# గురుజాడలు

(మహాకవి గురజాడ అప్పారావు సర్వలభ్య రచనల సంకలనం)

**ప్రధాన సంపాదకులు**
పెన్నేపల్లి గోపాలకృష్ణ

**సహ సంపాదకులు**
డాక్టర్ కాళిదాసు పురుషోత్తం
ఎం.వి.రాయుడు




**మనసు ఫౌండేషన్**
8-2-611/3, నిషాన్-ఇ-ఇక్బాల్, గ్రౌండ్ ఫ్లోర్, రోడ్ నెం.11,
బంజారాహిల్స్, హైదరాబాద్-500034. ఫోన్ :040 2332 3760.

**GURUJAADALU**
(Compendium of all available works of Mahakavi Gurajada Apparao)

***Publishers***
Manasu Foundation
8-2-611/3, Nishan-E-Iqbal,
Ground Floor, Road No. 11,
Banjarahills, Hyderabad - 500 034,
Phone : 04023323760.

***Cover Page :***
Bapu

***Cover Design :***
Siva Sai Graphics, Hyderabad.

***First Edition :***
21st September, 2012.

***D.T.P.***
R.V.Ramana, 9247361401.

***Printing :***
Kalajyothi, Hyderabad.

***Distributors :***
Pallavi Publications,
Dr. A. Prem Chand Complex,
Ist Lane, Ashok Nagar,
Vijayawada - 10,
phone :9866115655.
All Branches of Visalandhra,
Navodaya Book House, Hyderabad.

**Price : Rs. 375/-**

# ప్రకాశకుల మనవి

మనసు ఫౌండేషన్ పేరిట ఇంతవరకూ రావిశాస్త్రి, కాళీపట్నం రామారావు, శ్రీశ్రీ, బీనాదేవి గార్ల లభ్య రచనల సర్వస్వాలు ప్రజలకు అందజేసాం. 'చెప్పులు కుడుతూ.. కుడుతూ', 'సర్ ఆర్థర్ కాటన్ జీవితం-కృషి' అనువాద రచనలు ప్రచురించాం. ఇవన్నీ ప్రజలు చదవాలన్న కోరికతో పుస్తకం తయారీ ధర కన్నా చాలా తక్కువ ధరకే అందించాం.

గురజాడ సర్వస్వమైన ఈ గ్రంథంలో వారి లభ్యరచనలను అనువాదం చేయకుండా యథాతథంగా ఇందులో చేర్చాం. సాధ్యమైనంత వరకు తొలి ముద్రణలను ప్రామాణికంగా చేసుకున్నాం. ఈ పుస్తకానికి ప్రధాన కారకులు పెన్నేపల్లి గోపాలకృష్ణగారు. వీరు ఈ గ్రంథాన్ని చూడకుండానే కన్నుమూయటం ఒక పూడ్చలేని విషాదం. వీరు రచించి ప్రచురించిన 'మధురవాణి ఊహాత్మక ఆత్మకథ' చాలా మందిని అలరించింది. వీరు 2009లో ఆంగ్లంలో ప్రచురించిన Diaries of Gurajada కు సంపాదకత్వం వహించారు. వీరి కృషికి మనసు ఫౌండేషన్ కృతజ్ఞతలు.

గోపాలకృష్ణ గారు అప్పగించిన బాధ్యతను అందుకుని చివరి వరకూ నిర్వహించిన డాక్టర్ కాళిదాసు పురుషోత్తం గారికి, వారి కుటుంబ సభ్యులకు అభినందనలు. గురజాడ రచనల సేకరణతో పాటు అనేక విధాలుగాను సహాయపడిన వెలుగు రామినాయుడు, పరుచూరి శ్రీనివాస్, వెల్చేరు నారాయణరావుగార్లకు కృతజ్ఞతలు. ఈ పుస్తకానికి సహనంతో సమర్థతతో డి.టి.పి. నిర్వహించిన రంగిశెట్టి వెంకటరమణగారికి, ప్రూఫులు దిద్దటంలో సహకరించిన వేణుగారికి, అన్ని విధాలుగా సహాయపడిన మహమ్మద్ రసూల్‌గారికి, శ్రీ పి.ఎల్.ఎన్. ప్రకాశంగారికి, శ్రీ కాళిదాసు గిరిధర్ Scientist, LAM గారికి, చిర్రా ఎలక్ట్రానిక్స్ సిబ్బందికి, ఇతర మిత్రులకు అభినందనలు.

ముచ్చటైన ముఖచిత్రం అందించిన బాపుగారికి కృతజ్ఞతలు.

కవర్ డిజైన్ చేసిన శివసాయి గ్రాఫిక్స్‌వారికి, మా పుస్తకాల ముద్రణలో మొదటి నుంచీ సహకారం అందిస్తున్న కళాజ్యోతి బాపన్నగారికి, వారి సహచరులకు ధన్యవాదాలు.

ఈ పుస్తకం సకాలంలో రావడానికి కృషి చేసిన మనసు ఫౌండేషన్ సలహామండలి సభ్యులు పల్లవి వెంకటనారాయణ, శ్యామ్‌నారాయణ, బాలాజీ (దాము) గార్లకు ప్రత్యేక అభినందనలు.

**- మనసు ఫౌండేషన్**

# శ్రీ పెన్నేపల్లి గోపాలకృష్ణ
## (1937-2011)

శ్రీ పెన్నేపల్లి గోపాలకృష్ణ జర్నలిజంపైన మక్కువతో న్యాయవాదవృత్తిని విడిచిపెట్టి, నెల్లూరులో యూత్ కాంగ్రెస్ వారపత్రిక సంపాదకులుగా, జమీన్ రైతు సహాయ సంపాదకులుగా దాదాపు పదిహేనేళ్ళు పనిచేశారు. పదేళ్ళు ఆకాశవాణి జిల్లావిలేకరిగా ఉన్నారు. తను నెల్లూరులో 'వర్ధమాన సమాజం' కార్యదర్శి అయిన తర్వాత ఆ సమాజం నిర్వహించే ప్రాచీన కవుల జయంతులతో పాటు వీరేశలింగం పంతులు, గురజాడ అప్పారావు జయంతులు నిర్వహించారు. కావలి 'జవహర్ భారతి' అధ్యాపకులు కే.వి.రమణారెడ్డి, ఆ కాలేజీ ప్రిన్సిపాల్ ఎం.పట్టాభి రామిరెడ్డి గార్ల స్నేహం, నేలనూతల శ్రీకృష్ణమూర్తిగారి సాన్నిహిత్యం గోపాలకృష్ణ దృష్టిని చరిత్ర, సాహిత్యంవైపు మరల్చాయి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యుడుగా ఎన్నిక కావడం కూడా ఇందుకు దోహదపడింది.

వర్ధమాన సమాజ సభల్లో మహాపండితులు ఏటా కవిత్రయం మీద ఉపన్యాసాలు చేసేవారు. వారి ఉపన్యాస పాఠాలు సేకరించి, గోపాలకృష్ణ "కవిత్రయ కవితా వైజయంతి" పేరుతో ఒక పుస్తకాన్ని ప్రచురించారు. ఇప్పుడది ఒక రెఫరెన్సు గ్రంథం. వర్ధమాన సమాజం తరఫున ఆయన కావలి రామస్వామి "డెక్కన్ పోయెట్సు"ను పునర్ముద్రించారు; పఠాభి "ఫిడేలు రాగాల డజన్", "కయిత నాదయిత" కవితా సంకలనాలను వెలువరించారు.

నెల్లూరు సాంస్కృతిక జీవితంలో గోపాలకృష్ణ క్రియాశీల పాత్ర నిర్వహించారు. 'యువ భారతి' సంస్థను నిర్వహించి, నెల్లూరులో లలితకళలపట్ల స్పృహ కలుగజేశారు. అభ్యుదయ వేదిక, ప్రొగ్రెసివ్ ఫిల్మ్ సొసైటి తదితర సమాజాల కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొన్నారు.

ఆయన సినిమాల మీద, నాటకాలమీద చిరకాలం గుర్తుంచుకోదగిన మంచి సమీక్షలు చేశారు. జమీన్ రైతు పత్రికలో వారం వారం 'మాటకచేరి' శీర్షికలో స్థానిక విషయాల నుంచి, గొప్ప గ్రంథాల పరిచయం వరకు వైవిధ్యంగల విషయాలమీద చర్చించారు.

డాక్టర్ ఎం.పట్టాభిరామిరెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెస్ సంస్థను ప్రారంభిస్తున్నప్పుడు ఆయనకు అండగా నిలబడ్డారు. గోపాలకృష్ణ ఏ.పి. హిస్టరీ కాంగ్రెస్ ఫౌండర్ మెంబర్స్‌లో ఒకరు.

గోపాలకృష్ణ తిరుపతిలో 'ఉదయం' దినపత్రిక రెసిడెంట్ ఎడిటర్‌గా ఉన్న రోజుల్లో "గురజాడ అధ్యయన కేంద్రాన్ని" నెలకొల్పారు. త్రిపురనేని మధుసూదనరావు, భూమన్, సాకం నాగరాజు మొదలైన మిత్రులతో కలిసి కన్యాశుల్కం నూరేళ్ళపండుగ ఏడాది పొడవునా నిర్వహించారు.

గురజాడమీద ఒక వర్గం దారుణంగా విమర్శలు చేసినపుడు కే.వి.ఆర్. ప్రోత్సాహంతో గోపాలకృష్ణ ఆ విమర్శలకు అరుణతారలో సమాధానం రాశారు. ఆయన గురజాడమీద రాసిన వ్యాసాలు జమీన్ రైతు, ఉదయం, ఆంధ్రజ్యోతి, వార్త తదితర పత్రికల్లో అచ్చయ్యాయి.

సౌత్ ఆఫ్రికాలో జాతివివక్షకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో భారతీయుల పాత్రను వివరిస్తూ గోపాలకృష్ణ రచించిన "ఇంద్రధనుస్సు ఏడోరంగు" ప్రామాణిక గ్రంథంగా గుర్తింపు పొందింది.

గురజాడ సాహిత్యంమీద, ప్రత్యేకంగా కన్యాశుల్కం మీద తన అధ్యయన సారాన్ని గోపాల కృష్ణ "మధురవాణి ఊహాత్మక స్వీయచరిత్ర"గా రచించారు. ఈ పుస్తకం పరిశోధనకు, కాల్పనిక రచనకు మధ్య ఉన్న సరిహద్దును చెరిపివేసి తెలుగుసాహిత్యంలో ఒక కొత్త ప్రక్రియకు దారి చూపింది. గురజాడ ఇంగ్లీషులో రాసుకున్న దినచర్యలు మొట్టమొదటిసారి గోపాలకృష్ణ సంపాదకత్వంలోనే ఇంగ్లీషులో అచ్చయ్యాయి.

గోపాలకృష్ణ ఎప్పుడూ గంభీరంగా, హుందాగా వ్యవహరించేవారు. మితభాషి, హాస్యప్రియులు. ఆయన వచన రచనలో గొప్ప పరిణతి, నైపుణ్యం సాధించారు. ఆయన్ను ఎరిగినవారు "గోపాలకృష్ణ పెర్ఫెక్షనిస్టు" అంటారు.

గురజాడ సమగ్ర సాహిత్యం – 'గురుజాడలు' కు సంపాదకులుగా శ్రమించి, ఆ సంపుటం ఆవిష్కరించబడుతున్న వేళ, ఆయన మన మధ్య లేకపోవడం తీరని లోటు – గొప్ప విషాదం.

గోపాలకృష్ణ ఆత్మీయ మిత్రుడిగా ఆయన స్మృతికి శ్రద్ధాంజలి ఘటిస్తూ ఈ పరిచయాన్ని ముగిస్తున్నాను.

**– డాక్టర్ కాళిదాసు పురుషోత్తం**

# Introduction

## IN THE CAUSE OF THE PEOPLE

*Pennepalli Gopalakrishna*

**Gurajada Venkata Apparao** (1862-1915) was the harbinger of the modern era - Telugu literature. He was a pioneer and a crusader in the cause of people, simultaneously in more than one field. Renowned scholars, writers and historians have lauded him as a revolutionary in his thought and in his influence. He represents not merely a break away from the traditional thinking and writing, but also as one who brought a distinct change in direction.[1] He "brought out bloodless revolution in both the literary and social spheres".[2] He "revolutionized theme and treatment, he rescued language from the learned and gave it back to people, the ultimate creators of language. He looked ahead of his time, with an outlook amounting to vision." [3]

K.V.R., who can be called the Boswell of Gurajada, in his well-researched and comprehensive biography, said that Gurajada became great not by being ahead of his times and being different from others, but because his thinking transcended his contemporary milieu. Such a man is called a universal writer whose writings are applicable to all nations and people. Even while retaining the characteristics particular to his people, he achieved universality. They are relevant even today.[4] (Translation from Telugu by the Editor)

Reaffirming his unflinching faith in spoken Telugu, Gurajada in a letter to his disciple, as well a good friend, Ongole Munisubrahmanyam wrote :

"My cause is the cause of the people and I have cultured opinion at my back. I do not mind if those, who are incapable of understanding the subject, array themselves against me. Their conversion can do no good to the language. They are so hopelessly wedded to the old, highly artificial literary dialect."[5]

### *Strange mindset*

Since Gurajada did not explicitly propagate his reformist views, some critics feel that he was not a votary of social reform.[6] No doubt he

viewed the reforms critically; yet he should not be construed as an opponent of social reform. He was however dissatisfied with contemporary reforms. A few superficial changes, he opines, will not transform society in totality.[7] The basic structure of society should be changed paving way for a new society of individual liberty, social equality and economic justice. But he never openly aired his views. "Gurajada was a firm advocate of social and religious reforms. Indeed, he would have welcomed humanism replacing all religions. What he liked in Auguste Comte (1798-1857) was Comte's humanism, and what he turned his face against was the religious gloss put on humanism by Comte. It is therefore, wrong to maintain as it is done sometimes, that Gurajada ridiculed social and religious reform. In reality, what he ridiculed was pretence of such reform. He had contempt for those who made religion a cover of means and chicanery; he hated those who, in the name of religion and social reform, tried to gain worldly advantage. His over-zealousness in holding up to ridicule such imposters did create in some minds the impression that he was against all reform. In fact, what he wanted was more than reform; he wanted a change in our thinking and being so that mankind as a whole could scale new heights and score new triumphs". [8]

Gurajada was intrinsically an artist. He viewed the world with a painter's brush and writer's creative pen. Through his artistic work he wakes up the reader to social evils. He neither propagates nor resorts to didacticism. But his social views and his personality reflect abundantly in his work. He says, "I paint life artistically, idealizing of course. Though art is my master I have a duty to society."[9] He was modern to the core. His dream and vision were of a new social system. His attitude towards women's education, social equality and love as the basis of marriage are all surprisingly modern. His concern was with every basic problem that has a bearing on life, the thought of his generation and the generations to come.

The writings of Gurajada should be taken as a whole to assess his personality and his message. His creative writings alone will not suffice. His other works – the diaries, letters and notes should be taken into account. How far these can be treated as literature depends upon their quality and substance. It is the task of the critic to analyze and classify them.

### *1911 Diary – lost or not written?*

Unfortunately, not all of his diaries are available. The diaries from 1895 to 1915 are available covering only two decades in the short span of his life of fifty three years. Again, among these 20 years the diaries from 1907 to 1912 are missing. What we miss is a very valuable period of his life. It was during that time he published a revised edition of *'Kanyasulkam'* (1909). The 1911 diary raises a question – was it lost or not written at all? The year is significant in the history of modern Telugu literature as the movement for spoken dialect was started by Gidugu and Gurajada in that year. Opposing spoken dialect, the Andhra Sahitya Parishad was started by the champions of classical literature and 10,000 signatures were collected in support of the classical dialect to submit a memorandum to Government.

The controversy of *Muddupalani's Radhika Santwanam* too erupted in this period, when Bangalore Nagaratnamma, the icon of Carnatic music and a relentless champion of the cause of *Devadasis,* published a complete edition of *Radhika Santwanam* in which she gave a powerful rejoinder to Kandukuri Viresalingam for his derogatory remarks on Muddupalani in his *'Kavula Charitramu'*. Viresalingam's followers promptly complained to Government that *Radhika Santwanam* contained obscene descriptions. Government immediately seized the copies and initiated prosecution. Meanwhile, a meeting of learned Telugu and Sanskrit scholars was held in Madras and passed resolutions requesting Government to withdraw prosecution and bring out expurgated editions of Telugu classical works where there were objectionable passages. It is quite obvious that the meeting did not condemn the ban on the book. This meeting was presided over by Gurajada who sent the resolutions to the Chief Secretary to Government.[10] Burra Seshagirirao, a young contemporary of Gurajada, claimed to have discovered the 1911 diary and quoted from it, "Viresalingam was undoubtedly a great man." But the said diary has neither seen the light of the day nor is there any evidence to corroborate Seshagirirao's claim.

### *Peculiar scribbling*

The diaries are more elaborate with regard to the research of history. As an epigraphist of the Vizianagaram Samsthanam, Gurajada acquainted himself with the old Telugu script in lithic records. He

wanted to write the history of *Kalinga* region and seems to have collected material for this, but his notebooks were lost in a journey. Hence the history of *Kalinga* region never saw the light of the day.

The manner in which Gurajada scribbled the diaries was peculiar to him. Important events were cryptically noted. Even the death of Ananda Gajapati, an event that caused enormous grief and personal loss to him, was given only one sentence (May 1897). Again at the end of the year he wrote something like a homage to the Maharajah. Gurajada briefly noted even the tragic and sudden death of his father, the marriage of his daughter and nowhere did he mention the death of his brother. (Did it happen in the year when the diary was not written?) He scribbles R.S. cryptically for the courtesan Ramaswamy, for whose details we have to depend on his notes. His conversations with prominent people like William Miller, Principal of Madras Christian College, Justice S. Subramania Iyer, Madan Mohan Malaviya, founder of Benares Hindu University, and eminent Bengali scholars like Gurudas Banerjee also found only a passing mention each. In the diary of 1897, the year in which the first edition of *Kanyasulkam* was published, nothing about the event finds place, except that it was presented to the Joint Manager of the Samsthanam.

George Sampson writes, "Diaries as a form of expression suited to certain natures have been common in many ages and they have been used normally as the material for reminiscences, autobiographies and biographies. A few have been printed in full and of these few, the greatest are the diaries of John Evelyn and Samuel Pepys, the first personal record of events and the record of a personal revelation of the frankest kind".[11] Anandarangam Pillai's diaries during the early period of East India Company in Madras Presidency are a source of history for scholars. Anne Frank's diaries are a treasure by themselves. Diaries thus also contribute a solid base for personality assessment.

The tradition of writing diaries is not exclusive to Western culture. Even though the coinage of word might differ and vary, the records of many historical, political and literary works can be called diaries. In Bengal this tradition seems to have started in the beginning of the twentieth century. In *Andhradesa*, this genre was taken up by two contemporary stalwarts, Gurajada and Kandukuri,[12] quite unwittingly

at the same time, in the late nineteenth century. Gurajada's diaries, as evidenced in the earliest publication, can be traced to 1889, whereas Kandukuri started writing diaries the following year.

Unfortunately, not all the diaries and manuscripts Gurajada's are available with the State Archives, A.P. Diaries prior to 1895 are not found either with the State Archives Hyderabad or elsewhere. Yet, the first edition of the Telugu version of Gurajada's diaries published in 1954 by Visalandhra Publishing House, Vijayawada, includes the slim diaries of 1889, 1891, 1892 and 1893. Since the manuscripts were in the possession of Visalandhra for a long time before they were handed over to the State Archives, the genuineness of the diaries published by them need not, rather dare not be questioned. Visalandhra is a pioneer in the publication of not only the diaries, but the entire literature of Gurajada with great zeal and commitment. Moreover, writers like K.V.R. and Arudra who perused the manuscripts when they were with Visalandhra Publishing House had quoted from the diaries extensively in their writings.

The diaries, letters and notes of Gurajada go a long way in re-evaluating his revolutionary ideas and reforms. They help to assess and understand his multifaceted personality, the graphic growth of his wisdom, vision and intellect and bring to light the high pedestal he occupies in the social and literary realm.

"We have still 'miles to go' before we reach the goals, which Gurajada has set for us. And until we reach those goals, he would be unto us 'a shaft of light' guiding our steps and lightening for us the weariness of the long journey by his friendly jests, his good honoured drollery and his hilarious laughter".[13]

***"Never does land***
***Mean clay and sand***
***The people, the people, they are the land"***

*(Gurajada's 'Desabhakti' translated by Sri Sri)*

***Notes :***

1. V.R. Narla : *Father of Modern Telugu Literature:* Gurajada centenary souvenir. New Delhi (1962).
2. Ronanki Appalaswami : Gurajada commemorative volume, South Delhi Andhra Association, New Delhi (1976)
3. M. Chalapati Rao : Gurajada commemorative volume, South Delhi Andhra Association, New Delhi (1976)
4. K.V. Ramana Reddy (K.V.R.) : *Mahodayam:* (1969)
5. Gurajada's letter to Ongole Munisubrahmanyam
6. Prof. Velcheru Narayanarao : *Girls for sale – Kanyasulkam,* Indiana University Press, Indianapolis, U.S.
7. Rachamallu Ramachandra Reddy: *Samvedana,* monthly magazine from Cuddapah (now Kadapa) July 1968.
8. V.R. Narla : Gurajada- Kendra Sahitya Academy, New Delhi.
9. Gurajada's letter to Ongole Munisubrahmanyam, dt. May 21, 1909.
10. V. Sriram : *The Devadasi and the Saint – The life and times of Bangalore Nagaratnamma,* Chennai, 2007.
11. George Sampson : Cambridge History of English Literature.
12. Viresalingam Diareelu, edited by Dr. Akkiraju Ramapati Rao, Visalandhra Publishing House, Hyderabad.
13. V.R. Narla : Gurajada, Kendra Sahitya Academy, New Delhi.

*****

# PREFACE

Gurajada Venkata Apparao's diaries, letters and notes, all in English, should be viewed as one unit that provides an accurate assessment of his life and the contemporary literary and social movements. In fact, they are more helpful than his poems, short stories and plays to get a comprehensive picture of his varied activities and versatile genius. Such invaluable material has been in the dark for over a century.

I believe that Prajasakti Publishing House acquired the manuscripts from the successors of Gurajada in 1946 and got them translated into Telugu by Avasarala Surya Rao, a well-known writer. Subsequently the translated version of the diaries was published by Visalandhra Publishing House, Vijayawada, a premier publisher in Andhra Pradesh. Deciphering the scrawl of Gurajada, leave alone the translation, is a Herculean task, however expert the translator may be. Surya Rao fulfilled this task with great perseverance and zeal. A few lapses might have been committed in deciphering the script. Such lapses cannot mitigate the magnitude of his work.

After nearly four decades, the manuscripts, I trust most of them, were handed over by Visalandhra Publishing House to the Andhra Pradesh State Archives, Hyderabad obviously for safe custody and proper preservation. My friend Dr. Kalidasu Purushotham, who is deeply interested in the literature of Gurajada, and I visited the State Archives several times to study these records. It appears by the time Gurajada's papers reached the Archives, many of the important documents, were lost. Kanyasulkam manuscript, manuscripts of his poems etc. were

also lost. It was sad to say that even the pages from the diaries are also lost and got mixedup and jumbled. We approached Prof. Jayadhir Tirumala Rao, the then Director of A.P. Government Oriental Manuscripts Library and Research Institute, Hyderabad and explained the importance of the Gurajada papers. Subsequently he took steps to secure the digitized copies of the Gurajada collection of manuscripts from the A.P. State Archives and Research Institute. I am thankful to the Director, A.P. State Archives & Research Institute and Prof. Jayadhir Tirumala Rao for providing the Diaries and other papers of Gurajada in original (digital) form.

I owe my first interest in the diaries of Gurajada to S. Raminaidu of *Velugu*, Vijayanagaram, who sent me a typed script in 1993. A few years ago Sri Chalasani Prasad of *Virasam* sent me a suitcase of typed copies of the manuscripts of diaries, letters and notes and also the manuscript of *Kondubhattiyam*, the incomplete play of Gurajada, and encouraged me to go ahead with publication. The love of my friends has sustained me with encouragement and enthusiasm. My thanks are due to Sri Bapu for the meaningful art piece on Gurajada. I am thankful to my close friend Dr. Kalidasu Purushotham for sharing the responsibility of editing Gurajada's works. My profound thanks are due to Sri M.V. Rayudu garu, Manasu Publications, Bangalore who readily volunteered to bring out the complete works of Gurajada.

*–Pennepalli Gopalakrishna*

# Notes on Minute of dissent

**Minute of dissent :** A historical document of great importance was presented by Gurajada to the Madras University on the resolution passed by majority numbers of the sub-committee on Telugu composition in 1913 and in 1914. Though the purpose of the said document was to protest against the University decision, rejecting 'Modern Telugu' as medium for writing Telugu composition, the same turned out to be the *Magna Carta* of 'The Modern Telugu Language' in particular and of Indian education system, in general. Gurajada opined that a highly artificial and archaic poetic dialect was altogether unsuitable to modern Telugu prose had strongly observed that "The education of the masses was no part of the orthodox tradition." He added, "learning and literature were no monopoly of the Brahmin to whom Sanskrit precedent was sacred and inviolable."

He said, "Telugu poetry appealed to a narrow cult" and that scholars wrote only for those few and as time went on, unintelligibility was felt to be high literary merit. Brushing aside all the criticism on the local variations of spoken Telugu dialect, he asserted that 'they were insignificant' and that 'it was easier to learn modern Telugu than the poetic forms.' He argued that literary cultivation of modern Telugu necessitates a study of it, and that the study of 'refined living vernacular has great cultural value.'

Even the present day system of education should realize that "if school books are written in modern Telugu, vernacular education will improve at one bounce. Gurajada categorically condemned the argument of the protagonists of literary dialect as 'a narrow cult'. In this context he quoted Prof. Whitney that "scholars might be developed and sustained on the old literatures, but not the people."

The 'Minute of Dissent' is a relevant document since it aims at 'rescuing the Telugu language from the learned and give it back to the people, the ultimate creators of language. (M. Chalapati Rao : Gurajada Com-

memorative Volume, New Delhi.)

This Dissent Note of Gurajada was first published in 1914 by Vavilla Venkateswara Sastri.

While publishing this present edition, the editors who had painstakingly and meticulously screened through the 1914 edition had felt it right to correct few printing errors, make few changes in the font and subjoin some missing nomenclature; all these changes without hurting the original text of Gurajada, for the better understanding of the readers.

In the Dissent Note, Gurajada had referred certain persons; some of their surnames, some by their short or pet names and some by their second names. The Editors of this edition preferred to give the complete names of those persons referred for the clearer understanding of the readers.

Sri Gurajada quoted some of Butterworth's inscriptions in his dissent note in support of his views. The editors on verification with the original text of Butterworth's inscriptions found that some of those inscriptions were printed incorrectly in the first edition of 1914. The editors corrected those errors in this edition.

At many places in the 1914 edition, the editors found many paragraphs printed in italics for no obvious reason they could conceive. They were restored to normal font.

In fine, it is assured that the editors had put in their best efforts to make this edition of Gurajada's Dissent Note, flawless, plain and clearly understandable for the readers even while retaining the original letter and spirit of Gurajada.

The Publishers and the editors wish to express in this connection, their sincere gratitude to Prof. B. Kesavanarayana, Visakhapatnam who had provided them with a copy of 1914 edition of Gurazada's Dissent Note and helped in completing this stupendous work.

**- K. Purushotham**

# యవనిక వెనక

మహాకవి, యుగకర్త గురజాడ వెంకట అప్పారావుగారి 150వ జయంతిని పురస్కరించు కొని ఆయన రచనల సర్వస్వం **'గురుజాడలు'** తెలుగుజాతికి అంకితం చేస్తున్న సందర్భం ఇది. చిరకాలం ఆనందంగా స్మరించుకోదగిన రోజిది.

2010లో శ్రీ పెన్నేపల్లి గోపాలకృష్ణ గురజాడ ఉత్తర ప్రత్యుత్తరాల రాతప్రతులను పరిశీలించి, ఇంగ్లీషులో ఉన్న ఆ లేఖలను ఇంగ్లీషులోనే ప్రచురించాలనే ఆలోచనతో కృషి మొదలుపెట్టారు. ఆ సందర్భంలోనే గురజాడ లేఖలను ప్రచురించే అవకాశం ఉంటుందా? అని మనసు ట్రస్టు అధిపతి శ్రీ ఎం.వి.రాయుడు గారిని సంప్రదించారు. ఒక రచయిత సమస్త సాహిత్యాన్ని కలిపి ప్రచురించే సంప్రదాయాన్ని మనసు ట్రస్టు నెలకొల్పిందని, గురజాడ సాహిత్యాన్నంతా సేకరించి ఒక సంపుటంగా ప్రచురించే ఆలోచనలో తాము ఉన్నామని ఆ సంపుటానికి సంపాదకులుగా ఉండమని రాయుడుగారు గోపాలకృష్ణను కోరారు.

గురజాడ రచనలన్నింటిని ఏకఖండంగా భావించి, దాని అన్ని పార్శ్వాలనూ లోతుగా, క్షుణ్ణంగా బేరీజు వేసుకోవలసిన అక్కర ఇంకా తీరలేదని భావించిన గోపాలకృష్ణ మనసు ట్రస్టువారి ప్రతిపాదనను అంగీకరించారు. గురజాడ తెలుగుజాతికి అందించిపోయిన అక్షర సంపదను ఒక కుదురుకు తెచ్చుకొని, మొత్తంగా మరొకసారి మదింపు వేసుకోవలసిన చారిత్రక సందర్భం ఇది అనీ, "ట్రంకుపెట్టె"ల్లో, చీకటిగదుల్లో అజ్ఞాతంగా ఉండి, చెల్లాచెదరై పోయినవి పోగా గురజాడ స్వహస్తాలతో రాసిపెట్టిపోయిన ఈ రచనాశకలాలను ఒకచోట చేర్చి, సమగ్రంగా కాకపోయినా, ప్రయత్నలోపంలేని కృషితో, ఈ సాహిత్య సంపదను భావితరాల వారికి అందజేయాలన్న సదాశయంతో గోపాలకృష్ణ ఈ ప్రయత్నానికి శ్రీకారం చుట్టారు.

మా ఇద్దరి అభిరుచుల్లో సారూప్యత ఉండడంచేత, నెలకొని ఉన్న గాఢమైత్రిచేత, గోపాల కృష్ణ కోరిన వెంటనే నేను ఆయనతో కలిసి పని చెయ్యడానికి అంగీకరించాను. ఒక సుడిగాలిలా రాష్ట్రమంతా తిరిగి ముఖ్యమైన గ్రంథాలయాలలో గురజాడ రచనలకోసం శోధించాము. కన్యాశుల్కం 1897 ప్రతి ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఆర్కైవ్స్‌లోను, చెన్నైలోని జి.ఓ.ఎం.ఎల్.లోనూ కూడా ఉంది. ఆంధ్రభారతిలో అచ్చయిన కథలు సేకరించాము. గురజాడ డిసెంట్ నోట్ కోసం విశ్వప్రయత్నం చెయ్యవలసి వచ్చింది. చివరకు ప్రొఫెసర్ బి.కేశవనారాయణగారు (ఆంధ్ర విశ్వవిద్యాలయం విశ్రాంత ఆచార్యులు) ఆ పుస్తకాన్ని హైదరాబాద్‌కు తెచ్చి ఇచ్చారు.

జి.సి.వి. శ్రీనివాసాచార్యుల హరిశ్చంద్ర నాటకానికి గురజాడ ఇంగ్లీషులో రాసిన 'ప్రిఫేస్'ను విజయనగరం నుంచి మిత్రులు డాక్టర్ ఉపాధ్యాయుల నరసింహమూర్తిగారు పంపించారు. భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రి శ్రీరామ విజయవ్యాయోగానికి గురజాడ రాసిన పరిచయాన్ని అమెరికానుంచి ప్రొఫెసర్ వెల్చేరు నారాయణరావుగారు పంపించారు. జార్జిదేవచరితకు గురజాడ సమకూర్చిన ఉపోద్ఘాతం లేకుండానే 'గురుజాడలు' వెలువరించవలసి వచ్చిందనే అసంతృప్తి మాత్రం మాకు మిగిలిపోయింది.

గోపాలకృష్ణ గురజాడ లేఖలకు ఒక కాపీ తయారుచేశారు.

ఒక గురజాడ చేతిరాతను మాత్రమే కాదు, గురజాడకు జాబులు రాసిన వారందరి రాత పద్ధతులను అవగాహన చేసుకొని, ఆ లేఖలన్నీ ఆయన చదవగలిగారు. ఇదంతా ఒక్క రోజులో జరిగింది కాదు. నెలల తరబడి శ్రమించి, ఆ కార్యాన్ని సాధించగలిగారు. ఉత్తరాలను అచ్చుకు సిద్ధం చేస్తున్న సమయంలోనే ఆయన తీవ్రంగా అస్వస్థులయ్యారు. రెండు మూడు పర్యాయాలు నన్ను హైదరాబాదుకు పిలిపించుకొని, కంప్యూటరు ఆపరేటరును పక్కన కూర్చో బెట్టి నాచేత ఉత్తరాలను డిక్టేట్ చేయించారు; ప్రూఫులు దిద్దించారు. 2011 ఏప్రిల్ మాసాంతానికి లేఖలకు ఒక రూపం ఏర్పడింది.

చివరిసారి నేను, నా శ్రీమతి గోపాలకృష్ణగారిని చూడడానికి 2011 మే18న హైదరాబాదు వెళ్ళాము. ఇంటినిండా బంధువులు, పరిచయస్తులు. ఆయన నన్ను గదిలోకి పిలిపించుకొని, ఆక్సిజన్ మాస్కు తీసివేసి, గంటసేపు మాట్లాడారు – ఊపిరి తీసుకోడానికి చాలా ఇబ్బంది పడుతూనే. గురజాడ లేఖలు, ఇతర రచనలు సమగ్రంగా పూర్తి చెయ్యడానికి అవసరమైన సూచనలిచ్చి, నన్ను మిగిలినపని పూర్తి చెయ్యమన్నారు. ఆయనకు పూర్తిగా నమ్మకం కుదిరింది, నేను ఈ బాధ్యతను నిర్వహించగలనని.

కన్నీళ్ళు బలవంతాన ఆపుకొని వీడ్కోలు తీసుకొని గదిలోంచి వచ్చేశాను.

గోపాలకృష్ణగారు 2011 మే 27వ తేదీన తుదిశ్వాస విడిచారు.

★ ★ ★

శ్రీ ఎం.వి. రాయుడుగారు నన్ను సంపాదక బాధ్యత తీసుకొని ప్రాజెక్టును పూర్తి చేయమని కోరారు. సహ సంపాదకులుగా ఉండి సహకరించమని వారిని నేను కోరాను. ఆయన అంగీక రించి, గురజాడ రచనలు మొట్టమొదటిసారి ప్రచురించబడిన పత్రికలను, పుస్తకాలను సాధించి తెచ్చారు. రీస్ అండ్ రయ్యత్‌లో అచ్చయిన గురజాడ సారంగధరను, గురజాడ తమ్ముడు శ్యామలరావు రచన "తాంతియా ది భిల్" ను తెప్పించారు.

శ్రీ రాయుడుగారు ముందుగా గురజాడ తెలుగు రచనలు అచ్చుకు సిద్ధం చెయ్యడానికి పూనుకోవడం వల్ల నాపరిశ్రమకు చాలా సమయం లభించింది. మొదట 1914లో అచ్చయిన డిసెంట్ నోట్‌లో గురజాడ ఇచ్చిన బట్టర్‌వర్తు నెల్లూరుజిల్లా శాసనపాఠాలను మూలంతో సరిచూసి అచ్చుతప్పులు సవరించడం మాత్రమేగాక, పాఠకుల సౌలభ్యం కోసం ఆయా తాలూకాల పేర్లన్నీ అకారాది క్రమంలో ఏర్పాటు చేశాను. 1914 ప్రతిలో ఇంగ్లీషు పుస్తకాలు, రచయితల పేర్లలో వచ్చిన ముద్రారాక్షసాలను సవరించగలిగాను. ఈ ప్రతిలో వీరేశలింగం, జయంతి రామయ్య పంతులు మొదలైన వాళ్ళ పేర్లు రకరకాలుగా కన్పిస్తాయి. రాబోయే తరాల పాఠకులను దృష్టిలో ఉంచుకొని ఆయా వ్యక్తుల పూర్తిపేర్లను ఇచ్చాను. ఇటువంటివే, చిన్న చిన్న సవరణలు తప్ప పాఠాన్ని (text) ఎక్కడా మార్పు చెయ్యలేదు.

గురజాడ రాసిన జాబులు, ఆయనకు ఇతరులు రాసిన జాబులు, లభించినవన్నీ ఈ సంపుటంలో చేర్చాము. పుస్తకం అచ్చుకు వెళ్ళే వరకు అలా చేర్చుతూనే వచ్చాము. ఒకటో రెండో ఉత్తరాలు పూర్తిగా జిలుగు రాతలో ఉండి బోధపడకపోవడం చేత వాటిని విడిచిపెట్టవలసి వచ్చింది. మరికాస్త సమయం ఉండి ఉంటే అవి కూడా ఈ సంపుటంలో చేరి ఉండేవి. గురజాడ ఇంగ్లీషు లేఖలలో తెలుగు లేఖలు కూడా చేర్చాము – పాఠకులకు లేఖలన్నీ ఒకే చోట అందు బాటులో ఉంటాయనే ఆలోచనతో. ఏట్సు, హంటర్, గిడుగు రామమూర్తి మొదలైన ఆత్మీయులు గురజాడ రామదాసుకు పంపిన సంతాపసందేశాలను కూడా గురజాడ లేఖల్లో చేర్చాము. 1929లో గిడుగు రామమూర్తి గురజాడ రామదాసుకు రాసిన రెండు ఉత్తరాలను కూడా ఇందులో చేర్చాము. గురజాడ వ్యక్తిత్వానికి, రచనలకు సంబంధించిన విషయాలు వీటిలో ఉన్నాయి.

ఎఫ్. హెచ్. స్క్రిని (F.H. Skrini, ICS) రీస్ అండ్ రయ్యత్ సంపాదకులు శంభుచంద్ర ముఖర్జీ జీవిత చరిత్రను, ఉత్తరాలను ఒక పుస్తకంగా అచ్చువేశాడు. ఏభై ఏళ్ళ క్రితమే ఇందులో ఒకటి రెండు ఉత్తరాలు తెలుగులోకి అనువదించబడ్డాయి కూడా. ఇందులోని గురజాడకు సంబంధించిన ఉత్తరాలన్నింటినీ పాఠకుల సౌలభ్యం కోసం 'గురుజాడలు'లో యథామాతృకంగా చేర్చాము.

జూనియర్ వేదం వెంకటరాయశాస్త్రి తమ తాతగారు వేదం వేంకటరాయశాస్త్రి జీవిత చరిత్రను తెలుగులోను, ఇంగ్లీషులోను రచించారు. ఆ రచనల్లో గురజాడ వేదం వేంకటరాయ శాస్త్రికి రాసిన లేఖలను ఆయన ఉదహరించారు. ఆ లేఖలు కూడా ఈ సంపుటంలో చేర్చ బడ్డాయి.

1969–70 ప్రాంతంలో ఆర్నెల్లపాటు నార్ల వెంకటేశ్వరరావుగారి పర్యవేక్షణలో పాటిబండ్ల సుందరరావుగారు, గొల్లపూడి మారుతీరావుగారు, కె.వి.రమణారెడ్డిగారు, తుమ్మల వెంకట్రామయ్య గారు పనిచేసి గురజాడ డైరీలను చదివి "మళ్ళీ రాయించటం, టైపు చేయించడం", "క్షాళన కార్యక్రమం" నిర్వహించారు. (పురాణం సుబ్రహ్మణ్యశర్మ, మధురవాణి ఇంటర్వ్యూలు, పుటలు 10,129). ఈ విషయాన్ని కే.వి.ఆర్. కూడా ప్రస్తావించారు. (మహోదయం, పుట. 435, 2012 ప్రతి).

ఇటీవల శ్రీ గొల్లపూడి మారుతీరావుగారిని కలిసినప్పుడు, వారు తాము గురజాడ రాత ప్రతులను చదివి శుద్ధప్రతులను తయారు చేసిన కార్యక్రమంలో పాల్గొన్నట్లు ధ్రువీకరించారు. ఆ మాటే కే.వి.ఆర్. నాతో (1976లో) అన్నారు. ఈ విధంగా చదివి, టైపు చేయించిన దినచర్య, ఇతర నోట్సు వగైరాల కాపీ, భమిడిపాటి రాధాకృష్ణ తనకు ఇచ్చిన, గురజాడ స్వహస్తాలతో రాసుకొన్న కొండుభట్టీయం ప్రతి – అన్నీ కే.వి.ఆర్. గారివి శ్రీ చలసాని ప్రసాద్ గారికి అందాయి. చలసాని ప్రసాద్గారు ఆ పత్రాలన్నీ 2006లో పెన్నేపల్లి గోపాలకృష్ణకు పంపించారు.

గురజాడ దినచర్య, ఇతర నోట్సు ఇంగ్లీషులో టైపు చేయించిన వాళ్ళు ఆ ప్రతిలో తమకు బోధపడనిచోట, తెలుగు, సంస్కృత పదాలు వచ్చినచోట తరచుగా (...) గుర్తు పెట్టారు.

1895 సంవత్సరానికి గురజాడ రెండు డైరీలను వాడారు. ఒకటి Hoe and Co. వారి డైరీ. రెండోది ఒక మామూలు రూళ్ళ నోట్బుక్. ఆ ఏడాది గురజాడ ఈ రెండు పుస్తకాల్లో దినచర్య రాసుకొన్నారు. రూళ్ళ నోట్బుక్లో మద్రాసులో నాటక ప్రదర్శనలు, బెంగుళూరు సందర్శన వగైరా విషయాలు రాశారు. ఈ నోట్బుక్ పేజీలు విడిపోయి, గజిబిజిగా కలగలసి పోయి అస్తవ్యస్తంగా ఉన్నాయి. మొత్తం గురజాడ దినచర్యలో ఒక్క 1895 దినచర్యే సగభాగంపైగా ఆక్రమించింది.

గోపాలకృష్ణ గురజాడ దినచర్య రాతప్రతులన్నీ మళ్ళీ మళ్ళీ చదివి, తన సంపాదకత్వంలో అచ్చయిన 2009 ప్రతికి ఎన్నో సవరణలు, మార్పులు చేశారు. ఈ దినచర్యకు, గురజాడ లేఖలకు ఆయనే ఒంటిచేతిమీదుగా నోట్సు సమకూర్చారు.

గోపాలకృష్ణ సిద్ధం చేసిన దినచర్య దగ్గర ఉంచుకొని రాతప్రతులతో మరొకమారు నిమ్మళంగా సరిపోల్చి చూశాము. ఈ కృషిలో నాతోపాటు శ్రీ సర్వోదయ కళాశాలలో పని చేసిన డాక్టర్. ఎం.శివరామప్రసాదు సహకరించారు. గురజాడ జిలుగు రాతను బోధపరచుకొని మళ్ళీ దినచర్య రాతప్రతులను (Digital Copies) చదివాము. పూర్వం బోధపడక విడిచిపెట్టబడిన

కొన్ని పుటలను, వాక్యాలను, పదాలను చదివి, గుర్తించి ఆ విషయాలన్నీ చేర్చాము. వ్యక్తుల పేర్లు, పుస్తకాలపేర్లు, అనేక విషయాలను శోధించి గురజాడ దినచర్య గ్రంథానికి మరింత నిండుతనాన్ని తెచ్చామని భావిస్తున్నాము. మాకు ఒక పదమైనా, వాక్యమైనా, ఒక పేజీ మొత్తమైనా బోధపడకపోతే (...) గుర్తుతో సూచించాము లేదా not legible అని పేర్కొన్నాము. దినచర్యలో ఒకటి రెండు చోట్ల రైళ్ళ రాకపోకల వివరాలో, రూపాయనోట్ల నంబర్లో, షేర్‌మార్కెట్లకు సంబంధించిన సంఖ్యలో అచ్చువెయ్యకుండా విడిచిపెట్టాము.

My Own Reflections, Observations, Remarks etc. కు సంబంధించి ఒక వివరణ ఇవ్వాల్సిన అవసరం ఉంది. గురజాడ తన అనుభవాలను, అనుభూతులను, పరిశీలనలను నోట్సుగా రాసుకున్నారు. వీటన్నిటికీ ఇప్పుడు లభిస్తున్న టైపు ప్రతి తప్ప రాత ప్రతి లేదు. అట్లాగే గురజాడ ఆనందగజపతి మహారాజుతో తన అనుభవాలను కూడా నోట్సుగా రాసుకున్నారు. టైపు ప్రతిలో M.O. అని, H.H. అని వీటికి శీర్షికలు పెట్టారు. టైపు ప్రతుల్లో (కే.వి.ఆర్.వి) ఆయా శీర్షికలతోపాటు కాగితం పైన ఒక కొనలో M.O. అని, H.H. అనీ ఉంది. ఒక కాగితం మధ్య భాగంలో M.O. = My Own Reflections, Observations, Remarks etc. అని మాత్రమే టైపు చేసి ఉంది. బాలికా పాఠశాల, భట్రాజుగారబ్బాయి, వెలగాడ కొండమీది నుంచి దృశ్యం వగైరా శీర్షికలన్నీ M.O. కు సంబంధించినవే.

M.O. కు సంబంధించిన కొన్ని రాతప్రతుల పుటలు మాత్రం ఇప్పుడు A.P. State Archives, Hyderabad లో భద్రపరచబడి ఉన్నాయి. బాలికాపాఠశాల, భట్రాజుగారబ్బాయి, వెలగాడ కొండమీది నుంచి దృశ్యం వగైరాల రాతప్రతులు ఇప్పుడు లభిస్తున్నాయి. కనుక దీన్ని బట్టి మిగతా శీర్షికలకు సంబంధించిన మాతృకలు కూడా ఉండేవని, ఆ రాత ప్రతుల ప్రాముఖ్యాన్ని ఎరగకపోవడంవల్ల, వాటిని handle చేసిన వ్యక్తుల అజాగ్రత్తవల్ల ఆ పుటలన్నీ కాలగర్భంలో కలిసిపోయి ఉంటాయని మనం భావించవచ్చు.

గోపాలకృష్ణ వీటన్నింటిని, ముట్టుకుంటే పొడిపొడి అవుతున్న టైపుకాగితాలను శ్రద్ధగా కాపీ చేసి, అచ్చుకు ఒక ప్రతిని తయారు చేసి ఉంచారు. ఆయన చనిపోయిన తర్వాత, వాళ్ళ అబ్బాయిలు ఇంట్లో దొరికిన కాగితాలన్నీ సేకరించి నాకు చేర్పించారు. ఆ టైపు కాగితాల మీద ఆయా శీర్షికలకు సంబంధించినంతవరకు పుటల సంఖ్య ఉందిగాని, మొత్తం M.O, H.H. శీర్షికలను గురజాడ ఏ క్రమంలో రాసిపెట్టారో తెలుసుకునే అవకాశం లేక పోయింది. శీర్షికల సారూప్యతనుబట్టి నాకు స్ఫురించిన వరుసలో అమర్చడమే చేయగలిగినది. మరికొన్ని M.O., H.H. కు సంబంధించిన టైపు పుటలు జారిపోయి లేదా misplace అయి నా దృష్టిలోకి వచ్చిఉండకపోవచ్చు కూడా. గోపాలకృష్ణ దృష్టి నుంచి తప్పించుకొన్న కొన్ని శీర్షికలు ఇందులో చేర్చడం జరిగింది.

గురజాడ అసంపూర్ణ రచనలు (1) Rev and the Hero, (2) A Novel - few scenes (3) రక్షస తంగడి యుద్ధం నేపథ్యంలో గురజాడ రాయతలపెట్టిన నవల / నాటకం తాలూకు నోట్సు (4) చిత్రాంగి పేరుతో గురజాడ రాసిన ఇంగ్లీషు నాటకంలో ఇప్పుడు మిగిలిన కొన్ని పుటలు (5) మరికొన్ని అసంపూర్ణ వ్యాసాల టైపు పుటలు కూడా ఉన్నాయి. వీటిలో 3, 4 అంశాలకు సంబంధించి గురజాడ స్వహస్తాలతో రాసి పెట్టుకున్న కాగితాలు A.P. State Archives, Hyderabad లో గురజాడ 'సంచయం'లో ఉన్నాయి. సౌకర్యం కోసం వీటన్నిటినీ M.O. లో చేర్చి 1. M.O., 2. H.H. 3. Creative Writings 4. Miscellaneous Works అని నాలుగు శీర్షికలుగా విభజించాము. గురజాడ దినచర్యల్లో ఖాళీపుటల్లో రాసుకొన్న నోట్సు కూడా M.O. లో చేర్చాము. Unilit (1963) గురజాడ విశేషసంచికలో ప్రచురించిన వ్యాసాలను కూడా M.O. లోనే చేర్చాము.

సెట్టి ఈశ్వరరావు సంపాదకత్వంలో విశాలాంధ్ర ప్రచురణాలయం ప్రచురించిన "గురజాడ రచనలు – కవితల సంకలనం"లో 'ఎమరాల్డ్సు' పేరుతో రెండు ఇంగ్లీషు పొయెమ్సు ఉన్నాయి. ఇందులో ఒకటి ఒక పార్సీ గీతానికి అనువాదంలాగుంది. కే.వి.ఆర్. సంపాదించిన టైపు ప్రతిలో ఈ గీతం ప్రతిపైన ఒక మూల H.H. అని గుర్తుగా టైపు చేసి ఉంది. అందువల్ల ఈ కవితను H.H. శీర్షికలో చేర్చాము. ఈ 'ఎమరాల్డ్సు' పోయమ్స్ తర్వాత అదే పుటలో 'How he did it' అనే కవిత ఉంది. ఇందులో కొన్ని పాదాలు జారిపోయినట్లనిపించింది. దీన్ని ఎటువంటి మార్పులు చెయ్యకుండా అనుబంధంలో చేర్చాము.

1912లో గురజాడ హిందూపత్రికకు రాసిన రెండు సంపాదకీయ లేఖల్లోంచి కొన్ని భాగాలు మాత్రం ఇప్పుడు లభ్యమవుతున్నాయి. ఆ భాగాలను కూడా M.O. లో చేర్చాము.

1908 డిసెంబరు 27, 28, 29 తారీకుల్లో మద్రాసులో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ మహాసభలకు గురజాడ హాజరయ్యారు. ఆ సభల నిర్వహణమీద, ఉపన్యాసాల మీద ఆయన హిందూపత్రికలో హాస్యం, వ్యంగ్యం కలగలిపి ఒక వ్యాసం రాశారు. అవసరాల సూర్యారావు, సెట్టి ఈశ్వరరావు ఇద్దరూ ఈ వ్యాసాన్ని తెలిగించారు. ఈ వ్యాసం మధ్యలో గురజాడ ఒక పేరడీ కవితను చేర్చారు. అవసరాల ఈ కవితను తన అనువాదంలో యథాతథంగా ఇవ్వబట్టి ఈ కవితైనా మనకు దక్కింది, మిగతా వ్యాసం మటుకు గురజాడ అలబ్ధ రచనల జాబితాలో చేరిపోయింది – ప్రస్తుతానికి.

ఆంధ్రభారతిలో అచ్చయిన కథలు మినహాయిస్తే, గురజాడ మిగతా కథలు ఏ పత్రికల్లో అచ్చయ్యాయో తెలీదు.

"Stooping to raise" కథ ఆనాటి ఇంగ్లీషు కథల పత్రికల్లో ప్రచురించబడి ఉండవచ్చనే ఆశతో గోపాలకృష్ణ లండన్‌లో మిత్రుల ద్వారా ప్రయత్నం చేశారు. కాని, ఫలితం లేకపోయింది. ప్రసిద్ధ చిత్రకారులు, రచయిత శ్రీ అబ్బూరి గోపాలకృష్ణ గారు ఈ కథకు సంబంధించి ఒక ముచ్చట చెప్పారు. శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు గురజాడ శతజయంతి సందర్భంగా Unilit విశేష సంచిక (1963)ను వెలువరిస్తున్న సందర్భంలో విజయవాడలో ఇండియన్ ఎక్స్‌ప్రెస్ ఉద్యోగి ఒకరు Stooping to raise కథను ఎనిమిది వందల రూపాయలకు అమ్మజూపాడట. అంత పెద్దమొత్తం సమకూడక ఆ అవకాశాన్ని సాంబశివరావుగారు వదులుకోవలసి వచ్చిందట! వేపా రామేశం చేత తన కథకు పరిచయ వాక్యాలు రాయించుకొన్నట్లు గురజాడ దినచర్యలో రాసుకొన్నారు. ఆ కథ ఏమయిందో తెలీదు.

అవసరాల సూర్యారావు సంపాదకత్వంలో విశాలాంధ్ర ప్రచురణాలయం ప్రచురించిన గురజాడ కథా సంపుటంలో పెద్దమసీదు, మెటిల్డా రెండు కథలున్నాయి. ఈ రెండు కథలు అంతకుముందే, అంటే 1950లో వావిళ్ళ ప్రచురణ సంస్థ అచ్చువేసిన "మహాకవి అప్పారావు గారి చిన్న కథలు" సంపుటంలో కన్పిస్తాయి. వావిళ్ళవారి పుస్తకంలో "మతము–విమతము" పేరుతో ఉన్న కథ విశాలాంధ్ర ప్రచురించిన పుస్తకంలో "పెద్దమసీదు" పేరుతో ఉంది. ఈ మార్పు కే.వి.ఆర్.కు తెలియకపోలేదు. ఆయన కూడా మహోదయంలో "పెద్దమసీదు" పేరుతోనే ఈ కథను పేర్కొన్నారు. గురజాడ ఇంగ్లీషులో M.O. నోట్సులో స్పష్టంగా 'భట్రాజుగారబ్బాయి' అని పేర్కొంటే అవసరాల 'భ' గారబ్బాయిగా మార్చారు. హిందూ మహమ్మదీయ సంస్కృతుల మధ్య వైరుధ్యాల నేపథ్యంలో కథ రాయాలని గురజాడ M.O. లో రాసుకున్నారు. మతము–విమతము కథా వస్తువు అదే. ఈ కథలో భాషను గమనిస్తే గ్రాంథికభాషాస్పర్శ అధికంగా ఉన్నట్లు తోస్తుంది. ఇదే గురజాడ తొలికథేమో?

మద్రాసులో వంటమనిషి చెప్పిన కథ గురజాడ వివరంగా దినచర్యలో రాసుకున్నారు. ఈ సంఘటనే మెటిల్డా కథకు ప్రేరణ అయి ఉండవచ్చని కే.వి.ఆర్. భావించారు.

ఈ సంపుటం తయారుచెయ్యడంలో ఎందరో సహాయ సహకారాలు అందించారు. డిసెంట్ నోట్‌లో, శ్రీరామ విజయ వ్యాయోగం పీఠికలో గురజాడ ఉదాహరించిన శ్లోకాలపాఠాన్ని నిర్ణయించి సహకరించిన వారు ప్రొఫెసర్ రామకృష్ణమాచార్యులవారు (కేంద్రీయ సంస్కృత విద్యాపీఠం, తిరుపతి). మనుస్మృతి శ్లోకాన్ని సరిచూసి పంపిన మిత్రులు డాక్టర్ శ్రీరంగాచార్య (హైదరాబాద్). సారంగధర, ఇతర ఇంగ్లీషు కవితలు చదివి కొన్ని సూచనలు చేసినవారు శ్రీ వేదం వెంకటరామన్ (నెల్లూరు వి.ఆర్. కళాశాల విశ్రాంత ఆంగ్ల అధ్యాపకులు), శ్రీ మైదవోలు సత్యనారాయణ (నెల్లూరు). గురజాడ దినచర్యలు చదివి గోపాలకృష్ణ మిత్రులు వి.ఏ.కె.

రంగారావు గారు కొన్ని సవరణలు సూచించారు. ఏ పుస్తకం కావాలన్నా కాకితో కబురుచేస్తే క్షణాల్లో పంపించారు శ్రీ లంకా సూర్యనారాయణ గారు (గుంటూరు). ఆచార్య మొదలి నాగభూషణశర్మ గారు, డాక్టర్ ఏటుకూరి ప్రసాద్‌గారు, డాక్టర్ కడియాల రామమోహనరాయ్‌గారు అవసరమైన సమాచారం, సూచనలు అందించారు. నాపోరు తట్టుకోలేక శ్రీ చలసాని ప్రసాద్‌గారు తన వద్ద ఉన్న గురజాడ పత్రాల సూట్‌కేస్‌ను పెన్నేపల్లి గోపాలకృష్ణకు పంపించారు, "మహాకవి గురజాడ అప్పారావుగారి గేయములు" (వావిళ్ళ వారి ప్రచురణ, 1950) జెరాక్సు చేసుకోడానికి అంగీకరించారు. శ్రీశాసపు రామినాయుడుగారు (వెలుగు, రాజాం) నీలగిరి పాటలు కాపీ పంపించారు. డాక్టర్ పోరంకి దక్షిణామూర్తిగారు, డాక్టర్ అక్కిరాజు రమాపతిరావుగారు, ఇతర మిత్రులు ఇచ్చిన ప్రోత్సాహం మరువలేనిది. బాపు ఈ సంపుటాన్ని ముఖచిత్రంతో అలంక రించారు.

కన్యాశుల్కం 1909 ప్రతి మనదేశంలో ఎక్కడా లభించలేదు. శ్రీ ఎం.వి. రాయుడుగారి కుమారులు చిరంజీవి 'జెన్' ఇంగ్లాండు నుంచి ఈ పుస్తకం డిజిటల్ కాపీ పంపి సహకరించారు. శ్రీ ఎం.వి. రాయుడుగారు మనసు ట్రస్టు అధిపతులుగా, ఈ సంపుటం సహ సంపాదకులుగా మాకు సంపూర్ణ సహకారం అందించారు. ఎప్పుడు, ఏ సమాచారం అవసరమైనా క్షణాల్లో పంపించారు.

ఈ 'గురుజాడలు' సమగ్ర రచనల సంపుటాన్ని తయారు చెయ్యడానికి రెండు సంవత్సరాల పైనే పట్టింది. అన్ని అడ్డంకులు అధిగమించి, మనసు ట్రస్టువారు గురజాడ 150వ జయంతి రోజు ఈ సంపుటాన్ని విడుదల చెయ్యడం ఆనందించదగిన సంగతి. మా కృషిలో లోపాలు లేవని అనుకోడం లేదు. అయితే గురజాడ రచనలన్నీ ఒకేచోట, ఒక సంపుటంగా తీసుకొని రావడంలో ఒక అడుగు ముందుకు వేశామని మాత్రమే వినయంగా విన్నవించుకొంటూ సెలవు తీసుకొంటున్నాము.

9.9.2012,
నెల్లూరు.

**- డాక్టర్ కాళిదాసు పురుషోత్తం**
(సంపాదకవర్గం పక్షాన)

# గురజాడ నేటి అవసరం

మహాకవి గురజాడ అప్పారావు జన్మించి 150 ఏళ్ళు. మరణించి ఇంచుమించు వంద ఏళ్లు. ఆయన మిగిల్చినవి దాదాపు పాతిక కవితలు, మూడు నాటకాలు, నాలుగున్నర కథలు, కొన్ని వ్యాసాలు, కొన్ని ఉత్తరాలు, కొన్ని ఏళ్ల దినచర్యలు వగైరా. తెలుగుజాతి వందేళ్లుగా వీటిని చదువుకుంటూనే ఉంది. వారి ఆలోచనా జీవితాన్ని గురజాడ సృజన ప్రభావితం చేస్తూనే ఉంది. ఇకపై కూడా ప్రభావితం చేస్తుందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

ఆయన రాసినదానికన్న ఆయన మీద తెలుగుజాతి రాసుకున్నది చాలా ఎక్కువ. ఆ రాతలో గురజాడ రచనలలోని సూక్ష్మాంశాల వివరణ ఉంది. లోతయిన విశ్లేషణ ఉంది. పరిశోధన ఉంది. పరవశంతో కీర్తించడం ఉంది. వీటితోబాటు అభిశంసన కూడా హెచ్చుగానే ఉంది.

ఆ కీర్తనకైనా, అభిశంసనకైనా ప్రేరణ ఏమిటి? అది వ్యక్తమైన రూపాలు ఏమిటి?

మనం వాటినన్నింటినీ గుర్తించి ఒక పట్టీ వేయవచ్చు. అనేక విధాల విశ్లేషించ వచ్చు. అందులో తెలుగుజాతి ఉద్వేగాలను, ఆవేశకావేశాలనూ పోల్చుకోవచ్చు. వాటి నన్నింటినీ క్రోడీకరించి, ఒకే ఒక అంశాన్ని గుర్తించడానికి ప్రయత్నించితే నాకు కనిపించిం దొక్కటే.

అది గురజాడ వారి నిలువు (stand).

ఆ నిలువు ఏమిటి?

## 2

మహాకవులెవ్వరికైనా వారు జీవించిన కాలంలో, సమాజంతో అనివార్యమైన అసంతృప్తి ఉంటుంది. అసమ్మతి ఉంటుంది. దానిని వారు తమ రాతలతో పట్టుకోజూస్తారు. రూపం కట్టజూస్తారు. దానిని జనానికి చూపెట్టజూస్తారు. జనం మనసును ఆకట్టుకోజూస్తారు. వారి మస్తిష్కాలను పట్టజూస్తారు. ఆ అసంతృప్తీ, సాహిత్యరూపంలో దాని ఆవిష్కరణా విశ్వమానవుడిని చూపించే క్రమానికి ఒక వెలుతురు ఇస్తుంది. స్థూల దృష్టితో చూస్తే మహాకవుల నిలువు ఒక్కటే అవుతుంది.

అయితే –

వారు జీవించిన కాలం ప్రత్యేకమైనది. సమాజం ప్రత్యేకమైనది. వ్యక్తిగత జీవితం ప్రత్యేకమైనది. వారి అనుభవాలు ప్రత్యేకమైనవి. వారి మెదడునూ, హృదయాన్నీ రూపొం దించిన పుట్టుక, పెంపకం, ఎదుర్కొన్న సమస్యలూ, వాటిపై చేసిన ఆలోచనలూ, కలిగిన ఉద్వేగాలూ, తెల్చుకున్న అంశాలూ, తీసుకున్న నిర్ణయాలూ వేటికవే ప్రత్యేకమైనవి.

ఈ సూక్ష్మాంశాలు పట్టుకుని పరిశీలించితే –

వారి నిలువులోని ప్రత్యేకత అర్థమవుతుంది. ఆ నిలువుకిగల సానుకూల, ప్రతి కూలాలు గ్రహించగలుగుతాం. ఆ సానుకూలతను ఆకట్టుకోటానికి ప్రతికూలతలను తట్టుకోడానికి వారు నిర్మించుకున్న సాహిత్య పరికరాలు స్పష్టమవుతాయి. అవి మొత్తం సాహిత్యానికి సమకూర్చిన కొత్తదనాలు కంటబడతాయి. నేర్పరితనం ఎలా సానబట్టు కున్నదీ చూడగలుగుతాం.

ఈ దృష్ట్యా చూస్తే –

గురజాడ నాటి పరిస్థితులేంటి? వాటి నుంచి రూపొందిన వారి నిలువు ఏంటి?

వారి కాలానికి ప్రపంచంలో భావ విస్తరణకి దారులు విస్తరించాయి. భావ విస్తరణకి పట్టేకాలం తగ్గించి. శతాబ్దాలుగా రాజకీయంగా ఒక్కటిగా లేని భారతదేశం భావాలలో, నమ్మకాలలో ఒక్కటిగా ఉంది. ఆచారాలలో, సాంప్రదాయాలలో, ఆలోచనలలో ఒక సారూప్యత కలిగి ఉంది. ఈ దేశానికి దూరం నుంచి వచ్చిన ఆంగ్లేయుల పాలన రాజ కీయంగా ఒక్కటి చేస్తోంది. అంతకుముందు ఈ దేశానికి వచ్చిన వారు దాదాపు ఇక్కడే స్థిరపడి, ఇక్కడి సంస్కృతితో ప్రభావితమైన ఈ సంస్కృతిని ప్రభావితం చేసి దానిలో భాగమైపోయినవారు.

అయితే;

పడమటి ప్రపంచం కేవలం లాభార్జన కోసం ప్రపంచమంతా విస్తరించే కార్యక్రమంలో భాగంగానే భారతదేశానికి వచ్చింది. వారిలో వారికి కోట్లాటలలో ఈ దేశంలో ఆంగ్లేయులు విజయం సాధించి పాలన ఆరంభించారు. వారిపై స్థానికులు తిరగబడగా దానిని అణచి వేసి వ్యాపార కంపెనీ పాలన స్థానంలో రాజపాలన ఆరంభమయింది. పడమటి ప్రపంచం నమ్మకాలలో (faith) దాదాపు ఒక్కటే మతమూ, గ్రంథమూ, దేవుడూ కలిగి ఉన్నా, లాభార్జనలో, సంపద పెంపులో మాత్రం ఎవరి జాతి వారిదే అన్న దృష్టికి అలవాటు పడింది.

క్రైస్తవంలోని 'పొరుగువాడు' అన్న భావన తమ జాతివారికి మాత్రమే పరిమితం చేసుకున్నారు. జాతిపేరుతో ఏకం అయినా, లాభాలు వ్యక్తులకే దక్కినా, సంపదను జాతి పేరుతో లెక్కగట్టటం (Nation's Wealth) పడమటి ప్రపంచం అలవరచుకొని, మిగిలిన ప్రపంచానికి కూడా అలవాటు చేస్తోంది. ఇలా జాతి సంపద పెరగటం అన్న భావనకు, దానికి అవసరమైన పద్ధతులను రూపొందించుకుంటున్న పడమటి ప్రపంచం లోనే, ఆ కాలంలోనే ఒక తాత్వికమైన ప్రశ్న ఉదయించింది.

జ్ఞానోదయమంటే ఏమిటి అన్నది ఆ ప్రశ్న.

దీనికి ఇమాన్యుల్ కాంట్ చేసిన నిర్వచనం చాలా ప్రధానమైనదిగా భావిస్తారు.

Enlightenment is man's emergence from his self-imposed nonage. Nonage is the inability to use one's own understanding without another's guidance. This nonage is self-imposed if its cause lies not in lack of understanding but in indecision and lack of courage to use one's own mind without another's guidance. *Dare to know! (Sapere aude.)* "Have the courage to use your own understanding", is therefore the motto of the enlightenment (తనకుతాను విధించుకున్న వయో అపరిపక్వత (సంరక్షకత్వం) నుంచి మనిషి బయటపడటమే జ్ఞానోదయం. ఇతరుల మార్గదర్శకత్వం లేకుండా తన అవగాహనను ఉపయోగించుకోలేని అసమర్థతే వయో అపరిపక్వత. ఈ వయో అపరిపక్వత స్వయంగా విధించుకున్నదే. ఎందుకంటే దీనికి కారణం అవగాహనారాహిత్యంలో లేదు. ఇతరుల మార్గదర్శకత్వం లేకుండా తన మస్తిష్కాన్ని ఉపయోగించుకోటానికి ధైర్యం లేక పోవటంలోనూ, నిర్ణయాలు తీసుకోకపోవటంలోనూ ఉంది. తెలుసుకోటానికి ధైర్యం చెయ్! "నీ అవగాహనను ఉపయోగించుకునే ధైర్యం అలవర్చుకో", అన్నది జ్ఞానోదయానికి నినాదం)

ఈ ప్రశ్న వెలువడటమూ, వ్యక్తులు సంపద పోగుచేసుకునే కార్యక్రమం ముమ్మరం కావటమూ, దానికి రక్షణ కోసం జాతి సంపద అన్న భావం పెంపొందించటమూ ఇంచు మించు ఒకే కాలంలో, ఒకే సమాజంలో జరగటం యాదృచ్ఛికం కాదు. అలాగని మానవజాతి అభివృద్ధిలో వీటి పాత్ర తక్కువదీ కాదు. వ్యక్తులు స్వతంత్రంగా ఆలోచించటం వల్ల ప్రభుత్వ పునాదులు ప్రభావితమవుతాయని, అది అంతిమంగా రాజ్యానికే ప్రయోజన కారి అవుతుందని వివరిస్తాడు కాంట్. ఈ వివరణలో తాత్వికత, రాజకీయం రెండూ

కలసి ఉండటంతో – అంటే వ్యక్తి ఏం చెయ్యాలీ, ప్రభుత్వం దానితో ఎలా వ్యవహరించాలన్నది–ఇది చాలా ప్రాధాన్యత సంతరించుకుంది. బహిరంగంగా పౌరుల స్వేచ్ఛా వాదనా, ఆంతరంగికంగా వారి రాజ్య విధేయతా ప్రతిపాదిస్తాడు కాంట్. ఈ అవగాహన పై పడమటి ప్రపంచం రెండు శతాబ్దాలుగా తర్జనభర్జనలు పడుతూనే ఉంది. జర్మన్ ఆదర్శవాదం కాంట్ అవగాహన పరిమితులు చర్చించి దానిని దాటి గురజాడ కాలానికే చాలా ముందుకు వెళ్లింది. వ్యక్తి వివేచన యొక్క ఆవశ్యకత అందరూ అంగీకరించినా దానికి బౌద్ధిక సంకల్పం ఎంత అవసరమో అంతకన్న భౌతిక అవసరాలు తీరటం అవసరమన్న అవగాహన ఆ చర్చల సారాంశం. అయితే ఆ వాద ప్రతివాదాలు పడమటి ప్రపంచం దానిలో భాగమైన ఆంగ్లేయుల పాలననూ, పౌరులతో వ్యవహరించవలసిన తీరునీ ప్రభావితం చేసాయి. వారితో బాటు భారతదేశానికి చేరిన ఈ భావన వ్యక్తి వివేచనకి పురికొల్పింది. రాజ్యం కన్న ఎక్కువగా సమీప స్వసమూహాల (కులం, వర్ణం) అదుపులో ఉన్న భారతీయ మేధావికి ఒక ఆత్మవిశ్వాసాన్ని కలిగించటంలో ఇది తోడ్పడింది.

గురజాడ వారి నిలువు దాదాపు దీని నుంచే ప్రభావితమైనది.

కన్నుగానని వస్తుతత్వము
కాంచనేర్పరు లింగిరీజులు
కల్లనొల్లరు; వారి విద్యల
కరచి సత్యము నరసితిన్

అని తన హేతుబుద్ధి వికసనానికి మూలం చెప్పుకున్నా,

హేలీ తోకచుక్క అన్న ఆ కాలపు సంఘటన మీద అది నష్టం కలిగిస్తుందన్న మూఢ విశ్వాసానికి వ్యతిరేకంగా "తలతు నేనది సంఘసంస్కరణ పతాకగన్" అని ప్రకటించినా,

చూడు మునుమును మేటివారల
మాటలనియెడి మంత్రమహిమను
జాతి బంధములన్న గొలుసులు
జారి, సంపదలుబ్బెడున్.
యెల్లలోకము వొక్కయిల్లై,
వర్ణభేదములెల్ల కల్లై,

వేలనెరుగని ప్రేమ బంధము
వేడుకలు కురియు.
మతములన్నియు మాసిపోవును,
జ్ఞానమొక్కటి నిలచి వెలుగును;
అంత స్వర్గసుఖంబులన్నవి
యవని విలసిల్లున్.

అంటూ మానవజాతికి ఉండవలసిన ఆకాంక్షలకు ఉదాత్తరూపం దిద్దినా,

మధురవాణి, గిరీశం వంటి పాత్రలతో నాటకం నడిపించినా,

గురజాడను నడిపింది స్వంత వివేచనే.

అదే వారి నిలువు.

## 3

గురజాడ వారి నిలువుని మరింత లోతుగా అర్థం చేసుకోవాలంటే అది రూపొందిన స్థల, కాలాలపై దృష్టి పెట్టాలి.

అప్పటికి

1) భారతదేశంలో ఒక ఆలోచనా వర్గం ఏర్పడింది. దానికి ఆరంభకునిగా చాలా మంది భావించే వ్యక్తి రాజారామమోహన్‌రాయ్. ఆయన తన సమూహంలోని కొన్ని సంప్రదాయాల పట్ల, మతం పేరిట ఆచరించుతున్న దురాచారాల పట్ల తన స్వంత వివేచనతో, ధైర్యంతో ధ్వజం ఎత్తాడు. తన పోరాటానికి ఆంగ్లేయుల శాసనాధికారాన్ని వినియోగించుకున్నాడు. తన సమాజంలోని ఒకనాటి తాత్వికతను పునరుజ్జీవింప చేసి, మధ్యలో వచ్చిన అవాంఛిత ఆచారాలను వదిలింపజేయటానికి బ్రహ్మ సమాజం నెలకొలిపాడు. ఆంగ్లవిద్య సంస్కరణలకి అవసరమని భావించాడు. ఈ ఆలోచనా వర్గం సంఖ్యాపరంగా చిన్నదైనా దాని శక్తి పెద్దది.

2) మారటానికి ఇష్టం లేని, ధైర్యంలేని అసంఖ్యాక సమూహం ఉంది. సహజంగానే ఈ మార్పుల ప్రయత్నానికి అది సమ్మతించదు. సంఖ్యాబలం ఉన్నా, దాని శక్తి ప్రదర్శనకి ప్రధాన అవరోధం భారతదేశపు ప్రత్యేక పరిస్థితి. ఈ పరిస్థితి వర్ణ వ్యవస్థ, కుల వ్యవస్థల ఫలితం. అచింత్యుడూ, నిర్గుణుడూ, నిరాకారుడూ అంటూ

ఎంతో పైస్థాయికి చెందిన అమూర్త (నైరూప్య, అరూప) భావనలతో ఈశ్వరుడిని ఏకదైవం చేసే ఎన్నో తాత్విక భావాలు వచ్చినా, సామాజిక అసమానతలను ధార్మిక పరిధిలోనే తొలగించటానికి కొన్ని ప్రయత్నాలు జరిగినా ఈ రెండు వ్యవస్థలూ సృష్టించిన సామాజిక అంతరాలను అవి గట్టిగా తాకలేక పోయాయి. భారతదేశపు సమూహాలకుగాని, వ్యక్తులకు గాని కష్టసుఖాలను ఒకే విధంగా అనుభవించే వీలు ఇవ్వలేక పోయాయి. ఒక సమూహంలోని దురాచారమనే దానితో తతిమ్మా సమూహాలకు వాస్తవిక సంబంధం లేకపోయింది. ఓ సమూహంలో రావలసిన మార్పులూ, దాని పట్ల వ్యతిరిక్తతా ఆ సమూహానికే సూక్ష్మస్థాయిలో పరిమితమై పోయాయి. స్థూలస్థాయిలో అది మొత్తం సమాజానికి చెందిన సంస్కరణగా చెప్ప బడినా, సూక్ష్మస్థాయిలో అది అనేకానేక సమూహాల దైనందిన కార్యకలాపాలకు సంబంధం లేనిదయింది. ఈ పరిస్థితి మార్పు వ్యతిరేకుల శక్తిని పెంచలేకపోయింది.

3) ఈ మార్పు వ్యతిరేకులు పొందిన విజయం ఏదైనా ఉందా అంటే వెలి వంటివి అమలు చేయటంతో పాటు, వారి స్మృతులు, శృతులూ, వేదాలూ, ఉపనిషత్తులూ వంటి గ్రంథాల పరిధిలోనే మార్పు కోరేవారు వాదనలు చేయవలసి రావటం. ఆ భావనలూ, భాషా పరిధిలోనే రాజారామమోహన్‌రాయ్ నుంచి, అంబేద్కర్ వరకూ తమ వాదనలు చేసారు. సమాజంలో అమలులో ఉన్న అనేక దురాచారాలు ఆ గ్రంథంలో లేవని చూపించటానికి తమ కాలమంతా వినియోగించవలసి వచ్చింది.

4) కందుకూరి వీరేశలింగం ఈ వాదనా విధానంలోనే పనిచేస్తూ, విధవా వివాహాలు జరిపించటానికి కొత్తగా పెరుగుతున్న 'అక్షరాస్యుల'ను ప్రభావితం చేయటానికి సాహిత్య మార్గం చేపట్టాడు. కార్యకర్త అయిన ఈయనకు సాహిత్యం ఒక ప్రచార సాధనంగా కనిపించింది. ఈయన సాహిత్య సృజన హేళన ప్రధానంగా సాగింది. ఆనాటి చదువరి అయిన వెంటే సాగుతూ, దురాచారాలు లేదా మూఢవిశ్వాసాలతో బాటు అవి కలిగి ఉన్న వారిని హేళన చేయటం ద్వారా తాము ఇతరుల కన్న అంతో ఇంతో అధికులమన్న మానసిక ఆధిక్యతా భ్రమకు లోనవటానికి అవకాశం ఏర్పడింది. ఇది కందుకూరి వారి ఆచరణ రంగానికి అతికినట్లు సరిపోయింది.

5) గురజాడది విజయనగరం. ఈ నగరం ఒక సంస్థానం. దీని పాలకుడు ఆనంద గజపతి రాజు. పడమటి గ్రంథాలు, పత్రికలూ అప్పటిలో భారతదేశానికి చేరటానికి

సంస్థానాలే ద్వారాలు. దానికి సంస్థానాధీశుల అభిరుచులూ కారణం కావచ్చును. ఆంగ్ల పాలకుల ప్రోత్సాహమూ కారణం కావచ్చును. 17, 18, 19 శతాబ్దాలు ప్రపంచ తాత్విక చరిత్రలో ప్రధానమైనవి. ఆ పుస్తకాల ద్వారా నూతన భావాలూ, భావనలూ భారతదేశానికి చేరటానికి పట్టే కాలం 20, 30 సంవత్సరాలకు గణనీయంగా తగ్గింది. రాజుచేత గుర్తింపబడిన అప్పారావు గారికి అవి వెంటనే అందే వీలుకలిగింది.

6) సంస్థానాలను ఆశ్రయించుకుని జీవించేవి కళావంతుల కుటుంబాలు. వారివల్ల నాశనమైపోతున్న సంసారాలు కందుకూరి వారి దృష్టికి వస్తే వారు ఆరంభించినది ఏంటీనాచ్ ఉద్యమం. ఆనాటి పత్రికలను పరిశీలిస్తే వేశ్యల వివాహ ప్రయత్నాలు, వారే తమ ప్రత్యామ్నాయ ఉపాధి మార్గాల గురించి ప్రశ్నించడాలూ కనిపిస్తాయి. ఇలాంటి వాతావరణంలో వేశ్యల అసలు సమస్య గురించి ఆలోచించటానికి, పరిశీలించటానికి విజయనగర వాతావరణం, రాజప్రాపకం గురజాడకి ఉపకరించాయి.

ఈ పై చెప్పబడిన పరిస్థితులలో గురజాడ నిలువు రూపొందింది.

దానిని రెండింటిగా విభజించి అవగతం చేసుకోవచ్చు.

సమాజంలో మార్పులు అవసరం. దానికి సాహిత్యం వినియోగపడాలి – ఇది సమాజ సంబంధి.

సాహిత్యంలో కూడా మార్పులు అవసరం. అది వాస్తవికతను ప్రధానం చేసుకోవాలి. భాష కృతక స్థితి నుంచి వాస్తవికం కావాలి. అంటే వాడుకభాషలో రచన సాగాలి. వస్తువు, పాత్రలు వాస్తవ జీవితం నుంచి ఎంచుకోవాలి. అంటే అవి రచయిత భావాలు, నిలువు చెప్పే కీలుబొమ్మలు కారాదు. రచన మాత్రమే రచయిత హృదయం ఎటు మొగ్గి ఉన్నదీ చెప్పాలి. ఆ హృదయం ఎప్పుడూ మనిషిమీద కరుణ కలిగి ఉండాలి. – ఇది సాహిత్య సంబంధి.

ఇదీ గురజాడ నిలువు.

దీనివల్ల ఆయన సమాజంలోని మార్పులను సమర్థించటంతో బాటు ఆ మార్పుల పేరిట పబ్బం గడుపుకునే స్వార్థపరులనూ, కబుర్లరాయుళ్లనీ చూడగలిగాడు. తెలిసిన వాళ్లు ఎంత అవకాశవాదులుగా ఉండగలరో చూపగలిగాడు. తద్వారా ఆయన సాహిత్యానికి

ఒక కొత్త సామాజిక బాధ్యత సూచించగలిగాడు. సమాజంలో వస్తున్న ధోరణులకు ఒక కాపలాకుక్కలా వ్యవహరించి, ఏ పెడధోరణి కనిపించినా, తన స్వంత వివేచనతో పసిగట్టి అరచి, గోలచేసి, తలపడి జనాన్ని జాగృతం చేయటం దాని బాధ్యత. – ఇది సమాజ సంబంధమైనదైతే –

సాహిత్యంలో ఆయన నిలువు – కొత్తపాతల మేలుకలయిక, క్రొమ్మెరుంగుల జిమ్మగా – అంటూ వ్యక్తం అయింది. కొత్తపాతల మేలు ఎవరు నిర్ణయిస్తారు? కొత్తలోని మేలునీ, పాతలోని మేలునీ తూచేది ఎవరు? ఎలా? స్వంత వివేచన.

ఈ స్వంత వివేచన అన్నది వ్యక్తి ఇచ్ఛమేరకు ప్రవర్తించే లక్షణంగా పొరబడరాదు. సమాజ నియమాలను, ధోరణులను వివేచించి తన బుద్ధి మేరకు తనను తాను నడుపుకునే శక్తి అది. అలాగే అది సాహిత్యంలో స్వీయమానసిక ధోరణిగా కూడా పొరబడరాదు. అది సాహిత్యంలో వ్యక్తియొక్క సామాజిక ప్రతిఫలనమేనని గ్రహించాలి. అది సమాజంపై వ్యక్తిలో నిబిడీకృతమైన బాధ్యతగా అర్థం చేసుకోవాలి.

## 4

గురజాడ మీద ప్రశంస, అభిశంసనల చరిత్ర అంతా ఆయన నిలువు పట్ల సమర్థన, వ్యతిరిక్తతల చరిత్రే. ఒక విధంగా ఇది దాదాపు వందేళ్ల తెలుగు జాతి బౌద్ధిక, తాత్విక చరిత్రగా కూడా భావించవచ్చు. ఈ చరిత్రను కొన్ని దశలుగా విభజించి క్లుప్తంగా పరిశీలించ వచ్చు. ఆరంభదశలోని సమర్దన, వ్యతిరిక్తతలు తరవాత కాలాలలో అదే విధంగా లేవు. అవి స్వభావంలోనూ, స్వరూపంలోనూ మారుతూ వచ్చాయి.

గురజాడ నిలువుపై ఆరంభ సమర్థన, వ్యతిరిక్తతలు ఏమిటి? ఎందుకు?

వారి తొలి సమర్థకులు అనేక రకాలు. సామాజిక నిలువుతోనూ, సాహిత్య నిలువుతోనూ పూర్తి ఏకీభావం కలవారు కొందరు. ఆయన సాహితీ సామర్థ్యానికి ముగ్ధులై పోయినవారు ఇంకొందరు. తమ చుట్టూ మసిలే మనుష్యులలో కనిపించే అవతత్వాలను పోల్చుకోటానికి కావలసిన జీవిత పరిశీలనను అద్భుతంగా అక్షరబద్ధం చేసిన సామర్థ్యానికి తాదాత్మ్యం చెందినవారు మరికొందరు.

వ్యతిరేకులలో గురజాడ సామాజిక నిలువుతో అంటే సంస్కరణల సమర్ధనతో ఏకీభవించనివారు కొందరైతే సాహిత్య నిలువుతో అంటే వాడుక భాషతో విభేదించనివారు

మరికొందరు. ఈ కారణంతో దాన్ని, ఆ కారణంతో దీన్ని వ్యతిరేకించినవారు ఇంకొందరు. స్వకులాన్ని రచ్చకీడ్చిన కులద్రోహి అని భావించిన వారు కొందరైతే, శాఖాభేదాలతో ఆగ్రహించిన వారు కొందరు. వారిలో సాంప్రదాయ నిరాకరణను సాంప్రదాయ పతనంగా ఎంచినవారిని మరింతగా పరిశీలించాలి. అప్పటికి ఆంగ్లవిద్య కొత్త ఉపాధి మార్గాలను తెరిచిందన్నది బ్రాహ్మణ కుటుంబాలకు పూర్తిగా తెలుసు. ఆ విద్య వేషభాషలను మార్చింది. ఆ ఉపాధులు డబ్బు అన్నదాని శక్తిని అర్థమయేట్టు చేసాయి. అదే సమయంలో అంత వరకూ ఆయాచితంగా పదవితో సంబంధం లేకుండా, పుట్టుకతో సంక్రమించిన ఆధిక్యతతో అనుభవించిన తోటి మనుష్యుల 'విధేయత' తగ్గుముఖం పట్టటం వారిని అభద్రతకి గురి చేసింది. దానికి 'కారకులైన' స్వసమూహంలోని గురజాడ, కందుకూరి వంటి ఈ ద్రోహులను ఎలా ఎదుర్కోవాలి? సామాజిక దోషాలుగా వారు ఎత్తిచూపుతున్న వాటిని కాదని, అవి ఎలా సమాజానికి అవసరమో వారి మార్గంలో - అంటే పత్రికలలో, సాహిత్యంలో, తర్కంతో వాదించాలి. ఆనాటి పత్రికలలో శారదా చట్టానికి (వివాహ వయోపరిమితిపై 1930-34) కనిపించిన పాటి వ్యతిరిక్తత, కన్యాశుల్కం, విధవా వివాహం వంటి సంస్కరణల విషయంలో కనిపించదు. వ్యతిరిక్తత ఉండకుండా ఉండే అవకాశం లేదు కనుక, దానిని బట్టి అది వ్యక్తం కాలేదు అని అర్థం చేసుకోవచ్చు. దానిని గురించి రాసినవారు కాని, పత్రికలు పెట్టినవారుగానిచాలా అరుదుగా కనిపిస్తారు. కారణం ఆనాటి 'అక్షరాస్యుల'లో వారి సంఖ్య తక్కువ. దాంతో వీరి వ్యతిరిక్తత చెవికొరుకుళ్ల (scandals) రూపంలో ఎక్కువగా వ్యక్తమయింది. చాలా వరకూ దానికే పరిమితమయింది. గురజాడ విషయంలో ఆయన రాజ విధేయత, జీవనశైలి, ప్రవర్తన వంటి వ్యక్తిగత అంశాల నుంచి అనేక లైంగికనీతి పతనాలను వదంతులకు సరుకుగా తయారు చేసుకున్నారు.

ఇక సాహిత్య విషయానికి వస్తే గురజాడ, గిడుగుల వాడుకభాషా ప్రతిపాదనకు వ్యతిరిక్తత చాలా గట్టిగానే బహిరంగమయింది. విశ్వవిద్యాలయాలలో గ్రాంథిక భాషను నిలబెట్టటానికి చాలాకాలం వరకూ ప్రయత్నాలు సాగాయి.

మోడర్న్, ప్రోగ్రెసివ్ అన్న ఆంగ్ల పదాలకు సమానార్థకంగా వాడుతున్న ఆధునిక, అభ్యుదయ పదాలకు పర్యాయ పదంగా గురజాడను ప్రశంసించటం ఆరంభమయి,

క్రమంగా బలపడింది. ఆధునికతను ఒక మలుపుగానూ, అభ్యుదయాన్ని ఒక మార్గంగాను భావించేవారు. కాలక్రమంలో ఆ రెండూ గతం పట్ల కించాదృష్టినీ, అవహేళననూ వ్యక్తం చేస్తున్నాయన్న భావన బలపడ్డాక గురజాడ అభిమానుల ధోరణినీ, 'అతి'నీ ఎదుర్కొనే క్రమంలో గురజాడను అభిశంసించేందుకు కొందరు ప్రయత్నించారు. గురజాడకీ, వీరేశలింగానికి మధ్య భేదం, దానిని పరాస్తం చేయటానికి ఆయన డైరీలో ప్రక్షిప్తాలూ వంటివి రాతలకు ఎక్కాయి. ఆరంభ వ్యతిరిక్తత సృష్టించిన చెవికొరుకుళ్లు రాతలకు ఎక్కాయి. కన్యాశుల్కం కర్తృత్వం కూడా గురజాడది కాదన్న వివాదం సైతం వచ్చింది.

సెట్టి ఈశ్వరరావు, అవసరాల సూర్యారావు, కట్టమంచి రామలింగారెడ్డి, నార్ల, శ్రీశ్రీ, ఆరుద్ర, కె.వి.రమణారెడ్డి వంటివారి కృషి, ఆరాధనల వల్ల గురజాడ సృజన తెలుగు వారి గుండెలకు హత్తుకుంది. రచనల సేకరణ, పరిశీలన, వివరణలతో వారి కృషి ప్రతి ఫలించింది. కె.వి.ఆర్, ఆరుద్రల నిశితమైన పరిశీలనలలో వివరాల సేకరణ, విశేషాల వివరణ తెలుగు ఆలోచనా పరులకు గురజాడను నిత్యనూతనం చేసాయి. గొప్ప పరిశోధనా లక్ష్యంతో బ్రౌన్‌నీ, గురజాడనీ పరిశోధించిన బంగోరె (బండి గోపాలరెడ్డి)ని 'సత్య' ఆరాధకునిగానే గాని, 'వ్యక్తి' లేదా 'ఆదర్శ' ఆరాధకునిగా నేను భావించలేను. ఆయన కృషితో మొదటి కన్యాశుల్కం తిరిగి వెలుగులోకి వచ్చింది.

ఒక దశలో గురజాడకి లభించిన గుర్తింపు, ప్రచారం కమ్యూనిస్టులు పనిగట్టుకుని చేసిందన్న వారు ఉన్నారు. తెలుగు సాహిత్యంలో కమ్యూనిస్టుల ప్రవేశానికి ముందు గురజాడపై వచ్చిన వ్యాసాలను విడిగా పరిశీలించి ఆ భావాన్ని గట్టిగా ఖండించటం జరగలేదు. ఆయనపై అవిరళ కృషి చేసిన వారు ఆ వ్యాసాలను పరిశీలించినా, ఈ 'విమర్శ'ను చూసీచూడనట్టు ఉపేక్షించారు.

ఆ తరువాత దశలో గురజాడ, కందుకూరిలను కామ్రేడ్‌లుగా కమ్యూనిస్టులు గౌరవించడం కొత్త వ్యతిరేకులను తయారు చేసింది. వారు ఏదో ఒక నెపంతో గురజాడపై ధ్వజం ఎత్తిన సంఘటనలు చోటు చేసుకున్నాయి. వారిని ఆంగ్లేయుల బానిసలుగా, దేశభక్తి లేనివారిగా, లైంగికనీతి బాహ్యులుగా చూపెట్టటానికి ప్రయత్నించారు. ఈ కాలమంతా ఇవేవీ పట్టించుకోకుండానే చదివే జనం గురజాడను చదువుతూనే ఉన్నారు. నేర్చేది నేరుస్తూనే ఉన్నారు. ఆనందించేది ఆనందిస్తూనే ఉన్నారు.

## 5

ఇటీవలి దశలో వచ్చిన విమర్శ అన్ని విధాలా భిన్నమైనది. ఇది సాహిత్యంలో అస్తిత్వ వాదాలు దూసుకు వచ్చిన దశ. ఈ విమర్శకు లోతూ, గాఢతా ఉన్నాయి. దీనికి గురజాడ నిలువుతో విభేదం లేదు. స్థూలస్థాయిలో గురజాడదీ, వీరిదీ నిలువు (stand) ఒక్కటే. సాహిత్యానికి సామాజిక బాధ్యత ఉంది. జీవిత చిత్రణలోనూ, భాషలోనూ కూడా అది వాస్తవికంగా ఉండాలి.

పోతే –

వారి పరిశీలనకు కేంద్ర బిందువు గురజాడ పుట్టుక. మనిషి ఎక్కడో ఒకచోట పుడతాడు. అతని భావ వైశాల్యం వల్ల విస్తరిస్తాడు. ప్రపంచమంతటికీ చెందుతాడు. స్థలకాలాలను అధిగమిస్తాడు. దానికి అతని సామర్థ్యం చాలావరకు పనిచేస్తుంది. కొంత వరకూ అతని జాతి స్వభావం, వారి కృషీ పనిచేస్తాయి. భారతీయ సమాజంలో అధిగమించవలసిన వర్ణం, కులం, భాష వంటివి అధికంగా ఉన్నాయి. అవి పుట్టుకతోనే లభిస్తాయి. గురజాడ వెంకట అప్పారావు అనే మనిషి బ్రాహ్మణ అనే కులంలో, వర్ణంలో ఆయన ప్రమేయం లేకుండా పుట్టాడు. అది ఈ సమాజంలో పుట్టిన ప్రతి ఒక వ్యక్తికి సాధారణ పరిస్థితి. అస్తిత్వ వాదుల పరిశీలన ప్రకారం ఆయన కృషి ఆయన పుట్టిన కులం 'బాగు'కే వినియోగింపబడింది.

దాదాపు 70–80 ఏళ్ళుగా గురజాడ అభిమానులూ, వ్యతిరేకులూ దాదాపు అగ్ర కులాల వారు. ఆ కులాల బయటివారు ఇపుడు ఈ ప్రశ్న లేవనెత్తారు. గురజాడను ఆధునికతకూ, అభ్యుదయానికీ తర్వాత కమ్యూనిజానికీ విగ్రహం చెయ్యబోతే వాటివల్ల మాకేం ఒరిగిందని ఆలోచిస్తున్న వారు లేవనెత్తిన ఈ ప్రశ్న చర్చనీయమైనది.

భారతదేశపు ప్రత్యేక పరిస్థితుల సమగ్ర అధ్యయనానికి ఎంతయినా దోహదం చెయ్యగల ప్రశ్న ఇది. ఇది సరిగ్గా చర్చించబడలేదు. మాకొద్దీ తెల్లదొరతనమని అగ్ర కులాల వారు ప్రకటిస్తే మాకొద్దీ నల్లదొరతనమని తతిమా కులాల వారు స్పష్టం చేస్తున్న తరుణం ఇది. ఆత్మగౌరవం అంతిమ లక్ష్యమంటున్న అణచబడిన, బడుగున్న సమూహాలు వేసిన ఈ ప్రశ్న ఒక మీటింగ్ పాయింట్ ఏర్పరచింది. దీనిలో సమాజం అంతా పాల్గొనే అవకాశం, పరిస్థితి ఉంది. ఆవశ్యకత ఎంతయినా ఉంది. ఇది ప్రస్తుతం బీజ ప్రాయంలో ఉన్న ప్రశ్న. రేపటి తాత్వికత దీని నుంచే పుట్టే అవకాశం ఉంది.

మాకేమిటి అన్న రాజకీయ డిమాండ్ నుంచి మేమేమిటి అన్న తాత్విక ప్రశ్నవైపు భారతీయ సమాజంలోని అశేష సమూహాల ప్రయాణం ఇప్పుడిప్పుడే ఆరంభమయింది.

ఈ దశలో అడుగడుగునా గిరీశాలు ఎదురవుతుంటారు. వీరివద్ద పదిమందినీ చుట్టూ తిప్పుకోగల సామర్థ్యమేదో ఉంటుంది. మాటకారితనం ఉంటుంది. తాము మాటలాడుతున్న దానికి జవాబ్దారీలేనితనం ఉంటుంది. ఈ క్షణం పబ్బం గడవటం కోసం ఎంతకైనా తెగించగలతనం ఉంటుంది. వీరు అభ్యుదయ చింతకుల వేషంలో ఉంటారు. తమ వ్యక్తిగత సామర్థ్యాలను ఆ వేషం రక్తికట్టటానికే ధారపోస్తారు. అమాయకులైన బుచ్చమ్మలను ఉద్ధరించటానికే పుట్టామంటారు. తోలుబొమ్మలాటలో కేతిగాడు, బంగారక్కల లాగ వచ్చి నిద్రపోతున్న జనాన్ని లేపటానికన్నట్లు కబుర్లు చెప్పటమే గిరీశాల పాత్ర. చప్పట్లే వారి లక్ష్యం. చడీచప్పుడూ లేకుండా సొమ్ము చేసుకునేవారి కన్న, చప్పుడు చేస్తూ దృష్టి నిలవకుండా మరల్చే గిరీశాలే సమాజంలో అయోమయం సృష్టించటంలో ముందుంటారు.

ఈ గిరీశాలు సాహిత్యంలో, ఉద్యమాలలో ప్రతి కార్యాచరణ రంగంలో, భావ రంగంలో తారసపడుతూనే ఉంటారు. తన కాలపు గిరీశంతో డామిట్ కథ అడ్డం తిరిగింది అనిపించ గలిగాడు గురజాడ. ఈనాటి, రేపటి గురజాడలు తమ చుట్టూ ఉండే, తమలోనే ఉండే గిరీశాలతో ఆ మాట అనిపించవలసిన అవసరం ఎప్పుడూ ఉంటుంది. ఆ గిరీశాలు లేని సమాజం మానవజాతి రూపొందించుకునే వరకూ ఆ అవసరం ఉంటూనే ఉంటుంది.

## 6

రాబోయే పాతిక ముప్పై ఏళ్ల కాలం భారతీయ సమాజానికి, అందులోని తెలుగు సమూహానికీ ముఖ్యమైన దశ. సమాజంలో అన్ని సమూహాలూ కలసి కష్టసుఖాలు కలబోసుకుంటూ, ఒకరి సమస్యలను ఒకరు తెలుసుకుంటూ, చర్చించుకుంటూ ముందుకు వెళ్లగల సందర్భం శతాబ్దాల బహుశా సహస్రాబ్దాల తర్వాత తొలిసారి ఏర్పడింది. ఆలోచనా పరుల సంఖ్య పెరుగుతోంది. దాంతో రాసేవారూ, అసంఖ్యాకంగా చదివేవారూ పెరుగు తున్నారు. ఈ సామాజిక సందర్భాన్ని సాహిత్యంలో ప్రతిఫలించవలసిన రచయితలు స్వంత వివేచనతో, బాధ్యతతో రాయటమే కర్తవ్యం. అనేక సమూహాలకు చెందిన వీరు గురజాడ వంటి వారిని కొత్తగా పరిశీలిస్తారు. వ్యక్తులుగా, సమాజ చలనంలో పాల్గొన్న శక్తులుగా వారిని గురించి ఆలోచిస్తారు. తమ ముందున్న కర్తవ్యాలను, ఆచరణలను ప్రోదిచేసుకోటానికి వెనకటి వారిలో ముందు చూపున్న వారి కోసం వెదికినపుడు గురజాడ

తప్పక కంటబడతాడు. పుట్టుకనుబట్టి వేరు సమూహానికి చెందిన వారైనా, వారి అనుభవాలు, వారి వ్యక్తీకరణ విధానాలు, వారి వ్యక్తిగత చిత్తశుద్ధి అయినా, మూటగట్టుకున్న తిట్లైనా, మెప్పులైనా తమకు ఉపయోగిస్తాయా లేదా అన్న దృష్టితో చూస్తారు.

ఇది భవిష్యత్తుపై నా అంచనా.

ఈ అంచనా ఏమాత్రం నిజమైనా ఈ పుస్తకం ఈ రూపంలో తెచ్చిన కృషి ఫలిస్తుంది.

**చెట్టపట్టాల్ పట్టుకుని**
**దేశస్తులంతా నడువవలెనోయ్**
**అన్నదమ్ముల వలెను జాతులు**
**మతములన్నియు మెలగవలెనోయ్**

అన్న గురజాడ వేడికోలుతో అందరం కలసి ఆలోచించుకోవాలన్న ప్రేరణ నయినా పొందుతాం!

**మతమునెన్నడు మరవనీకుము**
**మంచిగతమేనని భ్రమించనీయుము**
**జ్ఞానమొక్కటి కలియనీకుము**

అంటున్న వ్యాపార ప్రపంచ పాలనలో మనం జ్ఞానోదయం కోసం ధైర్యం తెచ్చుకుంటే

**మతములన్నియు మాసిపోవును**
**జ్ఞానమొక్కటె నిలచి వెలుగును** – అన్న గురజాడ ఆకాంక్షని మానవుని ఆకాంక్షగా గుర్తించగలుగుతాం !

అందుకోసం మా ఉడతాభక్తి ప్రయత్నం ఈ గ్రంథం.

**– మీ మనసు వివిన మూర్తి**

# గురజాడ జీవితంలో ప్రధాన సంఘటనలు

| | | |
|---|---|---|
| జననం (తండ్రి రామదాసు, తల్లి కౌసల్యమ్మ)...................... | : | **21-9-1862** |
| ప్రాథమిక విద్య చీపురుపల్లిలో ................................ | : | 1869-1872 |
| హైస్కూలు విద్య విజయనగరంలో ...................................... | : | 1872-1882 |
| మెట్రిక్ : మహారాజా హైస్కూలు .............................. | : | 1882 |
| ఎఫ్.ఎ. మహారాజా కళాశాల...................................... | : | 1882-84 |
| ఇంగ్లీషులో 'కుక్కూ' గేయం ......................................... | : | 1882 |
| 'సారంగధర' ఇంగ్లీషు గేయం ప్రచురణ ................................ 'ఇండియన్ లీజర్ అవర్', విజయనగరం | : | 1883 |
| 'సారంగధర' ప్రచురణ కలకత్తా నుంచి ................................. వెలువడే రయస్ అండ్ రయత్ జర్నల్‌లో | : | ఆగస్టు 11 & 18, 1883 |
| బి.ఎ. పట్టా మహారాజా కళాశాల నుండి........................... | : | 1884-1886 |
| అప్పల నరసమ్మతో వివాహం ........................................ | : | 1885 |
| మహారాజా కాలేజీలో ఉపన్యాసకులు (ఇంగ్లీషు) ఉద్యోగం ...... | : | 1886 |
| డిప్యూటీ కలెక్టర్ ఆఫీసులో హెడ్ క్లర్కు ఉద్యోగం ................ | : | 1886 |
| మహారాజా కాలేజీలో ఉపన్యాసకులు ............................ | : | 1887 |
| కుమార్తె లక్ష్మీ నరసమ్మ జననం .............................. | : | 1887 |
| డిబేటింగ్ క్లబ్‌కు ఉపాధ్యక్షుడు........................................ | : | 1889 |
| కుమారుడు రామదాసు జననం........................................ | : | 12-10-1890 |
| మూడవ స్థాయి ఉపన్యాసకులుగా పదోన్నతి .................... | : | 1891 |
| తమ్ముడు శ్యామలరావు మరణం ...................................... | : | 1890-92(?) |
| 'కన్యాశుల్కం' మొదటి ప్రదర్శన (జగన్నాథ విలాసినీ సభ) ........ | : | ఆగస్టు 1892 |
| మద్రాసుకు వైద్య సహాయం కోసం పయనం, "ట్రీటీ" ప్రచురణ | : | 1895 జనవరి 9 నుండి జులై 3 |

| | | |
|---|---|---|
| ఎస్టేట్ ఎపిగ్రాఫిస్ట్‌గా నియామకం........................ | : | జూన్ 5, 1896 |
| 'ప్రకాశిక పత్రిక' డిక్లరేషన్ .................................... | : | 1896 |
| 'కన్యాశుల్కం' మొదటి కూర్పు; ముద్రణ ........................ | : | జనవరి 1897 |
| ఆనంద గజపతి మరణం ............................................ | : | మే 23, 1897 |
| 'హరిశ్చంద్ర' ఇంగ్లీషు నాటకానికి పీఠికా రచన.................... | : | 1897 |
| కుమార్తె వివాహం ................................................ | : | మే 12, 1898 |
| రేవా రాణీగారికి అంతరంగిక కార్యదర్శిగా నియామకం .......... | : | జూన్, 1898 |
| మద్రాసులో పరిశోధన ............................................ | : | 1899 |
| ఎస్టేటు కేసులపై సలహా కోసం కలకత్తా ప్రయాణం .............. | : | 1900 |
| మద్రాసులో భాష్యం అయ్యంగారితో సమావేశం .................. | : | డిసెంబర్ 18, 1900 |
| రెండవ కుమార్తె జననం .......................................... | : | 1902 |
| వారసత్వ దావా; ఎస్.శ్రీనివాస అయ్యంగారితో స్నేహం............. | : | 1903 |
| ఇంగ్లీషు కథా రచనా కాలం (Stooping to Raise)............... | : | 1903 |
| తండ్రి రామదాసు మరణం .......................................... | : | ఏప్రియల్ 24 1905 |
| 'కొండుభొట్టీయము' నాటక రచన ................................ | : | మే 1906 |
| వ్యావహారిక భాషోద్యమం .......................................... | : | 1906 |
| 'నీలగిరి పాటలు' ప్రచురణ ...................................... | : | 1907 |
| 'కన్యాశుల్కం' మలికూర్పు; ముద్రణ ............................ | : | 1909 |
| ఆంధ్రభారతిలో 'దిద్దుబాటు' కథానిక ప్రచురణ .................. | : | ఫిబ్రవరి, 1910 |
| బరంపురంలో భిన్నకులాల సహపంక్తి భోజనం .................. | : | నవంబర్, 1909 |
| 'బిల్హణీయం' మొదటి భాగం ప్రచురణ ........................... | : | 1910 |
| ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో | | |
| 'మీపేరేమిటి' పెద్దకథ ప్రచురణ, ఆంధ్రభారతి...................... | : | ఏప్రిల్–జూన్ 1910, |
| 'ముత్యాలసరము' గేయం ప్రచురణ, ఆంధ్రభారతి .................. | : | జులై 1910 |
| 'కాసులు' గేయం ప్రచురణ, ఆంధ్రభారతి ........................ | : | ఆగస్టు 1910 |
| 'డామన్ పితియస్' గేయం ప్రచురణ, ఆంధ్రభారతి................. | : | సెప్టెంబర్ 1910 |

| | | |
|---|---|---|
| 'లవణరాజు కల' గేయం, ప్రచురణ ఆంధ్రభారతి | : | నవంబర్ 1910 |
| 'బిల్హణీయం" రెండవ భాగం ప్రచురణ, ఆంధ్రపత్రిక, ఉగాది సంచికలో | : | 1911 |
| మద్రాసు విశ్వవిద్యాలయం బోర్డ్ ఆఫ్ స్టడీస్‌లో సభ్యత్వం | : | 1911 |
| కలకత్తాలో రవీంద్రనాథ్ టాగోర్‌తో భేటీ | : | జనవరి 23, 1912 |
| 'కన్యక' గేయం ప్రచురణ, ఆంధ్రభారతి | : | అక్టోబరు 1912 |
| 'పూర్ణమ్మ' గేయం రచన | : | 1912 ? |
| రేవారాణి మరణం | : | డిసెంబరు 1912 |
| మద్రాసు విశ్వవిద్యాలయం – ఫెలోషిప్ | : | జనవరి 1913 |
| వారసత్వ దావాలో రాజీ | : | 1913 |
| 'సుభద్ర' పద్యకావ్య రచన | : | 1913 ? |
| పదవీ విరమణ | : | 1913 |
| 'దేశభక్తి గేయం' ప్రచురణ; కృష్ణాపత్రిక | : | ఆగస్టు 9 1913 |
| 'డిసెంటు పత్రం' (ఇంగ్లీషు) ప్రచురణ | : | 1914 |
| 'దించు లంగరు' గేయప్రచురణ, కృష్ణాపత్రిక | : | ఏప్రియల్ 1914 |
| అనారోగ్యం | : | నవంబర్ 19, 1914 |
| వైద్య పరీక్షలు | : | 1915 |
| 'లంగరెత్తుము' గేయ రచన | : | సెప్టెంబర్ 1915 ? |
| గృహప్రవేశము | : | 1915 |
| మరణం | : | **నవంబర్ 30, 1915** |

# విషయసూచిక

## 1. కవితలు 1 - 122

# Sarangadhara

## Part - 1

The labouring dawn gave out the child of light
Whose infant became played O'er the river's breast
And woke the bees asleep in lotus bowers,
While from Godavary's bank in merry whirls
A thousand pigeons starred the morning sky.
"Mine that, that farthest speck," one cries ; "And mine
Is out of sight," another ; but a third,
"Mine surely wheels the best"; and many so
Scanned with their weary eyes, like flying hopes
Their favourite birds. The prince at last as if
He said, "Let all that be, now see how mine
Doth wheel," with one warm kiss left his. At once
Rose over the air one deafening cheer; all eyes
Were up, when lo! no flight, no merry whirl,
The frightened bird rushed onwards as if mad
And perched himself upon the palace heights.

The prince concerned his min'ster comrade called,
And said, "Didst thou not mark my pigeon perch
Upon those spires gilt by the morning sun?
They are the Queen's; and I shall fetch it back."
But, then, the boy - dewan held by the robe
Prince Saranga, and whispered in his ear,

"The King's abroad to hunt and thou art fair."
"Fool!" thought the prince as on he rushed, "to breed
Such thought like this.

But at his sight up rose
Chittrangi, once bride destined but whom
A father's love, his mother made, and said,
"O Sir what favour this! Sooner we thought
Could *Sampang* blooms invite the bee, than (then?) thee
These mansions poor. Pray seat thyself upon
This silken throne." She slowly washed his feet
With waters pure in golden vessels held,
And washing, "Many a way thy presence here
This day, gives boundless joy to me. Thy sire
To try his aged strength in youthful sports,
To hunt is gone; and in thy beauteous form
I see the king to lusty youth transformed."
Then softly pressing dry with robes she wore
His feet, with smile on lip and blush on cheek,
"What interest one may feel in thee, that once
Was bride destined?"
Then flashed through the Prince's mind,
"The king's abroad to hunt and thou art fair."
But yet he thought, "That may not be."
And she went on, "To whom but one beloved
I pride would feel to show my pleasure groves –
The talk of the world? Pray rise and come.
And thou shalt see a hundred fountains leap
Bright in the morning sun, and Nature fair
All night in calm repose now gives herself
To mirth and jollity."

"Another time,
Good mother ! for me it would ill - become
To tarry long, while all my comrades wait
Upon the river's bank, whereas we flew
Our pigeons, mine" – "Tis safe," she interposed,
And dragged him by the arm through several gates
And left him at a bright pool's brink and shut
A gate or two and slipt.[1]

And he, like one
From midnight slumbers snatched to moonlight bowers
In Persian vales, by some love-sick Peri,
With wonder looked around at scenes the like
He never saw before. All over the park
A hundred fountains flew, with rainbows decked
And full of golden foam; a Jessamine sea
About him spread, and at his feet a pond
Now one by one her colored lilies closed.
More varied lay the scene beyond, where spread
As far as eye could reach an endless grove.
With raptured eye the prince surveyed the scene
And took his way to where one water broad
Shone in the morning sun, and stood reclined
To a youthful tree that kissed the water's face.
He was a learned youth and not to him
Unknown the magic realms that poets trod
Before ; and spake to him each bird and bloom
Some poetic tale or moral sweet. He mused
And musing stood, lost in a world of charms.

But lo ! Presently at his side, the queen,
Her ringlets flying to the morning breeze,
Like water nymph or forest Dryad stepped;
And looked steadfast with eye unlided like
Some modern mesmerist over his subject,
At that fair prince. But he, like one in trance
Mesmeric, stood absorbed.
And she advantaged by his absent mood.
Stole softly round his neck her snowy arm
And softly thus began, "Marketh thou prince
How now the Lord of Day from every bud
Kisses the sleep away, that blushing wakes
And opens her fairy lids? The butterfly
Robbed in his gaudy silks wooes every bloom,
But wooes to quit – reckless wanton he !
And lo ! that malati twining as it does
The Kulaya's tall and aged trunk holds up
Her odorous blooms to frolic Zephyr's kiss.
In nature all his playful, all his mirth,
And beauteous things to beauteous things are linked."
And here a meaning look she cast at him,
But he  a ghastly look returned, and slipped
From her side as if to pluck a lotus
That at the margin blew.

"Softly my prince !
Disturb not so the amours of the pair
Of ruddy geese, from nights' separation sore,
That lately met. 'Tis but a dreary waste

This mortal world, unless Love strew the scene
With freshening flowers. And O ! the pain one feels.
That feverish flame that creeps through every nerve –
Not soothed but fanned by Nature's cooling hand –
That anguish deep for one beloved ! Worse than
A brute is he, that having power to soothe,
Lends not his tender aid ! O ! save me dear
From yonder black-bee buzzing over the bloom
That thou hast pluckt." She drew behind him close
As if for fear, and threw her arms around
His neck, like frightened fawn behind from bush
Of stately growth. "I tremble Prince", she said
In accents choked within an ivory throat,
"There crept into the hollow of that trunk
A frightful snake. Then carry me secure
To yonder summer house that skirts that lake."
She hung upon his arm, and he led on.
At that gate she looked relieved, held firm
The prince's hand, and in her turn played guide.
"Lo! Prince," she said as into a room they stepped,
"Upon these walls, a master pencil's work,
It was a smith of learning great, who was
Much favoured at our court. Him brahmins[1] feared;
And once my sire in whimsied mood fade him
Draw these. Become they not a bridal gift?
The art of Love is there laid bare, and if
You read it to the end, why, then, thou learn'st,-
Where love is strong there hearts may wed,
You mark the amours of that shepherd God

Of million wives ! Did ever a woman love
And he not yield to her wish?"
'Mother ! wrongly
You read the sense of all those wondrous works
Of great Gopal. Didst thou not hear it said
That spirit of God husbands the human souls?
As if not hearing, she, "There in those panes
The amorous God a worthy lesson teach.
And saints! Well, well! if there is a heart that burns
With love for thee, respect you not examples
They have set?"
"I? Certainly not. One e'en
May read the mystic meaning of the stars;
Make out with daring aim the Maker's writ
On naked skulls, or peep through linkless words
At prophets' hearts; but who, however great
Of learning, can presume to read the sense
Of acts divine? On commonest things, doubt stamps
Her dismal mark. Why then should one with feet
Unhallowed tread the realms divine?"
"Well, prince !
If logic strange like this, befitting more
The broken hearts of forest bowers, should come
From youthful beauty, why then, may not our sex
Petition the gods against the mark (make?) of toys
Useless like us! The sprightly shape belies
These monkish texts. But I shall preach

Thee now upon a different theme, that must –
If thou art the rock that mocks the iron's edge –
Go home directly to the heart." "This then,"
She said, removing a screen that careful hung
Upon a drawing drawn to human size,
"This then the text on which was vileness played –
Vileness and grim perfidy by a king –
One, not less worthy than thy sire,"
He started back like one that meets at night
Some frightful shape, while from his lips escaped,
"Undone! Undone!" The image over the wall
To echo seemed. Speechless he stood, and not
The motion least his form betrayed, as if
The picture walked out of its frame. So like
Were they; for it was his. "And knowest thou prince,"
She said, "the story of this piece which strikes thee dumb
With such a perfect beauty that, except
Within thy glass, I throw, you never met?
At least I didn't ; and so when first my eyes
Lighted upon this drawing, which thy sire
Sent as the bridegroom's – and falsely sent–
My very heart did weep for (with) joy, and took
The image in. Since then the vision sweet
Haunted my thoughts, till last brought to this Court.
Whom did I meet within the bridal room?
Oh! Vilely done – thy sire! – and at his sight
Failed joy from me for ever. They say thou art
A man of tender heart; now make amends
For sins thy sire has done, or else no more

Can I endure the pangs of fruitless flame
For thee."
He tried to speak, but anger choked
His breath, and, muttering something, "Die than slip
From right." He moved to walk away; but she
Caught Sarang by his cloak, which he, in haste
To fly, left in her grasp, and through the park
Over  the flower and plant like whirlwind passd and climbed
The garden wall and jumped he down. And there
With sweep majestic flowed Godavary's stream.

He stood a moment on its bank, while rolled
Within his brain, like to a horrid dream,
The events late. A moment cast a crazy look
Upon the stream below, and, as if it were
Oblivion's flood, dashed into the river and reached
The other shore.

**Part - 2**

The noon was far advanced; the monarch left
The tents, and sought where freshening to the eye
The forest trees a shady bower made.
Wearied with morning's mirth, all nature sank to rest
And not the slightest stir was there, save where
The streamlet gurgled over the distant slope,
And butterflies, like the spirits of the wood, among
The foliage moved. And there he laid him down
Upon the grass, and wearied with the chase
Soon sunk to sleep and dreamt.

"It was moonlight

And with his queen beloved, long through the park
He walked in converse sweet, till when he reached
The summer house, and like a baby held
Her in his arms, a hideous shape came O'er her
And he dropped her in fright; and there was blood,
And broken limbs lay strewn upon the floor."
He woke in fright, and passing hastily
On to the tents, he cried, "to horse" and rode
Away.

But how was she, the object dear
Of all his anxious thoughts? She when the prince
Ran roughshed over the park like a wild colt
And left the cloak behind, felt like a lover who
In dream obtains his lady's wished embrace,
But waking, feels the pillow in his arms.
Sorely distressed she felt and from her eyes
Rolled down big drops. In silent grief awhile
She stood, and in her heart the feelings changed
To wounded worth, and anger next followed;
But revenge last took possession of her heart.
She leaned upon the gate and thought on what
To do; cried, "He shall rue;" and tore as mad
Her costly robe, and broke her bangles O'er
A post, and, as to lock her thoughts in sleep
'Gainst every feeling soft, emptied a glass
And lay upon the floor.
But when she woke
It was night. She rose not, but still with face

Pillowed on crossed arms, she brought to mind
The events of the morn, till coming where
The prince with countenance stern contemptuous looked
On her and turned away, her bosom burned
Once more with dire revenge, and in the fit
She like a fury lifted up her head; and saw
The king seated beside her, anxiously
Looking over the prostrate form before.
The Queen at once withdrew her face and dropped
It over again upon her crossed arms.
"What means this girl," he said, "this torn robe
And broken bangles strewn upon the floor!
And why withdraw thy face in haste, as if
You saw some hateful fiend in me? Is there
No better bedding than a floor? Arise
And speak! For me the riddle is hard to read."
But when he held her arm to lift her up,
O' touch me not my lord," she cried, I'm fouled,
Fouled by a stranger's touch within *thy* house,
Like harlot slighted. Ah! 'tis woman's fate
To bide by every ill" "Slighted and fouled!
And who the wretch that touched? For by my life
Tomorrow's morning shall not see him whole!"

"Vow not so, King ! for why should one be blamed
That fate decreed me this? First brought by guile,
I have to brook indignity in thy Court.
This morn, thy son, knowing you gone to hunt,
Came with the story of a pigeon fled ;

Desired to see my park, and in this place,
This very place, laid violent hands on me;
Said I was once his bride destined, and spoke
Of love, but when I, drawing yonder sword,
Prepared to die rather than yield to his wish,
He like a coward fled, and left me here
Distressed. I am defiled and thee but ill
Befit ! Henceforth an ascetic shall I live
In forest caves secluded from the world,
But harm him not, thy son, for it is my fate
And not his fault." "Enough," he said, and walked
With haughty step away.

It was the time
When, from their haunts, deities to shrines return;
And stars slip out from heaven's azure vault
Where on their silver thrones through all the night
A heavenly choir they keep; and beasts of prey
Completely wearied with their fruitless search
Homeward retrace their cautious steps. 'Twas then
Upon a rock beneath a forest lime
That with a thousand eyes her fragrance wept,
Loud wailing lay, in agony deep, a prince
With severed legs and arms; and none was near
Except the workers of the deed who watched
With heavy hearts from distance over the scene,
But who yon shape that like a shadow walks

The nighted wood? Some ghost whose haunts disturbed
The prince's wail? Oh no ! it is the saint
Whom oft at early morn the woodman meets
Crossing with speed of wind the forest tracts.
Has he then heard the prince's cry? He did,
And is presently at his side. "Alas !
Innocent prince", he cried, and from his pot
Sprinkled the holy water over his form.
At once the bleeding stopped, and, in his arms
Holding the swooning prince, the holy saint
Windswift over forest flew.

## Conclusion

The sun has set; but, linger yet his rays
Over the odorous heights of eastern peaks,
Where, stopping in her thoughtless speed, the fawn
With baby-wonder eyes the setting day,
That, twitching now his mantle bright, walked down
The slopes of the western mount. The forest lay
In all its twilight grandeur robed in shades.

But who be she that like a goddess sat
Upon a rock that edged a noiseless stream
And shiplike rose amidst a leafy sea?
All clad in purest white : one diamond lace
Alone adorned her neck and dangling rested
Over her fairy breast. Long did she trace
With thoughtful eye the evening evolutions
Of earth and sky, while each image that graced

Her orbs wooed back some relic of the past
Or golden thoughts that blossomed in her breast.
Softly she rose from reverie and withdrew
Her palm from 'neath her rosy cheek, and touched
A VIN with flowerets decked, and charmed the wood :-

**Chorus**

*With power and pelf so falsely fair,*
*The world is all to thee;*
*O speak no more; O speak no more,*
*The world is not for me.*

With tempting hues the lilies blow
Upon the Lake of Life;
But all below, unseen they grow
The weeds of sin and strife.

The plant of wealth on guile is grown
And watered is with sin;
The craft of power on blood is built
Its sails are puffed with din.

O not to me that power and wealth,
O not to me the world;
In muddied streams there life doth flow
And vapours dim are curled.

Mine be these woods, these hills, these dales,
Mine be the crystal stream,
Like wild bird in these happy vales
A happy heart I roam.

The prince that was by me undone
Lives in the cave below;
His limbs would all be whole again
In dozen moons or so.

I tend him like a mother true
It is a joy to me;
The holy saint of wonderous powers
Says, "Gods have forgiven me."

And when the prince is strong and whole
And to his Raj shall he;
My loved lord the king of kings
Will come and live with me.
And here beside this pleasant stream
A home we'll build of straw;
And bright blue-eyed and rosy-smiled
Shall creepers deck it ah!.

And here relieved from worldly cares
His easy head shall rest;
Though spurred by fate from faith it's strayed
Upon this dear breast.

And in the noon the gentle winds,
Shall make us flower beds meet,
And little fawns with fishy eyes
Shall frolic at our feet.

As oft I pass the twilight lake
    I spy the naiad fair;
Like lightning over the dark-blue skies
    She sinks her then and there.

But I shall hide behind some brake
    When moon is shining bright,
When she to ripples walks the lake
    With tread so airy light.

Then half above the water's face
    The naiad glides along
Planting among the furrowed waves
    Her lilies bright and young.

*(This poem was first printed in a Vizianagarm local journal "Indian Leisure Hour" in 1883. Later it was published in Reis and Rayyet. (Sambha Chandra Mukherji's letter to the G.Venketesh Ramanaiah, dated 14.8.1883). The publishers of Unilit who retrieved the poem from Reis and Rayyet files and published in Unilit, "Homage to Gurajada" special issue, 1963 edition. Eds.)*

# నీలగిరి పాటలు

## సుందరతర మీ నీల నగము

రాగము, సురట, – తాళము, ఆది.

పల్లవి

సుందరతరమీ నీల నగము దీని।
యందము హృదయానందకరము దీని।
చందము హృదయానందకరము ॥

అనుపల్లవి

నందన వన మిదె – నాతిరొ వింటివె।
బృందారక ముని – బృంద సేవితము॥

చరణములు

౧. ఎచ్చట జూచిన – బచ్చిక పట్టులు।
పొద పొద రొదలిడు – పొలుపగు పిట్టలు।
వింత వాసనలు – వీచెడు చెట్టులు।
కుదురు రథ్యగల – కొలకుల గట్టులు॥

౨. నిచ్చెలు నగముల – నీటగు తోఁటల।
విచ్చలవిడి చను – నచ్చపు మొగుళుల।
నచ్చరఁగేరెడు – మచ్చెకంటు లిట।
మించు తీవలన – మించి చరింతురు ॥

౩. పాద ఘట్టనకుఁ – బర్వు చక్రములు।
మంత్ర మహిమనగు – జంత్రపు రథములు।

పందెము వారెడు – పటుజవనాశ్వము।
లందముగా నిట – గ్రందయి తోచును॥

౪. గట్టుల లోయలఁ – గాజే చప్పరల।
మట్టి గోలెముల – మడువుల నడవుల।
నెల్లెడ విరియగ – వెల్లువలై విరు।
లిక్షధన్వు దొన – లక్షయమయ్యెను॥

౫. తప్పక భృత్యుల – నెప్పుడు బ్రోచెడి।
యప్పలకొండయ – మాంబా దేవిని।
నొప్పుగఁబ్రోచుత – నప్పుర దమనుఁడు।
మెప్పగు వరముల – విప్పుగఁగురియుచు॥

# ఊటి చోద్య మేమి చెపుదు

## రాగము, పంతువరాళి - తాళము, రూపకము

పల్లవి

ఊటి చోద్యమేమి చెపుదు - నువిద వింటివే।

అను పల్లవి

సాటియేది యూటి కెందు-

స్వర్గమైన దీని క్రిందు.

చరణములు

౧. వాటమైన తటములందు-దోటలెంతొ సొంపు మీరఁ।
గూటములను సౌధరాజి - కుదిరి మెరయఁగా।
మాటు మణగి శివుని జటా - జూటముననుు గంగపగిది।
కోటి హ్రదములందు జలము - కొమరి యమరి యుండును॥

౨. పండు వెన్నెలచటి పవలు - పావకుండు రాత్రులందు।
దండ నుండి యింట నింట - దయను బ్రోవఁగ।
నెండ దాడి కోడి సీతు - కొండ వట్టెనేమొ యనఁగ।
నిండు కొలువు హేమంత - ముండి యిచట వెలసెను॥

౩. వెన్నునిసిగ నమరియున్న - వేల్పు తరువు విరుల మాట్కి।
సన్న సన్న వెండి మబ్బు - చఱియ లంటగా।
మిన్ను బూయ సంజకాఁడు - మేళవించు రంగు లనగ।
వన్నె వన్నె పూలగములు - వనముఁ గ్రమ్మి మెరయును॥

౪ వెండి కొండ దొరను బూజ - వేట్కమీరఁ జేయు నప్పల।
కొండయాంబాధిరాజ్ఞి - కొలువు మహిమను।
దండి నీల నగము కనుల - పండువగను జూడగలిగె ।
రండు చెలియలార నేడు - పండెను మన సుకృతమెల్ల॥

# ఉమాపతి యర్చన.

రాగము, భైరవి - తాళము, చాపు, మిశ్రజాతి.

పల్లవి

ఉదకమండలమున - నుమాపతి యర్చన ।
కోటి గుణితమై - కోరిక లీడేర్చును ।

అనుపల్లవి

వెల్లనౌ మబ్బులు - విరిసి వెన్నెల గాయ।
వెండి కొండని సురలు - వేట్కతో రాఁగ॥

చరణములు

౧. కర్పూర తరువులు - కంబములై తోప।
మిన్ను పందిరిఁబోల - మించు దివ్వెలుగాఁ।
బచ్చేల హసియించు - పచ్చికపై విరు।
లచ్చేర లిడు ముగ్గు - టచ్చున వెలయఁగ॥

౨. దేవదారు తరులు - దివ్య గంధము లీన।
యక్ష గానము మీఱి - పక్షులు పలుక।
రసితమల్లదె శంఖ - రావమై చెలఁగఁగ।
దీవ లేమలు పూలు - తిరముగఁ గురియఁగ॥

౩. ఆశ్రిత వరదుఁ- డంబికా రమణుఁడు।
బాలచంద్రమౌళి - భక్తికి నెదమెచ్చి।
రాజరాజపుత్రి - రాజ్ఞి నప్పలకొండ।
యాంబఁ బ్రోచుఁగాత - నధిక సౌఖ్యము లిచ్చి॥

# నాటి మాట

రాగము, అఠాణా - తాళము, రూపకము

పల్లవి

నాటి మాట మఱచుట యే।
నాటికైన మఱవ వశమ॥

అనుపల్లవి

బోటి ప్రాణ మీ వంటి, ము ।
మ్మాటికి నిను విడ నంటి॥

చరణములు

౧. మాట మూట గట్టికొని।
పాటిదప్పి తనుట నా పొర।
పాటుగాక, మాటన నే।
పాటిర నీ సాటి దొరకు॥

౨. బ్రతుకు నందు లేని స్థిరత।
వెతక నేల భాషయందు।
నతుకు వేష భాష కోడు।
నతివలదే తప్పుగాక॥

౩. సాటి లేదు నా కంటివా।
మాట నిజము నేడు గంటి।
సాటి కలదె నమ్మి భంగ ।
పాటు పడిన పడంతి కెందు॥

౪. మేటివైన నీ యెద మొగ।
మాట మెటుల బాసె, నొక్క।
మాటురా, నీ యోటు మాటె
కోటి ధనము లిచ్చి కొందు॥

# లేవొకో మంత్రములు

రాగము, శంకరాభరణము- తాళము, ఝంప.

౧. లేవొకో మం(త్రములు-లేమగాఁ జేయ నిను।
లావపుడు బయలు బడు నొక్కొ।
కావనుచు నీలాటి-కాంతునకుఁ జిక్కి నీ।
భావమున నలయికనుబడుదొ॥

౨. మంచియును చెడ్డయును మానమును గనక పటు।
వంచనను పరకాంత దగిలి।
యించుకయినను లోక-మెంచునని భీతిలక।
కొంచెతన మూను టది కొమరొ॥

౩. మగఁడవై పగ తీర్చు-పగతుఁడవు గాక నిది।
తగునటర తలపోయకుంట।
మిగిలినది లేదు రిఁక మీద నిను నమ్మ నా।
నగధరుని నమ్మెదను లేరా॥

# చిత్తరువని చూడ

రాగము, శంకరాభరణము- తాళము, మిశ్రజాతి చాపు

పల్లవి

చిత్తరువని చూడఁ జిత్తము గొంటివి ।
చిత్తజు నపరంజి - చిలుక యెవ్వతెవే ॥

అనుపల్లవి

వత్తువొ నా మ్రోల - వలరాజు వేఁడిన ।
మత్తకాశిని నీదు - మనమైన నీగదె ॥

చరణములు

౧. ఇచ్చి పుచ్చుకొంట - యిలలోని మర్యాద ।
ముచ్చిలి మౌనము - మెచ్చుదు రటవే ।
వచ్చి చూచినంత - వంచనఁ జేయుదె ।
పచ్చి దొంగతనము - పడతిరొ పరువె ॥

౨. మనసులేని తనువు - మరి యేలనే నాకు ।
చెనటి దీనిఁగూడ - చేకొనఁ గదవె ।
వానికి బదు లొక్క - వాక్కు నే వేఁడెద ।
మానిని యీపాటి - మన్నింపఁ జెల్లునె ॥

౩. విలువ చాలదన్న - విరివిల్తుపై నాన ।
కలుగు జన్మములఁ - గానుక కొనవె ।
ఎలమి నానందేంద్రు- నేలిన వెన్నుఁడు ।
పలు తెఱఁగుల మేలు - పడతి నీ కిచ్చునె ॥

*(ఈ ఆరు పాటలు "నీలగిరి పాటలు" అనే చిన్న పుస్తకంలోనివి. ఈ పుస్తకం 1907లో అచ్చయింది. రీవా మహారాణి అప్పల కొండయాంబ 'అనుజ్ఞ'తో ఈ ఆరు పాటలు రాసి ఆనంద గజపతి స్మృతికి అంకింతం చేశారు గురజాడ. ఈ పాటలను ఆయన Songs of the Blue Hills పేరుతో ఇంగ్లీషు లోకి అనువదించారు. తెలుగు మాతృక, ఇంగ్లీషు అనువాదం ఒకే పుస్తకంగా అచ్చయ్యాయి. -సం॥)*

# Songs of The Blue Hills

## Beautiful are the Blue Hills !

*Chorus*

Beautiful are the Blue Hills, and
Their beauty gladdens the heart.
Verily this is the garden of the gods, and gods
And sages love to roam here.

Everywhere the eye meets expanses of green grass. Birds sing sweetly from every bush. The pine odours fill the air. Lovely drives sweep round limpid lakes.

In the masses of clouds that love to haunt the gardens on the hill slopes, fish-eyed damsels flit about like lightnings.

Wheels that speed under tread, cars that mock the powers of magic, and swift horses that race, move along in beauty.

On ridges and in valleys, in lakes and in forests, and in pots and in glass houses, flowers grow everywhere in profusion. So the quivers of the god of love are inexhaustible here.

May Siva, the Destroyer of the Puras, shower choice blessings on Appala Kondayamba Devi, who is kind to her servants.

# The Wonders of Ooty

*Chorus*

Listen, friend, how can I describe
The wonders of Ooty?
Ooty has no equal.
Heaven itself is inferior.

Beautiful gardens cover the gentle slopes of the hills, and palaces glitter on the peaks. Like Ganga on Siva's head, a hundred lakes nestle in the valleys.

Here sunshine is mellow as moonlight, and at night, the fire god gives comfort in every home. Worsted by Summer on the plains, Winter has taken to these mountain fastnesses and holds sway here.

Silver clouds rest on the peaks like Kalpa blossoms on the head of Krishna, and manyhued flowers spread over the hill sides and shine like colours mixed by Evening to paint the dome of heaven.

Come, friends, our merit has attained fruition, and we are enabled to see the great Blue Hills by the kindness of the King's daughter Appala Kondayamba.

# Worship the Lord of Uma

*Chorus*

Worship the Lord of Uma on the Blue Hills and you acquire merit a thousandfold.

White clouds envelop the peals and make moonlight - and gods take the Blue Hills for, the silver mountains and crowd with enthusiasm.

They witness Nature's worship of Siva there. The tall eucalyptuses form columns and the sky the awning. Lightning serves for lights and flower beds in the midst of green grass look like ornamentation of the floor by wood-nymphs in coloured powders.

The pines waft divine odours, and the birds sing as never nymphs sang. The thunder serves as the music of the conchshell and creeper damsels shed flowers.

May the Lord of Ambika who wears the moon-crescent as a crest-jewel save Maharani Appala Kondayamba, daughter of the great king, pleased with her devotion.

# That Word of Long Ago!

*Chorus*

Can I forget your forgetting

That word of long ago?

You said I was your life.

You promised never to part.

*(He):* To treasure a *word* and to task you with unfaith is *my* fault. Of what count is a *word* to a great one like you?

Why should one seek in a *word* stability which one misses in Life? Women are to blame who turn thralls to words and ways that are not of the man.

*(She):* You said I had no equal. I now realise the truth of it. Where will one find another woman like me who trusted and suffered !

*(He):* How has compassion left the breast of a great one like you? Come to me but once and I will buy even your false word for a crore of gold.

*(We supplied the words He and She for clarity. Eds.)*

# Is there no Magic ?

Is there no magic that will transform you into a woman? Would then your courage become plain? Would you, entangled in the wiles of a lord like you, suffer pangs of the heart?

Not to consider good and bad, and honour, and to take to another man's wife, not to heed the talk of the world, and to grow little – was that wise?

Are you a foeman of a previous birth born as a husband to be re-venged ! Not too late. I shall not trust you, hereafter I shall trust in God!

# I Took You for a Picture !

*Chorus*

I took you for a picture and looked.

You stole my heart.

Who may you be,

O gold parrot of the god of love?

If I pray to him will he send you to me? Beautiful one, at least give me *your* heart.

To give and take is the rule of the world. Do the wise approve of stealth and silence? Is one to be cheated for going and seeing? Is open robbery a credit ?

What do I want with a body devoid of mind? So take that also. In return for both I crave but *a word*. Oh, fair one, you may concede this much.

If you think the price small, I present to you lives to come, and I call the god of love to witness. May Vishnu who ruled the heart of Prince Anandaraja bless you !

# ముత్యాల సరములు

గుత్తునా ముత్యాల సరములు
కూర్చుకొని తేటైన మాటల,
కొత్త పాతల మేలు కలయిక
క్రొమ్మెరుంగులు జిమ్మగా.

మెచ్చునంటా వీవు; నీ విక
మెచ్చుకుంటే మించిపొయెను;
కొయ్యబొమ్మలె మెచ్చు కళ్ళకు
కోమలుల సౌరెక్కునా?

తూర్పు బలబల తెల్లవారెను,
తోకచుక్కయు వేగుచుక్కయు,
ఒడయుడౌ వేవెల్గు కొలువుకు
వెడలి మెరసిరి మిన్ను వీధిని.

వెలుగు నీటను గ్రుంకె చుక్కలు;
చదల చీకటి కదలబారెను;
యెక్కడనొ వొక చెట్టుమాటున
నొక్క కోకిల పలుకసాగెను.

మేలుకొలుపులు కోడికూసెను;
విరులు కన్నులువిచ్చి చూసెను;
ఉండి, ఉడిగియు, ఆకులాడగ,
కొసరెనోయన గాలివీచెను.

పట్ణమున పదినాళులుంటిని
కార్యవశమున పోయి; యచ్చట
సంఘ సంస్కరణ ప్రవీణుల
సంగతుల మెలగి,

యిల్లుజేరితి నాటి వేకువ;
జేరి, ప్రేయసి నిదురలేపితి;
"కంటివే" నేనంటి, "మింటను
కాముబాణం బమరియున్నది."

తెలిసి, దిగ్గున లేచి, ప్రేయసి
నన్నుగానక, మిన్నుగానక,
కురులు సరులును కుదురుజేయుచు
ఓరమోమిడ, బల్కితిన్.

ధూమకేతువు కేతువనియో
మోముచందురు డలిగి చూడడు?
కేతువా యది? వేల్పులలనల
కేలివెలితొగ కాంచుమా!

అరుదుగా మిను చేప్పరంబున
చొప్పుతెలియని వింత పొడమగ,
చన్నకాలపు చిన్నబుద్ధులు
బెదరి యెంచిరి కీడుగా.

అంతెకాని రవంతయైనను
వంతనేగతి కూర్చనేర్చునె,
నలువ నేరిమి కంతు యిదియన
నింగితొడవయి వ్రేలుచున్ –

కవుల కల్పన కలిమి నెన్నో
వన్నె చిన్నెలు గాంచు వస్తువు
లందు వెట్టి పురాణ గాథలు
నమ్మ జెల్లునె పండితుల్.

కన్ను కానని వస్తుతత్వము
కాంచ నేర్పరు లింగిరీజులు;
కల్లనొల్లరు; వారి విద్యల
కరచి సత్యము నరసితిన్.

దూరబంధువు యితడు భూమికి,
దారిబోవుచు చూడవచ్చెను-
డబ్బ దెనుబది యేండ్ల కొక తరి
నరుల కన్నుల పండువై.

తెగులు కిరవని కతల పన్నుచు
దిగులు జెందు టదేటి కార్యము?
తలతు నేనిది సంఘసంస్కర
ణప్రయాణ పతాకగాన్.

చూడు మునుమును మేటివారల
మాటలనియెడి మంత్ర మహిమను
జాతిబంధము లన్న గొలుసులు
జారి, సంపద లుబ్బెడున్.

యెల్ల లోకము వొక్క యిల్లై,
వర్ణ భేదము లెల్ల కల్లై,
వేల నెరుగని ప్రేమబంధము
వేడుకలు కురియ.

మతము లన్నియు మాసిపోవును,
జ్ఞాన మొక్కటె నిలిచి వెలుగును;
అంత స్వర్గసుఖంబులన్నవి
యవని విలసిల్లున్ -

మొన్న పట్ణము నందు ప్రాజ్ఞులు
మొట్ట మొదటిది మెట్టు యిది యని,
పెట్టినా రొక విందు జాతుల
జేర్చి; వినవైతో?

అంటి నేనిట్లంత ప్రియసఖి
యేమి పలుకక యుండు యొక తరి,
పిదప కన్నుల నీరు కారుచు
పలికె నీ రీతిన్.

వింటి, మీ పోకిళ్ళు వింటిని,
కంట నిద్దుర కానకుంటిని;
యీ చిన్న మనసును చిన్న బుచ్చుట
యెన్నికని యోచించిరో?

తోటి కోడలు దెప్పె, పోనీ;
సాటివారోదార్చె, పోనీ;
మాటలాడక చూచి నవ్వెడి
మగువ కేమందున్.

తోడు దొంగని అత్తగారికి
తోచెనేమో యనుచు గుందితి;
కాలగతియని మామలెంతో
కలగ సిగ్గరినై.

చాలునహా! మీ చాకచక్యము.
చదువుకిదె కాబోలు ఫలితము!
ఇంత యగునని పెద్దలెరిగిన
యింగిలీషులు చెపుదురా?

కోట పేటల నేలగలరని
కోటి విద్యలు మీకు కరపిరి;
పొట్ట కూటికి నేర్చు విద్యలు
పుట్టకీట్లు కదల్చెనా?

కట్టుకున్నది యేమి కానీ;
పెట్టి పొయ్యక పోతె, పోనీ;
కాంచి పెంచిన తల్లిదండ్రుల
నైన కనవలదో?

కలిసి మెసగిన యంత మాత్రనె
కలుగబోదీ యైకమత్యము;
మాల మాదిగ కన్నె నెవతెనొ
మరులుకొన రాదో?

అనుచు కోపము నాపజాలక
జీవితేశ్వరి సరులు నాపై
వేరచి చనె క్రొమ్మెరుగు చాడ్పున
మనసు వికలముగాన్.

తూర్పు బల్లున తెల్లవారెను;
తోకచుక్క యదృశ్యమాయెను;
లోకమందలి మంచి చెడ్డలు
లోకు లెరుగుదురా?

**("ఆంధ్రభారతి" 1910 జూలై)**

# కాసులు

మనలకీ పోరాట మిప్పుడు
దేని గూరిచి కలిగె చెపుమా,
మరచితిని.... నవ్వెద వదేలను?
యేమి కారణమైన పోనీ ;
వినుము, ....ధనములు – రెండు తెరగులు;
ఒకటి మట్టిని పుట్టినది; వే
రొకటి హృత్కమలంపు సౌరభ
మ, దియు నిది యొక్కెడను కలుగుట
యరుదు; సతులకు వేడ తగినది
యెద్దియో?
"మనసులో నీ కుండు
ధనమన నొండు కలదే పసిడి
గాక"ని. ప్రాజ్ఞులకె కనికట్టు
కనకము; చపల చిత్తుల కన్ను
చెదురుట చిత్రమా! తీవలకు
తలిరుల తెరంగున, కాంచనము
సింగార మందురు లలనలకు;
కానిమ్ము; గాని, కమ్మని తావి
గ్రమ్మెడి పుష్పనిచయము ప్రేమె
కా? అది లేక మంకెన కెంపు,
కాంతల యందము
"ప్రేమ కొరుకుకు

తిందురా? యెట్టిదది? నా వలను
కలదో, లేదా?" యను నొక వింత
చూపును చూచెదవు-
బంగరు
మిసిమి మేనికి పసపు నలదితి;
కురుల నలరుల నూనె నించితి;
కాటుకను మెరుగిడితి చూడ్కికి;
విడెము వింత హొరంగు గూర్చెను
వాతెరకు; పలువరుస వెన్నెల
లలమె; దానదానను, మురువు
పెనగొనె, నేర్చి మెరసితి రూపు
ప్రేమ పెంచక పెరుగునే?
ప్రేమ-
పెన్నిధి గాని, యింటను నేర్ప
రీ కళ, ఒజ్జలెవ్వరు లేరు-
శాస్త్రము లిందు గూరిచి తాల్చె
మౌనము-నేను నేర్చితి భాగ్య
వశమున, కవుల కృపగని, హృదయ
మెల్లను నించినాడను ప్రేమ
యను రతనాల-కొమ్మ!
తొడవులుగ నవి మేన దాల్చుట
యెటుల నంటివో? తాల్చితదె, నా
కంట చూడుము! సతుల సౌరను
కమల వనముకు పతుల ప్రేమయె
వే వెలుగు; ప్రేమ కలుగక బ్రతుకు
చీకటి"
నా నేర్పు కొలదిది
(ప్రేమ విద్దెకు వోనమాలివి,)

యెదను నిల్పిన, మేలు చేకురు.
"మరులు ప్రేమని మది దలంచకు;
మరులు మరలును వయసు తోడనె;
మాయ, మర్మములేని నేస్తము

మగువలకు మగవారి కొక్కటె
బ్రతుకు సుకముకు రాజమార్గము–
ప్రేమ నిచ్చిన, ప్రేమ వచ్చును –
ప్రేమ నిలిపిన, ప్రేమ నిలుచును–
ఇంతియె–
కాసు వీసము నివ్వ నొల్లక,
కవిత పన్నితి నని తలంపకు;
కాసులివె; నీ కంఠసీమను
జేరి బంగరు వన్నె గాంచుత!
మగడు వేల్పన పాతమాటది;
ప్రాణమిత్రుడ నీకు నీ నెనెరు
కలుగకనున్న, పేదను కలిగినను
నా పదవి వేల్పుల రేని కెక్కడ?

**("ఆంధ్రభారతి" 1910 ఆగస్టు)**

# డామన్, పితియస్

వన్నె కెక్కిరి డమను పితియసు
లన్న యవనులు ముజ్జగంబుల
మున్ను: వారల స్నేహ సంపద
నెన్న సుకృతంబౌ !

ఒక్క నాడా సీమ జనపతి
యక్కజంబగు కోప భరమున
"వ్రక్కలించుము డమను శిరమ"ని
పలికె తలవరితోన్ !

చెక్కు చెదరక నిలిచి డమనుడు
"నిక్కమే కద చావు నరునకు?
యెక్క డెప్పుడు, యెటుల గూడిన
నొక్కటే కాదా?"

"మ్రందు టన్నది బొందె మార్చుట,
ముందు భవమున కలుగు విభవము
నందజేయుటె కాదె, యేలిక!
దండ మను మిషను ?"

"కాని యింటికి పోయి యొక తరి
కనుల జూచెద నాలు బిడ్డల;
పనులు తీర్చుకు మరలి వత్తును
యానతిండనియెన్ !"

వింత పలుకుకు విస్మితుండై
కొంత కరకరి తీరి నరపతి,
"యింత యిట్టుల మిడునె విద్య"ను
చింత చిగురెత్తన్ !

అనియె నరపతి "యటులె కాని
మ్మవని కొంచము విపుల మందురు;
తనువు దాచను తగిన చోటులు
కలవు యెటు జనినన్.

"మించు చతురత మాట విరుపున
యెంచి నాడవు చెడ్డ మంచని;
పంచ ప్రాణము లందు ప్రేముడి
పరచునే? చెపుమా?

"ఆలు బిడ్డల చూతు నంటివి;
ఆలకించిన వారి శోకము,
తొలగు విద్యలు; తొలగు ధైర్యము
తొలగు నీతైనన్

"కాన నీకై తనువు నోడెడి
వాని నొక్కని జూపి చననగు;
మానవేశుని యాన తప్పిన
మాయదే జగము?"

లేచి పలికెను పితియసప్పుడు,
"రాచ సింగమ! ఒడలి కొడ లిదె!
వేచి యుంటిని బ్రతుకు ఫలముకు,
దొరికె నీ నాటన్" ॥

"ఐన, చనుమనె" నవనిపతి, డా
మనుడు కొంచము తలచి, యిట్లను
"పనుపు, భటులను పనికి, యిప్పుడె
పోవ నేనొల్లన్ !"

వొకటి తలచును నరుడు మది; వే
రొకటి తలచును బ్రహ్మ, వినమే?
పోక, రాకల నడుమ నడ్డము
లెన్ని తలపడునొ!"

"పొమ్ము, పొమ్మ"నె రేడు, "పొమ్మిట
రమ్ము, యీ నెల నిండు నంతకు;
లెమ్ము, చాలదె యదను పో, రా.
నడ్లు గడ్లైనన్."

**2**

కడలి నడుమను కలదు సేమా
సనెడి ద్వీపము కవుల పుట్టిలు;
వాడి లేదట యినుని వేడికి
సీతు వలికైనన్-

ఋతువు కొక్కొక వింత రూపం
బతుల శోభాభాజనంబై
మతుల కొల్లల నాడు, స్వర్గం
బేమొ యా సీమ?

అందు నుండొక కొండ కోనను
సుందరంబగు భవనరాజము;
విందు కనులకు కడలి యెదురై
లీలలో లాడన్-

పక్షముల నారింజ, ఆలివు
వృక్ష షండము లుప్పతిల్లును;
ద్రాక్షపందిరు లింటి పంటలు
సొంపు పచరింపన్ !

నవ్వులకు నెనరులకు నిల్లై
నివ్వటిల్లెను భవనరాజము;
పువ్వులెత్తెను దాన నిలిచిన
మొందు మనసైనన్ !

తదియ చంద్రుం డబ్ధి సోకెను;
చదల విడబడి, యిరులు బ్రాకెను;
అదను కాంచిన రిక్కమూకలు
అంతటను ప్రబలెన్ !

చారు తరముగ పసిడి పమిదల
బారు తీరి వెలింగె జోతులు;
వారి యంత్రము తళుకు ముత్తెపు
సరులు విరజిమ్మెన్

అలరు జిగురుల తోరణావళి
యలమి చుట్టెను జిలుగు కంబము
లుల్ల మలరగ నాటపాటలు
వుమ్మిరయి సెలగెన్.

ఘుమ్ము, ఘుమ్మని కమ్మతావులు
గ్రమ్మె ధూపము లాసవమ్ముల
దుమ్ము రేగెను నాటి పండువ
నిండు వేడుకతోన్ !

చుట్టలును, మిత్రులును, భ్రాతలు
చుట్టు మూగుచు దమను నడిగిరి
"యెట్టి వింతలు తెచ్చినాడవు
కలదు వేడ్క, గనన్?"

పలికె డామను "యిలను ద్రిమ్మరి
పలు తెరంగుల జనుల గాంచితి,
తెలియ నేర్చితి మర్మమెల్లను
వారి విద్యలలో !"

"యెరుగ రాదని తొల్లి విబుధులు
మరుగు పరచిన మంతనంబుల
తిరుగుడులు మరలించితి, తీసితి
రాళ రప్పలలోన్ !"

"వింత నొక్కొక దాని కని, మును
యింత కెక్కుడు లేద నుంటిని;
వింత లన్నిటి వమ్ము జేసెడి
వింత వినుడింకన్"-

"ఒకటే" ఆయెను రెండు మూడులు
"ఒకటే" ఆయెను కోటి సంఖ్యలు;
పెక్కు లొకటిగ జూచువాడే
ప్రాజ్ఞుడన వినమే?"

"నేను, తానను భేదబుద్ధిని
రేని కాగ్రహ మొదవి డామను
కాని వాడని తలచి ప్రాణము
గోలు పొమ్మనియెన్."

“ఒక్క వింతిది – పిరికి డామను
వొకటి వొకటికి సమము కద? వే
రొకడు నాకయి ప్రాణమిచ్చిన
చాలదా యనియెన్.”

“వింత రెండవ దిద్ది – నృపుడును,
చింత వాపుచు వల్లె యనియె, న
నంతరము నే నిటకు వచ్చితి
వింత కనగోరి –”

“కాన, మీరల నెవ్వ డిప్పుడు,
తాను, నేనను బుద్ధి తలపక
తనువు నాకై విడుచు వాడన
పలుక డొకడైనన్.”

“చింతవంతలు చిత్రితములై
అంతకానగ నయ్యె మోముల
“వింత యిదె!” యని పలికె డామను
వికసితాననుడై”

ఆట పాటలు అణగె నంతట;
మాటు మణిగెను భవనరాజము;
చాటు మాటున చార జొచ్చిరి
సఖులు చుట్టములున్.

“కల్ల జెప్పితి!” ననియె డామను
“యెల్లరెప్పటి యట్ల నలరుం
డుల్లముల!” వారపుడు “కొనుమివె
ప్రాణముల” నన్నన్.

పంజరమ్ముల నున్న పిట్టలు
మంజులారణ్యములు మరచెను;
శింజితములౌ కాలి గొలుసులు
శిక్షయని మరచెన్"

"దారిపోయే వారికొక్కటి
కారవాసర కల్పనాయెను;
దారి కాదిది దరి యటంచును
తలచుటొక వింత"
అనుచు, డామను డాసవమ్ముల
నాని పాడ దొడంగి మించెను;
కాని పండువ నందు కొండొక
కలక కన నయ్యెన్-

**3**

యెల్లి పున్న మనంగ పితియసు
యిల్లు నందొక విందు మిత్రుల
కెల్ల నాయెను, పితియసప్పుడు
పల్కె నీ పగిదిన్ !

"తెలియు వాడన నొక్కడే భువి;
తెలుపు వాడన నొక్కడే భువి;
పలు తెరంగుల సద్గుణాళికి
పట్టు వక్కండే."

కనియు, నేర్చుట, వాని కడనే;
వినియు నేర్చుట, వాని వలనే;
అనగవలెనా, అతడు డామను
డన్న మాటొకటి?

లోకమందభిమాన ముంచియొ!
నాకు యశ మొనగూర్చ నెంచియొ,
నాకపతి, నా మిత్రు డామను
రాక నడ్డడొకొ!"

"బ్రతికి, చచ్చియు ప్రజల కెవ్వడు
బ్రీతి గూర్చునొ, వాడె ధన్యుడు;
బ్రతికి డామను ప్రజల నేలును;
చచ్చి, నేనొకడన్."

"మందుటన్నది బొంది మార్చుట;
ముందు భవమున కల్గు విభవము
నంద, ప్రాజ్ఞుడు వగవ జెల్లునె
చెప్పుడీ" యనియెన్ !

"చదివి చెడితివి చాలున" నె నొక
"డొదవె యశమ"ని బలికె నొక్కం
"డదుననకు డామనుడు రాడా
యనియె నొక్కరుడున్.

అంత పితియసు కాంత పలికెను
కొంత గద్గదికంబు తోపగ,
"ఇంత వరకును ధైర్యమూనితి
మాట నమ్మికచే."

వచ్చువాడయితేను డమనుడు
వచ్చు నింతకె; చావు కోసము
యిచ్చగించుచు తానె వచ్చునె
పిచ్చి వాడైనన్ !

"వత్తునన్నను, వారి వారలు
మొత్తమై, తా మడ్డుపడరే?
పొత్తులన్నవి సంపదలకే;
ఆపదల కగునే ?

వాని నను టే లింత? పతి తన
చాన నెంచక, బలగ మెంచక
తనువుమిత్రున కోడుటన్నది
తగవ? యది చెపుడా

"కష్ట సుఖముల కలిసి కుడుచుచు,
గోష్ఠి ప్రాణంబంచు నెంచుచు,
ఇష్టవర్తన నున్న చానను,
బాయుటొక మహిమా?"

"విందు, నీల్గుట నిక్కమౌటను
యెందు, యెప్పుడదైన నొకటని;
యెందరో కల రనెడు వారలు
లేరు చనువారల్ !

"చదువు వారికి వెట్టి భ్రాంతులు
మెదడు కెక్కిన పాయ వందురు;
అదును లేదే దేనికైనను
అంద రెరుగనిదే?

"పండ గలదని కాయ కుడుతురె?
తిండి యెల్లిది నేడు తిందురె?
అండ మందున చిలుక కలదని
అరచి జీరెదరే?"

బతకవలసిన కాల ముండగ
బతుక నొల్లమి కంటె పుట్టినె
బతుకు దునిమిన బతుకు భారము
పాయదే చెపుడా!

అది యటుండగ డమనుపై పగ
మది దలంచిన మానవేశుడు
బదులుగా గొనె పాప మెరుగని
ప్రాణి నేలనొకో?

"నరుని చావే కాంక్ష్య మేనియు
నరపతికి, నరులెంద రనుదిన
మరుగు వారలు యముని పురమున
కంత తనియడొకో?"

"తప్పు వొక యెడ దండ మొక యెడ
వొప్పెయని; నరపతికి దోచిన
వప్పగించెద నాదు ప్రాణము
డమను క"న్నంతన్.

నీడ వెలువడి నిలిచె ముందట
వేడ్క మోమున వెల్లివిరియగ
"వీడె డమనుం"డంచు నందరు
విస్మయము చెందన్ !

"ఆ మహామతి; అంత వేరొక
యమిత విక్రము డతని కెదురై
"డమన ! బతుకుము బతుకు మనె;
"రేడ" నిరి పలువురటన్ !

పలికె నరపతి "మిత్ర భావము
సలుపు డిక నీ సఖుడు నీవును;
అలఘు రాజ్యము ప్రేమ సంపద
కలతి యని దలతున్"

"విద్య లందలి మాయ మర్మము
దిద్ది చెప్పిందబల యొక్కతె;
విద్య లెరుగని ప్రేమ భరమును
వింతగా చూపెన్."

వినగ తగినది వింటి నిచ్చట;
కనగ తగినది కాంచినాడను;
మనుజు లిద్దరు మగువ యొక్కతె
మాన్యు లీ జగతిన్."

**(ఆంధ్రభారతి' 1910 సెప్టెంబరు)**

# లవణరాజు కల

నిండు కొలువున లవణుడను రా
జుండె, జాలికు డొకడు దరిజని,
దండినృప! వొకగండు గారడి
    కలదు కనుమనియెన్

అల్లపింఛ్ఛము నెత్తినంతనె
వెల్లగుఱ్ఱం బొకటి యంచేల
పల్లటీల్పస నొడయు నుల్లము
    కొల్లగొని వచ్చెన్

వచ్చి నిలిచిన వారువంబును
యచ్చెరువుపైకొన్న చూపున
మెచ్చు మేరలు గనకచూసెడి
    నృపుని కతడనియెన్

"ఉత్తమాశ్వంబిది సర్వేశ్వర!
చిత్రగతులను సత్వజవముల
చిత్తమలరించేని జనుమిక
    మనసుగలచోట్లన్"

చూపుదక్కగ చేష్టలుడిగెను
చూపరులు వెరగంద నృపునకు;
యేపుచెడి, వొకకొంత తడవున
    కెరిగి, నలుగడలన్

కలయజూసెను,కల్లనిజములు
కలకజెందిన మనసులోపల
మెల్లమెల్లన పూర్వజ్ఞానం
బల్లుకొని పొడమ !
“యేడి జాలకు డేది యశ్వం
బేడు లెన్నో గడిచె” ననె నృపు
“డేడు నిమిషము లేవి ప్రభువా!”
యనిరి తనభృత్యుల్!

కలదు లేదను రెండు భ్రాంతుల
కలయగూర్చుకు బుద్ధి బలమున
కాలమహిమకు వెరగుజెందుచు
లవణుడిట్లనియెన్

ఏడు నిమిషము లేడులాయెనొ?
యేడు నిమిషములందు యిమిడెనొ
యేడులెన్నో? యింతలంతలు
చింత చేయునొకో!

యెక్కెనట వొక మాయగుఱ్ఱం
బొక్క నరపతి మనసు నిలవక;
యెక్కినంతనె పరవశంబై
యెగసె నది యెటకో!

కన్ను మిన్నును కనని జవమున
కాననంబులు గడిచి యెన్నో,
యెన్న జీవం బొక్క టేనియు
లేని మరుభూమిన్

మట్టి చనె, సంస్కృతిని జీవం
బట్లు, యిరులును మరులు వేళకు
తుట్టతుద కొక గున్న యడవిని
బట్టి, గమనంబున్

మందగించిన, మానవేంద్రుం
దందుకొనె నొక కొమ్మ నల్లుకు
కింద వ్రేలెడి తీవ; గుఱ్ఱము
ముందువలె పరచెన్!

అడుగు పుడమిని తగిలి నంతనె,
బడలి యుంటను నిదుర పాలై
ఒడలు తెలియక వ్రాలి నరపతి
చాగె మృతునట్లన్.

పిదప జన్మాంతరము తెరగున
నిదుర జారినవేళ కన్నుల
యెదట వెలసెను వింతలోకము
సంజె కెంజాయన్!

"వెలుగు నీడలు కనుల కింపై
మెలగి చెలగెడు నాకసంబున
వ్రేలు మబ్బుల యంచులంటను
రగిలె రత్నరుచుల్.

పారె పక్షులు పొంజు పొంజుల;
జీరె కోయిల లొకటి వొకటిని;
దూరి గూడుల బాసలాడెను
పిట్ట లెల్లెడలన్!

గగనరాజ్యము గ్రమ్మ వేడుక
మగటిమిని తన కళలు గూర్చుచు,
పగలు వెన్నున దన్ని సోముడు
పైనమై వెడలెన్ !

తాడివనములు తూర్పు కొండను
గొడుగు లెత్తెను; చామరంబులు
నడిపె జీలుగులుడుగణంబులు
దవ్వులను నిలిచెన్!

చల్ల గాలులు సాగి యలలుగ
జల్లు జల్లున రాల్చె పూవుల;
ఉల్ల మలరెను; ఆక లొక్కటె
బడబవలె నడరెన్!

అంత చెవులకు దవ్వు దవ్వుల
వింత గానం బొకటి సోకెను;
సోకినంతనె పూర్వవాసన
పిలిచి నట్లాయెన్ !

మరిచె నాకలి; మరలె నిడుములు;
పరవశుండై నృపతి, గానము
దరియ, గాంచెను శ్యామలాంగిని
నొక్క జవ్వనినిన్.

అర మొగిడ్చిన కన్నుగవతో,
చెదరి యాడెడి ముంగురులతో,
బెదురు యెరగని బింక మొప్పిన
బెడగు నడకలతో,

"కూటికడవను బుజముపై నిడు
వాటమది యొక మురువు గులకగ
పాట పాడెను, పాటలాధరి
చెట్లు చామలకై !

పాట పాడెను, చెట్లుచామలు
కోటి చెవులను గ్రోలి యలరగ;
తాటి వనమున నాగి చంద్రుడు
తాను చెవి యొగ్గన్.

ఎవని గూరిచి పాట పాడెనొ?
యెవని నామము ధన్యమాయెనొ?
లవణుడను మాటొకటి నా చెవి
తాకినట్లయ్యెన్!

## 2

మంచివలె నిది మాయమగు నని
యెంచి, యించుక సంశయించక
కించలన్నియు తొలగి వెంబడి
వేడి యిట్లంటిన్.

వినుము, కిన్నరి! నీకు దైవం
బన్ని శుభములు – గూర్చు గావుత!
నిన్న నుండియు నన్న మెరగని
యాకలొక వంకన్!

"అంతకన్నను అధికతర మొక
వింత యాకలి మనసు గ్రాచెను;
యింత అంతని చెప్ప నేరక
యిట్లు వెంబడితిన్!

అనగ కన్నియ, తిరిగి మెల్లన
నన్ను కన్నులు విచ్చి చూసెను;
పూర్ణ బ్రహ్మాండాధి రాజ్యము
పూని నట్లయ్యెన్!

చూసి, కన్నులుడించి, మది తల
పోసి, మిన్నక తోవ సాగెను;
బాసె బింకము బెడగునడకల;
ముగిసె గానంబున్!

పండు వెన్నెల కుముదవనిపై
నిండుగమ్మిన నీడ క్రైవడి
నిండె మోమున చింత యొక్కటి;
మరల నేనంటిన్.

"అన్న మిడుటా కొన్న వారల
కెన్న సుకృత తమం బటంచును
మున్ను పెద్దలు బల్కి రది నీ
వెరుగ కుండుదువే?

"భృత్యునైతిని నీదుమూర్తికి;
భృత్యునౌదును నీకు సుందరి!
మృత్యుముఖమున నున్న భటునకు
నన్న మీవలదో?

చన్న బ్రతుకుల కొలిచి కుడిచిన
తెన్ను మనసుకు కొంత తోచెడి;
నిన్న యన్నదె, నేడు రేపులు
అన్యు నెట్లగుదున్?

"మౌనమూనిన, మరల గలనని
మది దలంపకు" మంటి; కన్నియ,
గమన మించుక మందగించి
శిరంబు వంచి యనెన్

"వన్నె మీరిన మేని పసతో
కన్ను మణగెడి రత్నరుచితో,
నన్ను తెలియక నాసచేసెద
వయ్యో! మాలిత నేన్,

"అయ్యకోసము కూడు కొందును,
ఇయ్యలే ననుమాట, హృదయము
వ్రయ్య చేసెదు; నాదు భాగ్యము
కెవరి నేమందున్.

**3**

"అన్న పలుకు విసంపుభల్లము
కన్నవాడయి మనసు దూసెను;
కన్నె కన్నుల నీరు గమ్మట కాంచి
ఖిన్నుడనై,"

కొన్ని నిమిషము లెన్ని యెన్నో
కన్న విన్నవి ధర్మముల నే
నెన్నుకొని, వొక పరమధర్మము
నపుడు గనుగొంటిన్!

మలినవృత్తులు మాలవారని
కులము వేర్చిన బలియురొక దే
శమున కొందరి వెలికిదోసిరి
మలినమే, మాల.

కులము లేదట యొక్క వేటున
పసరముల హింసించు వారికి;
కులము కలదట నరుల వ్రేచెడి
క్రూర కర్ములకున్.

మలినదేహుల మాల లనుచును,
మలినచిత్తుల కధిక కులముల
నెల వొసంగిన వర్ణధర్మమ
ధర్మ ధర్మంబే!

అనెడు నిశ్చయ మాత్మ దోపగ
వినుము, కన్నియ! యంటి యెదురై,
జనులు తెలియక పలుకు మాటకు
జనదు వగవంగన్.

"మంచి చెడ్డలు మనుజు లందున,
యెంచి చూడగ, రెండె కులములు;
మంచి యన్నది, మాలయైతే,
మాల నే అగుదున్!

"తెలివి యొలికెడి తేట కన్నులు
మురువు గులికెడి ముద్దు మోమును
వేల్పు చేడియలైన నేరని
గాన మాధురియున్,

"చిత్తరవులందైన గనని ప
విత్రరూపపు సౌష్టవంబును,
ఉత్తమోత్తమ జాతిలక్షణ
యుక్తి సంపదయున్.

“మాల యనువారున్న, వారల
మందబుద్ధికి వగవవలె; తన
యందు లేని కొరంత కలదని
వగవగానేలా?”

“నమ్ము నేనను మాట తెరవ! భ
యమ్ము వాయుము; కూటినిడి చే
కొమ్ము నా హృదయంపు రాజ్యము
నిస్సపత్నముగాన్.”

వినియె వ్రీడా విస్మయంబులు
ఆననంబున పొడమి పోరగ
కనుల నెత్తుచు, డించుచును నను
కాంత యిటు బలికెన్.

“తండ్రి కోసము తెచ్చు కూటిని
తిండికై యొరు కెట్టు లిత్తును?
పెండ్లియాడిన– పెనిమిటొకనికి
పెట్ట ధర్మంబౌ!

తడవు ఆయెను; తల్లడిల్లుచు
తండ్రి నాకై యెదురు చూసును”
అనుచు నన్ను తొలంగు భావము
అతివ అగుపరచన్.

కరము బట్టి యురంబు యురమున
జేర్చి, ముద్దిడి కురులు దువ్వితి;
తాళవనమును వెడలి చంద్రుడు
పక్కునను నవ్వెన్!

"ఆడబోయిన తీర్థ మెదురై
వేడబోయిన వరము వచ్చెను;
పెండ్లి యాడెద చంద్రు సాక్షిగ
పెట్టు కూడంటి"న్.

మున్ను వేల్పులు వెన్ను చేతను
గొన్న యమృతము కన్న రుచులను
చెన్ను మీరెను కూడు, కన్నియ
చేత నిడినంతన్ !

**4**

'వచ్చితివ యల్లుండ!' నీకై
వేచియుంటిని యింతకాలము;
యిచ్చితిని, చేకొమ్ము కూతులు
ప్రాణమది నాకున్.

"వచ్చితిమి యెట నుండొ" అటబో
నిచ్చ మెండై యుండు మనమున;
పసిడి గొలుసులు, బిడ్డ నాకై
పట్టి నన్నుంచెన్!

"ఇహము లోపలి మంచి యంతయు
యిమిడి యున్నది దీని ఆత్మను;
ముక్తికాంతై తుదకు నీ కిది
ముందుగతి చూపున్!

"కరపినాడను పరము మరవక
యిహము నందున మనెడు మర్మము!
కోటితపముల పుణ్యఫల మిది
కొమ్ము నీకి స్తిన్!

"మాలనైనను మలినవృత్తులు
మానుకుంటిని గురువు దయచే;
పొలములోపల పశుల మేపుచు
పొట్ట పోషింతున్.

మలినవృత్తులు మాన్పి, మాలల
వలస తెచ్చితి యీ వనాంతము;
పల్లె కలదిట; ప్రాజ్ఞు లందలి
ప్రజలు మావారల్!

పాడిపంటలు గలవు, తామర
తంపరలు మా పశులమందలు;
జంతుహింసను చేయనొల్లము;
భూతదయ మతము!

కాని మనుజుని బుద్ధి లోపల
కలవు, తన మే లొరుల కీడును
తలచు వృత్తులు; కానబోయిన
కలచు నెవ్వారిన్.
మాన్పగలిగితి కత్తికోతలు;
మాన్పవశమే; మాటకోతలు?
కత్తి చంపును; మాట వాతలు
మాన వేనాడున్ !"

నాటునను గలయట్టి యిడుములు
కాటి యందును కలవు; ఓరిమి
యేటికైనను మందు; కలిగిన
కలుగు సౌఖ్యంబుల్."

“యేలుకొను డొండొరుల; సిరులకు
మిట్టి పడకుడు; కీడు మూడిన
నాడు కుంగకు డొరుల మేలుకు
పాటుపడు డెపుడున్.”

అనుచు పలికెను వేదవాక్కులు
మమ్ము చేతులుబట్టి కన్నియ
తండ్రి; తొల్లిటి ఋషి యితండని
తోచ చిత్తమునన్!

పండు గెడ్డము; నిండుకన్నుల
నిండ శాంతరసంబు; పలుకుల
కడలి గాంభీర్యంబు, యొడలిని
దివ్యతేజంబున్ !

కలిగి కూచునె రాజఋషివలె
రావికిందను రచ్చశిలపై
కొమ్మలను జొరి చంద్రకాంతులు
మేన చెదరంగన్!

అంత నుండియు కొన్నిపంటలు
కాంతతో నట స్వర్గసౌఖ్యము
లొంది మంటిని; చక్రవర్తుల
కొమరులను కంటిన్ !

చిత్త మా కొమరులను తగులుట
కొత్త శృంఖల యంచు మామ ని
వృత్తిమార్గముపట్టి, దేహము
వాసె యోగమునన్!

పల్లెలోపల దొమ్ములాటలు
అల్లుకొనె, ఆనాట నుండియు
యెల్లవారలు పెద్దలగుటకు
యెంచిచూడంగన్!

సన్నగిల్లెను సాగు పొలమున;
వున్న దెల్లను తిన్న పిమ్మట
తినిరి పెంచిన పశుల చంపుకు;
అవియు కడతేరన్ !

చెల్లచెదురై పరచిరందరు
యెల్లదిశలను, పరచు ముందర
కొల్లకొని రేనున్న పొలమును
పండి మేముండన్!

తెల్లవారిననుండి మేమును
పిల్లలము పడ్డట్టి పాటులు
ఝల్లుమనియెడు నొడలుతలచిన
చాల, చెప్పంగన్!

"అడవియందలి కాయకసురులు
కుడవనేరక బడలె బిడ్డలు;
అడవి ద్రిమ్మరి కడకు ప్రాణము
చేరి నేనుంటిన్!

"ప్రాణసఖి నను పిలిచియప్పుడు
పలికె స్మితముఖియై వినుండిక
చేయు కార్యములేదు; చెల్లెను
ముందు గనవలయున్.

"కడకుజేరితి మీ భవంబున;
తడవులేదిక; మనసు తిప్పుకు
గడగవలె రాబోవు భవమున
జ్ఞానసంపదకై.

"కష్టసుఖముల తీరు లెన్న న
దృష్టములు - మన సత్యవర్తన
కాచుగావుత, కావగలిగిన
కన్న పసివాం(డన్.

"చింతయుడుగుడు - చితిని జొత్తము
యింతకన్నను భాగ్యమున్నదె!
అంతమున మతియెట్టులుండునొ
అట్టిగతి గల్గున్.

"కలుగు భవములు కూడ నీతో
కలిసి గడుపుచు ముక్తి జెందెద-
కలదె నీ (ప్రణయాతిరేకము
కన్న సద్గతియున్?"

అనుడు, చింతలు వాసి, కైకై
జేర్చి జొచ్చితి మపుడు చితి"

### 5

పలికె నిట్టుల పలు విషాద స
మాకులేక్షణు డగుచు లవణుడు,
"కలగవల దిది మాయ సర్వం"
బనిరి శాస్త్రజ్ఞుల్.

లవణు డనియెను, బొమలు ముడివడ,
"కలగ వలదట! కల్ల యిది యట!
కలిగి నది లేదన్న యంతనె
తొలగునట వేధల్!."

"పుస్తకంబులలోని మాటలు
విస్తరించుచు, ననుభవమ్ముల
తత్వమెరగక, శుకములగుదురు
వొట్టి శాస్త్రజ్ఞుల్!.

"యెప్పటికి అనుభూత మెద్దియొ
అప్పటికి యది నిక్కువంబే-
యెప్పుడో లోకంబు కల్లగు
ననుట యిపుడెట్లో?"

"చిత్తమందున కీలితములై
నిత్యఖేదము నిచ్చు తలపుల
నెత్తివైచును -లేరె! హా! యిది
చెప్పగల ప్రాజ్ఞుల్?

"యెక్కడిది ఆ మాయదేశం
బెక్కడుందురు నాదుబిడ్డలు?
ఒక్కరైనను జూపలేరే
నాదు ప్రాణసఖిన్?"

నృపుడు యిట్లని శోక భార
మ్మాపుకొన శక్యమ్ముగా కిరు
కేల కన్నులు మూసి, చింతా
మగ్నుడై యుండెన్

అంత దుర్గద్వారసీమను
వింత కలకల వినగ నయ్యెను;
చెంత ద్వారకు డేగి నృపునకు
తెల్పె "నొక మునియున్."

వారువముపై నొక్క కన్నియ
వచ్చి నిలిచిరి ద్వారసీమను."
"చెచ్చెరను తెమ్మ"నియె నరపతి
నోట మాటుండన్!.

జొచ్చె నాస్థానాంగణం బపు
డప్సరాకృతి వొక్క కన్నియ;
అచ్ఛ వర్ణపుటశ్వరాజం
బొక్క తాపసుడున్!.

పలికె తాపసు డతుల సౌఖ్యం
బధిప! నీ కౌగాక: యవనుడు,
సింధుదేశాధిపుడు, పితృసఖు
డంపె కానుకగా.

తనదు గాదిలి పట్టి, యీయమ
వినయ విద్యా సద్గుణాన్విత;
కోరె నీ నెయ్యంబు; నీ గుణ
సంపదకు నలరెన్."

"పంపె నీకీ యశ్వరాజం
బెందు లే దిద్దానికీ"డనె-
చెవిని మాటలు సోకి సోకక
లవణు డక్కన్నెం

జూచె, స్మయ హర్షాతిరేకము
లాత్మ పెనగొన; డాసి, చేకొని
"వచ్చితివ, నా ప్రాణ సఖి" యని
గద్దియను జేర్చెన్!

**(ఆంధ్రభారతి, 1911 నవంబరు)**

# ముత్యాల సరము

వెల్లువగ నారోగ్య సంపద,
లుల్ల మలరుచు నిచ్చుగావుత
తల్లి భారతమాత పంచమ
జార్జి కెల్లపుడున్.
జార్జి సమ్రాట్భాసనంబుల,
జాజి పూవుల దండ మాడ్కిని
రాజ రాజులు శిరములందున
దాల్చి మనవలయున్.

మర్మ మెరుగని ధర్మ మనియెడి,
నిర్మలంబగు నీతి పథమున
పేర్మి ప్రజలను మలచు నేర్పరి
జార్జి మనవలయున్.

భరతఖండం బెన్న డెరుఁగని,
నిరత శాంతి నొసంగి విద్యల
నెరయ నించిన యాంగిలేయుల,
రేడు మనవలయున్.
కొల్లబోతగ జంపి శత్రుల,
ఢిల్లి, పట్టము గట్టు బలిమిని
తొల్లి నల్లని దేవుడొక్కడ
జాత శత్రునకున్.

తెల్లవారలు నీతి నిపుణులు,
ఢిల్లి పట్టము గట్టి రిపుడే
కల్ల యెరుగని జార్జిరేని,
కజాత శత్రునకున్.

నల్లవాడును తెల్లవాడును
నెల్ల శుభములగూర్చు గావుత
తల్లి మేరీ మహారాజ్ఞికి
జార్జి నరపతికిన్.

*1912 డిశంబరు మాసాంతంలో పంచమ జార్జి కలకత్తా నగరం వస్తున్న సందర్భంలో 'రాజరాజు'కు బహూకరించడానికి, "రీవారాణి అప్పారావుతో చెప్పి రాయించిన గేయం" ఇది. 1929లో గురజాడ రామదాసు ముద్రించిన 'ముత్యాల సరము'లో దీన్ని చేర్చారు. (కె.వి.ఆర్. మహోదయం - 1969 ప్రతి, పుట. 154)*

# కన్యక

తగటు బంగరు చీరె కట్టి
కురుల పువ్వుల సరులు జుట్టి
నుదట కుంకుమ బొట్టు పెట్టి
సొంపు పెంపారన్

తొగల కాంతులు కనులు పరపగ
మించు తళుకులు నగలు నెరపగ
నడక లంచకు నడలు కరపగ
కన్నె పరతెంచెన్
రాజవీధిని.

పసిడి కడవల పాలు పెరుగులు
పళ్లెరమ్ముల పళ్లు పువ్వులు
మోము లందున మొలక నవ్వులు
చెలగ చెలికత్తెల్
వెంట నడిచిరి.

అంత పట్టపు రాజు యెదురై
కన్నె సొగసుకు కన్ను చెదురై
మరుని వాడికి గుండె బెదురై
యిట్లు తలపోసెన్

"ఔర! చుక్కల నడుమ చందురు
నట్లు వెలిగెడు కన్నె ముందర
వన్నె కాంచిన నగరి సుందరు
లంద రొక లెక్కా?

"పట్టవలెగా దీని బలిమిన
కొట్టవలెరా మరుని రాజ్యం
కట్టవలెరా గండపెండెం
రసిక మండలిలో"
నాల నడుమను నట్టి వీధిని
దుష్ట మంత్రులు తాను పెండెం
గట్టి కన్నెను చుట్టి నరపతి
పట్ట నుంకించెన్
మట్టి వచ్చిన దైవగతి కిక
దైవమే గతి యని తలంచుక
దిట్టతనమును బూని కన్నియ
నెట్ట నిటు పలికెన్.

"ముట్టబోకుడు, దేవకార్యం
తీర్చి వచ్చెద, నీవు పట్నం
యేలు రాజువు, సెట్టి కూతర,
నెటకు పోనేర్తున్"

చుట్టములు తన చుట్టు నిలవగ
భృత్యవర్గం కాచి కొలవగ
సెట్టి కరములు మోడ్చి రాజుకు
ఇట్లు వినిపించెన్.

“పట్టమేలే రాజ! బలిమిని
పట్టవలెనా? నీదు సొమ్మే
కాద కన్నియ? నీవు కోరుట
కన్న మరి కలదా
వైశ్యజాతికి వన్నె”

“గాని మన్నన జేసి మమ్ముల
బంధువర్గం, కులం పెద్దల”
ధర్మమన్నది అరసి కొంచెం
దారి కనపడితే,

“అగ్నిసాక్షిగ కన్నె గైకొని
ఆదరించుము మమ్ము, కానుక
లందుకొమ్మెం తంత వలసిన,
మనుచు మాజాతిన్”

నవ్వి హేళన నవ్వు, నరపతి
పల్కె, “నోహో! ధర్మ మార్గం
పట్టమేలే రాచబిడ్డకు
సెట్టి కరపడమా!

“రాజు తలచిందేను ధర్మం
రాజు చెప్పిందెల్ల శాస్త్రం
రాజులకు పేరైన పద్ధతి
కాద, గాంధర్వం?”

“తడవు చెయ్యక తల్లడిల్లక
నేడు రేపని గడువు పెట్టక,
నెమ్మి గోరితివేని, కన్నియ
నిమ్ము!
లేకుంటే, పొమ్ము!

"దేగ, పిట్టను పట్టి విడుచున?
కన్నె, యింటికి మరలి నడుచున,
తెమ్ము కానుక లిమ్ము, నీవిటు
వచ్చినందాకన్

కదల" నంతట సెట్టి పలికెను,
"దేవకార్యం ముందు, ఆవల
రాచకార్యం కాద, రాజా!
శలవు నీవిస్తె -

"యింటి దైవం వీరభద్రుడి
దేవళానికి పోయి యిప్పుడె
పళ్లెరం సాగించి వత్తును,
పైని తమచిత్తం!"
"మంచిదే, మరి నడువు, మేమును
తోడ వత్తుము, దేవళంలో
అగ్ని సాక్షిగ కన్యకను మే
మందుకొన గలము."

## 2

నాడు గుడిలో మండె గుండం
మంట మింటని ముట్టి యాడగ,
కన్న నరపతి గుండె దిగులై
పట్టు విడ జొచ్చెన్

భక్తి పరవశ మైన మనసున
దుర్గనప్పుడు కొలిచి, కన్యక,

ముక్తి వేడుచు వూడ్చి నగలను
శక్తి కర్పించెన్.

దుర్గ కొలనున గ్రుంకి పిమ్మట
రక్త గంధం రక్తమాల్యం
దాల్చి గుండం చుట్టు నిలిచిన
జనుల కిట్లనియెన్.
"అన్న లారా తండ్రులారా
ఆలకించం డొక్క విన్నప
మాలు బిడ్డల కాసుకొనుటకు
ఆశలేదొక్కొ
కులము లోపల?

"పట్టమేలే రాజు అయితే
రాజు నేలే దైవ ముండడొ?
పరువు నిలపను పౌరుషము మీ
కేల కలగదొకొ?
"విద్య నేర్చినవాడు విప్రుడు
వీర్య ముండిన వాడు క్షత్రియు
డన్న పెద్దల ధర్మ పద్ధతి
మరచి, పదవులకై
"ఆశ చేయక, కాసు వీసం
కలిగి వుంటే చాలు ననుకొని,
వీర్య మెరగక, విద్య నేర్చక
బుద్ధి మాలినచో

"కలగవా యిక్కట్లు? మేల్కొని,
బుద్ధి బలమును బాహు బలమును
పెంచి దైవము నందు భారం
వుంచి, రాజులలో

"రాజులై మనుడయ్య!" ఇట్లని;
కన్య నరపతి కప్పుడెదురై
నాలుగడుగులు నడిచి ముందుకు
పలికె నీ రీతిన్

"పట్టపగలే, నట్టివీధిని
పట్టబోరే జారచోరులు,
పట్టదలచితి వింక నీవొక
పట్టమేలే రాజువట!

"కండకావర మెక్కి నీవీ
దుండగము తలపెట్టినందుకు
వుండడా వొక దైవమంటూ,
వుండి వూర్కొనునా?

"కులం పెద్దలు కూడి రదుగో!
అగ్నిసాక్షికి అగ్ని అదుగో!
కన్ను కోరిన కన్నె యిదుగో!
జాల మేలొక్కో?

"పట్టమేలే రాజువైతే
పట్టు నన్నిపు" డనుచు కన్యక
చుట్టి ముట్టిన మంట లోనికి
మట్టి తా జనియెన్!

పట్టమేలే రాజు గర్వం
మట్టి గలిసెను, కోట పేటలు
కూలి, నక్కల కాటపట్లై
అమరె

యెక్కడైతే కన్య, మానం
కాచుకొనుటకు మంట గలిసెనొ
అక్కడొక్కటి లేచె సౌధము
ఆకసము పొడుగై

పట్ణమేలే రాజు పోయెను,
మట్టి కలిసెను కోట పేటలు,
పదం పద్యం పట్టి నిలిచెను
కీర్తులపకీర్తుల్."

**('ఆంధ్రభారతి' 1912 అక్టోబరు,**
**'శశిలేఖ' 1912 నవంబరు)**

# మనిషి

మనిషి చేసిన రాయి రప్పకి
మహిమ కలదని సాగి మొక్కుతు
మనుషులంటే రాయి రప్పల
కన్న కనిష్టం

గాను చూస్తా వేల, బేలా?
దేవుc డెకడో దాగెనంటూ
కొండ కోనల వెతుకులాడే
వేలా?

కన్ను తెరిచిన కానబడడో?
మనిషి మాత్రుడి యందు లేడో?
యెరిగి కోరిన కరిగి యీడో
ముక్తి ?

('కృష్ణాపత్రిక' 1912 డిసెంబరు 14)

## దేశభక్తి

# దేశమును ప్రేమించుమన్నా

1

దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా!
వొట్టి మాటలు కట్టిపెట్టోయి
గట్టి మేల్ తలపెట్టవోయి.

2

పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయి;
తిండి కలిగితె కండ కలదోయి,
కండ కలవాడేను మనిషోయి!

3

యీసురోమని మనుషులుంటే
దేశమే గతి బాగుపడునోయి?
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశి సరుకులు నించవోయి.

4

అన్ని దేశాల్ క్రమ్మవలె నోయి,
దేశి సరుకుల నమ్మవలెనోయి !
డబ్బు తేలేనట్టి నరులకు
కీర్తి సంపద లబ్బవోయి.

5

వెనక చూసిన కార్యమేమోయి?
మంచి గతమున కొంచెమేనోయి
మందగించక ముందు అడుగేయి
వెనకపడితే వెనకే నోయి!

6

పూను స్పర్ధను విద్యలందే
వైరములు వాణిజ్యమందే,
వ్యర్థ కలహం పెంచబోకోయి
కత్తి వైరం కాల్చవోయి!

7

దేశాభిమానం నాకు కద్దని
వొట్టి గొప్పలు చెప్పుకోకోయి;
పూని యేదైనాను వొకమేల్
కూర్చి జనులకు చూపవోయి!

8

ఓర్వలేమిపిశాచి దేశం
మూలుగులు పీల్చేసెనోయి,
ఒరుల మేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చవోయి!

9

పరుల కలిమికి పొర్లి యేడ్చే
పాపి కెక్కడ సుఖం కద్దోయి?
ఒకరి మేల్ తన మేలనెంచే
నేర్పరికి మేల్ కొల్లలోయి!

**10**

స్వంత లాభం కొంత మానుకు
పొరుగు వాడికి తోడపడువోయి,
దేశమంటే మట్టి కాదోయి,
దేశమంటే మనుషులోయి!

**11**

చెట్టపట్టాల్ పట్టుకుని
దేశస్థులంతా నడవవలెనోయి,
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయి.

**12**

మతం వేరైతేను యేమోయి?
మనసు లొకటై మనుషులుంటే
జాతమన్నది లేచి పెరిగి
లోకమున రాణించునోయి!

**13**

దేశమనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయి,
నరుల చమటను తడిసి మూలం,
ధనం పంటలు పండవలెనోయి!

**14**

ఆకులందున అణగిమణగీ
కవిత కోయిల పలకవలెనోయి
పలుకులను విని దేశమందభి
మానములు మొలకెత్తవలెనోయి!

**('కృష్ణాపత్రిక' 1913 ఆగస్టు 9, రచనా కాలం 1910)**

# లంగ రెత్తుము

1

విరిగి పెరిగితి; పెరిగి విరిగితి;
కష్ట సుఖములపార మెరిగితి;
పండు నన్నవి ఆశలెన్నో
    యెండి రాలగ బొగిలితిన్.

2

అంద జాలని పళ్ల కోసము
అఱ్ఱు జాపితి; నేల పాకిన
చెట్ల పళ్లను విలవ లెరగక
    పాదరక్షల మట్టితిన్.

3

తీపి విరిగిన చెరుకు వలె ఆ
నాటి కోర్కెలు నేడు బెండౌ
టెంచి నవ్వితి; బుద్ధి చపలత
    కొత్త కోర్కెల తగిలితిన్.

4

దేవతలతో జోడు కూడితి;
రక్కసులతో కూడి ఆడితి;
కొత్త మిన్కుల తెలివి పటిమను
    మంచి చెడ్డల మార్చితిన్.

5

చూతునా! అని చూసితిని; మరి
చేతునా ! అని చేసితిని; ఇక
చూడ చేయగరాని వింతలు
చూపి కన్నులు కట్టితిన్.

6

శత్రు మిత్రుల కిచ్చి నెనరులు
స్నేహవార్ధిని కొల్లగొంటిని;
నాటి మిత్రులు తరల శూన్యం
బైన పుడమిని నిలిచితిన్.

7

పంజరంబున నున్న కట్లను
పగలదన్నగ లేక స్రుక్కితి;
నింగి పర్వగ లేని జన్మము
నీరసంబని రోసితిన్.

8

“ఉసురులకు విసికితివా? యుద్ధము
కలదు; దేశము కొరకు పోరుము.”
యుద్ధమా? ఇకనేమి లోకము !
చాలు ! చాలును ! లంగరెత్తుము.

**(కృష్ణాపత్రిక, 1915 జనవరి**
**రచనాకాలం 1914 సెప్టెంబరు)**

# కోరుకొండ

కనుల పండువయ్యె నగరు కాంత కంటివే
విజయరామ నిర్మితమై
విమల ప్రభా వర్మితమై
విబుధ బలము కలిమి విజయ
శ్రీల నలరుచూ॥

కొండ యిదా గోపురమా
దండి నృపతి కాపురమా
రండు, కండు, ఆనందమొందు
కలదె యింత మెందు॥

కోరుకొండ, కోర్కొండ, కోరకుండ నిత్తు
వరము లూరకుండ వలదు రండు
రండనె నట నృపవరుండు॥

శుభ విభవము లభయదాత ఇభరాట్
శ్రీ విజయరామ విభువరున కొసంగి
లలితలక్ష్మి బ్రోవగా॥

మాట మర్మ మెరిగినట్టి మేటి కవుల
జాడలరసి బోటి
అప్పకవి యమర్చె మాటల ముత్యాల పేట॥

## ఆడపిల్లల పాటలు

# పూర్ణమ్మ

మేలిమి బంగరు మెలతల్లారా!
కలువలకన్నుల కన్నెల్లారా!
తల్లులగన్నా పిల్లల్లారా!
విన్నారమ్మా యీకథను.

ఆటలపాటల పేటికలారా!
కమ్మని మాటల కొమ్మల్లారా!
అమ్మలగన్నా అమ్మల్లారా!
వినరమ్మ మీరీ కథను.

కొండలనడుమను కోనొకటున్నది;
కోనకి నడుమా కొలనొకటుంది;
కొలనిగట్టునా కోవెలలోపల
వెలసెను బంగరు దుర్గమ్మ.

పూజారింటను పుట్టెను చిన్నది
పుత్తడిబొమ్మా పూర్ణమ్మా;
అన్నల తమ్ముల కనుగై దుర్గకు
పూజకు పువ్వులు కోసేది.

ఏయేవేళల పూసేపువ్వుల
ఆయా వేళల అందించి
బంగరుదుర్గను భక్తితొ కొలిచెను
పుత్తడిబొమ్మా పూర్ణమ్మ.

ఏ యే ఋతువుల పండే పళ్ళను
ఆయా ఋతువుల అందించి
బంగరు దుర్గను భక్తితొ కొలిచెను
పుత్తడిబొమ్మా పూర్ణమ్మ.

పళ్ళను మీరిన తీపుల నడలను
పువ్వులు మీరిన పోడుములున్
అంగములందున అమరెను పూర్ణకు
సౌరులుమించెను నానాటన్

కాసుకులోనై తల్లీదండ్రీ
నెనరూ న్యాయం విడనాడి
పుత్తడిబొమ్మను పూర్ణమ్మను వొక
ముదుసలి మొగడుకు ముడివేస్రీ.

ఆమనిరాగా దుర్గకొలనులో
కలకలనవ్వెను తామరలు;
ఆమని రాగా దుర్గవనములో
కిల కిల పలికెను కీరములు.

ముద్దునగవులూ మురిపెంబు మరి
పెనిమిటిగాంచిన నిమిషమున
బాసెను కన్నియ ముఖకమలమ్మును
కన్నులగ్రమ్మెను కన్నీరు –

ఆటల పాటల తోటి కన్నియలు
మొగుడు తాత యని కేలించ,
ఆటల పాటల కలియక పూర్ణమ
దుర్గను చేరీ దుఃఖించె –

కొన్నాళ్ళకు పతి కొనిపోవచ్చెను
పుత్తడి బొమ్మను పూర్ణమను;
చీరెలు సొమ్ములు చాలగ దెచ్చెను
పుత్తడి బొమ్మకు పూర్ణమకు-

పసుపు రాసిరి బంగరు మేనికి
జలకము లాడెను పూర్ణమ్మ;
వదినెలు పూర్ణకు పరి పరి విధముల
నేర్పులు మెరసీ కై చేస్రీ.

పెద్దల కప్పుడు మొక్కెను పూర్ణమ
తల్లీ తండ్రీ దీవించ్రీ;
దీవన వింటూ పక్కున నవ్వెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మా!

చిన్నల నందర కౌగిట చేర్చుకు
కంటను బెట్టెను కన్నీరూ;
అన్నల తమ్ముల నప్పుడు పలికెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మా -

అన్నల్లారా తమ్ముల్లారా!
అమ్మను అయ్యను కానండీ!
బంగరు దుర్గను భక్తితొ కొలవం
డమ్మలకమ్మా దుర్గమ్మా.

ఆయా వేళల పూసే పువ్వుల
ఆయా ఋతువుల పళ్ళన్నీ,
భక్తిని గోసి శక్తికి యివ్వం
డమ్మల కమ్మా దుర్గమ్మా.

నలుగురు కూచుని నవ్వే వేళల
నా పేరొకతరి తలవండి;
మీమీ కన్నబిడ్డల నొకతెకు
ప్రేమను నా పేరివ్వండి.

బలబల కన్నుల కన్నీరొలికెను
పుత్తడి బొమ్మకు పూర్ణమకు
కన్నులు తుడుచుకు కలకల నవ్వెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మా.

వగచిరి వదినెలు, వగచిరి తమ్ములు
తల్లియు కంటను తడిబెట్టన్
కాసుకు లోనై అల్లుని తలుచుకు
ఆనందించెను అయ్యొకడె.

యెప్పటి యట్టుల సాయంత్రమ్మున
యేరిన పువ్వులు సరిగూర్చి
సంతోషమ్మున దుర్గను కొలవను
వొంటిగ బోయెను పూర్ణమ్మ.

ఆవులు పెయ్యలు మందల జేరెను
పిట్టలు చెట్లను గుమిగూడెన్
మింటను చుక్కలు మెరయుచు పొడమెను
పూర్ణమ యింటికి రాదాయె.

చీకటి నిండెను కొండల కోనల
మేతకు మెకములు మెసల జనెన్
దుర్గకు మెడలో హారములమరెను
పూర్ణమ యింటికి రాదాయె.

కన్నుల కాంతులు కలవల చేరెను
మేలిమి జేరెను మేని పసల్!
హంసల జేరెను నడకల బెడగులు
దుర్గను జేరెను పూర్ణమ్మ.

*(రచనాకాలం1912 అని విమర్శకులు ఊహిస్తున్నారు. గురజాడ వెంకట రామదాసు 1929లో ప్రచురించిన 'ముత్యాలసరములు, చిన్నకథలు' పుస్తకంలో 'ఆడపిల్లల పాటలు' అనే శీర్షికపెట్టి 'పూర్ణమ్మ' గేయాన్ని వేశారు - సం॥)*

# దించు లంగరు

1. దించు లంగరు దీర్ఘయుద్ధం
ధర్మపక్షము ముల్లు చూపెను
నరుల పీనుగు పెంట పోకల
నాటి వెలయును శాంతి వృక్షము.

2. పాత సంధులు పాతిపెట్టుము
యుద్ధముల కవి ఉనికి పట్టులు
లోక మంతయు ఏకమై
యుద్ధమునె మారణము చేయును.

3. వచ్చెనిది బంగారు కాలము
వాంఛ లెల్లను తీరు సుజనుల
కాంగిలేయుల ధర్మ రాజ్యము
జ్ఞానమును స్వాతంత్ర్యమిచ్చుచు
సంతతము వర్ధిల్లు గావుత!

**('కృష్ణాపత్రిక' 1915 అక్టోబరు 30)**

# మిణుగురులు

(పిల్లల గీతములు)

౧

మల్లెలు మొల్లలు పూచే వేళ

చల్లని గాలులు వీచే వేళ

మేనుల గంధం బలదే వేళ

ఉరుములు మెరుపులు మెరసే వేళ

తొలకరి వానలు కురిసే వేళ

మామిడి పండులు పండే వేళ

మన్మథ బాణం మ్రోగే వేళ

మగువల మనసులు క్రాగే వేళ.

౨

బూరుగు చెట్టు

చిలకలతోను

ఏమని పలికింది.

పండిన పండు

ఎండిన దూదై

పక పక నవ్వింది

౩

చిలకల్లార !

చిలకల్లార !

కలవలతోను,

ఏమని పలికారు?

కలవల్లార !

కలవల్లార !
రాజు వచ్చెను,
కన్నులు విప్పండి !
కలవల్లార !
కలవల్లార !
రాజు గ్రుంకెను
కన్నులు మూయండి.

౪

అరిటి కాయ బజ్జి,
మినపప్పు సొజ్జి
కలసి మెలసి తిందాం,
కథలు విథలు విందాం.

౫

ఏనుగు ఎక్కి మనము
ఏవూరెళదాము?
ఏనుగు ఎక్కి మనము
ఏలూరెళదాము!
గుఱ్ఱం ఎక్కి మనము
ఏ వూరెళదాము?
గుఱ్ఱం ఎక్కి మనము
గుంటూ రెళదాము.
మోటా రెక్కి మనము
ఏ వూరెళదాము?
మోటారెక్కి మనము
మోటూ రెళదాము.
వెన్నుని యెక్కి మనము
ఏ వూరెళదాం?
వెన్నుని యెక్కి మనము
వెయ్యేళ్ చూదాము.

**('భారతి', 1930 ఫిబ్రవరి సంచిక)**

# సంప్రదాయ కవితలు

## సుభద్ర

క. పండుగ దండిగఁ బర్వెను
గొండకు నలుగడల; నొక్క కోనను విడిగా
నుండి కిరీటియుఁ గృష్ణుఁడు
మెండగు మంతనములందు మెలఁగెడు వేళన్.

క. కల కల నగవులు మగువల
కలభాషలు నంగదముల గలగలరవముల్
చెలఁగి వన వీధి నొక తతి
నల విఱిగిన భంగి విఱివి యణఁగె బొదలలోన్.

ఉ. అంతట నొక్క కాంత, యల
కాంతము లల్లలనాడఁ దెమ్మెరన్
జెంత వనాంతము న్వెడలి
చేరఁజనెం; దొవకావి చీరపై
వింత మెఱుంగు రశ్మికలు
వెల్వఁగ బంగరు కత్తళంబు, వి
క్రాంతవిలాసముల్ నడలఁ,
గన్నులఁజెన్నుల వెల్లిగొల్పుచున్.

క. అడుగడుగున నూపురముల
చడి, వీణియ మీటు మాడ్కి సలుప, నరునకున్
గడు హృదయాహ్లాదము, నొక
పడఁతుక యేతెంచి నిలిచెఁ బజ్జను హరికిన్.

క. ఈ రెండ దాఁకి చదరఁగ
నీరజముఖి తళుకు మేన, నెలఁతుక మించెన్
వారిజ కింజల్క శ్రీ
వారంబున వెలసి మెఱయు వరలక్ష్మి క్రియన్.

క. హరి కెఱఁగి చెలియ నరుఁగని
మరుఁ గనిన తెఱంగు దోప మదిఁ గొండొక త
త్తరము వొడను నొయ్యారము
మెరయ నొఱగెఁ దపసి కలిమి మిన్నులు ముట్టన్.

చ. గరిత హొరంగు గొల్పె నరు
కన్నులకున్ మిఱుమిట్లు; చూడ్కుల
మ్మరుని కటారులై పొడువ
మర్మము, దిగ్భ్రమ మావహిల్లె; సుం
దరి ధనువూను సోయగము
ధైర్యము ద్రిప్పె; నినుండు దోచె మో
మరయ; నెఱుంగ డిట్టి యస
మాద్భుత విక్రమ మెట్టి పోరులన్.

క. "అమ్మా!" యని చెలి శిరమున
నెమ్మి గరంబుంచి పలికె నీరజనేత్రుం
"డిమ్మోని కరుణ సౌభా
గ్యమ్ముల నవ్వారిగాఁగఁ గాంచెద" వంచున్.

ఆ. కపట మౌనిఁ జూచి కన్నియఁ జూచుచుఁ
గన్నెఁ జూచి కపట మౌనిఁ జూచి,
చిత్త మలరఁదలఁచెఁ జిత్తజ జనకుండు
నేఁడు గంటి నలువ నేర్పటంచు.

ఆ. మొలక నగవు దోప మోమున, వసుదేవ
తనయుఁ డనియె మాయ తపసి తోడ;
"కాదె భావి నీకుఁ గరతలామలకంబు
మౌనివర్య! కలదు మనవి యొకటి."

క. "భద్ర యిదె కొలిచె, రైవత
కాద్రిని, వరుఁగోరి; కరుణఁ నరసి తెలుపుఁడీ!
రుద్రుఁడగునొ, వరుణుఁడొ, ని
ర్నిద్ర పరాక్రముఁడు నరుఁడొ, నీరజభవుఁడో!"

క. ఱెప్పల డాఁచిన నగవులు
ముప్పిరి గొని ముందు కుబుకు మురహరు మోమున్
విప్పుఁగనుల వీక్షించుచు,
నెప్పగిదినిఁ బలుక నేర క్రిందజుఁడున్నన్.

క. హరి యనియె "నిట్టి సిద్ధులు
మఱుఁగు పఱుతురమ్మ క్రొత్త మనుజుల కడఁదా
రెఱిఁగిన యర్థంబయినను;
గురుతర పరిచర్య గోడి కూర్తురు శుభముల్.

క. * ఘటనా ఘటన సమర్థులు
గుటిలపు విధి వ్రాఁతనైనఁ గుదురుపఱచు వా
క్పటిమ గల పురుషసింహము
లెట పఱచుఁ గటాక్ష మొదవు నీప్సితము లటన్.

పాఠాంతరం :

క. ఘటనా ఘటన సమర్థులు
నిటలంబున బ్రహ్మ వ్రాయు నిర్ణయ ఫక్కిం
బటు నిష్ఠా పాటవమున
నటునిటు సేయంగ నేర్తు రార్తులఁబ్రోవన్.

క. కేవల నరుఁడే యీతడు
భూవలయము చుట్టి పుణ్యభూము లరయుచున్
రావలసి వచ్చె నిట నినుఁ
బ్రోవను; సేవించి వేడ్కఁ బొందుము శుభముల్.

ఆ. కాంచి నరు సుభద్ర "కంటినా ముసు వీని"
నన్న శంక మనసు నలవి కొనఁగ
"నెఱుఁగకున్న వీని నెఱిగినట్లున్నది;
మంచిగూర్చు" ననుచు మదిఁదలంచె.

ఆ. "అన్న వీని నెన్న, నధికుఁడు కానోపు
నెన్నకున్న వీని చెన్నుఁజూడ
నన్నుఁ బ్రోవ వచ్చె నర రూపమును దాల్చి
మానవైరి యంచు మదిని దోఁచె.

క. నరుఁగూర్చిన నరుఁగూర్చును ।
నరుఁగూర్పకయున్న నాకు నరుఁడై గుఁరుడై
దరిఁజేర్చు; నిహము నోఁచమిఁ
బర సాధనమైనఁ గనుట పాడి దలంపన్."

ఆ. "పెద్ద యన్న నరుని పేరైన వినవొల్లఁ
డొరుని కెపుడు నన్ను నొసఁగఁ జూచు
గురుల చేతనుండుఁ దరుణీజనము పెంపు
వారు మెచ్చు వాఁడె వరుఁడు మరుఁడు."

ఆ. "కించయేల నాకుగృష్ణుఁడు నాయెడ
నున్న వాఁడు లోక మెన్ను వాఁడు
వాని పనుపు సేయ వమ్మగా దేనాడు
యతిని గొలిచి విజయు నధిగమింతు."

ఆ. అర్జునుండు దలంచె 'నమృతంబుఁ గొనునాడు
వెన్నుఁడెత్తి నట్టి వేస మిదియె
విప్రు కన్నులందు వెలయు ప్రసాదంబు
నిప్పు గప్పినట్టి నివుఱు గాదె?"

క. పసితనపు టాటపాటల
విసువని విలువిద్య దొడ్డ వేడ్క చెలంగన్
గుసుమాస్త్రుఁ డెన్నఁడెఱుఁగని
యసమాయుధ కౌశలంబు లబ్బె గరితకున్.

క. "లఘు నమనోన్న మనంబును
లఘు రయమును నంగముల విలసితము లగుటన్
సుఘటిత లావణ్యం బీ
జఘన ఘనకుఁ దెచ్చికొనని సొరులమర్చెన్."

ఆ. "వీరుఁడన్నవాడు బీరంబుగల యిట్టి
భామ నేలు భాగ్య మొదవెనేని
గాల ముందు దనుకఁ గతలందు నుతికెక్కు
కడిమి మీఱు సుతునిఁ బడయకున్నె.'

ఆ. 'వాసు దేవుఁడపుడె వాగ్దాన మొనరించెఁ
గొందు దీని నడ్డ మెందయైన
రాముఁడొకడు దక్క రౌహిణేయునిఁ బోర
గడఁగరాదు గనులు గప్పవలయు.'

ఆ. తలఁచె నిట్లు నరుడు; తలఁచి నంతనె వచ్చెఁ
దాటి సిడపు జోదు; తప్పుటడుగు
మేని చందనంబు మైకంపుఁ గనుచూపు
పండుగాడి నట్టి నిందు దెలుప.

క. ఎఱిగిరి భద్రయుఁ గృష్ణుడు
నరుఁడ వనత వదనుఁడయ్యె; నగి బలరాముం
“డరసితి” ననె “మిము గానక
దొరకితి రిపు డిచటఁదోడిదొంగ లిరువురున్.”

క. “సరి, సరి, మునియొకఁ డమరెనొ?
మఱి కృష్ణుఁడు మఱచు జగము; మన భద్రన్నన్
వరుఁగోరి తపముఁ జేసెడి;
గురు జనములఁ గన్న సేవ గురుకొని చేయున్.”

క. “కూర్చుండుఁడయ్య మీరలు
కూర్చుందము మనము; వింటె కురు వీరులలో
నేర్చు మగఁడతఁ డితండని
యేర్చుచు వాదిడిరి బాలు రెఱుఁగుదు చెపుమా!

క. “నరుని యెడఁ బక్షపాతము
పఱుపక యున్నట్టి మాట పల్కుము; “పల్కెన్
హరి యెటు పలుకం జెల్లును
బరులకు? ఈ మేటి తపసి ప్రక్కనె యుండన్”.

క. “ఇల యెల్లం గాలించుచు
మలసి మలసి, పురుషవరుల మహిమాన్వితులం
గలసి భవ మీఁదు తెఱవులు
తెలియుఁ దగులు మనములోనఁ దివిరి కొనంగన్.”

క.	“విన్నాఁడట : హరి యీనాఁ
డున్నాఁడవతారలెత్తి యుర్వినని, యతం
డన్నారఁట నీవే యని;
కన్నారఁగ నిన్ను గాంచఁగా నిటు వచ్చెన్”

ఉ.	గొంతు కొకింత మార్చుకొని
గుంతి సుతుండనె “నో బలాఢ్య! నీ
యంతటివాని ముందొరుల
నౌనె గణింప; మనుష్య మాత్రులా
వెంత; భవిష్యమెంత! జను
లేల యెఱుంగరొ నిన్నెఱింగియున్
సంతత సత్యవర్తనమె
సత్వము జీవులకన్న ధర్మమున్.

ఆ.	ధర్మముండుచోట దైవ బలంబుండుఁ,
గలుగ దైవ బలము గలుగు జయము,
విఱ్ఱవీఁగు జడుడు విజయంబు దనదంచు
మున్న లోకపాలు రెన్నినట్లు.”

చ.	అనిమొన నొంచి రక్కసుల
నాత్మబలంబులె కారణంబుగాఁ
గొని రమరుల్ జయంబునకు
గొండొక యక్ష మెదిర్చి గాలి న
గ్నిని గని మీరలీ తృణము
కేల్కొని త్రోయుఁడు కాల్చుఁడన్నవా
రనువది గామి, గుర్తెఱిఁగి
రాత్మబలంబుల పారతంత్ర్యమున్.

క. “ఐనను వృష్ణి కుమారులు
పైన గనంగలరు పోటువాసులు; పోరెం
దైనఁ బొసఁగ కున్నె దురభి
మానము కౌరవుల యెడల మల్లడిలంగన్.”

క. కల దంతశ్శత్రుచయం
బలఘు బలం బాప్తవేష మతిమానుషమై
యలయించు నెంత వారల
వెలి శత్రుల వెతకు వాఁడు వెడఁగు దలంపన్.”

క. కావున శత్రుని మిత్రుఁగ
నే వెరవుననైనఁజేయు నేర్పరి బలియుం
డావల నంతశ్శత్రుల
కావర మణఁగింపగలడు కాల మలవడన్.

క. “ఎఱుఁగనియ ట్లోరు నడుగుట
మఱుఁగుపఱచి దైవ జన్మ, మానుష లీలల్
నెఱుపుటగా కీ వెఱుగని
పరమార్థం బొందు గలదె ప్రజ్ఞాననిధీ.”

క. ఎద్దానికైన మీరలు
దిద్దక మముబోంట్లు నిజము తెలి వెఱుఁగుటగా
దద్దారి గనక వట్టివి
సుద్దులు నేర్చితిమి; యగునె సూక్తులను బనుల్.

క. “వసు దేవుని బిడ్డలు మీ
రసదృశ మహిమానుభావు లాప్తులు చెంతన్
వసియించి, కొంతకాలము,
పసగల సద్వస్తు వొకటి పట్టఁదలంచితిన్.”

క.	కంటిని మిము ధన్యుఁడనను
కొంటిని; మీవంటి వారు కూరుట తపపుం
బంట కదా; ననుఁ గనుఁడొక
కంటను, గన్నంత నాకుఁగల్గు శుభంబుల్.

క.	ప్రేమ పెనగొన్న చూపున
రాముఁడు తన తమ్ముఁ జూచి రంజిలి పల్కెన్
"ధీమంతుం డీ తాపసుఁ
డేమందును మనదు భాగ్య మెఱిఁగితి మితనిన్.

చ.	"కలరిల నెందఱో యతులు
కాంచి యెఱుంగము వీని యట్టి ని
స్తుల సదసద్వివేకనిధి
సూనృత వాక్కుల నాభిరాము స
ల్లలిత శుభానుభావు, విమ
లాత్ము, విచక్షణు, నిట్టి వానిఁబూ
జలఁదనియించి కొన్ని దివ
సంబులు నిల్పుట యింట నొప్పదే".

క.	"యదువీరు లెల్ల నీ ఘను
నదను లెఱిఁగి భక్తి గొల్వ నాత్మజ్ఞానం
బొదవు; భవ జలధి గడపెడు
చదురుం డలవడుట పూర్వ జన్మ ఫలమెకా?".

క.	ఎందెందుఁ గలుగు తీర్థము
లందలి మహిమముల నీ మహాత్ముని వలన
న్విందము; పరమార్థంబులఁ
గందము; వీనులకు విందు గద సూనృతముల్".

క. “మన భద్రయు నీ తపసిని
బనిగొని సద్భక్తి భోజ్య భక్ష్యంబులచేఁ
దనిపెడుఁగా కద్దానను
గనకున్నే రాజరాజుఁ గాంతునిఁగాఁగన్”.

క. గారాబ మొల్కు కన్నుల
నా రాముఁడు భద్రఁగాంచి నరుని కనియె “నీ
నారీమణి రైవతకము
నారాధించిన ఫలంబయౌ – నినుఁగాంచెన్”.

క. “నీ దాసిగ గొని చెలియల
నేదానను లోపమున్న నెఱుఁగఁ దెలుపుచున్
మోదానఁ గొనుఁడు పూజలఁ
గాదనకుఁడు ముద్దు గడపి కారుణ్యముతోన్”.

క. “కత్తిమొన బ్రతుకు జోదుల
పొత్తు గదా బ్రహ్మ వ్రాసెఁ బొలఁతులకు మా
యుత్తమ రాజ కులంబుల
నెత్తమ్మికి నిశితకరుని నెయ్యమువోలెన్”.

క. “బాణాసన తూణ తను
త్రాణము శైశవము నుండి తాల్చుచు నొక వి
న్నాణంపు జోదు తానై
ప్రాణంబుల సరకు గొనదు భద్ర మగటిమిన్”.

క. “పుట్టింట నుండు కాలం
బెట్టెట్టుగ నున్నఁ జెల్లు నింతికి; మఱి తా
మెట్టిన యింటను మెలఁగెడు
గుట్టు తెలియకున్న నెట్ల కూరు సుఖంబుల్”.

క. “దారుణము క్షత్రధర్మం
బీరసముల కిరవు దొల్లి యేర్పఱచిరి, యే
కారణమొ ధర్మకర్తలు
పూరుషులకుఁ జెల్లుఁగాక పొలఁతుల కేలా?”.

క. “పారంబులేని యోరిమి
గూరిమి బాంధవుల పట్ల, గురుజనములచో
గారవము భృత్యవర్గము
నేరుపెఱిఁగి యేలుకొంట, నెలఁతకు నీతుల్”.

క. కఱపవలె మీరు భద్రకు
నిరపాయ సుఖంబు లిచ్చు నీతి పథంబుల్
వరమీవలె నెన రెఱిఁగిన
నరవరు, మీయట్టి శాంతు నాథుఁ బడయఁగన్.”

క. తమ్ముఁడు పలికె “తథాస్తు” ని
నెమ్మొగమును వాంచి భద్ర నేత్రాంతములం
జిమ్మె నరుని యెడఁ జూపులఁ
గమ్మవిలుతు మాటు వెడలు కఱకు శరములన్.

క. అంతట మదిరను గ్రోలెడు
చింత మనమునందు దోప, సీరధ్వజుఁ డా
వింత తపసి వీడ్కొని చనె;
నంతి పురముఁ జేరె భద్ర యత్యుత్సుకయై.

# సుభద్ర

## రెండవ భాగము

సీ. కస్తూరి గన్నేరు కావి చీర మెఱుంగు
మేని చాయకు వింత మిసిమి గొలుప
చెలరేగు ముంగురుల్ చేర్చి కట్టిన జోతి
యిరులపై రిక్కల కరణి వెలుఁగ
పైటపైఁ దూఁగాడు పచ్చల హారముల్
చలదింద్ర చాపంబు చాడ్పుఁజూప
నిద్దంపుఁ జెక్కుల దిద్దిన పత్రముల్
మకరాంకు బిరుదాల మాడ్కి వఱల

గీ. మెఱపు, కెమ్మబ్బు లోపల మెఱయునట్లు
వలిపమున మేల్మి మొలనూలు తళుకులీన
భద్ర నడతెంచె బంగరు పళ్లెరములఁ
బండ్లుఁ బూవులు గొనుచు సపర్య కొఱకు.

క. మగని కడకేగు నెలఁతకు
దగు నీ కైసేత గాక, తపసిని దోడ్తోఁ
నెగఁజూచుట కాదే! యీ
సొగసరి, నీ ఠీవి నంప సుమ శరము వడిన్.

క. యతి నియతిఁ గోలుపోని
మ్మతివను గన్నంత మాత్ర ననిమేషత్వం
బతను విభూతియుఁ గాంచఁడె,
యతియై తాఁ బొందఁ జూచు టంతయు కాదే?

క.  మంచి నటింతురు తన్పక
వంచనపరులైన వారు; వారిఁగని జనుల్
మంచనె పాటింతురు! మఱి
వంచన వంచకునె చెఱచి వంచించుఁదుదన్.

క.  యతి మీదికి మతి వోవుట
మతిపోవుటగాఁ దలంచి మానిని యెంతో
ధృతిఁ గడఁగె మరులు మరులుప
మతి ద్రిప్పిన కొలఁది ఁజోకు మితి గడచుటయున్.

ఉ.  "పొత్తులనుండ బెద్ద లిది
        పోలునటంచుఁ దలంచినట్టి యా
పొత్తుఁ దలంప కీ మగువ
        పుణ్యవతీతిలకమ్ము నోఁచె, ము
న్నుత్తగఁ గొంతిదేవి నను
        నమ్మల కన్నుల పెంపుదక్క యీ
రిత్త తపస్విపై మరులు
        రేఁగుట కానక మోసపోయితిన్.
ఉ.  నవ్వదొడంగి రీ గతికి
        నా వదినె ల్తలలూపి ఖిన్నులై
నొవ్వగఁ బల్కఁజొచ్చిరి
        కనుంగవ నశ్రులు గ్రమ్మ చేటు; లీ
రవ్వఁదలంపఁగాని, మది
        రాల్పడి గుండె, నెఱింగెనేని యా
కవ్వడి నొచ్చి చుల్కనగఁ
        గాంచు గదాయని నాదు శీలమున్.

సీ. "ఏడు లోకంబుల నెనలేని

విల్లుకాఁ డెవ్వాఁ డటన్న గవ్వడి యనంగ

సాటివారల పట్ల సౌహార్ద మొనరించు,

మేటి యెవఁడన కిరీటి యనఁగ

నెనరు నేర్పులు గల్గు నెఱజాణుఁ డెవఁడన్న

నింద్రజుండని లోక మెన్ని పల్క,

పెద్దల కడ భక్తి పిన్నల యెడ రక్తి

నెరపువాఁ డెవఁడన్న నరుఁడె యనఁగ

గీ. వీను లలరంగ విని విని వేడ్కగదుర

నరుని నావానిగాఁ గొన్న నాతి నిపుడు

నాకు నాలోన వింతయ్యె నరుని మఱచి

మాయ యతి నొక్కరుని గాంచి మరులుకొంట.

క. జగదేక వీరునకు నే

నగుదును దగు వీరపత్నినని తలఁచి మదిం

దగిలి విలువిద్య నేర్చితి

నగవు గదా తపసి కప్పనము సేఁతకడున్.

క. పోనొల్లను యతి కడ కిఁకఁ

గానిమ్మెమైన; నరుఁడు గానలలోనన్

గాని, యగచాట్లఁ గుందగఁ

గానక నేఁదిరుగుచుంటి ఁగఠిన హృదయనై.

క. అని కన్నియ దలచుటయును

గనుఁగవ నుప్పొంగి పాఱెఁ గన్నీరు; పరు

ల్గన రాదని పడకింటికిఁ

జని పానుపుఁ జేరి కడు విషాదముఁ జెందెన్.

# సుభద్ర

## మూడవ భాగము

చ. పంచిరి రాచ బిడ్డ నొక పాంథ తపస్వి సపర్యకై గురుల్
మంచి దలంచి; చేకురక మానునె; నీవిటు వారి పంపుల
జ్జించి పరిత్యజించి నిరసించితి వేమొకొ యేమి కీడు శం
కించితివో యటంచు యతి కించల పాల్పడి వేఁగుచుండఁడే.

క. తెత్తును నరునని యతి వా
గ్దత్తము గృష్ణునకుఁ జేసెఁ గాని వినుమీ
తత్తరము మాని జనుమ యు
దాత్తుం డెంతేనిఁ దపసి తప్పునె పలుకుల్.

క. యతి నొకనిఁ గుడుపఁ జేకుఱు
నతి వేలంబైన భాగ్యమనఁడే హరి, నీ
మతకరి వదినెల మాటలఁ
గుతుక మఱియు నూరకుంట కూడునె చెపుమా.

క. కాలము దేశము సిద్ధుల
పాలై యాజ్ఞలను మెలఁగుఁ బార్థుని నీకై
లీల మెయిం గొనఁగా యతి
చాలడె? వంతలను మాని చనుమా వేడ్కన్.

క. "కాదని యాదవ వీరులఁ
గాదని నీ పెద్దయన్నఁ గవ్వడికొగి ని
న్నీఁదగు ధీరుడు కావలె
నౌదల మిన్నేఱు దాల్చు నార్యుండొకడే.

క. కారాదొకొ యతి యీశుఁడు,
రారాదొకొ నిన్నుఁ బ్రోవ రమణిరొ వటుఁడై
తా రాఁడొకొ యిటకు నరా
కారంబన నెంత యతికిఁ గరుణ గలిగినన్.

క. సిగ్గఱి వలె నొక్కొక తఱి
నెగ్గులఁ దొలగింపఁగోరు నింతులు; దానన్
లగ్గులు చేకుఱు మఱి నే
సిగ్గని నాఁడూరుకున్నఁ జిక్కునె హరియున్.

క. కోరి వరించితిఁ గాదే
నారాయణు నేను నాఁడు నాతులలోనన్
బేరుఁ బ్రతిష్ఠయుఁ గాంచనె
పారుఁడొకడు కాదె నాకుఁబట్టై నిలిచెన్.

క. ఉత్తముఁడా తపసి యెడన్
బత్తెంతయుఁ గల్గియుంట భావ్యం బైనన్
జిత్తమున నిన్న మొన్నను
గ్రొత్త తలఁపు లేరుపడ్డఁ గొంకితి పోవన్.

# Subject for An Extravaganza

A young man makes love to a girl whom he often sees on a terrace of a house. She notices his attentions signs & c. She is in her పుట్టిన యిల్లు.

On Moon-light nights he goes along that street and listens to her music.

He sings snatches in the same tune. She replies.

She makes enigmatical appointments leading him into all kinds of escapades ending in embracing the దాసి.

At last She hatches a plot with the hero's wife, so that on a certain night the wife and the hero meet.

**1**

He చదలెల్ల వెదకెనే కొదమ చకోరము
కుదురైన రేవెల్గు కుదిసెనో యేమొ.

**2**

She ఏగాలి విసరెరా మగడ నిను యీా వంక
He తనువుకు తనువుకు తగులదె లంకె.

**3**

She తనువుకు తనువుకు తగులొక లంకా?
తగులన్న వగలన్న తలపోయు మింక.

**4**

He నేడేల కల్గెనె నెలత నీకీ శంక
(విను) మనుసుకు మనుసుకు మరులెగా లంకె.

**5**

She మనుసుకు మనుసుకు మరులు వక లంకా?
మరులన్న చెరలన్న మరవబోకింక.

**6**

He మగువల మాటలు మగువరో వింత
తగులము వగయని తగవొక కొంత?

**7**

She మగవారి బాటలు మరి మరి వింత
మగనాలిపైగాని మరులు కోరెంత.

**8**

He మాటలు కావిదె మనసిత్తు జూర
She మనసొక్క టేయైతె మరి రాకుపోర.

**9**

He చెంతకు చేరిన చెనకుట మేలె?
వంతలబెట్టకు వనజాక్షి యేలె.

**10**

She నీ కాంత నేనైన నెనరుంతువేమో!
పరకాంత పొందంటె ××××

**11**

He నాకాంత వీవైతె నా భాగ్యమెంత?
She నీకాంత నయ్యెద నిదె చూడు వింత.

*(గురజాడ రామదాసు పంతులు ఈ గేయాన్ని, విజయనగరం నుంచి 1940 ప్రాంతంలో వెలువడిన 'విజయ' అనే పత్రికలో ప్రచురించారు. ఈ గేయాన్ని సేకరించిన బంగోరె దక్షిణ ఢిల్లీ ఆంధ్రసంఘం వెలువరించిన గురజాడ సంస్మరణ విశేషసంచికలో ప్రచురించారు. సం॥)*

# పుష్పలావికలు

వెన్నెల గాయు కుందములు వేళ నెరుంగక బూయ కల్వలున్
జున్నులు జూరగా గుడిపి చొక్కుల నెక్కుడు తేల్చు తమ్ములున్
జెన్ను వహించె నీ కడను చేరగ నిమ్మిక యన్యమేలనే
వెన్నుని యాన యిచ్చెదను వేడిని సొమ్ముల నంద్రు కామినుల్.

మోసములాయె లావికరొ మొన్నను నే తొగలెత్త నీ కడన్
మూసె గృహంబు చేరుతరి మోమను చందురు గానమిన్ మదా
వాసము జేరి కల్వలకు బాసట జేయుట నమ్మితేని నిన్
గాసుల నోలలార్చెదను కాదనక న్మెయి రమ్మనున్ విటుల్.

గోరుల డాలు దండలకు గూర్పగ గెంజిగి నెఱ్ఱమొల్ల లిం
పారగ జూడగా గలిగె నన్నువ తెమ్మని తీసి యింటికిన్
జేరగ తెల్లవార గని చింతిలి తారును దెల్లవారి ర
య్యారను గల్గు లావికల యోజలు చిత్రములంచు జవ్వనుల్.

నీ దండ చిక్కువడెనే
నా దండను చిక్కటన్న నగరే ప్రాజ్ఞుల్
నీ దండ నుంచికొనుమా
వాదుడుగు మటందు రచటి వనితలు విటులున్.

అరపది మోముల సామిని
విరులవి యొక రెండొ మూడొ విరియగ జేసెన్
విరుల వ్వారిగ బఱపెడు
విరుబోడులు విటుల తూల్చ వింతయె దలపన్.

కుసుమ శర విద్ధు లయ్యును
కుసుమంబులె కొందు రచటి కోవిదులు విటుల్
విసమునకు మందు విసమగు
నసమాయుధు వేటు తీట లలరులె మాన్చున్.

చూతము మీ మీ జాతుల
నాతిరొ యన విటులు బల్కె నగి లావికలున్
ప్రీతిగలదేని జాతులు
జూతురె మా జాతులెల్ల జోద్యము లనరే.

చక్కదనంబు నశ్వరము చానరొ వింటివె నీవు నా యెడం
జిక్కతనంబు జూపు టిటు చెల్లునె లోభి ధనంబు సర్వముం
బొక్కసమందు దాచు గతి బొంగెడు నా వెలలేని సొంపు నా
మక్కువనెల్ల గొంటి వొక మాట నొసంగుట భారమయ్యెనే!

చక్కదనంబు నశ్వరము సత్యమె మక్కువ లెల్ల కాలమున్
మిక్కుటమై చెలంగునొకొ, మిత్రమ చీమలు చుట్టుముట్టుచుం
జక్కెర చెల్లుదాక బలు సందడి జేయుచు వీడు కైవడిన్
జొక్కపు ప్రాయ మేగు తరి సున్న కదా మగవారి మక్కువల్!

# భోట్టు

నూగు మీసపు కట్టు
కానరాని బొట్టు
నోటాన సిగరెట్టు
కోటు వింత కుట్టు
చేకట్ల జిలుగు వెండి కట్టు
నీలగిరి కొలను గట్టు
పై విహరించు వైష్ణవ భోట్టు.

# సమస్యాపూరణం

మ. కలిచేతన్ విమతిత్వ మొందుచు మహా కామాంధకారంబునన్
కులధర్మంబు పరిత్యజించి గణికన్ గూడిమ్మ అమ్మా నినున్
బలుమార్వేడెదమంచుఁ బల్కెదరహో పాండిత్యమూహింపకే
వెలవాల్గంటి కుమారులౌదురు గదా విప్రోత్తముల్ రావణా!

*(రీవారాణి అప్పలకొండయాంబకు సమస్యా పూరణం అంటే చాలా ఇష్టమట. "వెలవాల్గంటి కుమారులౌదురు గదా విప్రోత్తముల్ రావణా!" అనే సమస్యను ఆమె ఆస్థాన పండితులకిచ్చారట. గురజాడ పూరించిన పద్యమిది. కె.వి.ఆర్. మహోదయం, 1969 ప్రతి, పుట. 123)*

# మాటల మబ్బులు

దబ్బరలుం గొండెమ్ములు
మబ్బువలెం గ్రమ్మ మాయ మాటల తీపున్
నిబ్బరపు మొండితనమును
నబ్బురమగు విద్యలచటి యధికారులకున్.

తన కొక మేలు చేకురగ తక్కినవారికి గీడు సేయుటల్
మనమున లేని భక్తి యభిమానము మాటలలోనే చూపుటల్
గొనకెటు లాభముల్ గలుగు? గొంకక నాటకమాడ సాగుటల్
ధనమునకు న్మహోన్నతికి దారులు రాజ గృహాంతరంబులన్.

కెంజిగురుల కోయిల, సుమ
మంజరులన్ దేటిగముల, మనుజ ఖగములన్
మంజుల ఫలముల, చూతమ!
రంజించెద వితర తరులు రా వాదుకొనన్.

విధి వశమున నీ చెంతకు
మధుపము రా హేళనంపు మాటాడకుమా
మధు వొలుకు జలజ కులముల
కధికపు నెయ్యుఁడగు కుటజమా! తెలియు మెదన్.

# మెరుపులు

ఈవియు దియ్యని మాటయు
భావంబున జేయతగిన పని తెలియుటయున్
ఠీవియగు ధైర్యభావము
రావు సుమీ యొకని వలన రావలె తనతోన్.

మానిసులు గాని యింతుల
తా నేర్చని నేర్పు చెలగు తరి జెప్పంగా
జ్ఞానవతుల కగునె పికము
దాని శిశువుల బెంచు నెగురుదాక నొరుచేన్.

గడ్డి తిను కారు మెకముల
బొడ్డున కస్తూరి నునిచి పొలియగ చేసెన్
జడ్జివిధి దుష్టజిహ్వాల
నొడ్డిన సమకూరు శుభము లుర్వీజనులకున్.

అడచుకొన కింద్రియంబుల
నిడుమల కది త్రోవ యంద్రు యివి యడచుటయే
కడు సంపదలకు బాటగు
నడుమే తేర వి ష్టమొదవు నా మార్గమునన్.

కాశి జచ్చెనేని కలుగదు జన్మంబు
కలిగెనేని నుదుట కలుగు కన్ను
సిరసు నందు చిన్ని సిరి తోడుబుట్టువు
కంఠసీమ వెలయు గరళ చిహ్నా

నాల్గు రీతుల గనకంబు నాడెమగును
వేటు గీటుల తునియించి వెచ్చజేసి
నరుడు నట్టుల నాల్గింట నాడెమగును
కులము శీలంబు కర్మంబు గుణము చేత.

*(ఇవి కొన్ని సంస్కృత శ్లోకాలకు గురజాడ తెనిగింపు అని అవసరాల సూర్యారావు గుర్తించారు. సం॥)*

# ఋతశతకము

స్మితమతి సూచీ భేదిత
ఋత మౌక్తిక పదక శతక మిభపతి భాషా
సతి కతి కుతుకత గూర్చగ
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్.

సతి ప్రేమ వృత్తులను గని
పతి నమ్మిక నెగడు రీతి ప్రకృతి సతి యెడన్
మతియుతుడు ఋతము గనుటను
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

వెత బెట్టకు మిది యిమ్మని
బ్రతిమాలెడు ప్రియుని పల్కు ప్రతిభాషల సు
స్మిత  ఋతమున్ వివరింపగ
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

ఋతము లతియత్న మృగ్యము
లతిగుప్తము లౌట పండ్ల నాకులలోనన్
వెతుకు గతి వెతుక దగునని
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

ఋతము గనుట లుప్తాక్షర
తతి పోల్కియు వేరు తెలివి తలపుల గూటం
బు తలప దాని క్రమమ్మని
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

అతి సుకుమారము ఫలద
మృృత వృక్షం బనృతకక్ష మేచిన దానిన్
హతిజేసి తరువు గనుమని
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

కుతప తరుణీ కర శబలీ
కృత వాతాచక్ర మనిల కృపి జెడు భంగిన్
ఋతమంటి కల్ల చెడునని
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

వితథముల బల్కి యొరులకు
వెత జేయు నతఁడు వన్నెలు వెట్టి యనృత పా
తతి కీలల తనె పడునని
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

కతలను రక్కసు నెత్తురు
క్షితి బడి రక్కసులగు గతి నృతమతి జంపన్
ఋతములు మితి లేకగునని
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

అతి తృష్ణాగ్ని పిశాచము
మతి ధర్మపథంబు నుండి మరలించు నెడన్
ఋతవిదుడె త్రోవ యిడునని
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

చతురత నశ్వంబును వలె
మతి నొంచు విచిత్ర గతుల మానవుడీ వై
నృత సత్యవర్ణ్నులం జన
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

ఋతమందు నిలిపి యుంచిన
మతి కుడ్యావృత సముద్ర మధ్యస్థంబై
ద్యుతి జెందు నోడ వలెనని
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

మతి వీణా నిక్వణమున
ధృత తంతువు మీటకున్న నెట్టావృతమై
శ్రుతి చెడు, శ్రావ్యత యెట్లని?
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

మతి వీణ మీటు నంతనె
ఋత తంత్రీ శ్రుతిని జేరి యింపుగ స్వరముల్
ప్రతి సంవాద మ్మిడునని
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

ఋతమతి చూపులు దాకకు
మతి విద్యుద్యంత్ర మంచు మానిసి పగిదిన్
ధృతి చెడి వికలత గనునని
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

కితవత గట్టిన సంపద
కుతు కోద్యతి డించు పేక కోటల రీతిన్
ఋతమంటి నంత చెడునని
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

ఇతిహాసానృత కోష్టము
లతి కామోద్రేక రచన లందిరి నృపతుల్
ఋతకృతు లొందగ నృపతికి
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

మృతభట సంభృత రణ భువి
కుతల పతులు గనిరి కీర్తి కుంజర పతికిన్
మృతజీవిక ఋతభువి
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

గత క్లేశము లొొదవు హాయిని
కతలను విను వలన నెట్లు గలుగున్ సుఖముల్
మతిలేక నట్టి పోల్కిని
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

బ్రతుకు విధము దెలియగ నగు
బ్రతికి యవుల బోవు తెలివి వంక వెతల నీ
ది తరణి గనుటయె యగునని
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

వెతక దగు నొక్క సత్వము
మతి నరు నొక్కింత ప్రేమ సరిగా జూడన్
నితరము లరయం జనదని
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

ఋతమునకు బ్రాణ మిచ్చిన
మతిమంతు చరిత్ర కాల మార్గము నందున్
ఋత ఋజ దీపం బనుచున్
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

మితి మీరి దానవు తా
మృతిదాయక లోహమెత్త మెయి జీవనమౌ
గతి లోహమెత్తె నరు డిల
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

వితత కవితా ఖని గని కు
మతి కను చెదురు; మతియుతుఁడు కవితల సొంపున్
చతురత నేరిచి గనునని
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

ధృతి గురు జాడల నరిగెడు
గతి పెద్దలు జూప జనితి గజపతి త్రోవన్
కృతి కదె గౌరవమగుటన్
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

# గురజాడ వారి పిల్లల పాట

చింతా చెట్టు చిలకల తోటీ
ఏమని పలికిందీ?
"చిలకల్లారా చిలకల్లారా
ఛీ ఛీ పొమ్మందీ."
కొబ్బరి చెట్టు చిలకల తోటీ
ఏమని పలికిందీ?
"చిలకల్లారా చిలకల్లారా
ఛీ ఛీ పొమ్మందీ."
జామీ చెట్టు చిలకల తోటీ
ఏమని పలికిందీ?
"చిలకల్లారా చిలకల్లారా
రండీ రండందీ."
మామిడి చెట్టూ చిలకల తోటీ
ఏమని పలికిందీ?
"చిలకల్లారా చిలకల్లారా
రండీ రండందీ."

*('విశ్వవీణ' 1959 డిశంబరు 1వ తేదీ సంచిక నుంచి. చూ : గురజాడ రచనలు, కవితల సంకలనం, సం॥ సెట్టి ఈశ్వరరావు, పుట. 78, సప్తమ ముద్రణ, 2007)*

# Madras Congress

Tell me not in scornful numbers
Congress is an 'empty' show[1]
For though many a delegate slumbers
Seats are 'full' in every row.

Congress is earnest ! Congress is real!
Self-Government is its goal;
Action said, a high ideal
Is always good for the humen soul!

In the congress field of battle,
In constitutional strife
Indulge internal rattle,
Never lift a chair for life.

Lives of Moderates all remind us
We should wisely keep from crime,
Open sedition only finds us,
Shelter in a far-off clime[2]!

Let us then lie up and speaking,
Speaking at a furious rate :
Not always some benefit seeking
Learn to be loyal and to wait".

1. The first two lines resemble --
   H.H. Long Fellow's poem "A psalm of life".
   (Tell me not in mornful numbers, Life is an empty dream)
2. Perhaps a reference to the prison in Anandaman Islands.

*(This poem was first printed in Vyasa Chendrika (A collection of Gurajada's Essays), edited by Avasarala Surya Rao and published by Visalandhra Publishing House in 1953. In a foot note Surya Rao stated that this parody was part of an essay written by Gurajada on Madras Congress Session held in December 1908 and published in the Hindu. Unfortunately Surya Rao published only the poem but not the whole essay. Till date the essay remained untraceable. Eds.)*

---

# The Emeralds

Under the bowers
Where the ocean powers,
Sit on their pearled thrones,
Through coral woods
of weltering floods,
Over heaps of unvalued stones,
Through the dim beams,
Which amid the streams
Weave a network of coloured light.

# DEDICATION

**To**

**His Highness the Maharaja Mirja**
**Sri Ananda Gajapati Raj, Manea Sultan**
**Bahadur of Vizinagaram, G.C.I.E.**

May it please your highness,

It is fable that when the ancient demi-god of your noble race was making a causeway across the sea to rescue his consort from captivity, the faithful squirrel brought at the end of its tail a few grains of sand, not indeed hoping to advance the high enterprise in any appreciable degree, but to show an inclination to serve. Ten years ago, when the question was engaging Your Highness's attention of saving a very helpless section of our woman-kind from a galling type of slavery, fraught with the germs of social demoralisation, an humble servant made a feeble effort to arouse public opinion on the subject by exposing the evil in n popular drama. The success that attended its production on the boards, and demand for copies from various quarters, emboldened him to publish it. No one is better aware that t he writer himself how great are the imperfections of the piece, and how unworthy it is of presentation to such an exalted personage and ripe scholar as Your Highness, but he has ventured to seek Your Highness's indulgence, as he deems it the highest honour and his greatest ambition to be permitted to dedicate the fruits of his intellect, poor though in merit, to Prince with whom knowledge is an absorbing passion and whose appreciative encouragement of letters, has attracted to his court, literary starts of the first magnitude and inaugurated to his court, literary starts of the first magnitude and inaugurated a brilliant epoch in the history of Telugu Literature.

I have the honour to subscribe myself

May it please Your Highness,

One Ever Loved to **The Ever Loyal.**

# *Preface*

Under the orders of His Highness the Maharajah of Vizianagarm, a list was prepared ten years ago, of Brahmin *sulka marriages*, celebrated in the ordinary tracts of the Vizagapatnam District during three years. The lists is by no means exhaustive as the parties concerned were naturally averse to admitting acceptance of bride-money; but such as it is, it forms a document of great value and interest. The number of marriages recorded reached one thousand and thirty four, giving an average of three hundred and forty four for the year. Ninety nine girls were married at the age of five years, forty four at four, thirty six at three, six at two, and three at the age of one ! - the babies in the last instance carrying a price of from three hundred and fifty to four hundred rupees a head. Strange, as it may sound, bargains are sometimes struck for children in the womb. Such a scandalous state of things is a disgrace to society, and literature cannot have a higher function than to show up such practices and give currency to a high standard of moral ideas. Until reading habits prevail among the masses, one must look only to the stage to exert such healthy influence. These considerations prompted me to compose *Kanyasulkam.*

I clothed the play in the spoken dialect, not only that it is better intelligible to the stage - going public than the literary dialect, but also from a conviction that it is the proper comic diction for Telugu. Dramatic style is, no doubt, determined to some extent by usage, but the absence of any real dramatic literature in Telugu, leaves a writer free to adopt that outward form which he deems most appropriate for the presentation of his ideas. The metres in use in Telugu, with their alliterative restrictions, are incapable of imparting no language conversational ease which is indispensable in a comedy, or *continuity* in whcih, as Mr. Ward remarks, lies real life. One might invent new dramatic measures - but it would be a superfluous task, so far at least as comedy is concerned, as prose is gaining ground all over the world for dramatic purposes.

It has been remarked that the use of what is wrongly termed the *vulgar tongue* mars the dignity of a literary production, but that is a piece of criticism which one need not heed at the present day when the progress of the Science of Language has established better standards for judging the quality and usefulness of tongues than the whims of Grammarians of old linguistic strata. The Telugu literary dialect contains many obsolete grammatical forms, an inconveniently, large mass of obsolete words and arbitrary verbal contractions and expansions, necessitated by a system of versification based on allit-

eration and quantity. A license, which, no doubt, has its own advantages of introducing Sanskrit words to any extent has been but too eagerly availed of by poets who brought glossaries into requisition, revelled in fantastic compound - formation, and made the Telugu literary dialect *doubly dead.* This is not the place to dilate on the question of linguistic reform; but thus much might be said - It it is intended to make the Telugu literary dialect a great civilizing medium, it must be divested of its superfluous obsolete and Sanskrit elements, and brought closer to the spoken dialect from which it must be thoroughly replenished. There is not much dialectical difference in the Telugu generally spoken in the various parts of the Telugu Country; so a new common literary dialect can be established with comparative ease if only able writers set about it in right earnest.

Recently, I happened to read *Brahmavivaham* by Rai Bahadur Viresalingam Pantulu garu and found that there were some parallel passages in our plays, a thing perfectly natural considering that his piece traversed the whole field of Brahmin marriages. But it will be seen that these plays have little else in common, our treatment being essentially different. *Brahmavivaham* was meant to be a pure comedy of manners, while in *kanyasulkam* humour, characterization, and the construction of an original and complex plot have been attempted with what success, it is for the public to judge.

Vizianagaran, **G.V.A.**
1st January 1897.

# పాత్రలు.

౧. అగ్నిహోత్రావధాన్లు : - కృష్ణారాయపుర మగ్రహారము కాపురస్థుడు.

౨. వెంకటేశము : - అగ్నిహోత్రావధాని కుమారుడు.

౩. గిరీశం :- వెంకటేశమునకు చదువుచెప్పునయ్యవారు.

౪. కరటకశాస్త్రులు :- వెంకమ్మ తోడబుట్టినవాడు.

౫. లుబ్ధావధాన్లు :- రామచంద్రపుర మగ్రహారము కాపురస్థుడగు నొక బ్రాహ్మణుడు.

౬. రామప్పంతులు :- రామచంద్రపుర మగ్రహారము కాపురస్థుడగు నొక లౌక్యుడు.

౭. సౌజన్యరావుపంతులు :- ప్లీడరు.

౮. భీమారావు పంతులు :- ప్లీడరు.

౯. నాయుడు :- ఏజన్సీకోర్టు వకీలు.

౧౦. కరటకశాస్త్రుల శిష్యుడు :- డెప్యూటీ కలెక్టరు, హెడ్‌కనిష్టీబు, బైరాగి, శూద్రులు, దుకాణదారు, కలక్టరు కచేరి గుమాస్తాలు, బ్రాహ్మణులు, బంట్రౌతులుమొదలగు వారలు.

౧. వెంకమ్మ : - అగ్నిహోత్రావధాని భార్య.

౨. బుచ్చమ్మ : - అగ్నిహోత్రావధాని కూతురు.

౩. మీనాక్షి : - లుబ్ధావధాని కూతురు.

౪. మధురవాణి : రామప్పంతులుంచుకొనిన సాని.

# కన్యాశుల్కము

## మొదటియంకము

### స్థలము - విజయనగరములో బొంకులదిబ్బ

(గిరీశం ప్రవేశించి.)

**గిరీశ** : సాయంకాలమైనది. పూటకూళ్లమ్మకు సంతలో సామాను కొనిపెట్టుతానని నెల రోజులైనది పదిరూపాయలు పట్టుకువెళ్లి డ్యాన్‌సింగు గర్లుకింద ఖర్చు పెట్టినాను. యీవేళ ఉదయము పూటకూళ్లమ్మకూ నాకూ యుద్ధము అయిపోయినది. బుఱ్ఱ బద్దలకొడదామా అన్నంతకోపం వచ్చినది కాని, పూర్ రిచ్చర్డు చెప్పినట్లు పేషన్సు వుంటేనే కాని లోకములో పనిజరగదు.

When lovely woman stoops to folly,
And finds too late that men betray,
What charms can soothe her melancholy,
What arts can wash her guilt away?

ఈలా డబ్బు లాగేస్తే యిదివరకు యెన్ని పర్యాయములు ఊరుకున్నదికాదు. డ్యాన్‌సింగు గర్లు మాట యేదో కొంచెము ఆచోకీ కట్టినట్టు కనబడుతుంది. లేక యెవళ్లయినా నా మీద కోపంకొద్దీ ఉన్న నిజం దానితో చెప్పివేసినారేమో! ఈ వేళ ఉదయంసంగతి ఆలోచిస్తే యిటుపైని తిండిపెట్టేటట్టు కనపడదు. ఇక యీ వూరులో మనపప్పు వుడకదు. ఎటుచూచినా అందరికీ బాకీలేను. వెంకుపంతులుగారి కోడలికి లవ్‌లెటర్ వ్రాసినందుకు యెప్పుడో వొకప్పుడు సమయంచూసి యెముకలు విరగ్గొట్టేస్తారు.

Can love be controll'd by advice?
Will cupid our mothers obey?

శీఘ్రంగా బిచాణా యిక్కడనుండి యెత్తివెయ్యడమే బుద్ధిమంతుడికి లక్షణం. గాని మహాలక్ష్మిని వదలడమంటే యేమీ మనస్కరించకుండా వున్నది.

It is women that seduce all mankind.

నేను యేదో ఉద్యోగాలూ ఊళ్ళు యేలి తనతో వైభవము వెలిగిస్తాననే నమ్మకముతో ఉన్నది. పూర్ క్రీచర్ !

Oh! Whistle to me and I will come away, Though father mother and grandmother. Should go mad.

ఎవరా వస్తూ ఉన్నది? నా ప్రియశిష్యుడు వెంకటేశ్వరులులాగు వున్నాడు. ఈ వేళ కిస్‌మిస్ శలవులు యిచ్చివుంటారు. వాడి ముఖం వైఖరి చూస్తే ఫెయిలయినట్టు కనపడుతున్నాడు. వీడికి శలవులలో చదువుచెప్పే మిషమీద వీడితోకూడా వీడి వూరు వుడాయిస్తే చాలా చిక్కులు వదులుతవి. అటు నుంచి నరుక్కురమ్మన్నాడు.

(వెంకటేశ్వర్లు ప్రవేశించుచున్నాడు.)

**గిరీశ** : ఏమివాయి, మైడియర్ షేక్స్‌పియర్. ముఖం వేల వేసినావు?

**వెంకటే**: ఇక మీరు నాతో మాట్లాడకండి, మీతో సావాసం చేయడముచేత నా పరీక్ష పోయిందని మా మేష్టరుగారు చెప్పినారు.

**గిరీశ** : నాన్సెన్స్. మొదటినుంచీ నేను అనుమానిస్తూనే వున్నాను. నీ మేష్టరుకి నన్ను చూస్తే కిట్టదు. అందుచేత నిన్ను ఫెయిలుచేసినాడు గాని; లేకుంటే నివ్వు ఏమిటి? ఫెయిలు కావడమేమిటి! అతనికీ నాకూ యెందుకు విరోధము వచ్చిందో నీకు తెలిసిందా? అతను చెప్పేదంతా తప్పుల తడక. అది నేను న్యూసు పేపరులో పెట్టి యేకివేసినాను.

**వెంకటే**: మీవల్ల నాకు వచ్చినదల్లా చుట్టకాల్చడం వక్కటె. పాఠం చెప్పమంటే యెప్పుడూ కబుర్లు చెప్పడమేకాని, ఒకమాటయినా ఒక ముక్క చెప్పిన పాపానపోయినారా!

**గిరీశ** : డామిట్. యిలాంటి మాటలంటే నాకు కోపము వస్తుంది. ఇది బేస్ యిన్‌గ్రాటిట్యూడ్. నాతో మాట్లాడుతుండడమే యెడ్యుకేషన్. నీకున్న లాంగ్వేజి నీ మేష్టరుకైనా వుందీ? విడో మారేజి విషయమై నాచ్ కొశ్చన్ విషయమై నీకు యెన్ని లెక్చర్లు యిచ్చాను. నా దగ్గర చదువుకొన్నవాడు ఒకడూ అప్రయోజకుడు కాలేదు. పూనాలో డక్కన్ కాలేజిలో నేను చదువుతున్నప్పుడు, ది ఇలివెన్ కాజస్ ఫర్ ది డిజన్‌రేషన్ ఆఫ్ ఇండియా విషయమై మూడు ఘంటలు ఒక్క బిగిని ఆలాగు లెక్చెర్లు యిస్తే ప్రొఫెసర్లు అంతా టప్రు కొట్టేశారు. మొన్న బంగాళీబాబు ఈ వూళ్లో లెక్చర్లు యిచ్చినప్పుడు ఒకడికయినా నోరుపెగిలిందీ. మనవాళ్లు వట్టి వెధవాయిలోయి. చుట్ట కాల్చడం యొక్క మజా నీకేమీ బోధపడలేదు. చుట్ట కాల్చడం నించే దొర్లు యింత గొప్పవాళ్లు అయినారు. చుట్టుకాల్చని ఇంగ్లీషు వాడిని చూశావూ? చుట్టకాల్చడంబట్టె స్టీముయంత్రం కనుక్కున్నారు. శాస్త్రకారుడు కూడా యేమన్నాడో వినలేదా?

క. ఖగపతి యమృతముతేగా ।
భుగభుగమని పొంగి చుక్క భూమినిఁవ్రాలెన్ ।
పొగచెట్టైజన్మించెను ।
పొగతాగని వాడు దున్నపోతైబుట్టున్ ॥

ఇది బృహన్నారదీయం నాలుగవ ఆశ్వాసములో వున్నది. అది ఆలాగు వుణ్ణీగాని నీ అంత తెలివయిన కుఱ్ఱవాడిని ప్రొమోషన్ చెయ్యనందుకు నీ మేష్టరుమీద నావళ్లు మహామండుతూ వున్నది. ఈమాటు వంటరిగా షికారు వెళ్ళుతూన్నపుడు చూచి ఒక తడాఖాతీస్తాను. నీవు శలవులలో యిక్కడ వుంటావా లేక, మీ వూరికి వెళతావా?

వెంకటే: మా వూరికి వెళ్ళాలనివుంది కాని (గద్గద స్వరముతో) ప్యాసుకాలేదంటే మా వాళ్ళు కొట్టేస్తారు.

గిరీశ : నీకు నేనొక వుపాయం చెప్పుతాను. నేను చెప్పినట్టల్లా యెప్పుడూ వింటానని ప్రమాణకం చేస్తావా?

వెంకటే: (అతనికాళ్ళు పట్టుకుని) ఏలాగైనా నన్ను రక్షించాలి మా నాన్నకు మా చెడ్డకోపం. ఇంటికి వెళ్లితే యెముకలు విరగగొట్టేస్తాడు.

గిరీశ : దట్ యీస్ టిరనీ యిదే బంగాళీ కుఱ్ఱవాడవుతే యేమిచేస్తాడో తెలిసిందా? కఱ్ఱ పట్టుకుని తండ్రయేది తాతయేది ఛమ్డాలు యెక్కకొడతాడు. మీ అగ్రహారంలో మరి యెవరూ స్కూలు కుఱ్ఱవాళ్లులో లేరుగద?

వెంకటే: లేరు.

గిరీశ : అయితే నేనొక వుపాయం చెప్తాను విను. నేను కూడా నీతో వస్తాను. నువ్వు ప్యాస్ అయినావని చెప్పేదాము. కావలిస్తే అటుంచి వచ్చిన తరువాత టవును స్కూలులో ప్రవేశించవచ్చును.

వెంకటే: మీరు కూడా వుంటే నాకు భయములేదు, మొన్న వేసంగి శలవులలో కూడా మా అమ్మ శలవులలో పాఠాలు చెప్పడానికి మిమ్మలిని తీసుకురమ్మంది.

గిరీశ : ఆల్‌రైట్. కాని నా కిక్కడ చాలా వ్యవహారములలో నష్టము వస్తుంది. మునసబుగారి కొమాళ్లకి శలవులలో పాఠాలు చెప్పితే ట్వంటీ రుపీస్ యిస్తామన్నారు. అయినా నీ విషయంలో యెంత లాస్‌వచ్చినా నేను కేర్ చెయ్యను. మీవాళ్లు బార్ బరస్ పీపిల్ తిన్నగా ట్రీట్ చేస్తారో చెయ్యరో. నీవు నా విషయమై గట్టిగా రికమెండు చెయ్య వలసియుంటుంది. కొత్త పొస్తకాలు కొనడముకు ఒక జాబితావ్రాయి. కొంచెము

డబ్బు చేతిలో వుంటేనే గాని సిగర్సుకి కొంచెము ఇబ్బందిగా వుంటుంది. నోట్‌బుక్కు, పెన్సలు తియ్యి:

1. రోయల్ రీడర్.
2. మ్యాన్యుఅల్ ఆఫ్ గ్రామరు.
3. గోషుస్ జ్యామెట్రి.
4. బాసూస్ ఆల్జిబ్రా.
5. బాసూస్ అర్థమెటిక్కు.
6. నలచరిత్ర.
7. రాజశేఖర చరిత్ర.
8. షెప్పర్డ్సు జనరల్ యింగ్లీషు.
9. వెంకట సుబ్బారావ్స్ మేడిజీ.

యెన్ని పుస్తకాలయినాయి.

**వెంకటే**: తొమ్మిది పొస్తకాలయినాయి.

**గిరీశ** : మరొక్కటి వెయ్యి – కుప్పుస్వామి అయ్యర్సు మేడ్‌డిఫికల్ట్. అక్కడికి చాలును. మీవాళ్ళుగాని ఇంగ్లీషు మాట్లాడమంటే తణుకూ బెణుకూ లేకుండా పుస్తకాలలో వున్న ముక్కలు ఏకరపెట్టెయ్యి. నీ దగ్గిర యేమయినా కాపర్సు వున్నవా? బ్యాంకినోట్లు మార్చలేదు. వక పదణాలుపెట్టి మిఠాయి పట్టుకొనిరా. రాత్రి మరి నేను భోజనము చెయ్యను. మార్కట్‌కు వెళ్ళి బండి కుదిర్చేశి దానిమీద నా ట్రావెలింగు ట్రంక్ పడేసి మెట్టుదగ్గిర బండి నిలబెట్టివుంచు. ఇక్కడ కొన్ని పనులు చక్కబెట్టుకొని యెంత రాత్రికయినా వచ్చి కలుసుకుంటాను. గో యట్ వన్స్ మై గుడ్ బోయ్. నీవు బుద్ధిగా చెప్పిన మాటలు వింటూవుంటే సురేంద్రనాథ్ బనర్జీ అంత గొప్ప వాడిని చేసేస్తాను. నేను నీతో వస్తానన్న మాట మాత్రం పిట్టకైనా తెలియనియ్యవద్దు.

(వెంకటేశ్వరులు నిష్క్రమించుచున్నాడు)

**గిరీశ** : (తనలో) ఈ వ్యవహార మొకటి ఫైసలయింది. ఈ రాత్రి మహాలక్ష్మికి పార్టింగు విజిట్ యివ్వవలెను.

(పైకి) రవణింతున్నుతి కాలకంఠ మకుటాట్టాలప్రతోళీమిళత్యవమానామరశింధు బంధురపయ స్సంభార

(ఒక బంట్రోతు ప్రవేశించి.)

**బంట్రోతు** :అయ్యా మొన్న మీరు వేయించుకొన్న పొటిగ్రాఫుల ఖరీదు అడగమని మా పంతులు గారు పంపించారు.

**గిరీశ** : (వినబడనట్టు నటించుచు)

గంభీరవాగ్వ్యవహారైక ధురంధరత్వమగు జిహ్వాలోలి మత్తలికిన్! జనికిందల్లికి కారవేల్లికి ధనుర్జ్యావల్లి నీరుల్లికిన్!!

**బంట్రోతు**:యంతమందిని పంపించినా యిదుగో యిస్తామని అదుగో యిస్తామని తిప్పుతూ వచ్చేవారట. నేను వాళ్ళలాగు వూరుకునే వాడను కాను.

**గిరీశ** : అయ్య కోనేటికి తోవయిదే.

**బంట్రోతు** :యిదెక్కడ చెమిటి మహాలోకము వచ్చిందయా.

**గిరీశ** : కోమటి దుకాణమా? కస్పాబజారులో కాని ఇటివైపు లేదు.

**బంట్రోతు** :(గట్టిగా చెవిదగ్గిన నోరుపెట్టి) పొటిగ్రాఫుల ఖరీదు యిస్తారా ఇవ్వరా?

**గిరీశ** : బస రాధారీ బంగళాలో చెయ్యవచ్చును.

**బంట్రోతు** : (మరీగట్టిగా) మీరూ సానిదీ కలిసి వేయించు కున్న పొటిగ్రాఫు ఖరీదు 16 రూపాయలు. అప్పుడే యిస్తామని యింకా తిప్పలు పెడుతూన్నారు.

**గిరీశ** : ఓహో నీవా! నింపాదిగా మాట్లాడు. నింపాదిగా మాట్లాడు. రేపు వుదయం తప్పకుండా 8 ఘంటలకు పూటకూళ్లమ్మ యింటికి వచ్చినట్టైనా రూపాయలు అణాపైసలతో ఇచ్చివేస్తాను. మీ పంతులుకు స్నేహమూ మంచీ చెడ్డా అక్కరలేదూ. ఇంత తొందర పెట్టడానికి యేవూరైనా పారిపోతామా యేమిటి.

**బంట్రోతు** :మాటలతో కార్యము లేదు రూపాయలు నిలువబెట్టి మరీ పుచ్చుకోమన్నారు.

**గిరీశ** : పెద్దమనిషివి నువ్వూ అలాగే అనడం ధర్మమేనా? రేపు వుదయం యివ్వకపోతే మాలవాడి కొడుకు ఛండాలుడుతో సమానము – ఇంకా నీకు నమ్మకము లేకపోతే యిదుగో గాయిత్రి పట్టుకు ప్రమాణం చేస్తాను.

**బంట్రో** :కానియ్యండి రేపు వుదయం ఇయ్యకపోతే మాత్రం భవిష్యం వుండదు

(అని నిష్క్రమించుచున్నాడు.)

**గిరీశ** : (తనలో) ఇన్నాళ్ళకు జంఝ్యపుపోచ వినియోగం లోకి వచ్చింది. ధియాసాఫిస్ట్ చెప్పినట్లు మన ఓల్డు కస్టమ్సుకు ప్రతిదానికీ యెదో ఒక ఉపయోగం ఆలోచించే మన వాళ్ళు నియమించారు. యిప్పుడు నాకు బోధపడ్డది.

ఈ పిశాచాన్ని వదుల్చుకునేటప్పటికి తలప్రాణం తోక్కివచ్చింది. చీకటి పడింది. శీఘ్రబుద్ధేఃపలాయనంఅని పెందరాళే ఈ వూరునుంచి వుడాయిస్తేనే కాని ఆబోరు దక్కదు. ఇక బయలుదేరి మహాలక్ష్మి ఇంటికి వెళ్ళవలెను. మేక్ హే వైల్‌ది సన్‌షైన్స్ అన్నాడు. (పైకి) పూజారివారి కోడలు తాజారగ బిందెజారి జర్రున పడియెన్. ఆ పైముక్క మరి జ్ఞాపకమువచ్చినది కాదూ. (చుట్టనోటిలో బెట్టుకుని అగ్గిపుల్ల వెలిగించు చుండగా తెరదించి వేయవలెను.)

★★★

## (ఠస్థలము - కృష్ణారాయపురం అగ్రహారంలో అగ్నిహోత్రావధాన్లుగారి నడవ)

(అగ్నిహోత్రావధానులుగారు కూర్చుని జంఝ్యాలు వడుకుచు కరటక శాస్త్రులు శిష్యునిచేత పేలు నొక్కించుకొనుచు వెంకమ్మ కూర తరుగుచు గనబడుదురు)

**వెంకమ్మ :** నిన్నటినుంచి కిసిమీశ్శలవులని కుర్రవాడు వుత్తరం వ్రాసినాడు. యెన్నాళ్లైందో చూచి కళ్ళు కాయలుకాచిపోయినాయి. గడియో గడియో వస్తాడు కాబోలు.

**అగ్నిహో:** ఎందుకు వట్టినే వగచడం. నేను వద్దు వద్దంటూంటే ఇంగ్లీషులో పెట్టావు. మెరక పొలంమీద వచ్చేశిస్తంతా వాడికింద ఖర్చుఅయిపోతున్నది. క్రిందటి సంవత్సరం పరీక్షఫేలు అయిపోయినాడు. మనకి ఇంగ్లీషు అచ్చిరాదని పోరి పోరి మొదటే చెప్పాను. మా పెత్తండ్రి దిబ్బావధానులు కొడుకుని ఇంగ్లీషు చదువుకు పార్వతీపురం పంపించేటప్పటికి వుష్ణంవచ్చి మూడు రోజుల్లో కొట్టివేశింది. బుచ్చబ్బి కొడుక్కి ఇంగ్లీషు చెప్పిందామనుకుంటూండగానే పెద్దఖాయిలా పెట్టిచచ్చినంతైంది.

**వెంకమ్మ :** మీరు యెప్పుడూ యిలాంటి వాగాయత్తం మాటలే అంచారు. డబ్బుఖర్చు అయిపోతుందని మీకు బెంగ. మొన్న మొన్న నాకళ్లయదట మన వాకట్లో జుత్తువిరబోసు కుని గొట్టికాయలు ఆడుకునేవాడు నేమానివారి కుర్రాడికి మునసబీ అయిపోయింది.

**అగ్నిహో:** మన వెధవాయికి చదువువచ్చేది యేమీ కనపడదుకాని పుస్తకాలకింద జీతం కింద ఇక నాలుగు యేళ్లయేటప్పటికి మనభూమి కడతేరిపోతుంది. ఆ పైని చిప్పా దొప్పా పట్టుకుని బయలుదేరాలి. నిమ్మళంగా ఇంటిదగ్గిర వుంటే ఈ పాటికి నాలుగు అర్థాలు చెప్పివేదును. వొద్దంటూంటె యీ వెధవ ఇంగ్లీషుచదువుకింద పెట్టావు.

**వెంకమ్మ :** మనవాడికి ఒక మునసబు పనైనా, పోలీసు పనైనా అవుతే ఋణాలిచ్చి యీ అగ్రహారం భూములన్నీ కొనేస్తాడు. సాలుకు వక నూఱు రూపాయీలు ఖర్చుపెట్టడానికి ముందూ

వెనుకా చూస్తున్నారు. మీలాగే వాడూ పెద్ద కడుపు వేళ్లాడేసుకుని జంఝాలు వడుక్కుంటూ బతకాలని వుందా యేమిటి? మీకంత భారమనితోస్తే మా వాళ్లు నా పసపూ కుంఖానికి యిచ్చిన భూమి అమ్మేసి కుఱ్ఱాడికి చదువు చెప్పిస్తాను.

**కరటక :** నీ భూమి యెందుకు అమ్మాలి మన సొమ్ము చెడతిని కొవ్వివున్నాడు అతనే పెట్టుకుంటాడు.

**అగ్నిహో:** అయితే నా కడుపును ఆక్షేపణ చేస్తావషె? యీ మారంటె నీ అన్న వున్నాడని వూరుకునేది లేదుసుమా!

(గిరీశ, వేంకటేశ్వర్లు, ప్రవేశించుచున్నారు.)

**వెంకమ్మ :** మా బాబు – మా బాబు వచ్చావషోయి (అని లేచి వెళ్లి కవుగలించుకొనుచున్నది)

**అగ్నిహో:** వెధవాయా. యీ మాటైనా ప్యాసు అయినావా లేదా?

**వెంకటే:** (తెల్లబోయి జూచుచున్నాడు)

**గిరీశ :** ప్యాసు అయినాడండి. ఫస్టుగా ప్యాసయినాడు.

**అగ్నిహో:** యీ తురక యెవడోయి?

**గిరీశ :** టర్క్! డామిట్, టెల్‌మాన్.

**అగ్నిహో:** మాన్! మానులావున్నానంఛావు? గూబ పగలకొడఛాను.

**వెంకటే:** (వణుకుతూ తల్లివైపుచూచి) అమ్మా యీయనే నాకు చదువు చెప్పుతాడు.

**కరటక :** ఇంటికి పెద్దమనిషి వస్తే అపుచ్ఛపు మాటలాడుతావేమి ఇంగ్లీషుమాట ఆయనేమో కుఱ్ఱవాడితో అంటే పుచ్చకాయ దొంగంటే బుజాలు తుడుముకున్నట్టు నీ మీద పెట్టుకుంటావేమి.

(బండివాడు సామాను దించును)

**గిరీశ :** తమరు యిక్కడా వున్నారు. నన్ను తమరు యరగకపోయి వుండవచ్చును గాని సంస్కృత నాటక కంపెనీలో తమర్ని తరుచుగా చూస్తూ వుండెవాడిని. యిండియా అంతా తిరిగినాను. గాని తమవంటి విదూషకుణ్ణి యక్కడా చూడలేదు. సంస్కృతం, అరవం, మహారాష్ట్రం, యింకా యెన్నో భాషలు మంచినీళ్ల ప్రవాహంలా మాట్లాడుతారు.

**అగ్నిహో:** (ధుమధుమలాడుచు) యీ శెషభిషలు నాకు పనికిరావు. ఈయన వైఖరి చూస్తే యిక్కడే బసవేసేటట్టు కనబడుతున్నది. నా యింట్లో భోజనం యంత మాత్రమూ వీలుపడదు.

**వెంకమ్మ** : ఆయన వెర్రివాడు, ఆయనమాట గణనలోకి తేకు బాబూ! యాలాగైనా మా వాణ్ణి కడుపులోపెట్టుకుని ఒక ముక్క అబ్బేటట్టు చేయిబాబూ. వాడు వట్టి సత్తెకాలం నాయన. నామోస్తరే.

**గిరీశ** : అభ్యంతరమేమిటమ్మా, మీవాడు శలవులలో చదువు చెప్పమని యెంతో బతిమాలుకుంటే పోనీ పనికివచ్చే కుర్రవాడుగదా అని వచ్చినాను. లేకుంటే పట్నంలో పంచపక్వ పరమాన్నాలు మానుకుని ఇక్కడ ముతక బియ్యం తినడానికి ఎందుకువస్తాను.

**కరటక** : (తనలో) వీడు టక్కర్‌లా వున్నాడు.

**వెంకమ్మ** : ఈ చదువులకోసమని పిల్లలను వదులుకుని వుండడం వార్లక్కడ శ్రమదమాదులు పడుతూవుండడం, నా ప్రాణాలు యెప్పుడూ అక్కడే వుంచాయి. డబ్బంటే యెప్పుడూ వెనకచూడలేదుకదా, మేము కనడం మట్టుకుకన్నాము. మీరే తల్లిదండ్రీ వాడిని యేలాగు బాగుచేస్తారో మీదే భారం.

**గిరీశ** : మీరు ఇంతదూరం శలవు యివ్వవలెనా. నా మంచీ చెడ్డా మీకుర్రవాణ్ని అడిగితేనే తెలుస్తుంది. ఇంతెందుకు ఇక మూడుసంవత్సరములు నా తరిఫీతులో వుంచితే క్రిమినల్ లోవర్ అనగా పోలీసు పరీక్ష ప్యాసు చేయించివేస్తాను. డబ్బువిషయమై మట్టుకు మీరు వెనక తీయకుండా వుండాలి.

**అగ్నిహో**:యీ సంవత్సరం పుస్తకాలకి యెంతైందిరా అబ్బీ?

**వెంకమ్మ** : పదిహేను రూపాయిలవుతుంది.

**అగ్నిహో**:ఒక దమ్మిడీ ఇచ్చేది లేదు. వీళ్లిద్దరూ కూడి ఆ రూపాయలు పంచుక తినేసేటట్టు అగుపడుచుంది గాని మరేమీ లేదు. నేను వేదము 82 పన్నాలూ జటాంతం వరకూ పుస్తకాల కింద ఒక దమ్మిడీ ఖర్చు లేకుండా చదువుకున్నాను. ఇదంతా టోపీ వ్యవహారంలాగా కనబడుతుంది.

**కరటక** : (ముఖంవంకబెట్టి నవ్వుకొనును)

**గిరీశ** : (కరటకశాస్త్రులవైపుచూచి) బార్బరస్ చూచారండి జన్‌టిల్‌మ్యాను అనగా పెద్దమనిషిని యెలాగు అంటున్నారో– నేను యీ నిమిషం వెళ్లిపోతాను.

**వెంకమ్మ** : చాలు. చాలు. బాగానే వున్నది. ఇంటికి ఎవరైనా పెద్దమనిషి వస్తే నాకిదే భయం. ఆయన మాటల కెక్కడికి –బాబూ వెళ్లకండి. అన్నిటికీ నేను వున్నాకదా.

**కరటక** : అగ్నిహోత్రావధానులూ కుర్రవాడికి రవ్వంత చదువు చెప్పించడానికి ఇంత ముందూ వెనకా చూస్తూన్నావు. బుచ్చమ్మని అమ్మిన పదిహేను వందల రూపాయిలూ యేమిచేసినావు.

గిరీశ : సెల్లింగ్ గర్ల్స్! డామిట్.

అగ్నిహో:ప్రతిగాడిదకొడుకూ అమ్మేవు అమ్మేవు అంచూవుంచాడు. కూరగాయషోయి – అమ్మ డానికి – ఆ రూపాయిలు పుచ్చుకోకపోతే మొగుడు చచ్చాడు గదా దానిగతి యేమవును, వడ్డీతో కూడా ఇప్పుడు ౧౮౦౦ రూపాయలు అయినవి. దాని మానాన్న అది బతకవచ్చును.

కరటక: చచ్చాడంటే వాడిది తప్పా? మంచంమీంచి దించివేయడానికి శిద్ధముగా వున్నవాడికి పెళ్ళిచేసినావు. సదశ్యం నాడు వెంకుపంతులుగారు వచ్చారు కారని భోజనాల దగ్గిర కనిపెట్టుకు వుండేసరికి గుడ్లు పేలిచచ్చాడు. అగ్నిహోత్రావధానులూ! నేను యెరుగనట్లు చెప్పుతావేమిటి?

గిరీశ : తమరేనా, నులక అగ్నిహోత్రావధానులుగారు. జటలో తమతో సమానులు లేరని రాజమహేంద్రవరంలో అనుకునేవారు.

అగ్నిహో:మీది రాజమహేంద్రవరంటండీ. ఆ మాట చెప్పారు కారేమి. రామవుధానులు గారు ఖులాసాగా వున్నారా? ఆయన గొప్ప ఘనాపాటీ.

గిరీశ : ఖులాసాగా వున్నారు. నేను ఆయన మేనల్లుణ్ణే నండి నాపేరు గిరీశం అంటారు.

అగ్నిహో:ఆలాగునండీ చెప్పారు కారూ.

గిరీశ : మా మామగారు ఎప్పుడూ ఎవరువచ్చినా మిమ్ములనే పొగుడుతూ వుంటారు.

అగ్నిహో:ఎవరో అనుకుని యిందాకా మిమ్మలిని అన్నమాటలు క్షమించాలి సుమండీ. నేను కొంచెము ప్రథమకోపిని.

గిరీశ : దానికేమిటండీ. తమవంటి పెద్దవాళ్ళు అనడమూ – మావంటి కుర్రవాళ్లు పడడం విధి.

కరటక: (తనలో) మా అగ్నిహోత్రావధాన్లుకి తగినవాడు దొరికాడు.

అగ్నిహో:చూచారండీ మా కరటకశాస్త్రి వట్టి అవకతవక మనిషి మంచీ చెడ్డా యేమీ తెలియదు. అల్లుడు చచ్చిపోయినాడంటే అందువల్ల యంతలాభం కలిగింది? భూములకి దావా తెచ్చామా లేదా! గిరీశంగారూ నేను యీ మధ్య దాఖలుచేసిన అర్జీ పట్టుకొస్తాను దానిమీద యిందారుసు చదవండీ (అని గదిలోనికి వెళ్ళి తీసుకొనివచ్చి చేతికిచ్చు చున్నాడు)

గిరీశ : (కాకితము నెగదిగజూచి) ఎవరో తెలివి తక్కువ గుమాస్తా వ్రాసినట్టువున్నది గాని యెక్కడా అక్షరం పొల్లిలేదండీ.

**అగ్నిహో**:లేదండీ దొరగారు స్వయం చేత్తో వ్రాశారు. మఱి వక్కమారు చూడండి.

**గిరీశ** : అలాగు చెప్పండి – యిది లాటిను భాషను వ్రాసినాడు, ఇంగ్లీషు గాని యింకా నేను లాటినుభాష నేర్చుకొనలేదండి.

**అగ్నిహో**:మా వకీలు చదివేశాడండీ.

**గిరీశ** : అది యేమాత్రం పనండి. లాటిను వక రోజులో చదువవచ్చును. జరుగురు లేక నేను చదవడం లేదు.

**కరటక** : (తనలో) వీడిచర్య గమ్మత్తుగా వున్నది.

**వెంకటేశ**: మా అబ్బాయీ మీరు వక పర్యాయం ఇంగ్లీషు మాట్లాడుతారూ?

**గిరీశం** : Twinkle! Twinkle!little star,
How I wonder what you are.

**వెంకటేశ**: There is a white man in the tent.

**గిరీశం** : The boy stood on the burning deck
whence all but he had fled.

**వెంకటేశ**: Upon the same base and on the same side of it the sides of a trapezium are equal to one another.

**గిరీశం** : Of man's first disobedience and the fruit of that mango tree, sing Venkatesa my very good boy.

**వెంకటేశ**: Nouns ending in *f* or *fe*, change their *f* or *fe* into *'Ves'*.

**అగ్నిహో**:ఈ ఆడుతూన్న మాటలకి అర్థమేమిటండీ?

**గిరీశ** : యీ శలవులలో యే ప్రకారం చదవవలెనో అదంతా మాట్లాడుకుంటున్నాము.

**కరటక** : అబ్బీ వక్క తెనుగు పద్యము ఏదైనా చదువుతావురా?

**వెంకటే**: పొగచుట్టకు సతిమోవికి

**కరటక** : చబాష్!

**గిరీశ** : డ్యామిట్ డోన్ట్‌రీడ్దట్. (మెల్లగా) నల దమయంతు లిద్దరు (అని అందిచ్చుచున్నాడు.)

**వెంకటే**: నలదమయంతు లిద్దరు మనః ప్రభవానలదహ్యమానులై

**కరటక** : మనః ప్రభవానలమంటే యేమిట్రా అబ్బాయీ?

**గిరీశ** : స్కూళ్లలో అర్థం చెప్పరండి. పరీక్షకు అర్థం అక్కరలేదు. వేదం చదివినట్టె తెలుగూ చదివిస్తారు.

**కరటక** : (తనలో) తరిఫీత్ మా చమత్కారంగా వున్నది. వీడికి పెందరాళే ఉద్వాసన చెప్పితేనే గాని అసాధ్యుళ్లా వున్నాడు.

**అగ్నిహో** : బాగావుందండి మా వాడికి డబ్బు ఖర్చులేకుండా పెళ్ళి అయేసాధనం కూడా ఒకటి తటస్థించింది. ఇటుపైన కలక్టరీదాకా చదువుచెప్పిస్తాను.

**వెంకమ్మ** : మీ నైజం కొద్దీ ఛిర్రూ కొర్రూ మంటారు గాని మీకుమాత్రం బాబు మీద ప్రేమలేదా యేమిటి పట్నంలో గొట్టాలమ్మ వచ్చినప్పుడు బెంగపెట్టుకుని బాబుని శలవర్జీరాసి వెళ్ళిపో రమ్మన్నారు కారా – పెళ్ళీ చెయ్యక చదువూ చెప్పించక తీరుతుందాయేమిటి.

**కరటక** : డబ్బుఖర్చు లేకుండా కొడుక్కు పెళ్ళి చేస్తావుటోయి బావా! పిల్లలను అమ్మినట్టె అనుకున్నావా యేమిటి? పదిహేను వందలైనా పోస్తేగాని పిల్లను యివ్వరు.

**అగ్నిహో**:రామచంద్రపురం అగ్రహారంలో లుబ్ధావధాన్లుగారికి చిన్నమ్మిని పద్దెనిమిదివందల రూపాయిలలకు అడగవచ్చినారు. ఆయన నాలుగు లక్షలకధికారష. ఉభయ కర్చులూ పెట్టుకుంటారష. పెళ్ళి మహావైభవంగా చేస్తారష. మనమే తర్లి వెళ్ళడం. తాంబూలం పుచ్చుకున్నారు. నిశ్చయం అయిపోయినది, ఆ పద్దెనిమిది వందలూ పెట్టి వెంకడికి పెళ్ళిచేస్తాను.

**వెంకమ్మ** : అయ్యో! అయ్యో! నాకు తెలియకుండానే? నాకు తెలియకుండానే? యెన్నేళ్ళేమిటి పెళ్ళికొడుక్కి.

**అగ్నిహో**:ఎన్నేళ్లైతే నేమిటి నలభైయైదూ.

**వెంకమ్మ** : బుచ్చమ్మ మన జీవానికి వుసూరుమని యేడుస్తూంటే సుబ్బిని కూడా యెవడో ముసలి వెధవకు అమ్మ తల్చుకున్నారు. మేనరికము యివ్వాలని ఎంతో ముచ్చటపడుతూన్నాను. ఈ సంబంధము చేసుకుంటే నేను నూతులో పడకమానను.

**గిరీశ** : లుబ్ధావధాన్లు మా పెత్తల్లి కుమారుడండి కాని సెల్లింగ్‌గర్ల్స్ కన్యాశుల్కము, డామిట్, యెంతమాత్రమూ కూడదు. అవధానులు మామగారూ. డామిట్ – మల్బారీ దాని విషయమై చాలా యస్సేస్ వ్రాసినాడు. నేను పూనాలో వున్నప్పుడు కన్యాశుల్కము విషయమై ఒకనాడు నాలుగు ఘంటలు లెక్చరిచ్చినాను. సావకాశంగా కూర్చుంటే కన్యావిక్రయము బహు దౌర్జన్యమైన పనని మీచేత వొప్పిస్తాను.

**కరటక** : ఈ సంబంధము చేస్తే నీ కొంపకి అగ్గి పెట్టేస్తాను.

**అగ్నిహో:** వీళ్లమ్మా శిఖాతరగా! ప్రతి గాడిదకొడుకూ తిండిపోతుల్లాగచేరి నన్ను అనేవాల్లే! మరింతకాక యింత గింజుకుచచ్చేది యీ సంబంధము చెయ్యకపోతే బారికరాముడే సరి.

(అని వెళ్ళిపోవును).

**కరటక :** ఏమి అపృచ్ఛపుమాటలంటావయ్యా.

**వెంకమ్మ :** అబ్బీ యీ సంబంధం చేస్తే నేను నూతులో పడకమానను. నలుగురు బంధువులలో పరువూ ప్రతిష్టా పోవడం సరేగదా అమాంతంగా పిల్లదాని పీక కోసివెయ్యడం కాని మరివకటి కాదు. పెద్దదానిని పక్కలో కుంపటిలాగు ఇంట్లో పెట్టుకు అనుభవిస్తూనే వున్నాము. ఆయనకి మంచీ చెడ్డా వొళ్లునాటక ఈ దౌర్భాగ్యపు సంబంధం కల్పించినారు. ఆయన చదువులూ నా నోములూ యెందుకు. తగలేయనా, ఆయనకు యెంతతోస్తే అంతేకాని కావలసిన వారిని సలహాచెయ్యడం అదీ యెప్పుడూ లేదు. ఇంతెందుకూ ఈ సంబంధము అయినట్టాయనా ఒక నుయ్యో గొయ్యో చూచుకోవడమే కాని మరి సాధనం లేదు.

**కరటక :** (ఆలోచించుచు నిమ్మళముగా) గట్టి అసాధ్యము వచ్చినది - వొట్టి మూర్ఖపు గాడిదకొడుకు యెదురు చెప్పితే మరింత కొర్రెక్కుతాడు. యేమీ పాలు పోకుండావున్నది.

**గిరీశ :** వెంకమ్మత్తగారూ మీరెందుకాలాగు విచారిస్తారు. సావకాశముగా మామగారు ఒక్క ఘంట కూర్చుంటే కన్యాశుల్కమూ, శిశువివాహమూ కూడదని లెక్చరు ఇచ్చి ఒక నిముషములో ఆయన మనసును మళ్ళించి వేస్తాను.

**కరటక :** (తనలో) నీవు వొక ఘంట లెక్చరు యిస్తే నీ వంటిమీద అతను రెండు ఘంటలు లెక్చరు ఇస్తాడు. (బిగ్గరగా) అమ్మీ నేనొక సలహా చెపుతాను యీలాగురా. (ఇద్దరును వెళ్ళిపోవుచున్నారు)

**గిరీశ :** మైడియర్ షేక్స్పియర్! మీఫాదర్ అగ్గిరాముడోయి, మీ ఇంట్లో యెవళ్ళకీ అతనిని లొంగదీసే యలొక్వెన్సు లేదు. నా దెబ్బ చూడు యీవేళ యేమిచేస్తానో. వీరేశలింగం పంతులుగారు కన్యాశుల్కము విషయమై వ్రాసిన పాంప్లెట్ ట్రంకులోనుంచి తియ్యి. మామగారికి లెక్చర్లు ఇవ్వడానికి కత్తీ ఖటార్నూరాలి.

**వెంకటే:** మీ లెక్చరు మాట ఆలాగుండనీండిగాని యీవేళ నాగండము గడిచినది గదా అని సంతోషిస్తూన్నాను. మీరు రాకపోతే మా తండ్రి పెయ్యకట్టుతాడు పట్టుకుని పరీక్ష ఫెయిల్ అయినందుకు చెమడాలు యెక్కకొట్టి వేసును. క్రిందటి మాటు కిసిమిసు శ్శెలవులలో తిన్నదెబ్బలు యిప్పటికి మరిచిపోలేదు.

గిరీశ : యిలాంటివి తప్పించుకోవడమే ప్రజ్ఞ. యేమైనా డిఫికల్టీ వచ్చినపుడు ఒక రస్సా వేసినామంటే బ్రహ్మ భేద్యముగా ఉండవలెను. పొలిటిషన్ అంటె మరేమిటనుకున్నావు, పూజా నమస్కారాలు లేక బూజెక్కి వున్నాను గాని మన కంట్రియే ఇన్‌డిపెండెంటు అయిపోతే గ్లాడ్‌స్టన్ లాగు దివాన్‌గిరీ చెలాయిస్తును. ఏమివాయి మీ తండ్రి వైఖరి చూస్తే పుస్తకాలకి సొమ్మిచ్చేటట్టు కనబడదు. చుట్టలు పట్నమునుంచి అరకట్టే తీసుకుని వచ్చినాను.

వెంకటే: నాన్న యివ్వకపోతే అమ్మనడిగి పుచ్చుకుంటాను.

గిరీశ : యూ ఆర్ ఏ వెరి ఇన్‌టిలిజెంటు బోయ్. దట్ ఇజ్ ది ప్రాపర్‌వే. యూ విల్ వన్‌డే బికమ్ ఏ గ్రేట్ పొలిటిషన్.

(బుచ్చమ్మ ప్రవేశించును.)

బుచ్చమ్మ: తమ్ముడూ అమ్మ కాళ్ళు కడుక్కోమంటూంది.

గిరీశ : (తనలో) హౌ బ్యూటిఫుల్ క్వైట్ అనెక్స్‌పెక్టెడ్.

బుచ్చమ్మ: అయ్యా మీరు చల్దివణ్ణము తించారా.

గిరీశ : నాట్‌ది స్లైటెస్టు అబ్‌జెక్షన్. యెంతమాత్రమూ అభ్యంతరము లేదు. మీరే వడ్డిస్తారా యేమిటి?

బుచ్చమ్మ: మీకు ఆలిశ్యం వుందా.

గిరీశ : నాట్ ది లీస్టు. యెంతమాత్రమూ ఆలిశ్యములేదు. వడ్డించెయ్యండి. ఇదిగో వెళ్ళి పోవస్తాను. తోవలో యేటివద్ద సంధ్యావందనమూ అదీ చేసుకున్నాను.

(బుచ్చమ్మ నిష్క్రమించుచున్నది.)

గిరీశ :వాట్ యీవిడ మీసిస్టరా? తలచెడ్డట్టు కనబడుతున్నదే?

వెంకటే: అవును.

గిరీశ :ఇన్నాళాయి నీకు విడో మారేజి విషయమై లెక్చరిస్తూంటే ఈ కథ యెప్పుడూ చెప్పినావుకావు. మీ ఇంట్లోనే ఒక అన్‌ఫార్చునేట్ బ్యూటిఫుల్ యంగు విడో వున్నదోయి! మైహార్టు మెల్టుస్ నేనే తండ్రినైతే యెవరికైనా ఇచ్చి పెళ్ళిచేసేదును. (తనలో) ఇంత చక్కని పిల్లనెక్కడా చూడలేదు. పల్లెటూరు వూసుపోదనుకున్నాను గాని కాంపేన్ ఓపెన్ చేసి పని జరిగించడముకు మంచాపర్చూనిటీ యీ పల్లెటూరిలో కూడా తటస్తించడం నా అదృష్టం. (పైకి) మీ సిస్టర్‌కి చదువు వచ్చునా.

**వెంకటే** :రాదు.

**గిరీశ** :(తనలో) అయితె లవ్ లెటర్సు ద్వారా కథనడిపించడముకు వీలులేదు.

(కరటకశాస్త్రి ప్రవేశించుచున్నాడు.)

**కరటక**: మీకోసం వడ్డించి బుచ్చమ్మ కనిపెట్టుకవున్నది.

**గిరీశ** :యిదిగో వస్తున్నాను. (అని గిరజా సవరించుకొనుచు మీసములు కీటుకొనుచు లోపలికి వెళ్ళుచున్నాడు.)

(వెంకటేశ్వర్లు కూడా అతనితో వెళ్లుచున్నాడు)

**శిష్యుడు** : (తెరలో తేనిచి)

సతత్రమంచేషు – మంచేషా కుంచేషా?
పుస్తకం చూడాలి
సతత్ర మంచేషు
సతత్ర మంచేషు
సతత్ర మంచేషు
సతత్ర మంచేషు – మూడు పర్యాయములు వల్లెవేయడమైనది.
మనోజ్ఞ వేషాం
మనోజ్ఞ వేషాం
మనోజ్ఞ వేషాం
యింతసేపటికి పట్టుపడినది (కలిపి చదువుచున్నాడు)
సతత్రమంచేషు మనోజ్ఞ వేషాం,

సహ – ఆ రఘు మహారాజు, తత్ర – అక్కడ, మంచేషు – మంచం అంటే మంచంగదా, "షూ" మాటకేమి. మనోజ్ఞ –మనోజ్ఞ మయినషువంటి, వేషాం – అక్కడ నట్టిపోయినది.

యిది మా నాటకంలో వేషమో భాగవతవేషమో తెలియకుండా వున్నది. గురువుగారి నడగవలెను (ప్రవేశించుచున్నాడు)

**కరటక**: అబ్బీ కొత్త శ్లోకము చెప్పనటరా?

**శిష్యుడు**: పాతశ్లోకము రువ్వేశాను.

**కరటక** : అయితే రెండు చిడప్పొక్కులు గోకు. (గోకుచున్నాడు)
యేదీ చదువు శ్లోకము.

**శిష్యుడు**: ఉదయానికి సాపుగా వచ్చింది గాని చల్దివణ్ణం తినగానే అడుగునపడి తెమలకుండా వున్నది. రాత్రల్లా రువ్వుతూనే ఉన్నాను. మీ చిడప్పొక్కులు గోకుతూ మీతో దేశాలంట తిరగడమే కాని మరి నాకు చదువు వచ్చేటట్టు కనపడదు.

**కరటక**: (తనలో) నీ ఆసక్తి నా శ్రద్ధ వక్కలాగే వున్నాయి. నీ బుద్దులు చూస్తే కిందను పెడితే పంటా మీదినిపెడితే వానా లేకుండా వున్నది. (ప్రకాశంగా) చదువు యెందుకురా అబ్బీ? పొట్ట పోషించుకోవడం కోసం గదా? నీకు మా అమ్మినిచ్చి పెళ్ళిచేస్తాను. నీకు పెళ్లికాదన్న భయం అక్కరలేదు.

**శిష్యుడు**: యన్ని వందలు పుచ్చుకుని కన్యాదానం చేస్తారేమిటి?

**కరటక**: నీదగ్గిర డబ్బు పుచ్చుకుంటానా? ఆ ఆచారం మా యింటా వంటా కూడా లేదు. ఒక పాతికభూమి పిల్లకు వ్రాసి యిచ్చేస్తాను.

(శిష్యుడు సంతోషమును దెలుపుడు చేయునటుల వికాసముగా ముఖము పెట్టుచున్నాడు)

గాని నేను చెప్పినపని అల్లా చేస్తూ గురుభక్తితో వుండాలి

**శిష్యుడు**: మీరు చెప్పినపని యెప్పుడు చెయ్యలేదు?

**కరటక**: యీవేళ చిన్నమ్మి వివాహం విషమై జరిగిన చర్చ విన్నావుగదా – లుబ్ధావధానులు సంబంధం జరగకుండా చెయ్యవలెను. నీకు ఆడవేషం వేసి తీసుకవెళ్లి అతనికి పెళ్లి చేస్తాను. నీకు మన మహారాజావారి నాటక కంపెనీలో ఆడపిల్ల వేషం అలవాటే గనుక యవరూ భేదించలేరు. ఈడున్నా పొట్టిగా కూడా వున్నావు. ఆడవేషంతో నిన్ను చూచిన తరువాత లుబ్ధావధానులు తప్పకుండా నిన్ను పెళ్ళాడడానికి వప్పుకుంటాడు.

**శిష్యుడు**: యిదెంతపని.

**కరటక**: గాని బహుజాగ్రత్తగా వుండాలి. ఏమయినా వ్రాత ప్రోతం వచ్చిదంటే కొంప మునిగిపోతుంది. పదిరోజులు వాళ్ళయింట్లో వుండి యిల్లు గుల్లచేసి గందర గోళం పెట్టివెళ్ళిపోయి రావలెను. మల్లవరంలో నీకోసం కనిపెట్టుకుని వుంటాను.

**శిష్యుడు**: మీరు చెప్పిన దానికంటె యెక్కువ చేసుకు వస్తాను.

**కరటక**: యీ పనిలో నేను చెప్పిన ప్రకారం నడుచుకుంటే తప్పకుండా నీకు గొప్ప వుపకారం చేస్తాను. మా పిల్లని కన్యాదానం చేసి నిన్ను యిల్లరికం వుంచుకుంటాను.

**శిష్యుడు**: మీరే తల్లీ దండ్రీ అని మొదటినుంచీ ఆలోచించుకుంటూనే వున్నాను. మీ ఆజ్ఞకు యెప్పుడూ మీరేవాడిని కాను.

**కరటక**: ఏదీ శ్లోకం చదువు.

**శిష్యుడు**: సతత్ర మంచేషు మనోజ్ఞవేషాం.

(తెర దించవలెను)

# కన్యాశుల్కము

## ద్వితీయాంకము

### ఒకటవ స్థలము - అగ్నిహోత్రావధాన్లుగారి యింటియెదుటివీధి.

(గిరీశ, వెంకటేశ్వర్లు, ప్రవేశించుచున్నారు.)

**వెంకటే:** నిన్నరాత్రి కన్యాశుల్కముమీద లెక్చరు యిచ్చారా?

**గిరీశ** : లెక్చరేమిటోయి ధణుతు ఎగిరిపోయినది. మీ తండ్రిది మైరావణచరిత్రోయి. మీ అంకుల్ కరటకశాస్త్రి స్కౌండ్రల్‌లాగ కనబడుతున్నాడు.

**వెంకటే:** ఏమి జరిగిందేమిజరిగిందేమిటి?

**గిరీశ** : రాత్రి భోజనాలవేళ లెక్చరు ఆరంభించమని రోజల్లా బురిడీలు పెట్టి నేను సబ్జక్టు అందుకునేటప్పటికి తనుకూడా సపోర్టుచేస్తానన్నాడు గాని నాకు మీ తండ్రివైఖరీ చూస్తే లెక్చరు ఆరంభిద్దామని నోటికొసకి అక్షరము వచ్చి జంకి మళ్లీ వూరుకుంటూ వుండేవాడిని. తుదకు పెరుగూ అన్నము కలుపుకునే వేళకు యిక టైమ్ మించిపోతుందని ఆరంభించాను ఇంకా ఇన్‌ట్రడక్షన్ రెండు సెన్‌టెన్‌సెస్ చెప్పలేదు నాలుగు ఇంగ్లీషుమాటలు దొర్లేయి దాంతో మీ తండ్రి గుడ్లు యర్రచేశి ఈ వెధవ యింగ్లీషు విద్యనుంచి బ్రాహ్మణ్యం చెడిపోతున్నది దేవభాషలాగ భోజనాలదగ్గిరకూడా ఆ మాటలే కూస్తారు, సంధ్యా వందనము పురుషసూక్తము శ్రీసూక్త పారాయణ తగలబడి పోయినది కదా అని గట్టిగా కేకలు వేశేటప్పటికి నేను కొంచము పస్తాయించి థ్రోయింగ్ పెర్ల్స్ బిఫోర్‌స్వైన్ అనుకుని కరటశాస్త్రులు ఏమయినా హెల్పు చేస్తాడేమో అని అతనివైపు చూశాను. వులకలేదు పలకలేదు సరేకదా మొఖమటు తిప్పేసి కడుపు పగిలేటట్టు నవ్వుతూ కూర్చున్నాడు. యిక లెక్చరు వెళ్లిందికాదు సరే కదా నోటిలోకి ముద్దకూడా వెళ్లిందికాదు. ఛీ యింత ఇన్‌సల్టు జరిగిన తరువాతను తక్షణం బయలుదేరి వెళ్ళిపోదామనుకున్నాను.

**వెంకటే:** అయ్యయ్యో వెళ్లిపోతారా యేమిటి?

**గిరీశ** : నాట్ ఇన్ ది లీస్ట్. కొసాకు విను నీ తండ్రిని అప్పుడే పోకట్‌లో వేశాను.

**వెంకటే:** అయితే మరి లెక్చరు ఇచ్చి పెళ్లి తప్పించేస్తామన్నారే.

**గిరీశ** : పెళ్లి ఆపడానికి బ్రహ్మశక్యంకాదు. డిమోస్తనీస్ సురేంద్ర నాథ్ బానర్జీ వచ్చి చెప్పినా కాని నీ తండ్రి ఆ పెళ్లి మానడు. లెక్చరెంతసేపూ సిటీలలోనే కాని పల్లెటూళ్లలో పనికిరాదు. పూనాలాంటి సిటీలో లెక్చరు ఇచ్చామంటే టెన్‌థౌజండు పీపిల్ వినడానికి

వస్తారు. మన టౌన్‌లోనే పెద్ద మీటింగులు చెయ్యాలంటే డప్పులు బజాయించి నోటీసులు కట్టి బాజారులు కాసి తోవంట వెళ్లిపోయే వాళ్లందరినీ యీడ్చుకుని వచ్చినాకాని వక యాభై మందికారు. పల్లెటూరి పీపిల్ లెక్చరుకు అన్‌ఫిట్. మొన్న మనము వచ్చిన బండివాడికి నేషనల్ కాన్‌గ్రెస్ విషయమై రెండు ఘంటలు లెక్చరు యిచ్చేసరికి ఆ గాడిదకొడుకు వాళ్ల వూరు హెడ్‌కానిస్టేబులుని కాన్ గ్రెస్‌వారు యెప్పుడు బదిలీ చేస్తారని అడిగాడు. విలేజస్‌లో లెక్చర్లు యంతమాత్రం కార్యంలేదు. నీ తండ్రిదగ్గిరమాత్రం లెక్చరు అన్న మాటకూడా అనకు.

**వెంకటే**: అయితే ఆయన్ని ఏలాగు జేబులో వేశారేమిటి?

**గిరీశ** : అది పోలిటిక్సు దెబ్బోయ్! ఆ తరువాత కథవిను. నా మీద కేకలు వేశిన తరువాత కోపం అణక్క ధుమధుమలాడుకుంటూ పెరుగూవణ్ణం కుమ్మడం ఆరంభించాడు. యింతట్లో మీ అప్పవచ్చి గుమ్మందగ్గర నిలువబడి కోకిలకంఠంతో నాన్నా తమ్ముడికి పెళ్లి చెయ్యాలంటె నా సొమ్ముపెట్టి పెళ్లిచెయ్యండి గాని దాని కొంపదీసి చెల్లెలని లుబ్ధావధానులకి ఇవ్వవద్దని చెప్పింది. దానితో వుత్తరవుపోసనం పట్టకుండానే ఆ పెరుగూ అన్నం విస్తరి తీసుకువెళ్ళి దానినెత్తిమీద రుద్దేశాడు. కరటకశాస్త్రుల్లు అడ్డపడబోయేటప్పటికి చెంబులో నీళ్లు అతనినెత్తిమీద దిమ్మరించాడు. దానితో కోపంవచ్చి కరటకశాస్త్రుల్లూ అతని శిష్యుడూ అప్పుడే బయలుదేరి వాళ్ల వూరికి వెళ్ళిపోయినారు.

**వెంకటే**: ఇదేనా ఏమిటి మా నాయన్ని జేబులో వేశెయ్యడం?

**గిరీశ** : కొసాకు విను మరి కరటకశాస్త్రుల్లు స్కౌండ్రల్ వెళ్ళిపోయాడని సంతోషించాను కాని మీ సిస్టర్ ఫేట్ విషయమై మహా విచారమయినది. నేనే దాని హజ్‌బెండ్ అయినట్టయితే నీ తండ్రిని నిలబడినచోట రివాల్వర్‌తో షూట్ చేసేదును. మీ అమ్మ ఏడుస్తూ వకమూల కూర్చున్నది. అప్పుడు నేను నీళ్ల పొయిలో నిప్పువేశి నీళ్లుతోడి మీ సిస్టరుని తీసుకువెళ్ళి స్నానం చేయించినాను. ఇంతట్లో మీ తండ్రికి పశ్చాత్తాపము వచ్చి నేను అరుగుమీద పక్కవేసుకుని పడుకుంటే మాటల్లో పెట్టి తెల్లవారినదాకా నిద్దరపట్టనిచ్చాడుకాడు, మొత్తము మీద కత్తుకలిపేసినాడు. అతను చెప్పినదానికల్లా సహీచేశాను. కరటక శాస్త్రుల్లు మీదమట్టుకు గట్టిగా బజాయించేశాను. మొత్తముమీద ఇన్‌ఫెంటు మేరియేజి బాగా ఆలోచిస్తే కూడును అని తోస్తున్నది.

**వెంకటే**: ఇన్నాళ్లూ కూడదని చెప్పేవారే నాతోటి?

గిరీశ : ఒపీనియన్సు అప్పుడప్పుడు ఛేంజిచేస్తూ వుంటేనే కాని పొలిటిషన్ కానేరడు. నాకు తోచిన కొత్త ఆర్గ్యుమెంటు చూచావా? ఇన్‌ఫెంట్ మేరియేజి వుంటేనే కాని విడోస్ అట్టే వుండరు. విడోస్ వుంటేనే కాని విడోమేరియేజి రిఫారము కాదుగదా. సివిలిజేషను కల్లా ఎసెన్షియల్ విడోమేరియేజే. కన్యాశుల్కము తప్పులేదనికూడా ఇప్పుడు నేవాదిస్తాను.

వెంకటే: యేలాగేమిటి?

గిరీశ : కన్యాశుల్కములేని మేరియేజి వుందిటోయి లోకంలోను డబ్బుపుచ్చుకుంటే నేమి, సరుకులు పుచ్చుకుంటేనేమి, లేక ఇంగ్లీషువాళ్లలాగ సెటిల్ మెంటు చేస్తేనేమి, ఈ ఆర్గ్యుమెంటు రాత్రి మీ నాన్నతో చెప్పేటప్పటికి చాలా సంతోషించాడు.

వెంకటే: రాత్రి యింకా యేమి మాట్లాడారేమిటి?

గిరీశ : నీకు జడ్జీపనిదాకా చదువు చెప్పించేస్తానన్నాడు. పుస్తకాల సంగతి కదిపాను గాని, పెళ్లినుంచి వచ్చిన తరువాత యిస్తామన్నాడు. ఈ లోగా సిగర్స్ లేకపోతే గుడ్లెక్కొస్తాయి. పట్నం నుంచి తెచ్చిన అరకట్టా ఆయిపోయింది. దొంగ తనంగా చుట్టకాల్చుకుందామని రాత్రి పక్క వీధరుగుమీద వేసుకుంటే మీ తండ్రి కూడా బిచాణా అక్కడే వేశాడు. సిగర్స్‌కోసం యేమయినా కాపర్స్ సంపాదించావా లేదా?

వెంకటే: లేదు – ఈ వుదయమల్లా అమ్మ, ధుమ ధుమలాడుతున్నది. పొడుంకోసం మా నాన్న కొట్టులో నిలవచేసిన పొగాకులోది వక కట్ట వోణీలో దాచి పట్టుకొచ్చాను.

గిరీశ : దటీజ్ పోలిటిక్స్ మైడియర్ బోయ్! మరి యింతసేపూ చెప్పావుకావేమి – చుట్టలు చుట్టుకుని ఈ కోవిలగోపురంలో కూర్చుని కాల్చుకుందాము.

వెంకటే: కోవిలలో చుట్టకాల్చవచ్చునా?

గిరీశ : కాలుస్తే కోవిలలోనేకాల్చవలెనోయి – దీని పొగముందర సాంబ్రాణీ, గుగ్గిలంయేమూల. యేదీ కట్ట యీలాగునతే (అని యందుకొని వాసనచూచి) హా యేమి పొగాకోయి – నిజంగా కంట్రిలైఫులో చాలా చమత్కారం వున్నది. బెస్ట్ టొబాకో – బెస్టు గేదెపెరుగు, మాంచి ఘీ అంచేతనేనోయి పొయట్సు కంట్రీలైఫు కంట్రీలైఫు, పేస్టొరల్ లైఫ్ అని దేవులాడుతారు?

వెంకటే: మీరూ పోయట్సేకదా?

గిరీశ : అందుకు అభ్యంతరంయేమిటి? నాకు కంట్రిలైఫు యిష్టమే గాని సీమలోలాగ బ్యూటిఫుల్ షెప్పర్డెసెస్, లవ్ మేకింగూ వుండదోయి – గ్రాస్గర్లు తగు మాత్రంగా వుంటారుకాని మాడర్టీస్మెల్, అదొకటిన్నీ మనదేశంలో మెయిడ్సువుండరోయి చిన్నప్పుడే మేరీచేస్తారు. యిక నెంతసేపూ లవ్ మేకింగ్ విడోసుకి చెయ్యాలిగాని మరి సాధనంలేదు.

**వెంకటే**: మీరు విడోసుమీద వ్రాసిన పోయిట్రీ యిస్తామన్నారు. ఒకమాటూ చదివారుకాదు.

**గిరీశ** : అది నేను రిఫార్మర్‌లో అచ్చువేయించేసరికి టెన్నిసన్ చూచి గుండె కొట్టుకున్నాడు. మైమదర్ అనేటటువంటి పోయిట్రీ నీకు వచ్చునా?

**వెంకటే**: వచ్చును. బారోసు రీడరులో చదివాను.

**గిరీశ** : దానికి పాఠాంతరంగా నేను పోయిట్రీ చేశాను. నోటుబుక్కూ పెన్సలూ తీసుకో (అని చుట్ట కాల్చుచు మధ్య మధ్య చుట్ట చేతపట్టుకుని యొక్కొక్క ముక్క చెప్పుచుండగా దానిని వెంకటేశ్వర్లు వ్రాయును)

**The Widow**

She leaves her bed at A.M.four,
And sweeps the dust from off the floor,
And heaps it all behind the door,
The Widow!

Of wond'rous size she makes the cake,
And takes much pains to boil and bake,
And eats it all without mistake,
The Widow!

Through fasts and feasts she keeps her health,
And pie on pie she stores by stealth,
Till  all the town talk of her wealth
The Widow!

And now and then she takes a mate,
And lets the hair grow on her pate,
And cares a jot what people prate,
The Widow!

I love the widow - however she be,
Married again - or single free,
Bathing and praying,
A model of saintliness,
Or model of comeliness,
What were the earth
But for her birth?

The Widow!

(చుట్టపారవేశి) యింటికి పోదాము పద చాలా సేపయి పోయింది. (అని నాలుగడుగు లిద్దరు నడచునప్పటికగ్నిహోత్రావధానులు ప్రవేశించి)

**అగ్నిహో** :ఏమండీ రాత్రి మనమనుకున్న ప్రకారం మన దావాలు గెలుస్తాయనే మీ యభి ప్రాయమా?

**గిరీశ** : అవి గెలువకపోతే నేను చెవి కదపాయించుకుని వెళ్లిపోతాను. బుచ్చమ్మ గారి భూముల తగాయదా విషయమై జబ్బల్‌పూర్ హైకోర్టు తీర్పు స్పష్టముగా వున్నది. మా పెత్తండ్రిగారు యీలాటి కేసే వకమాటు గెల్చారు.

**అగ్నిహో** :దీనికల్లా వచ్చిన అసాధ్యం –పార్వతీపురం కోర్టులో దావా తేవడానికి వీలులేకపోయింది. భూములలో చాలాభాగము అమలాపురం తాలూకాలో వున్నాయి గనుక, కేసు ఆ కోర్టులో తేవలసివచ్చింది. కరటకశాస్త్రుల్లని మళ్లీ పంపించాలని అనుకుంటూ వుండే వాడిని కాని, వాడు వట్టి అవకతవక మనిషి, యెడదిడ్డం అంటే పెడదిడ్డం అంటాడు, వాడు వెళితే కేసు చెడిపోవడానికి అభ్యంతరంలేదు. కేసు యవడో చవల వకీలుకి అప్పగించాడు.

**గిరీశ** : మీ శలవయితే నేను వెళ్ళి ఆ వ్యవహారం అంతా చక్కపెట్టుకు వస్తాను. మా పెత్తండ్రిగారు అమలాపురం మునసబు కోర్టులో కల్లా పెద్దప్లీడరు. ఆయన పట్టినకేసు యప్పుడూ పోవడం లేదు.

**అగ్నిహో** : మీరు వెళ్లితే నేను వెళ్లినట్లే – యెంత ఫీజు అయినా మీ పెత్తండ్రిగారికే వకాల్తీయిస్తాను.

**గిరీశ** : మీ దగ్గర ఫీజు పుచ్చుకోవడం కూడానా? ఖర్చులు మట్టుకు పెట్టుకుంటే వక్కదమ్మిడీ యైనా పుచ్చుకోకుండా పనిచేస్తారు.

(బుచ్చమ్మ ప్రవేశించి)

**బుచ్చమ్మ**: నాన్నా అమ్మ మడికట్టుకోమంటున్నాది.

(అని బుచ్చమ్మ వెళ్లిపోవుచున్నది)

(గిరీశం క్రేగంటను జూచును)

**అగ్నిహో** :భోజనం చేసిన తరువాత కాయితాలు మీ చేతికి యిస్తాను. అవన్నీ సావకాశంగా చూడండి. మా యింటిపొరుగు సూరావధానులకీ మాకు మందడి గోడ విషయమై తెచ్చిన దావాలో మనమీద అన్యాయముగా లంచము పుచ్చుకొని మునసబు తీర్పు చెప్పితే జడ్జీ కోర్టులో అప్పీలు చేసినాను. దానికింద నాలుగువందల రూపాయిలు అయి పోయినవి. మీ వంటి వారు నాకు చెయ్యాసరా వుంటే సూరావధానుల పిలక వూడ దీసేదును. క్రిమినల్‌కేసు తెమ్మని కూడా మా వకీలు సలహా యిచ్చాడు. మీరే మంటారు.

(బుచ్చమ్మ తిరుగ ప్రవేశించి భోజనమునకు బిలుచును)

**అగ్నిహో** :వెధవముండాసొద – పెద్దమనిషితో వ్యవహారము మాట్లాడుతూవుంటే రామాయణంలో పిడకల వేట్లాటలాగ అదే పిలవడం.

**గిరీశ** : తప్పకుండా తేవలశినదే. దానితోకాని వాడికి శాస్తికాదు. 1572వ శక్షన్ ప్రకారం నెగోషియబిల్ ఇన్‌స్ట్రుమెన్‌ట్సుఆక్టు తెచ్చేదీ జయిలులోపెట్టించేసేదీ. తగాయిదాస్థలం చూచినాను గనుక జల్లీలు తెగ పొడిచేసేటట్టు సాక్ష్యం పలికేస్తాను. ఈ గోడచూస్తే తప్పకుండా మీదయినట్టే అగుపడుతూవున్నది.

**అగ్నిహో** :అందుకు సందేహం ఏమిటండి? పెరటిగోడకూడా చూదాము యీలాగు రండి. (అని నిష్క్రమించుదురు).

★★★

## రెండవ స్థలము – రామచంద్రపురం అగ్రహారం రామప్పంతులు ఇల్లు.

(రామప్పంతులు – మధురవాణి ప్రవేశించి)

**మధు** : లుబ్దావధాన్లుని పెళ్ళికి యలా వొప్పించారేమిటి?

**రామ** : కట్టా విప్పా సమర్థుణ్ణి, నాకు యిదొకకష్టమయిన పనా!

**మధు** : అయినా చెబుదురు.

**రామ** : సిద్ధాంతిద్వారా హికమతంతా చేశాను. వాడు వెళ్ళి జాతకంలో వివాహయోగం వుందని, పిల్ల మహాపతివ్రత అవుతుందని, అది ఇంట్లో కాలుపెట్టిన దగ్గిరనుంచి యిల్లంతా బంగారంతో నిండిపోతుందని చెప్పాడు, నేను వెళ్ళి మీనాక్షి యిల్లు గుల్లచేసేస్తూందని, దానివల్ల యప్పటికైనా ముప్పువుందని చెప్పినాను. దానితో మనసు కుదిరింది. గాని చలచిత్తం ముండాకొడుకు, డబ్బు ఖర్చవుతుందని అడుగడుక్కీ వెనకతీస్తుంటాడు. యీ వివాహంలో నీకు బాగా డబ్బు యిప్పిస్తాను. యిది అంతా నీకోసమే.

**మధు** : మీమాయలు నాకు తెలియవా యేమిటి? లుబ్ధావధాన్లుకు పెళ్ళి చెయ్యడం మీకోసమే, అంచేత నాకు మనస్కరించకుండా వున్నది.

**రామ** : మైడియ్యర్ – అలాంటి అన్యాయం మాటలు ఆడకు. నిన్ను చూచిన కంటితో మరి వక్కర్తెను చూస్తే – మొత్తెయ్యాలని బుద్ధిపుడుతుంది. (అని ముద్దు పెట్టుకొనును)

(తెర దించివెయ్యవలెను.)

★★★

మూడవ స్థలము - రామచంద్రపురపగ్రహారములో లుబ్ధావధానులుగారి యిల్లు

(లుబ్ధావధానులు, రామప్పంతులు ప్రవేశించుచున్నారు.)

**లుబ్ధావ:** ఏమండి రామప్పంతులుగారూ వివాహానికి యాభై రూపాయీలు ఇస్టేమెంటు చేసినాను.

**రామప్ప:** నీగుణం నీవు పోనిచ్చుకోవు గదా మామా? లోకంలో యేమనుకుంటారో అన్నభయం యీషత్తైనా లేదు.

**లుబ్ధావ:** లోకంలో యేమనుకుంటే నాకేం కావాలి? మీరు ప్రోద్బలంచెయ్యబట్టి పద్ధెనిమిదివందల రూపాయీలు ఇవ్వడానికి వప్పుకున్నాను గాని. లేకుంటే యిప్పుడంత సొమ్ము అప్పుచేసి తెచ్చినదాకా నాకు ఏమిపట్టింది.

**రామప్ప:** వేషాలు వెయ్యకండి. పాతులో రెండు సంచీలు తియ్యరాదా - మీరు పెళ్ళిచేసుకుని నన్ను వుద్ధరించినట్లు మాట్లాడుతారేమిటి - మీరు పెళ్లాడే పెళ్లాము నా యింట్లో వచ్చి కాపురం చేస్తుందా ఏమిటి.

**లుబ్ధావ:** యిపుడు అంటే అన్నారు కాని పాతు, పాతు, అంటూ వుండకండి పాతువుంటే పురిల్లు ఖర్మమేమి - ఆ యాభయి రూపాయీలు మీచేతికి ఇస్తాను కటాక్షించి అది దాటకుండా అంతతో సరిపుచ్చుతే మీకు చాలా పుణ్యం వుంటుంది- డబ్బు తేవడమంటే బహు ఇబ్బందిగా వున్నది.

**రామప్ప:** ఆ యాభయికి మరి వకసున్నాచుట్టి నాచేతికి యివ్వండి. అతిక్లుప్తంగాను విశేషవ యిభవం గాను, వివాహంచేస్తాను. మీకేమీ శ్రమ లేకుండా అన్ని సప్లయిలు చేస్తాను.

**లుబ్ధావ:** అయిదువంద లెక్కడ వస్తాయేమిటి? పెళ్ళిలేకపోతె మానిపోయె.

**రామప్ప:** ఇప్పుడు వద్దన్నా మానదు. ప్రధానమయిన తరువాత చేసుకోకపోతే అగ్నిహోత్రావధానులు మహా చెడ్డవాడు. లా, బాగా తెలుసును. అయిదువేల రూపాయీలు డేమేజికి దావాతెస్తాడు.

**లుబ్ధావ:** నీనించే ఈ చిక్కంతా నాకు వచ్చినది.

**రామప్ప:** చక్కని పెళ్ళాము యింటికి వస్తూవుంటే చిక్కేమిటయ్యా, వెర్రి బ్రాహ్మడా! ఆడపిల్లను అమ్మిన సొమ్ము ఏమయినది. యాభయిఏళ్ళాయి వడ్డీ వ్యాపారము చేస్తున్నావు. యెప్పుడయినా నూటికి నెలకు - మూడు రూపాయిలకు తక్కువ వడ్డీ పుచ్చుకున్న పాపాన్ని పోయినావా?

**లుబ్ధావ:** యాభైఏళ్లు - యాభై ఏళ్లు అంటూ వస్తావు. పెళ్లికూతురు వారితో యన్నేళ్ళు వున్నాయని చెప్పారేమిటి.

**రామప్ప:** నలభై రెండేళ్లు అని చెప్పాను.

**లుబ్ధావ:** ఒకటి రెండు హెచ్చుతగ్గుగా అంతేసుమా నా వయస్సు ప్లవసంవత్సర శ్రావణమాసము ఏదీ లెక్కపెట్టండి.

**రామప్ప:** (తనలో) ముసలిగాడిదకి ఏమి అభిమానము (పైకి) సర్వజిత్తు, సర్వధారి, విరోధి, క్రోధన, అక్షయ (అని నోటికి వచ్చినట్టల్లా గబగబ లెక్క పెట్టుచూ) ఆట్టేలేవు వచ్చే శ్రావణమాసానికి డెబ్భైతొమ్మిది వెళ్లిపోతాయి. నామాటవిను అయిదువందల రూపాయిలతో నిన్నొక దమ్మిడీ అడగకుండా సరపలాగి చేస్తాను. అంతా అమాంబాపతులు రెండువేల మూడువందల రూపాయిలతో ఇతి భాషామంజరి సమాప్తః అవుతుంది. ముందూ వెనకా చూడక పాతుతియ్యి.

**లుబ్ధావ:** అదుగో పాతు పాతు అంటారు గదా అసాధ్యము వచ్చింది. ఈ మాటు మళ్లీ ఆమాట అంటే మరి మీకూ నాకూ సరి. ఈలాగే నీవంటి మహాత్ములు యెవరో లేనిపోని మాటలు పోలీసుగారితో చెప్పి పన్నువేయించేశారు.

**రామప్ప:** యీ అలకలతో నాకేమీ పనిలేదు. నాద్వారా పని జరిగించవలసినదని మీకుంటే అయిదువందల రూపాయిలకి తక్కువకి నేను చెయ్యను. అంతకితక్కువైతే నా ప్రతిష్టకు లోపంవస్తుంది. మరెవరి చేతైనా చేయించుకోండి.

**లుబ్ధావ:** కోపము పడకండీ మామా. మీ మాట యెప్పుడు వినలేదు. డబ్బుతో సంబంధించిన పని గనుక ఇంత బతిమాలుకుంటున్నాను.

**రామప్ప:** బేరానికి నేను మనిషినికాను. శలవిప్పించండి.

(తెర దించివెయ్యవలెను)

★★★

## నాల్గవస్థలము – రామప్పంతులుగారి గృహము

(కరటక శాస్త్రులు, స్త్రీ వేషముతో శిష్యుడు, ప్రవేశించుచున్నారు.)

**కరటక:** అబ్బీ నేను చెప్పినదంతా నాటకంలో పాత్రలాగా అచ్చుకొట్టినట్టు చేసుకురావలెను. రవ్వంత పిసరు వాతప్రోతము వచ్చిందిరా అంటే మనపీకలు పోతాయి.

**శిష్య :** మీకెంత మాత్రమూ ఆ భయము అక్కరలేదు.

**కరటక:** (తలుపు దగ్గిరకు వెళ్ళి) ఇదేనా రామప్పంతులుగారి బస.

**రామప్ప**: (లోపలనుంచి) మీదియేవూరయ్యా?

**కరటక** : కృష్ణాతీరము. జటాంతస్వాధ్యాయిని.

**రామప్ప**: రామప్పంతులుగారు యింట్లో లేరు.

**కరటక** : మీరు వున్నారుగద.

**రామప్ప**: యెవరుంటే నేమిటి, యీ వేళ యేకాదశి వెళ్లిపొండి.

**కరటక** : తలుపుతీశివుంది; యిక మిమ్మల్ని బ్రతిమాలుకోవడమెందుకు? (అనిలోపల ప్రవేశించు చున్నారు)

**రామప్ప**: పీటవెయ్యవే, దయచేయండి.

**కరటక** : సాలిగ్రామాల వాసన కొట్టుతూంది యేమిటండోయి – యేకాదశన్నారే.

**రామప్ప**: వొళ్ళు, కారకంచేసి వున్నది. ఔషధంగా పుచ్చుకుంటూ వున్నాను. ఈ మాట యెక్కడా చెప్పకండి.

**కరటక** : మీ దయవల్ల భోజనం చేసినాను. ఒక ప్రయోజనం వుండి – వచ్చినాను.

**రామప్ప**: (తడక యవుతలనుంచి పైకివచ్చి చెయ్యి తుడుచుకొనుచు) దయచేయండి కుర్చీమీద – ఔనే, చుట్టలు పట్టుకురా. శాస్త్రుల్లుగారికి కూడా ఆకులు చెక్కలూ ఇయ్యి.

(సాని ప్రవేశించి)

**సాని** : నమస్కారమండీ పంతులుగారూ.

**కరటక** : ఇన్నాళ్ళకి జన్మసాఫల్యమయినది నన్ను పంతులుగారిని చేశావా.

**రామప్ప**: యేమండీ–ఇంగ్లీషు అభివృద్ధి అయిన దగ్గిరనుంచీ మన వైదీకులము కూడా పంతుళ్ల వారము అవుతున్నాము.

**కరటక** : నియ్యోగీవైదీకీ భేదమూ నాడీ భేదమూ శాస్త్రసిద్ధము కాదని విజయనగరము ఆనంద వర్ధనీ సమాజంవారు పరిష్కరించినారు.

**రామప్ప**: అందుకు సందేహమేమిటండీ. పేరుగొప్పా, ఊరుదిబ్బా అన్నట్టు యీ మార్థులు, ఈ కరణకమ్మలు, ఈ నియ్యోగులు, లౌక్యానికి మనవాళ్లతో పనికివస్తారండీ. యీ తాలూకాలో యే క్రిమినల్ కేసువచ్చినా నా సలహా లేనిదీ పని జరగదు. నియ్యోగి యేమిటి, వైదీకి యేమిటి.

**రామప్ప**: ఔనే. అద్దం పట్టుకరా.

(ఆమె తెచ్చి యద్దము చేతికివ్వగా దానినందుకొని చూచుకొనుచు మీసములు సవరించుకొనుచుండును.)

**కరటక**: లుబ్ధావధానులుగారికీ తమకీ చాలా స్నేహమటా? తమ మాట అడుగు దాటడని విన్నాను.

**రామప్ప**: ఆ గాడిదెకొడుకుకు ఒకడితో స్నేహమేమిటండీ, వాడి ప్రాణానికీ డబ్బుకీలంకె. డబ్బుకీ వాడికీ స్నేహముగాని మరియెవరితోనూ స్నేహములేదు. అయితే వాడికి వ్యవహార జ్ఞానం బొత్తిగా లేదు. కోర్టు అంటే భయపడతాడు. అంచేత నా సలహాలేక బతకలేదు.

**కరటక**: నేను కృష్ణాతీరమునుంచి వస్తున్నాను. భూములమీద చాలా ఋణం అయిపోయినది. ఈ పిల్లని నందిపిల్లిలో, వెంకటదీక్షితులు గారికి, పదిహేనువందల రూపాయిలకు అమ్మి ఆ ఋణం తీర్చుకోవాలని అంతా సిద్ధంచేసుకుంటే మాసంరోజులకు గాని, రూపాయిలు యివ్వలేమని ఆయన అన్నారు. పదిహేనవ తారీఖులోగా రూపాయిలు చెల్లకపోతే భూములు పోతాయి. ఇంతట్లో లుబ్ధావధాన్లుగారు వివాహప్రయత్నం చేస్తున్నారని విని ఆ సంబంధం మానుకుని యీలాగు వచ్చినాను. ఈ పిల్లను ఆయనకు అమ్మివేసి ఋణవిముక్తుణ్ణి కావలెనని ఆలోచిస్తున్నాను. ఇదిగాని సమకూరిస్తే మీకు పది వరహాల సొమ్ము దాఖలు చేసుకుంటాను.

**రామప్ప**: నలభై, యాభై రూపాయిల వ్యవహారాల్లోకి చొరబడే వాడనుకాను. అయినా మీరు దూరదేశమునుంచి వచ్చినారు. ఈపాటి ఉపకారం చేతునుగాని మించిపోయింది. పది రోజుల కిందటవస్తే అయిపోవును. అప్పుడే సంబంధం రహితమయినది. అయితే మీది యేనాడి?

**కరటక**: యేనాడి కావలిస్తే ఆనాడే అవుతుంది. మేము వెల్నాట్లం.

**రామప్ప**: చూచారా! అది వక వుపద్రం, వారు వేగినాట్లు – యెందుకయినా వేరే ఒక చోట ప్రధానం అయిపోయినది.

**కరటక**: ఈ కార్యం సమకూరిస్తే నాకు దొరికే దానిలో నాలుగోవంతు మీకిస్తాను.

**రామప్ప**: యెంతయిస్తేనేమిటి? మించిపోయినదని మనవి చేసినాను కానూ, ఇంకా మరి వకపని కావలిస్తే చేస్తాను. మీ భూములు తనఖా యిచ్చాం అన్నారు గదా, తనఖా దస్తావేజు చూపిస్తే, అది చెల్లకుండా సాక్ష్యం సంపన్నం సంపాదించి గ్రంథం చేయిస్తాను.

**కరటక**: సాక్షులు యెవరు దొరుకుతారండి?

**రామప్ప**: మధుపాడా, గరికివలసా, యింకా మరికొన్ని అగ్రహారాలూ వున్నాయి కావండీ, ఉర్లాం బసవరాజు గారి పద్దులెఖ్ఖే దొంగసాక్ష్యాలకు కూడా పనికివస్తుంది. కుండనాలుంటే పది. లేకుంటే ఆరు. నా తమాషా చూడండి యీ విషయంలో కావలిస్తే యాభయి సాక్ష్యాలు తీసుకువస్తాను. యీలాంటివి యెన్ని వ్యవహారాలు మోసేశానండీ.

**కరటక**: ఈ లండాచోరీలో దిగడానికైనా డబ్బుండాలి కదా? పిల్లకి యేలాగైనా పెళ్ళిచేస్తేనే కాని డబ్బు దొరకదు. టొంపలాగు యిది నాతో తిరుగుతూ వుంటే స్వేచ్ఛావుండదూ.

**రామప్ప**: మీకు దొరికేదానిలో సఘం రూపాయిలు యిస్తే వక తంత్రం చేసి వివాహం కుదురుస్తాను.

**కరటక**: సఘం మీకిస్తే నేను ఋణం యేమితీర్చుకోను.

**రామప్ప**: ఋణం తీర్చుకోనక్కరలేకుండా గ్రంథం జరిగిస్తానుగదా.

**కరటక**: (ఒక నిమిషమాలోచించి) అయితే కానియ్యండి. అంతా మీదే భారం, పిల్లదాని కలంకారం వుంపిస్తారా.

**రామప్ప**: ప్రయత్నం చేస్తాను కాని ఖరారు చెయ్యజాలను, వాడు పీసరికొట్టుముండా కొడుకు– అయినా నా ప్రతాపం చిత్తగించండి – అవునే కలం, కాయితం, సిరాబుడ్డీ తీసుకురా– (వ్రాయుచు గరటకశాస్త్రులవైపు జూచి) మీరు రేపు జాముురాత్రికి రండి.

★ ★ ★

**అయిదవస్థలము – లుబ్ధావధానులుగారి ఇల్లు, లుబ్ధావధాన్లు, రామప్పంతులు, మీనాక్షి, ప్రవేశించుచున్నారు.**

**రామప్ప**: అయితే మూడువందలకా సిసలు.

**లుబ్ధావ**: ఒక యాభై కొట్టివేస్తే బాగుండును.

**రామప్ప**: వక దమ్మిడీ తక్కువైతే నేను సరపలాగీ చెయ్యలేను. మరి యెవరిచేతనైనా చేయించు కోండి.

**లుబ్ధావ**: పోనీయండి నేనన్నమాటా వద్దు, మీరన్నమాటా వద్దు, ఒక పాతిక కొట్టి వేయండి.

**రామప్ప**: అయిదువందలల్లా, మూడువందలదాకా దించాను. ఇక వొక దమ్మిడీకొట్టేస్తే నాకీ వ్యవహారం అక్కరలేదు. అగ్నిహోత్రావధానులు మహా కోపిష్ఠిముండా కొడుకు, లాంఛనాలలో యేమిలోపం వచ్చినా వూరుకోడు.

(తెరలో) యిదిగో వుత్తరంబాబూ.

**రామప్ప**: యేవూరినుంచేమిటి.

**కూలివాడు**: కృష్ణారాయపురం అగ్ఘురారంనుంచి బాబూ.

**రామప్ప**: యిదిగో అప్పుడే మీ మామగారివద్దనుంచి వుత్తరాలు వస్తున్నాయి.

**లుబ్ధావ**: పంతులుగారూ చదవండి.

**రామప్ప**: (చదువుచున్నాడు)

శ్రీ వేదమూర్తులైన బ్రహ్మశ్రీ లుబ్ధావధానులుగారికి – త॥

మీకు విశేష వయస్సు లేదని మధ్యవర్తులు మభ్యపరచినందున మేము మీ సంబంధం చేసుకోవడంకు నిశ్చయించుకున్నాము. అయితే మీరు చాలా ముసలివాళ్లని మాకు తెలిసినందున, మీ సంబంధం మానివేయడమైనది – గనక, మీరు వేరే సంబంధం చూచుకోవచ్చును. మీరు మరి యెవరినీ యీలాగు దగాచెయ్యరని నమ్ముతాను.

అగ్నిహోత్రావధాన్లు వ్రాలు.

**లుబ్ధావ**: ముసలివాడనటోయి వీడమ్మ కడుపుకాల్చా.

**మీనాక్షి**: మరేమిటి కాకపోతే – అగ్నిహోత్రావధానులు తగినశాస్తి చేశాడు. యిపుడు పెళ్లెందుకు లేకపోతే.

**లుబ్ధావ**: అంతా నానోట్లో గడ్డిపెట్టేవారే.

**రామప్ప**: అమ్మీ – ఆడవాళ్లకీ వూసెందుకు అవతలికి వెళ్లూ.

(మీనాక్షి వ్రేళ్ళు విరచి వెళ్లిపోవును.)

యిది మించిపోతే వచ్చిన బాధేమిటి. అగ్నిహోత్రావధాన్లకు సిగ్గువచ్చేటట్టు దీనితాత సంబంధం మరివకటి చూస్తాను.

**లుబ్ధావ**: నా మాటవిని మరి యీ విషయమై మీరు శ్రమపడవద్దు. యీ ఖర్చు తప్పిపోయినదని సంతోషిస్తున్నాను.

**రామప్ప**: ఖర్చో, ఖర్చో అని యేడుస్తావు. నీ కూతురు సంసారం కొల్లబెట్టేస్తూవున్నది. ధాన్యం అమ్ముతుంది గదా? నాటి గందరగోళం అప్పుడు హేడ్డు కనిష్టీబుకు మూడువందలు దిమ్మరించకపోతే నిలబడ్డ మానాన్న అరదండాలు వేసేసునుగదా – యెప్పటికయినా యిది నీ పీకలమీదికి వున్నది. నీవు పెళ్ళి చేసుకుంటే నీవూ నీ పెళ్లామూ ఖులాసాగా వుండి దానిని వేరే కాపురం బెట్టవచ్చు. యిది యవరినైనా తీసుకుపారిపోతుంది.

**లుబ్ధావ**: చవకగా కుదిరేటట్టయితే మరివక సంబంధం చూడండి.

**రామప్ప**: పన్నెండు వందలకు కుదురుస్తాను – సమాధానమేనా?

**లుబ్ధావ**: వెయ్యికి కుదిరిస్తే మహాయుక్తంగా వుంటుంది.

**రామప్ప:** నీకు డబ్బుంటే మతిపోతుంది. అగ్నిహోత్రావధానులకు పద్దెనిమిది వందలు యివ్వడానికి వొప్పుకున్నావు. యిప్పుడు వెయ్యికి నన్ను కుదర్చమంటే నా శక్యమా. పన్నెండువందలకి తక్కువ కుదరదు.

**లుబ్ధావ:** తేలిపోయిన సంబంధము తేలేపోయింది. మళ్లీ నన్నెందుకు బాధపెట్టుతావు – మరి సంబంధము యెంతమాత్రమూ అక్కరలేదు.

**రామప్ప:** అగ్నిహోత్రావధానులు నిన్ను ముసలివాడని అగౌరవపరచిన తరువాత రెండువేలు ఇచ్చైనా పెళ్లాడకపోతే లోకం అంతా నవ్వుతారు. మీనాక్షివల్ల వచ్చే వుపద్రం మరచిపోకు, జాతకంలోకూడా రూఢిగా వివాహయోగం, ఆ భార్యామూలంగా గొప్ప ధనయోగం వుంది. నువ్వు అక్కరలేదంటే తప్పుతుందా.

**లుబ్ధావ:** అయితే సుళువుగా ఎక్కడైనా సంబంధము చూడండి.

**కూలిమనిషి:** చాలాశేపైంది. బత్తెఖర్చు ఇప్పించండి బాబూ.

**లుబ్ధావ:** ఈ శుభవార్తకా భత్యఖర్చు, వకదమ్మిడీ ఇచ్చేదిలేదు. ఇంకా శిగ్గులేక భత్యఖర్చు అడుగుతావు.

**కూలి :** ఆ వూసు నాకెందుకయ్యా. నా కూలి నేను నిలబెట్టి పుచ్చుకుంటాను.

**లుబ్ధావ:** రామప్పంతులుగారూ చూచారండి, యీ గాడిదకొడుకు పెంకితనం.

**కూలి :** మాటలు మిగల్నియ్యకండి, ఆ వెనక నేను వూరుకునేవాణ్ణికాను.

(తెర దించవలెను)

★★★

## ఆరవ స్థలము – లుబ్ధావధానుల యిల్లు

**కరటక:** (తెరవెనుకనుంచి) యత్రబాణా స్సం పతంతీ

**లుబ్ధావ:** యవరయా వారు?

**కరటక:** బ్రాహ్మలం మాది కృష్ణాతీరం తలుపు తీయించండి.

**లుబ్ధావ:** ఏమిటయ్యా వేదము మహావడిగా చదువుతున్నావు. నేను చదవలేనా యేమిటి. వేదము వొక దమ్మిడీ ఇవ్వదు. ఇంగ్లీషు చదువుకొండి.

**కరటక:** ఒక పనస వినుపించి వెళ్లిపోతాను.

**లుబ్ధావ:** నేను కావలిస్తే పది పనసలు చదువుతాను.

**కరటక:** అయితే తలుపుతియ్యవషయ్యా?

**లుబ్ధావ:** తీసేదిలేదు పంతులుగారి యింటికి వెళ్లండి.

**కరటక:** ఇది లుబ్ధావధానులగారి యిల్లుకాదూ.

**లుబ్ధావ:** ఇదికాదు, ఇదికాదు. అవతలవీధి.

**రామప్ప:** (తెర యవుతలనుంచి) అవధాన్లు మామగారూ

**లుబ్ధావ:** పంతులుగారా – యేమిటి యిలాగు వచ్చారు.

**రామప్ప:** కొంచెము పనివున్నది.

**లుబ్ధావ:** మీకు రోజూ రెండురఝాముల రాత్రప్పుడు పనిగలిగే వుంటూ వుంటుంది. నేనెంతమాత్రం వప్పేదిలేదు.

**రామప్ప:** ఇందాకా మన మనుకున్న ప్రకారం వ్యవహారం ఒకటి ప్రశస్థంగా కుదిరింది.

**లుబ్ధావ:** ఊఁ అలాగనా? సరే. అమ్మీ తలుపుతియ్యవే.

(మీనాక్షి ప్రవేశించి తలుపు తీయుచున్నది.)

**రామప్ప:** ముండాకొడుకు ఎన్ని గడియలు వేశాడయ్యా.

(రామప్పంతులు, కరటకశాస్త్రులు, ఆడువేషముతో శిష్యుడు, ప్రవేశించుచున్నారు.)

**లుబ్ధావ:** దయచెయ్యండీ అవధానులుగారూ దయచెయ్యండి. ఈ పిల్ల మీ కుమార్తా యేమిటండీ?

**కరటక:** అవునండీ. దీన్ని యెవరికయినా సమర్పించి ఋణవిముక్తుణ్ణి అవుదామని ఆలోచిస్తున్నాను.

**లుబ్ధావ:** కన్యాదానం చేస్తారా ఏమిటండీ?

**కరటక:** తమకు తెలియని ధర్మము ఏమిటున్నది – దాని ప్రక్రియ అంతా పంతులుగారితో చెప్పినాను.

**రామప్ప:** మూతముప్పిడి యెందుకుమామా, పన్నెండువందల రూపాయలకు నిర్ణయించినాను.

**లుబ్ధావ:** తమరు యోగ్యులు పిల్ల నమ్ముతారండీ? గవర్నమెంటువారి రూల్సు వున్నదే అమ్మ కూడదని. మా గిరీశం చెబుతూ వచ్చేవాడు.

**మీనాక్షి:** యిన్నిరూల్సు యెరిగివుండేనా చచ్చే ముసలిగాడిదకొడుక్కి నన్ను అమ్మేవు.

**రామప్ప:** ఈలాంటి పెద్దవేషాలు వేస్తే మామా, నేనూ యీ పనిలో జొరుకోను.

**లుబ్ధావ:** (పిల్లవైపు యగదిగ జూచి తనలో) పిల్ల యేపుగానూ, లక్షణంగానూ వున్నది. (పయికి) అయితే పన్నెండువందలా?

**కరట :** ఇప్పిస్తేనేగాని వీలులేదండి, భూములమీద కొంత ఋణం తీర్చుకోవాలి. యీ నెల 15వ తారీఖు వాయిదా – ఆలోగా రూపాయలు చెల్లకపోతే భూములు పోతవి. పెళ్లి యాలాగు కావలిస్తే ఆలాగు చేసుకొండి. మీ యింట పిల్లను దిగబెట్టి వెళ్లిపోతాను.

**మీనాక్షి:** ఇప్పటినుంచీ దిగపెట్టడమే.

**లుబ్ధావ:** నీ నోరు వూరుకోదుగదా?

**కరటక :** రామప్పంతులుగారూ – అలంకారాలమాట వూరుకున్నారు. అలంకారాలు పెట్టకపోతే పిల్లది చిన్నపోతుంది. వివాహసమయమందే వుంచితేనేకాని వొప్పేదిలేదు.

**లుబ్ధావ:** అలంకారం ఒక పిసరయినా వుంచేదిలేదు.

**రామప్ప:** (లుబ్ధావధానులు చెవులో) చెడగొట్టకయ్యా వ్యవహారం సులభంగా కుదిరింది.

**లుబ్ధావ:** (రామప్పంతులుతో) యింట్లో వక పిసరైనా బంగారంలేదు. యేలాగు పెట్టడము?

**రామప్ప:** (లుబ్ధావధానులతో) నేను యెక్కడనైనా రహస్యంగా ఒక కంటె యెరువు తీసుకువస్తాను, పెళ్లప్పుడువుంచి తరవాత తీసి యిచ్చివేదాము (కరటకశాస్త్రులవైపుచూచి) అలంకారం విషయమై మీ ఇష్టానుసారం ఫైసలు చేశామండి.

**కరటక :** అయితే సంతోషమే – ఇక మీ పిల్లగాని నా పిల్లగాదు. దాని కేమి సరుకులు పెట్టుకున్నా మీవేగదా?

**రామప్ప:** మామా అయితే తాంబూలం యిప్పించేయండి.

**లుబ్ధావ:** అమ్మీ తాంబూలం తేవే.

(మీనాక్షి వెళ్ళుచున్నది.)

**రామప్ప:** నేనే పట్టుకువస్తాను (అని వెనుక వెళ్లుచున్నాడు.)

**కరటక :** మీకు వేరే సంబంధం కుదిరి తేలిపోయినదటే.

**లుబ్ధావ:** అవునండి, పిల్లదాని నక్షత్రము మంచిదయిందికాదు.

**కరటక :** అలాగునా! శుభస్య శీఘ్రం అన్నారు. పంతులూ నేనూ ముహూర్తం దగ్గిరగా నిర్ణయించాము – చూచారండీ కార్యమేదో క్లుప్తంగా కానీండి. విజయనగరం ఆనందవర్ధనీ సమాజమువారు, సదస్యమూ, నాగవిల్లీ, చెయ్యనక్కరలేదన్నారు.

**లుబ్ధావ**: మామగారూ (నిమ్మళముగా) యీ పంతులు వకడు శనిలాగు పోగయినాడు. యేదో వొక పెంటపెట్టి విశేషఖర్చుపెట్టిస్తూ వుంటాడు.

**కరటక** : (నిమ్మళముగా) మామగారూ యిటుపైన మీకు యేపని వచ్చినా, కావలసిన వాడిని గదా యిటుపైని నేనే చేసిపెడుతూ వుంటాను – మీరు శలవిచ్చినట్టు యీ పంతులు యింద్రజాలిలా కనపడుతాడు.

**లుబ్ధావ**: (నిమ్మళముగా) ఆ సంగతి నాకు మొదటినుండీ తెలుసును.

**కరటక** : (నిమ్మళముగా) నేను యవరినీ నమ్మలేకుండా వున్నాను. రూపాయీలు చేతులో పడితేనేకాని మంగళసూత్రధారణం చెయ్యనివ్వను సుమండీ.

**లుబ్ధావ**: (నిమ్మళముగా) ఆలాగే కానివ్వండి (బిగ్గరగా) ఇంతసేపు తాంబూలాలు తేవడ మేమిటయ్యా.

**రామప్ప**: వస్తున్నాను మామా చక్కలు పడిపోయినాయి వెదుకుతూ వున్నాను.

(అని తాంబూలము పట్టుకొని ప్రవేశించుచున్నాడు.)

(లుబ్ధావధానులు కరటక శాస్త్రికి తాంబూలమిచ్చును.)

**లుబ్ధావ**: వీరిని, వివాహమయ్యే వరకు మీయింటనే ఉంచండి.

**రామప్ప**: యిక్కడే వుండకూడదా? మా యింట్లో చేసేవారెవరూ లేరు.

**కరటక** : నేనే చేస్తానయ్యా పదిమందికి (అనిలేచి) శలవుపుచ్చుకుంటాను.

**రామప్ప**: (రహస్యముగా) వెర్రిబ్రాహ్మడా యిక్కడే వుండవయ్యా.

**కరటక** : (రహస్యముగా) వీళ్లయింట్లో వుండలేనండీ.

**రామప్ప**: (నిమ్మళముగా) అయితే నే వచ్చేదాకా అరుగుమీద పడుకొండి.

(కరటకశాస్త్రులు, శిష్యుడు, వెళ్లిపోవుచున్నారు.)

**రామప్ప**: యెల్లుండి పెళ్ళి నిశ్చయించాము. పుస్తెకట్టేటప్పుడు రూపాయీలు యివ్వాలట.

**లుబ్ధావ**: ఇంత కొద్ది కాలంలో, ఇన్ని రూపాయలెక్కడ, అప్పు దొరుకుతాయి.

**రామప్ప**: పాతుతియ్యవయ్యా?

**లుబ్ధావ**: బాబూ నీ పుణ్యవుంటుంది కాని ఆమాట పదే పదే అంటూ వుండకు.

**రామప్ప**: యీ వ్యవహారము యంత సులభంగా కుదుర్చానో చూశారా! పెద్ద మనుష్యులని, భోజనాలకీ వాటికీ, పిలవడం ఎప్పుడేమిటి.

**లుబ్ధావ:** నాకు పిలిచేవారు యవరున్నారు? మీరే రేపురాత్రి బయలుదేరి పిలవండి, మిమ్మలిని నమ్ముకుని నేను యీ పనిలో దిగాను. కాని నాకు యంతమాత్రమూ యిష్టంలేదు.

**రామప్ప:** మీకోసం వక్కదమ్మిడీ అపేక్షించకుండా యంతశ్రమ పడుతున్నానో చూశారా! రేపురాత్రి యీ అగ్రహారమంతాను, పెద్దిపాలెంలో లౌక్యుల్నీ పిలిచేటప్పటికి తెల్లవారిపోతుంది.

**లుబ్ధావ:** అగ్రహారంలో మీరుపిలిచి, పెద్దిపాలెం మరియవరినైనా పంపండి.

**రామప్ప:** అగ్రహారపు వైదీకపు వాళ్లని యవరయినా పిలుస్తారు. పెద్దిపాలెం వెళ్లి, లౌక్యుల్ని నేనేపిలవాలి. మేజువాణీవుంటేనే కాని వివాహము రాణించదుసుమండీ.

**లుబ్ధావ:** లేకపోతే బాధేమిటి?

**రామప్ప:** లేకపోతే పెద్దమనుష్యులు యవరొస్తారయా?

**లుబ్ధావ:** ఎల్లుండికి మేజువాణీ ఎక్కడవొస్తుంది.

**రామప్ప:** మన మధురవాణి వుందికాదూ ఆపాటి చెయ్యిమరి ఈ జిల్లాలో యేదీ?

**లుబ్ధావ:** ఆ ఖర్చువెచ్చమంతా మీ ఇష్టానుసారమే అని చెప్పాను కానూ, అంతకు వక దమ్మిడీ హెచ్చితే మాత్రం నేనివ్వజాలను.

**రామప్ప:** ఆలాగే కానియ్యండి (అని తనలో) ఆద్యంతాలు అయేసరికి మరి రెండు వందలు వీడిదగ్గిర లాక్కపోతే నేను మరియేమి లౌక్యుణ్ణి.

**లుబ్ధావ:** (పొడుము పీల్చుచు) అమ్మీ పంతులుకు తాంబోలమియ్యి.

**రామప్ప:** అక్కరలేదు నేనే వెళ్లి తెచ్చుకుంటాను.

**లుబ్ధావ:** ఇదుగో నువ్వు వెళ్లకయ్యా.

(తెర దించవలెను)

★★★

# కన్యాశుల్కము

## తృతీయాంకము

గిరీశ : (కాముని విరిశముల బారికినే అను జావళీ కూనురాగముతో పాడుచు ప్రవేశించి తనలో) ఇన్నాళ్లకు మిడతంభొట్లు చేతిలో చిక్కాడు. యేమీ పాలుపోకుండా వున్నది. యీ విడోబ్యూటీ చూస్తే యేమీ తోచదు. అయితే యిది చెప్పినట్టల్లా వశమయ్యేది కాదు. ఇంత సింప్లిసిటీ యెక్కడా నేను చూడలేదు. దీనికి లవ్ సిగ్నల్స్ రామరామా! యేమీ తెలియవు. చమత్కారము మాటలు ఆడితే యెంతమాత్రం అర్థం చేసుకోలేదు. యే మాటలన్నా ఆ లేడి కళ్లతో తెల్లబోయి చూస్తుంది. అయామ్ డ్రెడ్‌ఫుల్లీ యిన్ లవ్. దీనిని చూచిన దగ్గిరనుంచీ టవున్ లవ్‌సూ డాన్సింగ్ గర్ల్సూమీద పరమ అసహ్యం పుట్టింది. పోజిటివ్ యబ్‌హరెన్స్ వాళ్ల పెంకె మాటలు,పెడర్థాలు, వేషాలు, డామిట్ అంతా యిన్‌సిన్ సిరిటీయే కదా? యిన్నాళ్లు వాళ్ల వలలలో పడిపోయి యేలాగు యాస్‌ని అయిపోయినానో ఆశ్చర్యముగా ఉన్నది. దీనికీ వాళ్లకీ కమ్‌పేరిజన్ ఏమిటి? ఇది ప్యూర్ డైమండ్, అట్టర్ ఇన్నొసెన్స్. నేను రాత్రిళ్లు అరబ్బీనైట్సు కథలూ, కాశీ మజిలీలూ, ఇతరదేశపు ప్రయాణాల డచ్చీలూ చెప్పడానికి ఆరంభించిన దగ్గిరనుంచీ నాదగ్గర బహుచనువుగా నున్నది. ఈ మధ్య వాళమ్మ నూతిలో కాలుజారిపడ్డప్పుడు నేను సాహసించి ఉరికిపైకి తీసిన దగ్గిరనుంచీ నేను బహుయోగ్యుడనని, సత్య హరిశ్చంద్రుణ్ణి అని అనుకుంటూ యున్నది. కథలలో ప్రతిచోటా విధవలు పెళ్ళాడి బహుసుఖముగా ఉండి తుదకు స్వర్గానకు వెళ్లినట్టు సందర్భం తెస్తూవుంటున్నాను. అది కొంచెము బుచ్చమ్మ మనస్సుకు యెక్కివుండదా? అయితే యిప్పుడు సాల్వు కావలసిన ప్రోబ్లెమ్ యేమిటీ? దీనిని పాడు చేదామంటే అది పాపభీతిచేత వొప్పుకోదు. నాకూ యిష్టము లేదు. దీనికి నామీద కొంత ప్రేమయున్నది. నోడౌట్ ఎబౌట్ దట్ అయితే సక్సీడ్ కావడం యేలాగు, దేరీజ్ ది రబ్. యేమిసాధనం యిటుపైని? టుబీ, ఆర్ నాట్ టుబీ, దట్ ఈజ్ ది క్వశ్చన్. షేక్సృియరు ఉన్న అవస్థలో పడ్డాము. యాశస్ బ్రిడ్జి యేదయినా కట్టితేనే కాని ఒడ్డుచేరే మార్గములేదు. (పైకి ముఖము నెత్తియాలోచించి) ఇక విడో మారేజీ కూడునని బోధపరిచి రామవరం తీసుకుని వెళ్లిపోవడమే పని, అందుకు వప్పకపోయినా, యీ సంగతి తనవాళ్ళతో చెప్పినా, పీక కోసుకుంటానని చెప్తూతాను. లెట్ మీ బిగిన్ ది కాంపైన్ ఎట్‌వన్స్, (తలుపు కన్నములో నుంచి తొంగిచూచి) నడవలో కూర్చుని విస్తళ్లు కుడుతున్నది. మొట్టమొదట కొంచెం మ్యూజిక్ విసురుదాము (ఎటులోర్తునే చెలియా అను జావళీ కూను రాగముతో

పాడి) బుచ్చమ్మ వదిన గారూ తలుపుతీయండి (బుచ్చమ్మ తలుపుతీయును) వదినా.... వెల్!.... వేంకటేశం యేమి చేస్తున్నాడు?

**బుచ్చమ్మ:** పెరట్లో గొట్టికాయ లాడుతున్నాడు.

**గిరీశ :** ఈవూరువస్తే మరి చదువు చెడిపోతుంది. పట్నంలో వున్నప్పుడు దస్కుదగ్గిరనుంచి కదులుతే వొప్పేవాడను కాను... ఒక్క మాటు పి... పిలుస్తారా పాఠం చెపుతాను.

(బుచ్చమ్మ తమ్ముని తీసుకొని వచ్చుటకు వెళ్లును.)

ఆహా! దీని రస్సాకొయ్యా మొహం యెదటికి వచ్చేటప్పటికి కొంచెం ట్రెంబ్లింగ్ పట్టుకుంటుంది. వకటి అనవలెనని మరి వకటి అనేస్తూ యుంటాను. మరెవళ్లూ లేరు. వంటరిగా దొరికింది. యీలాంటప్పుడు నా మనస్సులో మాట చెప్పేస్తే తీరిపోనా! ఆకోతి వెధవను తీసుకొని రమ్మని చెప్పినాను. కానీ, పాఠాలలో చిన్న లెక్చెరు వేతాము. (వెంకటేశ్వరులు, బుచ్చమ్మ ప్రవేశించుచున్నారు) యేమివాయి మైడియర్ బ్రదరిన్లా వెంకటేశం, పాఠాలు చదవడం శుభ్రంగా మానివేశావు? యిక్కడ మాసం రోజులుంటే వచ్చిందికూడా మరచిపోతావు, యేదీ టెక్స్టు బుక్కు పట్టుకురా – (వెంకటేశం పుస్తకము పట్టుకుని వచ్చును)

గాడ్స్‌వర్క్స్ అనే పాఠం తియ్యి, రీడ్ ఆన్ మైగుడ్ బోయ్.

**వెంకటే:** (తడుముకొనుచు) దేర్‌యిజ్ నాట్ ఏన్ ఆబ్జక్టు వుచ్ డజ్‌నాట్ సర్వ్ సమ్ యూస్‌ఫుల్ పర్‌పస్.

**గిరీశ :** అట్టె! అట్టె! అక్కడ ఆపు, క్రియేషన్ అనగా యేమిటి?

**వెంకటే:** క్రియేషన్ అనగా – అనగా – ఆవులు

**గిరీశ :** నాన్సెన్స్ చదవేస్తే ఉన్న మతి కూడా పోతున్నది. ఆవులు యెదుటున్నాయనా ఆవులంటున్నావు. మళ్లీ ఆలోచించి చెప్పు.

**వెంకటే:** యేమాటకి అర్థం అడిగినారు?

**గిరీశ :** క్రియేషన్.

**వెంకటే:** ఆదా! క్రియెషన్ అంటే ప్రపంచం. నేను యెదట ఆవులు కనబడితే యీ ఆవు పెరుగు యీ నెలరోజులే కదా తినడమని అనుకుంటున్నాను.

**గిరీశ :** వన్ థింగ్ ఎట్ ఏటైమ్. యిప్పుడు పాఠంమాట ఆలోచించు–క్రియేషన్ అనే వక్క మాటపైనే వక్క ఘంట లెక్చరు యివ్వవచ్చును. ప్రపంచం యేలాగున్నది? కపిద్ధా కారభూగోళా అని మనుధర్మ శాస్త్రంలో చెప్పినాడు. కపిద్ధమంటే యేమిటి?

**వెంకటే**: నారింజపండు.

**గిరీశ** : వెరిగుడ్ – అందుకు అమర నిఘంటులో పద్యం నీకు వచ్చునా?

**వెంకటే**: రాదు – చెప్పండి రాసుకుంటాను.

**గిరీశ** : యింతలు బదరీ ఫలములు యింతలు మారేడుబళ్లు యీడుకుజోడై బంతులు తామర మొగ్గలు దంతీకుచ కుంభములబోలు తరుణీకుచములూ.

యీ ప్రపంచములో యేమి వస్తువు లుంటవి?

**వెంకటే**: ఆవులు,

**గిరీశ** : డామ్ నాన్సెన్స్ – యెంతసేపూ ఆవులే? యేమిటి వుంటవి?

**వెంకటే**: గేదెలు

**గిరీశ** : దట్ విల్‌నాట్ డు – ఆలోచించి చెప్పు

**వెంకటే**: అయితే నాకు తెలియదు.

**గిరీశ** : విడోస్–యింత చిన్న ప్రశ్నకు నీకు జవాబు తెలియదు! ప్రపంచమందుండే వస్తువుల న్నిటిలోకీ ముఖ్యమయినవి విధవలు. దాని విషయమై లెక్చరు యివ్వవచ్చును. మన దేశములో ఒక దురాచారము వున్నది. మొగవాడికి పెళ్లాము చచ్చిపోతే తిరిగీ పెళ్లాడు తాడు. ఆడదానికి మొగుడు చచ్చిపోతే యంత యవ్వనములో నున్నా, యెంత సొగసుగా వున్నా, మరివకడిని, పెళ్లాడడం వల్ల లేదు. ఇది అన్యాయమంటావా? కాదంటావా?

**వెంకటే**: తప్పకుండా అన్యాయమే.

**బుచ్చమ్మ**: యేమండీ గిరీశంగారూ – వెధవ, పెళ్లాడడం పాపంకాదూ?

**గిరీశ** : ఆహా! మీ సత్యకాలం చూస్తే నాకు విచారంగా నున్నది. వెధవలు పెండ్లాడవలసిన దని పరాశరస్మృతిలో స్పష్టంగా నున్నది. వేదంలో కూడా నున్నది. రాజమహేంద్ర వరములో యిదంతా పండితులు సిద్ధాంతం చేసినారు. పూర్వ కాలంలో వెధవలు పెండ్లాడేవారు. వెంకటేశం! నలచరిత్రలో దమయంతి రెండో పెండ్లి సాటించిన పద్యం చదువు.

**వెంకటే**: నాకురాదు.

**గిరీశ** : యింత ముఖ్యమయిన పద్యం మరచిపోవడం యంత తప్పూ! నోటుబుక్కుతీసిరాసుకో– దమయంతి రెండోపెళ్లికి, ధరనుండే రాజు లెల్ల దడదడవచ్చిరీ – చూశావా! లోకంలో వుండే రాజులంతా వెధవని పెళ్లాడడానికి వచ్చారు. (బుచ్చమ్మ వైపుజూచి) చూశారా?

శాస్త్రాలన్నీ వొప్పుకోవడమే కాకుండా వెధవలు పెళ్లాడకుండా వుండిపోతే దోషమని కూడా చెప్పుతూ వున్నాయి. యిందు విషయమై ఆచార్యులవారు పత్రికకూడా యిచ్చియున్నారు.

**బుచ్చమ్మ:** అయితే మనవాళ్లంతా వెధవల్ని పెళ్లిచేసుకోకూడదంటారే?

**గిరీశం :** అదంతా యింట్లో చాకిరీ చేయించు కోవడముకోసరముగానీ మరేమీకాదు. ఝాము రాత్రి ఉందనగా లేచి మరునాడు రెండు ఝాముల రాత్రిదాకా యెద్దులాగు పనిచేయిస్తారు కదా? ఒక్కపూటకంటె యెక్కువభోజనం చెయ్యనివ్వరుకదా? అప్సరసలాగున యెంత సొగసుగా నున్నా మంచి గుడ్డకట్టుకోనివ్వరు. సరుకు పెట్టుకోనివ్వరు. తుమ్మెద పంక్తుల్లా వుండే జుత్తుకూడా తీసివేస్తారు గదా! ఫర్ ఎగ్జాంపిల్, మీ అక్కయ్యకు ఆ చంద్ర బింబమువంటి ముఖముపైని ఒక కుంకుమబొట్టుంటే త్రినేత్రుడికైనా చూడడానికి అలవి వుండునా. ఆహా! యీ అవస్తచూస్తే నా హృదయం కరిగిపోతున్నది. ఆల్‌రైట్! ప్రపంచములో యింకా యేమి వస్తువులువున్నవి?

**వెంకటే:** చేగోడీలు.

**గిరీశ :** డామ్ నాన్సెన్స్–ఎంత సేపూ తిండి విషయమయ్యే ఆలోచిస్తావు. బాచిలర్స్, బ్రహ్మ చారులు కూడా వున్నారు. వాండ్లు చెయ్యవలసిన పనియేమిటి?

**వెంకటే:** వేదం చదువుకోవడం, పెయ్యలకి గడ్డితేవడం.

**గిరీశ :** నాన్సెన్స్–అది మీ తండ్రి దగ్గర చదువుకునే విద్యార్థులుకి, బ్రహ్మచారి యొక్క రియల్ డ్యూటీ, అంటే, విధించినపని యేమనగా విధవలను పెండ్లాడడమే. ఇంకా క్రియేషనులో యేమున్నది?

**వెంకటే:** నాకు తెలియదు.

**గిరీశ :** రామవరములో వెధవవివాహము చేసుకున్న వాళ్లకల్లా నెల వక్కింటికి నూరు రూపాయిలు యిచ్చి పోషించడముకు విడోమారేజి సభవకటి యున్నది. ఇదివరకు ఐదువేలమంది వెధవలకు వివాహములు అయి పుని స్త్రీలు అయిపోయినారు. ఆల్‌రైట్! క్రియేషన్ అనేమాట అయినది. ఆ సెంటెన్సు అంతకూ అర్థముచెప్పు.

**వెంకటే:** మీరొకమాటు చెప్పిన తరువాత నేచెబుతాను.

**గిరీశ :** ఆల్‌రైట్! ప్రపంచములో దేవుడు ప్రతి వస్తువునూ యేదో ఒక వుపయోగముకొరకు చేసియున్నాడు. చేగోడీ యెందుకు చేసినాడూ?

**వెంకటే:** తినడముకు.

గిరీశ : దట్ ఈజ్ రైట్. ఆవులనెందుకు చేశాడు?

వెంకటే: పాలు యివ్వడముకు.

గిరీశ : పెర్ఫెక్ట్లీ రైట్. ఆడవాళ్ల నెందుకు చేశాడు?

వెంకటే: వంట చెయ్యడానికి.

గిరీశ : నాన్‌సెన్స్. పెండ్లాడడముకూ పిల్లలను కనడముకున్నూ గనుక పెండ్లాడకుండావున్న వెధవపిల్లలు దేవుని ఆజ్ఞను అతిక్రమించిన పాపమును చేస్తున్నారు.

(అగ్నిహోత్రావధానులు ప్రవేశించుచున్నాడు)

అగ్నిహో : ఏమండీ గిరీశంగారూ మా కుర్రవాడికి చదువు చెప్పుతున్నారూ.

గిరీశ : ఘంటసేపాయి చెపుతున్నానండీ.

అగ్నిహో : యేదీ నేకూడా వింటాను కొద్దిగా చెప్పండీ.

గిరీశ : మైడియర్ బోయ్, గాడ్‌మేడ్ క్రియేషన్. సృష్టియెవడు చేసినాడూ?

వెంకట్ : దేవుడు.

గిరీశ : ఫాదర్ ఈజ్ నెక్స్ట్‌టుగాడ్. దేవుని తర్వాత ముఖ్యం యెవరూ? సే ఫాదర్.

వెంకటే : తండ్రి.

అగ్నిహో : మొత్తముమీద మీ ఇంగ్లీషు చదువు మంచిదిలాగే కనబడుతూన్నది. భాష భేదంగాని మనముక్కలే వాళ్లవిన్నీ.

గిరీశ : వెంకటేశం! దేవుడు సృజించిన ప్రపంచములో యేమి వస్తువులున్నవి? సే కోర్ట్స్.

వెంకటే: వెధవలు.

గిరీశ : నాన్ సెన్స్. సే కోర్ట్స్.

అగ్నిహో : యిదేమిటండోయి ప్రపంచంలో వెధవలున్నారంచున్నాడు, ఇంగ్లీషు పుస్తకాల్లో యిదేనాయేమిటి వున్నది.

గిరీశ : వెధ్వల్ అన్నది లాటిన్ మాటండి – ఆమాట కర్థం కచేరీలండి. కచేరీలు యెందుకున్నవి?

వెంకటే: దావాలు తేవడముకు.

గిరీశ : దట్ ఈజ్ రైట్ – చూచారండీ మీవాడికి కచేరీల భోగట్టాలుకూడా నేర్పుతున్నాను.

అగ్నిహో : అయితే మనదావా విషయమై నేనిచ్చిన కాకితాలు సమగ్రంగా చూశారా.

గిరీశ : కేసు గెలవడము కేమీ అభ్యంతరము లేదు. మీకు తెలియడముకోసం గ్రంథం అంతా తెలుగు చేస్తున్నాను. మామగారూ మీ విషయమై యెంత శ్రమయినాపడి అమలాపురం వెళ్లి అక్కడ కోర్టులో కేసు గెలిపించకపోతే నన్ను పేరుపెట్టి పిలవవద్దు.

అగ్నిహో : యేదో అంతా మిమ్మలినే నమ్ముకుని వున్నాము. యెంత డబ్బయినా కేసు గెలిస్తే చాలును. పెళ్లిపనులకి మీరు కుమ్మక్కు వుంటేనేకాని తూగదుసుమండీ. నామీద కోపంచాత కరటకశాస్త్రుల్లూ వాళ్లూ వెళ్లిపోయినారు. వాళ్లు వొచ్చేటట్టు కనపడదు.

గిరీశ : మీరు కూర్చున్న దగ్గిరనుంచి కాలు కదపకుండా ఎరేంజిమెంటు యావత్తూ నేను చేస్తాను కాదూ.

(నిష్క్రమించుచున్నారు)

★★★

## రెండవస్థలము – రామచంద్రపురం అగ్రహారములో లుబ్ధావధానుల యిల్లు.

**(కరటక శాస్త్రి, పురోహితుడు ప్రవేశించుచున్నారు)**

కరటక : పంతులు వచ్చేలోగా కార్యమైపోవాలి.

పురోహి: ఆ పూచీనాదీ – మీ రిస్తానన్న రూపాయిలు నాచేతిలో పడేయండి.

(కరటకశాస్త్రి ఆయన చేతిలో పదిరూపాయిలు పడవేయును)

పురోహి: లుబ్ధావధానులుగారూ! వేగిరం స్నానాలు కానివ్వండి.

లుబ్ధావ: పెద్దమనుష్యులింకా రాలేదే?

పురోహి: లగ్నం పెద్దమనుష్యులకోసం ఆగుతుందయ్యా? అగ్రహారంలో బ్రాహ్మణులందరినీ పిలిచాను. వచ్చి పందిట్లో కనిపెట్టుకొని కూర్చున్నారు.

లుబ్ధా : పంతులు వుదయం నాలుగ్ఘడియలకి ముహూర్తమని చెప్పాడే?

పురోహి: పంతులు చెప్పినమాట చూస్తారా – పంచాంగం చూస్తారా?

లుబ్ధావ: ఆ–ఆ–పంతులు నాలుగ్ఘళ్ల పొద్దుకు రమ్మని పిలుస్తానన్నాడే పెద్దిపాలెంలో లౌక్యుల్ని?

పురోహి: నేను నాలుగు ఘడియలకి తెల్లవారుతుందనగా ముహూర్తమని చెప్పాను. పంతులు నాలుగు ఘడియలు తెల్లవారిన తర్వాతనుకున్నాడు కాబోలు.

లుబ్ధావ: అయితే కానియ్యండి స్నానానికి లేస్తాను.

**కరటక**: నా రూపాయిలిచ్చి మరీ స్నానంచెయ్యండి.

**లుబ్ధావ**: బాపన్నగారూ : యీసంచి పట్టుకొండి. మధ్యవర్తులు గనుక మంగళ సూత్రధారణ కాగానే మీరే యిచ్చి వెయ్యండి.

**కరటక**: పుస్తె కట్టడంకాగానే బయలుదేరి నేను వెళ్లిపోవలెను. రేపు రూపాయిలు చెల్లకపోతే భూములు నిష్కారణంగా పోతాయి. ఎల్లుండి ఎంత రాత్రికైనా వచ్చి కలుసుకుంటాను. ఈలోగా పిల్లది వక్కర్తె వంటరిగానుంటుంది. మీదే భారము. (కరటకశాస్త్రి, మీనాక్షి, తక్క దక్కినవారు వెళ్లిపోవుచున్నారు.)

**కరటక**: అమ్మీ మీనాక్షి! పిల్ల దాన్ని యలాగ చూసుకుంటావో నేను నీకిస్తానన్న మొహురిదుగో పిల్లదాని స్నానం అదీ ఒక్క నిమిషములో అయిపోవాలి. (మీనాక్షి చేతిలో నొకమొహురు బడవేయును)

**మీనాక్షి** :మీకెందుకూ, నేనున్నాను కాదూ, (వెళిపోవును.)

★★★

## మూడవస్థలము - లుబ్ధావధానుల యింటిలో సావడి.

(పసుపు పంచలు కట్టుకొని, లుబ్ధావధానులు, యింకను మరికొందరును, ప్రవేశించుచున్నారు. తాషామరపా చప్పుడు వినబడును.)

**పంతులు** :(డాబుగా దుస్తువేసుకుని ప్రవేశించి) అబ్బ! ఎంత శ్రమ పడ్డానండీ. (నౌఖర్ల వైపుచూచి) బాజాలూరుకోమనరా వెధవ పెద్దిపాలెం ఎంతదూరమున్నదండీ. కాళ్లు పీకుకువచ్చాయి.

(అని కూరుచొనును.)

**లుబ్ధావ** : లగ్నానికి మీరు లేకపోయినారుగదా అని మహావిచారంగా వుంది.

**పంతులు**: (ఉలికిపడిలేచి) ఏమిటీ.... వివాహమయిపోయిందీ?

**లుబ్ధావ** :మీరు ముహూర్తం తెల్లవారిన తర్వాత నాలుగు ఘడియలకనుకున్నారు. పురోహితుడు నాలుగు ఘడియల రాత్రుందనగా లగ్నమన్నాడు.

**పంతులు**: (పురోహితుని వైపుచూచి) నాతో స్పష్టంగా నాలుగు ఘడియల ప్రొద్దుకని చెప్పావు? నేను పెద్దమనుషుల్నాలాగు పిలుచుకువచ్చానుగదా వాళ్లేమనుకుంటారు? గుంటూరు శాస్తుర్లేడి?

**లుబ్ధావ**: వూరికి వెళిపోయినారు.

**పంతులు**: (ఆశ్చర్యము, కోపము, ముఖమున గనపరచుచు) ఏమిటీ రూపాయిలిచ్చి వెయ్యలేదు గదా?

**లుబ్ధావ**: సీదాగా యిచ్చివేశాను.

**పంతులు**: అన్న కొంపతీశావు మరేమిటి? ఇదంతా నీ కుట్రలాగ కనపడుతూంది. నువ్వూ వాడూ ఒకటైపోయినారు. యింతా నన్ను మధ్యవర్తినిచేసి నేను లేనిదీ ఈ వ్యవహారము ఏలాగు పైసలు చేసినారయా. ఈ వివాహంకోసం అష్టకష్టాలుపడి చమటూడ్చి పనిచేస్తే నేను లేకుండా ముహూర్తం జరిగినదా? ఇంత అమర్యాద నన్నెవ్వడూ చేయలేదు, దాని సంగతి నీకే తెలుస్తుంది.

**లుబ్ధావ**: నేను యేమీ చెయ్యలేదండీ మామగారూ, మీ పాదాలుసాక్షి, యేతప్పువున్నా క్షమించ వలసినది (అని కాళ్లుముట్టును.)

**పంతులు**: యీ గుంటూరిశాస్త్రుల్లు పచ్చపుదొంగలా కనపడుతున్నాడు. రూపాయలు పట్టుకుని వుడాయించాడు. పెళ్లి ఖర్చుకని నా దగ్గిర యాభై రూపాయలు బదులుకూడా పుచ్చు కున్నాడు. యీ వాళకమంతా చూస్తే వీడు యేదో పెద్దదగా చేసి నిలిచివుంటే యెక్కడ తెలిసిపోతుందో అని డబ్బు సంధించుకుని వుడాయించినట్టు కనపడుతుంది.

**లుబ్ధావ**: ఆయన రేపుసాయంత్రంలోగా రూపాయలు అప్పులవాళ్లకు చెల్లించకపోతే భూములు పోతాయని ఊరికే తొందరపడ్డాడు.

**రామప్ప**: నువ్వు తెలివిహీనుడివి. నీకు వాడి సంగతి బోధపడకయినా వుండవలె. లేకుంటే నీవూ వాడూ కలిసి నన్ను టోపీ వెయ్యడముకు కుట్రైనాచేసి వుండవలెను. నా యాభై రూపాయలు నిష్కారణంగా పోయినాయి. నేను వూరుకునేది లేదు. బాగా ఆలోచిస్తే యీ పిల్ల రెండోపెళ్లి పిల్లలాగ కనబడుతున్నది. కనిష్టేబులను పిలిచి కేసు చేయిస్తాను. నేను యెప్పుడూ యింత దగాపడలేదు. యెవరోయి, హెడ్డుగారిని పిలువు.

**లుబ్ధావ**: యేదో కార్యమైపోయింది. మీ యాభైరూపాయలూ నేనిచ్చుకుంటాను. నా పరువు నిలబెట్టండి. రసాభాస చెయ్యకండి. మీరెలా చెపితే అలాచేస్తాను.

**రామప్ప**: ససేమిరా! నేనెంతమాత్రమూ వూరుకోజాలను. నా దగ్గిరే స్వామిద్రోహం చెయ్య డమా?

**లుబ్ధావ**: క్షమించండి (కాళ్లుపట్టుకొనుచున్నాడు.)

**దగ్గిరున్నవారు**: లుబ్ధావధానులుగారు నిరపరాధి తమరేలాగైనా గడుపుకోవాలి.

**రామప్ప**:...యేవూరు వెళ్లారో తెలుసునూ?

**లుబ్ధావ**: విశాఖపట్నం.

**రామప్ప**: (బుర్ర తటాయించుచు) కానీ చెపుతాను – లౌక్యులంతా నాలుగుఘడియల ప్రొద్దుకు వస్తారు గదా యేమిటి చెయ్యడం?

**లుబ్ధావ**: యేమీతోచకుండా వున్నది. తమరే చక్రం అడ్డువెయ్యాలి.

**రామప్ప**: కానియ్యి మేజువాణీ పెడదాము. మధురవాణికి రాత్రులకు కంట్రాక్టుగాని పగలు రావడముకు ప్రసక్తంలేదు. దానికి ఇందుకు వేరే ఇస్తేనేగాని కుదరదు.

**లుబ్ధావ**: మీరేమిమ్మంటే అదిచ్చుకుంటాను.

**రామప్ప**: యెవరోయి నౌఖరు, పోలిశెట్టిని పిలువు. యెవరోయి వంటబ్రాహ్మలు, ఫలహారాలు మా బసకి పంపించినారా లేదా?

(తెర దించవలెను)

★★★

## నాల్గవస్థలము – లుబ్ధావధాన్లుగారి యిల్లు

**లుబ్ధావ**: సోమన్నశాస్త్రుల్లుగారు వచ్చారయ్యా నా గుడ్లు పైకి వస్తూన్నాయి.

**పురోహి**: ఇదివరకు పదికబుర్లు వెళ్లాయి. ఇప్పుడే దేవతార్చన చేస్తున్నారు.

**లుబ్ధావ**: రామయ్యపంతులుగారు వచ్చారా?

**బ్రాహ్మడు** : ఇప్పుడే చుట్టకాల్చుకుని స్నానానికి వెళ్లారు.

**లుబ్ధావ**: పంతులూ, నాకు మా ఆకలి వేస్తూన్నదయా పెందరాళే మెతుకులు పడితేనే కాని ప్రాణం నిలవడం కష్టం.

**రామప్ప**: మాయింటికిరండి అక్కడ చల్దివణ్ణం యెవరికీ తెలియకుండా పెట్టేస్తాను. ఇప్పుడు ఆచార మాలోచిస్తే కథ మొదటికి వస్తుంది – యేదో వొకటి పెందరాళేకానియ్యండి.

**లుబ్ధావ**: (నాలుగడుగులు నడచి తొంగిచూచి.) ఓయి నాయినా – ఇంతమందిని పిలిచినా వేమయ్యా భోజనానికి?

**రామప్ప**: ఇదో విశేషంటయ్యా – ఇందులో ముప్పాతిక మంది పిలవనివాళ్లే, పీక బట్టుకు గెంటుతూ వుంటే పెణకపట్టుకు వేళ్లాడుతున్నారు. యీ సప్లై వూసు మీ కెందుకు మీరు ముందు భోజనానికి పదండి.

(వెళ్ళిపోవుతున్నారు.)

## అయిదవ స్థలము : రామప్పంతులుగారి ఇల్లు

**లుబ్ధావ:** (తనలో) అమ్మా – భోజనమయింది – ప్రాణం తెప్పిరిల్లినది, కార్యం యరక్క తలపెట్టి నాను. యీ రామప్పంతులు సంసారం కొల్లపెట్టేస్తున్నాడు. యక్కడలేని బ్రాహ్మణ్యం వచ్చారు.

(రామప్పంతులు ప్రవేశించి.)

**రామప్ప:** ప్రయత్నం చాలిందికాదు. బ్రాహ్మలు కొంప ముట్టించేస్తామంటున్నారు.

**లుబ్ధావ:** గాడిదకొడుకులు, కనిష్టేబులను పిలవండి.

**రామప్ప:** యిందాకా పిలవని బ్రాహ్మలని తోలెయ్య డానికి కనిష్టేబులను పిలుస్తే దర్భాసనాలూ జారీలతో ఆ కనిష్టేబులను చావగొట్టారు. మధుపాడ అగ్రహారీకుడు, లెంపకాయకొడితే చూశారా నాదవడమీద అయిదువేళ్లూ అంటుకున్నాయి. రెండు మూడు వందలదాకా పయినివుంచివేశి తలుపులు బిడాయించి వేశినాను. వుతకయెత్తివేశి లోపల ప్రవేశించి నారు. వాళ్లే పదార్థంఅంతా ఒడ్డించేసుకున్నారు. అయిదురోజులకూ జాగ్రత్తచేసిన సామానంతా అయిపోయింది. యిప్పుడు వాళ్లకు వండిపెట్టకపోతే ఆబోరు దక్కదు, రౌద్రాకారులై వున్నారు, మీకోసం వెతుకుతున్నారు.

**లుబ్ధావ:** (వణుకుతూ) మీ పుణ్యం వుంటుంది పోలిశెట్టిదగ్గిర యిసేబు తెచ్చివాళ్లకు కూడా తిండిపెట్టెయ్యండి.

**రామప్ప:** (తనలో) సమయంలో సమయం పోలిశెట్టికి నేబాకీవున్న రూపాయలు కూడా దీనిలో కలిపివేస్తాను. (అని వెళ్ళిపోవుచున్నాడు)

★ ★ ★

## ఆరవ స్థలము – లుబ్ధావధానుల యిల్లు (హేకర్ ప్రవేశించుచున్నాడు)

**హేకర్ :** అయ్యా పంథుల్‌గారూ లెక్కా యిప్పించరా.

**లుబ్ధావ:** పెళ్లిచేసుకొన్న సౌఖ్యం బాగానే వున్నది.

**హేకర్ :** అమ్మగార్ నలభై రూపాయల్‌కీ కీన్‌కాఫ్‌తాన్ పుచ్చుకొన్నార్.

**లుబ్ధావ:** ఖీనూలేదు ఖాబూలేదు అడ్డదిడ్డంగ పేలక వెళ్లు.

**హేకర్ :** రూపాయల్‌కీ ఇయ్యరంటయ్యా బవిస్సం తీసివేస్తాన్.

**లుబ్ధావ:** ఫుండాఖోర్ – తలకు దగనిమాటలు ఆడతావు.

**హేకర్** : మాటల్‌కి మిగుల్ సెప్పకండి. యేటమ్మా మాటాడక్ యింటిలో కూఖుంటావ్. యిలా రావమ్మా నీ బవిస్సం తీసివేస్తాన్.

**లుబ్ధావ**: నీ అమ్మకడుపుకాల్చా. తీసుకోరా రూపాయలు, పెళ్లిసుఖం బాగా అనుభవిస్తున్నాను, ఇఖ మా యింటికివస్తే నేవప్పేవాడిని కాను. (రూపాయిల నిచ్చును)

**హేకర్** : మీకీ పెనిమిటి ధర్మరాజా అమ్మా. ముఖ్ మల్‌తాన్ మా మంచీదీ వుండాది కనిష్టీపుగారి కూతురుకి వకటి ముక్కా ఇచ్చాన్.

**శిష్యుడు**: రెండుగజాల గుడ్డ కావాలోయి.

**లుబ్ధావ**: గుమ్మంలో అడుగుపెడితే కాళ్లు విరగకొడుతాను.

**హేకర్** : అదుగోనమ్మా మీకి మొగుడ్ అలాగూ కోపంపడుతూవుంటే నాకీ యేమి సెయ్యమంటార్.

**శిష్యుడు**: నీకెందుకోయి ఆయన ముసలివాడు ఆయనకీ సంగతులేమీ తెలియవు.

**లుబ్ధావ**: కొంపపీక్కున్నాను. ఇంట్లో డబ్బంతా దీనికిందైపోతూంది. కుట్టుపనివాళ్లూ, పళ్లవాళ్లు, కంసాలివాళ్లూ అంతా బాకీలని తినేస్తున్నారు. సంసారం కడితేరుస్తూంది. రాత్రి దీనిపని పట్టిస్తాను. అమ్మీ వీడి మొఖముమీద పేడ్నీళ్లుపొయ్యి.

(హేకర్ బట్టలుమూట కట్టుకుని పారిపోవును.)

**మీనాక్షి**: దీనిని పెళ్లాడవొద్దని చెప్పానుకానూ – దాని తండ్రి యేమి మాయలమల్లి వాడమ్మా! ఓ సక్కా బంగారం మోరీ చేతులో పెట్టాడనుకున్నాను. కంసాలి అక్కాబత్తుడికి చూపిస్తే డబ్బుకు కళాయి వేశాడన్నాడు. కులంతక్కువ గుంటను పెళ్లాడితే యేమౌతుందేమిటి.

**శిష్యుడు**: తల పెంచుకుని తాంబూలం వేసుకుని సరసాలుచేసే వెధవముండ కంటె నయంకద.

**మీనాక్షి**: చూశావురా నాన్నా – దీనమ్మ కడుపుకాలా యేలాగంటుందో.

**లుబ్ధావ**: ఇక నాకు సుఖంలేదు

**మీనాక్షి**: నువ్వే తెచ్చిపెట్టుకున్నావు.

**లుబ్ధావ**: దెబ్బకి దెయ్యం వెరుస్తుందన్నాడు. రాత్రి దీనికి ఒక తాళాధ్యాయం వెయ్యి.

(తెర దించవలెను)

★★★

## ఏడవస్థలము - రామప్పంతులుగారి యిల్లు

రామప్పంతులు గడప వెలుపలను, మధురవాణి లోపలను, నిలువబడుదురు.

**రామప్ప:** నీకంత పెంకెతనంగావుంటే పెళ్లిచేసుకుని గృహస్థాశ్రమంలో ప్రవేశిస్తాను.

**మధురవాణి:** అరవైయేళ్లు వచ్చి చదువుకోక మన్ను కొట్టుకుంటానా అన్నట్టున్నది. యీ వెర్రికబుర్లకు యేమిటి - యేదో వొక తంబళ అనుమానం పెట్టుకుని చెర్రూ బుర్రూ అంటూవుండడం మీకు స్వభావమే. మెడలో కంటె తీసుకొని పోయినారు - అది యెక్కడనో తాకట్టుపెట్టి నేను యేమంటానో అని నామీదికే బయలుదేరుతున్నారు.

**రామప్ప:** కంటె తాకట్టు పెట్టుకోడం ఖర్మమేమి? నిలబడ్డపాటుగా చూడు కంటెలు వర్షం కురిపిస్తాను.

**మధుర:** నాకాకబుర్లేమీ పనికిరావు - మీ ప్రయోజకత్వం నాకు తెలుసును. నాకంటిప్పుడు తీసుకొస్తారా లేదా?

**రామప్ప:** నీకు మతిపోతూంది. నన్ను తృణీకరించడం ఆరంభిస్తున్నావు. నా దెబ్బ తెలియకుండా వుంది.

**మధుర:** యేడిశినట్టే వుంది.

**రామప్ప:** నాకు వొళ్లు మండుతూన్నది. ఖబడ్దార్!

**మధుర:** మీకు వొళ్లుమండుతూంటే గాల్లో నిలబడితే చల్లబడుతుంది.

(అని తలుపువేసికొనును.)

**రామప్ప:** యీ కంటెబాధ మా ఇబ్బందిగా వున్నది. తాకట్టుపెట్టానని ప్రాణం కొరికేస్తూంది. రేపు వుదయం తెస్తానంటే వినదు. యీ చీకట్లో లుబ్ధావధానులు ఇంటికి పోకతీరదు. యీ కంటె తాకట్టుపెట్టానని గట్టి అనుమానము పట్టుకుంది. తీరా వెళితే యిప్పుడు పెట్టా బేడా తీసియిస్తాడో ఇవ్వడో.

★★★

## ఎనిమిదవస్థలము - లుబ్ధావధానులుగారి యిల్లు

**రామప్ప:** (తలుపు వెలపలనుంచి గట్టిగా) అవధానులు మామగారూ! అవధానులు మామగారూ! తలుపండోయి (అని అనేక పర్యాయములు పిలిచి) యేమిటి చెప్మా, దొంగగాడిదె పలకడు. నిద్రమాట అబద్ధం. దొంగల భయంచాత వీడురాత్రల్లా మేలుకుంటాడు. (గట్టిగా) తలుపు తియ్యకపోతే వుతకయెత్తి వేస్తాను.

**లుబ్ధావ**: (లోపలనుంచి) యెవరయా?

**రామప్ప**: నేనయ్యా రామప్పంతులుని.

**లుబ్ధావ**: (నిమ్మళముగా) రామప్పంతులు... అమ్మీ తలుపుతియ్యవే.

(తలుపు తియ్యును)

**రామప్ప**: మామగారూ మీ వంట్లో తాజాగావుందిగద?

**లుబ్ధావ**: యేమితాజా అండి

(అని యూరకుండును.)

**రామప్ప**: కోడలు మాజోరుచేస్తూన్నట్టు కనబడుతూంది. వూరు హోకర్లంతా మీ గుమ్మంముందరే కనబడతారు.

**లుబ్ధావ**: (మోకాళ్లమీద బుర్ర పెట్టుకుని నిమ్మళముగా) ఆ ఊ ఊ ఉ!

**రామప్ప**: (తనలో) ఆ మాటలు యిష్టములేదు కాబోలు (పైకి) ఆకంటెకు చాలా తొందరగా వున్నది. మధురవాణి యేమీ నిలవనియ్యకుండా వుంది. అది తాకట్టు పెట్టానన్న అనుమానంకొద్దీ యిప్పుడు తెస్తేనేకాని వల్లకాదని కింకపట్టుపట్టి కూర్చున్నది.

**లుబ్ధావ**: అదికూడా పారిపోయింది.

**రామప్ప**: కంటె పారిపోయిందీ! ఏమిటి! మామగారు పలవరిస్తూ వున్నారా యేమిటి?

**లుబ్ధావ**: లేదండీ పలవరింతగాదు – కంటెపట్టుకుని చెప్పకుండా పరారీ అయిపోయింది. యిదంతా మీ కుట్రే.

**రామప్ప**: ఏమిటీ! అయితే కంటె యిస్తావా, యివ్వవా?

**లుబ్ధావ**: నా దగ్గిరలేదు.

**రామప్ప**: వద్దుసుమా నా సంగతి తెలిసిందికాదు నీకు.

**లుబ్ధావ**: నాకు అంతా తెలుసును. నాచేత పద్దెనిమిది వందలు కర్చుచేయించావు.

**రామప్ప**: (బుర్ర తటాయించి ఆలోచించి తనలో) అన్నా మించిపోయినది. యేదైనా వక యెత్తు యెత్తితేనేకాని కంటె రావడము కష్టము. (పైకి) మొన్నరాత్రి మీ ఇంట్లో పెద్దకేకలూ, పెడబొబ్బలూ జరగలేదూ?

**లుబ్ధావ**: అయితే!

**రామప్ప**: అయితే మరేమిటి – మీ అమ్మి దానితో దెబ్బలాడి నూతులో పడేసింది. నేను పెరట్లో గుడ్డెమీదికి బాహ్యానికిపోయి స్వయంగా చూచాను.

**లుబ్ధావ**: గాడిదెకొడకా! (అని కర్రపట్టుకొని లేచును).

**రామప్ప**: ముసలిగాడిదకొడకా నీ పనిపట్టిస్తాను.

(అని వెళ్లిపోవును)

★★★

# కన్యాశుల్కము

## చతుర్థాంకము

(బైరాగీ, హేడ్ కనిష్టేబు, దుకాణాదారుడు, యింకా మరిద్దరు, మధ్యను సీసాలు పెట్టుకుని ప్రవేశించుదురు.)

(తెరతీయు ముందర నారాయణ నారాయణ నారాయణభజే అను కీర్తన పాడుచుండవలయును.)

**హేడ్** : గురోజీ తమరు హరిద్వారం బయలుదేరి యెన్నాళ్లయిందేమిటి?

**బైరాగి** : రెండు రోజులయినది. మొన్న వుదయం ప్రయాగ, నిన్న వుదయం జగన్నాధం సేవించాము. ప్రచ్ఛన్నంగా సింహాచలం పోతూవుంటే నువ్వొక భక్తుడవు పట్టుకొని ఆపేశావు.

**హేడ్** : ఆహా! యోగమహత్యం – ముక్కు బిగించి స్నానాలుచేసే బ్రాహ్మలకెవరికీ యీ సిద్ధుల్లేవుగదా?

**బైరాగి** : వాళ్లకేమీ తత్వము తెలియదు. మా తాతగారు చెప్పిన పద్యం నీవు వినలేదా? ఆత్మ శుద్ధిలేని ఆచారమదియేల.

**హేడ్** : వేమన్న మీ తాతేనా గురోజీ?

**బైరాగి** : అవునోయి నాకు మూడువందల యేళ్లున్నవి, ఆయన పరంపదం వేంచేసి వెయ్యి సంవత్సరము లౌతవి.

**దుకాణ**: ఆహా! యివాళ మనదేమదురుష్టం. గురోజీ! నౌకరి కొక సందేహం వున్నాది. పరబ్బరమం సీసాలో కనపడ్డంత సొట్టంగా మరొకసోట అగుపడుతుందా?

**బైరాగి** : యీ రహస్యం నీకేలాగు దెలిసిందేమిటి? అమృతమంటే సారాయి కాదురా పామరుడా – నాడు దేవాసురులు యిదే చెడతాగినారు.

**దుకాణ:** (నలుగురివైపు జూచి) సూశారా భాయి నే మొదట్నించీ యిదేకదా సెపుతూ ఒచ్చేవోణ్ణి– అఖాడాకొస్తేగాని పరబ్బరమం దొరకదు.

**బైరాగి :** కాసీలో మేమూ వక బ్రాహ్మడు బ్రహ్మగ్యాన సమాధికి కూర్చున్నాము. బుడ్డీమీద బుడ్డి, బుడ్డీమీద బుడ్డి తెల్లవారేటప్పటికి యిద్దరికీ తన్మయం అయిపోయింది. మరి రెండు రోజులకుగాని నేను సమాధిలోంచి లేవలేదు. మరి ఆ బ్రాహ్మడు, యెప్పటికీ లేవలేదు. పరమాత్మలోకలిసి పోయినాడు. (పెన్షను సిపాయి అచ్చన్న ప్రవేశించుచున్నాడు)

**దుకాణ:** ఈయన సిపాయి అచ్చన్నగారు మంచి బరమగ్గాని.

**అచ్చన్న:** నేను యేహపాటివాఢనండీ, మీ ద్రాసుఢను, తమవంటివారు వచ్చినప్పుఢల్లా పాదసేవ చేసుకుని నాలుగు స్రంఘతులు నేర్చు కున్నాను.

**బైరాగి :** నీ ముఖాన్ని మంచి బ్రహ్మకళవున్నదిరా నరుడా.

**అచ్చన్న:** (దుకాణదారుతో) నాహస్రంగతి యిప్పుడు త్రెలిసింధా (పైకి) తమ క్రటాక్షం.

**హేడ్ :** అచ్చన్నగారు మా బాగాపాడుతారండీ.

**బైరాగి :** యేదీ కొంచెము పాడూ.

**దుకాణ:** ఒక గళాసుచ్చుకు మరీ పాడండి.

**అచ్చన్న:** (యాగంటి లింగడిపాట పాడి, పాటయిన తరువాత మరి రెండు గ్లాసులు పుచ్చుకొని) మాఘురువుగాహరు యీ క్రీర్తన ప్రాఢుతూ రెండు హడుగులుపైకి లేహచేవారు.

**బైరాగి :** నాశక్తి చూపిస్తాను చూడండి. నరుడా ఆ సీసా యిలాగందుకో మంత్రిస్తాను, వక్కొక్క గలాసు పుచ్చుకుని కళ్లు మూసుకుని లోపలిదృష్టితో చూడండి. నేను లంబికా యోగం పడతాను.

(అందరును త్రాగి కళ్లుమూసికొనుదురు.)

**బైరాగి :** కళ్లు మూసుకున్నారా?

**అందరు:** మూసుకున్నాము గురోజీ.

**బైరాగి :** బస్ – యికకళ్లు తెరవండి, యెన్ని అడుగులు పైకిలేచానో చూశారా?

**అచ్చన్న:** యీవేహళ యేమిసుధినం! మరి వక్క క్రీహర్తన మనవిచేసుకుంటాను.

(అని మరి వకగ్లాసు పుచ్చుకొనును.)

**బైరాగి :** యితను నిజంగా బ్రహ్మగ్యానిలాగ కనబడుతున్నాడు.

(వీధిలోనుంచి రామప్పంతులు తలుపు, తలుపు అని యనేకమారులు పిలుచును. ఎవరును పలుకరు.)

**రామప్ప:** గాడిదలు యెవరూ వినిపించుకోకుండా వున్నారు. (అని గట్టిగా) హెడ్డు గారూ కూనీ, కూనీ జరిగింది.

**హేడ్ :** యెవరో కూనీ, కూనీ అంటున్నారు.

**రామప్ప:** లుబ్ధావధానులు భార్యను చంపివేశినాడు. నూతిలో ధభీమని పడివేయడం నేను చూచినాను, ఆ తరువాత శవంతీసి పాతిపెట్టి వేసినాడు.

**హేడ్ :** (తలుపు తీసికొని యవులకువెళ్లి) యెందుకు చంపాడేమిటి.

**రామప్ప:** పెళ్లయిన మూడు రోజుల్లోగా రెండు వందలు రూపాయలు ఖర్చు పెట్టిందట. యింతే కాకుండా యిది వుండడం మీనాక్షి వ్యాపారానికి భంగం; యీ గుంట దానిగుట్టు వీధిలో పెట్టినది.

**హేడ్ :** యేదో ఆలాగచెప్పు అది వుంటేగాని కూనీయెప్పుడూ జరగదు. యిన్నాళ్లకు దొరికాడవుధాన్లు, నా రెండు వందలరూపాయల పత్రం లాగేస్తాను.

**రామప్ప:** అయితే నీమట్టుకేనా? భాయీ! నాకంటె అపహరించాడు. దాని ఖరీదు కూడా తియ్యాలి సుమా.

**హేడ్ :** అదంతా నువ్వే సెటిలుచేసుకో – గాని వక్కడి సాక్ష్యం చాలదే.

**దుకాణ:** నాకేమైనా పారేస్తే నేను సాచ్చికం పలుకుతాను.

**హేడ్ :** మూడోసాక్షికూడా కావాలే

**బైరాగి :** కావలిస్తే నేను కూడా వస్తాను, మావంటి జ్ఞానులుకు అబద్ధం అన్నమాటలేదు, లోకం అంతా మిధ్య, నువ్వూ నేనూ కూడా అబద్ధమే. దాని రహస్యం అది. ఏమయినా డబ్బు పారవేస్తే హరిద్వారంలో నేకడుతూన్న మఠానకు పనికివస్తుంది.

**హేడ్ :** అచ్చన్నగారుకూడా వస్తే బాగుండును గాని, ఆయన సమాధిలో వున్నాడు.

**దుకాణా:** మనము చాలమా యేమిటి, ఆయన రేపు సంజేళకిగాని సమాదిలోంచి లేవడు. (అంతా వెళ్లిపోనిచ్చి దుకాణాదారుడును. పంతులును వెనుక నాగుదురు. పంతులెవరును లేకుండ నిటునటు చూచి యొకగ్లాసు పుచ్చుకొనును)

**దుకాణా:** మీ పద్దు పాతిక రూపాయలయిందండి. అందర్లాగా మిమ్మల్నింటికొచ్చి అడగడానికి ఒల్లలేదుగదా?

**రామప్ప:** ఈ వ్యవహారంలో యేమయినా చెయ్యితడి అవుతుంది. నీపద్దు మొట్టమొదట పయిసలు చేస్తాను. (అని నిష్క్రమించును)

## ఒకటవస్థలము - లుబ్ధావధానులు యింటిపెరడు

(హేడ్ కనిష్టేబును, లుబ్ధావధానులును మాటలాడుచుందురు)

**హేడ్** : నాపత్రం యిచ్చివేస్తే కేసు నీళ్లు కారించివేస్తాను.

**లుబ్ధావ**: వడ్డీమట్టుకు వదిలివేస్తాను ఆలాగు కటాక్షించండి.

**హేడ్** : మళ్లీ మొదటికి వచ్చినారూ?

**లుబ్ధావ**: నాకు ఏఖర్మం తెలియదు నిరపరాధినిసుమండీ నాయనా?

**హేడ్** : యీ కబుర్లు నా దగ్గిర యందుకు చెపుతారండీ? పంతులు చూచారు, కీపర్ చూచాడు, గురోజీగారు చూచారు, గ్రంథం అంతా సంపూర్ణంగా ఉన్నది; రిపోర్టు చేస్తినా ఊరి బయట మర్రిచెట్టుకి మిమ్మలిని తప్పకుండా వురిదీసి వేస్తారు.

**లుబ్ధావ**: మరి వీళ్లకేమి యిచ్చుకోవలెను?

**హేడ్** : అంతకు తక్కువకు వప్పరు, యాభై రూపాయలు ఇయ్యండి.

**లుబ్ధావ**: యిరవయి రూపాయిలిచ్చుకుంటాను.

**హేడ్** : పోనియ్యండి ముప్పయిరూపాయలు ఇయ్యండి (అని పత్రమును రూపాయిలును పుచ్చుకొనును)

**లుబ్ధావ**: డబ్బంతా అయిపోయినది యిక ముష్టికి బయలుదేరాలి.

**హేడ్** : డబ్బుమాటకేమి ప్రాణం దక్కింది మరి భయం పడకండి. మీ భార్యా పరారి అయిపోయిందని రిపోర్టు వ్రాశేస్తాను.

(నిష్క్రమించుచున్నారు.)

★★★

## రెండవ స్థలము - లుబ్ధావధానులు పెరటిగోడ అవుతల

(రామప్పంతులు, దుకాణాదారు, బైరాగియు నుందురు, హేడ్ కనిష్టీబిల్ ప్రవేశించును)

**హేడ్** : (గట్టిగా) రండి వెళ్లిపోదాము.

**రామప్ప**: మీమాట ఫయిసలయింది కాబోలు - మామాట యేమిటి.

**హేడ్** : అంతా పైసలు చేసుకొచ్చాను.

**రామప్ప**: యేమిటి ఫయిసలు చెయ్యడము-నాకంటె యగేశాడు. రెండువందలిస్తేనే కాని కూడిరాదు.

**హేడ్** : ఆకాశం కన్నం పడినట్టు కబుర్లు చెపుతారు. మీ యిద్దరికి ఇదిగో చెరి అయిదు రూపాయిలు – గురోజీగారికి పది.

**బైరాగి** : (పుచ్చుకుని) నారాయణస్మరణ, రాత్రి మేము కాసీవెళ్లి రేపుసాయంకాలానికి తిరిగీ వస్తాము.

**హేడ్** : చిత్తం తమ దయవల్ల యీ వేళ యీ లాభం కలిగింది. నాకు మహాకులాసాగా వున్నది.

**దుకాణా**: (బైరాగి చెవులో) యీవేళే చెన్నాపట్టంనించి ఫష్టురకం బ్రాందీ వొచ్చింది. ఒక్కమాటు దుకాణం దగ్గిరికి దరిశనం యిప్పించి మరీ కాశీ వెళ్లాలి.

**రామప్ప**: (తనలో) గాడిద తనమట్టుకు తడుముకుని వూరుకున్నాడు. నేను చెప్పకపోతే యేమీ లేకపోవును. ఆ బైరాగి వెధవ కాసీ వెళ్లి రేపు సాయంత్రానికి వస్తాడట. వాడికి పది రూపాయిలిచ్చేశాడు. యీ హేడ్డుకి యేమీ నదురూ బెదురూ లేకుండా వున్నది. కంటె పోయిందంటే అయిదురూపాయిలు చేతులో పెడతాడూ? (పైకి) కనిష్టీబు అన్నా! నా కీ వ్యవహారంలో చాలా నష్టం కలుగజేసినారు. నాకంటె పోయింది. మీకు యేమీ చీమా దోమా కుట్టినట్టయినా లేదు. ఆ ముసలివాడిని మళ్లీ పట్టుకుంటాను – మీరు ఆ వూసుకు రాకూడదు సుమండీ.

**హేడ్** : నే మొదటే చెప్పాను మీ కథ మీరే శెటిలు చేసుకొమ్మని. (తనలో) దొంగవేషాలు వీడికంటె పోయిందట – వీడక్కడికిపోతే – నేను మధురవాణి దగ్గిరకు వెళతాను.

(పంతులు తప్ప అందరూ నిష్క్రమించుచున్నారు.)

**రామప్ప**: ఈ హేడ్ తాళం పట్టించాలి – వాడి సొదే చూచుకున్నాడు గాని నా మాటాలోచించాడు కాడు, బిచ్చం బిసాదు అయిదురూపాయిలా నావంటివాడికి యిప్పిస్తాడు? వీడికిగాని యీ వూరినుంచి వుద్వాసన అయితే మధురవాణివైపు చూసేవాడు మరెవడూ లేడు. ఆకాశరామన్న అర్జీలు నాలుగు యినస్పెక్టరుకి, పోలీసుకి కొట్ బజాయించేస్తాను.

(అని నిష్క్రమించును.)

★ ★ ★

## మూడవస్థలము - అగ్నిహో(త్రావధానులయిల్లు

(అగ్నిహో(త్రావధానులు, వెంకమ్మ (ప్రవేశించుచున్నారు.)

**అగ్నిహో** :రెండు జాముల రా(త్రికి (ప్రయాణం.

**వెంకమ్మ** : యెన్ని బళ్లేమిటి?

**అగ్నిహో** :యిరవయ్యైదుబళ్లు.

**వెంకమ్మ** : అన్ని బళ్లెందుకేమిటి?

**అగ్నిహో** :నులకవారు, నెమలివారు, న(ప్రవారూ అంతా వస్తారు. కరణంగారి కుటుంబముకూడా వస్తామని చెప్పారు దివాంజీ సాహేబుగారు ఒక యేనుగ, నాలుగు గుఱ్ఱాలూ ఇచ్చారు.

**వెంకమ్మ** : అల్లుడినడుం ఇదివరకు విరగకుండా వుంటే దీనితో విరిగిపోతుంది. యెందు కేమిటి యీ వెధవ పటాటోపమంతాను? తోవలో మనమింత మందికి తిండి పెట్టాలి కదా? వూళ్లో అయిన వాడినీ కానివాడినీ వెంట పెట్టుకు వెళ్లితే అల్లుడు పకీరౌతాడు - అమ్మిముష్టెత్తుకోవాలి.

**అగ్నిహో** : ఉత్సాహభంగమ్మాట్లాడకు, నాకు కోపము మా(త్రము తెప్పించకు. లుబ్ధావధాన్లు పెళ్లియెంతో వైభవంగా చేస్తాడు.

**వెంకమ్మ** : చాలును (ప్రయోజకత్వం. తోచినప్పుడల్లా ఆడవాళ్లను పశువులలాగ బాదడమే కదా ఇప్పటికిన్నీ, మా మంచి సంబంధం చేశారు లెండి మావాళ్లు కోపంవచ్చి రావడం మానేశారు.

**అగ్నిహో** : మీవాళ్లు రాకపోతే పీడాచీడా కూడా పోయింది. మీవాళ్లు ఓర్వలేని గాడిదలు.

**వెంకమ్మ** : అయ్యవారు బయలుదేరి వెళ్లిపోతామంటున్నారు. ఆయన కేదో పరిక్ష వుందట.

**అగ్నిహో** :ఆయన వెళ్లిపోతె పెళ్లిసప్తె యెంతమా(త్రమూ జరగదు. యేలాగైనా వుండమని బతిమాలు కుంటాను. ఆయనలాంటి అల్లుడుంటేనా, లోకమంతా సాధింతును. (నిమ్మ ళముగా) చిన్నమ్మిని ఇతనికిస్తె తీరిపోవును. అయితే డబ్బుంటేనేగాని వ్యవహారం జరగదు.

(అని ని(ష్క్రమించుచున్నారు)

(గిరీశం, బుచ్చమ్మ, (ప్రవేశించుచున్నారు.)

**గిరీశ** : మీ పెనిమిటి యెన్నేళ్లై పోయినాడు.

**బుచ్చమ్మ**: పెళ్లి సదస్యంనాడే.

గిరీశ : ఆహా! ఆ తల్లిదండ్రులు నీకు శత్రువులైనారు గదా! ముసలివాడికి కట్టిపెట్టడం కంటె శవానికి కట్టిపెట్టడం మేలు. ఆహా! స్త్రీలకు వెధవరికం యెంత దురవస్త, మీవంటి శోభ గల ముఖమునకు బొట్టూ కాటుక యుంటే యేమి సొంపుగా నుండును. ఆ తుమ్మెద బారుల నపహసించు జుత్తుతీసి వేయుదురు గదా? వంటిపూట తిండిబెట్టి ఆ దబ్బపండువంటి శరీరము కృశింపచేతురు. ఇంటిచాకిరంతా నీవే చేయవలెను గదా? మనవాళ్ల ఆచారము లెంత దుర్మార్గముగానూ, శాస్త్ర విరుద్ధముగానూ వున్నవి.

బుచ్చమ్మ: మన శాస్త్రాల్లో అలా చెయమనే వుందటే?

గిరీశ : రామాయణము నెత్తిని పెట్టుక ప్రమాణం చేస్తాను. చిన్న పిల్లని ముసలి వాడి కివ్వగూడదని శాస్త్రమున్నది గాని, విధవలను పెళ్లాడగూడదని లేదు. మీ తమ్ముడికి పాఠం చెప్పేటప్పుడల్లా శాస్త్రాలూ, సబబులూ చదివి వినిపించుతూనే వున్నాను కానూ. నేను సలహాయిచ్చినట్టు వెళ్లిపోడమే వీళ్లకు శాస్తి. నీయందు నాకు అపరిమితమైన అనురాగము వున్నది. నీవు ఆలాగు రాకపోయినా యీ సంగతి మీవాళ్లతో చెప్పినా తప్పకుండా ప్రాణత్యాగంచేస్తాను. నీ కోసమే ఇన్నాళ్లు మీ వాళ్ల యింట్లో అరవచాకిరీ చేస్తూ ఉన్నాను.

బుచ్చమ్మ: మీరు చెప్పిన మాటలు బాగానే వున్నవి గాని జాతిలోనుంచి వెలివేస్తారు గదా అని భయము మట్టుకు వదలకుండా వున్నది.

గిరీశ : నీ యడల ఇంత అక్రమముగా నడిచినవాళ్ల లోంచి విడిచిపోతే నీకు వచ్చిన నష్టం యేమి? యింత సొగసూ, యిన్ని సద్గుణములూ బూడిదెలో పోసిన పన్నీరు అయి పోయెను గదా అని విచారిస్తూన్నాను. గౌర్నమెంటువారు మళ్లీ పెండ్లాడిన వెధవల్ని కులములో కలుపుకొమ్మని ఆక్టుకూడా కొద్ది రోజులలోనే ప్యాసుచేయడానికి సిద్ధంగా వున్నారు.

బుచ్చమ్మ: లేచిపోయి మావాళ్లందరికీ–విచారం కలగచేయడంకంటె నేను బాధపడుతూ అయినా యిక్కడ వుంటేనే మంచిది కాదూ?

గిరీశ : నీవు యెక్కడ వున్నా యేమిచేసినా నీకు లోపంలేదు. వజ్రమెక్కడున్నా వజ్రమే, కానీ నీవు రాకుంటే నా బ్రతుకంతా వృధా అయిపోతుంది. నా ఇష్టము నెరవేరకపోయిన యడల జీవించడమందు యెంతమాత్రమూ అభిలాషలేదు. నీవు మీవాళ్లను విడవవలసి వస్తుందన్నావు? నీకింత అపకారము చేసి నిన్నింత బాధపెడుతూ వున్నవాళ్లను, విడిచేమి విడవకేమి. నెత్తి మీద పువ్వులాగ ధరిస్తాననిన్నీ, నీవు లేక జీవించలేననిన్నీ మనవి చేసుకుంటూ వున్న నన్ను పొందక పోవడం ధర్మమా (అని మోకాళ్లపడి చేయిపట్టుకుంటాడు).

**బుచ్చమ్మ**: అయితే మనము వెల్లిపోతే ఆపైన గతేమిటి?

**గిరీశ** : వీరయ్య పంతులుగారు మహాయోగ్యులు, ఆయన్ను చేరుకుంటే మనకి లోపం వుండదు. యీ సొసైటీ తాలూకు లక్షలకొలది డబ్బువున్నది, డబ్బు విషయమై నీకు విచారంవద్దు. నేను పరిక్ష ప్యాసుఅయినాను కదా?

**బుచ్చమ్మ**: అయితే మనం యేలాగు వెళ్లడం?

**గిరీశ** : యెల్లుండి రాత్రి జగన్నాధపురంలో మజిలీచేస్తాము. ఆరాత్రి ప్రయాణంలో నీ బండితోవ తప్పించి శౌంతాం మార్గంగా పెట్టించివేస్తాను.

**బుచ్చమ్మ**: నా బండిలో మా తమ్ముడుకూడా కూర్చుంటాడే?

**గిరీశ** : వాడిని యేనుగుమీద యెక్కిస్తాను?

**బుచ్చమ్మ**: కానియ్యండి – అలాగేను వెళ్లండి? నా మనస్సేమీ మనస్సు లాగుంది కాదు (అని కన్నీళ్లు విడుచును.)

**గిరీశ** : నేను చెప్పినట్టు చేస్తానని చేతులో చెయ్యివేస్తేనే కాని వెళ్లను.

**బుచ్చమ్మ**: (కొంత సేపాలోచించి) సరే.

(ఇద్దరు నిష్క్రమించుచున్నారు.)

★★★

## నాల్గవస్థలము – జగన్నాధపురం సత్రం

(గిరీశం, వెంకటేశం ప్రవేశించుచున్నారు)

**వెంకటే**: రాత్రి మీరూ నేనూ కూడా వొక బండిలోనే కూర్చుందాము.

**గిరీశ** : డామ్‌బండీ – నేను హార్సుమీద కూర్చుంటా.

**వెంకటే**: అయితే నాకూ బండీవద్దు హార్సు యెక్కలేనే మరి సాధనం యేమిటి ?

**గిరీశ** : అయితే నీకు యెలిఫెంటు. మావటివాండ్రతో బందోబస్తు చేస్తాను మీవాళ్లతో యీ ప్రయత్నం చెప్పకుమా.

## అయిదవస్థలం- (లుబ్ధావధానులు ఇల్లు)

(లుబ్ధావధానులు, రామప్పంతులు ప్రవేశించుచున్నారు.)

**రామప్ప:** అయితే కంటె ఇవ్వనంటావా?

**లుబ్ధావ:** నీకంటె సంగతి నాకేమీ తెలియదు.

**రామప్ప:** అయితే నీమీద క్రిమినల్ చార్జీ తేవలసి వుంటుంది.

**లుబ్ధావ:** పీకకోసినాగానీ కంటెమాట నాకేమి తెలియదు.

**రామప్ప:** యింతా చదువుకుని అబద్ధం ఆడేస్తావయ్యా.

**లుబ్ధావ:** అక్షరాలా.

**రామప్ప:** నీకూ నాకూ వుండే స్నేహం ఇంతేనా నా మాటవిని కంటెఇచ్చేయి మధురవాణి దానికోసం అల్లరి పెట్టేస్తూన్నది.

**లుబ్ధావ:** యీ కబుర్లు నాతో యెందుకు చెపుతారు? ససేమిరా కంటె సంగతి నాతో మాట్లాడవద్దు. నీ స్నేహంవల్ల కావలసిన వుపకారం ఎంత కావాలో అంతా అయింది. వద్దంటూ వుంటే పెళ్లాడమని ప్రాణాలు తినేశావు. డబ్బు పోవడం పెళ్లాము పారిపోయి పరువు పోవడం ఆలాగు వుండగా మీది మిక్కిలి కూనీకేసుకూడా పీకలమీదికి తెచ్చావు. నాపాలింటి శనిగ్రహంనీవే. అందుకు తోడు యేల్నాటిశని రోజులు కూడా తటస్థించాయి? రేపు రాత్రి బయలుదేరి కాశీయాత్ర వెళ్లడానికి నిశ్చయించాను. పెట్టవలసిన బాధేమో పెట్టావు. చెయ్యి చిక్కిన డబ్బేమో చెయ్యి చిక్కింది. మరి కంటే గింటే అని బాధపెట్టక లేచిపోతే బహువుపకారంగా ఆలోచించుకుంటాను.

**రామప్ప:** మొగుణ్ణి కొట్టి మొగసాలెక్కింది అన్న సామెతగా, నువ్వూ ఆగుంటూరు శాస్త్రులూ కలిశిచేసిన దగావల్ల యాభై రూపాయీలూ, కంటే, పోవడమే కాకుండా నేను పెళ్లిలో పడ్డశ్రమ యెంతమాత్రమూ ఆలోచించినావు కావు? చిన్నప్పటినుంచీ నీ దగ్గిర యెంతో స్నేహభావంగా వుండే నన్ను యీలాగు దగా చెయ్యడం యెంతమాత్రమూ నీకు న్యాయముకాదు. కేసులో నా వూసే ముంది. కూనీ జరిగిన తరువాత పోలీసు వాళ్లూరు కుంటారా? బలవత్తరమయిన సాక్ష్యం వచ్చింది. నన్నేమి చెయ్యమంటావు? ఇంకా నేను చెప్పబట్టే నిన్నీలాగు వదిలేశారు. న్యాయమాలోచించి నాకంటె నాకిప్పించండి.

**లుబ్ధావ:** యెవరివల్ల వస్తేనేమి నా ప్రాలుద్దం ఆలాగువుంది యేలాగా రేపు బయలు దేరి వెళ్ళిపోవడానికి సిద్ధంగా వున్నాను. మీకంటె సంగతి మీరే కొవ్వి తెచ్చిపెట్టుకున్నారు – నన్ను ఆ విషయమై అడగవలసిన ప్రసక్తిలేదు.

**రామప్ప:** బాగా ఆలోచించుకోండి నావల్ల చాలా వుపకారం పొందినారు.

(లుబ్ధావధానులు తలుపువేసుకొని లోపలికి వెళ్లిపోవును)

**రామప్ప:** ముసలిగాడిద టంగాడుకాడు. రేపు రాత్రి బయలుదేరి వెళ్లిపోతానంటూన్నాడు. వీడు వెళ్లిపోయినట్టైనా నా కంటెకు నీళ్లధారే – ఇంటిదగ్గిర రోజూ మధురవాణి ఘాలివాన పెట్టేస్తూ వున్నది. యీ రాత్రి అదన్నమాటలుచూస్తే దానిని పొడిచేసి పొడుచుకోవాలని బుద్ధిపుట్టింది. వీడు వెళ్లేలోగా ఆకాశరామన్న అర్జీ అంది పోలీసువస్తే బాగుండును. ఈ వేళ దశమికాదూ; ఆ! అయితే ఫర్వాలేదు. ఈ రాత్రి అగ్నిహోత్రావధానులు తోటలో దిగుతాడు. అక్కడ యేదైనా పన్నాగం పన్నాలి. ఇప్పుడు యింటికి వెళ్లితే మధురవాణి పేడనీళ్లు పట్టుకువస్తుంది నాకు యేమీ తోచకుండావున్నది తెల్లవారగట్ల కావచ్చినది. కాలోచిత కృత్యములు తీర్చుకోవడముకు చెరువుకు వెళ్లుదాము.

★★★

**ఆరవస్థలము – తోట – పెళ్లి వారి బళ్లు చెరువుగట్టుమీద నుండును.**

**అగ్నిహో** : బళ్లుదింపండి – బళ్లు దింపండి – సాయేబూ యేనుక్కి, కావలసినంత రొడ్డవున్నది. చెరువు, స్నానానికి మహాబాగా వున్నది. యెవరయ్యా చెరువు గట్టుమీద?

**రామప్ప:** నా పేరు రామప్పంతులంటారు.

**అగ్నిహో** : లుబ్ధావధానులుగారు మిమ్మలను పంపించారా యేమిటి?

**రామప్ప:** యెందుకండీ?

**అగ్నిహో** :మేమొస్తామని లుబ్ధావధానులుగారు యెదురుచూస్తూ ఉండలేదూ? నా పేరు అగ్నిహోత్రావధానులంటారు.

**రామప్ప:** మీరేనా అగ్నిహోత్రావధానులుగారు యేమి వచ్చారేమిటి?

**అగ్నిహో** : పెళ్లిమాట మీకు తెలియదా యేమిటి?

**రామప్ప:** పెళ్ళెవరికండీ?

**అగ్నిహో** : మీదీవూరు కాదా యేమిటండీ? మా పిల్లను లుబ్ధావధానులుగారికిస్తాము.

**రామప్ప:** లుబ్ధావధానులుగారికి పెళ్లి అయిపోయిందే?

**అగ్నిహో** : పంతులుగారాశ్యాలాడుతున్నారు – హాశ్యాలకేమిగాని ప్రయత్నాలు యేలాగు జరుగుతున్నాయి యేమిటండీ? లుబ్ధావధానులుగారు బహుసామంతులని వింటున్నాము?

**రామప్ప:** మీరే హాశ్యాలాడుతున్నట్లున్నది. పెళ్లి అయి పదిరోజులైంది. మీరీ సంబంధం అక్కరలేదని వుత్తరము వ్రాసినారట. అందుపైని గుంటూరు నుంచి వొక శాస్త్రుల్లు వస్తే ఆయన కొమార్తెను పన్నెండువందల రూపాయలు యిచ్చి పెళ్లాడాడు.

**అగ్నిహో** : అన్నగారూ హాశ్యం ఆడుతున్నారు – న్యాయంగాదు సుమండీ.

**రామప్ప** : గాయత్రీసాక్షి, నేను యెప్పుడూ అబద్ధం ఆడి యెరుగను. నా మాట నమ్మకపోవడం ధర్మమేనా?

**అగ్నిహో** : గుండెలు తీసినపని. రండీ గాడిదకొడుకుని యెమికలు విరగకొడతాను.

**రామప్ప:** నేను రానండి – గుంటూరు సంబంధం చెయ్యవద్దంటే నాతో దెబ్బలాడాడు. అప్పటి నుంచీ నాకూ అతనికీ మాటలులేవు – మీరు వెళ్లి మాట్లాడి రండి. సూర్యోదయము అయేసరికి వచ్చి కలుసుకుంటాను.

**అగ్నిహో** : గాడిదకొడుకింత స్వామిద్రోహం పని చేస్తాడూ? నా కేమీ నమ్మకము లేకుండా వుంది – నిజమైతే పులుసులోకి యెమికలు లేకుండా విరిచేస్తాను.

(నిష్క్రమించును)

**రామప్ప:** పిశాచంలాగు వెళ్లుతున్నాడు – కంటె యివ్వనందుకు తగినశాస్తి అవుతుంది–నా సంగతి చూస్తే ఆవు పెయ్యాకాదు – గేదెపెయ్యాకాదు, దిక్కుమాలిన పెయ్యలాగున్నది. ఇంటికి వెళ్లితే కంటెకి తాపులాట తప్పదు. వెళ్లకపోతే కనిష్టీబు ప్రవేశిస్తాడేమో అన్న బెంగ.

## ఏడవ స్థలము – రామప్పంతులు ఇల్లు

**(రామప్పంతులు వెనుక ప్రక్క నుంచే తొంగితొంగి చూచుచు నిమ్మళముగా అడుగువేయుచు ప్రవేశించును)**

**రామప్ప:** మధురవాణీ.

**మధుర:** అయ్యా?

**రామప్ప:** యెవరు యింట్లోంచి నల్లకోటు తొడుక్కుని వెళ్లిపోతున్నాడు?

**మధుర:** ఇల్లుతుడిచేదాన్ని కాబోలు చూచి ఆలాగనుకున్నారు. మీ కంతకంతకు మతిపోతూంది. నా కంటేదీ? తాకట్టు పెట్టేశారు. నాకు తెలుసును. అది అడుగుతానని యీ వేషాలు వేస్తూన్నారు. యీ సరుకులు మీరు తీసుకోండి – మీరు నన్ను సార్లా చెయ్యరు – నేను నూతులో బడిపోతాను (అని యేడ్చును)

**రామప్ప:** (తనలో) గట్టి వుపద్రం వచ్చింది. (పైకి) సుందరి! యెందుకు నిష్కారణంగా విచారిస్తావు యీ నెలలో రొండు కంటెలు సంపాదించి యివ్వకపోతే నా మీసం గొరిగించెయ్యి

**మధుర:** నాకేమి అక్కరలేదు నాకంటె నాకు కావాలి.

**రామప్ప:** (దగ్గిరకు వెళ్లి) గడ్డం పట్టుకు బ్రతిమాలుకుంటాను. (అని గడ్డము పట్టుకొనబోవును, మధురవాణి తోసివేయును)

**రామప్ప:** కాళ్లు పట్టుకుంటాను నన్ను రక్షించి యేలాగైనా ఈ మాటు కాపాడు.

**మధుర:** ఆ కంటె యెవర్తెకిచ్చావో దాని కాళ్లేపట్టుకో. (అని తన్నివేయును)

## ఎనిమిదవ స్థలము - తోట

**(రామప్పంతులు, అగ్నిహోత్రావధానులు, వెంకమ్మ, మొదలగువారు)**

**అగ్నిహో:** గాడిదకొడుకుని మా చెడ్డదెబ్బలు కొట్టేశాను. యేనుగులూ గుఱ్ఱాలూ తెచ్చాను - వీడి శ్రార్ధము మీదికి త్రోవ ఖర్చులైనా వాడు వొక దమ్మిడి ఇవ్వడష.

**వెంకమ్మ:** మన ప్రాలుధ్ధం గాని యెందుకీ సంబంధం వద్దంటే విన్నారూ. నేను మొదటే అను కున్నాను - వచ్చేటప్పుడు పిల్లి యెదురుగుండా వచ్చింది.

**అగ్నిహో:** మాదర్చోద్ వూరుకో? ఆడముండలకేమి తెలుసును. అన్నగారూ - క్రిమినల్ మీద వెళ్లడానికి అవకాశంగా వుంటుందా? మా దగ్గిర గిరీశంగారని అయ్యావారు ఒకరున్నారు - ఆయనకీ లాభోగట్టా మా బాగా తెలుసును. ఆయనను కూడా సలహా చేద్దాం.

**రామప్ప:** (తనలో) ఇదేమిటి పులిమీద పుట్రొచ్చింది వీడినిపట్టి గ్రంథంచేయించి డబ్బు పిండాలనుకుంటూవుంటే నా చేతిలో నుంచి వ్యవహారము తప్పిపోయేటట్టు కనపడుతూ వున్నది. (పైకి) చిన్నప్పటినుంచీ, లాలో పుట్టి పెరిగాను. నా కంటె యెక్కువ తెలిసిన వాడొకడున్నాడా? అయినా యిందులో సలహా కేమున్నది. మీరు మాత్రం యెరగని లా యేముంది. మొట్టమొదట క్రిమినల్కి తెచ్చేది, తరవాత సివిలు, నా సలహాప్రకారం వెళితే యీ కేసులో నాలుగువేల రూపాయిలు డామేజి యిప్పిస్తాను. మొట్టమొదట ఖర్చులకి మట్టుకు కొన్ని రూపాయిలు పట్టుకోవాలి.

**అగ్నిహో:** నా దగ్గిర లెఖ్క దమ్మిడీ లేదండీ, యీ గాడిదెకొడుకు రూపాయిలిస్తాడనే నమ్మకంచాత నేనేమీ తేలేదు.

**రామప్ప:** యింటికి వెళ్లి లెఖ్ఖపట్టుకు వచ్చేటప్పటికి వ్యవధి అయిపోతుంది. శుభస్యశీఘ్రం అన్నాడు. మీ ఆలోచనేమిటి?

**అగ్నిహో** : యిదేదో అయితేనేకాని యింటి మొఖంచూచేదిలేదు. ఓ సరుకేదైనా మా అమ్మిది యీ వూళ్లో అమ్మేస్తాను.

**రామప్ప:** అయితే పట్టుకురండి పోలిశెట్టికి అమ్మేదాము. మీరు లుబ్ధావధాన్లని కొట్టేటప్పుడు పోలిశెట్టి దగ్గిర వున్నాడని చెప్పారు. లుబ్ధావధాన్లు మీమీద కేసుతేవడం స్వతస్సిద్ధం. పోలిశెట్టి మీమీద సాక్ష్యం పలక్కుండా వాడికేమైనా యిచ్చి కట్టుకుందాము.

**అగ్నిహో** :ఆ సలహా బాగుంది. నాకూ అదే భయంవేస్తూవుంది.

**రామప్ప:** చూశారా ప్రతివాడికీ సలహా చెప్పడానికి చాతవుతుందండీ! అందులో యీ యింగ్లీషు చదువుకున్న అయ్యవార్లని సలహా అడిగితే కేసులు తేవద్దంటారు. వాళ్ల సొమ్మేం పోయింది. దొంగసాక్షాలు కూడదంటారు. యేవీ లేకపోతే కేసులు గెలవడం ఎలాగు?

**అగ్నిహో** :మా అయ్యావారుమట్టుకు మంచి బుద్ధిమంతుడూ, తెలివైనవాడండీ. కేసుల విషయమై అతనికి తెలియందేదీలేదు. అంత బుద్ధి మంతుణ్ణి యెక్కడా చూడలేదు, మీరు అతణ్ణి చూస్తే మీరూ అలాగే అంటారు.

**రామప్ప:** మీకు మరొకరు సలహా చెప్పవలసిన జరుగురుండదు. నా మాటవిని అయ్యావారిని తోడిచ్చి పిల్లల్ని యింటికి పంపించెయ్యండి, లుబ్ధావధాన్లు మీమీద చార్జీ తెచ్చేలోగా మనం ముక్కతగిలించేస్తేనేగాని బాధిస్తుంది, మరి వేగిరం ఏదో సరుకు పట్టుకురండి.

**అగ్నిహో** :యేదీ అమ్మి నిలా పిలువ్ (అమ్మేది, అమ్మేదియని పదిమందియు పిలుతురు)

**వెంకమ్మ** : అమ్మేది చెప్మా. బద్ధకించి బండీలో పడుకుందేమో పిల్చుకొస్తాను. (అమ్మిబండి యేది యనుచు నాలుగడుగులు నడుచును)

**ఒకరు** : అమ్మిబండీ యెక్కడా కనబడదు. బండీ, వెనక్కుండిపోయిందేమో?

**వెంకమ్మ** : అడుగో అబ్బున్నాడే, వీడెలావచ్చాడు? అబ్బీ నువ్వక్కయ్య బండీలో కూర్చోలేదూ?

**వెంకటే:** లేదు. నేను యేనుగెక్కాను.

**అగ్నిహో** :దొంగగాడిద కొడకా అయ్యావారేడ్రా.

**వెంకటే:** యెక్కడా కనబడదు.

**అగ్నిహో** :గుఱ్ఱం యేదీ, గుఱ్ఱపాడేడీ.

**వెంకటే:** రాత్రివేళ గుఱ్ఱం దిగిపోయి బండీయెక్కాడని గుఱ్ఱపువాడు చెప్పాడు.

**వెంకమ్మ** : అయ్యో దాన్ని లేవదీసుకుపోలేదు గద?

**దగ్గిరనున్న వారు** : ఆఁ! ఆఁ!

వెంకమ్మ : కొంప మునిగిపోయింది మరేమిటి (అని చతికిలబడును)

అగ్నిహో : (కోపముచేత వణకుచు) అయ్యవారు పకీరు ముండని తీసుకువెళ్లినాడూ? నగలపెట్టె! నాకోర్టు కాగితాలో!

వెంకటే: నా పుస్తకాల పెట్టెకూడా పట్టుకుపోయినాడు.

అగ్నిహో :(జందెము చేతుల బట్టి ముందుకు వెనుకకు కుడిచేయిలాగుచు) దొంగ లంజకొడకా! నువ్వే వాణ్ణి యింట్లో పెట్టావు, గాడిద కొడుకును చంపేదును. నాకు రవంత ఆచోకీ తెలిసింది కాదు. గాడిద కొడుకును పాతిపెట్టేదును.

రామప్ప: (దగ్గిరకువచ్చి) అయ్యవారు మహాదొడ్డవాడని చెప్పారే యేమి యెత్తుకు పోయినాడేమిటండి?

అగ్నిహో :యేమి యెత్తుకుపోయినాడా – నీ శ్రార్ధం యెత్తుకుపోయినాడు. పకీరు ముండ నెత్తుకపోయినాడు. యీగాడిద కొడుకు ఇంగ్లీషు జదువుకొంపతీసింది. (అని కుమారుని జుత్తుపట్టుకొని కొట్టబోవుచుండగా తెర దించవలెను)

★★★

# కన్యాశుల్కము

## పంచమాంకము

### ఒకటవస్థలము – విశాఖపట్టణములో మధురవాణి బసయెదుటి వీధి

**(రామప్పంతులు, అగ్నిహోత్రావధాన్లు ప్రవేశించుచున్నారు)**

అగ్నిహో : మనం పోలిశెట్టి దగ్గిర బదులెత్చిన రూపాయిలన్నీ అయిపోయినాయి, యిప్పటికీ ఖర్చులు ఖర్చులే అంటారు, నా దగ్గిర వక దమ్మిడీలేదు.

రామప్ప: ఖర్చు కానిదీ కార్యాలవుతాయిటయ్యా? మీ కడియం యెక్కడైనా తాకట్టు పెట్టండి.

అగ్నిహో : యీ వూళ్లో మనం యెరిగిన వాళ్లెవరున్నారు.

రామప్ప: రండి మధురవాణి దగ్గిర తాకట్టు పెడదాము.

అగ్నిహో : చేసేవి మాఘస్నానాలూ, దూరేవి దొమ్మరి కొంపలూ అని జటాంత స్వాధ్యాయిని నన్ను ముండలిళ్లకి తీసుకు వెళతావషయ్యా?

**రామప్ప:** మరి యేకొంపలూ తిరక్కపోతే కేసులు గెలియడం ఎలాగు? అది అందరు ముండల్లాంటి దనుకున్నారా యేమిటి? సంసారి వంటిది. ఐనా మీకు రావడం ఇష్టం లేకపోతే నాచేతికివ్వండి. నేనే తాకట్టుపెట్టి తీసుకొస్తాను.

**అగ్నిహో** :అలాక్కాదు నేను కూడా వస్తాను.

**రామప్ప:** యేదీ కడియం ఇలాగివ్వండి.

**అగ్నిహో** : యిది మాతాతగార్నాటిది. యిది యివ్వడమంటే నాకేమీ యిష్టంలేకుండా వుంది. డబ్బారికే ఖర్చుపెట్టించేస్తున్నారు. మీరు కుదిర్చిన వకీలు తగిన వాడుకాడు, యింగ్లీషూ రాదేమీ లేదూ.

**రామప్ప:** ఆయన్లాంటిచెయ్యి యీ జిల్లాలో లేదు. ఆయన్ని చూస్తే డిప్టీకలక్టరు గారికి ప్రాణం. ఇంతకీ మీరేదో పట్టుదల మనుషులనుకున్నా గాని మొదటున్న వుత్సాహం యిప్పుడు లేదు. మీకు డబ్బు ఖర్చుపెట్టడం యిష్టంలేకపోతే మానేసాయెను. యావత్తైలం తావద్వ్యాఖ్యానం అన్నాడు, మరి నాకు శెలవిప్పించెయ్యండి.

**అగ్నిహో** : (ఆలోచించి) అయితే తాకట్టు పెట్టండి. (అని నిమ్మళముగా కడియము తీసియిచ్చును)

**రామప్ప:** (తన చేతనెక్కించుచు) యీ కేసుల్లో యిలాగు శ్రమ పడుతున్నాను కదా? నాకొక దమ్మిడీ అయినా యిచ్చారుకారుగదా?

**అగ్నిహో** : అయితే నా కడియం వుడాయిస్తావా యేమిషి ?

**రామప్ప:** నేను మీకు యెలాంటి వకీల్ని కుదిర్చాను. ఆయన మీ విషయమై యంత శ్రమపడుతున్నాడు. ఇదుగో ఆయన వస్తున్నాడు.

(నాయడు ప్రవేశించును)

**రామప్ప:** (తనలో) యేమిటి చెప్మా వీడు మధురవాణి బసపెరటి దిడ్డీవేపునుంచి వస్తున్నాడు? వీడుకూడా మధురవాణిని మరిగాడా యేమిటి? వీణ్ణి యీ కేసులో నుంచి తప్పించెయ్యాలి.

**నాయడు** : యేమండీ రామప్పంతులన్నా, మిగతా ఫీజిప్పించారుకారుగద?

**అగ్నిహో** : మీరు రాసిన డిఫెన్సు బాగుంది కాదని భుక్తగారన్నారట.

**నాయడు** : ఎవడా అన్నవాడు గుడ్లు పీకించేస్తాను. రామప్పంతులన్నగారూ చూశారండీ – డిఫెన్సు యెంత జాగ్రత్తగా తయార్‌చేశానో. నా దగ్గిర హైకోర్టుక్కూడా ప్లయింట్లు రాసుకు వెళ్లిపోతారు, యీ కుళ్లు కేసనగా యేపాటి? నే చెప్పినట్టల్లా పార్టీ నడిస్తే నే

పట్టినకేసు పోవడమన్నమాట యెప్పుడూలేదు. యీ డిఫెన్సు చిత్తగించండి. (అని చంకలోని రుమాల్ కట్టతీసి విప్పి యందులోని యొక కాగితము తీసి చదువును)

'ఫిర్యాదీచెప్పిన సంగతులు యావత్తూ అబద్ధంకాని యెంత మాత్రం నిజంకావు.' చూశారూ ఆ వక్కమాటతోటే ఫిర్యాదీ వాదం అంతా పడిపోతుంది. 'ఫిర్యాదీ నామీద గిట్టక దురుద్దేశంతో కూహకంచేసి కేసు తెచ్చినాడు కాని యిందులో యెంతమాత్రం నిజంలేదు.

**రామప్ప:** డిఫెన్సు మాటకేమండి కాని అవధాన్లుగారు పైసా లేదంటున్నారు.

**నాయడు :** పైసాలేకపోతే పనేలా జరుగుతుంది?

**రామప్ప:** ఒక సంగతి మనవిచేస్తానిలారండి (రామప్పంతులు, నాయడు, వేరుగా మాటలాడుదురు)

**రామప్ప:** నాయడుగారూ మీ వకాల్తీ యీయన కేమీ సమాధానం లేదు. నే యెంత చెప్పినా వినక భీమారావు పంతులుగారికి వకాల్తీ యిచ్చాడు. మీకు యింగ్లీష్ రాదనీ, లా రాదనీ, యెవడో దుర్బోధ చేశాడు.

**నాయడు :** స్కాలెట్ దొరగార్ని మెప్పించిన ముండాకొడుకుని నాకు లా రాకపోతే యీగుంట వెధవలకుటోయ్ లా వస్తుంది. పాస్‌పీసని రెండు యింగ్లీషు ముక్కలు మాట్లాడడంతోటే సరా యేమిటి? అందులో మన డిప్టీకలక్టరు గారికి యింగ్లీషు వకీలంటే కోపం. అందులో బ్రాహ్మడంటే మరీని. ఆ మాట ఆలందరికి బోధపర్చండి.

**రామప్ప:** మరి కార్యం లేదండి, నే యెంతో దూరం చెప్పాను తిక్కముండాకొడుకు.

**నాయడు :** అయితే నన్నిలాగు అమర్యాద చేస్తారా? యీబ్రాహ్మడి యోగ్యత యిప్పుడే కలక్టరుగారి బసకువెళ్లి మనవిచేస్తాను.

(తెర దించవలెను)

★★★

## రెండవస్థలము - విశాఖపట్టణము, లుబ్ధావధాన్లుగారి బస

### (లుబ్ధావధానులు కూరుచొనియుండును)

**లుబ్ధావ:** రామనామతారకం భక్తి ముక్తి దాయకం; రామనామతారకం భక్తిముక్తి దాయకం- (అని స్మరణ జేయుచుండును). (తనలో) ఆహా! నా అంత దురదృష్టవంతుడు లోకంలో యెవడైనా వున్నాడూ? ఏల్నాడిశని రాగానే కాసీకి బయల్దేరి వెళ్లిపోవలసింది. బుద్ధి తక్కువపని చేశాను రామనామతారకం:- సౌజన్యారావు పంతులుగారు నిన్న పెట్టిన చివాట్లకి తల పగిలిపోయింది. ఇంత డబ్బుండీన్నీ కూతుర్ని ముసలివాడికి డబ్బుకు లోబడి అమ్మాను. అది మొదటి తప్పు, నా జీవానికి ఉసూరుమంటూ అది మానం, పరువూ, ప్రతిష్టా, చెడి, లేనిపోని కూనీకేసు పీకలమీదికి వచ్చి, జైల్లో పడ్డది. దానివంతు నన్ను జైల్లో పెట్టేస్తే నాకు విచారం లేకపోవును. యినస్పెక్టరు ముండాకొడుకు దాన్ని చేలపట్టాడు; ఈ పాపం యెవళ్లని కొట్టుకు పోతుందో. పెళ్లాం ముండ పారిపోవడ మేమిటి చంపేశామని మా మీద కేసేమిటి? కలి, కలి, కలి, కలి, కలి; కలి ముండుకు పోతూంది. రామనామతారకం - స్వయంకృతాపరాధం వగిచి కార్యంలేదు - రామ నామతారకం - ఈ రామప్పంతులే నా పాలిటి శెని, వేరే గ్రహం అక్కర్లేదు. లేకపోతే వెర్రిముండాకొడుకుని నా యింట్లో నే పడుండక ఆ వెధవమాట్లు విని కాలం అంతా మళ్లింతరువాత పెళ్లి చేసుకోవడమేమిటి. యెంత డబ్బు ఖర్చైపోయింది. పెళ్లికో రెండువేలు ఖర్చైపోయినాయి. హెడ్డు కనిష్టీబు వచ్చి కూనీ, కూనీ అని పత్రం తీసుకువెళ్లి పోయినాడు. ఆ తరవాత పోలీసొచ్చి మళ్లీ కేసు లేవదీసి అతనో సంచీ లాగేశాడు. మళ్లీ యేగాడిదకొడుకు యే పెంట పెట్టాడో కలక్టరు యిదంతా యెక్క తీశాడు. నిజం దైవానికి తెలుసును. మా అమ్మి పసిపిల్ల, సౌజన్యారావు పంతులుగారన్నట్టు యింత దారుణప్పని యెంత మాత్రం చేసి వుండదు. దాని వుసురూ నా వుసురూ యెవళ్లకు తగుల్తుందో, సౌజన్యారావు పంతులుగారు యిప్పుడు వస్తామన్నారు, ఆయనొక్కడే నాకు సత్యసంధుడు కనబడుతున్నాడు. కడమంతా వకీళ్లూ, పోలీసులూ అంతా పచ్చపదొంగలు, కలినిండిపోయివుంది - రామనామతారకం.

(రామప్పంతులు ప్రవేశించుచున్నాడు)

**రామప్ప:** మామా నాకేమీ మనస్సు మనస్సులాగుంది కాదు.

**లుబ్ధావ:** మహాప్రభో నీకు పదివేలు నమస్కారాలు. యిహ, యీ పకీరువెధవను వదిలివెయ్యి- రామనామతారకం -

**రామప్ప:** రామరామా! యెంత మాటంటావయ్యా. మీరు ఆపదలోవుండి విరక్తిచాత యేమాట లన్నా మేము మీవిషయంలో పనిచెయడం మాకు విధి. ముందూ వెనకా చూడ్డానికి యిహటైమ్ లేదు. వ్యవహారం అంతా ఖాక్తు పర్చుకువచ్చాను. పదివేలక్కర్లేదు. అయిదు వేలిచ్చినట్టైనా యినస్పెక్టరుగారు బలమైన డిఫెన్సు సాక్ష్యంకూడా కుదిర్చి పెడతారు. కేసు యెండ ముందర మంచు విడిపోయినట్టు విడిపోతుంది. ఒక చోట వ్యవహారం కూడా కుదిర్చాను. ప్రామిసరీ నోట్ రాసినట్టైనా రూపాయిలిస్తారు.

**లుబ్ధావ:** వకదమ్మిడీ నేనివ్వను – రామనామతారకం –

**రామప్ప:** చెడిపోక నామాటవిను, యంతో ప్రయాస మీద యీ ఘట్టం కుదిర్చాను. యినస్పెక్టరు, తాస్సీల్దార్ని సాధించడంకోసం యీ కేసంతా లేవదీశాడు. యిందులో సిక్షైపోయినట్టైనా తాస్సీల్దారు తాడుతెగుతుంది. డిష్టికలక్టరు బ్రహ్మద్వేషి: గట్టిడిఫెన్సొస్తేనేకాని కమ్మెంటు కట్టేస్తాడు. యినస్పెక్టరు యింత పట్టుదలగా వున్నా నాకూ అతనికీ వుండేస్నేహంచాత యీ ఘట్టానికి వొప్పుకున్నాడు. యిటు పైని జాలం అయితే నీ కూతురికి వురి నీకు కఠిన సిక్షాపడిపోతుంది.

**లుబ్ధావ:** పడితే పడ్నీ నాదగ్గిర డబ్బులేదు. నన్ను బాధపెట్టక నీ మానాన్న నీవు పోదూ రామనామతారకం –

**రామప్ప:** నీ అంత కర్కోటకుణ్ణి నేనెక్కడా చూడలేదు. కన్నకడుపు కూతురు జైల్లో కూర్చుని వురికి సిద్ధంగా వుంటే వెధవడబ్బుకి ముందూ వెనకా చూస్తున్నావు.

**లుబ్ధావ:** నన్నెందుకు బాధపెడతావు పదివేల నమస్కారాలు వెళిపో బాబూ–రామనామతారకం–

**రామప్ప:** ఐతే నీకు సిక్షకావడం, నీ కొమార్తెను వురితియ్యడం నిశ్చయం. నాకు హృదయం కరిగిపోతూంది. దేవుడా యేమిటిగతి. (అని కళ్లను వోణీ అద్దుకొనును)

(లుబ్ధావధాన్లు గదిలోనికి వెళ్లి తలుపు వేసుకొనును).

(సౌజన్యారావు పంతులుగారు ప్రవేశించుచున్నారు).

**రామప్ప:** తమరు ధర్మస్వరూపులు, లుబ్ధావధాన్లు గారియందు దయచాత యీ కేసులో పనిచేస్తున్నారు. కేసంతా వట్టి అన్యాయం. యేమీ నిజంలేదు. సెలవైతే డిఫెన్సు సాక్ష్యం కుదురుస్తాను.

**సౌజన్య:** నీ సంగతి నాకు తెలుసు. యిక్కడ్నుంచి లేచివెళ్లిపో.

**రామప్ప:** (తనలో) వీడసాధ్యుడ్లావున్నాడు. వీడి చర్య చిత్రంగా వుంది. డబ్బుయేదుపేమీ అక్కర్లేదు. ఎప్పుడూ న్యాయం న్యాయం అంటూ దేవులాడుతాడు. (అని నిష్క్రమించుచున్నాడు).

**సౌజన్య:** లుబ్ధావధాన్లుగారూ!

**లుబ్ధావ:** (తలుపు తీసుకొని పైకివచ్చి) బాబ్బాబు! దయచేశారా?

**సౌజన్య:** యీదౌల్బాజీని మళ్లీ యెందుకు రానిచ్చారూ?

**లుబ్ధావ:** యినస్పెక్టరు అయిదువేలు లంచమియ్యమన్నాడని వచ్చాడు.

**సౌజన్య:** మీరు కాక్కో మెతుకన్నా వెదపకండి. మొట్టమొదట మీ సంగతి చూడగానే మీరు నిర్దోషులని నాకు తట్టి మీ విషయంలో నేనే దఖలు పుచ్చుకున్నాను. ఆ గుంటూరి శాస్త్రుల్లెవరో యేమీ భేదించలేకుండా వున్నాను కాని, నాకు వచ్చిన యితర భోగట్టా అంతా మీ కనుకూలంగానే వుంది. తగిన డిఫెన్సు సాక్ష్యం దొరుకుతుందని నమ్మకం వుంది. మీరట్టే భయపడకండి.

**లుబ్ధావ:** బాబూ మీరు నా పాలింటి నారాయణమూర్తిలా చక్రం అడ్డువేశారు. మీరు సాక్షాత్తు అవుతారపురుషుల్లా వున్నారు. మీరు కడంవకీళ్ల లాంటివారుకారు మీ మొహం చూస్తే పాతకాలన్నీ పోతాయి. యీ గండం గడిచి నాపిల్లా నేను కాసీ చేరుకునే సాధనం చేయిస్తిరట్టయినా నా దగ్గిరున్న డబ్బంతా మీ పాదాల్దగ్గిర దాఖల్ చేస్తాను. మాకు నెలకో పదిరూపాయిలు జీవనోపాధికి పంపిస్తూ ఆ కడమంతా మీరు పుచ్చుకోండి.

**సౌజన్య:** నేను మొదట మీతోచెప్పేవున్నాను. నాకోదమ్మిడీ అక్కర్లేదు. నే చెప్పిన మాటలు మీకునచ్చి ముసలివాళ్లు పెళ్లాడకూడదనీ, కన్యాశుల్కం తప్పనీ, యిప్పటికైనా నమ్మకంతోస్తే యీలాంటి దురాచారాలు మాన్పడానికి రాజమహేంద్రంలో వొక సభ ఉంది కనక మీకు తోచిన డబ్బు ఆ సభకి యిస్తే చాలును.

**లుబ్ధావ:** (బుర్రయూపుచు). ఆ-ఆ-ఆ- బాగా బోధపడ్డది. శల్యాల్ని పట్టిపోయింది. తప్పకుండా దాఖలు చేసుకుంటాను.

**సౌజన్య:** (నోట్ బుక్కు, పెన్సలు, తీసి) బాగా జ్ఞాపకం తెచ్చుకొమ్మన్నాను-తెచ్చుకున్నారా గుంటూరు శాస్త్రుల్లు పోల్తీ అదీని.

**లుబ్ధావ:** ఆ!

**సౌజన్య:** అతని మాటలకి పడమటిదేశపు యాసవుందా?

**లుబ్ధావ:** (ఆలోచించి) యెంతమాత్రం లేదు.

(తెర దించవలెను)

(సౌజన్యారావుగారి యిల్లు.)

(సౌజన్యారావు పంతులుగారు, అగ్నిహోత్రావధానులు కూరుచొని మాటలాడుచుందురు)

**సౌజన్య:** ఇహ మిమ్మల్ని జయించినవాడు లేడు. పిల్లల్నమ్ముకోవడం శిష్టాచారం అంటారయ్యా?

**అగ్నిహో :** ఔనండి మా మేనత్తల్నందర్ని అమ్మేరు. వాళ్లంతా పునిస్త్రీ చావేచచ్చారు. మా తండ్రి మేనత్తల్నికూడా అమ్మడమే జరిగిందష. యిప్పుడీ వెధవ యింగ్లీష్ చదువునుంచి ఆ పకీరు వెధవదాన్ని లేవదీసుకు వెళ్లిపోయినాడు గాని, వైధవ్యం అనుభవించిన వాళ్లంతా యెంత ప్రతిష్టగా బ్రతికారు పూర్వకాలంలో.

**సౌజన్య :** చిన్నపిల్లల్ని కాలంగడిచినవాడికి చేస్తే వైధవ్యం రాక మానుతుందయ్యా?

**అగ్నిహో :** ప్రాలుద్ధం చాలకపోతే ప్రతివాళ్లకీ వస్తుంది. చిన్నవాళ్లకిస్తే నేమి పెద్దవాళ్లకిస్తేనేమి, రాసిన రాతెవడైనా తప్పించగలడూ?

**సౌజన్య :** డబ్బుకి లోభపడిగదా ముసలివాళ్లకిస్తారు. కన్యల్నమ్ముకోవడం శాస్త్ర దూష్యం కాదయ్యా?

**అగ్నిహో :** యిప్పుడు మీ లౌక్యుల్లో రెండేసి వేలూ, మూడేసి వేలూ, వరకట్నాలు పుచ్చుకుంటు న్నారు కారండీ. మామట్టుకేనా శాస్త్రాలు?

**సౌజన్య:** చంటిపిల్లని ముసలివాడికి యేం సౌఖ్యపడుతుందని యిచ్చారయ్యా?

**అగ్నిహో :** అదంతా మీకెందుకయ్యా. ఓహో! యిందుకా నన్ను పిలిపించారు. వెధవముండన్లే వదీసుకు పోయిన పకీర్ వెధవపక్షాన మాట్లాడతారూ? యేం పెద్ద మనుష్యులండీ, కేసుమానుకునేది లేదు సరేగదా ఆ వెధవ, కనపడితే నా దుఃఖంతీరా నూటేస్తాను.

**సౌజన్య:** తొందరపడకండీ అవుధాన్లుగారూ, బ్రాహ్మణోత్తములు, తమ దగ్గిరంతా శాంతం నేర్చుకోవాలి. లుబ్ధావధాన్లుని నూటేసినందుకు సిక్ష కావడానికి సిద్ధంగా వుందిగదా. వందో రెండువందలో యీసరికి వదిలిపోయినాయి. కాళ్లు బాగా పీకితేనేకాని కన్యా శుల్కంలోవున్న దోషమూ కనపడదు, మీ మూలంగా దురవస్థచెందిన మీ పిల్లయందు మీకు కనికరమూ పుట్టదు. నాపేర రిఫార్మ్ సభ శక్రటరీగారు వుత్తరం వ్రాశారు. ఆ పిల్లతాలూకు ఆస్తి కొంత మీవద్ద వుందట; చిక్కులలో దిగక పంపించెయ్యండి.

**అగ్నిహో :** నా పిల్లేమిటి పకీర్ముండ. రేపు యింటికి వెళుతూనే ఘటాశార్ధం పెట్టేస్తాను.

**సౌజన్య :** ఇంత కనికరం లేదేమయ్యా నీకు?

**అగ్నిహో :** ఏమిటో నా ప్రాలుద్ధం మీ కెందుకూ? మీ గృహకృత్యాలవూసుకు నే వచ్చానా?

**సౌజన్య** : అయితే ఆ పిల్ల ఆస్తికి మీమీద దావా తేవలసివుంటుంది.

**అగ్నిహో** : దావాలకి భయపడేవాణ్ణి కానండోయ్.

**సౌజన్యా:** అది నాకు తెలుసును, మీరు అగ్రహారపు చెయ్యి, ఆఖరుమాట ఒక మాట చెబుతాను, ఆలోచించండి. మీరు గిరీశంమీద కేసుతేవడం మానుకుని ఆ పిల్ల తాలూకు ఆస్తి యిచ్చివేస్తే, మీమీద లుబ్ధావధాన్లుగారు తెచ్చిన ఫిర్యాదు తీయించివేస్తాను.

**అగ్నిహో** :కేసు మానుకుంటానూ? లుబ్ధావధాన్లుకు చేసినట్టే యెప్పుడో వొహప్పుడు వాడిక్కూడా యెమికలు పచ్చడిచేస్తాను. లుబ్ధావధాన్లు నన్ను చేసేదేమిటి? సాక్ష్యం రావాలికాదూ.

**సౌజన్య:** ఇప్పుడు మీరే నాదగ్గిర వొప్పుకున్నారుగదా! నేనే పలుకుతాను సాక్ష్యం.

**అగ్నిహో** : అంతవారు కారనా, యేడిసినట్టేవుంది ముండాసంత, యేడిసినట్టేవుంది. యిందుకేనా యింత ప్రత్యుత్థానంచేసి నన్ను తీసుకువచ్చారు. యేమిటో కేసులో సలహా చెబుతారనుకున్నాను.

(అని లేచి వెళ్ళిపోవును)

★★★

## మూడవస్థలము – విశాఖపట్టణములోని వీధి

(బైరాగీ, వెనుక పదిమంది శూద్రులు ప్రవేశించుచున్నారు)

౧వ **శూద్రుడు** : యక్కడనుంచి విజయం చేస్తున్నారు?

**బైరాగి** : నేను కాశీనుంచి వస్తున్నాను.

౧**వ.** శూద్రుడు : యన్నాళ్లాయి బయలుదేరినారు?

**బైరాగి** : రెండురోజులయినది.

౨**వ.** శూద్రుడు : యలాగొచ్చారు యింతయేగిరం.

**బైరాగి** : పవనం బంధించి వాయువేగంమీద వచ్చాము.

౩వ **శూద్రుడు** : యోగులకి యాలాటి శిద్ధులయినా వుంటాయి. యీయనే కాబోలురా మొన్న శివరాత్రికి, సింహాచలంలోను, వుప్పాకలోనూ కూడా ఒక్క మాటే కనపడ్డాడని అనుకున్నారూ?

**బైరాగి** : యీ వూరిలో సదావృత్తి మఠం వున్నదా?

౩వ **శూద్రుడు**: లేదుగురూ మేమంతా వుండగా మీకు మఠం యెందుకూ? కాశీలో భోగట్టా యేమిటిగురూ?

**బైరాగి** : నాలుగు రోజుల క్రిందట విశ్వేశ్వరుడు కోవిల్లో ఒక బంగారపు రేకు పడ్డాది. దానిమీద అక్షరాలున్నాయి. బ్రాహ్మల కెవ్వరికీ తెలిసినాయికావు. అప్పుడు మా దగ్గిరకు తీసుకువచ్చేటప్పటికి మేము చదివాము–మరియెవరితో చెప్పకండి. అందులో ఆరు నెలలకి ఇంగిలీషు బావుటా పోతుందనివుంది.

౨వ **శూద్రుడు** : ఏమాచ్చెర్రెం! ఏమాచ్చెర్రెం! గురువుగారు భోజనం యేటారగిస్తారు?

**బైరాగి** : పాలు, పంచదార, అరటిపళ్లున్నూ, నెలకు పదిహేన్‌రోజులు ఆలాగు ఫలారం చేస్తాం, పదిహేన్‌రోజులు వాయుభక్షణం చేస్తాము. యీవూరు భోగట్టాలేమిటి?

౧వ **శూద్రుడు** : ఏమున్నాయండి. రామచంద్రపురం అగ్ఘురారం కాపరస్తుడు లుబ్ధావధాన్లని ముసలిబ్రాహ్మడు పెళ్లాన్ని కూతురుచేత చంపించేశాడు. కూనీ కేసు వొచ్చింది. రేపు సాయింత్రం అతన్ని, హెడ్డుకనిష్టీబుని, సాక్షులని, తాసీల్దారుని సిక్ష చెబుతారు.

**బైరాగి** : (తెల్లపోయి) యీ వూరు పాపంతో నిండినట్టు కనబడుతుంది. యీ వూళ్లో మేమొక నిముషమయినా వుండము.

౨వ **శూ** : గురోజీ మీ రెళ్లిపోతే మాగతేమిటి? కూనీ చేసినోళ్లు యీ వూరోళ్లుకారు.

౩వ**శూ** : ఆ వూరు దుకాణాదారుగారిదిగో వస్తున్నారు. ఆయన మంచి గ్యాని.

**బైరాగి** : (క్రేగంట నా దిక్కుజూచి) యీ వూళ్లో తాగడం లావుగావున్నట్టు కనబడుతుంది. మేము తాగుబోతులతో మాట్లాడము. ఆ దుకాణాదారు వచ్చేలోగా ఈ సందులోకి మళ్లిపోదాముర౦డి.

(ఇంతటిలో దుకాణదారు పరుగెత్తికొని వచ్చును)

**దుకా** : (బైరాగీమొలలో చెయివేసి పట్టుకొని) నాకు బాకీవున్న రూపాయలిక్కడ కక్కితేనేకాని వొదలను.

**బైరాగి** : యేమిటీవాళకం! వీడు తప్పతాగి పేలుతున్నాడు. నేను మొదటే అన్నాను కానూ, తాగుబోతులతో సహవాసం కూడదని.

౩వ **శూ**: భాయి! మీకేమి మతిపోయిందా యేమిటి? గురువుగారితో అలాగ మాటలాడుతున్నారు.

**దుకా** : గురువులేదు, గుర్రాలేదూరుకోశ్. యీడెక్కడ గురువు, నా దుకాణంమీద సారా అంతా చెడతాగి డబ్బు యివ్వకుండా యగేశాడు.

౨వ **శూ** : నీకు మతిపోయింది. ఆయనేటి నీ దుకాణంమీద సారాతాగడం యేటి? మొన్న బయల్దేరి కాశీనుంచి యిప్పుడే ఒచ్చారు.

దుకా : ఆకాశంమీంచి ఒచ్చాడుకాదూ? రూపాయిలిచ్చేసి మరీ కదులు.

బైరాగి : మావంటి సాధులతోటి మీకు వాదెందుకబ్బీ, యెవర్ని చూసి నేననుకున్నావో యేమిటో. నీ వంత మమ్మలిని నిర్బంధ పెట్టాలనివుంటే వొక్కనిముషంతాళు, యింత రాగి తెచ్చుకుంటే వెండిచేసి యిస్తాను.

3వశూ : యేమి వెర్రిముండాపని చేశావోయ్-బంగారం చేశేవాళ్లకి డబ్బులచ్చుంటోయ్, ఆరికాళ్ల మీదపడి కోపం తీర్చుకో.

దుకా : వుండోశ్ యేడిసినట్టేవుంది. (హెడ్ కనిష్టీబు ప్రవేశించును)

హెడ్ : యేమండోయి గురోజీ! మీరు దొరకడం నాకు దేముడు దొరికినట్టుంది. ఇక బతికాను, మీతో కొన్ని జరూరుసంగతులు చెప్పాలిరండి.

బైరాగి : భాయి! మీరు వెనక్కుండండి (పదిమంది శూద్రులును వెనుకకు వెళ్లిపోవుదురు.)

దుకా : నా రూపాయిలు యిచ్చి మరీ మాట్లాడండి.

బైరాగి : నీకు కావలసినంత వెండిచేసిస్తాను, నలుగురిలోను మర్యాదతీసి వెయ్యడం న్యాయమేనా. ఇలాంటి రహస్యాలు పామరులకు తెలియకూడదు.

హెడ్ : (దుకాణాదారునితో) భాయి! నీ రూపాయలు నేనిస్తానుగాని, కేసుమాటేదో జాగ్రత్త చేసుకోనియ్యండి. (బైరాగీవైపు తిరిగి) గురోజీ కూనీకేసు పీకల మీదికి వచ్చింది. కేసు యేబుగ్గిలేనిదే, నాలుగు రాళ్లు తడముకుందామని ఆవేళ రాత్రి ముసలివాణ్ణి గందరగోళం పెట్టాం, యీ రామప్పంతులుగాడు యేదో వాడడిగినంత యిచ్చాంకామని తాస్సీల్దారుకి ఆకాశరామన్న అర్జీకొట్టాడు - వాడొచ్చి కేస్ మళ్లీకదిపి, హోత్‌హూత్తని, ముసలాణ్ణి బెదిరించి డబ్బులాగి వూరుకున్నాడు. తాస్సీల్దారు దగ్గిరకూడా రామప్పంతులుకేం పెగిలింది కాదు, దాంతో కలక్టరుకి ఒహ ఆకాశ రామన్న అర్జీకొట్టాడు. దాని మీద అది యినస్పెక్టరుకి రిఫరైంది. వాడు మైరావణాసురుడు. తాస్సీల్దారుకీ వాడికి బలవద్విరోధం దొంగసాక్ష్యం అంతా కూడదీసి పద్మవ్యూహం పన్నేశాడు. నేనూ తాస్సీల్దారూ, కేసు కమ్మీచేశామని రుజువుతెస్తున్నాడు.

బైరాగి : మేముండగా మీకేమి భయమండీ. కోరుటుకు వెళ్లేటప్పుడు యీ వేరు చేతికి కట్టుకుని యీ అక్షింతలు యింటిమీద పడేసి లోపలికి వెళ్లండి. అధికారికి వాగ్బంధము అయిపోతుంది.

హెడ్ : ఆలాగురక్షించు గురూ. మీరు నా పక్షం సాక్ష్యంకూడా పలకాలి. లుబ్ధావధాన్లు మామ గారు ఆ గుంటూరు శాస్త్రులెవరో వాడెక్కడా కనబడకుండా వున్నాడు. వాడుకాని

దొరికితే కేసొక్క నిముషంలో పోతుందని ఫస్టుక్లాస్ ప్లీడర్ సౌజన్యారావు పంతులుగారు చెప్పారు. గుంటూరు టెలిగ్రాఫిస్తే అక్కడనుంచి యీ మధ్య యవరూ శాస్త్రుల్లు కూతుర్ని తీసుకుని యీ వేపు రాలేదని జవాబు వచ్చింది. వాణ్ణి రప్పించే సాధనం యేమైనా చేయించగల్రూ గురోజీ?

**బైరాగి** : ఆహా! అదెంతపని, రాత్రి అంజనం వేసి యెక్కడున్నదీ కనుక్కుంటాం.

**హెడ్** : దయచెయ్యండి యింటికి వెళదాము.

**బైరాగి** : యీ శిష్యులక్కొంచం గ్యానోపదేశంచేసి వస్తాను మీరు వెళ్లండి.

**హెడ్** : అలాక్కాదు. నేను మీతో కూడా వుంటాను.

(తెర దించవలెను.)

**డెప్యూటీ కలెక్టర్ మాణిక్యం మొదలికచేరీ** (వకీళ్లు, బంట్రౌతులు మొదలైనవారు.)

**భీమా** : నాకు మునసబుకోర్టులో కేసున్నది. కటాక్షిస్తే వొక అర్జీ దాఖలుచేసి శలవు పుచ్చుకుంటాను.

**కలెక్టర్** : కోర్టువారికి సావకాశం అయేవరకూ వుండలేని వకీళ్లు కేసు యెందుకు దాఖలు చేయవలె? ఇది చెప్పినట్టల్లా వచ్చే కోర్టనా మీ యభిప్రాయం?

**భీమా** : చిత్తం, చిత్తం, తమ ప్రిడిశెసర్లు అలాగ్గడుపుతూ వచ్చేవారు.

**కలెక్టర్** : ఆఫీస్ పని చూసుకొని పిల్చేవరకూ ఉండండి.

**అగ్నిహో** : (రామప్పంతులుతో) యేమండోయ్ మన కొత్తవకీల్ని కోప్పడుతున్నారే?

**రామప్ప**: యీ అధికార్ల నైజం యేమిటంటే యెవళ్లమీద దయుండి యెవళ్ల పక్షం కేస్ చెయ్యాలంటే వాళ్లని కరవ్వొచ్చినట్టు కనపడతారు. మీరు కోర్టసంగతంతా తెలుసునంటారే? యిదేనా మీ అనుభవం?

**అగ్నిహో** : (కొంచెము గట్టిగా) అవునవున్నాకు తెలుసును.

**కలెక్టర్** : యెవరా మాట్లాడుతున్న మనిషి.

**నాయుడు** : (లేచి) తక్‌షీల్ మాప్‌చేస్తే మనవిచేస్తాను. యీయన కృష్ణారాయపురం అగ్రహారం కాపురస్తుడు, నులక అగ్నిహోత్రావధాన్లుగారు, మహాయోగ్యమైన బ్రాహ్మడు, జటాంత స్వాధ్యాయి, యీయనే లుబ్ధావధాన్లుగారికి కొమార్తెని, పద్దెనిమిదివందల రూపాయిలకు, కన్యాదానం చేయడానికి బేరమాడుకుని, కాబోయే అల్లుడికి దేహశుద్ధిచేశారు, అందుకే యీ మధ్య లుబ్ధావధాన్లు గారు యేలినవారి కోర్టులో చార్జీదాఖలు చేశారు. అందులో

ముద్దాయీ యీ మహానుభావుడే! రామవరంలో సహస్రమాసజీవైన వక బ్రాహ్మణ శ్రేష్టుడుంటే ఆయనకు పెద్ద కుమార్తెను కన్యాదానంచేసి, రెండు పిల్లికూనల్ని స్వీకరిం చేటప్పటికి పెళ్లిలోనే ఆ బ్రాహ్మడిపుణ్యం అంతా మూడి పరంపదం వీంచేశాడు. ఆ పిల్లదాని తరపున భూముల కొరకు దావాతెచ్చారు. వీరు తమవంటి గవర్నమెంట్ ఆఫీసర్లకి తరుచుగా పని గలుగ చేసి ప్లీడర్లని పోషిస్తూవుంటారు. వీరి యోగ్యత లేమి, వీరి దయాంతఃకరణ లేమి, వీరి సరసత లేమి, మరి యెన్నడముకు శేషుడికైనా అలవికాదు. వారి తరపున కేసు దాఖలు చెయ్యడం కోసమే భీమారావు పంతులుగారు కోర్టుకు దయచేశారు (అని విరసముగానవ్వి కూరుచొనును).

**కలెక్టర్** : బలే శాబాష్ (గుమాస్తాతో) ఏదీ భీమారావు పంతులుగార్ని ప్రియాదు అర్జీ దాఖలు చేయమను. (గుమాస్తా పుచ్చుకొని దాఖలు చేయును)

**కలెక్టర్** : (కాగితమందుకొని) యేమిటయ్యా కేసు స్వభావం?

**భీమా** : చిత్తం, యీయన వెధవకొమార్తెని, యీయన కొమారుడికి చదువుచెప్పే గిరీశం అనే ఆయన అలంకారాలూ, ఆస్తితోకూడా లేవతీసుకు వెళిపోయినాడు.

**అగ్నిహో** : దస్తావేజులూ, కోర్టుకాయితాలూ కూడానండీ.

**కలెక్టర్** : యేమిటి? ఆ,హా,హా,హా,హా (అని నవ్వుచు బూట్సు నేలపైతట్టును) బలేశాబాష్ (అర్జీచూసుకొని) యిన్నాళ్లేమి చేస్తున్నారు?

**భీమా** : తహస్సీల్దార్‌గారి దగ్గిర నేరం జరిగిన మూడోరోజునే మున్సబుకోర్టు వకీలు వెంకట్రావు పంతులుగారు, చార్జీదాఖలుచేస్తే ఆ తహస్సీల్దారుగారు కేస్ స్వభావం యేమిటని అడిగి నారు. ఎబ్‌డక్షన్ అని వెంకట్రావుపంతులుగారు చెప్పేసరికి యింగ్లీషు రాకపోవడం చాత, తహస్సీల్దారు గారు ఆ మాట యెప్పుడూ విన్లేదని చెప్పారు. తరవాత కేస్ స్వభావం తెలుగున చెప్తే యీలాటి నేరం మా జూరిస్‌డిక్షన్‌లో జరగదు. తోవలో రోడ్డుమీద యే తాలూకా సరిహద్దులో యెత్తుకు పోయినాడో అని అర్జీ దాఖలు చేసుకున్నారు కారు. లుబ్ధావధాన్లుగారి కూనీకేసు కామాప్ చేసిన తహస్సీల్దారుగారే యీయనండి.

**నాయడు** : ఇంగ్లీష్ రాకపోతేనేమండి. తహస్సీల్దారుగారు యెంత ప్రాజ్ఞులు. పూర్వపు యూరోపియన్ అధికార్లని యెంతమందిని మెప్పించారు. ఆయన లుబ్ధావధాన్లుగారి కేసు కామాప్ చేశారని భీమారావుపంతులుగారు అంటున్నారు. యింకా విచారణవుతున్న కేసులో అలా అన్నందుకు యీనపైన తహస్సీల్దారుగారు పరువునష్టం చార్జీ తేవడమునకు వీలువున్నది.

**కలెక్టర్** : (భీమారావువైపు జూచి) పిల్లకు పదహారు సంవత్సరములకులోపు యీడని రుజు వున్నదా?

**భీమా** : జాతకం వుందండి.

**నాయడు** : కోర్టువారు ఆ జాతకం దాఖలు చేసుకోవాలి.

**భీమా** : యీ కేసులో ఆయన మాట్లాడుతూంటే నే ఎంతమాత్రం వొప్పేదిలేదు.

**నాయడు** : యీ కేసులో నాక్కూడా వకాల్తినామా వుందండి (అని దాఖలుచేయును)

**భీమా** : (అగ్నిహోత్రావధాన్లుగారితో) ఏమయ్యా యీయనక్కూడా వకాల్తీ యిచ్చావయ్యా?

**అగ్నిహో** : మొదటా, రామప్పంతులు యీయన కిప్పించారు.

**భీమా** : (అగ్నిహోత్రావధాన్లుగానితో) అయితే యేడువు.

(అగ్నిహోత్రావధాన్లు తెల్లపోయి చూచును)

**కలెక్టర్** : యేదీ జాతకం దాఖలు చెయ్యండీ.

(భీమారావు పంతులు దాఖలు చేయును)

**నాయడు** : కోర్టువారితో వకసంగతి మనవి చేసుకుంటాను. యీజాతకం విశ్వామిత్రుడంత యోగ్యుడైన బ్రాహ్మడిచేత తయారుచెయ్య బడ్డది. అదుగో ఆమూల నిలబడ్డ రామప్పం తులుగారికి యీ జాతకంలో మంచి ప్రవేశం వుందండి.

**భీమా** : నేను పేసడ్ వకీల్ని కేసు హీరింగు నేనే చేయవలెనుగాని నాయడుగారు చేస్తే నేనెంత మాత్రం వొప్పేదిలేదు.

**నాయడు** : స్మాలెట్ దొరగారి దగ్గిర్నుంచీ యేజన్సీ కోర్టులో వకాల్తీ చేస్తున్నాను. డబ్బుచ్చు కున్నందుకు నా పార్టీ తరపున నాలుగుమాటలు చెప్పితీరుతానుగాని యింగ్లీష్ చదువుకున్న కొందర్లాగ నోటంట మాట్రాకుండా కొయ్యలాగ నిలబడనండి.

**కలెక్టర్:** క్లార్కి ఆ రామప్పంతులుచాతను దీనిక్కాపీ రాయించు.

(క్లార్కి వ్రాయించును).

(అతను కాపీవ్రాయులోగా డెప్యూటీ కలెక్టర్, గుమాస్తాలు తెచ్చిన కొన్ని కాగితముల మీద సంతకములు చేయుచుండును. కొంతసేపునకు గుమాస్తా రామప్పంతులు వ్రాసిన కాపీతోకూడా జాతకమును దాఖలు చేయును)

**కలెక్టర్** : (అగ్నిహోత్రావధానులవైపుచూచి) మీ కొమార్తె, యే సంవత్సరమందు బుట్టిందయ్యా?

అగ్నిహో: దుర్మతి.

కలెక్టర్ : జాతకంలో దుందుభుందే. రెండు దస్తూరీలు వొక్కలాగున్నా యేమయ్యా బ్రాహ్మడా? బ్రాహ్మణ్యం పరువంతా తీసేస్తిరే. గడ్డితిని పిల్లనమ్ముకున్నావు సరేకాని, యీలాటి ఫోర్జరీలు కూడా చేయిస్తావూ. బ్రాహ్మల్లో అంత, ఖంగాలీ మాలకూడు మరెక్కడాలేదు. నీ దుర్మార్గతవల్ల నీ కుమార్తెను యీ అవస్థలోకి తెచ్చి మళ్లీ ఎబ్డక్షన్ కేసుకూడానా? నీ పొట్ట కరిగించేస్తానుండు. (గుమాస్తాతో) కేస్‌లో నోటీస్‌లు చెయ్యి.

గుమా : (చార్జీ కాగితముజూచి) యిందులో ముద్దాయి యింటిపేరూ సాకీనూ లేదండి.

నాయ : (లేచి) వల్లకాట్లో రామనాథయ్య వ్యవహారంలాగుంది. ఇంగ్లీషు వకీళ్లు దాఖలు చేసే కాకితాలు యీరీతినే వుంటాయండి.

భీమా : (గుమాస్తాతో రహస్యముగా) తరవాయీలు నింపించలేదుటయ్యా (పైకి) యీలా నాయడుగారు నన్ను తూలనాడుతుంటే కోర్టువారు ఊరుకోడం న్యాయంకాదు.

కలెక్టర్ : నాయడుగారు మిమ్ము నేమి అన్లేదే.

భీమా : (తనలో) యిక్కడికి నేను రావడం బుద్ధిపొరపాటు.

క్లర్క్ : (భీమారావు పంతులుగారితో) ఇంటిపేరూ, సాకీనూ యేమిటండీ?

భీమా : (అగ్నిహోత్రావధానులుగారితో) ఏమిటయ్యా?

అగ్నిహో : ఆయనపేరు గిరీశం, మరంతకంట నాకు తెలియదు.

కలెక్టర్ : చాబాష్ : బాగావుంది! అవధాన్లుగారి కొమార్తెని యెవడో తీసుకుపోయినాడు. కనక వాడి వూరూ పేరూ యెరిగినవాళ్లు తెలియచెయ్యవలసినదని దండోరా కొట్టించి గేజట్లో వేయించండి. పోలీసువారికి యెందుకు నోటీసివ్వలేదూ! సాకీనూ మొదలైనవి లేనిది కేసు యడ్మిట్‌చేయడానికి వీలులేదు. టిఫిన్‌కి వేళయింది లేదాము (అని లేచి వెళ్లిపోవును)

అగ్నిహో :(భీమారావు పంతులుగారితో) ఏమండోయ్ కేసు అడ్డంగా తిరిగిందే (భీమారావు పంతులుగారు మాట్లాడరు)

అగ్నిహో : యేమండోయి మీతోటి మాట్లాడుతున్నాను.

భీమా : ఇచ్చిన ఫీజుకు పనైపోయింది. మళ్ళీ ఫీజిస్తేనే కాని మాట్లాడేది లేదు.

అగ్ని : యేం పనైంది అఘోరంపని, కలక్టరు చివాట్లు పెడుతూంటే ముంగిలా మాట్లాడక వూరుకున్నారు.

భీమా : బంట్రోత్! యితన్ని నా దగ్గిరకి రాకుండా గెంటేయ్.

**అగ్నిహో** : ఓహో బాగుంది వ్యవహారం! రామప్పంతులేడీ?

**నాయడు** : (మెల్లగా వెనుకనుండివచ్చి) ఫోర్జరీమాట రాగానే సన్నగా జారారు యీపాటికి వారివూరికి సగంతోవలో వుంటారు.

**అగ్ని** : అయ్యో కొంపతీశాడే!

**నాయడు** : ఇంగ్లీషు వకీలు సరదా తీరిందా? ఫోర్జరీకి తమక్కూడా మఠప్రవేశం అవుతుంది.

**అగ్ని** : అయ్యో నీ యింటకోడి కాల్చా.

**నాయడు** : రోజూ కాలుస్తూనే వుంటారు.

(అందరునూ నిష్క్రమింతురు)

**(సౌజన్యారావుగారి బస)**

(కుర్చీమీద సౌజన్యారావుగారు కూరుచొని యుందురు,
బంట్రౌతొక కార్డు తీసుకొనివచ్చి యిచ్చును)

**సౌజన్య:** (కార్డు చూచుకొని) జె.యస్.గ్రీస్. (బంట్రౌతుతో) డ్రెస్సు వేసుకుని వస్తానుండు (అని వెళ్లి డ్రెస్సు వేసుకొని వచ్చి కుర్చీమీద కూరుచొనును).

**సౌజన్య:** (బంట్రౌతుతో) ఆయన్ను పిలు.

(బంట్రౌతువెళ్లి గిరీశమును లోపలికి పిలుచుకొనివచ్చును).

**సౌజన్య:** ఈయనెవరు. దొరగారేరి?

**బంట్రౌ** : యీయనేనండి కార్డుయిచ్చారు.

**గిరీశం** : ఐ యామ్, గిరీస్, సర్; వీరయ్య పంటులుగారూ, ఆఫ్ రామవరం, సెంట్‌మీ.

**సౌజన్య:** ఇదేమిటి వికారం గ్రిసేమిటి? క్రిస్టియనువుటయ్యా?

**గిరీ** : చిత్తం, చిత్తం, చిత్తం. కాను.

**సౌజన్య:** మీరు వచ్చిన సంగతి విషయమై ఆతరవాత చెబుతాను. కొన్ని రోజుల క్రిందట మీ విషయమై వీరయ్యపంతులుగారు నా పేర వ్రాసినారు, నేను అందు విషయమై భోగట్టా చెయ్యడంలో పాపం లుబ్ధావధానులుగారి కేసు సంగతి నాకు తెలిసినది. అందు విషయమై కొంత ఇన్‌టరెస్టు పుచ్చుకుని పనిచేస్తూన్నాను. లుబ్ధావధాన్లుగారు మీకు బంధువుణ్ణని చెప్పారు యేమి బంధుత్వం యేమిటి?

**గిరీశ** : అతను మా పెత్తల్లి కొమారుడండి.

సౌజన్య: ఆయన కుమార్తెమీద కూనీకేసు వచ్చినమాట యెరుగుదురు కాదూ! డెప్యూటీ కలెక్టరు బ్రహ్మద్వేషి; బలమైన డిఫెన్స్ సాక్ష్యం దొరక్కపోతే కమ్మెంట్టైపోతుంది. ఆయనికి పిల్లనిచ్చిన గుంటూరి శాస్త్రుల్లెవరో మీకు తెలుసునా?

గిరీశ : నాకు ఆసంగతి మట్టుకు తెలియదండి. శలవయితే అదెంత భాగ్యం కనుక్కుంటానండి.

సౌజన్య: వెతగ్గా వెతగ్గా యీ వూళ్లో గుంటూరు కాపరం అని చెప్పుకునే అవధాన్లొకడు దొరికాడు. ఆయన్ని మా యింటికి పిలిపించాను. ఇప్పు డిక్కడే వున్నాడు. వెళ్లి రహస్యంగా యీ సంగతి లుబ్ధావధాన్లుగారితో చెప్పి వేగిరం తీసుకురండి.

గిరీశ : ఆయన్కెడ బసచేశారండి?

సౌజన్య: జగన్నాథస్వామి కోవిల కెదురుగుండాను.

(గిరీశం వెళ్లును. తెర దించవలెను).

★★★

**మూడవస్థలము - (లుబ్ధావధాన్లుగారి బస)**

లుబ్ధావ: రామనామతారకం భక్తిముక్తిదాయకం (అని పఠించుచుండును)

గిరీశ : (ప్రవేశించి) అన్నయ్యా (అని యేడ్చుచు కౌగలించుకొనుచు)

లుబ్ధావ: రామనామతారకం భక్తిముక్తిదాయం -

గిరీశ : మీ మీద కూనికేసొచ్చిందని తెలిసి నిద్రాహారం లేకుండా యెకాయకీని వెళిపోయి వచ్చాను. మా అన్నయ్యకీ వాళ్లకీ కబురంపించావు కావేమి?

లుబ్ధావ: ఎవడేం చెయ్యాలి? అన్నిటికీ సౌజన్యరావు పంతులుగారే వున్నారు. అయితే అబ్బీ అగ్నిహోత్రావధాన్లుగాడి కూతుర్ని లేవదీసుకు వెళ్లిపోయినావట్రా! వాడికి తగిన శాస్తి చేశావు. దాన్ని పెళ్లిమాత్రం ఆడ్లేదుగదా!

గిరీశ : అంత తెలివితక్కువపని చేస్తానా? నువ్వు నన్ను పెంచుకుంటావనీ, పెళ్లి చేస్తావనీ మావాళ్ళు కొండంత ఆశ పెట్టుకున్నారు గదా!

లుబ్ధావ: యీ గండం గడిస్తే పెంపకంమాట ఆలోచించుకుందాం.

గిరీశ : (గద్గదస్వరంతో) గడిచేటట్టు కనపడదట. సౌజన్యరావు పంతులుగారన్నారు. డెప్యూటీ కలెక్టరు బ్రహ్మద్వేషట. కడుపు సముద్రం అయిపోతూంది (అని కళ్లు తుడుచుకొనును) విధికృతం తప్పించడాని కెవడి శక్యం, కానీ, ముందు గతన్నా చూసుకో. ఓ దత్తపత్రిక రాసిచ్చేస్తే కాపుదారీగా వుంటుంది.

**లుబ్ధావ:** నాకున్న బంధువులంతా నాదగ్గిర డబ్బు లాగాల్ని చూశేవాళ్లే కాని కష్టసుఖాలకి పనికి వచ్చేవాడు ఒక్కడయినా లేడు.

**గిరీశ** : ఒహణ్ణెత్తినైనా ఓ దమ్మిడి కొట్టిన పాపాన్నెప్పుడైనా పోయినావూ? నే కాబట్టి నీ ఆపద సమయంలో వచ్చాను కాని నీ బంధువులందరికీ నీయందు పిసరంతయినా అభిమానం లేదు.

**లుబ్ధావ:** లేకపోతే పీడా నాడా కూడా పాయెను.

**గిరీశ** : నీదగ్గిరొక దమ్మిడీ నేనాశించి రాలేదు. దత్తత చేసుకుని యిప్పటికైనా తరుణోపాధి చూసుకొమ్మన్నాను.

**లుబ్ధావ:** యిక్కడంతయింది, యిహ ముందు లోకం మాట ఆలోచించుకుందాం.

**గిరీశ** : నీకోవేళ సిక్కైపోతే నీ వ్యవహారాలూ సవహారాలూ చూశేవాడెవడైనా వుండాలిగదా? నీ సన్నిహిత బంధువుల్లో యింగ్లీషొచ్చినవాణ్ణి నే నొక్కణ్ణే. నాకో పౌరాఫ్టర్నామా ఐనా గొలికిచ్చేయ్.

**లుబ్ధావ:** నువ్వెందుకు నన్ను దుఃఖంలోవున్నవాణ్ణి మరింత దుఃఖపెడతావు? అన్నిటికీ సౌజన్యారావుపంతులుగారున్నారు. ఆయ నెలా చెబితే అలా చేస్తాను.

**గిరీశ** : (తనలో) యీ సౌజన్యరావు పంతులు మా అసాధ్యపు ఘటంలా వున్నాడు. అతణ్ణి చూసిన దగ్గిర్నుంచీ బ్రహ్మన్లక్ష్యపెట్టనివాణ్ణి నాకే కంపరం కలుగుతూంది.

(బంట్రౌతు ప్రవేశించును)

**బంట్రౌ** : అవధాన్లుగారూ! సౌజన్యరావుపంతులుగారు రమ్మంటున్నారు.

**గిరీశ** : ఆఁ. ఆఁ. మరిచిపోయినాను. నే నిప్పుడక్కడినుంచే వచ్చాను. ఎవరో గుంటూరి శాస్త్రుల్లు వారింటి కొచ్చాడట. నిన్ను పిలవమన్నాడు.

**లుబ్ధావ:** (ముఖమున నాతృత గనుపరచుచు) ఏమిటీ! గుంటూరి శాస్తుల్లే! ఇదుగో వస్తున్నాను. (వళ్లంతా వణుకును). (లుబ్ధావధాన్లు, గిరీశం నాలుగడుగులు నడచునంతటికి పోస్టు బంట్రౌతు కనుబడును)

**పోస్టు బం** : మీరేటండీ లుబ్ధావధాన్లుగారు?

**లుబ్ధావ:** అవును, ఎందుకేమిటి?

**పోస్టు బం** : మీపేర పన్నెండు వందల్రూపాయలు మనీ ఆర్డరొహటీ, బంగీవహటీ వచ్చింది.

**లుబ్ధావ:** (తనలో) నాపేర మణీ ఆర్డరేమిటి చెప్మా! (పైకి) ఏదీ యిలాతే.

**పో.బం:** యీ వూరి పెద్దమనుష్యులెవరైనా సాక్షి సంతకం చేస్తేనే కాని యిస్తే మాకు మాట వస్తుంది.

**లుబ్ధావ:** అయితే సౌజన్యరావు పంతులుగారి యింటికి, రా, ఎవరి దగ్గిర్నుంచొచ్చిందేమిటి మణీ ఆర్డరు?

**పో.బం:** (కాగితము తీసిచూచి) యెవరో గుంటూరి శాస్తుల్లట.

**లుబ్ధావ:** ఏమిటేమిటి? ఆ కాయితం యిలా చూడ్నీ. (అని వణుకుచున్న చేతితో కాగితము పట్టుకొని చూచి) గుంటూరి శాస్త్రుల్లేమిటి మణీ ఆర్డరు పంపించడం యేమిటి? యిది నిజమేనా?

**పో.బం:** అవునండీ. ఆ ఫారములో అలావుంది.

**గిరీశ** : (పోస్టు బంట్రౌతును గోకి, లుబ్ధావధాన్లుతో) కావలిస్తే నేసాక్ష్య సంతకం చేస్తాను. పుచ్చుకో రూపాయిలు. సంచీ నే మోస్తాన్లే. శుభస్య శీఘ్రం అన్నాడు.

**లుబ్ధావ:** అహఁ; అహఁ; అలాకాదు వేగిరంరా, సంజీవరావు పంతులుగారి దగ్గిరకి వెళదాం. (అని నడచుచు) గుంటూరి శాస్త్రుల్లేవూరి నుంచోయి యిచ్చాడు.

**గిరీశ** : యిలా తెండి చెబ్తాను. (అని లుబ్ధావధాన్లు చేతిలో నుంచి కాగితము లాగును)

**లుబ్ధావ:** వద్దొ ద్దొ ద్దొ ద్దొ ద్దొ ద్దు. (అని కాగితము వదలడు)

**గిరీశ** : (లుబ్ధావధాన్లు చేతిలోనుండగానే కాగితము చూచి) వైజాగపటామ్, అనగా, యీ వూరునుంచే.

**లుబ్ధావ:** (బుర్రెత్తి చూచి ఆశ్చర్యము ముఖమున గనుపరచుచు) అడుగో గుంటూరి శాస్తుల్లా సందులోను, మన్ని చూచి పరుగెత్తుతున్నాడు. (అని లుబ్ధావధాన్లు పరిగెత్తును)

**గిరీశ** : యేమిటి వెర్రెత్తిందా వీడికి! (అని లుబ్ధావధాన్లుతో కూడా నాలుగడుగులు పరుగెత్తి కరటకశాస్త్రులు కనబడగానే వెనకకుతగ్గి, లుబ్ధావధాన్లు చెయిబట్టుకు వెనుకకులాగి) వీడుకాదు గుంటూరిశాస్త్రుల్లు. అతను వలంగా వుంటాడు. అతన్ని సౌజన్యరావు పంతులుగారింట్లో చూశాను. ఇతను కరటకశాస్త్రుల్లు.

**లుబ్ధావ:** (జాపోయుచు) నీకు తెలియత్తెలియత్తెలియదు. వీణ్ణి పట్టుకో. పట్టుకుంటే యీమణీ ఆర్డర్రూపాయలు నీ కిచ్చేస్తాను.

**గిరీశ** : (ఒక్కక్షణ మాలోచించి ముందువెనుకజూచి) ఆల్‌రైట్ (అని పరుగెత్తును) (ముందు గుంటూరిశాస్త్రులు. వెనుక గిరీశం తెరచుట్టు పరుగుపెడుదురు.)

**(ఆ వీధిలోనే మరియొక చోటు)**

(అగ్నిహోత్రావధాన్లు, నాయడు, మాటలాడుచుందురు)

**అగ్నిహో** :అయితే కేసు మానుకొమ్మన్నారూ?

**నాయడు** : లేకపోతే మీకు చాలా వుపద్రం సంభవిస్తుంది. ఆ యింగ్లీషు వకీలు అంతా పాడుచేశాడు.

**అగ్నిహో** : అయితే రామప్పంతులు వూడాయించేసి నట్టేనా?

**నాయడు** : అందుకు సందేహం యేమిటి?

**అగ్నిహో** : నాకడియం. మరో బంగారపు సరుకూ తాకట్టు పెడతానని తీసుకుపోయినాడు.

**నాయడు** : వాటికి నీళ్లధారే.

**అగ్నిహో** : అయ్యో! కడియం మా తాతగారినాటిది, మీరు మొన్న దిడ్డీతోవంబడవస్తున్నారే, ఆ సానింట్లోతాకట్టు పెట్టానన్నాడు.

**నాయడు** : రామ, రామా, దాని దగ్గిర యంతమాత్రం లేదు. మీది మిక్కిలి దాన్తాలూక్కంటోటి వాడే తీసుకుపోయి యెక్కడో తాకట్టు పెట్టేశాడు, గాని మీమీద ఫోర్జరీకేసు ఖణాయించకుండా డిప్టీ కలక్టరుగారితో సిఫార్సు చేశాను గదా నాకేమిస్తారు?

**అగ్నిహో** : యేమిచ్చేది, నాభి కొనుక్కోడానికి దమ్మిడీ అయినా యిప్పుడు లేదు. వూరికి చేరితేనేకాని డబ్బురాదు.

**నాయడు** : పోనియ్యండి. ఒక ప్రోమిసరీనోటు రాయండి రూపాయిలు యిప్పిస్తాను.

**అగ్నిహో** : పీకపోయినా అప్పుచేయ్యను. మా తండ్రి చచ్చిపొయ్యేటప్పుడు రుణం చెయ్యనని ప్రమాణం చేయించుకున్నాడు.

(తెరవెనుక నుంచి పట్టుకో, పట్టుకో దొంగ యనునొక కేక వినబడును) (కరటకశాస్త్రులు వగర్చుచు పరుగెత్తుకొని వచ్చును)

**అగ్నిహో** : ఇదుగో బావా యిదేమిటోయ్!

**కరటక** : ఊరుకో, ఊరుకో, నేనిక్కడున్నానని చెప్పకు.

(అని పరదామూల దాగును. రెండవ వైపునుంచి వగర్చుచు గిరీశం వచ్చును)

**అగ్నిహో** : (గిరీశంను జూచి) ఇదుగో గాడిదెకొడుకు దొరికాడు, (అని మీద బడబోగా గిరీశం గతక్కుమని వెనుకకు మళ్లి పారిపోవును. అగ్నిహోత్రావధాన్లు వెంట దరుమును)

**నాయడు** : యేమిటీ గమ్మత్తు! యేమిటీ అద్భుతం! యిది అరబ్బీనైట్సులో చిత్రం లావుంది, దీని గమ్మత్తేదో మనంకూడా కనుక్కుందాం. (వెళ్లును)

## నాల్గవ స్థలము - సౌజన్యరావుపంతులుగారి యింటినడవ

(లుబ్ధావధాన్లు, గిరీశం ప్రవేశించుచున్నారు)

గిరీశ : దొరికిపోయినాడుకాని అగ్నిహోత్రావధాన్లు అడ్డుపడ్డాడు. వొహరికిద్దరైనారు గదా అని వెళిపోవచ్చాను.

లుబ్ధావ: గుంటూరిశాస్త్రుల్లు వాడేన్రా.

గిరీశ : వాడెక్కడ గుంటూరిశాస్త్రుల్లు. ఆయన అగ్నిహోత్రావధాన్లు బావమరిది కరటక శాస్త్రుల్లు.

(సౌజన్యరావు పంతులుగారు ప్రవేశించుదురు)

సౌజన్య: యేమిటండోయ్ విశేషాలు?

లుబ్ధావ: గుంటూరిశాస్త్రుల్లు కనపడ్డాడండి. ఇదుగో యిప్పుడే.

గిరీశ : కాడండి, అతను అగ్నిహోత్రావధాన్లు బావమరిది కరటకశాస్త్రుల్లండి.

సౌజన్య: (ఆశ్చర్యము నభినయించుచు) సొంస్కృతనాటకంలో విదూషకుడు, మన కరటక శాస్త్రుల్లా యేమిటి?

గిరీశ : అవునండి.

లుబ్ధావ: కాదు, కాదు, నా కళ్ళారా చూశాను. అతనే గుంటూరి శాస్త్రుల్లు, నన్ను చూస్తూనే పరుగుచ్చుకున్నాడు.

గిరీశ : చాలాదూరం వెంట దరిమాను కాని దొరికాడుకాదు.

సౌజన్య: అలాగనా; నిన్నే అగ్నిహోత్రావధాన్లు వీధికొసని కడుపీడ్చుకుంటూ వెంటతరమడం మేడమీంచి చూశానే.

గిరీశ : (తెల్లపోయి చూచును)

సౌజన్యా: మళ్లీ కళ్లెదటపడి దొరికినట్టైనా నీ యెముకలు విరక్కొట్టేస్తాడు.

లుబ్ధావ: (మణీఆర్డరు కాగితము సౌజన్యరావు పంతులుగారికి చూపించి) యిదిగోనండి గుంటూరి శాస్త్రుల్లు దగ్గిర్నుంచి పన్నెండువందర్లూపాయిలకు మణీఆర్డరు వచ్చింది. ఈ వూర్నుంచేనట.

సౌజన్య: పన్నెండు వందలేనా మీ దగ్గిర అతను పుచ్చుకున్నవి?

లుబ్ధావ: అవునండి.

సౌజన్య: అతని కుమార్తెకు పెళ్లికాలేదే? ఐసీ ఇట్ ఆల్ దిస్ ఈజ్ వన్ ఆఫ్ అవర్ హార్లకివ్స్ ప్రాక్టికల్ జోక్స్. మీ వివాహం నిజమయిన వివాహం కాదు మీరు భయపడకండి.

**లుబ్ధావ**: (చేయి వణకుచుండ) యిదుగోనండి ఈ బంగీలో గుంటూరి శాస్త్రుల్ల పిల్లకి పెట్టిన కంటె.

**నాయడు** : (పై మాటలనుచుండగ గడపమీద నడుగుబెట్టి నిలిచియుండి) ఆఁ. పంతులుగారూ! అది మధురవాణిదండి, దాని తరుపున వకాల్తీ నేనుపట్టాను. (లుబ్ధావధాన్లుగారి వైపు చూచి) యేమండీ లుబ్ధావధాన్లుగారూ! యీ కంటె మధురవాణిది కాదూ?

**లుబ్ధావ**: రామప్పంతులు అలాగే అంటూవచ్చేవాడు.

**సౌజన్య**: అది యెవరిదైతే వారికి యిప్పించేస్తాను.

**నాయడు** : తమరు మరి వకలా చేస్తారని కాదు. తెలిసిన హంశంగనక మనవి చేశాను. అగ్నిహోత్రావధాన్లుగారి కొమార్తెను ఎత్తుకు పోయిన గిరీశం తమ బసలో జొరబడ్డాడని ఆయన... చూసి కనుకొమ్మన్నారు, దొరికాడా యేమిటండీ?

**సౌజన్య**: మీరు మాటాడక ఊరుకోండి. యితనూ, అతనూ కలిస్తే రక్తఖల్లీలైపోతాయి. (గిరీశంతో) యిప్పుడు నాలుగు గంటలపావు అయినది. ఆరు గంటలకు స్టీమరు వెళ్లిపోతుంది. యవరోయి బంట్రోతు! బగ్గీ, పెరటి గుమ్మమువైపు తీసుకురా (గిరీశంతో) నీవు యీ నిముషము బయలుదేరి స్టీమరు అందుకుని, రాజమహేంద్రవరము వెళ్లిపో, నీ యోగ్యత నాకు యిదివరకే తెలిసి వీరయ్యపంతులుగారికి తెలియజేసినాను. బుచ్చమ్మను నీవు యిప్పుడు పెళ్లాడడముకు వల్లలేదు. ఆ పిల్లను రామబాయిగారి విడోస్‌హోముకు పంపించి విద్య చెప్పించ వలసినదని వీరయ్య పంతులుగారి పేర వ్రాసినాను. నీవంటివాళ్లు చేరితే రిఫారం పరువుపోతుంది. నీవు తిరిగీ కాలేజీలో ప్రవేసించి యీ వికారపు చేష్టలు వదిలి, బియ్యేవరకూ చదువుకుంటే ఆపైని బుచ్చమ్మకు యిష్టంవుంటె నిన్ను పెళ్ళాడుతుంది. నీచదువు విషయమయి వీరయ్య పంతులుగారు ఫండులోనుంచి సహాయము చేస్తారు. నీవు తిన్నగా తిరగకపోతే ఆ సహాయంకూడా చెయ్యరు. (బంట్రౌతు ప్రవేసించి బగ్గీ సిద్ధంగా వున్నది అని చెప్పును) పో, పోయి బుద్ధిగా బతుకు, వకనిముషం ఆగావంటే, అగ్నిహోత్రావధాన్లు నీ పెంకితనం అణగకొడుతాడు.

**గిరీశం** : (మాటలువినినంతసేపును, నిర్ఘాంతపోయి చూచుచు, మాటలు కాగానె ముఖం ప్రక్కకు త్రిప్పి) డామిట్! వ్యవహారం అడ్డంగా తిరిగింది.

(తెర దించవలెను)

# Preface to the Second Edition

It was my original intention to reprint the play with slight alternations, but at the suggestion of my friend Mr. S. Srinivasa Iyengar, for whose literary judgments. I have great respect, I recast it. In the process, it has gained considerably in size. In its present shape it is almost a new work.

The first edition was marked success. The press gave it a cordial reception and hailed it as an event in the History of Telugu Literature, and men, women and children read it with interest. The only exception was Mahamahopadhyaya K. Venkataratnam Pantulu garu who cannot stand two things in this otherwise perfect world - Social Reform and Spoken Telugu. The first edition was exhausted in a few weeks, and there was since been a constant demand for copies. I long postponed the worry of a second edition and I undertake it now only at the importunity of friends.

In the Telugu country an author has generally to be his own publisher and book-seller. There is no book-selling enterprise, and what book-reading enterprise there is, is due entirely to the exertions of that venerable body, the Board of studies. The Christian Gospels do not speak of an eleventh Commandment "Thou shalt read!", but it is given to the Telugu Board of Studies to Command "Thou shalt read!", and straight thousands of unfortunate young men read books that no mortal can read with profit or with pleasure.

When I wrote the play, I had no idea of publication. I wrote it to advance the cause of Social Reform and to combat a popular prejudice that the Telugu language was unsuited to the stage. Itinerant Maharatha troupes staged Hindi plays in the Telugu districts and made money. Local companies copied their example and audiences listened with delight to what they did not understand. The bliss of ignorance could not have been more forcibly illustrated. *Kanyasulkam* gave little scope to vulgar stage attractions such as flaring costumes, sensuous dances, bad music and sham fights; yet it drew crowded houses and vindicated the claims of the Vernacular.

I am glad to find that Hindi plays are on the decline. But the condition of the Telugu stage can, by no means, be considered to be satisfactory. There are no theatres worth the name, and no professional actors who practise acting as an art. There are not many good plays either. Modern life which presents complex social conditions is neglected by play-wrights except for purposes of the broadest farce, and poverty of invention is manifested by the constant

handling of threadbare romantic topics. Few writers display any knowledge of technique. Such a low level of literary workmanship is a matter for wonder after fifty years of University Education and domination of Western Culture, and it can be attributed only to the defective teaching of English Literature in our Colleges. A better state of things cannot perhaps, be expected until a strong sense of duty impels English Professors and Educational Officers to cultivate the vernaculars.

The Telugu intellect is also seriously handicapped by the tyranny of authority - of a highly artificial literary dialect, a rigid system of alliterative versification, and literary types which have long played out. I shall say a word here about the Literary Dialect. Since I wrote the preface to the first edition, the spoken Dialect has, gained ground. My friend, Principal P.T. Srinivasa Iyengar recently started a Telugu Teaching Reform Society among the aims and objects of which the cultivation of Vernacular Telugu holds a prominent place, and Mr. Yates, whose name will always be remembered in the Telugu districts for the introduction of rational methods of teaching into our schools, has lent weight to the movement by accepting the Presidentship of the Society.

I cannot understand how modern writers fail to see the merits of Spoken Telugu, its softness which elicited the admiration of foreigners, and its range of expression. At this moment, the best prose in the language is in the Spoken Dialect. Strange as it may sound, Telugu prose owes its origin and development not to the patronage of kings or to the influence of foreign literatures, but to the exertions of a curious Englishman who stimulated compilation of local histories in the vernacular during the early years of the last century. The Mackenzie Collections, no doubt, comprise tracts of unequal merit but for rythm, flow and directness some of them beat the best work in the Literary Dialect ! and, what is rare in Telugu literature, they reflect the mind of the people and bear impress of the times. Unconsciously possibly, **Raj Bahadur K. Viresalingam Pantulu** garu rendered great service to Telugu by issuing as the first volume of the collected works adaptations of English acting plays and farces of Indian Life written in vernacular of various degrees of purity; and the choice does credit to his shrewd common sense, because that first volume contains his very best work, in fact, his only work that took the public by storm. The credit of deliberately introducing the vernacular into Telugu drama in keeping with Sanskrit tradition belongs to my friend V. Venkataraya Sastri garu whose *Prataparudriyam* owes not a little of his charm to dialogue in the dialects. I believe my play is the first ambitious work in the Spoken Dialect and, certainly, it has not failed, but success or failure of individual authors is no test of the capacity of a language.

While the vernacular is thus gaining recognition, the Literary Dialect itself is approximating to the Spoken Dialect in the best modern prose which manifests great freedom of usage. Rai Bahadur K. Viresalingam Pantulu garu, the most Prominent figure in the Telugu World of letters at the present day, has set the example of laxity in the observance of the Law of interchange of soft and hard consonants after a *drita* nasal. Hardly a modern writer would escape censure if judged by rules of grammar and established usage, and in the school room. Pandits have relaxed insistence on rigid observance of rules of *sandhi*. The moral of this tendency to break through traditional restrictions is clear. The old Literary Dialect is felt to be an inconvenient instrument, and there is an unconscious effort to form a new Literary Dialect. My complaint is that this movement is illogically slow.

I view the Telugu Literary Dialect as a great disability imposed by tradition upon the Telugus. Let those who love fetters venerate it. My own vernacular for me, the Living Telugu, the Italian of the East in which none of us is ashamed to express our joys and sorrows, but which some of us are ashamed to write well. Literature in the Vernacular will knock at the door of the peasant and it will knock at the door of the Englishman in India. Its possibilities are immense.

No argument in favour of a Vernacular Literature is needed with persons who are conversant with the history of the English Dialects and the Prakrits, and I know it is : not arguments that will evolve a new Literary Dialect for Telugu. A great writer must write and make it. Let us prepare the ground for him.

The cause of Social Reform has received strong support from a recent decision of the Madras High Court in which a full bench consisting of Chief Justice Sri Arnold White, and Justice Miller and Munro ruled : "That a contract to make payment to a father in consideration of his giving his daughter in marriage is immoral and opposed to public policy within the meaning of Section 23 of the Indian Contract Act".

I had to contend with one difficulty in printing this book. There are many sounds in the Spoken Dialect which are not represented in the Telugu Alphabet. In the present state of Telugu phonetics, I had to content myself with indicating such sounds by a horizontal line placed over the nearest symbols, and I employed the Ardhanusvara after a nasal. The creation of new symbols and their adoption into type can be effected only after a more widespread recognition of the Spoken Dialect.

My best thanks are due to Messrs. G. Ramaswami Chetty Co., who cheerfully undertook to adopt my innovations, and did their part of the work to my entire satisfaction.

"Elk Hill House"
Ootacamund, G.V.A.
1st May 1909.

# పాత్రములు.



1. అగ్నిహోత్రావధాన్లు – కృష్ణారాయపురం అగ్రహారీకుడు.
2. వెంకమ్మ – అతని భార్య.
3. బుచ్చమ్మ – పెద్ద కూతురు, వితంతువు.
4. సుబ్బమ్మ – రెండవ కూతురు.
5. వెంకటేశం – కుమారుడు.
6. కరటకశాస్త్రి – అగ్నిహోత్రావధాన్లు బావమరిది. విజయనగరం సంస్కృత నాటక కంపెనీలో విదూషకుడు.
7. కరటకశాస్త్రి యొక్క శిష్యుడు, పెళ్లికూతురు వేషము, దాసరి వేషము వేయును.
8. లుబ్ధావధాన్లు – రామచంద్రపురం అగ్రహారీకుడు.
9. మీనాక్షి – అతని కుమార్తె వితంతువు.
10. రామప్పంతులు – రామచంద్రపురం అగ్రహారం కరణం.
11. గిరీశం – లుబ్ధావధాన్లు పింతల్లికొడుకు. వెంకటేశముకు చదువు చెప్పు నయ్యవారు.
12. సౌజన్యారావు పంతులు – వకీలు.
13. భీమారావుపంతులు – ప్లీడరు.
14. నాయుడు – ప్రైవేటు వకీలు.
15. పూజారి గవరయ్య – వైద్యుడు, మాంత్రికుడు.
16. మధురవాణి – వేశ్య.

డిప్టీకలక్టరు, హెడ్కనిష్టీబు, పోలిసెట్టి, సిద్ధాంతి, బైరాగి, దుకాణదారు, గ్రామ మునసబు, హవల్దారు, యోగిని, లుబ్ధావధాన్లు యొక్క నౌఖరు అసిరిగాడు, మనవాళ్లయ్య, వీరేశ.



# కన్యాశుల్కము

## ప్రథమాంకము

### ౧వ స్థలము : విజయనగరములో బొంకుల దిబ్బ

★★★

(గిరీశము ప్రవేశించును.)

**గిరీశ** : సాయంకాలమైంది, పూటకూళ్లమ్మకు సంతలో సామాను కొనిపెడతానని నెలరోజుల కిందట యిరవై రూపాయలు పట్టుకెళ్ళి డాన్సింగర్లు కింద ఖర్చు పెట్టాను, యీవాళ ఉదయం పూటకూళ్ళమ్మకీ నాకూ యుద్ధమైంపోయింది. బుఱ్ఱ బద్దలు కొడదామా అన్నంత కోపం వొచ్చింది గాని, పూర్రిచ్చర్డు చెప్పినట్లు పేషెన్సు వుంటే గాని లోకంలో నెగ్గలేం. ఈలా డబ్బు లాగేస్తె యిదివరకు యెన్ని పర్యాయములు వూరుకుంది కాదు. యిప్పుడేదో కొంచం డాన్సింగర్లు మాట ఆచోకీ కట్టినట్టు కనబడుతుంది. ఓర్వలేని వెధవ యెవడైనా చెప్పివుంటాడు. ఉదయం కథ ఆలోచిస్తే యిటుపైని తిండి పెట్టేటట్టు కానరాదు. యీ వూళ్ళో మరి మన పప్పు వుడకదు. ఎటు చూసినా అందరికీ బాకీలే. వెంకుపంతులు గారి కోడలికి లవ్ లెటర్ రాసినందుకు యెప్పుడో ఒహప్పుడు సమయం కనిపెట్టి దేహశుద్ధి చేస్తారు.

Can Love be controll'd by advice ?
Will cupid our mothers obey?

శీఘ్రంగా యిక్కణ్ణించి బిచాణా యెత్తివెయ్యడమే బుద్ధికి లక్షణం; గాని మధురవాణిని వదలడవంటే యేమీ మనస్కరించకుండా వున్నది.

It is women that seduce all mankind.

నేను యేమో ఉద్యోగాలూ ఊళ్ళూ యేలి తనతో వైభవం వెలిగిస్తాననే నమ్మకంతో వుంది, పూర్ క్రీచర్!

ఎవరా వస్తున్నది! నా ప్రియ శిష్యుడు వెంకటేశ్వర్లులా వున్నాడు. యీవాళ కిస్మిస్ శలవులు యిచ్చి వుంటారు. వీడి వైఖరి చూస్తే పరిక్ష ఫేలైనట్టు కనబడుతుంది. వీణ్ణి కొంచం వోదార్చి వీడికి శలవుల్లో చదువు చెప్పే మిషమీద వీడితో వీడి వూరికి వుడాయిస్తే చాలా చిక్కులు వొదుల్తాయి; అటుంచి నరుక్కు రమ్మన్నాడు.

(వెంకటేశం ప్రవేశించును)

యేమివాయ్ మైడియర్ షేక్స్పియర్, ముఖం వేల వేసినావ్?

**వెంక** : యిక మిర్నాతో మాట్లాడకండి. మా మేష్టరు మీతో మాట్లాడొద్దన్నాడు. మీ సావాసం చెయడం చాత నా పరిక్ష పోయిందని అన్నారు.

**గిరీ** : నాన్సెన్స్, మొదట్నుంచీ నేను అనుమానిస్తూనే వున్నాను. నీ మేష్టరికి నన్ను చూస్తే కిట్టదు. అందుచాత నిన్ను ఫెయిల్ చేశాడు గాని, లేకుంటే నువ్వేవింటి ఫెయిల్ కావడవేఁవిటి? అతనికీ నాకూ యెందుకు విరోధం వొచ్చిందో తెలిసిందా? అతను చెప్పేదంతా తప్పుల తడక. అది నేను న్యూసు పేపర్లో యేకేశాను. అప్పట్నుంచి నేనంటే వాడిక్కడుపుడుకు.

**వెంక** : మీ వల్ల నాకు ఒచ్చిందల్లా చుట్ట కాల్చడం వొక్కటే. పాఠం చెప్పమంటే యెప్పుడూ కబుర్లు చెప్పడవేఁ కాని ఒక మారయినా ఒక ముక్క చెప్పిన పాపాన్ని పోయినారూ?

**గిరీ** : డామిట్. ఇలాటి మాటలంటే నాకు కోపం వస్తుంది. ఇది బేస్ ఇన్గ్రాటిట్యూడ్. నాతో మాట్లాడడవేఁ ఒక ఎడ్యుకేషన్. ఆ మాటకొస్తే నీకున్న లాంగ్వేజి నీ మేష్టరుకుందీ? విడో మారియేజి విషయమై, నాచ్చి కొశ్చన్ విషయమై నీకు యెన్ని లెక్చర్లు యిచ్చాను! నా దగ్గర చదువుకున్నవాడు ఒహడూ అప్రయోజకుడు కాలేదు. పూనా డక్కన్ కాలేజీలో నేను చదువుతున్నప్పుడు ది ఇలెవెన్ కాజస్ ఫర్ది డిజనరేషన్ ఆఫ్ ఇండియాను గూర్చి మూడు ఘంటలు ఒక్క బిగిని లెక్చెర్ యిచ్చేసరికి ప్రొఫెసర్లు డంగయిపోయినారు. మొన్న బంగాళీ వాడు యీ వూళ్లో లెక్చరిచ్చినప్పుడు ఒకడికైనా నోరు పెగిలిందీ? మన వాళ్ళు వుట్టి వెధవాయలోయ్, చుట్ట నేర్పినందుకు థాంక్ చెయ్యక, తప్పు పట్టుతున్నావ్? చుట్ట కాల్చడం యొక్క మజా నీకు యింకా బోధపడకపోవడం చాలా ఆశ్చర్యంగా వుంది. చుట్టగాల్చబట్టే కదా దొర్లింత గొప్పవాళ్ళయినారు. చుట్ట కాల్చని యింగ్లీషు వాణ్ణి చూశావూ? చుట్ట పంపిణి మీదనే స్టీము యంత్రం వగయిరా తెల్లవాడు కనిపెట్టాడు. లేకపోతే వాడికి పట్టుబణ్ణా? శాస్త్రకారుడు యేవఁన్నాడో చెప్పానే. సూత ఉవాచ – క॥ ఖగపతి యమృతము తేగా । భుగభుగమని పొంగి చుక్క భూమిని వ్రాలెన్। పొగ చెట్టై జన్మించెను । పొగతాగనివాడు దున్నపోతై బుట్టును॥ యిది బృహన్నారదీయం నాలుగవ ఆశ్వాసంలో వున్నది. అది అలా వుణ్నీ గాని నీ అంత

తెలివైన కుఱ్ఱవాణ్ణి ఫెయిల్ చేసినందుకు మీ మేష్టరు మీద నావొళ్ళు మహా మండు తూంది. ఈ మాటు వంటరిగా చూసి వొక తడాఖా తీస్తాను. నువ్వు శలవుల్లో యిక్కడుంటావా వూరికి వెళతావా?

వెంక : వెళ్ళాల్నుంది గాని, పాసు కాలేదంటే మా తండ్రి చావకొడతాడు.

గిరీ : ఆ గండం తప్పే వుపాయం నేన్చెబుతాను, నే చెప్పినట్టల్లా వింటానని ప్రమాణం చాస్తావూ?

వెంక : (గిరీశం కాళ్ళు పట్టుకొని) మీ శలవు యెప్పుడు తప్పాను? మా తండ్రికి మా చడ్డ కోపం. పాసు కాలేదంటే యెవిఁకలు విరగ్గొడతాడు (కన్నీరు చేత తుడుచుకొనును)

గిరీ : దటీజ్ టిరనీ –యిదే బంగాళీ కుఱ్ఱవాడవుతే యేంజాస్తాడో తెలిసిందా? తాతయేది, తండ్రయేది కఱ్ఱ పట్టుకొని చమ్డాలెక్క గొడతాడు; మీ అగ్రహారం కుఱ్ఱ వాళ్ళు మరి యవళ్లయినా యీ వూళ్లో చదువుకుంటున్నారా?

వెంక : మరెవళ్లూ లేరు.

గిరీ : ఐతే నేనో వుపాయం చెపుతాను విను, నే కూడా నీతో మీవూరొచ్చి పరిక్ష పాసయినావని మీ వాళ్ళతో చెబుతాను; అక్కడ నీకు చదువు చెప్పడానికి ఒచ్చానని మీ వాళ్ళతో చెప్పు; శెలవులాఖర్ని నిన్ను టవును స్కూల్లో పై క్లాసులో ప్రవేశపెడతాను.

వెంక : మీరేవొస్తే బతికాను మరేవిఁటి; కిందటి మాటు శలవులికే మా అమ్మ మిమ్మల్ని తీసుకు రమ్మంది.

గిరీ : ఆల్రైట్–గాని–నాకిక్కడ చాలా వ్యవహారములలో నష్టం వస్తుందే – మునసబు గారి పిల్లల్కి శలవుల్లో పాఠాల్చెపితె ఫిఫ్టీ రుపీజ్ యిస్తావఁన్నారు; అయినా నీ విషయవైఁ యంత లాస్ వచ్చినా నేను కేర్ చెయ్యను. ఒక భయం మాత్రం వుంది. మీ వాళ్ళు బార్‌బరస్ పీపిల్ గదా, నన్ను తిన్నగా ట్రీట్ చేస్తారో చెయ్యరో. నీవు నన్ను గురించి మీ మదర్‌తో గట్టిగా రికమెండ్ చెయ్యవలసి వుంటుంది. కొత్త పుస్తకాలికి వొక జాబితా రాయి – కొంచం డబ్బు చేతిలో వుంటేనే గాని సిగర్సుకి యిబ్బంది కలుగుతుంది. నోటుబుక్కు తీసి రాయి.

1 రోయల్ రీడర్, 2 మాన్యూల్ గ్రామర్, 3 గోష్ జియామెట్రీ, 4 బాస్ ఆల్జిబ్రా, 5 శ్రీనివాస్సయర్ అర్థిమెటిక్, 6 నలచరిత్ర, 7 రాజశేఖర చరిత్ర, 8 షెపర్డు జనరల్ ఇంగ్లీష్, 9 వెంకట సుబ్బారావు మేడీజీ. యెన్ని పుస్తకాలయినాయి?

వెంక : తొమ్మిది.

**గిరీ** : మరొక్కటి రాయి. అక్కడికి పదీ అవుతాయి. కుప్పుసామయ్యర్ మేడ్ డిఫికల్ట్. అక్కడికి చాల్ను. మీ వాళ్లు గాని యింగ్లీషు మాట్లాడమన్నట్టాయినా తణుకూ బెణుకూ లేకుండా పుస్తకాల్లో చదువుకున్న ముక్కలు జ్ఞాపకం వున్నంతవరకు యాకరు పెట్టు, నీ దగ్గిర కాపర్సు యేవైఁనా వున్నవా? నా దగ్గిర కరన్సీ నోట్లు వున్నవి గాని మార్చలేదు. పదణాలు పెట్టి ఓ శేరు కాశీ మిఠాయి కొని పట్టుకురా. రాత్రి మరి నేను భోజనం చెయ్యను. మార్కట్టుకి వెళ్ళి బండీ కుదిర్చి దానిమీద నా ట్రావెలింగ్ ట్రంక్కు వేశి మెట్టు దగ్గిర బండీ నిలబెట్టి ఉంచు. యిక్కడ కొన్ని రాచకార్యాలు చక్కబెట్టుకుని యంత రాత్రికైనా వొచ్చి కల్సుకుంటాను. గో ఎట్వన్స్; మైగుడ్ బోయ్. నువ్ బుద్ధిగా వుండి చెప్పిన మాటల్లా వింటూంటే నిన్ను సురేంద్రనాథ్ బానర్జీ అంత గొప్పవాణ్ణి చేస్తాను. నేను నీతో వస్తానన్న మాటమాత్రం పిట్టకైనా తెలియనియ్యొద్దు. జాగ్రత (వెంకటేశం నిష్క్రమించును.)

**గిరీ** : యీ వ్యవహారమొహటి ఫైసలైంది. ఈ రాత్రి మధురవాణికి పార్టింగ్ విజిట్ యివ్వందీ పోకూడదు.

(రాగవరసతో పాడును)

నీ సైటు నా డిలైటు;
నిన్ను మిన్న
కానకున్న
క్వైటు రెచడ్ ప్లైటు,
మూను లేని నైటు.

(ఒక బంట్రోతు ప్రవేశించును)

**బంట్రోతు** : నేను పొటిగరాప్పంతులు గారి నౌఖర్నండి, లెక్క జరూరుగుందండి. పొటిగరాపుల కరీదు యెంటనె యిప్పించమన్నారండి.

**గిరీ** : (విననట్టు నటించుతూ)

ఫుల్లుమూనూ లైటటా,
జాసమిన్ను వైటటా,
మూను కన్న
మొల్ల కన్న
నీదు మోము బ్రైటటా,
టా! టా! టా!

**బంట్రోతు** : యంతమందిని పంపినా యిచ్చారు కారటండి, నేనాళ్ళ లాగూరుకుండేవోణ్ణి కానండి.

**గిరీ** : అయ్యకోనేటికి తోవయిదే.

**బంట్రోతు** :యక్కడి శెవిఁటిమాలోకం వొచ్చిందయ్యా.

**గిరీ** : కోవఁటి దుకాణవాఁ? కస్పా బజార్లో గాని యిటి వేపు లేదు.

**బంట్రోతు** : (గట్టిగా చెవిదగ్గర నోరుపెట్టి) పోటిగరాపులు కరీదిస్తారా యివ్వరా?

**గిరీ** : బస, రాధారీ బంగాళాలో చెయ్యొచ్చును.

**బంట్రోతు** : (మరీ గట్టిగా) యాడాది కిందట మీరూ సాన్దీ కలిసియేసుకున్న పోటిగరాపుల కరీదు మా పంతులు నిలబెట్టి పుచ్చుకొమ్మన్నారు.

**గిరీ** : ఓహో నీవటోయ్, యవరో అనుకున్నాను. నింపాదిగా మాట్లాడు, నింపాదిగా మాట్లాడు. రేపు ఉదయం యెనిమిది ఘంటలకి పూటకూళ్ళమ్మ యింటికి వొస్తే అణా ఫయిసల్తో సొమ్మిచ్చేస్తాను. మీ పంతులికి స్నేహం మంచీ చెడ్డా అక్కర్లేదూ?

**బంట్రోతు** : మాటల్తో కార్యం లేదు. మొల్లో శెయ్యెట్టి నిల్సున్నపాట్ని పుచ్చుకొమ్మన్నారండి.

**గిరీ** : పెద్ద మనిషివి గదా; నువ్వూ తొందరపడ్డం మంచిదేనా? నీ తండ్రి యంత పెద్ద మనిషి, యీ చుట్ట చూడు ఎంత మజాగా కాల్తుందో. హవానా అంటారు దొర్లు దీన్ని. రేప్పొద్దున్న రా రెండు కట్టలిస్తాను.

**బంట్రోతు** : శిత్తం, సొమ్ము మాటేం శలవండి.

**గిరీశం**: చెప్పాను కానా? రేప్పొద్దున్న యివ్వకపోతే మాలవాడి కొడుకు ఛండాలుడు.

**బంట్రోతు** : మాలాడి కొడుకు శండాలుడు కాకుంటే మరేటండి.

**గిరీశం**: నీకు నమ్మకం చాలకపోతే యిదిగో గాయత్రీ పట్టుకు ప్రమాణం చేస్తాను.

**బంట్రోతు** : శిత్తం, రేపు పొద్దున్న సొమ్మియ్యకపోతే నా ఆబోరుండదండి.

**గిరీ** : ఆహాఁ. నీ ఆబోరు ఒహటీ, నా ఆబోరు ఒహటీనా? (బంట్రోతు నిష్క్రమించును)

ఇన్నాళ్లకి జంఝుప్పోస వినియోగంలోకి వొచ్చింది. థియాసాఫిస్టుసు చెప్పినట్లు మన ఓల్డు కస్టమ్సు అన్నిటికీ యేదో ఒహ ప్రయోజనం ఆలోచించే మనవాళ్ళు యేర్పరిచారు. ఆత్మానుభవం అయితేనే గాని తత్వం బోధపడదు. ఈ పిశాచాన్ని వొదుల్చుకునే సరికి తల ప్రాణం తోక్కొచ్చింది. శీఘ్రబుద్ధేః పలాయనం. పెందరాళే యీ వూర్నించి వుడాయిస్తేనే కాని ఆబోరు దక్కదు. యిక మధురవాణి యింటికి వెళదాం. మేక్ హే వైల్దీ సన్ షైన్స్ అన్నాడు.

## ౨వ స్థలము : మధురవాణి యింట్లో గది

**(రామప్పంతులు కుర్చీ మీద కూర్చుండును, మధురవాణి యెదట నిలుచుండును.)**

**రామ** : (జేబులో నుంచి చుట్ట తీసి పంటకొన కొరికి) పిల్లా, అగ్గిపుల్ల.

**మధురవాణి** : (అగ్గిపుల్ల వెలిగించి చుట్టకందించుచుండగా రామప్పంతులు మధురవాణి బుగ్గను గిల్లును. మధురవాణి చుట్ట కాలకుండానే అగ్గిపుల్ల రాల్చి యెడంగా నిలబడి కోపం కనపర్చుతూ) మొగవాడికయినా ఆడదానికయినా నీతి వుండాలి. తాకవద్దంటే చెవిని పెట్టరు గదా?

**రామ** : నిన్ను వుంచుకోవడానికి అంతా నిశ్చయమయి రేపో నేడో మంచి ముహూర్తం చూసి మా వూరు లేవతీసుకు వెళ్లడానికి సిద్ధవఁయ్యింటే యింకా యెవడో కోన్కిస్కా హేగాడి ఆడాలో వున్నానంటూ పాతివ్రత్యం నటిస్తావేమిటి?

**మధుర** : వేశ్య అనగానే అంత చులకనా పంతులు గారూ? సానిదానికి మాత్రం నీతి వుండొద్దా? మా పంతులు గార్ని పిలిచి "అయ్యా యిటు పైని మీ తోవ మీది, నా తోవ నాది" అని తెగ తెంపులు చేసుకున్నదాకా నేను పరాధీనురాలినే అని యెంచండి. మీరు దెప్పి పొడిచినట్టు ఆయన వైదీకయితేనేమి, కిరస్తానం మనిషైతే నేమి, పూటకూళ్లమ్మను వుంచుకుంటేనేమి నన్ను యిన్నాళ్లూ ఆ మహరాజు పోషించాడు కాడా? మీరంతకన్న రసికులయినా, నా మనస్సు మీరు యెంత జూరగొన్నా, ఆయన యెడల విశ్వాసం నాకు మట్టుకు వుండొద్దా?

**రామ** : పెద్ద పెద్ద మాటలు ప్రయోగిస్తున్నావు! వాడి బతుక్కి వాడు పూటకూళ్లమ్మని వుంచుకోవడం కూడానా! పూటకూళ్లమ్మే వాణ్ణి వుంచుకొని యింత గంజి బోస్తూంది.

**మధు** : అన్యాయం మాటలు ఆడకండి, ఆయన యెంత చదువుకున్నాడు, ఆయనకి యెంత ప్రఖ్యాతి వుంది! నేడో రేపో గొప్ప వుద్యోగం కానైయ్యింది.

**రామ** : అహహ (నవ్వుతూ) యేం వెఱ్ఱి నమ్మకం! నీవు సానివాళ్ళలో తప్ప పుట్టావు. గిరీశంగారు గిరీశం గారు అని పెద్ద పేరు పెడతావేవిఁటి, మా వూళ్ళో వున్న లుబ్ధావధాన్లు పింతల్లి కొడుక్కాడూ వీడూ! గిఱ్ఱడని మేం పిలిచేవాళ్ళం. బొట్లేరు ముక్కలు రెండు నేర్చుకోగానే ఉద్యోగాలే! వాడికల్లా వక్కటే వుద్యోగం దేవుఁడు రాశాడు. యేవిఁటో తెలిసిందా? పూటకూళ్లమ్మ యింట్లో దప్పిక్కి చేరి అరవ చాకిరీ చెయ్యడం.

**మధు** : యీ మాటలు ఆయన్ని అడుగుదునా?

**రామ** : తప్పకుండా. కావలిస్తే నేను చెప్పానని కూడా చెప్పు.

**మధు** : అయినా ఆయన గుణ యోగ్యతలతో నాకేం పని? యేవఁయినా ఆయన నాకు యజమాని. ఆయన తప్పులు నా కళ్ళకు కనపడవ్.

**రామ** : అయితే అతడికి విడాకులు యెప్పుడిస్తావు?

**మధు** : యిక్కడి రుణాలూ పణాలూ తీర్చుకోడానికి మీరు శలవిచ్చిన రెండు వొందలూ యిప్పిస్తే యీ క్షణం తెగ తెంపులు చేసుకుంటాను.

**రామ** : అయితే యింద (జేబులోనుంచి నోట్లు తీసి యిచ్చును. మధురవాణి అందుకొంటుండగా రామప్పంతులు చెయ్యిపట్టి లాగును. మధురవాణి కోపంతో చెయి విడిపించుకుని నోట్లు పారవేసి దూరముగా నిలుచుఁను)

**మధు** : మీతో కాలక్షేపం చెయ్యడం కష్టం. ఒక నిర్నయం మీద నిలవని మనిషిని యేవఁ న్నమ్మను?

**రామ** : (నోట్లు యెత్తి) క్షమించు, అపరాధం, (నోట్లు చేతికిచ్చును) లెఖ్ఖపెట్టి చూసుకో.

**మధు** : ఆమాత్రం మిమ్మల్ని నమ్మకపోతే మీతో రానేరాను. యింత రసికులయ్యుండీ నా మనస్సు కనిపెట్ట జాలినారు కారు గదా? మీ నోట్లు మీ వద్దనే వుంచండి. నేను డబ్బు కక్కూర్తి మనిషిని కాను. (నోట్లు యివ్వబోవును.)

**రామ** : వొద్దు! వొద్దు! వొద్దు! నీ మనసు కనుక్కుందావఁని అన్నమాట గాని మరొకటి కాదు. గాని, యీ గిరీశం గుంట వెధవ, వీడెవడో మా గొప్పవాడనుకుంటు న్నావేవిఁటి?

**మధు** : ఆయన్ని నా యదట తూల్నాడితే యిదిగో తలుపు తీశాను విజయం చెయ్యండి (తలుపు తీసి వకచేత పట్టుకుని రెండవ చేతి వేలుతో పైకి తోవ చూపును). అదుగో గిరీశంగారే వొస్తున్నారు, ఆ మాటేదో ఆయన్తోటే చెప్పండి.

**రామ** : వేళాకోళం ఆడుతున్నావూ?

**గిరీశం**: (వాకట్లో నుంచి) మైడియర్.

**రామ** : (ఆత్మగతం) అన్న, వేళగాని వేళొచ్చాడు. గాడిద కొడుకు, తంతాడు కాబోలు, యెవిఁటి సాధనం, ఈ మంచం కింద దూరుదాం (మంచంకింద దూరును).

**(గిరిశం ప్రవేశించును.)**

**గిరీశం** : వెల్, మైడియర్ ఎంప్రెస్ (బుజము మీద తట్టబోవును.)

**మధు** : (ఒసిలి తప్పించుకుని) ముట్టబోకండి.

**గిరీశం**: (నిర్ఘాంతపోయి) అదేమిటి ఆ వికారం.

మధు : ఆఖరు వికారం.

గిరీ : (ఆత్మగతం) నేను వుడాయిస్తానని దీనికెలా తెలిసింది చెప్మా! సానివాళ్లకి కర్ణ పిశాచి వుంటుంది కాబోలు (పైకి) మైలబడితే స్నానం చేసి వేగిరం రా.

మధు : యిప్పుడేం తొందర, తలంటుకుంటాను.

రామ : (ఆత్మగతం) చబాష్, యేమి నీతయిన మనిషి యిది! వెధవని ముట్టుకోనివ్వ కుండా యెత్తు యెత్తింది!

గిరీ : మైలా గియిలా మా యింగ్లీషు వారికి లక్ష్యం లేదు, యిలారా (దగ్గిరికి చేరును.)

మధు : (వేలుచూపి) అక్కడనే ఆగండి. మీరు కిరస్తానం అయితే కావచ్చును. నేను కిరస్తానం ఇంకా కాలేదే. మీరు కిరస్తానం అన్నమాట యిప్పుడే ఒహరు చప్పగా విన్నాను.

రామ : (తనలో) నె చెప్పానంటుందా యేమిటి!

గిరీ : ఒకరు చప్పగా విన్నావూ? యవరా జెప్పింది? యవడికిక్కడికి రావడానికి మగుదూర్ వుంది? యిలాంటి చాడీకోర్ కబుర్లు చెప్పడానికి యవడికి గుండె వుంది? ఆ మాటలు విని నాతో చెప్పడానికి నీకెక్కడ గుండుంది? చెప్పు!

రామ : (తనలో) తంతాడు కాబోలు, యరక్క చిక్కడ్డాను.

మధు : మొగాడే చెప్పాలాయేవింటి? ఆడవాళ్లకి దేవుఁడు నోరివ్వలేదా?

గిరీ : (తనలో) పూటకూళ్ల ముండే చెప్పింది కాబోలు (పైకి) ఆడదా? ఆడదాన్ని నోరు బెట్టుకు బతకమనే దేవుఁడు చేశాడు. పరువయిన ఆడది నీ యింటి కెందుకొస్తుంది.

మధు : పరువైన మొగాళ్లొచ్చినప్పుడు పరువైన ఆడవాళ్లెందుకు రాకూడదు? ముందు కూచోండి. తరవాత కోప్పడుదురు గాని, చుట్ట తీసుకొండి. అదుగో అగ్గిపెట్ట.

గిరీ : ముట్టుకోడానికి వల్లలేకపోతే అగ్గిపుల్ల వెలిగించి యివ్వడానికయినా పెట్టిపుట్టాను కానా? యీవాళ మహా ఉత్సాహంగా వచ్చాను గాని, ఉత్సాహ భంగం చేశావ్.

మధు : యెవిఁటా వుత్సాహం?

గిరి : యిదిగో జేబులో హైదరాబాద్ నైజామ్ వారి దగ్గిర్నించి వచ్చిన ఫర్మానా. మా నేస్తం నవాబ్ సదరదాలత్ బావురల్లీఖాన్ ఇస్పహన్ జంగ్ బహద్దర్‌వారు సిపార్స్ చేసి వెయ్యి సిక్కా రూపాయలు జీతంతో ముసాయిబ్ ఉద్యోగం నాకు చెప్పించారు. అనగా హమేషా బాద్షా వారి హుజూర్న వుండడం.

రామ : (తనలో) యెవిఁట్రా వీడి గోతాలు!

గిరీ : యింత శుభవార్త తెచ్చినా, దగ్గిరికి రానిచ్చావు కావు గదా? నాతో హైదరాబాద్ వస్తావా?

మధు : (తలతిప్పుతూ) నే యెందుకు! పూటకూళ్లమ్మని తీసికెళ్లండి.

గిరీ : (నిర్ఘాంతపోయి) పూటకూళ్లమ్మ యేవఁయినా పెంట పెడుతూందా యేవిఁటి?

మధు : మీకే తెలియాలి.

గిరీ : నీ తెలివి తక్కువ చూస్తే నాకు నవ్వొస్తూంది. యెవడేమాటన్నా నా మీద నమ్మడవేఁనా? యీ ఘోరమైన అబద్ధాలు నీతో యవడు చెబుతున్నాడో కనుక్కోలేననుకున్నావా యేవిఁటి? సప్త సముద్రాల్దాటినా వాడి పిలకట్టుకుని పిస్తోల్తో వొళ్ళు తూట్లు పడేటట్టు ఢాఢామని కొట్టకపోతినట్టయినా నా పేరు గిరీశమే, నినద భీషణ శంఖము దేవదత్తమే! కబడ్దార్!

మధు : సముద్రాలవతల కెళ్ళి వెతకక్ఖర్లేదు. ఆ చెప్పిన మనిషి మీ యదటే చెబుతాడు.

రామ : (తనలో) యీ ముండ నన్ను బయలుబెడుతుంది కాబోలా దైవమా!

గిరీ : (తనలో) థాంక్గాడ్. అయితె పూటకూళ్ల దాన్దెబ్బ తగల్లేదు. (పైకి) యిలాంటి దుర్మార్గప కూతలు ఆయిల్లాలు చెవిని పడితే చాలా ఖేదిస్తుంది. ఆ పాపవఁంతా నిన్ను చుట్టుకుంటుంది. ఆమె యంత పతివ్రత! యంత యోగ్యురాలు!

మధు : వెధవముండకి పాతివ్రత్యం అన్నమాట యీనాటికి విన్నాను.

గిరీ : దానికి... కాదు ఆమెకి మొగుళ్లేక పోయినా ఆమెను వెధవనడానికి వీల్లేదు.

మధు : మీరుండగా వెధవెలా అవుతుంది?

గిరీ : నాన్సెన్స్ (దీనికో తస్సా చెప్పి రంజింపచేదాం) యిదుగో విను. దాని నిజం యెవిఁటంటే–పూటకూళ్లమ్మ ముచ్చటగా తప్పటడుగులు వేశే రోజుల్లో ఒక కునుష్టి ముసలాడికి కట్ట నిశ్చయించారు. పుస్తె కట్టబోతూంటేనో కట్టిన వుత్తర క్షణంలోన్నో ఆ ముసలాడు పెళ్లి పీటల మీదే గుటుక్కుమన్నాడు. అప్పుడు పెళ్లి అయినట్టా కానట్టా అని మీమాంస అయింది. కొందరు పుస్తెకట్టాడన్నారు. కొందరు కట్టలేదన్నారు. పిల్లతండ్రి, పెళ్లికొడుకు వారసులుమీద దావా తెచ్చాడు. పురోహితుడు వాళ్ల దగ్గర లంచం పుచ్చుకుని పుస్తె కట్టలేదని సాక్షివిఁచ్చాడు. దాంతో కేసు పోయింది; మరిదాన్నెవరూ పెళ్లాడారు కారు.

మధు : అయితే మరి మీకు తప్పలేదే?

గిరీ : యేవిఁటి యీ కొత్త మాటలూ! నాకు ఆదీ అంతూ తెలియకుండా వుందీ! ఆహాఁ సరసం విరసంలో దిగుతూందే! హాస్యానికంటే నివ్వేవఁన్నా ఆనందవేఁ, నిజవఁని

గానీ అంటివా, చూడు నా తడాఖా. యవడీ మాటలు పేల్తున్నాడో వాడి పేరు తక్షణం చెబుతావా చెప్పవా?

**మధు** : రామ.

**రామ** : (తనలో) సచ్చాన్రా, పేరు చెప్పేసింది!

**మధు** : రామ! రామ! ఒహరు చెప్పేదేవింటి లోకవంతా కోడై కూస్తూంటేను? (వీధిలో నుంచి తలుపు తలుపు అని ధ్వని)

**గిరీ** : (తెల్లపోయి) తలుపు తియ్యోద్దు, తియ్యోద్దు, ఆ పిలిచే మనిషి వెఱ్ఱిముండ, మనుషుల్ని కరుస్తుంది.

**మధు** : తలుపు తీసేవుంది.

**గిరీశం**: చంగున వెళ్ళి గడియవేసెయ్.

**మధు** : అదుగో తలుపు తోసుకు వొస్తూంది.

**గిరీ** : గెంటెయ్, గెంటెయ్

**మధు** : ఆ వయ్యారం చూస్తే మీ పతివ్రతలా కనిపిస్తూంది. (మధురవాణి వాకట్లోకి వెళ్లును).

**గిరీ** : మంచం కింద దూరుదాం (గిరీశం మంచం కింద దూరును).

(తనలో) దొంగలంజ– సరసుణ్ణి దాచిందోయ్ మంచం కింద. యిదేవింటో మంచిమనిషి అని భ్రమించాను. దీన్తస్సా గొయ్యా. సిగపాయిదీసి తందును గాని యిది సమయం కాదు. అయినా పోయేవాడికి నాకెందుకు రొష్టు, (రామప్పంతులుతో మెల్లిగా) యవరన్నా మీరు, మహానుభావులు?

**రామ** : నేను రామప్పంతుల్నిరా, అబ్బాయీ.

**గిరీ** : తమరా, యీ మాత్రానికి మంచం కింద దాగోవాలా, మహానుభావా? నన్నడిగితే యిలాంటి లంజల్ని యిరవై మందిని మీకు కన్యాదానం చేతునే.

**రామ** : (తనలో) బతికాన్రా దేవుడా; (పైకి) నువ్వురా బాబూ దీన్నుంచుకున్నావు! అలా తెలిస్తే నే రాకపోదును సుమా.

**గిరీ** : మాటవినపళ్లేదు. కొంచం యిసుంటారండి (రామప్పంతులు ముందుకు జరుగును, గిరీశం అతన్ని తప్పించుకుని గోడవేపు చేరును)

**గిరీ** : అన్నా యీ లంజని యన్నడూ నమ్మకండీ, యిలా యిరవై మందిని దాచగల శక్తుంది, దీనికి.

**రామ** : రెండు వందలు దొబ్బిందిరా బాబూ.

**గిరీ** : నువ్వులేం జాగర్త చేశారా?

**రామ** : అంతేనా ?

**గిరీ** : మరేవింటి ?

**మధురవాణిన్ని, పూటకూళ్లమ్మ వల్లెవాటులో చీపురుగట్టదాచిన్ని ప్రవేశింతురు.)**

**మధు** : మీరన్న మనిషి యిక్కడలేరంటే చెవిని బెట్టరు గదా!

**పూట** : నీ యింట్లో జొరబడ్డాడని వీధులో వాళ్లు చెబితే నీ మాట నమ్ముతానా యెవింటి? ఆ వెధవ వుంటే, నాకేం కావాలి, వుండకుంటే నాకేం కావాలి. వాడు నీకిచ్చిన యిరవయి రూపాయలూ యిచ్చెయ్.

**మధు** : యవడికిచ్చావో వాణ్ణే అడగవమ్మా.

**పూట** : వెధవ కనబడితే సిగపాయిదీసి చీపురుగట్టతో మొత్తుదును, యెక్కడ దాచావేవింటి?

**మధు** : నాకు దాచటం ఖర్మవేఁవిఁ? నేను మొగనాల్ని కాను. వెధవముండనీ కాను. నా యింటి కొచ్చేవాడు మహరాజులాగ పబ్లీగ్గా వొస్తాడు (కంటితో మంచము కింద చూపును)

**పూట** : మంచంకింద దాగాడేమో (మంచము కిందుకు వంగి) నీ పరువు బుగ్గయినట్టే వుంది లేచిరా. (చీపురు గట్ట తిరగేసి రామప్పంతులును కొట్టును)

**రామ** : ఓర్నాయనా, నన్నెందుకొట్టడతావే దండు ముండా? (మంచంకింది నించి పైకి వచ్చి వీపు తడుముకొనును).

**మధు** : ఆయన్నెందుకు కొట్టావు? నాయింటికొచ్చి యేవింటీ రవ్వ?

**పూట** : అయితె మంచంకిందెందుకు దూరాడూ?

**మధు** : నీ కెందుకా గోష? అదో సరసం.

**పూట** : యిదో చీపురుగట్ట సరసం.

**రామ** : (వీపు తడువుఁకుంటూ) నీ సిగతరగా, ఆడదానివై పోయినావే, లేకుంటే చంపేసిపోదును. నీ రంకు మొగుణ్ణి కొట్టక నన్నెందుకొట్టావే ముండా? అందుకా నన్ను ముందుకు తోసి తాను గోడవేపు దాగున్నాడు.

**పూట** : ఆ వెధవ కూడా వున్నాడూ మంచం కింద! కుక్కా పైకిరా.

**గిరీ** : వెట్టప్పా! మంచంకిందికిరా, వెట్టి వొదల గొడతాను.

**పూట** : అప్పనిత్రా వెధవా నీకు? నీకు భయపడతాననుకున్నావా యేవిఁటి? నీ సానిముండ యలా అడ్డుకుంటుందో చూస్తాను. (పూటకూళ్లమ్మ ఒకవేపు నుంచి మంచం కిందికి దూరును. మరివొక వేపునుంచి గిరీశం పైకి వచ్చి రామప్పంతులు నెత్తి చరిచి లఘు వేసి పెరటి వేపు పరిగెత్తిపోవును.)

**రాము** : సచ్చాన్రా నాయనా (రెండు చేతుల తలపట్టుకొని) మధురవాణీ యేవీఁబేహద్బీ! కనిష్టీబుక్కబురంపించూ.

**మధు** : యెందుకు పబ్లీకున అల్లరీ అవమానవుఁన్నూ! రేపో యెల్లుండో మీరే వాడికి దెబ్బకి దెబ్బతీసి పగతీర్చుకుందురు గాని.

(మధురవాణి రామప్పంతుల్ని కాగిలించుకొని తల ముద్దెట్టుకుని చేతరాసి) యేవిఁ దుష్టు! మొగవాడయినవాడు యెదట నిలిచి కొట్టాలి. దొంగ దెబ్బకొడతాడూ? వాడి పొంకం అణుతురు గాని లెండి.

**రామ** : గవురనుమెంటు జీతవిఁచ్చుంచిన కనిష్టీబులుండగా మనకెందుకు శరీరాయాసం? యీ వెధవని పజ్యెండుకోర్టులంటా తిప్పకపోతే నేను రామప్పంతుల్ని కాను చూడు నా తమాషా!

**మధు** : (రామప్పంతుల్ని ముద్దుబెట్టుకుని) మాటాడక వూరుకొండి. (మంచం కింది వేపు చూపించి నోరు మూసి) దొంగ దెబ్బ కొట్టినవాడిదే అవమానం; మీది కాదు.

**రామ** : నొప్పెవడిదనుకున్నావు? ఆ ముండ మంచం కింద నించి రాదేం? చీపురు కట్టలాక్కో

**పూట** : ఫడేల్మంటే పస్తాయించి చూస్తున్నాను. నీ మొగతనం యేడిసినట్టే వుంది. (పైకి వచ్చును)

(అంతా నిష్క్రమింతురు.)



# కన్యాశుల్కము

## ద్వితీయాంకము

### ౧వస్థలము : కృష్ణారాయపురం అగ్రహారంలో అగ్ని హోత్రావధాన్లు ఇల్లు

(అగ్నిహోత్రావధాన్లు జంఝాలు వడుకుచుండును. కరటక శాస్తుల్లు శిష్యుడిచేత లేనిపేలు నొక్కించుకొను చుండును. వెంకమ్మ కూర తరుగుచుండును)

**వెంకమ్మ** : నిన్నట్నించి కిశిమీశ్శలవులని కుఱ్ఱవాడు వుత్తరం రాశాడు. యెన్నాళ్లో ఐంది వాణ్ణి చూసి, కళ్లు కాయలు కాసిపోయినాయి. గడియో గడియో రావాలి.

**అగ్ని హోత్రావధాన్లు** : ఎందుకు వొట్టినే వగచడం? వొద్దు వొద్దంటూంటే యీ యింగిలీషు చదువులో పెట్టావ్. మెరకపొలం సిస్తంతా వాడి కిందయి పోతూంది. కిందటి యేడు పరిక్ష ఫేలయిపోయినాడు గదా? యీ యేడు యెలా తగలేశాడో తెలియదు. మనకీ యింగిలీషు చదువు అచ్చిరాదని పోరి పోరి చెబితే విన్నావు కావు. మా పెద్దన్న దిబ్బావుధాన్లు కొడుకుని యింగిలీషు చదువుకు పార్వతీపురం పంపించేసరికి వూష్టం వొచ్చి మూడ్రోజుల్లో కొట్టేశింది. బుచ్చబ్బి కొడుక్కి యింగిలీషు చెప్పిద్దావఁనుకుంటూండగానే చచ్చినంత ఖాయలా చేసింది.

**వెంకమ్మ** : మీరెప్పుడూ యిలాంటి వోఘాయిత్తం మాటలే అంఛూవుంఛారు. డబ్బు కర్చయిపోతుందని మీకు బెంగ. మొన్న మొన్న మనకళ్లెదట మనవాకట్లో జుత్తు విరబోసుకు గొట్టికాయలాడిన నేమానివారి కుఱ్ఱాడికి మునసబీ ఐంది కాదూ?

**అగ్ని** : మన వెధవాయకి చదువొచ్చేదేం కనపడదు గాని పుస్తకాల కిందా జీతం కిందా యిహ నాలుగేళ్ళయే సరికి మన భూమి కడితేరిపోతుంది. ఆ పైని చిప్పా దొప్పా పట్టుకు బయల్దేరాలి. నిమ్మళంగా యింటి దగ్గిరుంటే యీపాటి నాలుగష్టాలు చెప్పేదును. వొద్దంటూంటే యీ వెధవింగిలీషు చదువులో పెట్టావు.

**వెంకమ్మ** : మనవాడికో మునసబీ ఐనా పోలీసుపనైనా ఐతే రుణాలిచ్చి యీ అగ్ఘురారం భూవుఁలన్నీ కొనేస్తాడు. యీడాదికో నూఱ్ఱూపాయలు కర్చు పెట్టడానికింత ముందూ వెనకా చూస్తున్నారు. మీలాగే వాడూ జంఝాలు వొడుక్కుంటూ బతకాలని వుందా యేవిఁషి? మీకంత భారవఁం తోస్తే మావాళ్ళు నాకు పసుపూ కుంకానికీ యిచ్చిన భూవఁమ్మేసి కుఱ్ఱాడికి చదువు చెప్పిస్తాను.

**కరటకశాస్త్రి**: నీ భూవెందు కమ్మాలమ్మా! మన సొమ్ము చెడతిని కొవ్వున్నాడు, అతడే పెట్టుకుంటాడు.

**అగ్ని** : ఐతే నన్ను ఆక్షేపణ చేస్తావషే? యీ మారంటే నీ అన్న వున్నాడని వూరుకునేది లేదు.

(గిరీశం వెంకటేశం ప్రవేశింతురు.)

**వెంక** : మాబాబ్మాబాబు వచ్చావషాయ్! (వెంకటేశమును కాగలించుకొనును.)

**అగ్నిహో**: వెధవాయా యీ మారైనా పాసయినావా? (వెంకటేశం తెల్లబోయి చూచును)

**గిరీశం**: పాసయినాడండి, ఫస్టుగా పాసయినాడు. నేను చాలా శ్రమపడి చదువు చెప్పానండి.

**అగ్ని** : యీ తురకెవడోయ్?

**గిరీశం**: టర్క్! డామిట్, టెల్ మోన్.

**అగ్ని** : మానా? మానులా వుంచా నంఛావూ? గూబ్బగలగొడతాను.

**వెంకటేశం** : (వణుకుతూ తల్లి వేపు చూసి) అమ్మా యీయ్నే నాకు చదువు చెప్పే మేష్టరు.

**కరటక**: ఇంటికి పెద్దమనిషొస్తే అపృచ్ఛపు మాటలాడతావేవింటి బావా? ఆయనేదో కుఱ్ఱవాడితో యింగిలీషు మాటంటే పుచ్చకాయల దొంగంటే బుజాల్తడువుంకున్నట్టు నీ మీద పెట్టుకుంటావేం? (బండివాడు సామాను దించును)

**గిరీశం**: (కరటకశాస్త్రితో) తమ బావగారా అగ్నిహోత్రావధాన్లుగారు? నన్ను తమరు యరక్కపోవచ్చును గాని, డిప్టీ కలక్టరు గారింటికి తమరు వచ్చేటప్పుడు నేను వారి పిల్లలికి చదువు చెబుతూ వుండేవాణ్ణి. డిప్టీ కలక్టరుగారు తమర్ని యేమ్మెచ్చుకునే వారనుకుంటారు!

**కరటక**: అవును మీ మొఖం చూసిన జ్ఞాపకవుంది. డిప్టీ కలక్టరు గారు మహదొడ్డ ప్రభువ్.

**గిరీశం**: మీలాంటి చప్పన్న భాషలూ వచ్చిన మనిషిని యక్కడా లేదనీ, సంస్కృతం మంచి నీళ్ల ప్రవాహంలా తమరు మాట్లాడతారనీ, తమలాంటి విదూషకుణ్ణి యక్కడా చూళ్లేదనీ డిప్టీ కలక్టరుగారు శలవిస్తూండేవారు. కవితారసం ఆయన్లా గ్రెహించేవారేరీ? నా కవిత్వవంటే ఆయ్న చెవికోసుకుంటారు. మహారాజావారి దర్శనం కూడా నాకు చెయించారండి.

**అగ్ని** : (ధుమధుమలాడుతూ) ఈ శషభిషలు నాకేం పనికిరావు. యితడి వైఖరి చూస్తే యిక్కడే బసవేసేటట్టు కనపడుతూంది. మా యింట్లో భోజనం యంత మాత్రం వీలుపడదు.

**వెంక** : ఆయన మాటలు గణించకు బాబూ, ఆయన మోస్తరది. మీదయవల్ల మా వాడికో ముక్కబ్బితే మీ మేలు మరిచిపోం.

**గిరీశం**: అందుకభ్యంతర వేఁవిఁటమ్మా, మీ వాడు శలవుల్లో చదువుచెప్పమని యంతో బతిమాలు కుంటే పోనీ పనికొచ్చే కుఱ్ఱవాడు గదా అని వొచ్చానుగాని, పట్ణంలో మునసబు గారింట భోజనం చేదని వొచ్చానా వారిచ్చే డబ్బు చేదని వొచ్చానా అమ్మా?

**వెంకమ్మ** : యీ చదువులకోసవఁని పిల్లణ్ణి వొదులుకుని వుండడం, వాడు పరాయి వూళ్ళో శ్రమదమాలు పడుతూండ్డం నా ప్రాణాలు యెప్పుడూ అక్కణ్ణే వుంఛాయి. డబ్బంటే యెన్నడూ వెనక చూళ్లేదు గదా, మేం కనడం మట్టుకు కన్నాం. మీరే వాడికి తల్లీ తండ్రీని. యలా కడుపులో పెట్టుకు చదువు చెబుతారో మీదే భారం.

**గిరీశం**: తమరు యింత దూరం శలవియ్యాలమ్మా? నా మంచి చెడ్డలు మీ కుఱ్ఱవాణ్ణడిగితే తెలుస్తుంది. మునసబుగారూ, డిప్టీ కలక్టరుగారూ యెన్నిక చేసిన మనిషిని. నా మాట నే చెప్పుకోవాలా, ఇంతెందుకూ, యిక మూడేళ్లు నాతరిఫీదులో వుంచితే క్రిమినల్లో వరసగా పోలీసు పరిక్ష పాసు చేయిస్తాను.

**అగ్ని** : మూడేళ్ళే! యీ సంవత్సరం పుస్తకాల కెంతవుతుందిరా అబ్బీ?

**వెంకటేశం** : పదిహేన్రూపాయలవుతుంది.

**అగ్ని** : ఒక్క దమ్మిడీ యివ్వను. వీళ్లిద్దరూ కూడి ఆ రూపాయలు పంచుకు తినేటట్టు కనపడు చూంది. నేను వేదం యనభై రెండు పన్నాలూ ఒహదమ్మిడీ పుస్తకాల ఖర్చు లేకుండా చదువుకున్నాను. ఇదంతా టోపీ వ్యవహారంలా కనపడుతుంది.

**కరటక**: (నవ్వుతూ) కోట్లకి విలవైన మాట అన్నావు బావా!

**గిరీశం**: (కరటకశాస్త్రితో) దిసీజ్ బార్బరస్, చూచారండీ, జెంటిల్మేన్ అనగా పెద్దమనిషిని యలా అంటున్నారో! నేను యిక యిక్కడ వుండడం భావ్యం కాదు, శలవు పుచ్చుకుంటాను.

**వెంకమ్మ** : చాల్చాలు బాగానే వుంది! యింటికెవరొచ్చినా నాకిదే భయం, ఆయన మాటలకెక్కడికి బాబూ, వెళ్లిపోకండి.

**కరటక**: అగ్నిహోత్రావుధాన్లూ! కుఱ్ఱవాడికి రవ్వంత చదువు చెప్పించడానికి ఇంత ముందూ వెనకా చూస్తున్నావ్, బుచ్చమ్మనమ్మిన పదిహేనువొందల రూపాయలేంజేశావ్?

**గిరీశం**: సెల్లింగ్గర్ల్స్! డామిట్!

**అగ్ని** : ప్రెతీ గాడిదె కొడుకూ అమ్మావమ్మా వంచూంఛాడు. కూరగాయల్లోషే అమ్మడానికీ? ఆ రూపాయలు పుచ్చుకోకపోతే మొగుడు చచ్చాడు గదా, దాని గతి యావైఁ య్యుండును?

**కరట** : చచ్చాడంటే వాడిదా తప్పు, మంచం మీంచి దించెయడానికి సిద్ధంగా వున్న వాడిక్కట్టావ్?

**గిరీశం**: తమరేనా నులక అగ్నిహోత్రావుధాన్లు గారు? యీ పట్టెని జటలో తమంత వారు లేరని రాజమహేంద్రవరంలో మా వాళ్లనుకునేవారు.

**అగ్ని** : మీది రాజమహేంద్రంషండీ. ఆ మాట చెప్పారు కారేం? రామావుధాన్లుగారు బాగున్నారా?

**గిరీశం**: బాగున్నారండి. ఆయన మా మేనమావఁగారండి.

**అగ్ని** : ఆ మాట చెప్పారు కారూ?

**గిరీశం** : మా మావఁ ఈ దేశబ్భోగట్టా వొచ్చినప్పుడల్లా తమర్ని యెన్నిక చేస్తూంటారండి.

**అగ్ని** : నాకూ వారికి చాలా స్నేహం. చూశారా కొంచం నాకు ప్రథమ కోపం. యవరో తెలియకుండా అన్న మాటలు, గణించకండేం.

**గిరీశం**: దానికేవఁండి, తమవంటి పెద్దలు అనడం మాలాంటి కుఱ్ఱవాళ్లు పడడం విధాయకవేఁ గదండీ?

**కరట** : (తనలో) యిన్నాళ్ళకి మా అగ్నిహోత్రుడికి తగిన వాడు దొరికాడు.

**అగ్ని** : చూశారండీ, మీ పేరేవిఁటండీ?

**గిరీశం**: గిరీశం అంటారండి.

**అగ్ని** : చూశారండి, గిరీశంగారూ! మా కరటక శాస్త్రుల్లు వట్టి అవకతవక మనిషి; మంచీ చెడ్డా యేమీ వాడి మనసుకెక్కదు. అల్లుడు చచ్చిపోయినాడంటే అందువల్ల యెంత లాభం కలిగింది భూవుఁలకి దావా తెచ్చావాఁ లేదా? నేను యీ మధ్య దాఖల్చేయించిన పిటీషనుమీద ఆర్డరు చదివిపెట్టండి (గదిలోకి వెళ్లి కాకితం తెచ్చి గిరీశం చేతికి యిచ్చును)

**గిరీశం**: (చూసి) ఎవడో తెలివితక్కువ గుమస్తా వ్రాసినట్టుంది. అక్షర పొలితే లేదండి.

**అగ్ని** : మా వకీలు గడగడ చదివేశాడండి.

**గిరీశం**: నేను మాత్రం చదవలేకనా, అంతకన్న గళగ్రాహిగా చదువుతాను. లెక్చర్లిచ్చే పండితుణ్ణి నాకిది పేలపిండీ కాదు; అయితె రాసినవాడి తెలివికి సంతోషిస్తున్నాను. యిది అరిటిపండు విప్పినట్టు తర్జుమా చేసి దాఖలు చెయ్యమని శలవా?

**అగ్ని** : అంతకంటేనా! (తనలో) డబ్బు ఖర్చు లేకుండా వీడి చాత కాగితమ్ముక్కలన్నీ తర్జుమా చేయించేస్తాను.

**గిరీ** : ఇంకా యింగ్లీషు కాయితాలు యేవుంన్నా నా మీద పారెయ్యండి. తర్జుమా చేసి పెడతాను.

**అగ్ని** : అష్లాగే.

**వెంకమ్మ** : మా అబ్బాయీ మీరు ఒక్క పర్యాయం యింగిలీషు మాట్లాడండి బాబూ.

**గిరీశం**: ఆలాగేనమ్మా.

My dear Venkatesam-

Twinkle! Twinkle ! little star,

How I wonder what you are !

**వెంకటేశం** : There is a white man in the tent.

**గిరీశం** : The boy stood on the burning deck

Whence all but he had fled.

**వెంకటేశం** : Upon the same base and on the same side of it the sides of a trepezium are equal to one another.

**గిరీశం**: Of man's first disobedience and the fruit of that mango tree, sing, Venkatesa, my very good boy.

**వెంకటేశం** : Nouns ending in *f* or *fe* change their *f* or *fe* into *ves.*

**అగ్ని** : యీ ఆడుతూన్న మాటలికి అర్థంయేవింషండి?

**గిరీశం**: యీ శలవుల్లో యే ప్రకారం చదవాలో అదంతా మాట్లాడుతున్నావంండి.

**కరట** : అబ్బీ వొక తెనుగు పద్యం చదవరా?

**వెంకటేశం** : పొగచుట్టకు సతిమోవికి –

**కరటక**: చబాష్ !

**గిరీశం**: డామిట్! డొంట్రీడ్ దట్, (మెల్లగా) "నలదమయంతులిద్దరు" చదువ్.

**వెంకటేశం** : నలదమయంతులిద్దరు మనః ప్రభవానల దహ్యమానులై సలిపిరి దీర్ఘవాసర నిశల్

**కరట** : అట్టే అట్టే, మనః ప్రభవానలవంండే యేవింట్రా?

**వెంకటేశం** : (యింటి కప్పు వేపు చూసి వూరుకుండును.)

**గిరీశం** : పసి పిల్లలకి అలాంటి కఠినవైంన పద్యానికి అర్థం తెలుస్తుందా అండి?

**అగ్ని** : పద్యాలికి అర్థం చెప్పరూ?

**గిరీశం**: యిప్పటి మట్టుకు వేదంలాగే భట్టీయం వేయిస్తారు. తెల్లవాళ్ల స్కూళ్లలో తెలుగు పద్యాల మీద ఖాతరీ లేదండి. యంతసేపూ జాగర్ఫీ, గీగర్ఫీ, అర్థమెటిక్, ఆల్జిబ్రా, మాథమాటిక్స్ యివన్ని హడలేసి చెప్తారండి.

**కరటక**: (తనలో) తర్ఫీదు మాచక్కగా వుంది. వీణ్ణి పెందరాళె తోవపెట్టకపోతే మోసం వొఁస్తుంది.

**అగ్ని** : అన్నోటి చెప్తారండీ?

**గిరీశం** : మరేవఁనుకున్నారు? మీకుట్టువాళ్లాగ చదువుకునే వాడికి ఒక నిమిషవైఁనా తెరిపుండదు.

**అగ్ని** : అదుగో చదువంటే అహ్లాగే చదువుకోవాలి. గొట్టి కాయలాడకుండా మావాణ్ణి ఖాయిదా చేస్తే యంత చదువైనా వొస్తుంది.

**గిరీశం**: నా దగ్గిర గొట్టికాయలు గిట్టికాయలు పనికి రావండి. పుస్తకం చాతపడితే వేళ్లకి పుస్తకం అంటుకు పోవాలి, అలా చదివిస్తానండి.

**అగ్ని** : అలాగే చేస్తే మా వాడికి చదువొచ్చి అన్ని పరిక్షలూ పాసవుతాడండి. మా వాడికి డబ్బు ఖర్చు లేకుండా పెళ్లయె సాధనం కూడా తటస్థించిందండి.

**వెంకమ్మ** : మీ నైజం కొద్దీ ఛీట్లూ కొట్లూ మంఛారు గాని మీకు మాత్రం అబ్బి మీద ప్రేవఁ లేదా యేవిఁషి? పట్నంలో గొట్టాలమ్మొచ్చినప్పుడు యంతో బెంగబెట్టుకుని అబ్బిని శలవర్జీ రాసి వెళ్లిపోయిరమ్మన్నారు కారా? చదువూ చెప్పించక పెళ్లీ చెయ్యక తీరుతుందా యేమిషి?

**కరట** : డబ్బు ఖర్చు లేకుండా కొడుక్కి పెళ్లి చేస్తావుటోయి బావా? ఆడపిల్లల్ని అమ్మినట్టే అనుకున్నావా యేవిఁటి? పదిహేను వొందలైనా పోస్తేనే గాని అబ్బికి పిల్లనివ్వరు.

**అగ్ని** : డబ్బు ఖర్చు లేకుండా వెంకడికి యలా పెళ్ళి చేస్తానో నువ్వే చూతువు గాని. రామచంద్రపురం అగ్రహారంలో లుబ్ధావదాన్లు గార్ని యెరుగుదువా?

**కరట** : యరగను.

**అగ్ని** : ఆయ్న లక్షాధికారి. పద్దెనిమిది వందలకి సుబ్బిని అడగొచ్చారు. ఉభయ ఖర్చులూ పెడతారష, పెళ్ళి మావైభవంగా చేస్తారష, మనం పిల్లని తీసికెళ్లి వాళ్లింటే పెళ్లి చెయ్యడం, మనకి తట్టుబడి అట్టే వుండదు. ఆ పద్దెనిమిది వొందలూ పెట్టి వెంకడికి పెళ్లి చేస్తాను.

**వెంకమ్మ** : పెళ్లి కొడుక్కెన్నేళ్లు?

**అగ్ని** : యెన్నేళ్లైతేనేవిఁ? నలభైయ్యయిదు.

**గిరీశం**: లుబ్ధావధాన్లు మాపెత్తల్లి కొడుకండి, తమతో సమ్మంధవఁంటే నాకు సంతోషవేఁ గానండి. ఆయనకి అరవయ్యేళ్లు దాటాయండి, యీడేవఁయినా సెల్లింగ్ గర్ల్స్ అనగా కన్యాశుల్కం, డామిట్! యంత మాత్రమూ కూడదండి, నేను పూనాలో వున్నప్పుడు అందు విషయమై ఒహనాడు నాలుగ్గంటలు ఒక్కబిగిని లెక్చరిచ్చానండి. సావకాశంగా కూర్చుంటే కన్యాశుల్కం కూడని పనేని తమ చేతనే వొప్పిస్తాను.

**కరట** : బావా యీ సమ్మంధం చేస్తే నీ కొంపకి అగ్గెట్టేస్తాను.

**అగ్ని** : వీళ్లమ్మా శిఖాతరగ, ప్రతీ గాడిద కొడుకూ తిండిపోతుల్లాగ నా యింట జేరి నన్నేవాళ్లే, తాంబోలం యిచ్చేశాను, యిహ తన్నుకు చావండి.

**వెంకమ్మ** : నాతో చప్పకుండానే?

**అగ్ని** : ఆడముండల్తోనా ఆలోచన? యీ సమ్మంధం చైకపోతే నేను బారికరావుఁణ్ణే! (లేచి వెళ్లును.)

**కరట** : యెం మార్దవం

**వెంక** : అన్నయ్యా! యీ సమ్మంధం చేస్తే నేన్నుయ్యో గొయ్యో చూసుకుంటాను. పెద్దదాన్ని రొమ్ముమీద కుంపట్లాగ భరిస్తూనే వున్నాం. ఆయనికి యంత యీడొచ్చినా కష్టం సుఖం వొళ్లు నాటక యీ దౌర్భాగ్యపు సమ్మంధం కల్పించుకొచ్చారు. నే బతికి బాగుం డాలంటే యీ సమ్మంధం తప్పించు.

**కరట** : గట్టి అసాధ్యం తెచ్చిపెట్టావే, వొట్టి మూర్ఖప గాడిద కొడుకు. యెదురు చెప్పిన కొద్దీ మరింత కొట్టెక్కుతాడు, యేంచేయగల్గుదునని నీకు భరువసా చెప్పను? యేమీ పాలుపోకుండా వుంది.

**గిరీశం** : అమ్మా – మీరు యెందుకలా విచారిస్తారు? అవుఁధాన్లుగారు సావకాశంగా వున్నప్పుడు ఒక్క గంట కూర్చుంటే డబ్బుచ్చుకు ముసలివాళ్లకి పెళ్లిచెయ్యడం దౌర్జన్యవఁని లెక్చరిచ్చి మనసు మళ్లిస్తాను.

**వెంకమ్మ** : బాబూ, అతడు మీ మేనత్త కొడుకైతే మీ కాళ్లు పట్టుకుంటాను, మీరు వెళ్లి ఆయ్న మనస్సు మళ్లిస్తురూ. నా చర్మం చెప్పులు కుట్టియిస్తాను.

**గిరీశం**: అమ్మా యేం చెప్పను! వాడో త్వాష్టం. పిల్ల దొరకడవేఁ చాలువాడికి. యీ సమ్మంధం వొదులుకుంటే వాడికి పెళ్లే కాదు. వాడని వాడొదిలే ఘటం కాదు.

**కరట** : అమ్మీ, నేనో ఉపాయం చెబుతాను యిలారా. (కరటకశాస్త్రి, శిష్యుడు, వెంకమ్మ నిష్క్రమింతురు.)

**గిరీశం**: మైడియర్ షేక్స్పియర్! నీ తండ్రి అగ్గి రావుఁడోయి. మీ యింట్లో యవళ్ళకీ అతణ్ణి లొంగదీశే యలోక్వెన్సు లేదు. నా దెబ్బ చూడు. యీవాళేం జేస్తానో. వీరేశలింగం పంతులుగారు కన్యాశుల్కం విషయమై రాసిన ఉపన్యాసం పైకి తీయ్. మావఁగారికి లెక్చరివ్వడాని కృత్తీ కఠారీ నూరాలి.

**వెంకటేశం** : మీ లెక్చరు మాట అలా వుణ్ణీండి గాని యీవాళ నా గండం గడిచింది గదా అని సంతోషిస్తున్నాను. మీర్లాకపోతే పరిక్ష ఫేలయినందుకు మా నాన్న పెయ్యకట్టు తాడుతో చమ్డాలెక్కగొట్టును.

**గిరీశం**: యిలాంటి ప్రమాదాల్తప్పించుకోవడవేఁ ప్రజ్ఞ. యేమైనా డిఫికల్టీ వొచ్చినప్పుడు ఒక రస్సా వేశావంటే అది బ్రహ్మభేద్యంగా వుండాలి. పోలిటిషనంటే మరేవిఁటను కున్నావ్? పూజా నమస్కారాల్లేక బూజెక్కున్నాను గాని మన కంట్రీయే ఇండిపెండెంట్ అయితే గ్లాడ్స్టన్ లాగ దివాన్గిరీ చలాయిస్తును. యేమివాయ్! మీ తండ్రి వైఖరి చూస్తే పుస్తకాలకి సొమ్మిచ్చేటట్టు కనబడదు. చుట్టలు పట్నం నించి అరకట్టే తెచ్చాంగదా, యేమి సాధనం?

**వెంక** : నాన్నివ్వకపోతే అమ్మనడిగి డబ్బు తెస్తాను.

**గిరీశం**: నీ బుద్ధియలా వికసిస్తూందో చూశావా? యిలా తర్ఫీదవుతుంటే నువ్వు కూడా పెద్ద పోలిటిషనువవుతావు.

(బుచ్చమ్మ ప్రవేశించును)

**బుచ్చమ్మ** : తమ్ముడూ అమ్మ కాళ్ళు కడుక్కోమంచూందిరా.

**గిరీశం** : (తనలో) హౌ బ్యూటిఫుల్! క్వైటనెక్స్పెక్టెడ్!

**బుచ్చమ్మ** : అయ్యా మీరు చల్దివణ్ణం తించారా?

**గిరీశం** : నాట్దిస్లైటెస్టబ్జక్షన్, అనగా యంతమాత్రం అభ్యంతర లేదు. వడ్డించండిదుగో వస్తున్నాను. తోవలో యేటి దగ్గర సంధ్యావందనం అదీ చేసుకున్నాను. (బుచ్చమ్మవెళ్లును)

**గిరీశం**: వాట్, యీమె నీ సిస్టరా? తలచెడ్డట్టు కనబడుతున్నదే?

**వెంక** : మా అక్కే, జుత్తుకి చవుర్రాసుకోదు.

**గిరీశం**: తలచెడ్డం అంటే, విడో అన్నమాట. చవుఁరు గివుఁరూ జాంతే నయ్, గాని యిన్నాళ్లాయి నీకు విడో మేరేజి విషయమై లెక్చర్లిస్తూ వుంటే యీ కథ యెప్పుడూ చెప్పావు కావు? మీ యింట్లోనే ఓ అన్ఫార్చునేట్ బ్యూటిఫుల్ యంగ్ విడో వుందటోయ్! యేమి దురవస్థ! మై హార్ట్ మెల్ట్స్. నేనే తండ్రినైతే యీ పిల్లకి విడో మేరియేజ్జేసి శాశ్వితమైన కీర్తి సంపాదిస్తును. (తనలో) యేమి చక్కదనం, యీ సొంపు యక్కడా చూళ్లేదే!

పల్లిటూరు వూసు పోదనుకున్నాను గాని పెద్ద కొంపేనుకి అవకాశం యిక్కడ కూడా దొరకడం నా అదృష్టం.

**వెంక** : మా నాన్న నాక్కూడా పెళ్ళి చాస్తాడు.

**గిరీశం**: యీవాళో పెద్దపెళ్ళి నీకు తలవెంట్రుకంత వాసి తప్పిపోయింది. యీ శలవులాఖర్లోగా తాళాధ్యాయం కాకుండా తప్పించుకుంటే నువ్ పూరా ప్రయోజకుడివే. యిహ నిజ మైఁన పెళ్లా? యింత చదువూ చదువుకుని నీ తండ్రి కుదిర్చిన యేవీఁ యరగని చిన్న పిల్లకా పుస్తె కడతావ్? మాంచి యెట్టిగా బుట్టిగా వున్న యంగ్విడోని నువ్ పెళ్లాడకపోతే ఐషుడ్బి యషేమ్డాఫ్యూ!

## ౨వ స్థలము. దేవాలయం

**(పువ్వులతోటలో మండపం మీద కూచుని, శిష్యుడు ప్రవేశించును)**

**శిష్యుడు**: ఆర్నెల్లకోమాటు పొస్తకం పట్టుకుంటే కొత్త శ్లోకాలు, పాతశ్లోకాలు ఒక్కలాగ్కన పడతాయి. యిప్పుడు కొత్తశ్లోకం కనుక్కొమ్మంటే నా శక్యవాఁ? సిద్ధాంతి నెవణ్ణయినా ప్రశ్నడిగి కనుక్కోవాలి. లేకుంటే చటుక్కున పుస్తకం విప్పి యే శ్లోకం కనపడితే ఆ శ్లోకం చదువుతాను.

"మృగాః ప్రియాళుద్రు మమంజరీణాం"

యిదేదో చదివిన జ్ఞాపకం లీలగా వుంది. లేళ్లు పరిగెత్తాయని కాదూ? యేం గొప్ప మాట చెప్పాడోయి కవి! లేళ్లు పరిగెత్తితే యవడిక్కావాలి, పరిగెత్తకపోతే యవడిక్కావాలి? కుక్కలు పరిగెత్తుతున్నాయ్ కావా, నక్కలు పరిగెత్తుతున్నాయ్ కావా? పిల్లులు పరిగెత్తుతున్నాయి కావా? పనికొచ్చే ముక్క ఒక్కటీ యీ పుస్తకంలో లేదు. నాలుగంకెలు బేరీజు వేయడం, వొడ్డీ వాశీ కట్టడం కాళిదాసుకేం తెలుసును? తెల్లవాడిదా మహిమ! యెపట్నం యెక్కడుందో, యెకొండ లెక్కడున్నాయో అడగవయ్యా గిరీశం గార్ని; నిలుచున్న పాట్ను చెబుతాడు.

"ప్రియాముఖం కింపురుషశ్చుచుంబ"

ముద్దెట్టు కున్నాడటోయి ముండా కొడుకు. ముక్కట్టు కున్నాడు కాదూ?

**(కరటకశాస్త్రి శిష్యుడికి కనపడకుండా వెనుక నుంచి ప్రవేశించును.)**

"వర్ణ ప్రకర్షే సతి కర్ణికారం ।
ధునోతి నిర్గంధ తయాస్మచేతః ॥

యిది కూడా చదివినట్టే వుందోయి, ఆ పువ్వేదో కవికిష్టం లేదట. యిష్టం లేక పోతె ములిగిపోయింది కాబోలు? మా గురువు గారికి దొండకాయ కూరయిష్టం లేదు, గురువుగారి పెళ్లాం పెరట్లో దొండపాదుందని రోజూ ఆ కూరె వొండుతుంది. బతికున్న వాళ్ల యిష్టవెఁ యిలా యేడుస్తూంటే, చచ్చినవాడి యిష్టాయిష్టాల్తో యేం పని? యీ చదువిక్కడితో చాలించి గిరీశం గారి దగ్గర నాలుగింగిలీషు ముక్కలు నేర్చుకుంటాను. వెంకడికి యింగిలీషొచ్చునని యేం గఱ్ఱాగా వుంది?

**కరట** : యెవిఁట్రా అబ్బీ అంటున్నావు?

**శిష్యు** : యెదో నా స్వంత ఘోష.

**కరట** : గురువుని గదా, అదేదో నాకూ కొంచం చెబుదూ.

**శిష్యు** : చప్పడానికేంవుఁందండి! నాటకంలో నా చాత వేషం కట్టించి పెద్ద చాంతాళ్లలాంటి హిందూస్తానీ ముక్కలూ, సంస్కృతం ముక్కలూ అర్థం తెలియకుండా భట్టీయం వేయించడానికి మీకు ఓపికుంది గాని నాకు నాల్రోజులికోశ్లోకం చెప్పడానికి శ్రద్ధ లేదు గదా? పట్నం వొదిలి ఆర్నెల్లకోమాటు అగ్రహారాలంట వొచ్చినప్పుడు మరేం వూసుపోక "పుస్తకం తియ్యంటె" సంస్కృతం యేంవఁచ్చేని?

**కరట** : యిటు పైన్నుంచుడు యలా చెబుతానూ, రోజుకి నాలుగే శ్లోకాలు చెబుతాను. కొత్త శ్లోకం చదువు.

**శిష్యు** :

అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా ।
హిమాలయో నామ నగాధిరాజః॥

**కరట** : మొదటికొచ్చావేం ?

**శిష్యు** : మొదలూ కొసా వొక్కలాగే కనపడుతూంది

**కరట** : (నవ్వి) పోనియ్, మొదణ్ణించే చదువుదాం.

**శిష్యు** : చదివినా యేం లాభవుఁంది. యీ శ్లోకం శుద్ధ అబద్ధంట.

**కరట** : యవరు చెప్పారు?

**శిష్యు** : గిరీశం గారు.

**కరట** : యెం చెప్పాడు?

**శిష్యు** : హిమాలయం రెండు సముద్రాలకీ దాసి, రూళ్ల గఱ్ఱలాగ లేదట. మేపులో చూపించాడు.

**కరట** : హిమాలయం శిగగోశిరి గాని, ఆ పుస్తకం మణిచి నా మాట విను.

**శిష్యు** : చిత్తం (పుస్తకం మూయును.)

**కరట** : చదువన్నదెందుకు పొట్ట పోషించుకోడానిగ్గదా ?

**శిష్యుడు** : అవును.

**కరట** : యీ రోజుల్లో నీ సంస్కృత చదువెవడికి క్కావాలి?

**శిష్యు** : దరిద్రులిక్కావాలి.

**కరట** : బాగా చెప్పావు. నీకు యింగ్లీషు చదువుకోవాల్నుందో?

**శిష్యు** : చెప్పించే దాతేడీ?

**కరట** : నేను చెప్పిస్తాన్రా.

**శిష్యు** : నిజంగాను?

**కరట** : నిజంగాన్రా, గాని ఒక షరతుంది.

**శిష్యు** : యెవిఁటండి?

**కరట** : నాకో కష్టసాధ్యమైన రాచకార్యం తటస్థించింది. అది నిర్వహించి నువ్ చేసుకురావాలి.

**శిష్యు** : నా వల్లయే రాచకార్యాలు కూడా వున్నాయా?

**కరట** : యీ రాచకార్యం నీ వల్లే కావాలి. మరెవడి వల్లా కాదు. అదేవిఁటంటె, ఓ పది రోజులు నువ్వు ఆడపిల్లవై పోవాలి.

**శిష్యు** : గణియం పట్ణంలో వుండి పోయిందే?

**కరట** : అట్టే గణియం అవసరం లేదు. నీకు తలదువ్వి, కోకకడితే పజ్యండేళ్ళ కన్నెపిల్లలా వుంటావు. నిన్ను తీసుకెళ్లి లుబ్ధావధాన్లికి పెళ్లి చేస్తాను. నాలుగు పూటలు వాళ్లింట నిపుణతగా మెసిలి, వేషం విప్పేశి పారిపోయిరా. నిజమైన పెళ్లి ముహర్తం చాలా వ్యవధుంది.

**శిష్యు** : యిదెంతపని.

**కరట** : అలా అనుకోకు, అతి చేస్తి వట్టాయనా, అనుమానపడతారు. పట్టుబడ్డావంటే పీక తెగిపోతుంది.

**శిష్యు** : మీకా భయం వొద్దు.

**కరట** : నువ్వు నెగ్గుకొస్తే, మా పిల్లన్నీకిచ్చి యిల్లరికం వుంచుకుంటాను.

**శిష్యు** : అలా ప్రమాణం చెయ్యండి.

**కరట** : యిదుగో యీ పుస్తకం పట్టుకు ప్రమాణం చేస్తున్నాను.

**శిష్యు** : యీ పుస్తకం మీద నాకు నమ్మకం పోయింది. మరో గట్టి ప్రమాణం చెయ్యండి. గిరీశంగారిని అడిగి ఒక యింగిలీషు పుస్తకం పట్టుకురానా?

**కరట** : తప్పితే భూమితోద్రా.

**శిష్యు** : మీరు యగేస్తే భూవేఁం జేస్తుంది? మీ మాటే చాలును కానీండి.

## ౩వ స్థలము : అగ్నిహోత్రావధాన్లు యింటి యదటి వీధి

## (గిరీశం, వెంకటేశం ప్రవేశింతురు.)

**వెంక** : రాత్రి కన్యాశుల్కం మీద లెక్చరిచ్చారా?

**గిరీశం**: లెక్చరేవిఁటోయ్, ధణుతెగిరిపోయింది. మీ తండ్రిది మైరావణ చరిత్రోయ్. మీ అంకుల్ కరటక శాస్త్రి స్కౌండ్రల్లా క్కనపడుతున్నాడు.

**వెంక** : యేం జరిగిందేం జరిగిందేవిఁటి ?

**గిరీశం**: విను. రాత్రి భోజనాల వేళ లెక్చరు ఆరంభించమని రోజల్లా బురిడీలు పెట్టాడోయి మీ మావఁ. సబ్జక్టు నేను కొంచెం యెత్తగానే తను కూడా గట్టిగా సపోర్టు చేస్తానని ప్రోమిస్ కూడా చేశాడు. నీ తండ్రి వైఖరీ చూస్తే మాత్రం కొంచం ధైర్యం వెనకాడి నాలిక్కొసకొచ్చిన మాట మళ్లీ మణిగి పోతూండేది. పెరుగూ అన్నం కలుపుకునే వేళకి యిక టైమ్మించి పోతూందని తెగించి లెక్చరు ఆరంభించాను. ఇంట్రడక్షన్ రెండు సెంటెన్సులు యింకా చెప్పనే లేదు నాలుగు యింగ్లీషు మాటలు దొల్లాయోయ్. దాంతో నీ తండ్రి కళ్లెఱ్ఱ జేశి "యీ వెధవ యింగ్లీషు చదువునించి బ్రాహ్మణ్యం చెడి పోతూంది; దేవభాషలాగ భోజనాల దగ్గిర కూడా ఆ మాటలే కూస్తారు; సంధ్యావందనం శ్రీసూక్త పురుష సూక్తాలూ తగలబడిపోయినాయి సరే గదా?" అని గట్టిగా కేక వేసి చెప్పేసరికి నేను కొంచం పస్తాయించి "థ్రోయింగ్ పెర్లు బిఫోర్ స్వైన్" అనుకొని కరటకశాస్తుల్లు వేపు చూసే సరికి యెంచేస్తూన్నాడనుకున్నావ్? రాస్కెల్ వులకలేదు, పలక లేదు, సరేకదా మొహం పక్కకి తిప్పి కడుప్పగిలేటట్టు నవ్వుతున్నాడు. యిక లెక్చరు వెళ్లింది కాదు సరే కదా, నోట్లోకి ముద్ద కూడా వెళ్లింది కాదు. ఛీ యింత యిన్సల్టు జరిగింతరవాత తక్షణం బయలుదేరి వెళ్లిపోదావఁనుకున్నాను.

**వెంక** : అయ్యో వెళ్ళిపోతారా యేవిఁటి?

**గిరీశం**: నాటింది లీష్టు. కొసాకీ విను, నీ తండ్రిని పోకెట్లో వేశాను.

**వెంక** : నా తండ్రికి లెక్చరిచ్చి పెళ్ళి తప్పిస్తానన్నారే?

**గిరీశం**: పెళ్ళి ఆపడానికి బ్రహ్మశక్యం కాదు. డిమాస్థనీసు, సురేంద్రనాథ్ బెనర్జి వచ్చి చెప్పినా నీ తండ్రి యీ పెళ్లి మానడు. లెక్చర్లు యంతసేపూ సిటీల్లోనే గాని పల్లిటూళ్లలో యంతమాత్రం పనికిరావు. పూనాలాంటి సిటీలో లెక్చర్ యిచ్చానంటే టెంథౌజెండు పీపిల్ విండానికి వొస్తారు. మన టౌన్లోనే, పెద్ద మీటింగులు చెయ్యాలంటే, డప్పులు బజాయించి, నోటీసులు కట్టి, బజార్లు కాసి, తోవంట పోయేవాళ్లని యీడ్చుకు వొచ్చినా, యాభైమంది కారు. పల్లెటూరి పీపిల్ లెక్చర్లకి అన్‌ఫిట్. మొన్న మనం వొచ్చిన బండీవాడికి నాషనల్ కాంగ్రెస్ విషయమై రెండు ఘంటలు లెక్చర్ యిచ్చేసరికి ఆ గాడిద కొడుకు, వాళ్లవూరు హెడ్ కానిష్టేబిల్ని కాంగ్రెస్ వారు యెప్పుడు బదిలీ చేస్తారని అడిగాడు! విలేజస్‌లో లెక్చర్లు యంతమాత్రం కార్యం లేదు. నీ తండ్రి దగ్గిర మాత్రం లెక్చరన్న మాట కూడా అనకూడదు.

**వెంక** : అయితే, నాన్నని యలాగ జేబులో వేశారేవిఁటి?

**గిరీశం**: అది పోలిటిక్సు దెబ్బోయ్! ఆ తరవాత కథ విను. నా మీద కొకలేసిన తరవాత కోపఁ వణక్క, ధుమధుమ లాడుకుంటూ, పెరుగూ అన్నం కుమ్మడం ఆరంభించాడు. ఇంతలో మీ అప్పవొచ్చి గుమ్మం దగ్గిర నిలబడి కోకిల కంఠంతో "నాన్నా తమ్ముడికి పెళ్ళి చెయ్యాలంటే నా సొమ్ము పెట్టి పెళ్లి చెయ్యండి గాని దాని కొంపముంచి లుబ్ధావుఁధాన్లుఁకి ఇవ్వొద్దని" చెప్పింది. దాంతో నీ తండ్రికి వెఱ్ఱికోపం వొచ్చి వుత్తరాపోసనం పట్టకుండానే ఆ పెరుగూ అన్నంతో విస్తరి తీసికెళ్ళి దాన్నెత్తిని రుద్దేశాడు! కరటకశాస్తుల్లు అడ్డుపడబోతే చెంబుతో నీళ్లు వాడి నెత్తిందిమ్మరించాడు. కరటక శాస్తుల్లుకి కోపం వొచ్చి శిష్యుణ్ణి తీసుకు వాళ్ల వూరెల్లి పోయినాడు.

**వెంక** : దీని పేరేనా యేవిఁటి మా నాన్నం జేబులో వేసుకోవడం?

**గిరీశం**: పేషన్స్! కొసాకీ విను. స్కౌండ్రల్ కరటక శాస్తుల్లు వెళ్లిపోయినాడని సంతోషించాను గాని, నీ సిస్టర్ ఫేట్ విషయమై మహా విచారమైంది. నేనే దాని హజ్బెండ్నై వుంటే, నిలబడ్డపాటున నీ తండ్రిని రివాల్వర్తో షూట్ చేశివుందును. మీ అమ్మ యేడుస్తూ ఒక మూల కూచుంది. అప్పుణ్ణే వెళ్లి నీళ్లపొయిలో నిప్పేసి, నీళ్లు తోడి, నీ సిస్టర్ని స్తానం చెయమన్నాను. సిగర్సు కాల్చుకుందావఁని అరుగుమీద నేను బిచాణా వేసేసరికి, నీ తండ్రికి పశ్చాత్తాపం వొచ్చి, తానూ ఆ అరుగు మీదే బిచాణా వేసి, ఒక్క సిగరయినా కాల్చనియ్యకుండా రాత్రల్లా కబుర్లలో పెట్టి చంపాడొయ్. మొత్తానికి కత్తు కలిపేశాను.

**వెంక** : యాలాక్కలిపారేవిఁటి?

గిరీశం: ఒక పొలిటికల్ మహాస్త్రం ప్రయోగించి కలిపేశాను.

వెంక : యేవిఁటండా అస్త్రం?

గిరీశం: ఒకడు చెప్పిందల్లా మహా బాగుందందవేఁ. సమ్మోహనాస్త్రవఁంటే అదే కదా?

వెంక : లెక్చరిచ్చి మా తండ్రిని వొప్పించడానికి బదులుగా ఆయన చెప్పిందానికి మీరే వొప్పుకున్నారూ?

వెంక : కుంచం నిలువుగా కొలవడానికి వీల్లేనప్పుడు, తిరిగేశైనా కొలిస్తే నాలుగ్గింజలు నిలుస్తాయి. బాగా ఆలోచిస్తే యిన్ఫెంటు మేరియేజి కూడుననే తోస్తూంది.

వెంక : యిన్నాళ్లూ కూడదని చెప్పేవారే నా తోటి?

గిరీశం: ఒపినియన్సు అప్పుడప్పుడు ఛేంజి చేస్తూంటేనే గాని పొలిటిషను కానేరడు. నాకు తోచిన కొత్త ఆర్గ్యుమెంటు విన్నావా? యిన్ఫెంటు మారేజీలు అయితేనే గాని, యంగ్ విడోజ్ వుండరు. యంగ్ విడోజ్ వుంటేనే గాని, విడో మారియేజ్ రిఫారమ్‌కి అవకాశం వుండదు గదా? సివిలిజేషన్కల్లా నిగ్గు విడో మారియేజ్ అయినప్పుడు, యిన్ఫెంట్ మారేజీల్లేకపోతే, సివిలిజేషన్ హాల్టవుతుంది! మరి ముందు అడుగు పెట్టలేదు. గనక తప్పకుండా యిన్ఫెంటు మారేజి చేయ్యవలసిందే. యిది వొహ కొత్త డిస్కవరీ; నంబర్ టూ, చిన్న పిల్లల్ని ముసలాళ్లకిచ్చి పెళ్లి చెయ్యడం కూడా మంచిదే అని నేను వాదిస్తాను.

వెంక : సుబ్బిని లుబ్ధావుధాన్లికి యివ్వటం మంచిదంటారా యేవిఁటి? అమ్మ ఆ సమ్మంధం చేస్తే నూతులో పడతానంటూందే?

గిరీశం : ఫెమినైన్స్ ఫూల్సన్నాడు. "పడుపడు అన్న నా సవితే గాని పడ్డనాసవితి లేదంది" టెవర్తోను. నూతులో పడడం గీతులో పడడం నాన్సన్స్. ఓ రెండుతులాల సరుకోటి మీ నాన్న చేయించి యిచ్చాడంటే మీ అమ్మ ఆ మాట మానేస్తుంది. గాని నా ఆర్గ్యుమెంటు విను.

వెంక : యేవిఁటండి.

గిరీశం: పెళ్ళనే వస్తువ శుభవాఁ అశుభవాఁ? మంచిదా చెడ్డదా? చెప్పు.

వెంక : మంచిదే.

గిరీశం: వెరిగుడ్! పెళ్లనేది మంచి పదార్థమైతే "అధికస్య అధికం ఫలం" అన్నాడు గనక చిన్నపిల్లని ఒక ముసలాడికి పెళ్లి చేసి, వాడు చస్తే మరోడికి, మరోడు చస్తే మరోడికి, యిలాగ పెళ్లి మీద పెళ్లి, పెళ్లి మీద పెళ్లి అయి, వీడి దగ్గిరో వెయ్యి, వాడి దగ్గిరో వెయ్యి,

మరోడిదగ్గిర మరో వెయ్యి, రొట్టె మీద నెయ్యి, నేతి మీద రొట్టె లాగ యేకోత్ర వృద్ధిగా కన్యాశుల్కం లాగి, తుదకి నాలాంటి బుద్ధివంతుణ్నిచూసి పెళ్లాడితే చెప్పావ్ మజా? ఇహసౌఖ్యం పూర్తిగా లభిస్తుంది. ఇహసౌఖ్యం వుంటే పరసౌఖ్యం కూడా సాధించావేఁ అన్నమాట. యలాగో తెలిసిందా? ఈజ్‌మెంటు హక్కు యష్టాబ్లిష్ అవుతుంది.

**వెంక** : కన్యాశుల్కం కూడా మంచిదంటున్నా రేవిఁటి?

**గిరీశం**: మరేవిఁటనుకున్నావ్? నెవ్వర్డ్ బైహోవ్వన్నాడు, చేస్తే శుద్ధక్షవరవేఁ గాని తిరపతి మంగలాడి క్షవరం చెయ్యకూడదు. యీ అస్త్రంతోటే మీ తండ్రి వశ్యం అయినాడు. యింగ్లీషువాడు "థింక్" అన్నాడోయి. ఆలోచిస్తే గాని నిజం బోధపడదు. బాగా ఆలో చించగా, కన్యాశుల్కంలేని మారేజే యీ భూప్రపంచంలో లేదు. విన్నావా?

**వెంక** : యెలాగండి?

**గిరీశం**: అలా అడగవోయి, యేం? డబ్బుచ్చుకుంటేనే కన్యాశుల్కవఁయిందేం? యిన్ని తులాలు బంగారం పెట్టాలి, యింత వెండి పెట్టాలి అని రూపాయిలకి బదులుగా వెండి బంగారాలకింద ధనం లాగితే, కన్యాశుల్కం అయింది కాదేం? యీ పెద్ద పెద్ద పంతుళ్ల వారంతా యిలా చేస్తూన్న వారేనా?

**వెంక** : అవును.

**గిరీశం**: యిక దొర్లలోనో? వాళ్ల...తస్సా గొయ్యా, యిల్లు గుల్ల చేస్తారోయి; అవి గుడ్డలు కావు, అవి శెంట్లు కావు, అవి జూయల్సు కావు, మారియేజి సెటిలుమెంటని బోలెడు ఆస్తి కూడా లాగుతారు. యీ ఆర్గ్యుమెంటు నేను చెప్పేసరికి నీ తండ్రి బ్రహ్మానంద భరితుడైనాడు. లుబ్ధావుఁధాన్లు పెళ్లికి అన్నిటికన్న పెద్ద సవబొకటి నీకు చెబ్తాను విను.

**వెంక** : యెవిఁటండి.

**గిరీశం** : లుబ్ధావుఁధాన్లు ముసలాడూ, బంగారప్పిచికానున్ను. రెండేళ్లకో, మూడేళ్లకో అమాంతంగా బాల్చీ తన్నేస్తాడు. అనగా "కిక్స్ ది బకెట్". దాంతో నీ చెల్లెలు రిచ్చి విడో అవుతుంది. నువ్వు పెద్దవాడివైఁన తరవాత దానికి విడో మారియేజి చేశి శాశ్వతవైఁన కీర్తి అతి సులభంగా సంపాదించవచ్చును. యెవఁంటావ్?

**వెంక** : అవును.

**గిరీశం**: మరో గొప్పమాట! యీ సంబంధం అయితే నీకూ నాకూ సంబంధం కలుస్తుందోయి.

**వెంక** : అది నా కిష్టవేఁ.

**గిరీశం**: రాత్రి నీ తండ్రి, నీకు హైకోర్టు వకాల్తీ దాకా చదువు చెప్పిస్తానన్నాడు. ప్రస్తుతోపయోగం పుస్తకాల మాట కదిపాను గాని, పెళ్లినుంచి వచ్చిం తరవాత యిస్తానన్నాడు. యీలోగా చుట్ట ముక్కల్లాకపోతే గుడ్లెక్కొస్తాయి. సిగర్సు కోసం కాపర్సేవఁయినా సంపాదించావా లేదా?

**వెంక** : లేదు, యీ ఉదయవఁల్లా అమ్మ ధుమ ధుమ లాడుతూనే వుంది. మా నాన్న పొడుం కోసం కొట్లో నిలవచేశిన పొగాకులోది వో కట్ట వోణీలో దాచి తీసుకొచ్చాను.

**గిరీశం**: దటీజ్పోలిటిక్స్! మరియింతసేపూ చెప్పావు కావేం? చుట్టల్చుట్టుకుని యీ కోవిల గోపురంలో కూచుని కాల్చుకుందాం రా?

**వెంక** : కోవిల్లో చుట్ట కాల్చవొచ్చునా?

**గిరీశం**: కాలిస్తే కోవిల్లోనే కాల్చాలోయి. దీని పొగ ముందర సాంబ్రాణి, గుగ్గిలం యేమూల? యేదీ కట్ట యిలాతే (కట్ట అందుకొని వాసన చూసి) ఆహా! యేవిఁ పొగాకోయి! నిజంగా కంట్రీ లైఫులో చాలా చమత్కారం వుంది. బెస్ట్ టొబాకో, బెస్టు గేదెపెరుగు, మాంచి ఘీ, అంచేత నేనోయ్ పోయట్సు "కంట్రీ లైఫ్ కంట్రీ లైఫ్" అని దేవులాడుతారు.

**వెంక** : మీరూ పోయట్సే గదా?

**గిరీశం**: అందుకభ్యంతరవేఁవిఁటి? నాకూ కంట్రీ లైఫు యిష్టవేఁ గాని సీవఁలో లాగ బ్యూటిఫుల్ షెపర్డెస్లూ, లవ్ మేకింగూ వుండదోయ్. గ్రాస్‌గర్ల్సు తగు మాత్రంగా వుంటారు గాని, మాడర్టీ స్మెల్! అదొహటిన్నీ మన దేశంలో మెయిడన్సు వుండరోయి. యంతసేపూ లవ్మేకింగ్ విడోజ్కి చెయ్యాలి గాని మరిసాధనాంతరం లేదు.

**వెంక** : మీరు విడో మీద చేశిన పోయిట్రీ రాసి యిస్తానని యిచ్చారు కారు గదా?

**గిరీశం**: అడగ్గానే యిస్తే వస్తువ విలవ తగ్గి పోతుంది. అదొహటిన్నీ, మట్టెండేళ్లు పోతేనే గాని దాని రసం నీకు బాగా బోధపడదు. అయినా స్పెషల్ కేసుగా నీకు ఉపదేశం చాస్తాను. నోటు బుక్కు తీసి రాయి.

(గిరీశం చుట్ట కాలుస్తూ, మధ్య మధ్య చుట్ట చేత పట్టి,
ఒక్కొక్క ముక్క చెప్పగా వెంకటేశం వ్రాసును.)

THE WIDOW

She leaves her bed at A.M. four,
And sweeps the dust from off the floor,
And heaps it all behind the door,
The Widow!

Of wond'rous size she makes the cake,

And takes much pains to boil and bake,
And eats it all without mistake,

The Widow!

Through fasts and feasts she keeps her health,
And pie on pie, she stores by stealth,
Till all the town talk of her wealth,

The Widow!

And now and then she takes a mate,
And lets the hair grow on her pate,
And cares a hang what people prate,

The Widow!

I love the widow - however she be,
Married again - or single free,
Bathing and praying,
Or frisking and playing,
A model of saintliness,
Or model of comeliness,
What were the earth,
But for her birth? The Widow!

యిది నేను రిఫార్మర్లో అచ్చు వేసేటప్పటికి టెన్నిసన్ చూసి గుండె కొట్టుకున్నాడు (చుట్ట తాగడం సమాప్తంచేశి) యింటికి పోదాం రా చాలా సేపైంది.

(నాలుగడుగులు యిద్దరూ నడిచేసరికి అగ్నిహోత్రావుధాన్లు కలియును.)

**అగ్ని** : ఏవండీ హనుమాన్లుగారూ–మీ పేరేవిఁటండీ!

**గిరీశం**: గిరీశం అంటారండి.

**అగ్ని** : అదుగో, గిరీశంగారూ రాత్రి మనవఁనుకున్న ప్రకారం మన దావాలు గెలుస్తాయనే మీ అభిప్రాయవాఁ?

**గిరీశం**: గెలవకపోతే నేను చెవి కదపాయించుకు వెళ్లిపోతాను. మీ వూహాపోహాలు సామాన్యవైఁనవా? అందులో "యతో ధర్మస్తతో జయః" అన్నట్టు న్యాయం మీ పక్షం వుంది.

బుచ్చమ్మగారి కేసు విషయమై జబ్బల్పూర్ హైకోర్టు తీర్పొహటి మనకి మహాబలంగా వుంది. మా పెత్తండ్రిగారు యిలాంటి కేసే ఒహటి యీ మధ్య గెలిచారండి.

**అగ్ని** : దీని కల్లా అసాధ్యం యీ కేసు కాకినాళ్లో తేవలసొచ్చింది. మా కరటక శాస్తుల్లుని పంపిస్తే యవడో చవల వకీల్ని కుదిర్చాడు. వాడెప్పుడూ డబ్బు తెమ్మని రాయడవేఁ కాని కేసు భోగట్టా యేవీఁరాయడు. గడియ గడియ వెళదావఁంటె దూరాభారం గదా?

**గిరీశం**: మీశలవైతే స్టీమరు మీద నేను వెళ్లి ఆ వ్యవహారవఁంతా చక్క బెట్టుకు వస్తాను. మాపెత్తండ్రి గారు కాకినాడ కల్లా తెలివైన ప్లీడరు, ఆయన పట్టిన కేసు యన్నడూ పోయిందన్న మాట లేదండి.

**అగ్ని** : మీరు వెళితే నేను వెళ్లినట్టే. యంత ఫీజయినా మీ పెత్తండ్రి గారికే వకాల్తీ యిద్దాం, యావఁంటారు?

**గిరీశం**: మీ దగ్గిర ఫీజు పుచ్చుకోవడం కూడానాండి? ఖర్చులు మట్టుకు మీరు పెట్టుకుంటే, ఫీజఖ్కర్లేకుండానే పని చేయిస్తానండి.

**అగ్ని** : మీరలా అంటారన్నే నెరుగుదును. గాని గెలిచింతరవాత మనకి తోచిన బహుమతీ యిద్దాం.

**గిరీశం**: యిచ్చినా సరె, యివ్వకపోయినా సరేనండి.

(బుచ్చమ్మ ప్రవేశించును)

**బుచ్చమ్మ** : నాన్నా అమ్మ స్తానానికి లెమ్మంచూంది.

**అగ్ని** : అలాగే. (బుచ్చమ్మ వెళ్లిపోతుండగా గిరీశం కేగంట చూసును)

భోజనం చేశిన తరవాత కాయితాలు మీ చేతికిస్తాను; అవన్నీ సావకాశంగా చూడండి. మా యింటి తూరుప్పారుగు రావాఁవుధాన్లు మీద మందడి గోడ విషయమై మనం తెచ్చిన దావా, లంచం పుచ్చుకుని మునసబు అన్యాయంగా కొట్టేశాడు. జడ్జీ కోర్టులో అప్పీలు చేశాం; మా వకీలు అవతల పార్టీ దగ్గిర కతికి మన కేసు ధంసం చేశాడు. మీ వంటి వారు నాకు చెయ్యాసరా వుంటే రావాఁవుధాన్లు పిలకూడదీసేదును; కానిండి గాని తూర్పు మందడిగోడ రావాఁవుధాన్లిదయితే, పడవఁటి మందడి గోడ మందవాల్నా లేదా? న్యాయం చెప్పండి. చూడండీ దానిమీద యలా కొంజాయెత్తాడో! క్రిమినల్నడి పించమని భుక్త సలహా చెప్పాడు.

(బుచ్చమ్మ ప్రవేశించును)

**బుచ్చ** : నాన్నా! అమ్మ స్తానం చెయ్యమంచూంది.

**అగ్ని** : వెధవముండా సొద! పెద్ద మనుష్యుల్తో వ్యవహారం మాట్లాడుతూంటే రామాయణంలో పిడకల వేట్లాటలాగ అదే పిలవడవాఁ!

**గిరీశం**: తప్పకుండా క్రిమినెల్కేసు తావలిశిందే, క్రిమినల్ప్రొశిజ్యూర్ కోడు 171 శక్షన్ ప్రకారం తెద్దావాఁ? 172 డోశక్షన్ ప్రకారం తెద్దావాఁ?

**అగ్ని** : రెండు శక్షన్లూ తాలేవేం?

**గిరీశం**: నేరంగల ప్రవేశం, ఆక్రమణ రెండు శక్షన్లూ కూడా ఉపచరిస్తాయి. సరే గదా కళ్లతో చూశాను గనక యీ గోడ మీదయినట్టు జల్లీల్తెగ బొడిచి సాక్ష్యం కూడా పలగ్గలను, యీ గోడ స్పష్టంగా మీదాన్లాగే కనపడుతూంది.

**అగ్ని** : అందుకు సందేహం వుఁందండీ, యేమరిచి యిన్నాళ్ళు వూరుకున్నాను. పెరటిగోడ కూడా చూతురుగాన్రండి. అక్కా బత్తుడి ముక్కు నులిపి గెల్చుకున్నాను. కాని యీ దావాల కింద సిరిపురం భూవిఁ అమ్మెయ్యవలసి వొచ్చిందండి, రావాఁవధాన్లు కేసు కూడా గెలిస్తె, ఆ విచారం నాకు లేకపోవును.

(అందరు నిష్క్రమింతురు.)

# కన్యాశుల్కము

## తృతీయాంకము

### ౧వస్థలము. రామచంద్రపురం అగ్రహారంలో రామప్పంతులు యింట్లో సావిట్లో గది

★★★

**(మధురవాణి ప్రవేశించును)**

**మధు** : ఈ రామప్పంతులు కథ పైకి పటారం, లోపల లొటారంలా కనిపిస్తూంది. భూవుఁలన్నీ తాకట్టుపడి వున్నాయిట; మరి రుణం కూడా పుట్టదట. వాళ్లకీ వీళ్లకీ జుట్లు ముడేసి జీవనం జేస్తూన్నాడు. యీ వూరు వేగం సవిరించి చెయ్చిక్కినంత సొమ్ము చిక్కించుకుని పెందరాళే మరో కొమ్మ పట్టుకోవాలి. (పాడును) 'తెలియక మోసపోతినే, తెలియక' (పాడుతుండగా రామప్పంతులు ప్రవేశించును)

**రామ** : యేవిఁటో ఆ మోసపోవడం? తరవాత ముక్కేవిఁటి, పాడూ.

**మధు** : తరవాత ముక్కకేవుఁంది, మిమ్మల్ని నమ్మి మోసపోయినాను.

**రామ** : అదేం అలా అంటున్నావు? నిన్ను మోసపుచ్చ లేదే? నిర్ణయ ప్రకారం రెండొందలూ పట్ణంలో యిచ్చాను. నెలజీతం నెలకు ముందే యిచ్చాను. యిహ మోస వేఁవుఁంది?

**మధు** : యేం చిత్రంగా మాట్లాడతారు పంతులు గారూ, నాకు డబ్బే ప్రధానవైఁనట్టు మీ మనుసుకి పొడగడుతూంది కాబోలు, నాకు డబ్బు గడ్డిపరక. మీ భూవుఁలు రుణాక్రాంతవైఁనాయని అప్పట్లో నాకు తెలిశుంటే మీ దగ్గిర రెండొందలూ పుచ్చు కొందునా? మీరు ఖర్చు వెచ్చాలు తగ్గించుకుని సంసారం బాగు చేసుకోకపోతే నేను మాత్రం వొప్పేదాన్ని కాను. ఫలానా పంతులుగారు ఫలనా సాన్నుంచుకుని బాగు పడ్డారం టేనే నాకు ప్రతిష్ఠ. మా యింటి సాంప్రదాయం ఇది పంతులు గారూ; అంతేకాని లోకంలో సాన్లమచ్చని వూహించకండి.

**రామ** : భూవుఁలు తణఖా అన్నమాట శుద్ధ అబద్ధం, యవరన్నారో గాని; నేను మహరాజులా వున్నాను.

**మధు** : నాకంటికి మహరాజులా కనపడబట్టే యిల్లూ వాకలీ వొదిలి మానం ప్రాణం మీ పాలు చేసి నమ్మి మీ వెంట వొచ్చాను. నన్ను మోసం మాత్రం చెయ్యకండీ; మిమ్మల్ని పాపం చుట్టుకుంటుంది.

**రామ** : నేను మోసం చేసే మనిషినేనా?

**మధు** : ఆలాగయితే లుబ్ధావుధాన్లు గారికి పెళ్లెందుకు కుదిర్చారు? నాకు తెలియదనుకున్నారా యేవిఁటి? ఆ ముసలాడికి పెళ్లెందుకు? మీ కోసవేఁ యీ యెత్తంతాను.

**రామ** : ఆహా! హా! హా! యిదా అనుమానం! కొంచెం గెడ్డం నెరుస్తూంది, నన్ను కూడా ముసలాణ్ణంటావా యేవిఁటి?

**మధు** : చెట్లకి చావ నలుపు, మనిషికి చావ తెలుపూ. అనగా చీకట్లో నక్షత్రాల్లాగ, అక్కడక్కడ తెల్లవెంట్రుక తగిల్తేనే చమక్.

**రామ** : స్వారస్యం మాచమత్కారంగా తీశావ్! యేదీ ముద్దు (రామప్పంతులు మధురవాణిని ముద్దు బెట్టుకో బోవును.)

**మధు** : (చేతులతో అడ్డి ముఖము ఓరజేసుకొని) వేళాపాళా లేదా? లుబ్ధావుధాన్లు పెళ్ళి తప్పించేస్తే గాని నేను ముద్దు బెట్టుకోనివ్వను.

**రామ** : అంతా సిద్ధమైనం తరవాత, నాశక్యమా ఆపడానికి? (బలాత్కారంగా ముద్దు బెట్టుకొనును.)

**మధు** : సత్తువుందనా మోటతనం?

**రామ** : నా సత్తువిప్పుడేం జూశావ్, చిన్నతనంలో ధ్వజస్తంభం దండతో కొడితే గణగణమని గంటలన్నీ ఒక గడియ వాగేవి. నాడు జబ్బు చేసిం దగ్గిర్నుంచీ డీలా అయి పోయినాను.

**మధు** : యిదా డీలా? నా చేయి చూడండీ యలా కందిపోయిందో. అన్నా, మోటతనం!

**రామ** : చేప చిరిగినా చేదరంతని, నీ ప్రాణానికి యిప్పటి సత్తువే ఉడ్డోలం లా కనపడుతూంది.

**మధు** : యీ పెళ్ళి మాన్పించకపోతే నేను మీతో మాట్లాడను.

**రామ** : వెట్టి కుదిరింది, రోకలి తలకి చుట్టమన్నాట్ట! రెండేళ్ళాయి ఆ ముసలి గాడిదెకొడుకు మీద నా లౌక్య ప్రజ్ఞంతా వినియోగపర్చి పెళ్లి సిద్ధం చేసి యిప్పుడెలా తప్పించడం?

**మధు** : యేం లౌక్యం చేశారు?

**రామ** : అలా అడుగు. నా బుద్ధి సత్తువ కూడా నీకు తెలుస్తుంది. లుబ్ధావుధాన్లు పరమలోభి, వాడి గుణం యిలా వుండబోతుందని పోల్చారేమో అన్నట్టు చిన్నతనంలో వాడికి పేరు పెట్టారు. పెళ్లాడితే వొల్లమాల్ని ధనంవొస్తుందని ఆశ పెట్టించాను.

**మధు** : యలా చేశారీ మహా చిత్రం? పెళ్లైతే ధనం ఖర్చౌతుంది గాని, రావడమెలాగ.

**రామ** : లౌక్యమంటే మరేవిటనుకున్నావు? అసాధ్యాలు సాధ్యం, సాధ్యాలు అసాధ్యం చెయ్యడమే కదూ? మన సిద్ధాంతిని దువ్వేటప్పటికి వాడేంజేశాడనుకున్నావు? లుబ్ధావుధాన్లు జాతకం యగాదిగా చూసి, సీఘ్రంలో వివాహయోగం వుందన్నాడు, ఆ వివాహం వల్ల ధనయోగ వుందన్నాడు. దాంతో ముసలాడికి డబ్బొస్తుందన్న ఆశ ముందుకీ, డబ్బు ఖర్చౌతుందన్న భయం వెనక్కీ లాగడం ఆరంభించింది. యింతట్లో పండాగారిక్కడి కొచ్చారు. ఆయన్ని కూడా తయారు చేశాను. లుబ్ధావుధాన్లు అనుమానం తీర్చుకుందావమని ఆయనికి జాతకం చూపించే సరికి పండాగారు యేమన్నారూ? "వివాహ ధనయోగాలు జమిలిగా వున్నాయి, అయితే మీరు పెద్దవాళ్లు, యిప్పుడు మీకు పిల్లనెవరిస్తారు, పెళ్లెలా అవుతుంది? యిలాంటి జరగడానికి వీల్లేని మహాయోగాలు జాతకాల్లో పట్టినప్పుడు, గొప్ప మేలుకు బదులుగా గొప్ప కీడు సంభవిస్తుంది. అనగా మీకు మార్కమో ధననష్టమో సంభవిస్తుంది. గ్రహశాంతి చేసి బ్రాహ్మణ భోజనం బాహుళ్యంగా చెయ్యండి. కొంత్త జబ్బోగిబ్బో చేసి అంతటితో అరిష్టం పోతుంది. మంచి రోజు చూసి సూర్యనమస్కారాలు ఆరంభించండి" అని చెప్పేసరికి అవుధాన్లు గుండె రెండు చక్కలై వివాహ ప్రయత్నం ఆరంభించాడు. యిదీ కథ.

మధు : యేమి కల్పన!

రామ : యింకా వుంది; యిహను కృష్ణా రాయపురంలో అగ్నిహోత్రావుధాన్లు కూతురు జాతక మెలావుందట? చప్పడానికి అలవి లేదు. అది కాలు పెట్టిన యిల్లు పది యిళ్లౌతుందట. అది పట్టిందల్లా బంగారవౌతుందట!

మధు : నిజమేనా లేక అదీ మీ బనాయింపేనా?

రామ : అది మట్టుకు నా బనాయింపు కాదు, అగ్నిహోత్రావుధాన్లే జాతకం అలా బనాయించాడు. మా బ్రాహ్మల్లో యిది పరిపాటే, పెళ్లిళ్లలో పంపించేది ఒహ జాతకవూ నిజం వుండదు.

మధు : యేమ్మోసం!

రామ : లౌక్యం, లౌక్యమను.

మధు : రెండింటికీ యేవిటో భేదం.

రామ : నమ్మించోట చేస్తే మోసం, నమ్మంచోట చేస్తే లౌక్యవూను.

మధు : తాను చేస్తే లౌక్యం, మరోడు చేస్తే మోసం అనరాదా? అబద్ధానికి అర్థమేవిటి?

రామ : యేమన్నావూ? అబద్ధమనా? ఉద్యోగధర్మం లౌక్యవృత్తీ అని, అదివక వృత్తి భగవంతుడు కల్పించాడు. ఆ లౌక్య వృత్తి యెటువంటిదీ? నిజాన్ని పోలిన అబద్ధమాడి ద్రవ్యాకర్షణ చేసేది. యీ ధర్మసూక్ష్మాలు నీకెలా తెలుస్తాయి.

మధు : నాకెలా తెలుస్తాయి. నిజమేగాని, ద్రవ్యాకర్షణ యలాగ యీ పెళ్లి వల్ల?

రామ : (తనలో) క్రాసెగ్జామినేషను చేస్తూందోయి దీంతస్సా గొయ్యా (పైకి) నీకు మేజువాణి నిర్ణయించుకున్నాను కానూ, నీకు పదిరూపాయల సొమ్ము దొరకడం ద్రవ్యాకర్షణ కాదా?

మధు : యేంచిత్రమైన మనుష్యులు పంతులుగారూ! (తమలపాకు చుట్టతో కొట్టి) నేను రాబోతానని రెండేళ్ల కిందట కలగని, యీ కాబోయే మేజువాణీ బుద్ధిలో వుంచుకుని యీ పెళ్లి కావడానికి విశ్వప్రయత్నం చేశారూ! ద్రవ్యాకర్షణ యలాగో నాకు బోధపడ్డది. పెళ్లి కూతుర్ని యిలాకాచేసుకుని, దాం ద్వారా ముసలాడి మూటా ముళ్లాలాగేస్తారు. యంత సత్యకాలపదాన్నయినా ఆ మాత్రం ఊహించుకోగల్ను. లేకపోతే నేయంత బతిమాలుకున్నా యీ పెళ్లి తప్పించకపోవడమేవిఁ? మీ బుద్ధికి అసాధ్యం వుందంటే నమ్ముతానా?

రామ : ఆ మాట్నిజవేఁ గాని, అన్ని పనులూ ద్రవ్యాకర్షణ కోసవేఁ చాస్తాననుకున్నావా యేవిఁటి. ఆ ముసలాణ్ణి కాపాడదావఁనే యీ పెళ్లి తలపెట్టాను.

మధు : "చిత్రం చిత్రం మహాచిత్రం" అని కథుంది, అలా వున్నాయి మీ చర్యలు!

రామ : ఆ కథేదో చెబుదూ, నాక్కథలంటే మా సరదా.

మధు : పొగటిపూట కథలేవిఁటి, ముందు యీ చిత్ర కథేవిఁటో శలవియ్యండి.

రామ : అది చెప్పేది కాదు, చెప్పను.

మధు : చప్పకపోతే వొప్పను.

రామ : ఒప్పకేం జేస్తావు?

మధు : యేం జేస్తానా? యీ జడతో కొడతాను. శాస్త్రంలో కాముకులకు చెప్పిన ఆయుధవిఁది.

రామ : నేం దెబ్బలికి మనిషిని కాను. శాస్త్రం గీస్త్రం వొక పక్కనుంచి మోటసరసం మాను. చెప్పమంటే చెబుతాను గాని అలాంటి కబుర్లు నువ్వు వినకూడదు. మరేం లేదు. లుబ్ధావుఁధాన్లు వెధవకూతురు, మీనాక్షి ప్రవర్తన మంచిది కాదు. నాల్రోజుల కొహమారు అది పీకలమీదికి తెస్తూంటుంది. పోలీసువాళ్లు బెదిరించి పది డబ్బుల సొమ్ము లాగేస్తూంటారు. డబ్బు ఖర్చంటే ముసలాడికి, ప్రాణపోకట, సంసారం కూడా మీనాక్షి దూబర చేస్తుందంటాడు. పెళ్లయితె దాని ఆట కడుతుంది.

మధు : మీనాక్షి ప్రవర్తన బాగుంది కాదంటూ మీరే చెప్పాలి? మీరు కంటపడ్డ తరవాత యే ఆడదాని ప్రవర్తన తిన్నగా వుంటుంది?

రామ : అదుగో చూశావా? అలా అంటావనే కదూ చప్పనన్నాను.

మధు : యీ చిక్కులు నాకేం తెలియవు. పెళ్లి మానిపించెయ్యండి.

రామ : యీ పెళ్లిలో నీ మేజువాణీ పెట్టి పదిరాళ్లిప్పిస్తాను. మాటాడకూరుకో.

మధు : (ముక్కు మీద వేలుంచుకొని) లుబ్ధావుధాన్లు యదట నేను మేజువాణీ ఆఁ!

రామ : పేరు వాడు గాని, సభలో పెద్దన్నేనే కదూ?

(హెడ్ కనిస్టేబ్ చుట్ట కాలుస్తూ ప్రవేశించి కుర్చీ మీద కూర్చొనును.)

హెడ్ : రామఁప్పంతులూ! యినస్పెక్టరికే టోపీ వేశావటే?

రామ : (హెడ్ కనిస్టేబు చెవిలో) గారూ గారూ అనవయ్యా.

హెడ్ : యెప్పుడూలేంది గారేవిఁటి, గీరేవిఁటి, చింతగారు?

రామ : ఆడవాళ్ళున్న చోటికి తోసుకు రావడవేఁనా, అన్నా!

**హెడ్** : ఆడవాళ్లంటున్నావు, నువ్వు కూడా అందులోనే జమాయేవింటి? అహ! హ!

**రామ** : హాస్యానికి వేళాపాళా వుండాలి.

**హెడ్** : నేను హాస్యం కోసం రాలేదు; యినస్పెక్టరు పేరు చెప్పి రావింనాయడిదగ్గిర పాతిక రూపాయ ల్లాగావట, యిలా యందరి దగ్గర లాగాడో రామంప్పంతుల్ని నిల్చున్న పాట్లాన్ని పిలకట్టుకు యీడ్చుకురా అని నాతో ఖచ్చితంగా చెప్పి యినస్పెక్టరు పాలెం వెళ్లిపోయినాడు.

**రామ** : చిన్నప్పుడు వొక్క బళ్లో చదువుకున్నాం యినస్పెక్టరూ నేనూను. అంచాత అతని పిలక నేనూ నా పిలక అతనూ లాగినా ఫర్వాలేదు. రావింనాయడి మాట మాత్రం శుద్ధాబద్ధం. మీరు ముందు పదండి, గుఱ్ఱం కట్టించుకుని స్టేషను దగ్గిర కలుస్తాను.

**హెడ్** : నేనెలా వొస్తాను నీతోటి; నాకు వొల్లమాల్నె పనుంది, ఒక కనిష్టీబుని నీతో పంపిస్తాను

**రామ** : (హెడ్ చెవులో) నా యింట్లో మాత్రం నకార ప్రయోగం చెయ్యకు, నీ పుణ్యవుం టుంది.

**హెడ్** : అదా నీ ఘోష! అలాక్కానియి. (నిష్క్రమించును)

**రామ** : (తనలో) అదుగో మళ్లీ ఏకవచనవేం కూస్తాడు! (పైకి) యవఁడ్రా అక్కడ.

**నౌఖరు**: (ప్రవేశించి) సిత్తం బాబు.

**రామ** : గుఱ్ఱం కట్టమను.

**నౌఖరు**: సిత్తం బాబు. (నిష్క్రమించును)

**రామ** : చూశావూ మధురవాణీ, నేన్నిలబడ్డ చోట రూపాయలు గలగల్రాల్తాయి, యీ యినస్పెక్టరుగాడికి యీ తాలూకాకి వొచ్చింతరవాత అయిదారువేలు యిప్పించాను. వీధి తలుపు వేసుకొని సంగీత సాధకం చేసుకో, విద్యవంటి వస్తువు లేదు. (గుమ్మం దాటి నాలుగడుగులు వెళ్లి తిరిగి వచ్చి) అప్పుడే వీణ తీశావు? యీ వూళ్ళో మా దుర్మార్గులున్నారు; నా స్నేహితులవంనీ, బంధువులవంనీ పేరు పెట్టుకొస్తారు, రానీకుమా (తలుపు పైనించి వేసి) గడియ వేసుకో (నిష్క్రమించును)

౨వ స్థలము. రామప్పంతులు యింట్లో పడక గది

**(మధురవాణి తివాసీ మీద కూచుని వీణ వాయించుచుండును. వాయిద్యం ముగించి.)**

**మధు** : విద్యవంటి వస్తువ లేదు, నిజమే – ఒక్కటి తప్ప – అదేవిఁటి? విత్తం. డబ్బు తాని విద్య దారిద్ర్య హేతువ. యీ వూళ్ళో నారదుడు వొచ్చి పాడితే నాలుగు దమ్మిడీలివ్వరు. గనక యీ వీణ యిటుపెడదాం. హెడ్డు కనిష్టేబు సొజ్ఞ చేసి వెళ్ళాడు. అతడు యిచ్చేదీ చచ్చేదీ లేదు గాని, జట్టీలేవైఁనా వొస్తే ఓ వొడ్డుకాస్తాడు.

(వీధి తలుపు తట్టబడును.)

వొచ్చాడు కాబోలు. (తలుపు దగ్గిరకి వచ్చి) యవరు మీరు? బంధువులా?

(తలుపవతల కరటకశాస్తుల్లు, కన్య వొషంతో శిష్యుడున్నూ.)

**కరట** : ఆపదకడ్డం పడ్డ వారే బంధువులు. మేమ్మీకు బంధువులం కావుఁ గాని, మీరు మాకు బంధువులు కాగలు.

**మధు** : నొస్తులా?

**కరట** : (తనలో) యీ కంఠం విన్నట్టుంది (పైకి) నొస్తం కట్టడానికే వొచ్చాం.

**మధు** : దేంతో కడతారు?

**కరట** : (తనలో) యీ వేశ్య మధురవాణి కాదు గద? కంఠాన్ని పోలిన కంఠం ఉండకూడదా? (పైకి) నొస్తం కట్టడానికల్లా వున్నది ఒక్కటే గదా టంకం?

**మధు** : యేవిఁటో ఆ టంకం?

**కరట** : బంగారం!

**మధు** : మా పంతులుగారికి మీరు నొస్తులూ, బంధువులూ కూడా కాకపోతే తలుపు తియ్యొచ్చును. (తలుపు తియ్యును.)

**కరట** : (తనలో) అరే! మధురవాణే!

**మధు** : (ముక్కు మీద వేలుంచుకొని) చిత్రం!

**కరట** : యేమిటి చిత్రం?

**మధు** : యీ వేషం!

**కరట** : ఉదరనిమిత్తం బహుకృతవేషం; యిది దేవుఁడిచ్చిన వేషవేఁను.

**మధు** : నాదగ్గిరేనా మర్మం? యీ పిల్లెవరో?

**కరట** : నా కొమార్తె.

**మధు** : నాటకవంల్లా చెడి పొగటి వేషాల్లో దిగిందా? పెట్టి పుట్టారుగదా యేల యీ అవస్థ?

**కరట** : నీ దయవల్ల దేవుడిచ్చిన స్థితికేం లోపం రాలేదు. నిన్ను చూదావంని వొచ్చాను.

**మధు** : యిన్నాళ్లకైనా యీ దీనురాలు మీకు జ్ఞాపకం రావడం అదెంత గాదు?

**కరట** : నీలాంటి మనిషి మళ్లీ వుందా? నిన్ను చూడ్డం బ్రహ్మానందం కాదా? నీ దగ్గిరికి రావడం చేదనా యిన్నాళ్ళూ రాలేదనుకున్నావు? డిప్టీ కలక్టరుగారి కుమార్రత్నం గారు నిన్ను చేపట్టారని తండ్రికి తెలిసింతరవాత, నేను గానీ నీ యింటికి వొస్తే పీక ఉత్తరించేస్తాడేమో అనే భయం చాత కొంచం యడబెట్టి యితడికి యెప్పుడు బదిలీ అవుతుంది, మా మధురవాణ్ణి యెప్పుడు చూస్తాను అని దేవుణ్ణి సదా ప్రార్థిస్తూ వుంటిని, నువ్విక్కడెన్నాళ్లాయి వున్నావు?

**మధు** : డిప్టీ కలక్టరు గారి కుమార్రత్నం గార్ని, తండ్రి, చదువు పేరు పెట్టి చన్నపట్నం తగిలిన రెండు నెల్లదాకా ఆయన నేస్తుడు గిరీశం గారి ద్వారా డబ్బు పంపించాడు. ఆ తరవాత మొన్నటి దాకా గిరీశం గారు నన్ను వుంచారు గాని, డబ్బుకి యటామటీగా వుండేది. నా యింటికి వొచ్చిన వాడల్లా తన కొడుక్కి దోస్తీ అయివుంటాడని డిప్టీ కలక్టరు అనుమానిస్తాడేమో అని పేరుగల వాడెవడూ నా యింటికి రావడం మానేశాడు. సంజీవరావుగారి అల్లరి కొంచెం మరుపొచ్చిందాకా పైనుందావంని యీ వూరొచ్చాను.

**కరట** : (ముక్కుమీద వేలుంచుకొని) గిరీశం నిన్నుంచుకున్నాడా? మా మేనల్లుడికి చదువు చెప్పడానిక్కుదురుకుని మావాళ్లింట్లో చేరాడు. వాడికి పెందరాళే ఉద్వాసన చప్పాలి.

**మధు** : (ముక్కుమీద వేలుంచుకొని) నా దగ్గిరకు వచ్చినవాడల్లా చెడిపోయినాడో? నా దగ్గిరకు మీరు రాకుండా అవరోధం కలిగిందని యిప్పుడే డిప్టీ కలక్టరుగార్ని తిట్టారే, ఆయన కంటె మీ న్యాయం యేంబాగావుంది? నా దగ్గిరకు వచ్చినందుకు, మీ భార్యాగారు ముందు మిమ్మల్ని మెడబట్టుకొని యింట్లోంచి తరవ్వంలిసింది. తనకిరొట్టా, ఒహడికి ముక్కానా?

**కరట** : క్రియలలో అంతవరకూ జరక్కపోయినా మాటల్లో అమర్యాద అమేషా నాకు జరుగుతూనే వున్నది.

**మధు** : (చిరునవ్వుతో) యీ యిల్లాలు మా పంతులు కంటబడితే యీవిడ గుట్టు బట్టబయలౌతుంది.

**కరట** : యిల్లాలనేస్తున్నావేం అప్పుడేను? కన్నెపిల్ల; దీన్ని పెండ్లి చెయ్యడానికే, నీ దగ్గిరికి తీసుకొచ్చాను.

**మధు** : మా పంతులుకేనా పెళ్లి?

**కరట** : "ఏకా నారీ సుందరీ వా దరీవా" అన్నాడు. త్రిలోక సుందరివి నువ్వు దొరికిం తరవాత నీ పంతులు గారికి యింకా పెళ్లెందుకు?

**మధు** : ఐతే మరెవరికి పెళ్లి చెయ్యడం? నాకాయేవిఁటి? అలాగైతే, సైయేఁ! మొగవేషం వేసుకొని, పెళ్లి పీటల మీద కూర్చుంటాను. యిలాంటి పెళ్లాం దొరకడవేఁలాగ? జగత్ప్రసిద్ధులైన కరటకశాస్త్రుల్లు గారి అల్లుణ్ణి కావడం యెలాగ? దివ్యసుందర విగ్రహవఁని పొగడగానే నా బుజాలు పొంగుతాయనుకున్నారు కాబోలు? యీ పిల్ల దగ్గిర నా బోట్లు దివిఁటీ ముందర దీపాలు. ఆడది మెచ్చిందే అందం! మొగాడి కన్ను మసక. మీకేం తెలుసును? మరి నా పెళ్లాన్ని నాకిచ్చేసి మీ తోవని మీరు వెళ్లండి (శిష్యుడి చెయి పట్టి లాగును.)

**శిష్యు** : చూశావురా నాన్నా యలా పట్టుకుందో?

**మధు** : (ఆచుకోలేకుండా నవ్వుతూ) శాబాషు! యిదేనా పెద్దమనిషి తరహా! యిరుగు పొరుగమ్మ లేవఁంటారో మొగుడు పిలిస్తే వెళ్లకుంటేను?

**శిష్యు** : కొడుతుంది కాబోల్రా నాన్నా, యింటి కెళ్ళిపోదాం, రా!

**మధు** : యేం నంగనాచివే? తరవాత పెళ్లి చేసుకుంటాను. అందాకా ముద్దియ్యి (ముద్దెట్టు కొనును)

**కరట** : నేరని పిల్లని చడగొడుతున్నావు.

**మధు** : నాలాంటి వాళ్లకి నూరు మందికి నేర్పి చెడగొట్టగలడు. యవరి శిష్యుడు? యీ కన్నె పిల్ల నోరు కొంచం చుట్ట వాసన కొడుతూంది!

**కరట** : అంచాతే కాబోలు డబ్బీలో చుట్టలు తరుచు మాయవౌఁతూంటాయి. మధురవాణీ! దేవుఁణ్ణాకు నిన్ను చూపించాడు. పంతుల్లేని సమయం కనిపెట్టి వొచ్చాను; మళ్లీ అతడొచ్చే లోగా నా మాటలు నాలుగూ విని మాకు వొచ్చిన చిక్కు తప్పించు.

**మధు** : మీకొచ్చిన చిక్కేవిఁటి? నేం చెయ్యగలిగిన సహాయ వేఁవిఁటి?

**కరట** : చిక్కన్నా చిక్కు కాదు. విను, యీ యీళ్ళో గిరీశం పెత్తల్లి కొడుకు లుబ్ధావుధాన్లని ఓ ముసలాడున్నాడు; వాడికి మా మేనగోడల్నివ్వడానికి మా బావ నిశ్చయించాడు. యీ సంబంధం చేస్తే నాచెల్లెలు నూతులో పడతానని వొట్టేసుకుంది, యేం వుపాయం చేస్తావో, దాని ప్రాణం కాపాడాలి.

**మధు** : యీ పిల్లని అంతకి తక్కువ సొమ్ముకి అమ్మితే, లుబ్ధావధాన్లు చంకలు గుద్దుకుని చేసుకుంటాడు. అతని దాకా యెందుకు నేనే కొనుక్కుంటాను.

**కరట** : చూపితే అందుకు పోయేదానికి నీకు మిక్కిలి చెప్పాలా యేవిఁటి?

**మధు** : యిదివరకి నిర్ణయమైఁన సమ్మంధం యేమ్మిష పెట్టి తప్పించడం?

**కరట** : నీ బుద్ధికసాధ్యం వుందా? డబ్బుకసాధ్యం వుఁందా?

**మధు** : బుద్ధికి అంతా అసాధ్యవేఁ కాని, డబ్బుకి యక్కడా అసాధ్యం లేదు, యీ పెళ్లిలో మా పంతులుకో పది రాళ్ళు దొరుకుతాయనుకుంటున్నాడే?

**కరట** : నా సంబంధం చేసుకుంటే నేను యిరవై రాపాషాణాలు యిస్తాను.

**మధు** : సరే. గాని నాటకంలో యంతహాస్యమైఁనా చెల్లుతుంది. నటనలోకి హాస్యం తెస్తే యేవిఁ మూడుతుందో ఆలోచించారా?

**కరట** : మధ్య నీకొచ్చిన ఫర్వాయేవిఁటి? నాకొచ్చిన ఫర్వాయేవిఁటి? యీ కత్తెరమీసం, కత్తెర గెడ్డం కడిగేసుకొని నా తోవని నే వెళతాను. యీ కోక నీ దగ్గిర పారేసి మా శిష్యుడు వెళతాడు. ఆ తరవాత యిదేవిఁటమ్మా యీ చిత్రవఁని నువ్వూ నలుగురమ్మలక్కలతో పాటు ఆశ్చర్యపడుదువు గాని. మీ పంతులుతో సిఫార్సు చేసి యీ మంత్రం యలా సాగిస్తావో గట్టి ఆలోచన చెయ్యి.

**మధు** : మా పంతులు వక్కడివల్లా యీ పని కానేరదు.

**కరట** : మరియింకా యవరి కాళ్ళు పట్టుకోవాలో చెప్పు?

**మధు** : మా పంతులుతో మాట్లాడ్డం ఐన తరవాత అవుధాన్లు కూతురు మా నేస్తం మీనాక్షిని తండ్రికి తెలియకుండా చూసి, ఓ రెండు పెద్ద కాసులు యిస్తానని చెప్పండి. ఆ పైని సిద్ధాంతిని చూసి అతనికీ అలాగే ఆశ పెట్టండి. యీ పనికి సిద్ధాంతే కీలకం. నేను తెర వెనక నుంచి సమయోచితంగా హంగు చాస్తాను.

**కరట** : నీ మాట వేరే నే చెప్పాలా? నిన్ను సంతోష పెట్టడం నాకు విధి.

**మధు** : ఆ మాట మీరు శలవివ్వడం నాకు విచారంగా వుంది. వృత్తి చేత వేశ్యని గనక చెయ్య వలసిన చోట్ల ద్రవ్యాకర్షణ చేస్తాను గాని, మధురవాణికి దయా దాక్షిణ్యాలు సున్న అని తలచారా? మీతోడబుట్టుకి ప్రమాదం వొచ్చినప్పుడు నేను డబ్బుకి ఆశిస్తానా? యటుంచి యెటొచ్చినా కాపాడతాడు, హెడ్డు కనిష్టేబుకు మాత్రం కొంతం నిజం చెబుదాం. అతగాడు యిప్పుడే వస్తాడు, మాట్లాడతాను, మీరు యిక్కడ కూచోండి.

**కరట** : స్వాధీనుడేనా? కొంపముంచడు గద?

**మధు** : గులాం. (నిష్క్రమించును.)

**కరట** : కూచుందాం రా.

**శిష్యుడు** : నా పేరేవిఁటండోయి?

**కరట** : కొంప ముంచుతావు కాబోలు! సుబ్బి! సుబ్బి! మధురవాణ్ణి చూడగానే మతిపోయిందా యెవిఁటి?

**శిష్య** : దాని నవ్వు పట్టుబడాలెని నిదానిస్తున్నాను.

**కరట** : సబ్బు అన్నమాట జ్ఞాపకం వుంచుకుంటే సుబ్బి అనే పేరు జ్ఞాపకం వుంటుంది.

(రామప్పంతులు గుఱ్ఱం దూరాన్నదిగి నడిచివచ్చి)

**రామ** : (కరటక శాస్త్రితో మెల్లిగా) లోపలికెవరైనా వెళ్లారా?

**కరట** : (గట్టిగా) యవరో యిద్దరు ముగ్గురొచ్చారు గాని మీ యిల్లాలుగారొచ్చి పైకి పొమ్మని గెంటేశారు.

**రామ** : మీరెవరు? యెందుకొచ్చారు?

**కరట** : మాది కృష్ణాతీరం. నా పేరు గుంటూరు శాస్తుల్లంటారు. తమ దగ్గిర రాచకార్య వుండి వొచ్చానండి.

వీధిలోనుంచి జవాను – "యినస్పెకటరుగారు నే వొచ్చిందాకా మఱ్ఱిచెట్టుకింద గుఱ్ఱాన్ని నిలబెట్టుంచుతావఁన్నారు. రూపాయలు వేగం యివ్వండి"

(మధురవాణి ప్రవేశించును.)

**రామ** : యవరు వొచ్చారట?

**మధు** : యవరొస్తారు? మీ నాస్తులట ! తగిలాను.

**జవాను:** రూపాయలండోయి.

**రామ** : (మధురవాణితో) యేదీ మొన్న నీకిచ్చిన రూపాయలు? సాయింత్రం మళ్ళీ ఫిరాయిస్తాను. యీ సైతాను ప్రాణం తింటున్నాడు.

**మధు** : మీరిచ్చిన రూపాయలు పట్నంతోలేశాను. నేను డబ్బిక్కడ దాచుకుంటే మా తల్లెక్కడ కాలక్షేపం చెయ్యడవెఁలాగ?

**రామ** : వొట్టె బద్ధాలు!

**మధు** : (తాళముల గుత్తి మొలలో నుంచి తీసి రామప్పంతులు మీద విసిరి) చూసుకోండి.

**రామ** : (బుజం తడువుఁకుంటూ) దురహంకారం కూడదు! విసిరికొడితే దెబ్బతగల్దనుకున్నావా యేవిఁటి?

**మధు** : దుష్టు మాటలనగా తగిల్తే తప్పా?

**జవాను**: యేవఁయ్యోయి. పోయి, రూపాయి లిచ్చావు కావని యినస్పెక్టరు గారితో చెబుదునా?

**మధు** : (మెడలో నానుతీసి) యిది తాకట్టు వుంచి కావలసిన సొమ్ము తెచ్చుకొండి.

**రామ** : (తనలో) ఆహా ! యేమి యోగ్యమైన మనిషి! లేనిపోని అనుమానాలు పడకూడదు!

**కరట** : పంతులుగారూ యెన్ని రూపాయలు కావాలండి?

**రామ** : పాతిక.

**కరట** : నే దాఖల్చేస్తాను (జవానుకు యిచ్చును)

**రామ** : ధన జాతకానికి డబ్బులా వొస్తూ వుంటుంది. యేవిఁటి మీ రాచకార్యం?

**కరట** : యిది నా పిల్లండి. దీనికి వివాహం చేయించి ఆ సుకృతం తమరు కట్టుకోవాలి.

**రామ** : వివాహం చేయించడానికి నేను వైదీకిని కాను. నాకు మంత్రాలు రావే? (చుట్ట, జేబులోంచి తీసి కొనకొరికి) యేవఁంటావు మధురవాణీ? అగ్గిపుల్ల.

**మధు** : (అగ్గిపుల్ల అందిస్తూ పంతులు నుంచి శిష్యుడి వేపూ, శిష్యుడి నుంచి పంతులు వేపూ కోపముతో చూసును.)

**కరట** : మంత్రవఁన్నప్పుడు వైదీకపవాడిదేం మంత్రవఁండి? యీ రోజుల్లో వైదీక మ్మంత్రాల మహిమ పోయిందండి. మంత్రవఁంటే నియ్యోగ ప్రభువుదే మంత్రం! తమవంటి ప్రయోజకులకు మంత్రం మాటాడుతుందండి.

**రామ** : మధురం! యేవఁంటావు? యీ పిల్ల న్నే పెళ్ళి చేసుకుందునా?

**మధు** : (రామప్పంతులు వేపూ, శిష్యుడి వేపూ చురచుర చూసి నిష్క్రమించును.)

**రామ** : సొగసుకత్తెలకి అలక కూడా అదో సృంగారం సుమండీ, శాస్తుల్లు గారూ

**కరట** : వైదీకపాళ్లం మాకా శృంగారాలు యలా అనుభవవౌఁతాయండి? మాయిల్లాళ్ళక్కోపం వొస్తే చీపురు గట్టలు యెగురుతాయండి. సరసవఁన్నది పుస్తకాల్లో చదవడవేఁ గాని మాకు అనుభవవేద్యం కాదండి. శ్రీకృష్ణమూర్తివారు రాధికతో శలవిస్తున్నారు, ఓ రాధికా నీ కోపం తీర్చుకోవాలన్నష్షాయనా "ఘటయ భుజ బంధనం రచయరద ఖండనం, యేనవాభవతి సుఖజాలం" అనగా యేవఁంచున్నాడంటే కవీశ్వరుడు, చేతుల్తోటి ఉక్కిరి బిక్కిరి అయ్యేటట్టుగా కాగలించుకో, మరిన్నీ పెదివఁలు రక్తాలొచ్చేట్టు కొరికెయ్యి, అంఛున్నాడు.

**రామ** : (మధురవాణి వెళ్లిన గుమ్మము వేపు చూసి) ఉప్పులేకనే ముప్పందుం, మధురవాణికి మాత్రం యీ వెఱ్ఱి మొఱ్ఱి కవిత్వాలు చెప్పకండి. నాలాంటి మృదువర్లు మోట సరసం సహించరు.

**కరట** : ఆమె మీ భార్యా కారండీ? సంసారికన్నా మర్యాదగా వుంది యీ వేశ్య! మీది యేవఁ దృష్టం!

**రామ** : యెంపిక, యెంపికలో వుందండి. మీ రాచకార్యం చెప్పారు కారు.

**కరట** : లుబ్ధావుధాన్లు గారికీ తమకీ చాలా స్నేహవఁని విన్నాను. ఆయన తమమాట అడుగుదాటరట?

**రామ** : ఆ గాడిద కొడుక్కి ఒకరితో స్నేహం యేమిటండీ? వాడి ప్రాణానికీ డబ్బుకీ లంకె. డబ్బుకీ వాడికే స్నేహం గాని మరి యవరితోనూ స్నేహం లేదు. అయితే వాడికి వ్యవహార జ్ఞానం లాఁక పోవడం చాతా, కోర్టంటే భయంచాతా నా సలహాలాఁక బతకలేడు. వాడే అన్నమాటేవిఁటి, యీ తాలూకాలో సివిలు మేజస్ట్రేట్లు యెక్కఁడొచ్చినా రామప్పంతులు పప్పులేని పులగం వుండదు.

**కరట** : ఆ మాట వినే తాము నియ్యోగ ప్రభువులు, మంత్రబలం చాత చక్రం అడ్డేస్తారని తమర్ని వెతుక్కొచ్చాను. మా పింతల్లి కొడుకు బియ్యే బియ్యల్ పాసయినాడండి. డిప్టీ కలెక్టరీ చేస్తున్నాడు. బంధువులకి అతని వల్ల గడ్డిపరకంత సాయం లేదు గదా? మీది మిక్కిలి కూరానారా యవళ్లయినా గృహస్థులు గృహస్థు మర్యాదకి పంపించి, తల్లయినా, పెళ్ళాం అయినా అవి పుచ్చుకుంటే, తిరగగొట్టిందాకా అభోజనం కూచుంటాడు! పెట్టడానికీ పుచ్చుకోవడానికీ నియ్యోగ ప్రభువులు, తమకి చెల్లింది కాని, మా వాళ్ల ఉద్యోగాలు మంటిగడ్డ ఉద్యోగాలండి. "ఇయ్యా ఇప్పించంగల అయ్యలకే గాని మీసమన్యులకేలా రొయ్యకి లేవా బారెడు" అని కవీశ్వరుడన్నాడు.

**రామ** : యీ యింగిలీషు చదువులు లావైన కొద్దీ వైదీకులే అన్న మాటేవిఁటి అడ్డవైన జాతుల వాళ్లకీ ఉద్యోగాలవుతున్నాయి గాని యంత చదువుకున్నా మీ వైదీకప్పంతుళ్ళ వారికి మా చాకచక్యాలబ్బుతాయండీ? మా లౌక్యం మాతో స్వతహాగా పుట్టినది, మీరు తెచ్చి పెట్టుకున్నది. యెరువు సరుకు, యెరువు సరుకే, విన్నారా? మీ వాళ్ళు లంచాలు పుచ్చుకోవడం చాతకాక, పతివ్రతలమని వేషం వేస్తారు.

**కరట** : అదే పతకవైఁతే అది అమ్ముకు బతకనాఁ అన్నట్టు మా వాళ్లకే చాతయితే నాకు యీ అవస్థేవండి? మా వాడు పదిమంది పార్టీలతో చెబితే పదిరాళ్ల సొమ్ము దొరుకును. యీ చిక్కులు లాఁకపోవును

**రామ** : యేవిఁటా చిక్కులు?

**కరట** : రుణబాధ చాలా లావుగా వుందండి. రేపటి పున్నంలోగా ఒక దస్తావేజు తాలూకు రూపాయలు చెల్లక పోతే దావా పడిపోతుందండి. యీ పిల్లని నల్లబిల్లిలో వెంకట

దీక్షితులుగారికి పదహారు వందలకి అమ్మ నిశ్చయించుకొని తీరా వొచ్చేసరికి యిప్పట్లో రూపాయలివ్వలేం, పెళ్లయిన నెల రోజుల్లో యిస్తావఁన్నారండి. అందుచేత అది వొదులుకొని లుబ్ధావుధాన్లు గారు వివాహ ప్రయత్నంలో వున్నారని విని తమ దర్శనానికి వొచ్చానండి. యిది గాని తాము సమకూరుస్తే పది వరహాల సొమ్ము దాఖలు చేసుకుంటాను.

**రామ** : నేను నలభై యాభై రూపాయల వ్యవహారాల్లో జొరబడే వాణ్ణి కాను.

**కరట** : తాము చేసే సదుపాయాన్ని బట్టి యెంతయినా దాఖలు చేసేవాణ్ణేనండి. నా రుణాలు పదహారు వందలుంటాయండి. ఆపైని యేవొచ్చినా తాము దాఖలు చేసుకొండి.

**రామ** : "ఐతే, గియ్తే" బేరాలు మాకవసరం లేదు. అగ్నిహోత్రావుధాన్లకి పద్దెనిమిది వొందలిస్తున్నాడు గదా, అందుకు సగానికి సగం తగ్గితేనే గాని అవుధాన్లు ఆ సంబంధం మాని మీ సంబంధం చేసుకోడు. అందులో మీ రుణాలు తీరేదేవిఁటి? నాకిచ్చేదేవిఁటి? యేవైఁ తేనేవి? ఆ వ్యవహారం యలాగా మించిపోయింది. పదిరోజులకిందటొస్తే ఘొక్కుపరుస్తును. ఆ సంబంధం భోగట్టా మొదట నేనే తెచ్చాను. నా చేతులోంచి ఆ వ్యవహారం పోలిశెట్టి లాగేశాడు. కృత్యాద్యవస్థమీద మధురవాణి మేజువాణీకి వాణ్ణొప్పించే సరికి నా తాతలు దిగొచ్చారు. మరి వక ఉపాయం చెబుతాను వినండి. మీకు మయినరు కొమాళ్లున్నారా?

**కరట** : చిన్నవాడికి మయినారిటీ దాటి మూడేళ్లయిందండి.

**రామ** : అయితే యిహలేందేవిటి? ఆ కుఱ్ఱవాడు మయినరని వాదిద్దాం.

**కరట** : సాక్ష్యం యలావొస్తుందండి?

**రామ** : ఓహో హో! మీకు యేమీ తెలియదే! యిలాంటి వ్యవహారాలు నా తలమీద యెన్ని వెంట్రుకలున్నాయో అన్ని మోసేశాం. విన్నారా? ఉర్లాం బసవ రాజుగారి సంభావన్ల రేటే సాక్ష్యాలక్కూడా గేజటార్డర్ చేశాం. కుండనాలు వేసుకున్నవారికి ఓ రూపాయి జాఫా.

**కరట** : జాతకం వుంది గదా యేం సాధనం?

**రామ** : కాకితవైఁతే అగ్గిపుల్లతో ఫైసల్! తాటాకైతే నీళ్లపొయ్యి! కొత్త జాతకం బనాయించడం అయిదు నిమిషాలు పని. మా సిద్ధాంతి మట్టుకు నాలుక్కాలాలు చల్లగా వుండాలి. నా దగ్గిర పాత తాటాకులు ఆలేఖాలు అటక నిండా వున్నాయి. ముప్ఫైయేళ్ళ నాటి కాకితాలున్నాయి. రకరకాల సిరాలున్నాయి. ఒక నూఱ్ఱూపాయిలు నాకు ఫీజు కింద యిచ్చి ఖర్చులు పెట్టుకొండి. గ్రంథం నడిపిస్తాను.

**కరట** : దారి ఖర్చు కోసం తెచ్చిన రూపాయలు మీకు దాఖలు చేశాను. మరిబుర్ర గొరిగించుకుందా వంటే దమ్మిడీ లేదు. కోర్టంట తిరగడానికయినా చేతిలో ఓ డబ్బు సొమ్ముండాలి గదా? యిదొహర్తే టొంపలా నాతో వుంటే యలాగండి కోర్టంట తిరగడం? తమ లౌక్యానికి అసాధ్యవఁన్నది వుంటుందంటే నే నమ్మజాలను. యలాగయినా కుదిర్న సంబంధం తప్పించి, మా సంబంధం కుదిర్చి, నాకు యిచ్చే సొమ్ములో పదోవంతు తాము అంగీకరించి మిగిలింది నాకు దయచెయ్యండి. దీన్ని మొగుడింట అప్పజెప్పి ఆ పైన యీ గ్రంథం యేదోకొస చూసిందాకా తమర్ని అంటగాగి వుంటాను.

**రామ** : పదోవొంతు పనికిరాదు. మా బేరం యెప్పుడూ సగానికి సగం.

**కరట** : సంగోరు మీకిస్తే మరి నేను ఋణాలేం తీర్చుకోను?

**రామ** : ఋణాల్తీర్చుకో అఖర్లేకుండా గ్రంథం జరిగిస్తాం కదూ? అప్పుడే మీ చేతులో రూపాయలు పడడానికి శిద్ధంగా ఉన్నట్లు మాట్లాడుతారేవిఁటి? నేను యంత శ్రమపడ్డ పైని పతకం తిరగాలి? అది ఆలోచించారా?

**కరట** : తాము అలా అంటే నేనేం మనివి చెయ్నండి? రక్తం మాంసం అమ్ముకుంటూన్నప్పుడు ఆ కాని కూడయినా సంతుష్టిగా దొరకడం న్యాయం గదండి? వ్యవహారాల తొట్రుబాటు చాతనూ పిల్ల కట్టు దప్పి వుండడం చాతనూ, తొందరబడుతున్నాను గానండి, కొంచెం వ్యవధి వుంటే రెండు వేలకి పైగా అమ్ముకుందునండి.

**రామ** : "అయితేగియితేలు" అనుకున్న లాభం లేదని చెప్పాను కానా? ఐదో వొంతుకు యేవంటారు?

**కరట** : యీ పాపపు సొమ్ముకే తమరు ఆశించాలా అండి?

**రామ** : పాపపు సొమ్ము మాదగ్గిరికిరాగానే పవిత్రవైఁ పోతుంది. ఒహళ్ల కివ్వడం కోసవేఁ గాని నాక్కావాలా యేవిఁటి?

**కరట** : ఐతే కానియ్యండి.

**రామ** : యిక నా ప్రయోజకత్వం చూడండి. మధురం! మధురం! కాకితం, కలం, సిరాబుడ్డి తీసుకురా. మామోలు సిరాబుడ్డి కాక గూట్లోది పెద్ద సిరాబుడ్డి తే.

**మధు** : (అవతల నుంచి) నాకంటె మధురం కంటబడ్డ తరువాత నేనెందుకు?

**రామ** : ఆడవాళ్లకి అనుమానం లావండి. వింటున్నారా? అదో ముచ్చట!

**కరట** : కేవలం వజ్రాన్ని సంపాదించారు!

**రామ** : వజ్రవేఁగానండి, పట్టవాసపు అలవాటు చాత పదిమందితో మాట్లాడితే గాని దానికి వూసుబోదు.

**కరట** : ఆ మాత్రం స్వేచ్ఛ యివ్వడమే మంచిదండి; ఆడదాన్నట్టే రొకాయించకూడదండి?

**రామ** : రొకాయిస్తే యెంజేస్తుందేవిఁటండి?

**కరట** : యిలాంటి మానం గల మనిషైతే నూతులో గోతులో పడుతుందండి.

**రామ** : అలాగనా అండి?

**కరట** : అందుకు సందేహమేమిటండి? నాజూకైన మనస్సు గల స్త్రీని మల్లెపువ్వులాగ వాడుకోవాలండి.

**రామ** : ఆ నాజూకులూ గీజూకులూ మీకేం తెలుసునండి?

**కరట** : పుస్తకాల్లో చదువుకున్న ముక్కలు. నాయకుడు నిరాకరిస్తే నాయిక వొచ్చిన్నీ యేవే, ఉద్యానాల్లో వుండుకున్నషువంటి లతలతో వురిపోసుకుంచుందండి. మహాకవుల నాటకాల్లో ఆష్లాగే జరిగినట్లు రాశారండి.

**రామ** : మరెవళ్లతో మాట్లాడినా తప్పులేదు గాని, హెడ్డు కనిష్టీబుతో మాత్రం మాట్లాడవద్దని బుద్ధి చప్పండి. మీరు తండ్రిలాంటి వారు గదా?

**కరట** : ప్చు! అంత అదృష్టవాఁ అండి! అట్లాంటి పిల్లే నాకు వుంటే, మూడు నాలుగు వేలకమ్ముకుని రుణాలూ పణాలూ లేకుండా కాలక్షేపం చేసి వుందును. దీన్నయినా నాలుగు దిక్కులా అమ్మజూపితే రెండు మూడు వేలు యిదివరకే చేతిలో పడివుండునండి. మేనరికం చెయ్యాలని దీంతల్లి భీష్మించుక్కూచోబట్టి యీదురవస్థ మాకొచ్చింది. అంచాతనే యింట్లో చప్పకుండా యీ పిల్లని వెంటతీసుకొచ్చి యీ దేశంలో పెళ్లికి చూపుతున్నాను.

**రామ** : నా సహాయ లోపం వుండబోదు.

**కరట** : ఐతే కార్యవఁయిందే!

**రామ** : యేదీ పిల్లా యిలారా, చెయి చూపించూ.

(శిష్యుడు భయం నటించి వెనక్కి తక్కును)

**కరట** : చూపించమ్మా, భయంలెచ్చూపించు (కరటక శాస్తుల్లు శిష్యుణ్ణి రామప్పంతులు దగ్గిరికి తోయును. రామప్పంతులు చెయ్యిపట్టుకుని అరిచెయ్యి చూచు చుండును. శిష్యుడు చెయ్యి లాగుకొంటూన్నట్టు నటించును. మధురవాణి సిరాబుడ్డీ, కలం, కాకితం పట్టుకొని రామప్పంతులు వెనక నిలుచుండును)

**రామ** : ఆహా! యెం ధనరేఖా! సంతాన యోగ్యత బాగా వుంది.

**మధు** : మీరు చేపట్టింతరవాత, అందుకు లోపం వుంటుందా?

(సిరాబుడ్డిలోని సిరా రామప్పంతులు ముఖం మీద పోసి ఛఝ్ఝున వెళ్లిపోవును)

★★★

## ౩వ స్థలము. కృష్ణారాయపురం అగ్రహారంలో అగ్నిహోత్రావధాన్లు గారి ఇల్లు

(వీధి-గుమ్మం యదట గిరీశం నిలిచి సన్నని గొంతుకతో పాడును)

"కాముని విరిశరముల బారికి నే,
నేమని సహింతునే, చెలి, యేమని సహింతునే?"

వీడి తస్సాగొయ్యా, వీడి బాణాలు పువ్వులటోయి? ఆ మాట యవడు నమ్ముతాడు? వెర్రికుట్టె యెవడైనా నమ్మాలి గాని? అనుభవ వేద్యమైన దీని నిజం యేమిటంటే : మంచి పదును బట్టిన లోహం మొనకి, డయమండ్ పాయింట్ వేసి, పాయజన్‌లో ముంచి, కంటికి కనపడకుండా మంత్రించి విసురుతాడు. అంచేతనే పైకి గాయం కనపడదు గాని, పోలీసు వాళ్ల దెబ్బల్లాగ లోపల తహతహ పుట్టిస్తాయి. ఈ విడో బ్యూటీ చూస్తే యేమీ తోచకుండా వున్నది. అయితే యిది చెప్పినట్టలా వశమయ్యే మనిషి కాదు. పాతరస్త్రాలేం పనికి రాకుండా వున్నాయి. నా యక్స్పీరియన్సూ, నా శృంగార చేష్టలూ గుడ్డి గవ్వంత పని చెయ్యకుండా వున్నాయి. యింత సింప్లిసిటీ యక్కడా కానలేదు. దీనికి లవ్ సిగ్నల్సు రామరామా! యేమీ తెలియవు. చమత్కారం మాటలు ఆడితే యేమిన్నీ అర్థం చేసుకోలేక ఆ లేడి కళ్లతో తెల్లబోయి చూస్తుంది. అయామ్ డ్రెడ్ఫుల్లీ యిన్ లవ్ విత్ హర్. దీన్ని చూసిన దగ్గిర్నించీ టౌన్ లవ్సూ, డాన్సింగర్లుసూ, మీద పరమాసహ్యం పుట్టింది. పాజిటివ్ యబహరెన్స్. వాళ్ల పెంకె మాటలూ, పెడర్థాలు, దొంగ వేషాలూ, డామిట్! అంతా యిన్సిన్సిరిటీయేగదా? యిన్నాళ్లు మధురవాణి వలల్లో పడి యెలాగు యాస్‌ని అయిపోయినానో నాకు నా మట్టుకే ఆశ్చర్యంగా ఉంది! మధురవాణికీ యీ మనిషికీ కంపారిజన్ వున్నదా? అది రంగు వేసిన గాజుపూస, యిది ప్యూర్ డైమండ్? కాదని యవడైనా అభాజనుడు అంటే అమాంతంగా వాడి పిలకూడదీస్తాను. దీనిని చెడగొట్టడానికి ప్రయత్నం చెయ్యకూడదు. చేసినా సాగేది కాదు. గనక కొత్తదారీ, కొంత న్యాయమైనదారీ తొక్కాలి. యేమిటయా అది? మాయోపాయం చేసి దీన్ని లేవదీసుకుపోయి విడో మారియేజి

చేసుకుంటినట్టాయనా కీర్తీ, సుఖం కూడా దక్కుతాయి. "టూ బర్డ్స్ యట్ వన్ షాట్!" యిలాంటి అట్టర్లీ యిన్నోసెంట్ విడోని వొప్పించి తీసుకుపోయి పెళ్లాడితే మజా, ప్రయోజకత్వమూ గాని, రెండేసి మూడేసి సంతానాలు కలిగి తురకాడితోనో, దూదేకులవాడితోనో లేచిపోవడానికి సిద్ధంగా వున్న దండు ముండల్ని విడో మారియేజి చేసుకుంటే హెల్! పూట కూళ్ళమ్మలాంటి ముండని పెళ్ళాడ్డం విడో మారియేజి అనిపించుకోదు. అది దొంగ ముండా మారియేజి! యిదేవింటయా యిది, యీ బుచ్చమ్మ? సాక్షాత్తూ పరమపవిత్రమైన విడో విత్ గిల్ట్ లెటర్స్! అయితే, గియితే మ–రా–రా–శ్రీ, యన్ – గిరీశం గారు విడో మారియేజి చేసుకోవడమేనా? "టు మారీ యె విడో, ఆర్ నాట్ టు మారీ, దటీజ్ ది క్వశ్చన్!" షేక్స్పియర్ పడ్డ అవస్థలో పడ్డాం! "తొందరపడి హాజీసాహేబు తురకల్లో కలిసిపోయినాడన్నట్లు" నావంటి బుద్ధిమంతుడు తొందరపడి యేపనీ చెయ్యకూడదు. దాని లాభనష్టాలు బేరీజు వేసి, జమా ఖర్చు చేసుకుని మరీ డిసైడ్ చెయ్యాలి. లెటస్ సీ, Imprimis ఒకటో పద్దు డెబిట్ (నష్టం)– విడో మారియేజి చేసుకుంటే మావాళ్లు అక్కర చెయ్యరు. అందుకు క్రెడిట్, (లాభం) – వాళ్లిప్పుడు చేస్తూన్న అక్కరేవుంది గనక బాలెన్స్ (గాక బాకీ) నిల్, బండిసున్నా! రెండో పద్దు! డెబిట్ (ఖర్చు) – లోకం నన్ను బహిష్కారంచేస్తారు. అందుకు క్రెడిట్, (జమ)–లోకంలోకల్లా విలవైన వస్తువను నేను అంకించుకుని, పసలేని ఆ లోకానికే నేను బహిష్కారం వేస్తాను. గనక క్రెడిటు బాలెన్సు (నిలవ) –యేమిటయా? నెగెటివ్ యడ్వాంటేజి, హేవింగ్ నథింగ్ టుడూ వితే పాపర్‌వర్ల్డు – పోజిటివ్ యడ్వాంటేజి –పొజెసింగ్ ఆలిట్స్ వెల్త్! మూడోపద్దు – డెబిట్ – నష్టం – "వీడి పెళ్లాం వెధవముండ" అంటారు. నోటాబీనీ – యీ పద్దు నిజంగా డెబిటేనా? ఆడిట్ డిపార్టుమెంటువార్నడిగి సంశయం తీర్చుకోవాలి. అందాకా మ–రా–రా–శ్రీ, గిరీశం గారి అభిప్రాయం యేమంటే – విడో అనేది యేమిఁటి? ఏ నేమ్! ఓ పేరు! ఆ పేరు మనిషి మొహమ్మీద రాశుందా? మనిషిని ముస్తాబు చేసి యదట నిలబెడితే, యిది పునిస్త్రీ, యిది విడో అని చప్పగలిగిన పెద్దమనిషి యవడు? ఒహడూ లేడు, గనక విడో అనే వస్తువ యక్కడుందయా? వెక్కిరించే వెధవల నోళ్లలో వుంది. దీనికి క్రెడిట్,(లాభం) యేమనగా–విడో పెళ్ళాడిందంటే అశుభం వోగాయిత్యం అని అటెవడూ కన్నెయ్యడు. యిక డెబిట్లేని శుద్ధ క్రెడిట్, నంబర్ ఫోర్, "చుక్కలవలె, కర్పూరపు ముక్కల వలె నీదు కీర్తి ముల్లోకములన్ కిక్కిరిసి పిక్కటిల్లెను", అన్నట్లు గిరీశంగారి కీర్తి మిన్ను ముట్టుతుంది. గిరీశం గారి విధవా వివాహ మహోత్సవం కథ న్యూసు పేపర్లలో పెద్దక్షరాల్తో పడుతుంది. క్రెడిట్ నెంబర్ ఫైవ్ విడోమారియేజి యసోసియేషన్ వారు

ఒక తృణం యిస్తారు. బుచ్చమ్మక్కూడా కొంచం డబ్బుంది. డెబిట్-దావా తెస్తే గాని అవుఁధాన్లు మావగారు దాన్లో దమ్మిడీ యివ్వడు.

ఫ్రొజెండ్ కాన్సన్నీ విచారించగా, ఆవశ్యం విడోమేరియేజి చేసుకుని తీరవలసిందే. అయితే సాధనవేఁవిఁటి? యేదైనా యాసెస్ బ్రిడ్జికట్టి వొడ్డు చేరాలి. (పైకి ముఖంయెత్తి ఆలోచించి) వెంకమ్మ, మొగుడితో దెబ్బలాడి నూతులో పడ్డప్పుడు నేను సాహసించి వురికి పైకి తీసిందగ్గిర్నుంచీ వూరంతా నేను సాక్షాత్తూ సత్యహరిశ్చంద్రుణ్ణిగా భావిస్తున్నారు. అడుగడుక్కి బుద్ధి దాట్లేస్తూంటుంది గాని, నేనంత వాణ్ణీ కానా యేవిఁటి? స్నేహం పట్ల పీకిచ్చేస్తారే గిరీశంగారు! సాధారణులా? గనుక బుచ్చమ్మని మనం లావుచనుం చేసినా సుతిమించే వరకూ యవరూ తప్పు బట్టబోరు, రాత్రిళ్ళు అరబ్బీ నైట్లు, కాశీమజిలీలు, మదన కామరాజు కథలూ చెబుతూ వుంటే యంతో సర్దాగా పక్కని కూచుని వింటుంది. లవ్ స్టోరీజ్ బుఱ్ఱకెక్కించాను. కొంత గ్రౌండ్ ప్రిపేరైంది గనక, యిహ విడో మేరియేజి మంచిదని బోధపరుద్దాం. పాచిక పారినట్టాయనా, రాయవరం చలో, విడో మారియేజి కరో! లెట్ మీ బిగిన్ ది కాంపైన్ ఏట్ వన్స్! (తలుపు కన్నములోనుంచి తొంగి చూచి) నడవలో కూర్చుని విస్తళ్లు కుడుతున్నది. మొట్టమొదట కొంచం మ్యూజిక్ విసురుదాము. (ఎటులోర్తునే చెలియా అను జావళీ కూనురాగముతో పాడి) బుచ్చమ్మ వదినగారూ తలుపు తీయండి. (బుచ్చమ్మ తలుపు తీయును) వదినా... వెల్!... వెంకటేశం యేమిచేస్తున్నాడు?

**బుచ్చమ్మ** : పెరట్లో గొట్టికాయలాడుతున్నాడు.

**గిరీశం**: ఈ వూరువస్తే మరి చదువు చెడిపోతుంది. పట్నంలో వున్నప్పుడు డస్కు దగ్గిర నుంచి కదలితే వొప్పేవాడను కాను. ఒక్కమాటు పి... పిలుస్తారా పాఠం చెపుతాను.

(బుచ్చమ్మ తమ్ముని తీసుకొని వచ్చుటకు వెళ్లును.)

ఆహా! దీని తస్సాగొయ్యా, మొహం యెదటికి వచ్చేటప్పటికి కొంచం ట్రెంబ్లింగ్ పట్టుకుంటుంది. వకటి అనవలెనని మరివకటి అనేస్తూ యుంటాను. మరెవళ్లూ లేరు, వంటరిగా దొరికింది గదా. యీలాంటప్పుడు నా మనస్సులో మాట చెప్పేస్తే తీరిపోవునా! ఆ కోతి వెధవని తీసుకురమ్మని చెప్పాను. కానీ, పాఠాలలో చిన్న లెక్చరు వేతాము. (వెంకటేశ్వరులు, బుచ్చమ్మ ప్రవేశింతురు.) యేమివాయి మైడియర్ బ్రదరిన్లా వెంకటేశం, పాఠాలు చదవడం శుభ్రంగా మానివేశావు? యిక్కడ మరి మాసం రోజులు వుంటే వచ్చింది కూడా మరచిపోతావు. యేదీ టెక్స్టుబుక్కు పట్టుకురా. (వెంకటేశం పుస్తకము పట్టుకొని వచ్చును) గాడ్స్ వర్క్స్ అనే పాఠం తియ్యి. రీడ్‌ఆన్ మై గుడ్ బోయ్.

**వెంక** : (తడుముకుంటూ) దేర్ యిజ్ నాట్ ఏన్ ఆబ్జక్ట్ ఇన్ క్రియేషన్ వుచ్ డజ్ నాట్ సెర్వ్ సమ్ యూస్‌ఫుల్ పర్పజ్.

**గిరీశం**: అట్టె! అట్టె! అక్కడ నిలుపు, క్రియేషన్ అనగా యేమిటి?

**వెంక** : క్రియేషన్ అనగా – అనగా – ఆవులు.

**గిరీశం**: నాన్సెన్స్, చదవేస్తే ఉన్న మతి కూడా పోతున్నది. ఆవులు యెదటవున్నాయనా ఆవులంటున్నావు? మళ్ళీ ఆలోచించి చెప్పు.

**వెంక** : యే మాటకి అర్థం అడిగారండీ?

**గిరీశం**: క్రియేషన్

**వెంక** : ఆదా! క్రియేషన్ అంటే ప్రపంచం. నేను, యెదట ఆవులు కనబడితే యీ ఆవుపెరుగు యీ నెలరోజులేకదా తినడవఁని ఆలోచిస్తూన్నాను.

**గిరీశం**: వన్ థింగ్ ఏట్ ఏ టైమ్. యిప్పుడు పాఠం మాట ఆలోచించు. క్రియేషన్ అనే వక్కమాట పైనే వక్క ఘంట లెక్చరు యివ్వవచ్చును. ప్రపంచం యేలా గున్నది? కపిద్ధాకార భూగోళా అని మనుధర్మ శాస్త్రంలో చెప్పినాడు. కపిద్ధమంటే యేమిటి?

**వెంక** : నారింజపండు

**గిరీశం**: వెరిగుడ్. అందుకు అమర నిఘంటులో పద్యం నీకు వచ్చునా?

**వెంక** : రాదు. చెప్పండి రాసుకుంటాను.

**గిరీశం**: యింతలు బదరీ ఫలములు యింతలు మారేడు బళ్ళు యీడుకు జోడై బంతులు తామర మొగ్గలు దంతీకుచ కుంభములబోలు తరుణీ కుచములూ. యీ ప్రపంచములో యేమివస్తువులుంటవి?

**వెంక** : ఆవులు.

**గిరీశం**: డామ్ నాన్సెన్స్, యెంతసేపూ ఆవులేనా? యేవిఁటి వుంటవో బాగా ఆలోచించి చెప్పు.

**వెంక** : గేదెలు.

**గిరీశం**:దట్‌విల్ నాట్ డు, మళ్లీ ఆలోచించి చెప్పు.

**వెంక** : అయితే నాకు తెలియదు.

**గిరీశం**: విడోస్–యింత చిన్న ప్రశ్నకు నీకు జవాబు తెలియదు! ప్రపంచమందుండే వస్తువు లన్నిటి లోకీ ముఖ్యమయినవి విధవలు. దాని విషయమై పెద్ద లెక్చరు యివ్వ వచ్చును. మనదేశములో ఒక దురాచారము వున్నది. మొగవాడికి పెళ్లాము చచ్చిపోతే తిరిగి

పెళ్లాడుతాడు. ఆడదానికి మొగుడు చచ్చిపోతే యంత యవ్వనములో నున్నా, యెంత సొగసుగానున్నా, మరివకడిని పెళ్లాడవల్లలేదు. ఇది అన్యాయమంటావా, కాదంటావా?

**వెంక** : తప్పకుండా అన్యాయమే.

**బుచ్చమ్మ :** యేమండీ గిరీశం గారూ, వెధవలు పెళ్ళాడడం పాపం కాదూ?

**గిరీశం**: ఆహా! మీ సత్యకాలం చూస్తే నాకు విచారంగా నున్నది. వెధవలు పెండ్లాడవలసినదని పరాశరస్మృతిలో స్పష్టంగా నున్నది. వేదంలో కూడా నున్నది. రాజమహేంద్రవరములో యిదంతా పండితులు సిద్ధాంతం చేసినారు. పూర్వకాలంలో వెధవలు పెండ్లాడే వారు, వెంకటేశం! నలచరిత్రలో దమయంతి రెండో పెండ్లి సాటించిన పద్యం చదువు.

**వెంక** : నాకు రాదు.

**గిరీశం**: ఇంత ముఖ్యమయిన పద్యం మరచిపోవడం యంతతప్పూ! నోటుబుక్కు తీసి రాసుకో – "దమయంతి రెండో పెళ్లికి, ధరనుండే రాజు లెల్ల దడడడవచ్చిరీ" – చూశావా! లోకంలో వుండే రాజులంతా వెధవని పెళ్లాడడానికి వచ్చారట, (బుచ్చమ్మ వైపు జూచి) చూశారా? శాస్త్రాలన్నీ వొప్పుకోవడమే కాకుండా మీది మిక్కిలి వెధవలు పెళ్లాడకుండా వుండిపోతే దోషమని కూడా చెప్పుతూ వున్నాయి. యిందు విషయమై శంకరాచార్యులవారు పత్రిక కూడా యిచ్చి యున్నారు.

**బుచ్చమ్మ** : అయితే మనవాళ్లంతా వెధవల్ని పెళ్లి చేసుకోకూడదంటారే?

**గిరీశం**: అదంతా యింట్లో చాకిరీ చేయించుకోవడము కోసరము గాని మరేమీ కాదు. ఝామురాత్రి ఉందనగా లేచి మరునాడు రెండు ఝాముల రాత్రి దాకా యెద్దులాగు పనిచేయిస్తారు కదా? ఒక పూట కంటే యెక్కువ భోజనం చెయ్యనియ్యరు గదా? అప్సరస లాగున యెంత సొగసుగా నున్నా మంచిగుడ్డ కట్టుకోనివ్వరు. సరుకు పెట్టుకోనివ్వరు. తుమ్మెద పంక్తుల్లా వుండే జుత్తు కూడా తీసివేస్తారు గదా! ఫర్ ఏగ్జాంపిల్, మీ అక్కయ్యకు ఆ చంద్రబింబము వంటి ముఖము పైని ఒక కుంకుమ బొట్టుంటే త్రినేత్రుడికైనా చూడడానికి అలవి వుండునా? ఆహా ఈ అవస్థ చూస్తే నా హృదయం కరిగిపోతున్నది. ఆల్‌రైట్! ప్రపంచములో యింకా యేమి వస్తువులువున్నవి?

**వెంక** : చేగోడీలు.

**గిరీశం**: డామ్ నాన్సెన్స్–ఎంతసేపూ తిండి విషయమయ్యే ఆలోచిస్తావు. బాచిలర్స్, బ్రహ్మచారులు కూడా వున్నారు. వాండ్లు చెయ్యవలసిన పని యేమిటి?

**వెంక** : వేదం చదువుకోవడం, పెయ్యలకి గడ్డి తేవడం

**గిరీశం:** నాన్సెన్స్, అది మీ తండ్రి దగ్గర చదువుకునే విద్యార్థుల మాట. బ్రహ్మచారి యొక్క రియల్ డ్యూటీ అంటే, విధింపబడిన పని యేమనగా, విధవలను పెండ్లాడడమే. ఇంకా క్రియేషనులో యేమున్నది?

**వెంక :** నాకు తెలియదు.

**గిరీశం:** రామవరములో వెధవ వివాహము చేసుకున్న వాళ్లకల్లా నెల వక్కంటికి నూరు రూపాయలు యిచ్చి పోషించడమునకు విడోమారేజి సభ వకటి యున్నది. ఇదివరకు అయిదు వేల మంది విధవలకు వివాహములు అయి పునిస్త్రీలు అయిపోయినారు. ఆల్‌రైట్! క్రియేషన్ అనే మాట అయినది. ఆసెంటెన్సు అంతకూ అర్థము చెప్పు.

**వెంక :** మీరొకమాటు చెప్పిన తరవాత నేచెబుతాను.

**గిరీశం:** ఆల్‌రైట్! ప్రపంచములో దేవుడు ప్రతి వస్తువునూ యేదో వొక వుపయోగము కొరకు చేసి యున్నాడు. చేగోడీ యెందుకు చేసినాడూ?

**వెంక :** తినడముకు.

**గిరీశం:** దట్ ఈజ్ రైట్, ఆవులనెందుకు చేశాడు?

**వెంక :** పాలు యివ్వడముకు?

**గిరీశం:** పెర్‌ఫెక్ట్‌లీ రైట్, ఆడవాళ్లనెందుకు చేశాడు?

**వెంక :** వంట చెయ్యడానికి.

**గిరీశం:** నాన్‌సెన్స్. పెండ్లాడడముకూ పిల్లలను కనడముకున్నూ. గనక పెండ్లాడకుండా వున్న వెధవ పిల్లలు దేవుని ఆజ్ఞను అతిక్రమించిన పాపమును చేస్తున్నారు.

(అగ్నిహోత్రావధానులు ప్రవేశించును)

**అగ్ని :** ఏమండీ గిరీశంగారూ మా కుర్రవాడికి చదువు చెప్తున్నారూ?

**గిరీశం:** ఘంటసేపాయి చెపుతున్నానండి.

**అగ్ని :** యేదీ నేను కూడా వింఛాను కొద్దిగా చెప్పండీ.

**గిరీశం:** మైడియర్ బోయ్, గాడ్ మేడ్ క్రియేషన్, సృష్టి యెవడు చేసినాడూ,

**వెంకటేశ :** దేవుడు.

**గిరీశం:** ఫాదర్ ఈజ్ నెక్స్ట్ టు గాడ్. దేవుని తరువాత ముఖ్యం యెవరూ! సే ఫాదర్

**వెంకటేశ :** తండ్రి.

**అగ్ని :** మొత్తము మీద మీ ఇంగ్లీషు చదువు మంచిదిలాగే కనబడుచూన్నది. భాషభేదం గాని మన ముక్కలే వాళ్లవిన్నీ.

**గిరీశం**: వెంకటేశం! దేవుడు సృజించిన ప్రపంచములో యేమి వస్తువులున్నవి. సే కోర్ట్స్.

**వెంకటేశ** : వెధవలు.

**గిరీశం**: నాన్‌సెన్స్, సే కోర్ట్స్.

**అగ్ని** : యిదేమిటండోయి ప్రపంచంలో వెధవలున్నారంచున్నాడు. ఇంగ్లీషు పుస్తకాల్లో యిదేనా యేమిషి వున్నది?

**గిరీశం** : వెధ్వల్ అన్నది లాటిన్ మాటండి – ఆ మాట కర్థం కచేరీలండి. కచేరీలు యెందుకున్నవి?

**వెంకటేశ** : దావాలు తేవడముకు.

**గిరీశం** : దట్ ఈజ్ రైట్ – చూచారండీ మీ వాడికి కచేరీల భోగట్టాలు కూడా నేర్పుతున్నాను.

**అగ్ని** : అయితే మన దావా విషయమై నేనిచ్చిన కాకితాలు సమగ్రంగా చూశారా?

**గిరీశం** : కేసు గెలవడముకు యేమీ అభ్యంతరము లేదు. మీకు తెలియడం కోసం గ్రంథం అంతా తెలుగు చేస్తున్నాను. మామగారూ మీ విషయమై యెంత శ్రమయినా పడి అమలాపురం వెళ్లి అక్కడ కోర్టులో కేసు గెలిపించకపోతే నన్ను పేరుపెట్టి పిలవవద్దు.

**అగ్ని** : యేదో అంతా మిమ్మలినే నమ్ముకుని వున్నాము. యెంత డబ్బయినా కేసు గెలిస్తే చాలును. పెళ్లిపనులకి మీ కుమ్మక్కు వుంటేనే కాని తూగదు సుమండీ.నామీద కోపంచాత కరకటశాస్త్రుల్లూ వాళ్లూ వెళ్లిపోయినారు. వాళ్లు వొచ్చేటట్టు కనపడదు.

**గిరీశం** : మీరు కూర్చున్న దగ్గిరనుంచి కాలుకదపకుండా ఎరేంజిమెంటు యావత్తూ నేను చేస్తాను కాదూ.

(నిష్క్రమించుచున్నారు.)

★★★

**౪వ స్థలము. పెరటిలో జామిచెట్టు కొమ్మ మీద**
**వెంకటేశం కూచుని జామిపండు కొరుకుచుండును.**
**(చెట్టుకొమ్మలు ఆవరించివున్న నూతిలో నీరు బుచ్చమ్మ తోడుతుండును.)**

**బుచ్చమ్మ** : తమ్ముడూ, గిరీశం గారు గొప్పవారర్రా?

**వెంక** : గొప్పవారంటే అలా యిలాగా అనుకున్నావా యేవిఁటి? సురేంద్రనాద్ బెనర్జీ అంత గొప్పవారు.

**బుచ్చమ్మ** : అతగాడెవరు?

**వెంక** : అందరికంటే మరీ గొప్పవాడు.

**బుచ్చమ్మ** : అయితే గిరీశం గారికి వుద్యోగం కాలేదేమి?

**వెంక** : నాన్సన్స్! నువ్వు ఆడదానివి; నీకేం తెలియదు. ఉద్యోగవఁంటే గొప్పనుకుంటున్నావు. ఉద్యోగవంటే యేమిటో తెలిసిందా? సర్వెంట్ అన్నమాట.

**బుచ్చమ్మ** : అనగా యేమిటి?

**వెంక** : సర్వెంటనగానా? నౌఖర్ అన్నమాట. మన గేదెని కాసే అశిరిగాడు ఒక సర్వెంట్. మన యిల్లు తుడిచే అంకి ఒక సర్వెంట్. వీళ్లు మన నౌఖర్లు. పోలీసూ, మునసబూ, తెల్లవాడి నౌఖర్లు. జీతం లావురాగానే గొప్పనుకున్నావా యేవిఁటి? సురేంద్రనాద్ బెనర్జీ, గిరీశం గారూ లాంటి గొప్పవాళ్లు తెల్లవాడి దగ్గిరకాదు, దేవుఁడి దగ్గిరైనా నౌఖరీ చెయ్యమంటే చెయ్యరు. కలక్టరేవంటాడో తెలిసిందా? పోలీసువెళితే "స్టాండ్!" నిలుచో అంటాడు. గిరీశం గారు వొచ్చారంటే షేక్‌హేండ్ చేసి కుర్చీమీద కూచోండి అంటాడు. ఆయనకి హైదరాబాదు నవాబు వెయ్యిరూపాయల పని యిస్తామంటే, నీపనెవడిక్కావాలి పొమ్మన్నాడు.

**బుచ్చమ్మ** : ఆయనకి పెళ్లైందిరా?

**వెంక** : లేదు.

**బుచ్చమ్మ** : తమ్ముడూ, వెధవలు పెళ్లాడ్డం మంచిదంటారుగదా, ఆయనెందుకు పెళ్లాడారు కార్రా?

**వెంక** : నీకు యంతచెప్పినా తెలియదు (గట్టిగా) ఆయన ఉద్యోగం చెయ్యకపోవడం, పెళ్లి మానుకోవడం లోకం మరామత్తు చెయ్యడానికట; యిప్పుడు తెలిసిందా?

**బుచ్చమ్మ** : యలా మరమ్మత్తు చేస్తున్నార్రా?

**వెంక** : నావంటి కుర్రాళ్లకి చదువు చెప్పడం (నిమ్మళంగా) చుట్ట నేర్పడం. (గట్టిగా) నాచ్చికొశ్చన్ అనగా సానివాళ్లనందర్నీ దేశంలోంచి వెళ్లగొట్టడం ఒహటి. నేషనల్ కాంగ్రెస్–అనగా దివాన్గిరీ చలాయించడం ఒహటి. యిప్పుడు తెలిసిందా?

**బుచ్చమ్మ** : ఉద్యోగం చెయ్యరన్నావే? దివాన్గిరీ యే రాజు దగ్గిర్రా?

**వెంక** : యే రాజుదగ్గిరా? – ఆడదానివి నీ కెందుకూ యీ భోగట్టా అంతాను?

**బుచ్చమ్మ** : నువు కూడా లోకం మరమ్మత్తు చాస్తావుప్రా?

**వెంక** : ఓ !

**బుచ్చమ్మ** : ఐతే వెధవముండని కూడా పెళ్లాడతావురా?

**వెంక** : నాన్న తన్నకుండా వుంటే తప్పకుండా పెళ్ళాడతాను; గాని బోడిగుండు చేస్తే మాత్రం నాకక్ఖర్లేదు.

(గిరీశం ప్రవేశించి).

**గిరీశం** : వదినా యీ చెట్టుకింద నిలబడితే మీరు వనలక్ష్మిలా వున్నారు (బుచ్చమ్మ వైపు తేరి చూసును).

**బుచ్చమ్మ** : విన్నారా? తమ్ముడు వెధవని పెళ్లాడతాష్ట!

**గిరీశం** : నా ప్రియశిష్యుడూ, మీకు ప్రియసోదరుడూ అయిన వెంకటేశం విధవా వివాహవేఁ చేసుకుంటే, మేం యావన్మందివిఁన్నీ బ్రహ్మరథం పట్టవాఁ?

**బుచ్చమ్మ** : గురువులుగదా ముందు మీరెందుకు చేసుకోరు?

**గిరీశం**: అడగవలిసినమాట అడిగారు. చెబ్తాను వినండి. మీరడిగినతరవాత చెప్పకపోవడం తప్పని చెబుతున్నాను గాని, యీ మాటలు చెప్పవలసినవి కావు. యేవఁంటారా? నా గొప్ప నే చెప్పుకోకూడదు గదా? అదొహటి. అంతకంటె ప్రమాదమైన మాట మరోటుంది. చూశారా వొదినా! – మొదట్నించీ విధవా వివాహం కూడదు కూడదు అని తప్పు అభిప్రాయంలో పడిపోయివున్న అత్తగారూ, మావఁగారూలాంటి పెద్ద వాళ్లకి యెన్ని శాస్త్రాలూ సవబులూ మనం చెప్పినా, వాళ్లకి నెత్తికెక్కవు. యిలాంటి మాటలు వాళ్లతో మనం చెప్పినట్టాయనా కఱ్ఱుచ్చుకుంటారు. మావఁగారు వేదం మట్టుకే చదువుకున్నారు గాని నేను శాస్త్రాలు అన్నీ చదువుకున్నాను. అబ్బో, నేను మనశాస్త్రాల్లో వుడ్డోలుణ్ణి. శాస్త్రకారుడు యేవఁన్నాడూ? "బాలాదపి సుభాషితం" అన్నాడు. అనగా మంచిమాట చంటిపిల్లడు చెప్పినా విని ఆ ప్రకారం చెయ్యండయ్యా అన్నాడు. అయితే మన పెద్దవాళ్ళు శాస్త్రంలో చెప్పిన ప్రకారం నడుస్తారూ?

యంతమాత్రం నడవరు. మనం శాస్త్రమూ, సవబులూ చూపిస్తే యావఁంటారు? యీ గుంట వెధవలు చెప్పడం మనం విండవూనా అని కఱ్ఱుచ్చుకుంటారు. నా మాట కేవిఁచప్పకండి, నాది యినుంలాంటి శరీరం–కొడితే కఱ్ఱ విరిగిపోవాలి గాని చెక్కు చదరదు. నా ప్రియ శిష్యుడికైతేనో? మీ అందరివీ మెత్తని మృదువైన శరీరాలు అవుట చాత యెవిఁకలు విరిగిపోతాయి. గనక యీ మాటలు మన్లో మనం అనుకోవలసినవే గాని మరోళ్ళతో ప్రాణం పోయినా అనవలసినవి కావు. యావఁంటారు?

**బుచ్చమ్మ :** అవును.

**గిరీశం:** అవునంటే చాలదు. యవరితోనూ యీ మాటలు చెప్పనని మీరంటేనే గాని, నా మనసులో మాటలు నాలుగూ యెలా చప్పడం?

**బుచ్చమ్మ :** యవరితోనూ చప్పను.

**గిరీశం:** వొట్టేసుకోవాలి.

**బుచ్చమ్మ :**యావఁని వొట్టేసుకునేది?

**గిరీశం:** యావఁనా? మీరు యవరితోటైనా చెబితే నా బుఱ్ఱ పగిలిపోవాలని వొట్టేసుకొండి.

**బుచ్చమ్మ :** అహఁ! అలా వొట్టేసుకోను! మీ బుఱ్ఱ చల్లగా వుండాలి. చెబితే నాబుఱ్ఱే పగిలిపోవాలని వొట్టేసుకున్నాను.

**గిరీశం:** అందుకు నే వొప్పుతానా యేవిఁటి? నా బుఱ్ఱ పగిలింతరవాత మీబుఱ్ఱ జోలికి యవడైనా రావాలి గాని, మీ ప్రాణానికి నా ప్రాణం అడ్డు వెయ్యనా?

**బుచ్చమ్మ :** మా అమ్మని బతికించారు కారా? మీరు ఆలాంటి వారే.

**గిరీశం:** ఆ మాట మీరే అన్నారు గనక, వినండి – చెప్తాను. నేను పెళ్ళాడి పెళ్లాం బిడ్డలూ నాకుంటే, వాళ్లని తల్చుకున్న తరవాత ప్రాణానికి తెగించి మీ అమ్మని తియ్యడానికి నూతులోకి గెంత గలిగివుందునా? యీ జన్మవఁంతా లోకోపకారం కింద వినియోగ పర్చు కుందావఁని నిశ్చయించుకుని యిదివరదాకా ఏకాకినైవుంటిని. సత్యమే. మీలాంటి నా మేలుకోరిన వాళ్ళు "పెళ్లిచేసుకో" అంటే ఆ మాట తోసేయడం కష్టమే; గాని ఒక మాట మాత్రం జవాబు న్యాయంగా చప్పండి. ఒక్కళ్లకి ఉపకారం చెయడం గొప్పా? అందరికీ ఉపకారం చెయడం గొప్పా?

**బుచ్చమ్మ :** అందరికి చెయ్యడవేఁ గొప్పనుకుంటాను.

**గిరీశం:** సరే! ఆ మాట మీద నిలవండి. పెళ్లాడి, ఆలూ బిడ్డలికి, ముచ్చకాయ ముగ్గురికి ఉపకారం చెయడం కంటే లోకోపకారం కింద యీ ప్రాణం వినియోగపర్చడం పుణ్యం కాదా? చచ్చే కాలానికి స్వర్గం యెదురుగుండా వొస్తూందే?

**బుచ్చమ్మ** : లోకానికి యేం ఉపకారం చాస్తారు?

**గిరీశం**: అలా అడగండి. సోషల్ రిఫారమ్. సోషల్ రిఫారమ్ అంటే సంఘ సంస్కారం. అసలు యింగిలీషు మాట యంత అర్థవౌఁతుందో, మీకు, దాని తర్జుమా కూడా అంతే అర్థం అవుతుంది. విప్పి చెప్పాలంటే ఒక సిమిలీ, అనగా ఉపమానం చెప్పి మీకు బోధపరుస్తాను. లోకం తప్పు తోవలో వెళ్లుతూంటే ఆ తోవలోంచి మళ్లించి మంచితోవలో పెట్టడమనేది సోషల్ రిఫారమ్.

**బుచ్చమ్మ** : యేమిటా తప్పుతోవ?

**గిరీశం** : జారూ బురదాగట్లూ గతకలూ వున్న తోవ యలా వుంటుందో యిప్పుడు మనవాళ్ల ఆచారాలు అలా వున్నాయి; ఆ తోవలోంచి బండీ తప్పించి మంచి దిమ్మిసాకొట్టిన హైరోడ్డులోకి మళ్లించాలి. ఆ బండికి రెండు చక్రాలు. ఒకటి విధవా వివాహం, రెండు నాచిక్వొశ్చన్, అనగా సానివాళ్లని హతవాఁర్చడమున్నూ ఈ రెండే రాజమార్గాలు.

**బుచ్చమ్మ** : మనవాళ్ల దురాచారాలేవిఁటో నాకు బోధపడలేదు.

**గిరీశం**: ఐతే చెబుతాను వినండి. ముసలాళ్లకి చిన్న పిల్లల్నిచ్చి పెళ్లి చెయ్యడం ఒకటి. డబ్బుకి పిల్లల్ని అమ్ముకోవడం ఒకటి. అవునంటారా కాదంటారా?

**బుచ్చమ్మ** : అవును.

**గిరీశం**: ఆ ముసలాళ్లు ఛస్తే కష్టం సుఖం యరగని పసి పిల్లలు వెధవలు అవుతారు. ఉప్పూ, పులుసూ తినడం చాత యేమీ యరగని పసిపిల్లలు పూర్ణయవ్వనం వొచ్చిన తరవాత మనసు పట్టలేకపోతే వాళ్లదా తప్పు? "వెధవ వివాహం కూడదూ, గిధవ వివాహం కూడదూ" అని ఓర్వలేని మాటలు చెబుతూ, డబ్బుకాసించి, ముసలి పెళ్లిళ్లు చేసే మూర్ఖుల్దా తప్పు? వూరుకుంటారేం?

**బుచ్చమ్మ** : నాకు తెలియదు.

**గిరీశం**: అవుఁను మరి మీరేవఁనగల్రు? తల్లినీ తండ్రినీ యేవఁనుకున్నా మనసులో అనుకుని జీర్ణించుకోవాలి గాని, మీలాంటి మంచివాళ్లు పైకంటారా? నాలాంటి వాణ్ణి, యేవఁండీ మావఁగారూ, పిల్లల్ని రూపవంతుడూ, యవ్వనవంతుడూ, బుద్ధి మంతుడూ అయ్ని కుర్రవాడికి యిమ్మని శాస్త్రంలో వుంది గదా, శాస్త్రానికి విరుద్ధంగా యెందుచాత డబ్బుకక్కుర్తిపడి ముసలాళ్లకి కట్టబెడుతున్నారయ్యా? శాస్త్రంలో "వెధవలికి పెళ్ళి చెయ్యవలసినది, చెయ్యవలసినది" అని శాశించి చెప్పి వుండగా యెందుకు చెయ్యరయ్యా అని అడిగితినట్టాయనా, అర్థచంద్ర ప్రయోగం చేసి అవతలికి గెంటుతారు. అంచాత

"శాంతంభోషాణపెట్ట" అనుకుని నోరు మూసుకు వూరుకున్నాను. యిహ నాచ్చి కొశ్చన్ మాట వినండి. సానివాళ్ళని హతవాఁర్చడం మంచిదంటారా కారా?

**బుచ్చమ్మ** : వాళ్లని చంపేస్తారా యేవిఁటి?

**గిరీశం**: చంపక్కర్లేదు, "పొమ్మనక్కర్లేదు, పొగబెడితే" చాలునన్నట్టు సానివాళ్లని పెళ్లిళ్లకు పిలవకపోవడం, వాళ్లిళ్లకి వెళ్లకపోవడం, వాళ్లని వుంచుకోకపోవడం పైం చెప్పిన పనులు చేసేవాళ్లని కనపడ్డ చోటల్లా తిట్టడం, యిలా నాలాంటి బుద్ధిమంతులంతా ఒహటై కొంతకాలం చేసేసరికి, కలికంలోకైనా మరి సాంది వుండదు. లేకుంటే చూడండి. మన వెంకటేశం పెళ్లికి తప్పకుండా సానిమేళం తెస్తారు. నే యెరుగుదును. కూడదన్న పనల్లా మావఁగారు చాస్తారు, కూడిన పని మానేస్తారు. సానిమేళం తావడ మనేది డబ్బిచ్చి తద్దినం కొనుక్కోవడమన్నమాట కాదా? పెళ్లి నాటికి నా ప్రియ శిష్యుడికి కొంచెం యీడొస్తుంది గదా. ఆ సానిముండలు యట్టిగా బుట్టిగా వుండడం చూసి, పెళ్లాం మీద అసహ్యం పుట్టి "యీ పసిపిల్ల యదగడవెఁప్పుడు, కాపరానికి రావడవెఁప్పుడు, యీ సానివాళ్లు మామజాగా వున్నారని వాళ్లని వెంకటేశం వుంచు కుంటే కొంప మునిగిపోతుంది గాని తరవాయి వుండిపోతుందా? యేవఁంటారు?

**బుచ్చమ్మ** : అవును నిజవేఁ

**గిరీశం** : గనుక లోకం బాగుపడేటందుకుగాను వెధవలికి పెళ్లి చెయ్యడానికి, సానివాళ్లని సాగనంపడానికి వీరకంకణం కట్టాను. మరే వచ్చి, మీ తమ్ముళ్లాంటివాళ్లకి అనేకులికి విద్యాబుద్ధులు చెప్పుతున్నాను. గజీతగాణ్ణి ఔటచేత నూతుల్లో గోతుల్లో పడ్డ వాళ్లని పైకి తీస్తాను. యింకా నాషనల్ కాంగ్రెస్ ఒహటుంది గాని అందులో నే చేసేపని చాంతాడంత వ్యాఖ్యానం చేస్తే గాని మీకు బోధ పడదు. పరిపరి విధాల లోకోపకారం చేస్తున్నాను.

**బుచ్చమ్మ** : యీ పనులన్నీ పెళ్లి చేసుకుంటే మాత్రం చెయ్యకూడదా?

**గిరీశం**: యలా జెయడం? లోకవఁంటే యేవిఁటి గంజిగుంట అనుకున్నారా? యేషియా, యూరోప్, ఆఫ్రికా, అమెరికా, ఆష్ట్రలేషియా అని, ఐదు ఖండాలు. అందులో అమెరికాలో మనుష్యులు బుఱ్ఱకిందికీ కాళ్లు పైకీ పెట్టి నడుస్తారు. యిక్కడ పగలు గదా యిప్పుడు? అక్కడ రాత్రి. నార్త్‌పోల్ అని మరో దేశం వుంది. అక్కడ ఆర్నెల్లు పొగలే; అప్పుడు మరి రాత్రుండదు. ఆర్నెల్లు రాత్రే; అప్పుడు మరి పొగలుండదు. అక్కడేవిఁ టనుకున్నారు? సముద్రం అంతా మంచు కెరడైపోతే లేళ్లని బళ్లకి కట్టి సవారీఐ, వాయువేగ మనోవేగంగా వెళతారు. యిన్ని దేశాలకీ వెళ్లి అక్కడి వాళ్లకల్లా ఉపకారం

చేస్తే గదా లోకోపకారం అవుతుంది. పెళ్లాం బిడ్డలు వుంటే వాళ్లని వొదిలి యలా పోవడం? అయితే పెళ్లాడమని మీరు చెప్పిన మాట కూడా సుతలామూ కొట్టి పారెయ కూడదు. లోకానికోసం బతకడం ఉత్తమం. అయితే లోకం అంతా యంత విలవో అంత కన్న యెక్కువ విలవైన రత్నం లాంటి ఆడమనిషి దొరికితే, తప్పకుండా పెళ్లాడవలిసిందే. యీ వూరొచ్చేవరకూ నాకలాంటి దివ్య సుందర విగ్రహం, కనపళ్లేదు. మొహవెఁదట చెప్పకూడదు. అలాంటి మనిషి ఈ వూళ్లో కనపడ్డది; అందరాని పండుకు ఆశించడవెఁందుకని మనసు మళ్లించుకోడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాను గాని మనస్సు లొంగకుండా వుంది. భగవంతుడేం జేస్తాడో! మనస్సుతో యావఁ ంటున్నానంటే, "ఓ వెఱ్ఱి మనసా! నువ్వు వలచిన చిన్నది ఆణిముత్యవేఁగాని యిన్నాళ్లూ పెళ్లి మానేసి యిప్పుడు "పెళ్లాడదాం, పెళ్లాడదాం" అని యెందుకు సందడిపడతావు? "సంసార సాగరం దుఃఖం, తస్మాజ్జాగ్రత జాగ్రత" అన్నాడు. సంసారంలో పడిపోతే మళ్లీ నీకు లోకోపకారం చెయడానికి అవకాశం వుంటుందా?" అని మనస్సుకి బోధ పరుస్తున్నాను. పెళ్లాడితే లోకోపకారానికి అవకాశం యంతమాత్రం వుండదు. చూశారా వదినా! మాటవరసకి మనం పెళ్లాడతాం అనుకుందాం. సంసారం గడుపుకోవడానికి డబ్బు సంపాదించుకోవాలా? యిదివరకల్లా అంటే బ్రహ్మచర్యం ఆచరిస్తున్నాను. గనక "సత్రా భోజనం, మఠానిద్రా" సరిపోయింది. మాటవరసకి మిమ్మల్ని పెళ్ళాడింతరవాత, అలా సరిపోదే! మనం గాని మావఁగారి మూర్ఖానికి లక్ష్యపెట్టక, యవరితోనూ చప్పకుండా రామవరం వెళ్లిపోయి అక్కడ శాస్త్రోక్తంగా పెళ్లాడావఁంటే, ప్రస్తుతం మట్టుకు విడో మారియేజి సభ వారు మనకి నెలకి నూర్రూపాయలు యిస్తారు. ఓ నాలుగయిదు మాసాలు అలా కాలక్షేపం చేసి, హైదరాబాదులోగాని బడోదాలోగాని ఓ వెయిరూపాయల వుద్యోగం సులభంగా సంపాదించుకుంటాను. హయిదరాబాదు నవాబు నెలరోజుల కిందట పెద్ద ఉద్యోగ విఁస్తానన్నాడు. "నేను ఒకడి దగ్గర నౌఖరీ చేస్తానా?" అని విఱ్ఱవీగి తోసిపారేశాను. మీరు వివాహం చేసుకోమని సలహా యిస్తారని అప్పుడే యెరిగి వుంటే ఆ ఉద్యోగం మించిపోనియ్యకపోదును.

**బుచ్చమ్మ** : మీరు ఉద్యోగం చెయ్యరన్నాడే, తమ్ముడు?

**గిరీశం**: అవును బ్రహ్మచారిగా వుండి లోకోపకారం చేస్తూ వున్నంతకాలం పెళ్లిచేసుకోనని శపథం పట్టాను. గాని, యిప్పుడు నా అదృష్టం వల్ల లోకం అంతటి కన్నా విలవైన వజ్రంలాంటి భార్యా దొరికితే పెళ్లాడక తీరుతుందా? లోకం యొక్క విలవ వెండి అనుకోండి, లోకం వెండైతే మీలాంటి సువర్ణచ్ఛాయగల కుందనపు బొమ్మ,

పఙ్చుండోవన్నె బంగారం అవునంటారా కాదంటారా? బంగారం విలవ యెక్కువా వెండి విలవ యెక్కువా? చప్పండి.

**బుచ్చమ్మ:** బంగారవేఁ యెక్కువ

**గిరీశం:** సరే, మీలాంటి బంగారం బొమ్మె లభించినప్పుడు లోకం గీకం అవతలబెట్టి పెళ్లాడక తీరదుగదా. మాటవరసకి మనం పెళ్ళాడతాం అనుకొండి. పెళ్లాడింతరవాత సంసారం సుఖంగా జరుపుకోవాలంటే లావుగా డబ్బుండాలి గదా? ఉద్యోగం చేస్తే గాని డబ్బులావుగా రాదే?

**బుచ్చమ్మ:** అవును.

**గిరీశం:** అట్టే డబ్బెందుకని అడుగుతారు ఒకవేళ, చెబుతాను వినండి. సంసారానికి యిల్లన్నది ఒకటుండాలి గదా? యేవఁంటారు?

**బుచ్చమ్మ:** అవును.

**గిరీశం:** నాకు మేడలుంటేనే గాని కుదరదు. యిలాంటి చిన్న ఇళ్లలో నాకు ఉక్కిరి బిక్కిరిగా వుంటుంది. ఆ మేడ చుట్టూ తోట వుండాలి. మావిడి చెట్లూ, అరిటి చెట్లూ, జామిచెట్లూ, చెప్పన్ని వృక్షాలూ వేస్తాం. మన వెంకటేశం కోతిలాగ పళ్లు తింటూ యెప్పుడూ ఆ చెట్ల మీదే వుంటాడు.

**వెంక :** ఆ చెట్ల పళ్లన్నీ నేనే కోస్తాను.

**గిరీశం:** అంతవాడివి కావనా? మనం అలాగ యిల్లూ, వాకిలీ, తోటా, దొడ్డీ, యార్పరుచు కునేటప్పటికి మనకి చిన్నపిల్లలు పుడతారు. వాళ్లని సంరక్షణ చెయ్యాలా? వాళ్లు నేను కుర్చీ మీద కూచుని రాసుకుంటూంటే వొచ్చి చెయ్యిబట్టుకు లాగి నాన్నా యిది కావాలి అది కావాలంటారు. మీరు బీరపువ్వుల్లాగ వొంటి నిండా సరుకులు పెట్టుకుని,చక్కగా పసుపూ కుంకం పెట్టుకుని, మహాలక్ష్మి లాగ యింట్లో పెత్తనం చేస్తూ వుంటే ఒక పిల్ల యిటివేపువొచ్చి మెడ కాగలించుకునీ, ఒక పిల్ల అటు వేపు వొచ్చి మెడ కాగలించుకుని "అమ్మా యిది కావాలి, అమ్మా అది కావాలని" అడుగు తారు. వాళ్లకి సరుకూ జప్పరా చేయించాలి, జరీ దుస్తులు కుట్టించాలి. గిరీశం గారి పిల్లల్ని తీసుకురా అని ఒకప్పుడు నవాబుగారి శలవౌతుంది. మన పిల్లల్ని వెంకటేశంలాగ కాయగావంచా, తెల్లచొక్కాయితో పంపించడానికి వల్ల కాదుగదా? వాళ్లకి చిన్నబళ్ళూ, గిళ్లూ కొనాలి. వాళ్లకి చదువూ సంధ్యా చెప్పించి ప్రయోజకుల్ని చెయ్యాలి? యిదంతా సంసార తాపత్రయం కాదా? యిందులో పడిపోతే మరి

లోకోపకారం చెయడానికి అవకాశవుంటుందా? చెప్పడం మరిచి పోయినాను, అప్పుడు మన వెంకటేశం మన దగ్గిరే వుండి చదువుకుంటాడు.

**బుచ్చమ్మ:** అలా అయితే మరి నాన్నకి ఖర్చుండదు. నాన్నా అమ్మా వాడి చదువు కోసం దెబ్బలాడ్రు.

**గిరీశం:** నే వొద్దన్నానా?

**వెంక :** నాకో చిన్న గుఱ్ఱబ్బండి కొనాలి.

**గిరీశం:** వేరే నీకు బండీ యెందుకు? మా పిల్లల బండీలో నువ్వు కూడా వెళ్లుదువు గాని, వాళ్లు అల్లర చెయకుండానూ, కింద పడిపోకుండాను చూస్తూ వుందువు గాని.

**వెంక :** అక్కయ్యని పెళ్లాడేస్తారా యేవిఁటి?

**గిరీశం:** మాటవరసకి అని అంటూంటే, మతిపోయినట్లు మాట్లాడతావేవిఁటి?

**బుచ్చమ్మ:** అంతేకద?

**గిరీశం:** అంతేగదంటే, అంతకంటె అదృష్టం నాకు పట్టడం యలాగ? ఆ మాట మీరు అన్నా, నేను అన్నా, మీ వాళ్లు నన్ను తన్ని తగిలేస్తారు. వెంకటేశం గానీ అన్నట్టాయనా, పెయ్యికట్టుతాడు వుణ్ణే వుంది.

**వెంక :** ఓయి నాయనో! (వీపు తడువుకొనును) గుప్ చప్! నే ఆ వూసెత్తను!

**బుచ్చమ్మ:** మానొస్తం, రాంభొట్లు గారి అచ్చమ్మ మీరు వొప్పుకుంటే మిమ్మల్ని పెళ్లాడతానంది.

**గిరీశం:** పెళ్ళాడడవేఁ వొస్తే, అచ్చమ్మనీ, పిచ్చమ్మ నా పెళ్లాడతాను? యప్పటికైనా "ఒకళ్లతో నాకు పనేవిటి? నా బతుకు సుఖవేఁదో నేను చూసుకుంటాను" అని మీలాంటి దివ్య సుందర విగ్రహమూ, గుణవంతురాలూ, నా మీద కనికరించి "గిరీశంగారూ నన్ను పెళ్లాడండి" అంటే పెళ్లాడతాను గాని అచ్చమ్మల్నీ, పిచ్చమ్మల్నీ మెడకి కట్టుకుని ఉత్తమ బ్రహ్మచర్యం, లోకోపకారం మానుకుంటాననుకున్నారా యేవిఁటి?

**వెంక :** మంచిపండు పడిపోయింది అందుకోండి.

**గిరీశం:** (పండు తీసి) ఆహా యేమి చాయ! వొదినా మీ వొంటి చాయని వుంది యీ పండు, యిందండి.

**బుచ్చమ్మ:** బిందెలో పడెయ్యండి. తమ్ముడూ దిగొచ్చి బిందె యెత్తు.

**గిరీశం:** వాడక్ఖర్లేదు. నేనెత్తుతాన్లెండి (యెత్తి) ఆహా! యేమి వయ్యారం!

(బుచ్చమ్మ నిష్క్రమించును)

శిష్యా! రెండు పళ్లు రాల్చు.

**వెంక** : నాన్నొస్తున్నాడండోయి దిడ్డీతోవ్వేపు. యేవిఁటి సాధనం?

**గిరీశం**: ఆకులు దట్టంగా వున్నవేపు దాగో. నేను యాతాం తోడ్డం ఆరంభిస్తాను.

**(అగ్నిహోత్రావధాన్లు ప్రవేశించి).**

**అగ్ని** : గిరీశం గారూ, నీరు తోడుతున్నారండీ? అసిరిగాడు తోడుతాడే, యింగిలీషు చదువు కున్న వాళ్లు, మీ కెందుకాశ్రమ?

**గిరీశం**: పనివంటి వస్తువ లోకంలో లేదండి. ఊరికే కూచుంటే నాకు వూసుపోదు, మొక్కలకా, మంచిది. నాకా, కసరత్తూ. గవునరు, తోట్లో గొప్పు తవ్వుతాడు. సీవఁరాణీ వారు బీదలూ, సాదలకీ యివ్వడానికి బట్టలు కుడతారు. యింగిలీషువాడు సోమరితనం వొప్పడండి. వాళ్లలో పెద్ద కవీశ్వరుడు షేక్స్పియరు యేవన్నాడో విన్నారా, “డిగ్నిటీ ఆఫ్ లేబర్” అన్నాడు – అనగా కలక్టరు గొప్ప వాడు కాడు; జడ్జీ గొప్పవాడు కాడు, కాయక్లేశపడి కష్టపడే మనిషే గొప్పవాడన్నాడు. అంచాతనే యీ గొప్పదొర్లంతా మెప్పు పొందాలంటే తోటమాలీపని చేస్తారు. చెట్లూ చావఁలూ యెక్కడం వొహటి వాళ్లలో గొప్ప విద్య, లాభం లేని పని యేదీ దొరచెయ్యడండి మావఁగారూ. దొరగారు వూర్నించి వూరికి వెళుతూండగా దాహవేఁస్తుంది – చెట్లని పళ్లుంటాయి. నడి తోవలో చెట్టెక్కడం నేర్చుకోకపోతే దాహంతో చావవలసిందే గదా? యేజన్సీ కమాన్ చేస్తూ వుంటే పెద్ద పులి వొస్తుందనుకోండి. దొరకి చెట్టెక్కడం చాతయితె చపాల్న చెట్టెక్కి ప్రాణం కాపాడుకుంటాడు. అంచేత చదువుతో పాటు చెట్లెక్కడం కూడా నేరుస్తారు.

**అగ్ని** : దొర్ల తరీఫీదంతా అదో చిత్రం. వెంకడు రాసుకుంచున్నాడా, చదువుకుంచున్నాడా అండి?

**గిరీశం**: యింతసేపూ చదువు చెప్పి “చెట్లూ చావఁలూ యెక్కి ఆడుకో” అని తోలేశాను.

**అగ్ని** : మీకేం మతిపోయిందా యేవిఁటండి? కాలూ చెయ్యీ విరుచుకుంటే?

**గిరీశం**: రేపు మన వాడికి గుణుపురం తాసిల్దారీ అయి అడివిలో కమాను వెళ్లుతూ వుండగా పెద్దపులొస్తే చెట్టెక్కలేక, కాళ్లు వొణికి చతికిలబడాలని మీ అభిప్రాయవాఁ యేవిఁటి?

**అగ్ని** : మనవాడికి తాసీల్దారీ అవుతుందండి?

**గిరీశం**: యెందుక్కాకూడదూ? గుఱ్ఱాలెక్కడం, చెట్లెక్కడం మనవాడు నేర్చుకోకపోతే, “నాయనా నువ్వు కమాన్లకి పనికిరావు, దసుకు దగ్గిర కూచుని గుమస్తా పని చేసుకో, తాసిల్దారీ గీసిల్దారీ తలపెట్టకు” అని దొర్లంటారు.

**అగ్ని** : అషైతే చిన్న చెట్లెక్కించండి గాని పెద్దచెట్లప్పుడే యక్కనియ్యకండి.

**గిరీశం**: అంచేతనే జామచెట్టు యక్కమన్నాను. చూశారా?

**అగ్ని** : ఓరి! కోతి వెధవా!

**గిరీశం**: అదుగో తిడుతున్నారూ? దొర్ల చదువు చదువుకుంటే, దొర్ల తరిఫీదు యివ్వక తప్పదు. మీరిలా తిడితే భయపడి కిందపడతాడు; యిలాంటి పనులు మీకిష్టం లేకపోతే, యింగిలీషు చదువు మానిపించి వేదం చెప్పండి.

**అగ్ని** : మరిచిపోయి తిట్టాను. యీ యింగిలీషు వాళ్ల సంగతంతా అదో వెట్టిమొట్టి.

**గిరీశం**: మీవంటి ప్రాజ్ఞులు అలా అండం నాకు ఆశ్చర్యంగా వుంది. వాళ్ల నడవడిక మంచిదవడం చాతనే దేవుఁడు యింత రాజ్యైశ్వర్యం వాళ్లకిచ్చాడు. మనశాస్త్రాల్లో మాటలు మనం మరిచిపోయినావుఁ. ఆ మాటలే తెల్లవాళ్లు దొంగతనంగా పట్టుకు పోయి, శాస్త్రం చెప్పినట్టల్లా ఆచరించి మన రాజ్యం లాగుకున్నారు. మీరు యెరిగిన వారుగదా చెప్పండి, గురువులు దగ్గిర శిష్యులు యేంచేశేవారు? అడివికెళ్లి చెట్లెక్కి, సమిధలు తెచ్చేవారు. రండికీ మొండికి ఓర్చేవారు. యిప్పుడు యింత ప్రాజ్ఞులైన మీరేవఁంటు న్నారూ? మా వాడు యిల్లు కదిలివెళ్లితే కందిపోతాడు, మా వాడు జావఁచెట్టెక్కితే కాళ్లు విరుచుకుంటాడు అని భయపడతున్నారు. మీ శిష్యులు బ్రహ్మాండవైఁన మఱ్ఱిచెట్టు కొనకెక్కి ఆకులు కోసి తెస్తున్నారు కారా? మన పుస్తకాల్లో మర్మం కనుక్కుని దొర్లు బాగుపడుతున్నారు, మన పుస్తకాలు బూజెక్కించి మనం చెడుతున్నాం.

**అగ్ని** : మీకు చాలా తెలుసును. యీ తెల్లవాళ్లు చేసే విద్యలన్నీ మన గ్రంథాల్లోంచి యెత్తుకెళ్లి నవే. యీ రెయిళ్లు, గియిళ్లూ యావత్తు మనవేదంలో వున్నాయిష. మీది మాపరిశీలనైన బుద్ధి. మనకేసు గెలవడానికి మీరు రాసిన సవబులు మా బాగున్నాయి.

**గిరీశం**: యింకా బాగుండును. రికార్డు పూర్తిగా లేదు. కొన్ని కాగితాలు మీరే పారెశారో, మీ వకీలు వుంచేసుకున్నాడో నాకు బోధ పడకుండా వుంది.

**అగ్ని** : నేను పారెయ్యలేదండీ. నాకు యింగిలీషు తెలియకపోవడం చాలా చిక్కొచ్చింది.

**గిరీశం**: మీకే యింగ్లీషు వొస్తె భాష్యం అయ్యాంగార్లా అయిపోరా? యీ మడి తడిపేసి, వున్న కాగితాలు యావత్తుకూ జాబితారాస్తాను, తమరు వెళ్లండి.

**అగ్ని** : మీరు సంసారం పనిపాట్లు యేం శ్రద్ధగా చేసుకుంటారు! మా వాడికి మీలా ప్రయో జకత్వం అబ్బితే నాకొహడి అవసరం వుండదు. దిగేటప్పుడు నిమ్మళంగా సాయం చేసి మరీ దింపండేం? కీడించి మేలించమన్నాడు. (నిష్క్రమించును.)

వెంక : (నిమ్మళంగా) నాన్న యింట్లో కెళ్ళిపోయినాడు.

గిరీశం: నిమ్మళంగా దిగు.

వెంక : (వురికి) బతికించారు. (వెళ్ళిపోబోవును)

గిరీశం: ఆగు ఆగు ఆవొళ్లోపళ్లిలా పట్రా.

వెంక : దొబ్బుతారా యేవింటి అన్నీని? అన్యాయం!

గిరీశం: "అన్యాయం పాపనాశనం" అన్నాడు. ఒక్క అన్యాయంతో పాపాలన్నీ పోతాయి. అన్ని పళ్లూ నువు మాత్రం తింటావాయేమిటి? తింటే స్టమకేక్, కడుపు నొప్పొస్తుంది. కడుపునొప్పొస్తే మీ అమ్మ నోరు పగల్దీసి సోలడు ఆవంరదం వసగుండా గొంతుకలో పోస్తుంది.

వెంక : నేనావందం తాగను.

గిరీశం: అలా అయితే పళ్లట్టే తినకు (యాతాం వొదిలి వెంకటేశం వొళ్లోని కాయలు యెంచుచుండును)

వెంక : (యేడుపు మొహంతో) పెద్ద పళ్లన్నీ దొబ్బుతారా యేవింటి?

గిరీశం: పెద్దవాళ్లకి పెద్దపళ్లూ, చిన్నవాళ్లకి చిన్నపళ్లూ. యింతసేపూ చెట్టెక్కి చిలకలా కొరికావు చాల్దా? (నాలుగు పెద్దపళ్ళు తీసుకొని వెంకటేశం వీపుతట్టి) మైడియర్ బ్రదరిన్లా! యిహ నీ యిష్టవొచ్చినట్టు చెట్లూ చావంలూ యెక్కు యింగిలీషువాడు నేచర్ స్టడీ చెయ్యమన్నాడు. జామచెట్టెక్కి నప్పుడు మాత్రం పండూ, పరువుకాయా, పచ్చికాయా వీట్ల భేదం బాగా స్టడీ చేసి, పళ్లే కొయ్యి, అందులో నాలుగు గురుదక్షిణ కింద నాకియ్యి. లేకుంటే కడుపుబ్బుతుంది. నువ్వొహ మాటు చెట్టెక్కింతరవాత, వలేసి చూసినా మరి పరువు కాయ కనబడదు. "యేరకుమీ కసుగాయలు" అన్నాడు. రనెవే! (వెంకటేశం దాటు వేసి పారిపోవును).

పాచిక పారేటట్టే కనపడుతూంది. హా! యేమి సొగసు!

**క॥ నదమాపొక్కిలి, జాంబూ ।**
**నదమామైచాయ, కోకనదమా పదమా।**
**పదమాజడ, నడుమువియత్।**
**పదమా, నూగారు గూఢ పదమా చెలికిన్॥**

(నిష్క్రమించును.)

# కన్యాశుల్కము

## చతుర్థాంకము

### ౧వ స్థలము : రామప్పంతులు యింటిసావిడి

(రామప్పంతులు కుర్చీమీద కూర్చునివుండగా మధురవాణి నిలబడి తమలపాకులు చుట్టి యిచ్చుచుండును.)

**రామ** : నేనే చిన్నతనంలో యింగిలీషు చదివివుంటే జడ్జీలయదట ఫెళఫెళలాడించుదును. నాకు వాక్ స్థానమందు బృహస్పతి వున్నాడు. అందుచాతనే యింగిలీషు రాక పోయినా నా ప్రభ యిలా వెలుగుతూంది.

**మధు** : మాటలు నేర్చిన శునకాన్ని వేటకి పంపితే ఉసుకోమంటే ఉసుకోమందిట.

**రామ** : నేనా శునకాన్ని?

**మధు** : హాస్యానికన్న మాటల్లా నిజమనుకుంటారేవిఁ?

**రామ** : హాస్యానికా అన్నావు?

**మధు** : మరి మీతో హాస్యవాఁడకపోతే, వూరందరి తోటీ హాస్యవాఁడమన్నారా యేవిఁటి?

**రామ** : అందరితో హాస్యవాడితే యరగవా?

**మధు** : అంచేతనే కుక్కన్నా, పందన్నా, మిమ్మల్నే అనాలి గాని, మరొకర్ని అనకూడదే? మిమ్మల్ని యేవఁనడానికైనా నాకు హక్కు వుంది. యిక మీ మాటకారితనం నాతో చెప్పేదేమిఁటి? మీ మాటలకు భ్రమసే కదా మీ మాయలలో పడ్డాను?

**రామ** : నాకు యింగిలీషే వొస్తే, దొరసాన్లు నా వెనకాతల పరిగెత్తరా?

**మధు** : మీ అందానికి మేము తెనుగువాళ్ళము చాలమో? యింగిలీషంటే జ్ఞాపకవొఁచ్చింది. గిరీశం గారు మాట్లాడితే దొరలు మాట్లాడినట్టు వుంటుందిట.

**రామ** : అటా, యిటా! నీకేం తెలుసును. వాడువొట్టి బొట్లేరుముక్కలు పేల్తాడు. ఆ మాటలుగానీ కోర్టులో పేల్తే చెప్పుచ్చుకు కొడతారు.

**మధు** : అదేమో మీకే తెలియాలి! గాని, గిరీశం గారు లుబ్ధావధాన్లు గారి తమ్ములటా? చెప్పారు కారు!

**రామ** : నీ మనసు వాడి మీదికి వెళుతూందేం? ఐతే నీకెందుకు, కాకపోతే నీకెందుకు?

**మధు** : మతిలేని మాటా, సుతి లేని పాటా, అని.

**రామ** : నాకా మతి లేదంటావు?

మధు : మీకు మతిలేకపోవడవేఁం, నాకే.

రామ : యెం చేత?

మధు : నుదట్ను వ్రాయడం చేత.

రామ : యేవఁని రాశుంది?

మధు : విచారం వ్రాసివుంది.

రామ : యెందుకు విచారం?

మధు : గిరీశం గారు లుబ్ధావధాన్లు గారి తమ్ములైతే, పెళ్లికివొస్తారు; పెళ్లికి వస్తే యేదైనా చిలిపిజట్టీపెట్టి, మీమీద చెయి జేసుకుంటారేమో అని విచారం.

రామ : అవును, బాగా జ్ఞాపకం చేశావు, గాని డబ్బు ఖర్చైపోతుందని అవుఁధాన్లు బంధువుల నెవళ్లనీ పిలవడు.

మధు : గిరీశం గారు పిలవకపోయినా వస్తారు.

రామ : నువుగానీ రమ్మన్నావా యేమిటి?

మధు : మీకంటే నీతి లేదు గాని నాకు లేదా?

రామ : మరి వాడొస్తాడని నీకేలా తెలిసింది?

మధు : పెళ్లికూతురు అన్నకి చదువు చెప్పడానికి కుదురుకుని, వాళ్లింట పెళ్లి సప్తై అంతా ఆయనే చేస్తున్నారట. అంచేత రాకతీరరని తలస్తాను.

రామ : వాడొస్తే యేమి సాధనం?

మధు : నన్నా అడుగుతారు?

రామ : పెళ్లే తప్పిపోతే?

మధు : యలా తప్పుతుంది?

రామ : తప్పిపోడానికి ఒక తంత్రం పన్నాను.

మధు : అయితే, మధురం మాట చెల్లించారే?

రామ : చెల్లించక రావఁప్ప యే చెరువు నీళ్లు తాగుతాడు?

మధు : యేదీ ముద్దు (ముద్దు పెట్టుకొనును.)

రామ : గాని మధురం, కీడించి మేలిద్దాం. ఒకవేళ దెబ్బ బేజోటు అయిపోయి వాడు రావడవేఁ తటస్థిస్తే యేవిఁటి సాధనం?

**మధు** : ఆడదాన్ని, నన్నా అడుగుతారు?

**రామ** : ఆడదాని బుద్ధిసూక్ష్మం. కోర్టు వ్యవహారం అంటే చెప్పు. యెత్తుకి యెత్తు యింద్ర జాలంలా యెత్తుతానూ? చెయిముట్టు సరసవఁంటే మాత్రం నాకు కరచరణాలు ఆడవు.

**మధు** : పెళ్లి నాలుగురోజులూ, తలుపేసుకుని యింట్లో కూచోండి.

**రామ** : ఆడదాని బుద్ధి సూక్ష్మవఁని చెప్పాను కానూ? మా మంచి ఆలోచన చెప్పావు.

**మధు** : గాని, నాకొక భయం కలుగుతూంది. నిశిరాత్రి వేళ పైగొళ్ళెం బిగించి, కొంపకి అగ్గిపెడతాడేమో?

**రామ** : చచ్చావేఁ! వాడు కొంపలు ముట్టించే కొరివి ఔను. మరి యేవిఁగతి?

**మధు** : గతిచూపిస్తే యేమిటి మెప్పు?

**రామ** : "నువ్వు సాక్షాత్తూ నన్ను కాపాడిన పరదేవతవి" అంటాను.

**మధు** : (ముక్కుమీద వేలుంచి) అలాంటి మాట అనకూడదు. తప్పు!

**రామ** : మంచి సలహా అంటూ చెప్పావంటే, నాలుగు కాసులిస్తాను.

**మధు** : డబ్బడగలేదే? మెప్పడిగాను. నేను నా ప్రాణంతో సమానులైన మిమ్మల్ని కాపాడుకోవడం, యెవరికో ఉపకారం?

**రామ** : మెచ్చి యిస్తానన్నా తప్పేనా?

**మధు** : తప్పుకాదో? వేశ్యకాగానే దయా దాక్షిణ్యాలు వుండవో?

**రామ** : తప్పొచ్చింది. లెంపలు వాయించుకుంటాను, చెప్పు.

**మధు** : పెళ్లి వంటలకి పూటకూళ్లమ్మని కుదర్చండి.

**రామ** : ఛబాష్! యేమి విలవైన సలహా చెప్పావు! యేదీ చిన్న ముద్దు (ముద్దు పెట్టుకోబోయి, ఆగి) గాని గిరీశంగాడు నన్నూ దాన్నీ కూడా కలియగట్టి తంతాడేమో?

**మధు** : ఆ భయం మీకక్కరలేదు. పూటకూళ్లమ్మ కనపడ్డదంటే, గిరీశం గారు పుంజాలు తెంపుకు పరుగెత్తుతారు, ఆమె నోరు మహాఁ చెడ్డది.

**రామ** : అవును, నోరే కాదు, చెయ్యి కూడా చెడ్డదే. దాం దెబ్బనీకేం తెలుసును. గాని, మా దొడ్డ సలహా చెప్పావు. యేదీ ముద్దు (ముద్దు పెట్టుకొనును.)

ముద్దు బెట్టుకుంటుండగా లుబ్ధావధాన్లు ఒక వుత్తరము చేతబట్టుకుని ప్రవేశించును.)

**లుబ్ధా** : యేమిటీ అభావ చేష్టలూ!

**రామ** : (గతక్కుమని తిరిగిచూసి) మావాఁ పడుచువాళ్లం గదా? అయినా, నా మధురవాణిని నేను నడివీధిలో ముద్దెట్టుకుంటే, నన్ను అనేవాడెవడు?

**మధు** : నడి కుప్పమీద యెక్కి ముద్దు పెట్టుకోలేరో? పెంకితనానికి హద్దుండాలి, బావగారికి దండాలు, దయ చెయ్యండి (కుర్చీ తెచ్చి వేయును)

**రామ** : నాకు మావఁగారైతే, నీకు బావగారెలాగేవిఁటి?

**మధు** : మా కులానికి అంతా బావలే. తమకు యలా మావఁలైనారో? (లుబ్ధావధాన్లుతో) కూచోరేం? యేమి హేతువో గాని బావగారు కోపంగా కనబడుతున్నారు. రేపు పెళ్లైన తరవాత అక్కగారిని, వీధి తలుపు గడియ వేసి మరీ ముద్దెట్టుగుంటారేమో చూస్తాను గదా? అయినా మీ అల్లుడుగారికి చిన్నతనం యింకా వొదిలింది కాదు.

**రామ** : పైలా పచ్చీసీలో, చిన్నతనం కాక పెద్దతనం యలా వొస్తుంది? యేం మావాఁ! కోపవాఁ?

**లుబ్ధా** : నాకు పెళ్లీవొద్దు పెడాకులూ వొద్దు

**రామ** : (మధురవాణి చెవిలో) చూశావా మధురం, నా యంత్రం అప్పుడే పారింది. (పైకి లుబ్ధావధాన్లుతో) అదేం, అలా అంటున్నారు? నిశ్చయం అయిన తరువాత గునిసి యేం లాభం?

**లుబ్ధా** : నీ సొమ్మేం పోయింది? గునియడం గినియడం కాదు. నాకీ పెళ్లి అక్ఖర్లేదు.

**మధు** : (రామప్పపంతులు చెవిలో) యేమిటా వుత్తరం?

**రామ** : (మధురవాణి చెవిలో) అగ్నిహోత్రావుధాన్లు పేరుపెట్టి నేనే బనాయించాను.

**మధు** : (రామప్పంతులు చెవిలో) యేవఁని?

**రామ** : (మధురవాణి చెవిలో) నువ్వు ముసలవాడివి గనక నీ సంబంధం మాకు వొద్దని.

**మధు** : చిత్రం! చెప్పేస్తాను.

**రామ** : (మధురవాణి చెవిలో) నీకు మతిపోయిందా యేమిటి? పెళ్లి తప్పించమని నువ్వే నా ప్రాణాలు కొరికితే, ఈ యెత్తు యెత్తాను, నోరుమూసుకో.

**మధు** : (లుబ్ధావధాన్లు చెవిలో) యీ సంబంధం మీకు కట్టిపెట్టాలని పంతులు చూస్తున్నారు. వొప్పుకోకండి.

**రామ** : (మధురవాణితో) యేమీ బేహద్బీ! (లుబ్ధావధాన్లుతో) స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః అన్నాడు. దాని మాటలు నమ్మకండి. కల్పనకి యింత మనిషి లేదు.

లుబ్ధా : (చేతిలోని వుత్తరమును ఆడిస్తూ) యీ కుట్రంతా నీదే.

రామ : (తీక్షణంగా మధురవాణి వైపు చూసి, లుబ్ధావధాన్లుతో) కోపం కోపంలా వుండాలి గాని, యేకవచన ప్రయోగం కూడదు.

లుబ్ధా : యిదంతా మీ కల్పనే. నా కొంప ముంచడానికి తలపెట్టారు, చదవండి.

రామ : (వుత్తరం అందుకోక కుర్చీ వెనక్కి తీసుకుని) ఆ వుత్తరం సంగతి నాకేం తెలుసును?

లుబ్ధా : చేసినవాడివి, నీకు తెలియకపోతే, యెవరికి తెలుస్తుంది?

రామ : అదుగో మళ్లీ యేకవచన ప్రయోగం! మెత్తగా మాట్లాడుతున్నానని కాబోలు ఆనాడీ చేస్తున్నారు? వుత్తరం గిత్తరం నేను కల్పించానని, మళ్లీ అన్నారంటే కథ చాలా దూరం వెళుతుంది. ఆ సంగతి మట్టుకు కాని వుండండి. రామప్పంతులు తడాఖా అంటే యేవఁనుకున్నారో?

లుబ్ధా : నువ్వు –

రామ : అదుగో మళ్లీ.

లుబ్ధా : మీ కల్పనైతేనేం, మరొహరి కల్పనైతేనేం, బుద్ధి పొరపాటు నాది. మధ్య వెధవలతో నాకేం పని? వెంటనే బయల్దేరిపోయి, ఆ అగ్నిహోత్రావధాన్లునే అడుగుతాను.

రామ : మాటలు మా జోరుగా వొస్తున్నాయి జాగ్రత. (లుబ్ధావధాన్లు వెళ్లును) నన్నేనా వెధవలు అంటున్నాడు?

మధు : నన్ను కూడా కలుపుకోవాలని వుందా యేవిఁటండి?

రామ : నన్ను మట్టుకు వెధవని కింద కట్టావూ?

మధు : నేవుండగా వెధవలు మీరెలా అవుతారు?

రామ : నన్ను సప్త వెధవని చేశావు. మరి యింకా తరవాయి యేం వుంచావు?

మధు : అదేవిఁటి ఆ మాటలు?

రామ : ఆ వుత్తరం నేను బనాయించానని, ఆ వెధవతో యెందుకు చెప్పావు?

మధు : మీ తోడు, నేను చెప్పలేదే?

రామ : మరి నేను బనాయించానని, వాడికెలా తెలిసింది?

మధు : యెందుకీ ఆందోళన?

రామ : మరి, ఆ వెధవ ఆ వుత్తరం తీసికెళ్ళి అగ్నిహోత్రావుధాన్లుకి చూపిస్తే, నా మీద వాడు వెంటనే ఫోర్జరీ కేసు బనాయిస్తాడే? పీక తెగిపోతుంది? యేవిఁటి సాధనం?

**మధు** : యంత్రం యెదురు దిరిగిందో? ఐతే చక్రం అడ్డువేస్తాను (మధురవాణి తొందరగా వీధిలోకి వెళ్లును)

**రామ** : యిదెక్కడికి పారిపోతూంది? యిదే చెప్పేశింది. దొంగపని చేసినప్పుడు రెండో వారితో చెప్పకూడదు. వెధవని చెవులు నులుపుకుంటాను. పరిగెత్తి వెళ్లి చేతులో కాగితం నులుపుకొత్తునా?– గాడిదకొడుకు కరిస్తే? పోయి మీనాక్షి కాళ్లు పట్టుకుంటాను.

**(మధురవాణి వక చేతితో వుత్తరము, వక చేతితో లుబ్ధావధాన్లు చెయ్యి పట్టుకుని ప్రవేశించును.)**

**మధు** : (రామప్పంతులుతో) చాలు, చాలు, మీ ప్రయోజకత్వం. బావగారికి అన్నా, తమ్ముఁడా, కొడుకా, కొమ్మా! మిమ్మలిని ఆప్తులని నమ్ముకుని, సలహాకి వస్తే, ఆలోచనా సాలోచనా చెప్పక, ఏకవచనం, బహువచనం, అని కాష్టవాదం పెట్టారు. బావా! కుర్చీ మీద కూచోండి. (కుర్చీమీద కూచోబెట్టి) (రామప్పంతులుతో) యీ వుత్తరం యేవిఁటో నింపాదిగా చదివి చూసుకోండి. (వుత్తరం రామప్పంతులు చేతికి యిచ్చును.)

**రామ** : (వుత్తరం అందుకుని తనలో) బతికాన్రా దేవుఁడా (చూచుకొని). అరే నా ఉత్తరవేఁ కాదే యిది. నా నీడ చూసి నేనే బెదిరాను (పైకి) మావాఁ! వొస్తూనే తిట్లతో ఆరంభిస్తే యెంతటి వాడికైనా కొంచం కోపం వొస్తుంది. నెమ్మదిగానూ, మర్యాదగానూ నన్నొచ్చి యేం సహాయం చెయమంటే అది చెయనూ?

**లుబ్ధా** : మరైతే యీ పటాటోపం వొద్దని రాయండి. అతగాడికి పటాటోపం కావలిస్తే ఆ ఖర్చంతా అతగాడే పెట్టుకోవాలి.

**మధు** : (లుబ్ధావధాన్లు, జుత్తు ముడి విప్పి దులిపి) యేం ధూళి! సంరక్షణ చేసేవాళ్ళు లేకపోబట్టి గదా? (గూటిలో నుంచి వాసననూనె దువ్వెనా తెచ్చి తలదువ్వుచుండును.)

**రామ** : (ఉత్తరం తిప్పి కొసచూసి చదువును) "శేవకుడు తమ్ములు గిరీశం" – వీడా!

**మధు** : పైకి చదవండి.

**రామ** : నీ గిరీశం, అనగానే పైకి చదవాలేం?

**మధు** : అయితే, మీరే చదువుకు ఆనందించండి.

**లుబ్ధా** : "నీ గిరీశం" అన్నారేం?

**రామ** : అది వేరే కథ.

**లుబ్ధా** : పైకి చదవండి.

**రామ** : (చదువును)

"శేవకుడు, తమ అత్యంత ప్రియ సోదరులు గిరీశం అన్కే నమస్కారములు చేసీ చాయంగల విన్నపములు, త॥ యీ నాటికి వృద్ధాప్యంలో నయినా మీరు తిరిగీ వివాహం చేసుకుని ఒక యింటివారు కావడమునకు నిశ్చయించితిరన్నమాట విని యమందానందకందళిత హృదయారవిందుడ నైతిని".

**లుబ్ధా** : వెధవ, వృద్ధాప్యవంఁట్టాడూ? మొన్నగాక మొన్ననే గదా యాభై దాటాయి.

**మధు** : (దువ్వెన మొలను పెట్టి, లుబ్ధావధాన్లు జుత్తు ముడి వేసి) సంరక్షణ లేక యిలా వున్నారు గాని, యవరు మిమ్మల్ని ముసలివాళ్లనేవారు?

**రామ** : (చదువును) "మీకు కాబోవు భార్య, నా ప్రియ శిష్యుండగు వెంకటేశ్వర్లు చెలియలగుటం జేసి నాకు బ్రహ్మానందమైనది. నేను అగ్నిహోత్రావధానులవారి యింటనే యుండి పెళ్లి పనులు చేయించుచున్నాడను. వారు నన్ను పుత్రప్రాయముగా నాదరించుచున్నారు. బహు దొడ్డవారే గాని చంద్రునకు కళంకమున్నటుల వారికి కించిత్తు ద్రవ్యాశా, కించిత్తు ప్రథమకోపముం గలవు".

వ్యాకరణం వెలిగిస్తున్నాడయ్యా గుంటడూ!

"షరా – ఆ కోపం వొచ్చినప్పుడు మాత్రం యెదట పడకుండా దాగుంటే యెముకలు విరగవు. ప్రాణం బచాయిస్తుంది. మరేమీ ఫర్వా వుండదు – ద్రవ్యాశ అనగా, అది వారికి గాని మీకు గాని ఉపచరించేది కాదు. మీ వూరివారెవరోగాని ఒక తుంటరి, మీరు విశేష ధనవంతులనియు, పెళ్లి దేవదుందభులు మ్రోయునటుల చేతురనియు, వర్తమానము చేయుటను, యేబది బండ్ల మీద యీ వూరి వారి నందరిని తర్లించుకు రానైయున్నారు. ఇంతియకాక, దివాంజీ సాహేబు వారినడిగి, ఒక కుంజరంబునూ, మూడు లొట్టియలనూ, యేను గుఱ్ఱంబులం గూడ తేనైయున్నారు. బంగారపుటడ్డల పల్లకీ గూడ దెచ్చెదరు.

"షరా – దానిమీద సవారీఐ, ఆలండౌ లత్తులతో వూరేగి, మీరు పెళ్లిచేసుకోవడం నాకు కన్నుల పండువే గాని, యిదంతా వృధా వ్యయం కదా, అని నాబోటి ఆప్తులు విచారిస్తున్నారు. యెద్దుపుండు కాకికి రుచి, రామప్పంతులు సొమ్మేంబోయింది?"

వెధవ! నావూసెందుకోయి వీడికి?

"యిందులో ఒక పరమ రహస్యం. అది యెద్దియనిన, యీ రామప్పంతులు చిక్కులకు, జాకాల్; తెలివికి, బిగ్ యాస్".

యిదేవిఁటోయి, యీ బొట్లేరు యింగిలీషు!

"అనగా"

వ్యాఖ్యానం కూడా వెలిగిస్తున్నాడయా!

"జాకాల్, అనేది, గుంటనక్క"

పింజారీ వెధవ!

"బిగ్‌యాస్, అనగా, పెద్ద -"

వీడి సిగాదరగా! యేం వీడి పోయీకాలం! వీడిమీద తక్షణం డామేజీ దావా పడేస్తాను.

(మధురవాణికి నవ్వొచ్చి, ఆపుకోజాలక, విరగబడి నవ్వును.)

యెందుకలా నవ్వుతావు? నీ మొగుడు నన్ను తిడుతున్నాడనా ఆనందం?

**మధు** : (నవ్వు చేత మాట తెమలక, కొంతసేపటికి) కాదు - కాదు - మీతోడు - లొటి -

**రామ** : నా తోడేవిఁటి! నేను చస్తే నీకు ఆనందవేఁ!

**మధు** : (ముక్కుమీద వేలువుంచి, రామప్పంతులు దగ్గరకు వెళ్ళి, సిరస్సు కౌగలించుకొని, ముద్దెట్టుకొనును) యేమి దుష్టుమాటా!

**రామ** : మరెందుకు నవ్వుతావ్?

**మధు** : లొటి - లొటి - లొటి-

**రామ** : యేమిటా "లొటి"?

**మధు** : లొటి - పిట -

**రామ** : అవును, లొటిపిట, అయితే?

**మధు** : (సమాళించుకుని) యెందుకో?

**రామ** : యెందుకో నాకేం తెలుసును?

**లుబ్ధా** : ఉత్తరంవల్ల మీరే తెమ్మన్నట్టు అగుపడుతూందే?

**రామ** : నేనా? నేనా? నాకెందుకూ లొటిపిట?

**మధు** : (ఉప్పెనగా తిరిగీ నవ్వుతూ) యెక్కడానికీ.

**రామ** : నేనా యెక్కడం?

**మధు** : యెందుకు కూడదూ? మీరొక లొటి - పిట - బావగారొక లొటిపిట- పో - పో - పోలిశెట్టి -పెళ్ళి సప్లయిదారుడు గనక, అతడో లొటిపిట - యెక్కి పొలాలంట -

వూరేగండి-వెన్ను కుప్పెక్కి - ఆ వైభవం- కళ్ళారా - చూస్తాం - (మిక్కిలిగా నవ్వును, నవ్వు సమాళించుకుని) బావగారూ, క్షమించండి - ఆ దుష్ట వ్రాతకి నవ్వాను - మరేంగాదు.

**రామ** : దుష్టంటే దుష్టా! గాడిద!

**లుబ్ధా** : మీరొహ, పెద్ద గాడిదని కూడా తెమ్మన్నారని కాబోలు, రాశాడండీ.

**రామ** : లేదు, లేదు, గాడిదె మాట వుత్తరంలో యక్కడా లేదు.

**లుబ్ధా** : వుంది. నేను చదివానండీ గాడిదనెందుకు తెమ్మన్నావయ్యా నానెత్తి మీదికీ?

**రామ** : నీకు మతిపోతూందా యేమిటి? గాడిద మాట లేదంటూంటేనే? (మధురవాణి తిరిగీ నవ్వుచుండును) నీక్కూడా మతిపోయిందీ? యెందుకా నవ్వు? నన్ను చూశా? అవుధాన్లును చూశా?

**మధు** : యెందుకు - ఆ - అనుమానం? - సామెత - వుంది.

**రామ** : యేమిటా సామిత గీమితాను?

**మధు** : గాడిద అందిట-పాటకి నేను - అందానికి - మా అప్పా - అందిట -

**రామ** : అంటే?

**మధు** : పెళ్ళికి గాడిద - లొటిపిటా మాట యిన్నాళ్ళకి - మళ్లీ విన్నానుగదా అని.

**రామ** : వింటే?

**మధు** : నవ్వొచ్చింది. మీరు కూడా నవ్వరాదూ? యెందుకీ దెబ్బలాట?

**రామ** : వీడి మీద డామేజీ దావా వెంటనే పడేస్తాను.

**మధు** : (లుబ్ధావధాన్లుతో) బావా, యెందుకు మా పంతులు గారి మీద అన్యాయంగా అనుమానం పడతారు? ఆయన నిజంగా మిమ్మల్ని అన్నగార్లా భావించుకుంటున్నారు. గిరీశంగారు పంతులు మీద వ్రాయడానికి కారణాంతరం వున్నది. మీతో చెప్పవలిసిన సంగతి కాదు గాని, మీ ఉభయులకూ స్నేహం చెడడానికి సిద్ధంగా వున్నప్పుడు చెప్పక తీరదు. మీ గిరీశం గారు నాకు కొన్నాళ్లు యింగ్లీషు చెప్పేవారు. కొద్ది రోజులు నన్ను వుంచుకున్నారు. మా పంతులుగారు ఆయన దగ్గిర నుంచి నన్ను తీసుకువెళ్లి పోయి వచ్చినారనే దుఃఖం చేత లేనిపోని మాటలు కల్పించి "నక్కా గిక్కా" అని వ్రాశారు గాని, ఆ బొల్లి మాటలు నమ్మకండి.

**రామ** : "నక్కా గిక్కా" వొట్టినే పోతుందనుకున్నావా యేమిటి? డామేజీ దావా పడ్డతరవాత దాని సంగతి తెలుస్తుంది.

**మధు** : బావా, మరొకమాట ఆలోచించండీ. పంతులకేం లాభం యేనుగులూ, లొటిపిటలూ, గాడిదలూ – (నవ్వును.)

**రామ** : మనిషివి కావా యేమిటి? గాడిదె మాట లేదంటూంటేనే?

**మధు** : పోనియ్యండి – మీకెందుకు కోపం! గాడిదలు లేకపోతే కడంవ్వే ఆయెను. యివన్నీ మీ యింటి మీద పడి తింటే మా పంతులుగారికి యేం లాభం? చెప్పండీ. ఒకవేళ రాతబు బేరం జరుగుతుంది గనక పోలిశెట్టికి లాభించవచ్చును.

**లుబ్ధా** : బాగా చెప్పావు – పోలిశెట్టి చేసినపనే!

**రామ** : చవగ్గా చేస్తాడని ఖర్చు వెచ్చం కోవఁటాడి మీద పెట్టావు. అనుభవించు.

**మధు** :యిప్పుడు మించిపోయినదేమి? పెళ్లికూతుర్ని పంపిస్తే పది రూపాయలు ఖర్చుతో యిక్కడ ముడి పెట్టేస్తాం. మీరెవరూ రావద్దని, మీ మావఁగారి పేర వుత్తరం వ్రాయండి.

**లుబ్ధా** : మా ప్రశస్తమైన ఆలోచన చెప్పావు. మావఁగారూ, మధురం మా బుద్ధిమంతురాలు.

**రామ** : అదుగో! "మధురం గిధురం" అని మీరు అనకూడదు. "మధురవాణి" అనాలి.

**లుబ్ధా** : పొరపాటు–గాని తీరా మోసి వాళ్లు పెళ్లికూతుర్ని ఒక్కర్తైనీ పంపించేస్తే ?

**మధు** : మరేం? మీ తీపు దిగదీసిందీ? పెళ్లి చేసుకోండి.

**లుబ్ధా** : నా ప్రాణం పోతే ఈ సంబంధం చేసుకోను. ఆ వుత్తరం కొసాకూ చదివితే అభావచేష్టలు మీకే బోధపడతాయి.

**మధు** : చదవడం మానేసి యేమిటి ఆలోచిస్తున్నారు?

**రామ** : గిరీశం గాడిమీద పరువునష్టానికి డామేజీ దావా తేకమాన్ను – వాడి మొహంలాగే వుంది వుత్తరం. చదివేదేవిఁటి.

**లుబ్ధా** : మా వెధవ నా పరువు మాత్రం యేమైనా వుంచాడనా? అయినా తరవాయి చదవండీ.

**రామ** : (చదువును) తాజాకలం. చిన్నది బహులక్షణంగా వుంటుంది. గాని కొంచెం పెయ్యి నాకుడు మాత్రం కద్దు. అద్దానిని మనవారు వైధవ్యహేతువ అంద్రు. యిది వట్టి సూప–సూపర్–స్టి–షన్ అనగా, తెలివి తక్కువ నమ్మకం. మనవంటి ప్రాజ్ఞులు లెక్కించవలసినది కాదు. షరా – దీనికి వక చిన్న బైరాగీ చిటికీ వున్నది. చిమ్మిటతో పెయ్యి నాకుడు వెండ్రుకలూడబీకి, ఒక పౌ–పౌడర్ అనగా, గుండ కద్దు; ఆ గుండ ప్రామినచో మరల పెయ్యినాకుడు పుట్టనేరదు. ఈ లోగా దైవాత్తూ వైధవ్యంబే సంప్రాప్తించినచో, పదే పదే క్షౌరంబౌనుగావున పెయ్యినాకుడు బాధించనేరదు. రెండవ

నెంబరు షరా – ఒకవేళ వైధవ్యం తటస్థించినా, మా వదెనగారు జుత్తు పెంచుకునే యడల, మీరేం జెయ్యగలరు; నేనేం జెయ్యగలను?"

**మధు** : చాల్చాలు; యీపాటి చాలించండి. గిరీశం గారు యేం తుంటరి?

**రామ** : యిప్పుడైనా వాడి నైజంనీకు బోధపడ్డదా? (చదువును) మూడవ షరా –యీ రోజుల్లో స్త్రీ పునర్వివాహం గడబిడ లావుగా నున్నది. తమకు విశదమే. మీరు స్వర్గంబునకుం బోయి ఇంద్రభోగంబనుభవించుచుండ నామెకు పునర్వివాహము చేసికొన బుద్ధి పొడమ వచ్చును. అదిమాత్రం నేను ఆపజాలనని స్పష్టముగా తెలియునది. ఏలననిన ?వద్దని మందలించుటకు ఎదట పడితిమో, "మీయన్న స్వర్గంబున రంభతో పరమానందంబు నొందుచునున్నారు కదా, నా గతేమి" అని యడిగినచో నేమి యుత్తర మీయువాడ?

**మధు** : మరి చాలించండి.

**రామ** : నీ యిష్టం వచ్చినప్పుడు చదివి, నీ యిష్టం వొచ్చినప్పుడు మానేస్తాననుకున్నావా (చదువును)

నాల్గవ షరా – కొదువ అన్ని హంశములూ బహు బాగావున్నవి. తప్పకుండా యీ సంబంధం మీరు చేసుకోవలిసిందే. మీ అత్తగారు సాక్షాత్తూ అరుంధతి వంటి వారు. మనలో మనమాట, ఆమెకు యీ సంబంధం యెంత మాత్రమూ యిష్టము లేదు. పుస్తెకట్టే సమయమందు, మీ యింటి నూతులో పడి ప్రాణత్యాగం చేసుకుంటానని, యిరుగు పొరుగమ్మలతో అంటున్నారు, గాని ఫర్వాలేదు. ఆ నాలుగు గడియలూ, కాళ్లూ చేతులూ కట్టేదాం. మూడు ముళ్లూ పడ్డ తరవాత నూతులో పడితే పడ నియ్యండి. మనసొమ్మేం బోయింది? పోలీసు వాళ్ల చిక్కు లేకుండా మాత్రం, వాళ్ల కేమైనా పారేసి వాళ్లని కట్టుకోవలసివస్తుంది. యీ సంగతులు యావత్తూ మీ మేలుకోరి వ్రాసితిని. యిక్కడ వారికి తెలియరాదు. మరిచిపోయినాను. పిల్లజాతకం అత్యుత్కృష్టంగా వుందట. ఆ బనాయింపు కూడా రామ –"

**మధు** : రామ?

**రామ** : అది ఆడవాళ్లు వినవలసిన మాట కాదు.

**లుబ్ధా** : అది కూడా మీరే బనాయించారంటా దేవిటండీ?

**రామ** : వాడి నోటికి సుద్దీ బద్ధం వుందీ? డామేజీ పడితే గాని కట్టడు.

**లుబ్ధా** : కొంచం అయినా నిజం వుండకపోతుందా, అని నా భయం. అత్తగారికి యిష్టం లేదని పోలిశెట్టి కూడా చెప్పాడు. యీ సంబంధానికి వెయివేలదణ్ణాలు; నాకొద్దుబాబూ.

**మధు** : బాగా అన్నారు. మీ సంబంధం మాకు యెంతమాత్రం వొద్దని, మీ మావఁగారి పేర వ్రాయండి. కాకితం కలం తేనా?

**లుబ్ధా** : మావాఁ! మరి ముందూ వెనకా ఆలోచించకవెంటనే వుత్తరం రాసి పెట్టండీ. (నిలబడి మధురవాణి చెవిలో రహస్యము మాట్లాడును; మధురవాణి లుబ్ధావధాన్లు చెవిలో మాట్లాడును).

**రామ** : మొహంమీద మొహం పెట్టి, యేవిఁటా గుసగుసలు?

**పైనుంచి పోస్టుజవాను** – "లుబ్ధావుధాన్లుగారున్నారండీ. వుత్తరంవొచ్చింది"

(మధురవాణి పైకి వెళ్లి వుత్తరము తెచ్చి లుబ్ధావధాన్లు చేతికి యిచ్చును. లుబ్ధావధాన్లు రామప్పంతులు చేతికి యిచ్చును.)

**లుబ్ధా** : సులోచనాలు తేలేదు. మీరే చదవండి.

**రామ** : (తనలో చదువుతూ) మరేవీఁ! చిక్కే వొదిలిపోయింది. మీ మావఁగారి దగ్గిర్నించి.

**లుబ్ధా** : యేవఁని? యేనుగులూ, లొటిపిటలూ తానంటాడా యేవిఁటండి?

**రామ** : మీ సంబంధవేఁ అక్కర్లేదట.

**లుబ్ధా** : యేవిఁటీ? యెంచేతనో? వాడికా అక్కర్లేదు? నాకా అక్కర్లేదు? తన పరువుకి నేం తగనుకానో?

**మధు** : నిమిషంకిందట పెళ్లి వొద్దన్నారే? యిప్పుడు పెళ్లి తప్పిపోయిందని కోపవాఁ?

**లుబ్ధా**: యింకా యేం కూస్తాడో చెప్పండీ.

**రామ** : మీరు పీసిరి గొట్లని యెవరో చెప్పారట.

**లుబ్ధా** : నేనా పీసిరి గొట్టుని? వొక్క పాటున పద్దెనిమిది వొందలు యే పీసిరి గొట్టు పోస్తాడు? యింత సొమ్ము యెన్నడైనా, ఒక్కసారి, అగ్నిహోత్రావుధాన్లు కళ్లతో చూశాడూ? సంసారం పొక్తుగా చేసుకుంటే పీసిరి గొట్టా? వాడిసొమ్ము వాడి నెత్తిని కొట్టిన తరవాత, నేనెలాంటి వాణ్ణి అయితే వాడికేం కావాలి?

**మధు** : యెలాంటివాళ్లేం? బంగారంలా వున్నారు?

**రామ** : మీరు ముసలివాళ్లనీ, మీకు క్షయరోగం వుందనీ కూడా, యెవరో చెప్పారట.

**లుబ్ధా** : నేను ముసలివాణ్ణా వీడి సిగతరగా! యాభైయేళ్లకే ముసలిటండీ? కొంచెం దగ్గు వుండడవేఁ కాగట్టండి (దగ్గును) నిలివెడు ధనంపోసి పిల్లని కొనుక్కున్న తరవాత, మరిదాని ఘోషా, నా ఘోషా వాడి కెందుకయ్యా? డబ్బుచ్చుకున్న తరవాత చచ్చిన శవానికైనా కట్టకతీరదు. మాటా(డేం?

**రామ** : అవును; నిజవేఁ. మీరు ముసలివాళ్లైతే మాత్రం?

**లుబ్ధా** : అదుగో. 'ఐతేమాత్రం' అంటారేవిఁటి? నువ్వేపెట్టావు కాబోలు యీ పెంటంతాను.

**రామ** : అన్ని పెంటలు పెట్టడానికీ, మీ తమ్ముడు గిరీశం అక్కడే వున్నాడుకదూ?

**లుబ్ధా** : వీడు, అక్కడెలా పోగయినాడయ్యా నాకు శనిలాగ?

**మధు** : ఏమి! యీ మగవారి చిత్రం! యింతసేపూ పెళ్లి వొద్దని వగిస్తిరి; యిప్పుడు పెళ్లి తేలిపోయిందని వగుస్తున్నారు. నిజంగా మీకు పెళ్లాడాలని వుందండీ?

**లుబ్ధా** : వుంటే వుంది, లేకపోతే లేదు. గాని యీ దుర్భాషలు నేను పడివూరుకుంటానా?

**మధు** : మరేం జేస్తారు?

**రామ** : యేంజేస్తారా? డామేజీకి దావా తెస్తారు.

**లుబ్ధా** : దావావొద్దు, నీ పుణ్యం వుంటుంది. వూరుకో బాబూ.

**రామ** : కాకపోతే, యింతకన్న చవకైనదీ, సాంప్రదాయవైనదీ, సంబంధం కుదిర్చి, చేసుకున్నా వఁంటే, అగ్నిహోత్రావుధాన్లుని చెప్పుచ్చుకు కొట్టినట్టు వుంటుంది.

**లుబ్ధా** : చవగ్గా కుదరడవెఁలాగ?

**మధు** : నా మాటవిని పెళ్లిమానేసి వూరుకోండి.

**లుబ్ధా** : యేం? ముసలివాణ్ణని నీకూ తోచిందా? యేవిఁటి?

**మధు** : మీరా ముసలివాళ్లు? యవరా అన్నవారు?

**లుబ్ధా** : నీకున్న బుద్ధి ఆ అగ్నిహోత్రావుధాన్లకి వుంటే బాగుండును.

**మధు** : ఓ పన్ను కదిలిందా? కన్నుకు దృష్టి తగ్గిందా? చూడండీ మీ దండలు కమ్మెచ్చులు తీసినట్టు యలా వున్నాయో?

**రామ** : (తన దండలు చూసుకొని) మావఁ పెరట్లో గొప్పు తవ్వడం నుంచి దండలు మోటుగా వున్నాయి; గాని నా దండలు సన్నవైఁనా ఉక్కు ఖడ్డీలు.

**మధు** : (తన చీర కొంగుతో లుబ్ధావధాన్లు ఛాతీ కొలిచి) యెంత ఛాతీ!

**రామ** : యేమిటీ వాళకం?

**మధు** : వుత్తరం, మీలో మీరు చదువుకుంటారేం? పైకి చదవండి.

**రామ** : నువ్వు నన్ను ఆజ్ఞాపించే పాటిదానివా? మేం చదువుకుంటాం. యివి ఆడవాళ్లు విన వలిసిన మాటలు కావు. నువ్వు అవతలకి వెళ్లు.

మధు : నేను కదలను.

రామ : అమాంతంగా యెత్తుకెళ్లి వెనకింట్లో కుదేస్తాను.

మధు : (కుర్చీ వెనకను నిలబడి లుబ్ధావధాన్లు దండలు చేతులతో గట్టిగా పట్టుకుని) మార్కండేయులు శివుణ్ణి చుట్టుకున్నట్లు, బావగార్ని చుట్టుకుంటాను. యెలా లాక్కువెళతారో చూస్తాను.

లుబ్ధా : (తనలో) యేమి మృదువూ చేతులు! తల, తల దగ్గిర చేరిస్తే, యేమి ఘుమ ఘుమా! (పైకి) "బాలాదపి సుభాషితం" అన్నాడు మావఁగారూ – మధురవాణ్ణి వుణ్ణియ్యండి. మంచి బుద్ధిమంతురాలు. నిజం కనిపెడుతుంది.

రామ : అయితే మరివిను (చదువును) మీ కొమార్తె ప్రవర్తన బాగా వుండకపోవడం చాత మిమ్మల్ని వెలేశారని లోకంలో వార్త గట్టిగా వున్నది."

లుబ్ధా : (కొంత తడవు వూరుకుని) నువ్వే నాకొంప తీశావు.

మధు : పంతులేనా?

లుబ్ధా : ఒహర్నువలసిన పనేవుఁంది?

మధు : (కొంత తడవు వూరుకొని) నేను మీ యింటికి వెళ్లిపోయొస్తాను. రండి. పెళ్లీగిళ్లీ మానెయ్యండి. మీకు పెళ్లాంకన్న యెక్కువగా సంరక్షణ చేస్తాను.

లుబ్ధా : (ఆనందం కనపరుస్తూ) బీదవాణ్ణి నేను డబ్బివ్వలేనే? నీలాంటి విలవైన వస్తువను పంతులుగారే భరించాలి.

మధు : నాకు డబ్బక్కర్లేదు. తిండి పెడతారా?

లుబ్ధా : ఆహా! అందుకు లోపవాఁ!

మధు : ఐతే పదండి, మరి యీ పంతులుగారి మాయమాటలు వినక పెళ్లిమానేసి, సుఖంగా యింట్లో కూచుందురు గాని.

రామ : (మధురవాణి వైపు తీక్షణముగా చూసి) నువ్వు భోజనం చెయ్యలేదన్నమాట జ్ఞాపకం వుందా? వెళ్లు.

మధు : మీ చర్య చూస్తేనే కడుపు నిండుతుంది. (ఛఋ్ఖుమని యింటిలోనికి పోవును.)

లుబ్ధా : యీ మధురవాణి. విన్నారా! మావాఁ! వేశ్య అయినా! చాలా తెలిసిన మనిషి. మన సంసార్లకి దానికి వున్న బుద్ధివుంటే బతికిపోదుం.

రామ : అవుఁను. బుద్ధిమంతురాలే; గాని వొళ్లెరగని కోపం. యేవైఁనా వెఱ్ఱి అనుమానం పుట్టితే, తనూపై కానదు. చూశారా మావాఁ, మీలాంటి శిష్ఠులు సానివాళ్ల శరీరం

తాకకూడదు. అది చిన్నతనంచేత మొఖం మీద మొఖం పెడితే "పిల్లా, యడంగా నిలబడి మాట్లాడు" అని చవ్పాలి. ఒక్కటే వొచ్చింది దీనికి దుర్గుణం. పరాయివాళ్లతో మాట్లాడితే గాని దానికి తోచదు. పట్నవాసంలో వుండడంనించి ఆ దురలవాటు అబ్బింది.

**లుబ్ధా** : చిన్నతనం గదా! మధురవాణి నా పిల్ల లాంటిది. ముట్టుగుంటే అదో తప్పుగా భావించకండి.

**రామ** : నీ సొమ్మేం బోయింది! అదికాదు, చూశారా మావాఁ. వుంచుకున్న ముండాకొడుకు యదట, మరో మొగాణ్ణి పట్టుకుని "వీడి దండలు కమ్మెచ్చులు తీసినట్టున్నాయి. వీడి ఛాతీ భారీగా వుంది" – అని చెవిలో నోరు పెట్టి గుసగుసలాడుతూంటే అగ్గెత్తుకొస్తుందా రాదా?

**లుబ్ధా** : పొరపాటు, లెంపలు వాయించుకుంటాను. క్షమించండి.

**రామ** : మీ లెంపలు వాయించుకుంటే కార్యం లేదు. దాని లెంపలు వాయించాలి. మీమీద దానికి కొంచం యిష్టం వున్నట్టుంది. గట్టిగా బుద్ధి చెప్పండి.

**లుబ్ధా** : నా మీద యిష్టవేఁవిఁటి మావాఁ! యక్కడైనా కద్దా?

**రామ** : మీ యింటికి వెళ్లిపోయొస్తానంటూందే? మరి తీసికెళ్లు.

(పై మాటలాడుచుండగా మధురవాణి పట్టుచీర కట్టుకుని ప్రవేశించి.)

**మధు** : అలాగే తీసికెళ్తారు మీకు భారవైఁతేను. ఆ మహానుభావుడికి చాకిరీ చేస్తే పరం ఐనా వుంటుంది.

**లుబ్ధా** : మామగారు హాస్యానికంటున్నారు గాని, నిన్నొదుల్తారా? నేతగను, తగను.

**రామ** : అలా గడ్డి పెట్టండి!

**మధు** : ఆయన హాస్యానికి అంటున్నా, నేను నిజానికే అంటున్నాను. గడ్డి గాడిదెలు తింటాయి; మనుష్యులు తినరు.

**రామ** : అదుగో మళ్లీ గాడిదలంటుంది! (మధురవాణి నవ్వు దాచుటకు ముఖం తిప్పికొని, లోగుమ్మము దాటి, విరగబడి నవ్వును)

**లుబ్ధా** : మధురవాణికి మీదగ్గిర భయంభక్తీ కూడా కద్దు.

**రామ** : వుంది. కోపవొఁస్తే గడ్డిపరకంత ఖాతరీ చెయ్యదు. పరాయి మనిషి వున్నాడని అయినా కానదు.

**లుబ్ధా** : పెళ్లి ప్రయత్నం యిక మానుకోవఁడవేఁ ఉత్తమం, అని తోస్తుంది. యేవిఁటి తమ శలవు?

**రామ** : నా శలవేం యేడిసింది. పెళ్లి చేసుకోవొద్దని మధురవాణి శలవైంది. దాని బుద్ధికి ఆనందించి అలా నడుచుకుంటున్నారు. స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః అని చెప్పనే చెప్పాను.

**లుబ్ధా** : మీరు ఆప్తులనే గదా మీ సలహాకి వొచ్చాను. మధురవాణి చెప్పిందనా పెళ్లి వద్దంటున్నాను. తప్పిన పెళ్లి తప్పిపోయింది. ఖర్చులుకూడొచ్చాయి గదా అని సంతోషిస్తున్నాను.

**రామ** : రెడ్డొచ్చాడు మొదలాడన్నాడట. సాధక బాధకాలు యెన్ని పర్యాయములు చెప్పినా అవి అన్ని పూర్వపక్షంఐ, ముక్తాయింపు మళ్లీ డబ్బు ఖర్చు మీదికి వొస్తూ వుంటుంది. పెళ్లి చేసుకుని కడుపు ఫలిస్తే మీ యిల్లు పది యిళ్లౌతుంది. పెళ్లి చేసుకోక గుటుక్కుమంటే యీ కష్టపడి ఆర్జించిన డబ్బంతా యవడి పాలు కాను?

**లుబ్ధా** : అదుగో యేమో యెక్కువ ధనం వున్నట్టు శలవిస్తారు? నాకేవుఁంది?

**రామ** : వున్నంత వుంది. పరానికి యిన్ని నీళ్ల చుక్కలు వొదిలేవాడుండాలా?

**లుబ్ధా** : అలా అయితే, తమ రెందుకు పెళ్లి చేసుకున్నారు కారూ?

**రామ** : నేను పిత్రార్జితం అంతా కరరావుఁడు చుట్టేవేశాను. యిక పరానికా? నేను శాక్తేయుణ్ణీ; యోగ సాధనం చేస్తాను. నాకు మరి కర్మతో పనిలేదు. లోకం కోసం తద్దినాలు పెడుతున్నాను. అయితే సానిదాన్ని యెందుకు వుంచుకున్నావయ్యా! అని అడగగలరు?

"కామిగాక మోక్షకామి కాడు" అన్నాడు. యిక మీ సంగతో? మీరు నిద్దరపోతూండగా చూసి యెప్పుడో ఒకనాడు మీనాక్షి ఆపాతు యెక్కదీసి రంకు మొగుణ్ణి తీసుకు పారిపోతుంది. ఆపైని దరిద్ర దేవత మిమ్మల్ని పెళ్లాడుతుంది.

**లుబ్ధా** : అయితే యేం జెయమంటారు?

**రామ** : మీరు పునః ప్రయత్నం చేసి పెళ్ళాడండి. మీ పెళ్లాం భయం చేత మీనాక్షి ఆటకట్టడుతుంది. మీనాక్షి భయం చేత, మీ పెళ్లాం కట్టుగా వుంటుంది. అవునంటారా? కాదంటారా?

**లుబ్ధా** : నిజవైఁనమాటే.

**రామ** : నిజవైతేనేం? మీకు బహుపరాకు. సాధక బాధకాలు అడుగడుక్కీ, జ్ఞాపకం చేస్తూండాలి. మీకు జాతకరీత్యా వివాహం జరక్కపోతే, మార్కం వుందన్న మాట పరాకుపడ్డారా?

లుబ్ధా : పరాకు లేదు, గాని యిన్నాళ్లాయి కొట్టుకుంటూంటే, యీ నాటికి పద్దెనిమిది వొందలకి, వక సంబంధం కుదిరి, తీరా క్రియ కాలానికి తేలిపోయింది గదా? యిప్పుడు చవగ్గా మనకి సంబంధం కుదురుతుందా? కుదరదు. కుదరదు.

రామ : నిన్న వొచ్చాడయ్యా, గుంటూరు నించి ఒక బ్రాహ్మడూ. వున్నాడో వెళ్లిపోయినాడో?

లుబ్ధా : సంబంధానికా?

రామ : అవును. యంత బుద్ధి తక్కువ పని చేశానూ! నా యెరికని యెక్కడైనా సంబంధం వుందా అని అతగాడు అడిగితే, లేదని చెప్పాను. యీ సంబంధం మీకు తప్పిపోతుందని నేనేం కలగన్నానా యేవిఁటి? అతడు జటాంత స్వాధ్యాయిన్నీ మంచి సాంప్రదాయవైఁన కుటుంబీకుడున్నూ. ఆ సంబంధం చేస్తే అగ్నిహోత్రావుధాన్లుని చెప్పుచ్చుకు కొట్టినట్టౌను.

లుబ్ధా : బేరం యేం చెప్పాడు?

రామ : బేరం మహా చవకయ్యా. అదే విచారిస్తున్నాను. అతగాడు గుంటూరు నుంచి వస్తున్నాడు. అక్కడి వాళ్లకి మన దేశపు కొంపలమ్ముకునే బేరాలతాపీ యింకా తెలియలేదు. అందుచేత నందిపిల్లిలో పన్నెండు వందలకి సంబంధం కుదుర్చుకున్నాడు. వ్యవధిగాగాని పెళ్లి కొడుకువారు రూపాయిలు యివ్వలేమన్నారట, ఆ బ్రాహ్మడికి రుణాలున్నాయి. వాయిదా నాటికి రూపాయలు చెల్లకపోతే దావా పడిపోతుందని యెక్కడయినా పిల్లని అంటగట్టడానికి వ్యాపకం చేస్తున్నాడు. ఒకటి రెండు స్థలాల్లో వెయ్యేసి రూపాయలకి బేరం వొచ్చిందట. పన్నెండు వందలకి గాని యివ్వనని చెప్పాడు.

లుబ్ధా : మరొక్క వంద వేదాం మనం?

రామ : అతగాడు వుంటేనా, నూరు వెయడానికీ యాభై వెయడానికీని?

లుబ్ధా : కనుక్కుందురూ మీ పుణ్యం వుంటుంది. యెక్కడ బసో?

రామ : దాని సిగ గోసిన డబ్బు. డబ్బు మాట అలా వుణ్ణీండి గాని, ఆ పిల్ల యేమియేపు! యేమి ఐశ్వర్య లక్షణాలు! ధనరేఖ జెట్టిపోతులా వుంది. సంతాన రేఖలు స్ఫుటంగా వున్నాయి. పిల్ల దివ్య సుందర విగ్రహం.

(మధురవాణి ప్రవేశించును.)

మధు : గ్రహవేఁవిఁటి?

రామ : గ్రహవేవిఁటా? అవుధాన్లు గారి గ్రహస్థితి చూస్తున్నాం. జాతకరీత్యా యీ సంవత్సరంలో వివాహం కాక తప్పదు.

**మధు** : మీ మాట నేను నమ్మను (అవుధాన్లు దగ్గిరకు వెళ్ళి ముఖంయదట ముఖం వుంచి) ఆ మాట నిజమా?

**లుబ్ధా** : అంతా నిజం అంటున్నారు.

**మధు** : సిద్ధాంతిగారేవఁన్నారు?

**లుబ్ధా** : జాతకం చూసిన సిద్ధాంతల్లా ఆ మాటే అంటున్నాడు. యిదివరకల్లా నాజాతకం మా గట్టి దాఖలా యిస్తూంది. ఒక్కటీ తప్పిపోలేదు.

**మధు** : అయితే మీ ప్రారబ్ధం. ఆ పెయ్యనాకుడు పిల్లని మాత్రం యీ పంతులు మాయ మాటలు విని చేసుకోకండి.

**రామ** : భోంచేస్తూ వొచ్చావు, యేం పుట్టి మునిగి పోయిందని?

**మధు** : వెండిగిన్నె కోసం వొచ్చాను.

**రామ** : తీసుకెళ్ళు (మధురవాణి నిష్క్రమించును.)

**లుబ్ధా** : పెళ్లి చేసుకోవద్దంటుందేవఁండీ?

**రామ** : నిమ్మళంగా మాట్లాడండి. సానిది యక్కడైనా పెళ్లి చేసుకోమంటుందయ్యా? నీ మీద కన్నేసింది.

**లుబ్ధా** : నామీద కన్నెయ్యడవేఁవిఁటి మావఁగారూ! యవరు విన్నా నవ్వుతారు.

**రామ** : మీరు గానీ పెళ్లి చేసుకోవడం మానేస్తే, మీ యింట్లో వచ్చి బయితాయిస్తుంది. అది ఘంటాపథంగా చెబుతూవుంటే చెవుల్లేవా యేవిఁటి మీకు? దానితో మీరేవఁయినా వెఱ్ఱి వెఱ్ఱి చాష్టలు చేశారంటే మీకూ నాకూ పడుతుంది గట్టిరంధి. జాగ్రతెరిగి మసులుకొండి.

**లుబ్ధా** : నేనా? నేనా? యేవిఁటి అలా శలవిస్తున్నారు. మావాఁ ! నా పిల్ల ఒకటీ అది వొకటీనా? ఆ గుంటూరు శాస్త్రుల్లు వున్నాడో వెళ్ళాడో, ఒక్క మాటు కనుక్కోలేరో?

**రామ** : యదటింట్లోనే బసచేశాడు. కనుక్కుంటాను గాని, మధురవాణి భోజనం యేపాటి అయిందో చూసి మరీ వెళతాను (లోపలికి వెళ్లి వచ్చి పైకి వెళ్లును.)

**లుబ్ధా** : మధురవాణ్ణి తీసుకుపోతాననుకుంటున్నాడు యీ పంతులు అహా! హా! (పొడుము పీల్చి) మనిషికీ మనిషికీ తారతమ్యం సాందే కనిపెట్టాలి. పంతుల్లాగ మీసం వుంచుకుని, రంగు వేసుకుంటే, తిరిగీ యౌవ్వనం వస్తుంది. యీ చవక సంబంధం కుదిరినట్టాయనా యేమి అదృష్టవంతుణ్ణి!

(రామప్పంతులు స్త్రీ వేషముతో నున్న శిష్యుణ్ణి రెక్క పట్టుకు తీసుకువచ్చును. అరచెయ్యి చూపించి)

**రామ** : మావాఁ! యేం ఖొదాకొట్టుకొచ్చిందోయి నీకు! యిదిగో ధనరేఖ. చెయ్యి కొసముట్టి రెండో పక్కకి యెగబాకిరినట్టుందోయి. యివిగో సంతాన రేఖలు కంఠం దగ్గిర చూశావా. హారరేఖలు?

**లుబ్ధా** : అట్టే పరిశీలన అక్కర్లేదు. చాల్లెండి.

(పై ప్రసంగము జరుగుచుండగా మధురవాణి వెనక పాటున వచ్చి పంతులు నెత్తిమీద చెంబుతో నీళ్లు దిమ్మరించును.)

**రామ** : యేమిటీ బేహద్బీ!

**మధు** : మంగళాస్నానాలు (శిష్యుడి గెడ్డం చేత నొక్కి) నీకు సిగ్గు లేదే లంజా?

(మధురవాణి నిష్క్రమించును.)

**రామ** : కోపవొఁస్తే మరి వొళ్లెరగదు. యిక కొరకంచో చీపురుగట్టో పట్టుకు వెంటదరువుఁతుంది. యీ పిల్లని తీసుకు పారిపోదాం రండి.

(శిష్యుడి చెయ్యి పట్టుకుని పైకి నడుచును.)

**లుబ్ధా** : నడుస్తుంది. రెక్క వొదిలెయ్యండి.

**రామ** : (రెక్కవదిలి) ఓహో! కాబోయే యిల్లాలనా?

(ముగ్గురూ నిష్క్రమించి, వీధిలో ప్రవేశింతురు)

**లుబ్ధా** : యీ పిల్లని చేసుకోమని మీ అభిప్రాయవేఁనా?

**రామ** : నా అభిప్రాయంతో యేం కార్యం? మీ మనస్సమాధానం చూసుకోండి. పిల్ల యేపుగా వుందా? రూపు రేఖా విలాసాలు బాగున్నాయా? అది చూసుకోండి.

**లుబ్ధా** : సంసార్లకి సౌందర్యంతో యేం పని?

(సిద్ధాంతి తొందరగా యెదురుగుండా వస్తూ ప్రవేశించి.)

**సిద్ధాం** : (లుబ్ధావధాన్లతో) యవరు మావాఁ యీ పిల్ల? (లుబ్ధావుధాన్లు జవాబు చెప్పక, రామప్పంతులు వైపు బుఱ్ఱతిప్పి సౌజ్ఞ చేయును.)

**రామ** : మావాళ్ళే

**సిద్ధా** : (నిదానించి) భాగ్య లక్షణాలేంబట్టాయి యీ పిల్లకీ!

**రామ** : యేవిఁటండి?

**సిద్ధా** : విశాలమైన నేత్రాలూ, ఆకర్ణాలు, ఆవుంగరాల జుత్తూ, విన్నారా? యేదమ్మా చెయ్యి (చెయ్యి చూసి) యే అదృష్టవంతుడు యీ పిల్లని పెళ్లాడాడో గాని...

**రామ** : యింకా పెళ్లి కాలేదండి.

**సిద్ధా** : మీరు పెళ్లి చేసుకోవాలని వుంటే, యింతకన్న అయిదోతనం, అయిశ్వర్యం, సిరి, సంపదాగల పిల్ల దొరకదు. యిది సౌభాగ్య రేఖ, యిది ధనరేఖ, పంతులూ బోషాణ పెట్టెలు వెంటనే పురమాయించండి. యెది తల్లీ చెయి తిప్పూ. సంతానం వకటి, రెండు, మూడు. (చెయ్యి వదిలి లుబ్ధావధాన్లతో) యేదీ మావాఁ పొడి పిసరు. (పొడుం పీల్చి) పోలిశెట్టి కూతురు ప్రసవం అవుతూంది. జాతకం రాయాలి. మళ్ళీ దర్శనం చాస్తాను.

**రామ** : వక్కమాట (సిద్ధాంతితో రహస్యంగా మాట్లాడును. సిద్ధాంతి చంకలో పంచాంగం తీసి, చూచును. మరి నాలుగు మాటలాడి పంచాంగం చంకని పెట్టుకుని తొందరగా వెళ్లిపోవును.)

**లుబ్ధా** : యేవఁంటాడు?

**రామ** : నేనే యీ పిల్లని పెళ్ళిచేసుకుంటానను కుంటున్నాడు. రేపటి త్రయోదసి నాడు పెళ్లికి మంచిది అన్నాడు.

**లుబ్ధా** : ఆ రోజు వివాహ ముహూర్తం లేదే?

**రామ** : శుభస్య శీఘ్రం అన్నాడు. ద్వితీయానికి అంత ముహూర్తం చూడవలసిన అవసరం లేదు. తిథీ నక్షత్రం బాగుంటే చాలును. యిదుగో మీ మావఁగారు వొస్తున్నారు.

**లుబ్ధా** : బేరవాఁడి చూడండి.

(కరటక శాస్తుల్లు ప్రవేశించును.)

**కరట** : గంగాజలం సిరస్సున పోసుకున్నారా యేవిఁటి పంతులు గారూ? మా పిల్లని యెక్కడికి తీసికెళ్తున్నారు?

**రామ** : (కరటక శాస్త్రితో) మాట.

(ఇద్దరూ రహస్యముగా మాటలాడుదురు).

(లుబ్ధావధాన్లును యెడంగా తీసుకెళ్లి) పధ్నాలుగు వొందలు తెమ్మంటున్నాడు.

యెవళ్లో పదమూడు యిస్తావఁన్నారట.

**లుబ్ధా** : యిదా మీరు నాకు చేసిన సాయం? పోనియ్యండి. ఆపజ్యేందుకైనా తగలెట్టండి.

**రామ** : ఉపకారానికి పోతే నాదా నిష్టూరం? కోరి అడిగితే కొమ్మెక్కుతారు. యేం జెయను (కరటక శాస్త్రితో రహస్యంగా మాట్లాడి, తిరిగీ వచ్చి లుబ్ధావధాన్లుతో) మావాఁ కృత్యాద్యవస్థమీద వొప్పించాను. పిల్లదానికి సరుకు పెడితే గాని వల్లలేదని భీష్మించుకు కూచున్నాడు. యేవఁంటావు?)

**లుబ్ధా** : అది నా వల్ల కాదు.

**రామ** : వూరుకోవయ్యా. అలాగే అందూ, మధురవాణి తాలూకు కంటె తెచ్చి ఆవేళకి పెట్టి, తరవాత తీసుకుపోతాను.

**లుబ్ధా** : అదేదో మీరే చూసుకోండి.

**రామ** : నేనే చూసుకుంటాను. ఖర్చు వెచ్చాలేవో మనవేఁ చేసుకుని, కొంచంలో డబడబలాడిం చేదాం. పోలిసెట్టిని సప్లైకి పెట్టకండి. పెద్దిపాలెం వెళ్లి లౌక్యుల్ని యెవరు పిలవడం?

**లుబ్ధా** : మరి నాకెవరున్నారు. మీరే పిలవాలి.

**రామ** : లౌక్యుల్ని పిలవడానికి వెళ్లినప్పుడు దుస్తుడాబుగా వుండాలి. దగలా, గిగలా తీయించి యెండవేయిస్తాను.

(నిష్క్రమింతురు.)

★★★

## ౨వ స్థలము : లుబ్ధావధాన్లు యిల్లు

**లుబ్ధా** : అవును. మీరు చెప్పిన మాట బాగుంది. దివ్య స్థలాల్లో ఏకరాత్ర వివాహాచారం వుంది.

**కరట** : పెద్ద పెద్ద ఉద్యోగస్థులు కూడా, యిప్పటి రోజులలో, వివాహాలు అలాగే చేస్తున్నారు. కోదండ రామస్వామివారు స్వయంవ్యక్తవూఁ, హనుమత్ప్రతిష్ఠా, అయినప్పుడు, దివ్యస్థలం కాదని యెవడనగలడు?

**లుబ్ధా** : ఆ మాట సత్యవేఁ గాని, యిది దివ్య స్థలంగా ఆలోచించి ఇదివరకు యెవళ్లూ యిక్కడ, ఏకరాత్ర వివాహం చేసివుండలేదు మావఁగారూ. మనం చేస్తే యేవఁంటారో?

**కరట** : దివ్యస్థలం అయిన తరవాత యెవడేవఁంటే మనకేం పోయింది?

**లుబ్ధా** : అయితే పంతులుతో చెబుదాం.

**కరట** : యేవిఁటి మీ సత్యకాలం మావఁగారూ! యీ పెళ్లిలో యేదోవొక వొంటుబెట్టి, నాలుగు డబ్బులు ఆర్జించుకుందావఁని చూస్తూ వున్న పంతులూ, పోలిశెట్టీ, ఏకరాత్ర వివాహానికి ఆమోదిస్తారా? పుస్తెకట్టిందాకా ఆ మాట వాళ్లతో చెప్పకండి.

**లుబ్ధా** : పంతులుతో చెప్పకపోతే యేం జట్టీ పెడతాడో?

**కరట** : యేవిఁటి మీ భయం! అతగాడు మీకు యజమానా? జట్టీ, గిట్టీ పెడితే, పెణతూడ గొడతాను.

**లుబ్ధా** : మీరు కాదుగాని, సిద్ధాంతిగారి చేతిలో రెండు రూపాయలు పడేస్తే, ఆ పూచీ అంతా ఆయన నెత్తిమీద వేసుకుంటాడు. ఆయన యదట పంతులు నోరు యెగియదు.

**కరట** : పావఁంటిదానికి విరుగుడుంది. పంతులికుండదా?

(నిష్క్రమింతురు.)

**౩వ స్థలము : లుబ్ధావధాన్లు యింటి పెరడు**

**(కరటక శాస్తుల్లు, మీనాక్షి ప్రవేశింతురు)**

**మీనాక్షి**: మీ పిల్లని నా కడుపులో పెట్టుకోనా తాతయ్యా?

**కరట** : కడుపుగదా అమ్మా? అంచేత పదే పదే చెబుతున్నాను. దానికి తల్లివైనా నువ్వే, తండ్రివైనా నువ్వే (దుఃఖమును అభినయించును)

**మీనాక్షి**: విచారించకండి, తాతయ్యా. దానికి యే లోపం రానియ్యను.

**కరట** : అమ్మా, నీకిమ్మని మా అమ్మి చేతికి ఓ పులిమొహూరు యిచ్చాను. పుచ్చుకో.

**మీనాక్షి** :యిస్తుంది. తొందరేవిఁటి, తాతయ్యా? దాం దగ్గిర వుంటేనేం? నాదగ్గిర వుంటేనేం?

(సిద్ధాంతి ప్రవేశించును)

**సిద్ధాంతి** :యెంతసేపూ కూరలు తరగడం, భోజనాల సరంజాం జాగ్రత చెయ్యడం సందడే గాని, లగ్నానికి కావలసిన సరంజాం జాగ్రత్త చెయ్యడపు తొందరేవీఁ కానరాదు. నా శిష్యుడు ముంగిపోతులాగ పడున్నాడు.

మీనా : నాలుగ్గడియల పొద్దుకి లగ్గవైఁతే, యిప్పట్నించీ సరంజాం తొందరేవిఁటి అచ్చన్న మావా?

సిద్ధాంతి :చదవేస్తే వున్న మతీ పోయిందన్నాట్ట. నాలుగ్గడియల రాత్రుందనగా శుభమూర్తం.

మీనా : మా నాన్న యెప్పుడూ యిదే మచ్చు. యే మాటా నిజం యింట్లో ముండలతో చెప్పకపోతే యెలా యేడుస్తారు? నాన్నా ? నాన్నా!

(లుబ్ధావధాన్లు ప్రవేశించును)

లుబ్ధా : యెందుకా గావుకేకలు?

మీనా : నాలుఘ్ఘడియల రాత్రుందనగానట మూర్తం. అచ్చన్న మావఁ అంటున్నారు.

లుబ్ధా : యిదేవిఁటండోయి, నాలుగ్గడియల పొద్దు కనుకున్నానే ముహూర్తం?

సిద్ధాంతి: ముప్పై మూడు ఘడియల పొద్దు కనుకున్నారు కారో? మీ వెఱ్ఱులు చాలించి చప్పున కానియ్యండి మంగళాస్నానాలు. ఊళ్లో బ్రాహ్మలినందర్నీ పిలిచేశాను.

లుబ్ధా : చంపారే! చలి! – అయితే రావఁప్పంతులుకూడా నాలుఘ్ఘడియల పొద్దుకి అనుకున్నాడే ముహూర్తం? ఆయనే వొచ్చి, పెద్దిపాలెంలో లౌక్యుల్ని నాలుఘ్ఘడియల పొద్దుకి రమ్మని పిలుస్తారేమో?

సిద్ధాంతి: శతాంధాః కూపం ప్రవిశంతి. అమ్మీ, పిల్లకి స్నానం చేయించూ.

మీనా : యిదుగో, నిమిషంలో చేయిస్తాను.

సిద్ధాంతి :ఆడవాళ్లు నయం. పెళ్లి పందిట్లో సరంజాం చూసుకుంటాను.

లుబ్ధా : పంతులు లేకుండా లగ్నం అయితే–

సిద్ధాంతి: పంతులుకా, మీకా పెళ్ళి? జంకవోడక స్నానం కానీండి.

(నిష్క్రమింతురు)

★★★

**౪వ స్థలము : లుబ్ధావధాన్లు యింటి అరుగు మీద పసుపు బట్టలు కట్టుకుని, లుబ్ధావధాన్లు, స్త్రీ వేషముతో శిష్యుడు, కొందరు బ్రాహ్మలు కూర్చుని వుందురు**

(రామప్పంతులు, తాషామర్పా, కావిళ్ళూ, చాకర్లతో, ప్రవేశించి, అరుగు మీద చతికలబడి...)

రామ : అబ్బ! ఎంత శ్రమ పడ్డానండి (నౌఖర్లతో) తాషామర్పా వూరుకోమను. బోయీలొహాళ్లూ, బాజావాళ్లొహాళ్లూ, వూరు చేరేటప్పటికి కోలాహలం లావు చేస్తారు. కాళ్లు పీక్కు వచ్చాయయ్యా, వెధవ పెద్దిపాలెం యంతదూరం వుఁందీ! (తిరిగి చూసి) యిదేవిఁటీ

పసుబ్బట్టలూ, పెళ్లి కూతురుతో కలిసి కూచోడవూఁను? పెళ్లి కొడుకుం చేయించుకున్నావటయ్యా? ముదిమికి ముచ్చట్లులావు.

**లుబ్ధా** : లగ్నానికి మీరు లేకపోయినారు గదా! అని మహా విచారపడుతున్నాను.

**రామ** : (ఉలికిపడి) యేవిఁటీ! లగ్గవేఁవిఁటి?

**పూజారి గవరయ్య** :లగ్నం వేళకి తమరు లేకపోయినారు గదా అని, మేం యావన్మందివీఁ విచారించాం. తమరు యేదో వ్యవహారాటంకం చేత వేళకి రాజాలినారు కారనుకున్నాం. తాము లేకపోవడం చేత సభ సొగుసే పోయింది. "నియ్యోగి లేని సావిడి। అయ్యయ్యో వట్టి రోత, అది యెట్లన్నన్। వయ్యారి"–

**రామ** : అట్టే పేలకు, ముహర్తానికి ముందే పుస్తె యెలా ముడెట్టావయ్యా?

**పూజా** : సిద్ధాంతిగారు నక్షత్రాలు చూసి ఘడియలు గట్టి సరిగ్గా ముహూర్తం వేళకే పుస్తె కట్టించారండి.

**రామ** : నాలుగ్ఘడియల పొద్దుకాలేదే?

**పూజారి** :నాలుగు ఘడియల రాత్రుందనగా కదండీ, శుభముహూర్తం?

**రామ** : సిద్ధాంతి, ముహర్తం తెల్లవారి నాలుగు ఘడియలకని చెప్పాడే?

**పూజారి** :పంచాంగం మార్చడానికి యవడిశక్యం బాబూ? తెల్లవారగట్ల నాలుగు ఘడియలకని, సిద్ధాంతి గారు మనవి జేసి వుంటారు. తాము పరాగ్గా విని వుందురు.

**రామ** : పంచాంగానికేం యీ వెధవ పల్లిటూర్లో? సిద్ధాంతి ఆడింది ఆటా, పాడింది పాటా. యంతద్రోహం చేశాడయ్యా సిద్ధాంతి!

**పూజారి** :సిద్ధాంతి యంతో నొచ్చుకున్నాడు, తమరు రాలేదని బాబూ, యేమి ఆటంకంచాత వుండిపోయినారో అని అవుధాన్లు గారు తల్లడిల్లారు. తాషామర్ఫా విన్న తరవాత గదా, ఆయన మనస్సు స్వస్థపడ్డది.

**లుబ్ధా** : నిజం మావఁగారు.

**పూజారి** :యిక మధురవాణో? అంటే, ఆ పందిట్లో నిశ్చేష్టురాలై పుత్తడి బొమ్మలాగ నిలుచుంది గాని బ్రాహ్మణ్యం యావన్మందీ గెడ్డం పట్టుకు యెంత బతిమాలుకున్నా, పాడింది కాదు.

**కొండిభొట్లు** : అంతసేపూ హెడ్డు కనిష్టీబుగారితో మాట్లాడుతూ నిల్చుంది గాని, యేం? యింతమందిం ప్రార్థించినప్పుడు, ఓ కూనురాగం తియ్యకూడదో?

**మరివక బ్రాహ్మడు** :ఓరి కుంకాయా, పంతులుగారు సభలో లేందీ యలా పాడుతుందిరా?

**పూజా** : హెడ్డు గారితో యేవింటి మాట్లాడుతూందనుకున్నావు? పంతులుగారు సరుకూజప్పరా, పెట్టుకు వెళ్లారు, యేం ప్రమాదం వొచ్చిందో! ముహర్తం వేళకి రాలేదు, జవాన్లని పంపి వెతికించండి అని బతిమాలుకుంటూందిరా.

**కొండిభొట్లు** :ఈ గవరయ్యగారు గోతాలు కోస్తాడ్రా. హెడ్డూ, అదీ, ఒహరి మీదొహరు విరగబడి నవ్వుతూంటే, పంతులు కోసం బెంగెట్టుకుందని కవిత్వం పన్నుతాడు.

**రామ** : వైదికం! వైదికం! మీ యేడుపులు మీరు యేడవక, లోకంలో భోగట్టా అంతా మీకెందుకు?

**పూజారి** :వూరుకోరా కొండిభొట్లు. పెద్దాపిన్నా అక్కర్లేదూ?

**రామ** :నీ పెద్దతనం యెక్కడ యేడిసింది? నివ్వే ముందు రేపెట్టావు.

**పూజారి** :వై, స, బు, పె అని యందుకన్నాడు బాబూ?

**రామ** : అతడేడీ, అతడు? అతడి పేరేవింటీ?

**పూజారి** : యవరండి?

**రామ** : ఆ గుంటూరి శాస్తుల్లేడయ్యా?

**పూజారి** : యే గుంటూరి శాస్తుల్లండి?

**లుబ్ధా** : ఆయనా, – మరే వొచ్చి, ఆయనా – వూరికెళ్లారు.

**రామ** : యేవింటీ తెలివితక్కువ మాట! కూతురికి పెళ్ళౌతూంటే వూరికెలా వెళ్ళాడు? –

**లుబ్ధా** : పెళ్లయిపోయింది గదా ?

**రామ** : తెలివిహీనం! లగ్నవంటే నేను లేకుండా వెలిగించావు గానీ, పెళ్లి ఐదు రోజులు తగలడుతుంది గదూ ? –

**పూజా** : ఏకరాత్ర వివాహం కదండీ? అంచేత ప్రధాన హోమం, శేషహోమంతో సమాప్తి అయిపోయింది.

**రామ** : (నిశ్చేష్టుడై లుబ్ధావధాన్లుతో) ఓరి, సామిద్రోహప వెధవా!

**పూజారి** : నోరుమూసి, బాబ్బాబూ. శాంతించండి! శాంతించండి! (లుబ్ధావధాన్లుతో) పంతులుగారి కాళ్ల మీద పడవయ్యా. (పంతులుతో) తమరు చేయించిన శుభం. అశుభం మాటలు శలవియ్యకండి. సిద్ధాంతి గారూ, వారిమావఁగారూ, శాస్త్ర చర్చ చేసి, లగ్నం పదినిమిషాలుందనగా ఏకరాత్ర వివాహం స్థిరపర్చారు.

**రామ** : యేం కుట్ర! వాడికి రూపాయలివ్వ లేదు గద ?

**లుబ్ధ** : యెల్లుండి యేవాళకైనా రూపాయలు చెల్లించకపోతే దావా పడుతుందని, తొందరపడి పట్టుకు వెళ్లిపోయినారు. మళ్లీ వారంనాటికి వొస్తావఁన్నారు.

**రామ** : నన్ను మధ్యవర్తిని చేసి, నేను లేనిదీ, యీ వ్యవహారం యలా పైసలు చేశావు? నేను యంత యడ్వాన్సు వాడికి యిచ్చానో నీకు తెలుసునూ? అప్పుడే మావఁగారితో కలిసిపోయి నాకు టోపీ అల్లావూ?

**లుబ్ధా** : మీరు చేసిన నిర్ణయ ప్రకారవేఁ, రూపాయలు చేతులో పడితేనే గాని, పుస్తె కట్టనివ్వనన్నాడు. యేం జెయ్యను?

**రామ** : పుస్తె కట్టకపోతే నీ పుట్టె ములిగింది గాబోలు! నేవొచ్చేలోగా యేం వుప్పెనవొచ్చింది? వీడేదో పెద్ద దగా చేసి, నేనొస్తే, పట్టుగుంటానని రూపాయలు చేతులో పడేసుకుని వుడాయించాడు. వాడి పేరేవిఁటీ?

**పూజారి** : ఆయన పేరు – మరే వచ్చి – అవుధాన్లు గారు శలవిస్తారు.

**లుబ్ధా** : నాకు తెలియదు.

**రామ** : అయ్యో అభాజనుడా! యిహ, వాడు, పంచాలీ మనిషి అనడానికి సందేహవేఁవిఁటి?

**లుబ్ధా** : అతగాణ్ణి మీరే తీసుకొచ్చి దొడ్డవాడని చెప్పారు? అంచేతనే అతణ్ణి నేను నమ్మాను.

**రామ** : నువ్వు నమ్మితే యెవడికి కావాలి? నమ్మకపోతే యెవడికి కావాలి? అతనికి నేను పెళ్లి ఖర్చుల కోసం బదులిచ్చిన నూరు రూపాయిలూ, అక్కడ పెట్టు.

**లుబ్ధా** : యెవరికిచ్చారో ఆతణ్ణే అడగండి. నాతో చెప్పకండి.

**రామ** : సరే, నీతో చెప్పను–నీతో యిక మాటే ఆణ్ణు–మరి నీ యింట్లో వక్క నిమిషం వుండను (లేచి నులుచుని) అంతా వినండయ్యా! యీ గుంటూరు శాస్తుల్లు పచ్చి దొంగ. లేకుంటే ఈ తెలివిహీనుడు యిచ్చిన రూపాయిలు సంధించుకుని, పేరైనా చెప్పకుండా పరారీ అవుతాడా? నా తాలూకు సొమ్ము కూడా పట్టుకు చపాయించాడు. వీడి వైఖరీ చూడగా, రెండో పెళ్లి పిల్లనో, సూద్రప్పిల్లనో, యీ తెలివిహీనుడికి అమ్మి, యెగేసినట్టు కనపడుతుంది. గనక, ఒరే! బారికీ, ఒరే! మంగలీ, హెడ్డు గారి దగ్గిరికెళ్ళి ఇద్దరు జవాన్లను తీస్కురా. వాడి వెంట దౌడా యింపిస్తాను.

(పై మాటలు అంటూ వుండగా, సిద్ధాంతి ప్రవేశించి, రామప్పంతులు మాటలు ముగించి వెళ్లిపోబోతూ వుండగా రెక్కబట్టి నిలబెట్టును)

**సిద్ధాంతి**: యెక్కడికి వెళతారు? కొంచం నిలబడండి.

**రామ** : యేమిటి నీ నిర్బంధం?

**సిద్ధాంతి**: గుంటూరు శాస్తుల్లుగారి పేరేవింటో మీ క్కావాలా?

**రామ** : యేమిటా పేరు?

**సిద్ధాంతి**: పేరి రామశాస్త్రుల్లు గారు. ఆయన పేరుతో మీకేం పనుంది?

**రామ** : వాడు నాకు బాకీ.

**సిద్ధాంతి**: మీకు ఒక దమ్మిడీ బాకీ లేదు. ఆ నిజం నాకు తెలుసును.

**రామ** : చెయ్యి నొక్కేస్తున్నావేవింటి?

**సిద్ధాంతి**:వైదీకపాళ్ల చెయ్యి మృదువుగా యలా వుంటుంది? అవధాన్లు గారు యిచ్చిన సొమ్ము తాలూకు నిలవ యెంతుందో చెప్పండి.

**రామ** : నువ్వెవరివి అడగడానికి? అన్న! చెయ్యి నొక్కుతున్నావు! తంతావా యేవింటి?

**సిద్ధాంతి** :శుభమల్లె, పెళ్లికూతుర్ని ముండా ముతకా, అంటే యెవరయినా వూరుకుంటారా?

**రామ** : ముండకాదు, పుని స్త్రీయే, అంటాను; చెయ్యి వొదిలెయ్యి.

(లుబ్ధావధాన్లు శిష్యుడికి కొంతయడంగా జరుగును)

**సిద్ధాంతి** : కోపం వొచ్చినప్పుడు లౌక్యం మరిచి పోకూడదు. మీరు ప్రభువులూ; మేం ఆశ్రితులం. తమకిలాభించే మాట చెబుతాను, యిలా దయ చెయ్యండి.

**రామ** : మర్యాదగా మాట్లాడితే, నా అంత మంచివాడు లేదు.

**సిద్ధాంతి** : అవధాన్లు గారూ మీరు కూడా యిలా రండీ

(అవధాన్లు, సిద్ధాంతి, రామప్పంతులూ రహస్యముగా మాట్లాడుదురు)

**రామ** : (ఉత్సాహముతో) సిద్ధాంతీ యేదీ పొడిపిసరు. నియ్యోగపాడన్నవాడు, సవబుకి కట్టుబడతాడు. యవరయా వంట బ్రాహ్మలు! మా యింటికి పలహారాలు వెళ్లాయా? యేవోఁయి, కొండిభొట్లూ! మాట, యిలారా.

(కొండిభొట్లు వచ్చును)

**కొండి** : యేం శలవు?

**రామ** : మా యింటిదాకా నాతోరా.

**కొండి** : చిత్తం.

**రామ** : మా తోట్లో, మంచి పనసకాయలున్నాయి. రెండు కాయలకి బరాతవిఁస్తాను. తెచ్చుకో మీ అయ్యకి పనసకాయ కూరంటే, మా యిష్టం.

**కొండి** : చిత్తం!

**రామ** : పెళ్లిలో యేవింటోయి గమ్మత్తు

**కొండి** :యేవీఁ గమ్మత్తు లేదండి.

**రామ** : మధురవాణి పాడింది కాదేం?

**కొండి** : పాడింది –

**రామ** : ఆఁ!

**కొండి** : కాదండి.

**రామ** : అలా చెప్పు. అంతసేపూ హెడ్డు కనిష్టీబుతో మాట్లాడుతూంది కాబోలు?

**కొండి** : లేదండి. ఒక్క మాటాళ్లేదు.

**రామ** : మరెందుకన్నావూ, మాట్లాడిందని యిందాకానూ? విరగబడి నవ్విందన్నావే.

**కొండి** : మరీ – మరీ – మరే వొచ్చి– లింగన్న గారి కాంభొట్లు అలా అనమన్నాడు.

**రామ** : వాడిపని పట్టిస్తాను. నాతో వెకాస్యాలా! నువ్వు మాత్రం వాడి జట్టు కూడకు. చిన్నప్పట్నుంచీ నిన్ను యెరుగుదును. నువ్వు నిజాయితీ మనిషివి.

**కొండి** : అవుఁనండి. యెప్పుడూ నేను నిజవేఁ చెబుతాను.

**రామ** : అవును గాని, హెడ్డు కనిష్టీబు మాట మట్టుకు నిజం చెప్పావు కావు. పట్టాభిరామస్వామిఁ మీద ప్రమాణం చేసి, చెప్పూ! మధురవాణి యవరెవరితో మాట్లాడింది?

**కొండి** : మరే వచ్చి – నిజం చెప్పమన్నారూ?

**రామ** : నిజాయితీ మనిషివనే గదా నిన్ను అడుగుతున్నానూ?

**కొండి** : అయితే, – అందరితోటీ మాట్లాడింది.

**రామ** : అందరితోటీ అంటే యవరెవరితోటి?

**కొండి** : యవరెవరా అండి? పెళ్లి వొదిలేసి, అంతా మధురవాణి చుట్టూ మూగాం. భుక్తగారితో మాట్లాడింది, మరే వచ్చి

**రామ** : యింకా యవరితో మాట్లాడింది?

**కొండి** : సిద్ధాంతి మంత్రం చప్పడం మానేసి మధురవాణి చెవులో యేకాంతం మాట్లాడాడు.

**రామ** : మరింకా యవరితోటి?

**కొండి** : మరేవచ్చి – హెడ్డు కనిష్టీబు తోటి.

**రామ** : ఓరి ఛండాలుడా! హెడ్డుతో మాట్లాడ లేదన్నావే?

**కొండి** : అవును మాట్లాళ్లేదు.

**రామ** : ఫుండాఖోర్! మాట్లాడిందా మాట్లాళ్లేదా?

**కొండి** : సచ్చాఁన్రా దేవుఁడా!

**రామ** : అసత్యం అంటే, నాకు వెఱ్ఱి కోపం. ప్రమాణ పూర్తిగా, నిజం చెప్పు. అబద్ధవాఁడితే, తల పేలిపోతుంది. మాట్లాడిందా లేదా?

**కొండి** : లేదు.

**రామ** : ప్రమాణ పూర్తిగా?

**కొండి** : ప్రమాణ పూర్తిగానే.

**రామ** : యిప్పుడు నిజం చెప్పావు. విన్నావా? నీకు చిన్నతనం; ఆడవాళ్ల మీద, ఒహరు అనమన్నా, అన్యాయం మాటలు ఆడకూడదు, తెలిసిందా?

**కొండి** : మధురవాణి మా దొడ్డ మనిషి.

**రామ** : వూళ్లో అలా అనుకుంటారేం ?

**కొండి** : అంతా అనుకుంటారు

(రామప్పంతులు యింటి యెదట)

**రామ** : నేను తలుపు కొడతాను. నివ్వో చిన్న గమ్మత్తు చెయ్యి.

**కొండి** : చిత్తం.

**రామ** : ఈ విచ్చ బేడ మొలని పెట్టుకో, మా పెరటి గోడ అవతల, ఒక అర ఘడియ నిల బడు. దిడ్డీతోవంట, కనిష్టేబు గాని, మరెవరు గాని, పైకి వొచ్చినట్టాయెనా, రెక్కపట్టుకుని, కేకెయ్యి. నేవొస్తాను. లేకుంటే వుడాయించెయి. (కొండు భొట్లు నిష్క్రమించును.) తలుపు తలుపు (తనలో) ఒకంతట తలుపు తియ్యదు. అనుమానాని క్కారణం. వీడు నిజం చెప్పాడా? అబద్ధం చెప్పాడా? నేను పాలెం నించి వొచ్చి కబురు పంపించిన తరవాత రాక, యిది తుఱ్ఱుమని యలా పరిగెత్తి వెళ్లిందీ పెళ్లిలోకి? తలుపు తలుపు! యిప్పటికీ రాదేం!

(మధురవాణి తలుపు తీయును) యేం జేస్తున్నావు యింతసేపు?

**మధు** : ఉదయం నుంచి రాత్రివరకూ చేసే పనులన్నీ, రేపటి నుంచి వ్రాసి వుంచుతాను రండి.

(ఉభయులూ నిష్క్రమింతురు)

(కొండుభొట్లు ప్రవేశించి)

**కొండి** : పంతులుగారూ, పంతులుగారూ,

(రామప్పంతులు, మధురవాణీ ప్రవేశింతురు)

**రామ** : (మధురవాణితో) నువ్వు లోపలకి వెళ్లు (కొండిభొట్లుతో) యేవింటి?

**కొండి** : మరే వచ్చి, – పట్టుకోలేదు.

**రామ** : (తీక్షణంగా) యెందుకు పట్టుకున్నావు కావు?

**కొండి** : చెప్పరానిదాన్ని యలా పట్టుకోవడం?

**మధు** : చెప్పరానిదాన్ని యెందుకు పట్టుకోవడం?

**కొండి** :దిడ్డీ తోవంట యవరొచ్చినా పట్టుకొని, కాకెయమని పంతులు చెప్పారు.

**మధు** : యేవించిత్రం! యేం అప్రతిష్టా! బ్రాహ్మడికి వెట్టెత్తుతూంది కాబోలు.

**రామ** : (మధురవాణి వెనక నిలచి చేతితో వెపొమ్మని కొండిభట్లుకు సౌజ్ఞచేసి) పేలుడుగాయ వైదీకపగుంటడి వెకాశ్యాలు నిజం అనుకుంటావేవింటి?

(లోపలికి వెళ్లును)

(రామప్పంతులు యింటిలోనికి వెళ్లగానే మధురవాణి సావిడి వెనకతలుపు పైనుంచి వేసి,కొండిభొట్లును లోపలికి రమ్మని సౌజ్ఞ చేసి ముద్దెట్టుకొనును.)

**మధు** : (నిమ్మళంగా) బాగా, కాపాడావు!

**కొండి** : మధురవాణీ, యిదుగో పంతులిచ్చిన బేడ. యిదుగో హెడ్డుగారిచ్చిన పావలా. యింద వెండితొడిపొడికాయ (యిచ్చును).

**మధు** : (పుచ్చుకొని) నువ్వు మంచివాడివి. యీవేళ నుంచి, నీకూ నాకూ నేస్తం. తెలిసిందా? (మరివక సారి ముద్దు పెట్టుకొని) యిక వెళ్లు.

(కొండిభొట్లు చెంగున వీధిలోకి యెగిరి వీధి నడుమ గెంతులు వేయును)

(కాంభొట్లు ప్రవేశించి)

**కాంభొ**: యెందుకురా యీ గెంతులు?

**కొండి** : ముద్దెట్టుకుందిరా!

**కాంభొ**: వెట్టివెట్టి వేషాలు వెయ్‌కు. యీ కోతి మొహాన్నే!

**కొండి** : పోస్సి, వెట్టి కుట్టా! మేం జట్టుకట్టాం!

(నిష్క్రమింతురు)

౫వ స్థలము : కృష్ణారాయపురం అగ్రహారంలో.

**(అగ్నిహోత్రావధాన్లు యింటి పెరటిలో గిరీశం పనివాళ్ల చేత పందిరి వేయించుచుండును)**

(వెంకటేశం ప్రవేశించును)

**గిరీశం**: యేమివాయ్ బావా, యెడందవడ యెట్ట బారింది?

**వెంకటేశం** :నాన్న గూబగదలేశాడు.

**గిరీశం**: యేం జేశావు?

**వెంకటేశం** :సంధ్యెవార్చలేదని.

**గిరీశం**: ఆ మాత్రం వార్చినట్లు వేషం వెయ్యలేక పోతివో?

**వెంకటేశం** :చూద్దనుకున్నాను.

**గిరీశం**: అనుకోడాలు పనికి రావోయి, బావా. మనం యేదైనా, వేషం వేశావంటే, ఒకడు చూస్తున్నాడని అనుకున్నప్పుడూ, ఒకడు చూస్తూవుండలేదనుకున్నప్పుడూ కూడా, వొక్క మోస్తరుగా వేషం నడిపిస్తే సేఫ్ సైడ్. చూస్తున్నావు కావా, రోజూ నేను యెంతసేపు బక ధ్యానం చేస్తానో?

**వెంకటేశం** :యేవంని ధ్యానం చాస్తారు?

**గిరీశం**: యేం ధ్యానవాఁ? యీ చాదస్త బ్రాహ్మడు యంతట్లో దేవతార్చనచాస్తాడు. యంతట్లో విస్తట్లో మెతుకులు పడతాయి అని తదేక ధ్యానం చేస్తాను.

**వెంకటేశం** :మంత్రాలు చదివి దేవుణ్ణి ధానం చెయ్యాలి గాని, అన్నం కోసం ధానం చేస్తే పాపం కాదా?

**గిరీశం** : ఇగ్నొరెన్స్! మత సంబంధమైన సంగతులు నీకేమీ తెలియవు. యీ పెళ్లి అయిపోయిన తరవాత నిన్ను మతంలో తరిఫీదు చెయ్యాలి. అన్ని మతాలూ పరిశీలించి వాటి తాలూకు యసెన్స్, నిగ్గుతీసి ఓ కొత్త మతం యేర్పర్చాను. అది అమెరికా వెళ్లి ప్రజ్వ లింప చేస్తాను. యిప్పుడు మట్టుకు నీ సంశయం తీరుస్తాను. యేమన్నావ్? అన్నాన్నా ధ్యానించడం, అని కదూ? యేవంందోయి నీ ఉపనిషత్తు? "అన్నం బ్రహ్మేతివ్యజానాత్" అన్నవేఁ, బ్రహ్మ అని తెలుసుకోవోయి వెధవాయా, అంది. తెల్లవాడు యేవంని ధ్యానం చేస్తాడోయి రోజూనూ? "ఫాదర్, గివ్, అస్ అవర్, డెయిలీ, బ్రెడ్" అనగా "నన్ను కన్న తండ్రీ, రోజూ ఒక రొట్టెముక్క ఇయ్యవోయి అని" –ఇక, మనవేవనాలి? "తండ్రీ

రోజూ కందిపప్పు, ధప్పళం ఇయ్యవయ్యా" అని ధ్యానించాలి. మన చమకంలో యేమన్నాడూ? "శ్యామాకాశ్చమే" "చామల అన్నం మామజాగా వుంటుంది, నాక్కావాలి, ఓ దేవుఁడా!" అన్నాడు. ఆ చమకంలో యవడికి యిష్టమైఁన వస్తువులు వాడు కలపవచ్చును "కంది గుండాచమే, యింగువ నూనాచమే" దీనినే రిలిజియస్ రిఫార్మ్ అంటారు.

**వెంకటేశం** :గేదె పెరుగూచమే, చేగోడీచమే.

**గిరీశం**: చబాష్! అదే ఒరిజినాలిటీ – అడిగితే గాని అమ్మ అయినా పెట్టదు. దేవుడు మాత్రం ముద్దిస్తాడనుకున్నావా యేమిఁటి? నీకు యెప్పుడు యేమి కావలిస్తే అప్పుడు ఆ వస్తువులు సంపుటీ చేసి చమకపారాయణ ఆరంభించేది.

**వెంకటేశం** :అయితే రేపణ్ణించి నేను రోజూ చమక పారాయణ చేస్తాను.

**గిరీశం**: మనస్సులో చెయ్యి. పైకి పారాయణ చేశావంటే, నీ తండ్రి ఎడ్యుకేషన్ లేకపోవడం చేతా, రీజన్ తెలియకా, యిదేవిఁటి చమకం పాడు చేస్తున్నాడని పెణతెక్కగొట్టి, తొమ్మిదో అష్టం ఘనం పారాయణ చేస్తాడు.

**వెంకటేశం** :మొన్న బుగతగారి యింట్లోంచి మీరు పొగాక్కట్ట యెత్తుకొచ్చారు గదా, పాపం చేశారని దేవుఁడు కోప్పడ్డా?

**గిరీశం** : చిన్నతనంలో మా పింతండ్రి (నీ తండ్రి లాగే అగ్గిరావుఁడోయి) చెవి నులిపి నా చేత ఉపనిషత్తులు చదివించాడు. దాం తస్సా గొయ్యా, పేరు మరిచిపోయినాను గాని, ఒక వుపనిషత్తులోను, శిష్యుడు ప్రశ్న అడుగుతూవుంటే, గురువు సమాధానం చెబుతూంటాడు. ఆ వుపనిషత్తులో చెప్పిన శిష్యుల్లాంటి శిష్యుడివి నువ్వు; అలాంటి గురువుని నేను. మన ప్రశ్నోత్తరాలు యవడైనా తాటాకు మీద రాసి పారేశాడంటే, ఒక రెండువొందలేళ్ళు అయిన తరవాత "టొబాకోపనిషత్తు" అవుతుంది. పొగాకు కట్టకి పాపవేఁవిఁటోయి, కాల్చి పారేసేదానికి? అందులో పొడుం చేసే బుద్ధిహీనుల దగ్గర పొగాకు యెత్తుకు రావడం లోకోపకారవఁని నమ్ము.

**వెంకటేశం** :యలాగండి లోకోపకారం?

**గిరీశం** : యలాగా, యిదుగో, యిలా చుట్ట కాలిస్తే, స్టీము యంజన్ లాగ, భగ్, భగ్ మని పొగ ఆకాశానికి పరిగెత్తి మేఘమైఁ వర్షం కురిపిస్తుంది. పొడుం గాని పీలుస్తే ఆ ఘాటుకి, ఆకాశం ఆర్చుకుపోతుంది. ముక్కంట మాత్రం చిరి వర్షం కురిసి యిల్లూ వొళ్లూ కూడా డర్టీ అవుతుంది. గనక పొడుం చేసే మూర్ఖుల యింట్లో వుండే పొగాకంతా

దొంగిలించి చుట్టలు గట్టి, తగలెట్టవలసినదే. ఒకవేళ, గిరీశం గారూ, తమరు దొంగతనం చేశారు, కొద్ది రోజులు నరకానికి విజయంచెయ్యండి, అని దేవుఁడు గానీ, అన్నట్టాయనా, ఒకచిన్న లెక్చరుకొట్టి, గభరాయింపజేస్తాను.

**వెంకటేశం** :యేవని లెక్చరు కొడతారు?

**గిరీ** : యేవంనా? ఓ దేవుఁడా! నా మనస్సు యిండిపెండెంటుగా సృజించావా? లేక డిపెండెంటుగా సృజించావా? యిండిపెండెంటుగా అయితే, నా యిష్ట వొచ్చినపనల్లా నేను చేశాను, నువ్వెవరు అడగడానికి? యిలాంటి చిక్కులు పెట్టావంటే హేవెన్‌లో చిన్న నేషనల్ కాంగ్రెస్ వొకటి లేవదీస్తాను. లేక నన్ను డిపెండెంటుగా చేశావూ? అహ్లాగయితే నువ్వే నా చేత పాపం చేయించావు గనక నీకే ఆ శిక్ష కావలిసింది. దేర్ ఫోర్ చలో, నరకానికి, ఛలో! అక్కణ్ణించి నువ్వు తిరిగీ వొచ్చేలోగా, ఆరు ఘుడియలు స్వర్గంలో నీ అధికారం, నాకిస్తివట్టాయనా, కొన్ని సృష్టిలో లోపాలు సవరణ చేస్తానంటాను.

**వెంక** : యేవిఁటండి లోపాలు?

**గిరీ** : లోపాలన్న లోపాలా! నీ చేతే వొప్పిస్తాను. నెంబర్ వన్ – నీ మేష్టరు లాంటి అభాజనుణ్ణి పుట్టించడం లోపం అంటావా అనవా?

**వెంక** : లోపవేఁ.

**గిరీ** : నీ సిస్టర్ లాంటి బ్యూటిఫుల్ యంగ్ గర్లుని, విడోని చెయ్యడం తప్పంటావా, ఒప్పంటావా?

**వెంక** : తప్పే.

**గిరీ** : యిలాంటి లోపాలు కోటానకోట్లు. యిక రద్దు సృష్టి యంతుందనుకున్నావు? ఫరిన్‌స్టెన్స్, యెన్ని సముద్రాలు వున్నాయి?

**వెంక** : యేడు.

**గిరీ** : యేడూ, యేడిసినట్టే వున్నాయి. పాల సముద్రం వుంటూ వుండగా మళ్ళీ పెరుగు సముద్రం, నేతి సముద్రం యెందుకోయి? యిది ప్లియోనిజమ్, పునరుక్తి – మరో తెలివితక్కువ చూశావా? యెందుకూ పనికిమాలిన ఉప్పు సముద్రం మన నెత్తిని కొట్టి, పెరుగు, పాలు, నెయ్యి, చెరుకుపానకం, యీ సముద్రాలన్నీ యవడికీ అందుకు రాకుండా దూరంగా విసిరేశాడోయి. ఒక సంవత్సరం గాని నాకు దేవుఁడు దివాన్గిరీ యిస్తే, భీముని పట్ణానికి పాల సముద్రం, విశాఖపట్ణానికి మంచినీళ్ళ సముద్రం, కళింగపట్ణానికి చెరుకుసముద్రం తెస్తాను. యీ యీస్టర్న్ ఘాట్సు అంతా పొగాకు

అరణ్యం చేస్తాను. యీ లెక్చరు నేను కొట్టేసరికి, దేవుఁడు యేవఁంటాడో తెలిసిందా? వీడు అసాధ్యుల్లా వున్నాడు, వెనకటికి "పాతయముడివా? కొత్త యముడివా" అని అడిగిన పెద్ద మనిషి కంటే ఒక ఆకు యెక్కువ చదువుకున్నట్టు కనబడతాడు. గనక వీడికో జోడు గుఱ్ఱాలబండీ యిచ్చి, స్వర్గంలో వున్న యావత్తు మహలులు, బగీచాలూ చూపించి, యేంకావాలంటే అది యివ్వండని దేవదూతలతో చెబుతాడు. నా శిష్యుడు వెంకటేశాన్ని కూడా తీసుకొస్తే గాని, నాకేం తోచదని నే చెబుతాను. అప్పుడు నిన్ను విమానమ్మీద తీసుకొస్తారు. మనవిఁద్దరం స్వర్గంలో మజా వుడాయిద్దాం. యీ వేళకి మతం మీద యింతవరకు లెక్చరు చాలును. యిక వెళ్లి దేవాలయం తోటలో కోతిపిల్లిని కట్టి ఆడుకో. సాయంత్రానికి నీ తండ్రి వొచ్చేసరికి మాత్రం, దీపం యదట కూచుని పుస్తకం తిరగేస్తూ పులుసటుకులు ధ్యానం చెయ్యి. యింగువవేసి బలే సొగుసుగా తయారు చేస్తాను (వెంకటేశం వెళ్ళును) రనెవే.

(బుచ్చమ్మ ప్రవేశించి.)

**బుచ్చమ్మ:** యీ రుబ్బురోలు నిండా తాటాకు ముక్కలు పడుతన్నాయి. యివతలకి లాగేసి పెడతారూ.

**గిరీ** : అదెంతపని.

(గిరీశం రుబ్బురోలు, పందిరి అవతలకు లాగును.
బుచ్చమ్మ రుబ్బురోలు కడిగి మినపపప్పు రుబ్బును.)

**గిరీ** : (పాడును) "భజగోవిందం, భజగోవిందం. గోవిందం భజమూఢమతే" యేం, వదినా, కంటనీరు పెడుతున్నారూ?

**బుచ్చ** : యేవీఁ లేదు.

**గిరీ** : మీరు కంటనీరు పెడితే నా మనసు కలిగిపోతూంది.

**బుచ్చ** : మీకేం – మహరాజులు – మా కష్టాలు మమ్మల్నే బాధిస్తాయి.

**గిరీ** : యేమి కనికరం లేని మాట అన్నారూ! మీరు అలా దుఃఖంలో మునిగి వుంటే, యెందుకు నాకీ వెధవ బతుకు? మీ కోసం యేం చెయ్యమంటే అది చాస్తానే? ప్రాణవిఁచ్చెయ్యమంటే యిచ్చేస్తానే? దాఖలా చూడండి యిదుగో కత్తిపీట!

**బుచ్చ** : (కత్తిపీట దగ్గిర తీసుకుని) చెల్లికి యీ సమ్మంధం తప్పించారు కారు గదా?

**గిరీ** : అదొక్కటి మట్టుకు నాకు సాధ్యమైఁంది కాదు.

**బుచ్చ** : అయితే మీతో నాకేం పనీ? యింత సందడిగా పెళ్లి పనులు చేయిస్తున్నారు. మా నాన్నకి తోచకపోతే, మీకైనా తోచకూడదా, యీ సమ్మంధం కూడదని? మీకు కూడా దానిమీద ఇంత కనికరం లేకపోవాలా? లుబ్ధావుఁధాన్లు మీకు అన్నగారని కాబోలు మీకు సంతోషం.

**గిరీ** : నాకా సంతోషం? యంత క్రూరమైన మాట అన్నారు! ఈ సంబంధం ఔతుందని, నా మనస్సులో యంత ఖేదిస్తున్నానో, ఆ భగవంతుడికి తెలుసును. యీ సంబంధం తప్పించాలని చెడ చివాట్లు పెడుతూ మా అన్న పేర రెండు టావులు వుత్తరం రాశాను. చెవిని పెట్టాడుకాడు. నేను యేంచేతును? వాడిని స్మరిస్తేనే పాపం వొస్తుంది. ఊరికే కూచుంటే, మీ తండ్రి యేవఁను కుంటాడో అని, మీ యింట అరవ చాకిరీ చేస్తూ నీకు యేనాటికైనా కనికరం వొస్తుందేమో అని ఒక్క మనిషిని నూరుమంది చేసేపని చేస్తున్నాను. అంతేగాని, యీ నమ్మిన నౌఖరు మీద నీ మనసు భారంగా వుంటే, యవరికీ చెప్పకుండా యీ రాత్రి లేచి మా దేశానికి వెళ్లిపోతాను.

**బుచ్చ** : వెళ్లిపోకండి.

**గిరీ** : నేను మాత్రం పోయే సాధనం యలాగ? యెన్నో మాట్లు యేవఁనుకుంటాను? యీ పెళ్లి తప్పించ లేకపోయినాను గదా? నా ప్రాణం కంటే యిష్టమైన యీ బంగారపు బొమ్మలాంటి బుచ్చమ్మని పునిస్త్రీని చెయ్యలేక పోయినాను గదా? అని విరక్తి పుట్టి, పోదాం అని నిశ్చయించే సరికి – కాలు ముందుకు వేసినా, మనస్సు వెనక్కి లాగి యేమితోచేదీ? "పైకి పోతానని సందడి పడుతున్నాను. నా బుచ్చమ్మ కనపడకపోతే, పోయి బతకడం యలాగ? దానికి యంత కనికరం లేకపోయినా, యిక్కడే వుండి చూశైనా సంతోషిద్దాం" అని వుండి పోతూ వొచ్చాను.

**బుచ్చ** : మీరు చెబితే, లుబ్ధావుఁధాన్లు గారు పెళ్లి మానుకుంటాడని తమ్ముడు చెప్పాడు?

**గిరీ** : నే చెప్పినమాట, యీ భూప్రపంచంలో యవడూ కొట్టి వెయ్యలేడు. అందుచేత, వెంకటేశం అలా అని వుంటాడు గాని, మీ తండ్రి ఒకడు, మా అన్న వకడు లోకా తీతులు. వాళ్లు బ్రహ్మ చెబితే వినరు. ఈయనకి వెఱ్ఱికోపం. అతగాడు శుద్ధ పీసిరిగొట్టు. మా అన్న సుఖపడ్డానికా యీ పెళ్ళి తలపెట్టాడు? నీ మొగుడు నిన్ను పెళ్లాడి యంత సుఖపెట్టాడో, మా అన్న నీ చెల్లెల్ని పెళ్లాడి, అంతే సుఖ పెడతాడు. ఆఫ్రికా దేశంలో స్లేవరీ అని వుంది. అనగా మనుషుల్ని పట్టి పశువుల్లాగ బజార్లలో అమ్ముతారు. యవరు కొనుక్కుంటే వాళ్ల యింట్లో ఆయా మనిషి బతికినన్నాళ్లూ చాకిరీ చెయ్యాలి. అలాగ్గానే మా అన్న, మీ చెల్లెలిని పెళ్లి అనే మిషపెట్టి కొంటున్నాడు. వాడింట యిది

జీతంలేని బాపనక్కలాగ పనీ పాటూ చేస్తుందని, వాడి ఆశ. నేను కూడదని యంత గడ్డిపెట్టినా విన్నాడు కాడు. యీ కష్టాలన్నీ యిలా వుండగా నాకు మరో భయం వేస్తూంది. చెబితే కోపం తెచ్చుకోవు గద!

**బుచ్చ** : మీరేం చెప్పినా నాకు కోపం లేదు.

**గిరీ** : ఆ మాత్రం ధైర్యమిస్తే నాక్కావలసిందేవిఁటి? రామచంద్రపురం అగ్రహారీకులు బహు దుర్మార్గులు – మా అన్న చచ్చిపోయిన తరవాత నీ చెల్లెల్ని తిన్నగా ఉండనియ్యరు. అదికూడా మా మీనాక్షి మోస్తరౌతుంది.

**బుచ్చ** : మీనాక్షికేం లోపం వొచ్చింది?

**గిరీ** : యేవఁని చెప్పను. కడుపు చించుకుంటే కాళ్ల మీద పడుతుంది. అయినా నీ దగ్గిర నాకు దాపరికం యేవిఁటి? దాని మొగుడు పోయిన తరవాత యేటేటా కడుపు, అవుతూ వుండడం. అయినప్పుడల్లా వొల్లమాలిన అల్లరిన్నీ. ఒకప్పుడు అది ప్రాణభయం కూడా చేస్తుంది. ఆ వూళ్లో రామప్పంతులని వొక పరమదుర్మార్గుడు నియ్యోగప పంతులు వున్నాడు. వాడు ఒక సానిదాన్ని వుంచుకున్నాడు. యెందరినో సంసార్లని చెడగొట్టాడు. మా అన్న వ్యవహారాలన్నీ ఆ పంతులే చూస్తాడు. మా అన్న చచ్చిన ఉత్తరక్షణం, నీ చెల్లెలికి వొల్లమాలిన ధనం చేతిలోకి వొస్తుంది. స్వాతంత్ర్యం కలుగుతుంది. "యేమి ఇది?" అని అడిగే వాడుండడు. యిహ, చెడిపోవడానికి అభ్యంతరవేఁవిఁటి? "నేను కట్టుగావున్నాను కానా?" అని నువ్వు అనగలవు. నీ మొగుడి తాలూకు ఆస్తి నీ చెయ్యి చిక్కలేదు. మొగుడి యింటికైనా నువ్వు వెళ్లలేదు.

**బుచ్చ** : అవును.

**గిరీ** : తల్లిదండ్రుల చాటున ఖాయిదాగా వున్నావు. పరాయి వాడు యింట్లో అడుగు బెట్టలేదు. గాని యిలా యెంతకాలం వెళ్లుతుంది? నిన్ను తల్లిదండ్రులు కలకాలం కాపాడలేరు గదా? వాళ్లు పోయిన తరవాత నీకూ స్వాతంత్ర్యం వొస్తుంది. యే కాలానికి మనసు యలా వుండునో? అప్పుడు కాలుజారిన తరవాత, నువ్వు యేవఁనుకుంటావు? "అయ్యో నాడు గిరీశాన్ని శాస్త్రోక్తంగా పెళ్ళాడి పునిస్త్రీనయిపోతే, పిల్లాపేకా కలిగి, అష్టైశ్వ ర్యంతో తులతూగుదును గదా, యీ దురవస్థ నాకు రాకపోవును గదా" అని విచా రిస్తావు. అప్పుడు నే యెక్కడ వుంటానూ? స్వర్గంలో మీకోసం యెదురు చూస్తూ వుంటాను. యీ పెళ్ళి అయిపోయిన తరవాత వెంకటేశమూ, నేనూ పట్నానికి వెళ్ళిపోతాం. నిన్ను, తలుచుకుంటూ, నిద్రాహారం మానేసి, కొన్ని రోజులు వుంటాను. యెంతకాలవఁని మనిషన్న వాడు, నిద్రాహారం మాని వుండగలడు? నిన్ను తలుచుకుని

తలుచుకుని నిద్దర పట్టక, రెండు ఝాముల రాత్రప్పుడు నా గదిలో యీజీ చెయిరు మీద కూచుని వుండగా–యదట బల్లమీద మెరుపుదీపం, గోడని నిలువుటద్దం వున్నాయి – ఆ అద్దంలో నా ముఖం చూసుకుని యేమంటానూ? "యీ సొగుసైన ముఖం, యీ తామర రేకుల వంటి నేత్రాలు, యీ సోగమీసాలు, యివన్నీ వృధా గదా? యవరు చూసి ఆనందించనూ? నా బుచ్చమ్మ, నన్ను పెళ్లాడక పోయిన తరవాత నా బతుకు యెందుకు" అని, నిస్పృహ కలిగి ఛఝ్ఝున టేబిలు సొరుగు తీసి, అందులోవున్న జోడు గుళ్ల పిస్తోలు యెక్కు బెట్టి గుండె దూసిపోయేటట్టు కొట్టేసుకుంటాను.

**బుచ్చ** : కొట్టుకోకండి. మీరు అలా అంటే నాకు యేడుపొస్తుంది.

**గిరీ** : తక్షణం దేవతలు విమానం పంపించి నన్ను స్వర్గానికి తీసుకువెళతారు. స్వర్గానికి వెళ్ళానని నాకు అక్కడ మాత్రం సుఖవుంటుదనుకున్నావా వొదినా? నవాభరణ భూషితురాలయి రంభ తక్కుతూ తారుతూ వొచ్చి, "హా! ప్రియ! గిరీశ! నీలాంటి సుందరుణ్ణి యన్నడూ నేను చూడలేదు. రమ్ము, నన్ను చేకొమ్ము" అని రెక్కబట్టుకు లాగుతుంది. నేనేవంటానూ? "ఛీ! అవతలికిఫో! నేను ఏంటీ నాచ్చి! సానిది తాకితే, పరమ అపవిత్రంగా తలుస్తాను. పియర్సు సబ్బు రాసి కడిగితేనే గాని యీ చేతికి కశ్మలం పోదు. నువ్వా రంభవి? మా బుచ్చమ్మ సొగుసుకి నువ్వువొడ్డీకి పనికిరావు, గోయెవే, డామ్, డర్టీ గూస్" అని అంటాను. అలాగే, మేనకా, ఊర్వసీ, తిలోత్తమా మొదలైన యావన్మంది అప్సర స్త్రీలనీ తన్ని తగిలేస్తాను. తగిలేసి, కాషాయ వస్త్రాలు ధరించి కల్పవృక్షచ్ఛాయని "హా! బుచ్చమ్మా, బుచ్చమ్మా" అని నీ పేరు జపం చేస్తూ అనేక సంవత్సరాలు పద్మాసనం మీద వుండిపోతాను. అంతట కొన్నాళ్లకి నా తపస్సు ఫలించి, నువ్వు నందనవనంలోకి చంద్రోదయం లాగ బయలుదేరి వస్తావు. నేను "ప్రియురాలా! యెన్నాళ్లకి వొచ్చావు!" అని అమాంతంగా వెళ్లి నిన్ను కౌగలించు కుంటాను. అప్పుడు నీ మొదటి మొగుడు, ముసిలి వెధవ, గావంచా గుడ్డకట్టుకుని, పొడుంముక్కుతో "బుచ్చమ్మ నా పెళ్లాం" అని అడ్డురాబోతాడు. "వెధవాయా, నువ్వు బుచ్చమ్మకి తగవు. నీ రూపాయలు నువ్వు పట్టుకుపో" అని, వొక్కతాపు తన్ని తగిలేస్తాను. మనం యిద్దరం సుఖంగా స్వర్గంలో శాశ్వతంగా వుండిపోతాం.

**బుచ్చ** : యేడుస్తూన్న దాన్ని నవ్విస్తారు.

**గిరీ** : నువ్వు నన్ను పెళ్లాడితే, మనం బతికున్నంత కాలం నవ్వుకుంటూ, ఆనందిస్తూ కాలం వెళ్లబుచ్చుతాం. అప్పుడు నిన్ను యిలా పప్పు రుబ్బనిస్తానా? మనకి యెంత మంది నౌఖర్లు వుంటారు! యెంతమంది చాకర్లు వుంటారు! తోటలు, దొడ్లు, గుఱ్ఱాలు,

బళ్ళు! నిన్ను నడవనిస్తానా? పుష్పం లాగ నెత్తిమీద పెట్టుకుంటాను. అప్పుడు నీకు కలిగే ఆనందం ఆలోచించుకో.

**బుచ్చ** : నా జన్మానికి మరి ఆనందవెఁక్కడిది?

**గిరీ** : నేను, నీకు దాసుడనై, "యిదుగో నన్ను స్వీకరించు, నన్ను పెళ్ళాడి, ఆజన్మం ఆనందం అనుభవించు. నన్ను ఆనందంలో ముంచు" అని బతిమాలుకుంటూంటే, నువ్వు అట్టి సులభసాధ్యమైన సుఖమును కాలున తన్నుకు వెళ్లిపోయి, నా బతుకు కూడా బుగ్గిని కలిపితే, నేనేమి చెయ్యగలను?

**బుచ్చ** : మీ బతుక్కి లోపవేఁవి? మీరు మహరాజులు.

**గిరీ** : నువ్వునన్ను పెళ్లాడితే నేను మహారాజునే అవుతాను. నీ నోటంటవచ్చిన మాట అమోఘం – వొట్టినే పోకూడదు. గనక నాతో వెళ్లిపోయిరా.

**బుచ్చ** : అమ్మ నాయనా! నే మీతో రాను.

**గిరీ** : సరే. రాకపోతే నేనే గదా ప్రాణత్యాగం చేస్తాను? పీడానాడా కూడా పాయె.

**బుచ్చ** : అలాంటి మాటలు అనకండి.

**గిరీ** : చేసేమాట, చెబితే తప్పేమిఁటి? నేనేమైతేనేం గాని, నీ చెల్లెలిమీదైనా నీకు కనికరం కద్దా?

**బుచ్చ** : అదేం, అలా అడుగుతున్నారు?

**గిరీ** : నిజంగా కనికరం వుందా?

**బుచ్చ** : వుండకుండా వుంటుందా?

**గిరీ** : వుంటే, యీ పెళ్లి తప్పించే సాధనం నీ చేతులోనే వుంది.

**బుచ్చ** : నా చేతులోనా?

**గిరీ** : అక్షరాలా.

**బుచ్చ** : యేమి చిత్రమైన మాటలు చెబుతారు!

**గిరీ** : యీ భూ ప్రపంచం మీద వుండుకున్న యావన్మంది స్త్రీలలోనూ, నిన్నొక్కర్తెనూ వలిసి, నేను నీకు సుతలామూ లొంగిపోబట్టి గదా, నా బతుకు హాస్యాల కింద ఐపోయింది?

**బుచ్చ** : మీ తోడు – ఆలా అనకండి.

**గిరీ** : పోనియి – ఆ మాత్రం భరవసాయిచ్చావు. ఒక మాట నాకు ప్రమాణ పూర్తిగా చెప్పు. నీ చెల్లెలు పెళ్లి తప్పించడం, నీ చేత అయితే, చేస్తావా?

బుచ్చ : చెయ్యనా?

గిరీ : యేమో, చేస్తావో చెయ్యవో! చేస్తానని ప్రమాణం చేస్తేనే, ఆ మాట నేను చెబుతాను.

బుచ్చ : యేఁవఁని ప్రమాణం చెయ్మన్నారు?

గిరీ : నా మీద ప్రమాణం చెయ్యి.

బుచ్చ : మీ మీద ప్రమాణమే; చెప్పండి.

గిరీ : అయితే విను. వొంటరిగా చూసి, యీ మాటే నీతో రహస్యంగా చెప్పుదావఁని కాచి, కాచి వుండగా, యీ వేళ, మీ తండ్రి వూరికి వెళ్లడం, మీ తల్లి వాకట వుండడం నుంచి, సమయం చిక్కింది. చెవి వొగ్గి విను. నీ చెల్లెలి పెళ్లి తప్పడానికి ఒక్కటే సాధనం వుంది. అది యేవిఁటంటే, నువ్వు ముందూ వెనకా ఆలోచించక, నాతో లేచివచ్చి నన్ను పెళ్లి చేసుకోవడవేఁ – లేకుంటే నీ చెల్లెలి పెళ్లి తప్పదు.

బుచ్చ : (ముసిముసి నవ్వుతో) నేను మీతో లేచివొస్తే మా చెల్లెలు పెళ్లి ఆగిపోతుందీ? యేవిఁ చిత్రాలు!

గిరీ : ఆ మాట నీ చేతనే వొప్పిస్తాను కదూ – విను – పెళ్లికి తర్లివెళ్ళుతూన్నప్పుడు, రెండో నాడు రాత్రి బండీ వాడి చేతులో నాలుగు రూపాయలు పెట్టి, నీ బండీ తోవ తప్పించి అనకాపిల్లి రోడ్డులో పెట్టిస్తాను. అక్కడ నుంచి రామవరం దాకా మా స్నేహితులు అంచీబళ్లు ఖణాయిస్తారు. ఆడుతూ పాడుతూ, మనం దౌడాయించి రామవరంలో పెళ్లాడేసుకుని సుఖంగా వుందాం. యిక మీ వాళ్ల సంగతి యేవొఁతుందీ? మనం వుడాయించిన మన్నాడు తెల్లవారగట్ల, నీ బండీ కనపడక, కలవిలపడి, మీ వాళ్లు నెత్తీ నోరూ కొట్టుకుంటారు. నీ చెల్లెలు పెళ్లి ఆగిపోతుంది. మరి రెండు రోజులికి మనం పెళ్లాడావఁని తెలుస్తుంది. నిన్ను ముసలివాడికి కట్టిబెట్టి నందు వల్ల కలిగిన చిక్కులు చూస్తూ, నీ తండ్రి నీ చెల్లెలికి మళ్లీ ముసలి సంబంధం చెయ్యడు. నీ తండ్రి ఒకవేళ మూర్ఖించి పెళ్లి చేస్తానన్నా, మన తమాషా విన్న తరువాత, నా అన్న నీ చెల్లెల్ని మరి పెళ్లి చేసుకోడు, యిది సిద్ధాంతం అవునా కాదా?

బుచ్చ : అవును కాబోలు.

గిరీ : అయితే మరి అందుకు సమ్మతేనా?

బుచ్చ : యెందుకు?

గిరీ : నాతో వెళ్లిపోయి రావటానికి.

బుచ్చ : అమ్మ నాయనా, నా ప్రాణంపోతే నేను మీతో రాను.

**గిరీ** : రాకపోతే, మీ చెల్లెలికి యీ పెళ్లీ తప్పదూ, నాకు చావూ తప్పదూ.

**బుచ్చ** : అలా అనకండి.

**గిరీ** : అనకపోతే మాత్రం, చావు తప్పేదుంది గనకనా? నిన్ను వొదిలి బతకలేను, అది వకచావు, నువ్వు నా మీద వొట్టు వేసుకుని ఆ మాట తప్పిపోతే, నన్ను దేవుఁడే చంపేస్తాడు. అది రెండో చావు. మరి నాకు చావు యెలా తప్పుతుంది?

**బుచ్చ** : నానించి మీరు చచ్చిపోతే, నేనూ చచ్చిపోతాను. చచ్చిపోకండి.

**గిరీ** : నా వశవాఁ? అదుగో నీ తమ్ముడు వొస్తున్నాడు. మరి మనం యీ కష్టసుఖాలు మాట్లాడుకోవడానికి వీలు చిక్కదు. ఒక్క మాట చెప్పు. బతకమన్నావా? చావమన్నావా?

**బుచ్చ** : వెయ్యేళ్లూ బతకండి.

**గిరీ** : అలాగైతే, నాతో రావడం ఖాయవేఁనా?

**బుచ్చ** : యేంజెయమంటే అది చేస్తాను.

(వెంకటేశం మిడతను పట్టుకు ప్రవేశించును.)

**వెంక** : యిదుగోనండోయి, గొల్లభావఁని పట్టుకున్నాను.

**గిరీ** : చూశావూ, వొదినా! నీ తమ్ముడు చిన్న గుంటడయీ, అప్పుడే గొల్లభావఁల్ని పట్టుగుంటున్నాడు.

**బుచ్చ** : (ముసిముసి నవ్వు నవ్వుచు) మిడత!

**గిరీ** : (బుచ్చమ్మతో) యిన్నాళ్లకి మిడతంభొట్లు చేతులో చిక్కాడు. (వెంకటేశంతో) యిలాతే – మిడతల్ని పట్టుకోవడం మంచి ఎడ్యుకేషన్ – యిదే, నాచురల్ హిస్టరీ, ప్రకృతి శాస్త్రం అంటారు.

**వెంక** : అక్కయ్యా – కొంచం ఊరుబిండి!

**గిరీ** : అమ్మ చూస్తే తంతుంది.

**వెంక** : అమ్మ చూడదులే! (ఊరుబిండి చేతులో వేసుకుని నాలుకతో నాకి గెంతును.)

(తెరదించవలెను)

★★★

# కన్యాశుల్కము

## పంచమాంకము

### ౧వ స్థలము : లుబ్ధావధాన్లు పడకగది

లుబ్ధావధాన్లు మంచముమీద పరుండివుండును. నిద్రలో అరచి, కాళ్లూ చేతులూ కొట్టుకుని, లేచి కూచుని, వణక నారంభించును.

**లుబ్ధా** : అసిరిగా! అసిరిగా! అమ్మో! చంపేశాడత్తోయి. రామనామతారకం। రామనామతారకం। రామనామ తారకం । రామ నామ తారకం॥ యిది రెండో పెళ్లి ముండే. దీని మొగుడు పిశాచవైఁనాడు – నా పీక పిసికి చంపేస్తాడు. యేవిఁటి సాధనం? రామనామతారకం। రామనామతారకం।

(తలుపు అవతల నుంచి) అసిరిగాడు – యేటిబాబూ? యేటిబాబూ? (తలుపు తట్టును)

**మీనా** : యేవిఁటి నాన్నా, తలుపు తియ్యి.

**లుబ్ధా** : (తనలో) కాళ్లు ఆడవు. చేతులు వొణుకు తున్నాయి. (తలుపు తీయును; అసిరిగాడితో) వెధవా నువ్వు లోపలకి రాకు.

**అసిరి** : నాను పిలుస్తొస్సినాను (నిష్క్రమించును)

(మీనాక్షి – శిష్యుడు ప్రవేశింతురు)

**లుబ్ధా** : (మీనాక్షితో) ఆ ముండని అవతలుండమను.

**మీనా** : నువ్వు మన గదిలోకి వెళ్లిపో అమ్మా (శిష్యుడు గది అవతలకి వెళ్లును) యేవిఁటి నాన్నా?

**లుబ్ధా** : యిహ, నే బతకను.

**మీనా** : యేవొఁచ్చింది నాన్నా, కడుపునొప్పా, కాలు నొప్పా.

**లుబ్ధా** : కడుపునొప్పీ కాదు, కాలునొప్పీ కాదు, వెధవ ముండని పెళ్లాడిన కుంకపీనుగ బతకడం యలాగ?

**మీనా** : యేవిఁటా వోగాయిత్యం మాటలు, నాన్నా? మీకు యీ లేనిపోని అనుమానం యవరు పెట్టారు?

**లుబ్ధా** : అనుమానవేఁవిటి? నిజం, నిజం, నిజం – వూరంతా అదేమాట.

**మీనా** : యీ రావఁప్పంతులే యిలాంటి అపవాదలన్నీ వేస్తూ వుంటాడు. కనపడ్డ వాడితో అల్లా వూసు పెడితే, వూరంతా అనుకోరూ? బంగారం లాంటి పిల్లని యిలాంటి మాటలని బెంబేరు పెట్టకండి. తండ్రి వెళ్ళిపోయినాడని అది రాత్రీ పొగలూ యేడుస్తూంది.

**లుబ్ధా** : వెధవ తండ్రీ! బోడి తండ్రీని! గాడిద కొడుకు రెండో పెళ్లి ముండని నా పీకకి ముడేసి అమాంతంగా నా కొంప ముంచాడు! యిహ బతకను యిహ బతకను.

**మీనా** : "రెండో పెళ్లి ముండ, రెండో పెళ్లి ముండ" అని శుభమల్లే అనకండి. మీరే యిలా సాటుతూ వుంటే వూరంతా అనడం ఆశ్చర్యవాఁ? మాట్లాడక వూరుకోండి.

**లుబ్ధా** : వూరుకోవడవెఁలాగే? మనవూరా? మన దేశవాఁ? రెండో పెళ్లి ముండ కాకపోతే ఆ తండ్రి వెధవ, పేరయినా చెప్పకుండా పారిపోవడవేఁవిఁ?

**మీనా** : సిద్ధాంతితో చెప్పొట్టే, పేరు?

**లుబ్ధా** : వాడి శ్రాద్ధం చెప్పాడు. సిద్ధాంతి గడియకో పేరు చెబుతున్నాడు.

**మీనా** : అతగాడికి మాత్రం కొత్తవాడి పేరు జ్ఞాపకం వుంటుందా యేవిఁటి? మన పిల్ల మన యింట్లో వున్న తరవాత అతగాడి పేరుతో మీకేం పని?

**లుబ్ధా** : యీ పెళ్లాం ముండ నా యింట్లో వుంటే నేను చచ్చిపోతాను, మరి బతకను.

**మీనా** : వెఱ్ఱి కేకలెయ్యక నోరు మూసుకుని వూరుకోండి. యిరుగు పొరుగువారు నవ్వగల్రు. మీ మావఁగాఁరు యంతపండితుడు, యంత దొడ్డ మనిషి! లేనిపోని అనుమానాలు పెట్టుగోకండి. పసిపిల్ల బెంగెట్టుకోగల్దు.

**లుబ్ధా** : ఓసి భ్రష్టా! వాడు నీకేవఁయినా యిచ్చాడా యేవిఁటే, వాణ్ణి వెనకేసుకు మాట్లాడు తున్నావు? నీకు నేను చచ్చిపోవాలని వుంది కాబోలు!

**మీనా** : యేవిఁటా మతిపోయిన మాటలు! అతగాడు రేపో నేడో వొచ్చి, యిలాంటి మాట్లన్నం దుకు మన నోట్లో గడ్డి పెడతాడు.

**లుబ్ధా** : అతగాడెవడు. వొల్లకాట్లో రావఁనాథాయ? మరెక్కడొస్తాడు వాడు! యిహ, నాకు చావు సిద్ధం.

**మీనా** : మీకు చావేం వొచ్చింది యిప్పుడు? ఒహవేళ రెండో పెళ్లి పిల్ల అయితే మాత్రం, గుప్‌చుప్ అని వూరుకోవాలి గాని, అల్లరి చేసుకుంటారా? యీరోజుల్లో యంతమంది రెండో పెళ్లి చేసుకుని సుఖంగా వున్నారు కారు? పిల్ల బుద్ధిమంతురాలు. మీ అదృష్టం వల్ల దొరికింది. మాట్లాడక వూరుకోండి.

**లుబ్ధా** : నా అదృష్టం తగలబడ్డట్టే వుంది. నీకేం పోయీకాలం వొచ్చిందే! నువ్వుకూడా యీ కుట్రలోచేరి, నీ తండ్రికి కళ్లుగప్పి వెధవ పెళ్ళి చేశావే? అయ్యో వెధవని పెళ్లి చేసు కున్న కుంకవెధవా నీ బుద్దెక్కడికి పోయిందిరా? నీ చదువెక్కడికి పోయిందిరా? నీ వేదం తగలబడనూ – యిహ బతకను!

(మీనాక్షి నవ్వును)

**లుబ్ధా** : నవ్వుతావేఁవే భ్రష్టాకారిముండా? నువ్వూ, నీ సవిత్తల్లీ నన్ను చంపేసి రాజమహేంద్రం పారిపోయి, వెధవపెళ్లి చేసుకుంటారు. నాకు తెలుసును. గిరీశం గాడు అన్న మాట నిజం. వెధవని చెవిపెట్టాను కాను. నా సొమ్మంతా ఘటాశ్రాద్ధప వెధవల పాలవుతుంది. నువ్వుపో, నేను పడుకుంటాను. (పక్కమీద పడుకుంటూ) మళ్లీవొస్తాడు గాబోలా దేవుడా!

**మీనా** : యవరు నాన్నా?

**లుబ్ధా** : నువుపో, నీకెందుకు! ఆ వెధవ నా పీక పిసికేస్తాడు. నీ కోరిక తీరుతుంది.

**మీనా** : మీరలా అంటే నాకు యేడుపొస్తుంది. నేనిక్కణ్ణించి కదలను. యవడా పీకపిసికేవాడు?

**లుబ్ధా** : అయితే యిక్కడ పక్కేసుకుపడుకో

**మీనా** : పడుకుంటాను. యవడు మీ పీక పిసుకుతాడు?

**లుబ్ధా** : ఆ ముండ మొదటి మొగుడే. యిందాకా నువు రాకముందు, నా గుండెల మీదెక్కి, పీక పిసికేటప్పటికి ప్రాణం పోయిందనుకున్నాను.

**మీనా** : నిజంగానూ ! ..... కలగన్నారు కాబోలు – నాన్నా!

**లుబ్ధా** : కలెక్కడి కలే! పీక నులుచుకుపోతేనూ!

**మీనా** : మొదటి మొగుణ్ణి మీకేం తెలుసును?

**లుబ్ధా** : వాడే, చెప్పాడే! వెధవా! "నా పెళ్లాన్ని పెళ్లాడావు; నిన్ను చంపేస్తాన"న్నాడే.

**మీనా** : యలా వుంటాడు?

**లుబ్ధా** : గిరీశంగాడి మూడు మూర్తులూనే.

**మీనా** : కలకాబోలు నాన్నా. అదే తలుచుకు పడుకుంటే, చిన్నబాబు కల్లోకొచ్చాడు కాబోలు.

**లుబ్ధా** : నేను చస్తే యవరికి విచారం!

**మీనా** : ఆ పిల్లని వెళ్లి అడుగుదునా?

**లుబ్ధా** : వొద్దు, వొద్దు. తొందరపడకు.

**మీనా** : నన్ను తిట్టేస్తున్నారు, దాని చచ్చిన మొగుడు మిమ్మలిని చంపేస్తాడని భయపడుతున్నారు. యెందుకీ తంబళ అనుమానం? ఓ మాటు దాన్నేడిగేస్తే ఉన్న నిజం తెలిసిపోతుంది.

**లుబ్ధా** : నిజం నీతో చెబుతుందీ?

**మీనా** : నాతో నిజం చెబుతుంది. అది వొట్టి సత్యకాలప్పిల్ల. నాకు యంతో వుపచారం చేస్తుంది.

**లుబ్ధా** : దాన్ని పాడుచేస్తున్నావూ?

**మీనా** : యిలాంటి మాటలంటేనే నాకు అసయ్యం. మీరు యక్కడో దడుసుకున్నారు కాబోలు; అంచేత దుష్టకల వొచ్చింది. అంతేగాని, రెండో పెళ్లి, మూడోపెళ్ళి అని వెఱ్ఱులు వోడకండి. పూజారి గవరయ్యని పిలుస్తాను; అతగాడు యింత మంత్రించి వీభూది యిస్తాడు. రాసుకు పడుకోండి.

**లుబ్ధా** : కొంపతీస్తావా యేవిఁటి? వాడొస్తే, వాడితో యేవఁని చెప్పడం? దాన్నే నిజం అడుగుదూ.

**మీనా** : నే నడగను, నాన్నా, నన్ను అడ్డవైఁన మాటలూ అంటూంటే, నే నెందుకు అడుగుతానూ? నేం దాంతో యిగమాట్లే ఆణ్ణు.

**లుబ్ధా** : నా తల్లివి కాదూ, అడుగమ్మా.

(మీనాక్షి పైకి వెళ్లును.)

ఓపన్నం యాకర బెట్టేదా? గాయత్రీ స్మరణ చేసేదా?

వేదాలూ, మహామంత్రాలూ, యీ దెయ్యాలకి పేలపిండి వొడియాలు. శాపర మంత్రాలు ఉపదేశం అవుదావఁంటే, బెడిసిగొడతాయేమో అని భయం. యేవిఁసాధనం? "రామనామతారకం" స్మరణ చేస్తాను. "రామనామ తారకం। భక్తిముక్తిదాయకం। జానకీ మనోహరం। సర్వలోక నాయకం। రామనామ తారకం। రామనామ తారకం" యీ ముండ యింట్లో వుంటే, నే బతకను. "రామనామతారకం! రామనామతారకం!" రుద్రాక్షతావళం యేదీ? (మంచము అంచున కూచుని పరుపుకింద తడివిఁ, రుద్రాక్షతావళం తీయుచుండగా మీనాక్షి ప్రవేశించి)

**మీనా** : మీ మాట నిజవేఁ నాన్నా.

**లుబ్ధా** : నిజవేఁ!

(మంచము మీది నుంచి కింద కూలబడును.)

**మీనా** : (లేవదీసి) నాన్నా! నాన్నా! పడిపోయినా వేవిఁ!

**లుబ్ధా** : యేవీఁ లేదు, నిజవేఁ! నిజవేఁ!

**మీనా** : నిజవేఁను, ఆ మొగుడు యిప్పుడే దానిక్కూడా కనపడి, "ముండా, మళ్లీ పెళ్లాడావే? నీ కొత్త మొగుణ్ణి పీక పిసికేస్తాను చూడు" అన్నాట్ట.

లుబ్ధా : అయ్యో! అయ్యో! రామప్పంతులు యిల్లు వొల్లకాదు కానూ! యక్కడ కల్పించాడే, యీ మాయ పెళ్లి నాకోసం! వీడి పిండం పిల్లులికి పెట్టా! అయ్యో! అయ్యో! ఆ మొగుడు వెధవ యలా వున్నాడందే.

మీనా : వాడు రోజూ దానికి కనపడతాట్ట నాన్నా, వాడికి మీసాలూ, గిరజాలూ వున్నాయట, చావం చాయట.

లుబ్ధా : వాడేనే! వాడేనే! యేవిఁటే సాధనం? యిహ నేం దక్కను.

మీనా : పూజారి గవరయ్యకి కబురు పెడతాను.

లుబ్ధా : వొద్దు, వొద్దు, నా మాట విను. వాడొచ్చాడంటే యిల్లు తినేస్తాడు.

మీనా : తింటే తింటాడు. ప్రాణంకంటేనా యేవిఁటి?

లుబ్ధా : నాకొద్దంటూంటే వినవుగదా, నువ్వు నా మంచం దగ్గర పక్కేసుకు పడుకో; నువ్వు చదువుకునే భాగవతం పుస్తకం పట్రా; తలకింద పెట్టుకు పడుకుంటాను.

(మీనాక్షి వెళ్ళును)

యీ ముండ నా యింట్లోంచి విరగడైపోతేనే గాని, యీ పిశాచం వొదిలిపోదు. వేదం చదువుకున్న ముండా కొడుకుని, నా మీదే పడ్డ తరవాత, వీడు బ్రహ్మ రాక్షసి గాని, వొట్టి దెయ్యం కాడు. పోనీ అతడికే ప్రార్థన చేస్తాను. “నా పెళ్లాం మొదటి మొగుడా!” ఆఁ! నా పెళ్లాం కాదు లెంపలు వాయించుకుంటాను. “యీ పిల్ల మొగుడా! నువ్వే నిజమైన మొగుడివి. నేను కాను. దాన్ని ముట్టను–తాకను– దాంచేత చాకిరీ అయినా చేయించను. నన్ను రక్షించి, పీక పిసికెయ్యకు; పీక పిసికెయ్యకు; యే పాపం చెయబట్టో దెయ్యానివైనావు. నన్ను చంపావంటె బ్రహ్మ హత్య చుట్టుకుంటుంది. మరిజన్మం వుండదు. బాబూ! నాయనా! తండ్రీ! నా జోలికి రాకు. నీ మావఁగారి పీకనులివెఁయ్యి! ఆ రావఁప్పంతులుగాడి పీకనులివెఁయ్యి! లేకపోతే, (కేకలు, యేడ్పు వినబడును) ఓరి దేవుడా, మళ్లీ వొచ్చాడు కాబోలు (శిష్యుడు యేడుస్తూ పరిగెత్తి వచ్చి లుబ్ధావధాన్లును గట్టిగా కౌగలించుకొనును. మీనాక్షి శిష్యుణ్ణి చీపురుగట్టతో కొట్టబోవును. శిష్యుడు తప్పించుకోగా, దెబ్బలు లుబ్ధావధాన్లకు తగులును.)

మీనా : ముండా! నా మోహురు అక్కడపడేస్తావా పడెయ్యవా? నా తాళం యేదే లంజా?

లుబ్ధా : నన్ను కొట్టేశావేవిఁటే? (శిష్యుడితో) వొదులు, వొదులు, నన్ను ముట్టుకోకే తల్లీ (మీనాక్షితో) దీని అపవిత్రపు వొళ్లు తగిల్తే చచ్చిపోతాను. నన్ను వొదిలిపించెయ్యి.

(మీనాక్షి శిష్యుడి రెక్కలు పట్టిలాగి, బుగ్గ గిల్లును. శిష్యుడు మీనాక్షి చెయ్యి కరిచి పారిపోవును.)

**మీనా** : దానమ్మ కడుపు కాలా, చెయ్యి కరిచేసింది నాన్నా - రక్తం బొట బొట కారుతూంది. దీన్ని హతవాఁరుస్తాను.

**లుబ్ధా** : యంత దారణప్పని చేసిందీ, ముండ! యేదమ్మా చెయ్యి (గుడ్డ పీరికతో రక్తంతుడిచి), మొహురడిగావు గదా యక్కడిదేవిఁటి?

**మీనా** : ఆతంఁడ్రి వెధవ నాకిమ్మని యీ ముండ చేతికి యిచ్చాడు. దీని నక్కవినయాలు చూసి నా పెట్టా బాడా దానికే వప్ప జెప్పి, ఆ మోహురు దాన్నే దాచమన్నాను. అనుమానవేఁసి యిప్పుడు నా మోరు తెమ్మంటే, "బట్టలపెట్లో పెట్టాను, తాళం పోయింది" అంది. తాళం తాకపోతే రోకలితో బుఱ్ఱ చితకబొడుస్తాను.

**లుబ్ధా** : చెయిజేసుకోకు. నీది వెఱ్ఱికోపం. చావగొట్టగలవు జాగ్రత!

**మీనా** : చస్తే యీడిచిపారేస్తాను. ముండయలా కరిచిందో చూడండీ. యింకా రక్తం కారుతూందీ. మనిషి కాటుకి మందులేదన్నాడు.

**లుబ్ధా** : కుంకుం పెట్టమ్మా.

**మీనా** : దాని బుఱ్ఱ చితకబొడిచి మరీ పెడతాను (మీనాక్షి వెళ్లును)

**లుబ్ధా** : గుండుగొమ్ముల అనుమానం తీరిపోయింది - పీకనులివిఁ, వాడైనా చంపేస్తాడు; కరిచి అదైనా చంపేస్తుంది. వీడిచేతో, దానిచేతో, చావు తప్పదు. యెంత డబ్బెట్టి కొనుక్కున్నాన్రా, యీ చావు పెళ్లి! అయ్యో! అయ్యో! దీన్ని పైకి తగిలేస్తే వాడు కూడా విరగడై పోతాడు. అదే సాధనం - యెక్కడికి తోలెయ్యను? బండీ మీద యెక్కించి పట్నం తోలేస్తాను - అక్కడ గానీ తంఁడ్రి వెధవ కనపడకపోతే మళ్లీ దెయ్యాన్ని నెత్తిని పెట్టుకుని ప్రత్యక్షం అవుతుందే! బండిఅద్దె యిచ్చుకోవడవేఁ మిగుల్తుంది. యేమి సాధనం? - యేమి సాధనం? రావఁప్పంతుల్ని సలహా అడుగుదునా? ఆ! మంచి ఆలోచన తోచింది - రావఁప్పంతులు నాకు కట్టిపెట్టిన యీ ముండని, వాడి దగ్గిరికే పంపించేస్తాను - సానిదాంతో పాటు దీన్ని కూడా వుంచుకుంటాడు - కావలిస్తే పదిరూపాయలు దక్షణతో కూడా యిచ్చేస్తాను.

(మీనాక్షి ప్రవేశించి.)

**మీనా** : యక్కడా కనపడదు నాన్నా గుంట.

**లుబ్ధా** : నూతులో పళ్లేదు గద?

**మీనా** : యేమో !

**లుబ్ధా** : పరిగెత్తెళ్ళి గవరైని పిలవమను. దాన్ని నువ్వు చావగొట్టలేదు గద?

**మీనా** : కనపడితేనా?

**లుబ్ధా** : యేవింటి నాయనా, యీ కొత్త ఉపద్రం!

(నిష్క్రమింతురు.)

★ ★ ★

## ౨వ స్థలము : రామప్పంతులు యింట్లో కొట్టు గది

భుక్త, పోలిశెట్టి, సిద్ధాంతి, మధురవాణి పేకాడుచుందురు.

పూజారి గవరయ్య ఆట చూచుచుండును.

**పోలిశెట్టి** :యేం భష్టాకారి ముక్కలు యేశావయ్యా! యెప్పుడూ నువ్వింతేను.

**భుక్త** : చూసివేశానా యేవింటి? నీ దరిద్రదేవతని తిట్టు.

**పోలి** : గవరయ్యా, నీ మొణుకు నా దగ్గిర యిలా యెట్టకు. లేచిపో, నీ పుణ్యవుంటుంది.

**గవ** : నేను మా మధురవాణి దగ్గిర కూచుంటాను.

**భుక్త** : చూడూ, ముక్క తప్పుపడ్డట్టుంది.

**పోలి** : ఆఁ! బాపనయ్య పంచాలని తప్పు పంచుతున్నావు. తప్పు పంచితే బేస్తు మీద కుదేలెట్టిస్తాను.

**భుక్త** : ముక్కలు బాగా పడలేదన్నావే?

**పోలి** : రెండో యేత నాలుగాసులడకూడదా?

**భుక్త** : పోలిశెట్టికి ముక్కలు వేస్తూ యిదుగో నాలుగాసులేస్తున్నాను. జుఝ్ఝు.

**పోలి** : నీ యిషప చేత్తో యేస్తే, పొల్లు ముక్కలే పడతాయి; మంచి ముక్కలడతాయా?

**భుక్త** : తథాస్తు!

**పోలి** : అలా అనకు. యెంతశెడ్డా బాపనాడి శాపనాకారం మాశెడ్డది. (చూచుకొని) శీ! భష్టాకారి ముక్కలు!

**సిద్ధాంతి** : ఒకటి, రెండు.

**పోలి** : అదుగో, అలాశెప్పితే నేవొప్పను. ఒక్కొకటి శెప్పాలి.

**సిద్ధాంతి**: అయితే వకటి.

పోలి : ఒక్కటీ.

మధు : ఒకటి.

భుక్త :వకటి.

(సిద్దాంతి ఆలోచించును)

పోలి : యే టాలోసిస్తావు చేతరస! యెత్తవయ్యా.

సిద్ధా : నీదేం పోయింది! రెండు.

పోలి : లాంతరేశావు. యేటెత్తను? రొండు.

మధు : రెండు

భుక్త : రొండు

(సిద్ధాంతి ఆలోచించును.)

పోలి : యేటాలోసిస్తావు? చేతరస : యెత్తి బేస్తు గెలుసుకో.

సిద్ధా : నువు చెప్పావు గనక యెత్తుతాను.

పోలి : ఆఁ! డబ్బుక్కడెట్టి మరీయెత్తు. మూడో యెత్తడపు బేస్తు; గాపకవుందా! బేస్తు మీద కుదేలెట్టిఁ బాకీ లెట్టి, యగెయడానికా?

సిద్ధా : (తన ముక్కలు యెత్తు ముక్కల మీద వేసి) కోవఁటాడి పిలక నిగుడుతూంది!

పోలి : తంతావాయేటి?

సిద్ధా : తన్నడవఁంటే, ఒహలాగనా?

పోలి : నా ఆట శెడగొట్టేశినావు బాపనయ్యా!

భుక్త : ముక్కలు పడలేదని యేడుస్తూ, మళ్ళీ యేవిఁటి, ఆట చెడగొట్టాడని యేడుస్తావు?

పోలి : యీ ఆట బేస్తు చేయించకపోతే నా పేరు-

సిద్ధా : కోవఁటాడా, నోరు మూసుకుంటావా, మూసు కోవా?

పోలి : తెల్లాడిబావుటా యెగురుతుండగా, నీజులువేఁటి? ముక్కల్తియ్యడం యింతసేపైతే, మరాటేటి?

సిద్ధా : నువ్వుగానీ మళ్లీ మాట్లాడావంటే, ముక్కలు కలిపెస్తాను.

(పోలిశెట్టి "నేను మాటాడను; నువ్వు ఆడు," అని సౌజ్ఞ చేయును. సిద్ధాంతి ఆడును)

పోలి : మూడే తురుపులు పడ్డాయి బాపనాడా; "తమాషాదేఖో, లంకకేరాజా!"

**సిద్ధాం** : ఆటపారెయనా?

**పోలి** : బుద్ధొచ్చింది; బుద్ధొచ్చింది. లెంపలోయించుకుంటాను. మరి మాటాడితొట్టు

**పూజారి**: మా మధురవాణి మీద ఆశుకవిత్వం చెబుతాను.

రాణా, డైమనురాణీ?।

రాణా, యిస్పేటు రాణి? రాణికళావ।

ఙ్టాణా అఠీ[న్రాణీ?।

రాణి యనన్మధురవాణె, రాజులరాణీ।

**సిద్ధాం**: గవరయ్యా! యేంవిలవైన పద్యం చెప్పావోయి! నీ మీద నేను పద్యం చెబుతాను- విను.

"గవరయ్యా! నీ సరి మరి!

యెవరయ్యా?"

**పూజారి**: యెవరు లేరు, యిచ్చోనయ్యా!

**సిద్ధాం** : యిదుగో రాజు.

**పోలి** : యిదుగో పాల్తు.

(మధురవాణి తురుఫురాణీ వేయును.)

**పోలి** : అదుగో, అదుగో, యీ బాపనాడు కపీశం శెప్పి, మధురవోణి దగ్గిర రాణీ వుందని శెప్పేశాడు. గోరం. గోరం. గవరయగానీ మాటాడితే నే ఆటాణ్ణు.

**పూజారి** : పోలిశెట్టి మీద కవిత్వం చెప్పి చాలా రోజులైంది (పొడుం పీల్చి)

"పోలిశెట్టి ముఖము – పోలిరొట్టెను బోలు! పోలిశెట్టి ముక్కు పొడుముడొక్కు!"

**పోలి** : వొద్దు! వొద్దు! వొద్దు! నా మాటినను. పాసం పెట్టి సంపేస్తావాయేటి? ఊరుకుంటి వొట్టాయినా, యిన్నావా? యీ ఆట సిద్ధాంతి బేస్తెట్టి, నేను గెలిస్తే, నీక్కాండబ్బిస్తాను. మరూరుకో.

**సిద్ధాం** : నీ సొద తగలడా – తురుపు మిగిలిపోయింది; బేస్తు (ముక్కలు చూపించి పారవేయును)

**పోలి** : ఆఁ! మూడో యెత్తడబ్బేస్తు. గాపకాలుంచుకోం దయ్యా, చేతి వొరస, మంచి ముక్కలెయి, బాపనాడా అంతసేపు కలపడవాఁ? గోరం, గోరం.

**సిద్ధాం** : బులబులాగ్గా కలిపి, బేస్తు నీకిస్తాననుకున్నావా?

**పోలి** : తోలుసేత్తో, ముక్కలేసినావు! "నరిసింవ్వ, నీదివ్వె నామమంతరముశాత, నరిసింవ్వ నీదివ్వె–"

సిద్ధాం : దివ్వేలేదు, దీపం లేదు. ముక్కల్తియ్యి.

పోలి : గవరయ్యముక్కల మీద కన్నేసి సిల్లంగెట్టేస్తున్నాడు. నరశింవ్వ నీదివ్వే – (ముక్కలు యెత్తిచూసి) సీ! భష్టాకారి ముక్కలేశావు.

సిద్ధాం : (పంపకం ముగించి తన ముక్కలు తీసి చూసుకొని) మృత్తికాచమే!

పూజారి : పోలిశెట్టికి అంత అలకైతే, నే నింటికిపోయి పరుంటాను.

(గవరయ్య నిష్క్రమించును. మధురవాణి వెంట వెళ్లి తిరిగివచ్చును.)

పోలి : శని విరగడైపోయిందిరా, దేవుఁడా! – ఒట్టి భష్టాకారిముక్కలు. ఒహాటీ.

మధు : ఒకటి.

భుక్త : ఒహాటి.

సిద్ధాం : ఒహాటి.

పోలి : రెండు.

మధు : రెండు.

భుక్త : రెండు.

(సిద్ధాంతి ఆలోచించును.)

పోలి : యెందుకాయెట్లాలోశన? నా మాటిను. మూడో బేస్తెట్టకు.

(వీధి తలుపు తట్టబడును)

మధు : పంతులు!

పోలి : యీవాళ రాడని సెప్పితివే?

మధు : రారనుకున్నాను వొచ్చారు. యేంచేదాం?

సిద్ధాం : ఆట తీసెయ్యండి. (ముక్కలు పడవేయును)

పోలి : బేస్తెగెయడానికా? నేనొప్పను, మధురోణి, ఆటాడి మరీ తలుపుతియ్యి.

మధు : ముక్కలు కిందబెట్టి, లేచి (సన్నని గొంతుకతో) గోడగెంతి పారిపోండి.

భుక్త : దిడ్డితోవంట వెళ్లిపోతాం.

పోలి : నేను పట్టనే? యేటి సాధనం?

భుక్త : మేం దిడ్డితోవంట పోతాం. నువ్వు అటకెక్కు.

పోలి : నన్నెక్కించి మరీ యెళ్లండి. కాలుజారితే యేటి సాధనం?

**సిద్ధాం** : నీ కొడుకుది, అదృష్టం

(పెరటిలోకి వెళ్లును.)

**పోలి** : గోరం! గోరం! గోరం! యవడి ముక్కలు ఆడిదగ్గిరే! ఆట కలపకండి.

(తలుపు తిరిగీ తట్టబడును)

**పోలి** : నరిశింవ్వ, నీదెవ్వె –

(మధురవాణి ఊరుకొమ్మని కోపరసంగా సౌజ్ఞ చేయును)

(సిద్ధాంతి ప్రవేశించును)

**సిద్ధాం** : దిడ్డీ తలుపు కప్పుతాళం వేశుంది. మన్ని పట్టుగుందావఁనే, పంతులు దిడ్డీ తలుపు తాళవేఁశాడు.

**పోలి** : నరిశింవ్వ, నీ దివ్వె –

**మధు** : (పోలిశెట్టిని ఉద్దేశించి) చప్! (సన్నని గొంతుకతో) ఉలక్కుండా, పలక్కుండా ఈ గదిలో కూచోండి; ఆయన పరున్న తరవాత వచ్చి తలుపు తీసి వొదిలేస్తాను. (మధురవాణి దీపములు ఆర్పి, పైకి వెళ్ళి, గది తలుపు వేసి గొళ్లెము బిగించును)

(తలుపు తిరిగీ తట్టబడును.)

**మధు** : యేవీఁ గవరయ్య చాదస్తం! అదే తట్టడవాఁ (వీధి తలుపు దగ్గిరకు వెళ్ళి) యెవరు?

**తలుపవతల మనిషి** : యింతసేపేం?

**మధు** : నిద్దరబోతున్నాను.

**మనిషి** : పేక! పేక! పేక! నిన్నొదిలేస్తాను. నీ సంగతి నాకు తెలిసింది.

**మధు** : మరి, మీ మానాన్న మీరు పోయి, నిశిరాత్రి వేళ వొక్కర్తెనీ నన్ను వొదిలేస్తే ఈ అడివి వూళ్లో నాకు భయం కాదా? అంచేత పబ్లిగ్గా నలుగుర్నీ పిలిచి పేకాడుతున్నాను. తప్పేవుఁందీ? మంచు పడుతూంది. లోపలికి రండి (తలుపు గడియతీసి) రండి. నా ఆట మీరాడండి, నేను పరుంటాను.

**మనిషి** : సొందాన్ని యవడు నమ్మమన్నాడు? నీ కిద్దావఁని సంతోషంతో వక సరుకు తెచ్చాను. నీ చర్య చూసేటప్పటికి నా మనస్సు చివుక్కుమనిపోయింది.

**మధు** : యెంత న్యాయంగా సంచరించినా, మీ హృదయంలో కాసింత కనికరం లేదు గదా? యీ నాటి నుంచి మీరు యెక్కడికి కమాను వెళుతూ వుంటే, అక్కడకల్లా నేను కూడా మీతో వస్తూవుంటాను.

**మనిషి** : మెడపైకి వుంచు. (మధురవాణి అటుల చేయును. ఆ మనిషి మధురవాణి మెడలో కంటె వుంచును.)

**మధు** : ఔరా! యింద్రజాలి! పంతులు గొంతుక యెలా పట్టావు? నన్నే మోసపుచ్చితివే? (రెక్క పట్టుకొని) గదులోకిరా. (గదులోనికి తీసుకువెళ్లును) యీ చిల్లంగి కళ్లు నీకేదేవుఁడిచ్చాడు (ముద్దెట్టుకొనును) వాళ్లింట యేవేఁవిఁ చిత్రాలు చేశావో చెప్పు.

**శిష్యు** : ముద్దెట్టుకోనంటే, చెబుతాను?

**మధు** : నీకు తగనో?

**శిష్యు** : ముద్దెట్టుకుంటే యెంగిలౌతుంది.

**మధు** : నిజం. నీకున్న బుద్ధి నీ పెద్దలికి లేదు. నన్ను నిష్కారణంగా భయపెట్టావు. అందుకు నీ కేవిఁటి సిక్ష? బుగ్గ కొరికేతునా?

**శిష్యు** : పాలూ, పంచదారా వుంటే ఇయ్యి.

**మధు** : తరవాత మేపుతాను. ముందు నీకు దాసరి వేషం వేస్తాను. కొత్త అగ్రహారం పోయి నీ గురువును చేరుకుందు గాని.

(తెర దించవలెను)

(చీకటి గదిలో పోలిశెట్టి, భుక్త, సిద్ధాంతి వుందురు – తెర అవతల నుంచి రామప్పంతులు గొంతుకతో, శిష్యుడు "యీ గదులో యవణ్ణో దాచావు"

**మధు** : రామ! రామ! యవ్వడూ లేదు.

(పోలిశెట్టి నిచ్చెనయెక్కును, భుక్త కూడా యెక్కబోవును. నాలుగు మెట్లెక్కి యిద్దరూ కింద బడుదురు.)

**పోలి** : సంపేశినావు, బాపనాడా!

**భుక్త** : నా మీద నువ్వు పడి, నేను వుక్కిరిబిక్కిరి ఔతూంటే, నువ్వు సచ్చానంటావేవిఁటి? లేస్తావా? కరిచేదా?

**శిష్యు** : (రామప్పంతులు గొంతుకతో) అదుగో లోపల యెవళ్లో మాట్లాడుతున్నారు. లంజా! అదికోవఁటాడి గొంతుకలా వుంది. కప్ప తాళం వేసి వూరందరినీ లేవదీసుకొస్తాను.

**మధు** : కప్పతాళవెందుకు? లోపల యెవళ్లూ లేరు. దెయ్యాల కొంప – దెయ్యాలు దెబ్బలాడుతున్నాయి.

(మధురవాణి తలుపు తీసి గదిలో ప్రవేశించి అగ్గిపుల్ల వెలిగించును. శిష్యుడు పక్కకి తొలగిపోవును.)

మధు : పోలిశెట్టియేమి, పడుకుని లేవడు – మేలుకొలుపులు పాడనా?

భుక్త : రామప్పంతులేడీ?

మధు : రామప్పంతులూ లేరు, గీమప్పంతులూ లేరు. యింట్లో పనిచేసేవాడు తలుపు కొట్టాడు. బెంగెట్టుకోకండి.

భుక్త : అతగాడి మాటలు వింటేనే?

మధు : నేనే ఆయన గొంతుకు పెట్టి మాట్లాడాను. యేమి ధైర్యం! యేమి మగతనం!

పోలి : "నరశింవ్వ, నీదివ్వె" (లేచి) "నామమంతరము సేత"–యవడి ముక్కలాడి దగ్గిరున్నాయా?

(అంతా మళ్లీ ఆటకు కూచుందురు)

సిద్ధాం : ఆట కలిపేశాను.

పోలి : గోరం! గోరం! నాకు యిసిపేటు ఆసు దాడదదొచ్చింది గదా, బేస్తులు గెలుసుకుపోదునే! గోరం! గోరం! మధురోణి, ఒట్టినే బెంబేరు పెట్టేశింది. అటక మీంచి పడి నడుం విరిగిపోయిందిరా దేవుడా.

భుక్త : నీ కిందపడి నేను నలిగిపోయినాను. నీకేం తీపు దిగదీసింది?

పోలి : కలిపియెయ్యొయ్యి – ముక్కలు.

సిద్ధాం : నేను కలపను – నా వొంతు అయిపోయింది – నువు కలుపు.

పోలి : యేటైపోయింది?

(రామప్పంతులు వీధి తలుపు తట్టును.)

రామ : లక్ష్మి, లక్ష్మి, తలుపు.

మధు : యీ మాటు పంతులే.

పోలి : యేటి సాధనం?

మధు : గోడగెంతి వెళ్లిపోండి.

పోలి : నేను గెంతలేనే?

మధు : నిన్ను యీ గదిలో పెట్టి తాళం వేస్తాను.

పోలి : దీపం ఆరిపెయ్యి. నాకు బయవేస్తుంది.

సిద్ధాం : గాజు పెంకులు గుచ్చుకుంటాయి; గోడ దాటడం యెలాగ?

**భుక్త** : నాకు కాళ్లు మేహవాతం నొప్పులు. నేను గెంతలేనే?

**మధు** : (దీపవార్పి) యిలాగే వుండండి.

**పోలి** : నరశింవ్వ –

**మధు**: చప్!

**పోలి** : సచ్చాను.

**మధు** : (గది గొళ్లెం వేసి, వీధి తలుపు గడియ తీసి, తలుపు ఓరగా వుంచి) మాయగుంటని యెక్కడదాచారు?

**రామ** : మాయగుంట యేమిటి?

**మధు** : యేం నంగనాచే? లుబ్ధావధాన్లు మాయ పెళ్లాన్ని వాళ్ల యింట్లోంచి లేవదీసుకుపోయి యెక్కడ పెట్టారు? యిదే కదూ, రాత్రల్లా మీరు చేస్తూన్న లౌక్య వ్యవహారం?

**రామ** : నీ మాట నాకేవీఁ అర్థం కాకుండా వుంది. యింట్లోంచి లేవదీసుకుపోవడవేఁవిఁటి? నేను దాచడ వేఁవిఁటి?

**మధు** : దాస్తే దాచారు. దాచకపోతే మానారు. నాకంటె యేదీ?

**రామ** : నీకంటా? మరిచిపోయినాను సుమా.

**మధు** : యేమి చిత్రం! నన్ను మరిచారు – నా వస్తువ అని, మరిచారు. మరిచి, ఆ గుంట కిచ్చారు. దాన్ని లేవదీసుకుపోయి యెక్కడో దాచి, నిశిరాత్రి వేళ పెద్దమనిషిలా, యింటికి వొచ్చారు!

**రామ** : ఆ గుంట కనపడదా యేవిఁటి?

**మధు** : యేవిఁ నాటకం! మీకు కనపడకేం! మీరు పెట్టిన చోటే వుంది.

**రామ** : మీనాక్షి తన్ని తగిలేశిందా యేవిఁటి? కంటెతో తగిలేస్తే చచ్చానే?

**మధు** : యేమి నాటకం! చావండి; బతకండి; ఆకంటెతోంది గడపలో కాలుపెట్టనివ్వను.

(తలుపు వేయును)

**రామ** : నాలుగుకోసులు గుఱ్ఱపసవారీ అయి, యీసురోమని యిల్లు చేరుకుని, గుమ్మంలో అడుగు పెట్టేసరికి మబ్బులేని పిడుగుపడ్డది. మీనాక్షి ఆగుంటని మన్ననిస్తుందని, నేను యెన్నడయినా అనుకున్నానా యేవిఁటి? ఆ గుంట పోతేపోయింది, వుంటే వుంది; నా కంటె పోకుండా వుంటే అదృష్టవంతుణ్ణి. కంటె అడగడానికి వెళితే "నువ్వే యీ పెళ్ళి కుదిర్చావు" అని కఱ్ఱుచ్చుకుంటాడేమో!

(నిష్క్రమించును.)

## ౩వ స్థలము : లుబ్ధావధాన్లు యింటి వాకలి

లుబ్ధావధాన్లు – (పచారు చేస్తూ)

కనపడకపోతే యేవైఁనట్టు? నూతులోగానీ పడిందా? పోలీసువాళ్ళు యిల్లు దోచేస్తారు. నూతులో పడలేదా? పడకపోతే యేవైఁనట్టు? –రావఁప్పంతులు యింటికి పోయుం టుంది. అంతే కావాలి – యంత అందవైఁన పిల్లా! నాదిగాక దురదృష్టం! యంతట్లో వెన్నెల చీకటైందీ! రేపో యెల్లుండో యెదిగొచ్చే పిల్లగదా అని సంబరపడ్డాను. ఒహవేళ– అప్పుడే పెద్దమనిషైందేమో?–అందుకు సందేహవేఁలా? లేకుంటే యింత యేపైన పిల్ల పెద్ద పడుచుకాకుండా వుంటుందా? యిలాంటివి యెన్ని పెళ్ళిళ్లు చేసుకుని యందరు మొగుళ్లని కడితేర్చిందో! ఓరి కుంకపీనుగా, నీ కళ్లు యేవైఁపోయినాయిరా? రజస్వలాముండని చూస్తూ, చూస్తూ, యలా పెళ్లాడావురా? మరి నీకు గతులు లేవు. రాజమహేంద్రవరంలో వెధవ ముండల్ని పెళ్ళాడినవాళ్ల సామాజికంలో చేరావురా? అయ్యో! అయ్యో! దీనికి మరి ప్రాయశ్చిత్తం యక్కడిది? ఒహవేళ చేయించుకుందావఁ ంటే, శంకరాచార్యులు పాదకట్ణం పెట్టమ్మంటాడు. బ్రాహ్మలు యిల్లు తినేస్తారు. అంతకంటె పోలీసు వాళ్లు నయం. అల్లరి కాకుండా హెడ్డుచేతులో పాతిక రూపాయలు పెట్టి, రేపురాత్రి బయల్దేరి కాశీ పోయి, గంగలో మునిగానంటే అన్ని పాపాలూ పోతాయి. కాశీవాసవేఁ చేసుకుంటాను. భగవంతుడు బుద్ధొచ్చేటట్టు చేశాడు. లేకుంటే, ముసలి వెధవకి పెళ్లి చేసుకోవడపు పోయీ కాలవేఁవిఁ? అన్ని విధాలా యీ రామప్పంతులు నా కొంప తీశాడు.

(రామప్పంతులు ప్రవేశించి.)

**రామ** : యేవిఁటి మావాఁ రావఁప్పంతులంటున్నారూ?

**లుబ్ధా** : యేవీఁ లేదూ.

**రామ** : యింత రాత్రివేళ పచారు చేస్తున్నారేవిఁ?

**లుబ్ధా** : యేమీఁలేదు – నిద్దరపట్టక.

**రామ** : మావఁగారూ, ఆ కంటె యిప్పుడు తెమ్మని మధురవాణి భీష్మించుకు కూచుంది. శ్రమ అని ఆలోచించక యిప్పించాలి.

**లుబ్ధా** : కంటేవిఁటి?

**రామ** : మీ భార్యాకి పెట్టిన కంటెండీ.

**లుబ్ధా** : నా భార్యాకి నేను పెట్టలేదు.

**రామ** : మీరు పెట్టమంటే, నేను యెరువు తెచ్చాను కానా?

**లుబ్ధా** : నేను పెట్టమన్లేదు.

**రామ** : అయితే దొబ్బేస్తావా యేవిఁటి? మీ భార్యా మెళ్లో యిప్పుడా కంటె లేదూ?

**లుబ్ధా** : నా భార్యా యెవరు? నా భార్యా నాడే చచ్చింది.

**రామ** : మొన్న మీరు పెళ్లి చేసుకున్న పిల్ల మీ భార్యా కాదటయ్యా?

**లుబ్ధా** : రెండో పెళ్లి ముండ నాకు భార్యా యేవిఁటి?

**రామ** : రెండో పెళ్లి ముండేవిఁటి?

**లుబ్ధా** : రెండో పెళ్లి ముండ అని నువ్వే అన్నావు?

**రామ** : మాటమీద మాటొచ్చి, వొట్టినే అంటే, అదో దెప్పా?

**లుబ్ధా** : వొట్టినే అనలేదు. గట్టే అన్నావు. యిదంతా, ఆ గుంటూరు శాస్త్రుల్లూ నువ్వూ చేసిన కుట్ర; నాకు నిజం తెలిసిపోయింది. ఆ ముండ నీ యింటికే వెళ్లింది. మధురవాణిని వుంచుకున్నట్టు దాన్ని కూడా నువ్వే వుంచుకో. నా జోలికి రాకు. నీకు పదివేల నమస్కారాలు.

**రామ** : నా కంటె నాకియ్యమంటే, యీ వెఱ్ఱి వెఱ్ఱి మాట లేవిఁటయ్యా?

**లుబ్ధా** : నీ మాయగుంటా, నీ కంటా, నీ యింట్లోనే వున్నాయి.

**రామ** : యీ వేషాలు నాకు పనికిరావు. నిలబెట్టి నా కంటె పుచ్చుకుంటాను.

(తడిసిన భాగవత పుస్తకం పట్టుకుని మీనాక్షీ, చేతులో కఱ్ఱా, నెత్తిమీద పసుపురాసినకుండా, అందుమీద అఖండంతో అసిరిగాడూ, చేతిలో సీసాపట్టుకుని, తడి బట్టలతో పూజారి గవరయ్యా ప్రవేశింతురు.)

**పూజారి** : హ్రాం! హ్రీం! హ్రూం! ఓంకార భైరవీ!

(రామప్పంతులు భయమును కనపర్చును)

**మీనాక్షి**: యక్కడా కనపళ్లేదు నాన్నా. యీ పుస్తకం నూతులో పడేశింది.

(లుబ్ధావధాన్లు భయమును కనపర్చును.)

**రామ** : కనపడకపోవడం యవరు?

**మీనా** : నా సవిత్తల్లి – గవరయబాబు నూతులో దిగి అంతటా గాలించాడు. నూతులో మరేవీఁ కనపడలేదు.

(లుబ్ధావధాన్లు భయం తగ్గను.)

బ్రహ్మ రాక్షసిని గవరయ బాబు యీ సీసాలో బిగించాడు నాన్నా.

(రామప్పంతులు సీసాకి యడంగా నిలబడును.)

**రామ** : బ్రహ్మరాక్షసి యేవింటి?

**లుబ్ధా** : వేరే – ఓ బ్రహ్మరాక్షసి వొచ్చి – మా అమ్మిని భయపెట్టింది.

**మీనా** : నన్ను కాదు – మా నాన్న పీకే పిసికింది.

**రామ** : గవరయగారూ, పిల్ల యావైఁనట్టు?

**గవర** : దాని మొగుడు యగరేసుకు పోయినాడు.

**మీనా** : యక్కడికి యగరేసుకు పోయినాడు? వాడు యీ సీసాలోనే వున్నాడన్నారే?

**గవర** : (కొంచెం ఆలోచించి – చిరునవ్వు నవ్వి) అదీ యీ సీసాలోనే వుంది.

**మీనా** : మనిషి సీసాలోకి యలా వొచ్చింది?

**గవర** : అయ్యో సత్యకాలవాఁ! అది మనిషా అనుకున్నావు? అది కామినీ పిశాచం. అంచేతనే నేను మీ యింటికొచ్చినప్పుడల్లా దూరంగా వెళ్లిపోయేది, యేమి చెప్మా, అనుకునేవాణ్ణి.

**మీనా** : యిద్దర్నీ ఓ సీసాలో పెడితే దెయ్యప్పిలల్ని పెడతారేమో?

**గవర** : పంతులుగారూ చిత్తగించండీ, రెండు మనుషుల బలువుందో లేదో చూడండీ.

**రామ** : మొఱ్ఱో! నా దగ్గిరకి తేకయ్యా.

**గవర** : అసిరిగా నువ్వు పట్టుకో.

**అసిరి** : నాకు బయవేఁటి? పైడితల్లి చల్లగుండోలి – (సీసా పట్టుకుని) ఓలమ్మ! యంతంత బలువుందోస్సి!

**గవర** : సీసా, అఖండం, తులిసికోట దగ్గిరదించు.

**లుబ్ధా** : బాబ్బాబు! సీసా నా యింట్లో పెట్టకు, మీ యింట్లో పెట్టించండి.

**గవర** : మా పిల్లలు తేనెసీసా అని బిరడా తీసినట్టాయనా, రెండు దెయ్యాలూ వొచ్చి మళ్లీ మీ యింట్లోనే వుంటాయి.

**లుబ్ధా** : అయితే, సీసా భూస్థాపితం చెయ్యండి.

**గవర** : భూస్థాపన మజాకాలనుకున్నారా యేమిటి? భూస్థాపితం చెయ్యడానికి యంత తంతుంది! పునశ్చరణ చెయ్యాలి, హోమం చెయ్యాలి, సంతర్పణ చెయ్యాలి.

**లుబ్ధా** : నా యిల్లు గుల్ల చెయ్యాలి!

గవర : మీకలా తోస్తే నాకేం పోయింది? యీ మూత తీసేసి, నా మానాన్న నేను వెళ్లిపోతాను.

లుబ్ధా : మూతెందుకు తీసెయ్యడం. నాకు కలిగినది తృణవోఁ కణవో యిస్తాను. ఆ మూత తియ్యకుండా ఆ సీసా అలా వుంచి వెళ్లండి.

పూజారి : యేవీఁ అవధాన్లుగారి గడుస్తనం! నేపోగానే పాతిపెట్టడానికాయెత్తు? ఆ సీసా తగిన శాంతి చెయ్యందీ భూస్థాపితం చేశారంటే, నేను రౌరవాది నరకాలకి పోనా? యిప్పుడే బిరడా తీసేస్తాను.

లుబ్ధా : తియ్యకు, తియ్యకు. రేపు ఆ శాంతేదో తగలేతు గాని.

గవ : అష్లాగైతే, యీ రాత్రల్లా యీ సీసా దగ్గిర పెట్టుకు పెరట్లో పడుకుంటాను. మీరు వెళ్ళి నిర్భయంగా పడుకుని నిద్రపోండి.

(నిష్క్రమించును.)

రామ : మావాఁ! ఓ మాట.

(రామప్పంతులూ, లుబ్ధావధాన్లూ పక్కకు వెళ్లి మాట్లాడుదురు.)

రామ : నా కంటె మాటేవిఁటి, మావాఁ?

లుబ్ధా : మీ కంటె మీ యింట్లోనే వుంది.

రామ : మీ పెళ్లాం మా యింటికి వెళ్లిందని మీరంటున్నారు గాని, అక్కడికి ఆ పిల్ల రాలేదు. కంటా తాలేదు.

లుబ్ధా : అయితే యేవైఁందో! నాకేం తెలుసును?

రామ : వొద్దు సుమండీ – నా కంటె నాకిచ్చెయ్యండి – నేను మా కానివాణ్ణి.

లుబ్ధా : కంటె, గింటె, నాకు తెలియదు.

రామ : నీకు తెలియకపోతే మరెవరికి తెలుసును? గవరయ్య నీ పెళ్లాం దెయ్యవైఁందన్నాడు గదా? నువ్వూ నీ కూతురూ కలిసి దాన్ని చంపేశారు కాబోలు.

లుబ్ధా : ఓరి! గాడిద కొడుకా (కఱ్ఱతో కొట్టబోవును)

రామ : నా కంటె అపహరించావు గదా? నీ పని పట్టిస్తాను వుండు. (నిష్క్రమించును)

లుబ్ధా : (తనలో) కంటె యావైఁనట్టు చెప్మా? (పైకి) అమ్మీ!

మీనా : యేం నాన్నా?

లుబ్ధా : కంటె యేంజేసిందే?

**మీనా** : యేం జేసిందో? పెట్లో దాచిందేవోఁ? దాని వొంటినే వుంది గాబోలు నాన్నా?

**లుబ్ధా** : వొంటినుంటే – దెయ్యానికి కంటెందుకూ?

**మీనా** : యేం? తీపు దిగదీసిందా యేవిఁటి? పెట్టుగుంటుంది.

**లుబ్ధా** : నూతులో దిగి గవరయ్య నుయ్యంతా గాలించాడూ?

**మీనా** : గడియ సేపు గాలించాడు.

**లుబ్ధా** : నువు చూశావూ?

**మీనా** : చూశాను.

**లుబ్ధా** : అది రావఁప్పంతులు యింటికే వెళ్లిందేమోనే?

**మీనా** : గవరబాబు, సీసాలో బిగించాడు గదా, యలా వెళుతుంది?

**లుబ్ధా** : యేమో నాకేం పాలు పోకుండా వుంది. రా పరుందాం – మన ప్రారబ్ధం యిలా వుంది.

(నిష్క్రమింతురు.)

★★★

**౪వ స్థలము : రామచంద్రపురం అగ్రహారంలో సారా దుకాణం వెనక తోట)**

(ఆ తోటలో కాళీమందిరం యెదటి మంటపం. మంటపంలో కాళీ విగ్రహానికి యెదురుగుండా ఒక పెద్ద పీట మీద మూడు సీసాలతో సారాయి; చుట్టూ గళాసులు, పీట నిండా పువ్వుల దండలు, మంటపంలో వక వైపు పులి చర్మం మీద యోగదండమును ఆనుకుని సమాధిలో వున్న వొక బైరాగి; యోగిని యొకతె సారాయి అందరికీ అందిచ్చును. గ్రామ మనసబు సోమినాయుడు చిలుం పీల్చుచుండును. సాతాని మనవాళ్లయ్య, జంగం వీరేశ, దుకాణదారు రామందాసు చెదిరి కూర్చుందురు)

**మునసబు** : ఆకాశం ముందు పుట్టిందా? బూవిఁ ముందు పుట్టిందా?

**మనవాళ్లయ్య**: సుత్తి ముందా? కారుముందా?

**మునసబు** : పంగనావాఁలుముందా పట్టెవొర్దనాలు ముందా? నామాలోడా నా సవాలేటి? నీ బువాబేటి? ఆకాశానికి మట్టాబూవిఁ? బూవిఁకి కప్పా ఆకాశం? సదువుకున్నోడెవడో సెప్పండొస్సి –

**మనవాళ్లయ్య**: ఆకాశంబు సూన్యంబు అనగా యేమీ లేదన్నమాట.

**మునసబు** : యేటీ లేదా? గుడ్డోళ్లకి యేటీ లేదు. తెల్లోడు యెర్రోడా? పట్టంలో గొట్టావెఁట్టి అదే సూస్తాడే ఆకాశం కాసి?

**మనవాళ్లయ్య**: శాస్త్రంబులలోని రహస్యంబులు మ్లేచ్ఛులకెట్లు తెలియును?

**మునసబు** : అల్లాండం, బెల్లాండం, శక్కరపొంగలి తినడవఁనుకున్నావా, నామాలోడా? తెల్లోడి మహిమ నీకేటి తెలుసును! తెల్లోడి సారాయికి, తెనుగోడి సారాయికి యంత భేదం వుందో, తెల్లోడికి నీకూ అంత భేదం వుంది.

**మనవాళ్లయ్య**: గణిత శాస్త్రంబునం దాకాశంబన సున్న – సున్నయన సూన్యంబు – యేమీ లేదన్న మాట.

**వీరేశ** : చాత్రంలో మన్ను, మిన్ను,అని అన్నాడు కాడా? మన్ను లేదా? మన్నుంటే, మిన్నుండదా?

**మునసబు**: యీరేచ మామేలయిన పలుకు పలికినాడు.

**వీరేశ**: "ఆకాశం బొక్కడ్డది!" అంటురు గదా! ఆకాశం లేకుంటే బొక్కడ్డవెఁలాగ?

**మునసబు** : శబాసు యీరేచ! నామాలోడు పలకడేం? నోరు కట్టడ్డది.

(వీరేశ – శంఖం పూరించును)

**హెడ్డు** : (దుకాణదారునితో) యేవిఁటీ అల్లరి భాయి?

**మునసబు**: యీరేచం గెల్చుకున్నాడు గదా, చంకం వోగించడా?

**దుకాణదారు**: గురోజీగారి సమాదికి బంగం వొస్తే శపించి పోతారే?

**బైరాగి** : (కళ్లు తెరిచి) శివబ్రహ్మాం! శివబ్రహ్మాం! శివోహం!

**వీరేశ** : చూచావు నేస్తం, చివబ్రెమ్మం అన్నారు.

**బైరాగి** : రామబ్రహ్మాం! రామబ్రహ్మాం! రామోహం!

**మన**: మొదటి మాటను రెండవమాట రద్దు చేయును. రామానుజ! రామానుజ!

**వీరేశ** : చివ చివా! చివ చివా!

**దుకాణదారు**: యెందుకు కాట్లాడతారు. నీ శివుడూ నిజవేఁ. అడుగో ఆశీసాలో యెలుగుతున్నాడు. నీ రాముడూ నిజవేఁ. అడుగో ఆ శీసాలో యెలుగుతున్నాడు. వినలేదా తత్తం?

గాజుకుప్పెలోను గడగుచు దీపంబు।
యెట్టులుండు గ్యానమట్టులుండు।
తెలిశినట్టి వారి ద్రేహంబులందును।
యిశ్వదాభిరామ యినరవేమా॥

**బైరాగి** : సత్యం, సత్యం.

**దుకాణదారు** : గురోజీ! తమకి అంతా యిశదవేఁ! ద్రేహం గాజుకుప్పె, ద్రేహంలో వుండేది పరవాఁత్వ! గాజు కుప్పెలో వుండేది అన్నసారం. యీ అన్నసారం ద్రేహంలో పడితే గాని పరవాఁత్మ పెజ్జిలించదు. యేం శలవు?

**బైరాగి** : యీ పరమ రహశ్యం నీకు యెలా తెలిశింది తమ్ముడా?

**దుకా** : తమవంటి వారి ద్రయవల్లగురూ! (నలుగురి వైపూ చూసి) చూశారాబాయీ నేను యెప్పుడూ యీ మాటే గదా చెపుతూ వుంటాను? అఖాడాకి వొస్తే గాని పరబ్రెమ్మం పట్టుపడ్డం యేలాగు?

**బైరాగి** : అమృతమనేది యేమిటి? సారాయే! నాడు యిదే గదా తాగడానికి దేవాసురులు తన్నుకు చచ్చారు?

**వీరేశ** : చివచివా! చివచివా!

**మనవాళ్ల**: రామానుజ - రామానుజ!

**మునస**: కాట్లాటమాని ఘానం యినండొొస్సి - యెట్టిగొల్లోళ్లు.

**హెడ్డు** : గురూ, మరివొక రసలింగం చేయించి, శిష్యుడికి దయ చెయ్యాలి.

**బైరా** : అలాగె.

**మునస**: గురూ! బంగారం సేస్తారు గదా, అదెట్టి, హరిద్దొరంలో మటం కట్టించక మాలాటోళ్ళని డబ్బెందుకడుగుతారు?

**బైరా** : మేం చేశే స్వర్ణం మేవేఁ వాడుకచేస్తే తలపగిలి పోతుంది.

**హెడ్డు** : అవి వేరే రహస్యాలు వూరుకోండి మావాఁ! గురోజీ! హరిద్వారంలో చలి లావుగాబోలు?

**బైరాగి** : నరులకక్కద్దు - మా బోటి సిద్ధులకు, చలీ, వేడీ, సుఖం, దుఃఖం యెక్కడివి -

**హెడ్డు** : ఆహా! అదృష్టవంటే సిద్ధుల్దే అదృష్టం.

**మునస**: గురు, హరిద్దొరం నించి యెప్పుడు బైలెళ్లోరు?

**బైరా** : రెండు రోజులయింది. మొన్న ఉదయం ప్రయాగ, నిన్న వుదయం జగన్నాధం శేవించాం. ఖేచరీగమనమ్మీద ఆకాశమారాన్న పోతూ వుండగా మీ వూరి అమ్మవారు వనం దగ్గిర గమనం నిలిచిపోయింది. యేమి చెప్మా? అని యోగదృష్ఠిని చూసేసరికి అమ్మవారి విగ్రహము కింద నిలువుల లోతున, మహాయంత్రం వొకటి స్థాపితమై కనపడ్డది. అంతట భూమికి దిగి, అమ్మవారిని శేవించుకొని, ప్రచ్ఛన్నంగా పోదావఁంటూంటే, యీ భక్తుడు మమ్మల్ని పోల్చి నిలిపేశాడు.

దుకా : చూడగానే, నేను సిద్ధుల్ని పోలుస్తాను గురూ-

మునస: సుక్కేసేవోళ్ళని మాబాగా పోలుస్తావు. మా వూరమ్మోరు జగజ్జనని ! మా చల్లని తల్లి.

బైరాగి : బ్రహ్మోహం ! బ్రహ్మోహం!

హెడ్డు : ఆహా! యోగమహత్యం! స్తానాల్చేసి, ముక్కు బిగించే బ్రాహ్మలకి లేవు గదా యీ సిద్దులూ?

బైరా : వేషానికీ - జ్ఞానానికీ దూరం కాదా తమ్ముడా? మా తాతగారు చెప్పలేదా? "ఆత్మశుద్ధి లేని యాచార మదియేల" అని?

హెడ్డు : వేమన్న - తమ తాతా, గురూ?

బైరా : అవును - వారు పరంపదించి ఆరువొందల సంవత్సరాలు కావొచ్చింది.

హెడ్డు : తమ వయస్సెంత గురూ?

బైరాగీ : ఆదీ అంతూ లేనిదానికి లెఖ్ఖేవిటి తమ్ముడా? పరమాత్మకెన్నేళ్లో అన్నేళ్లు.

మునస: యేం యిలవైన మాటలింటున్నాం!

(వీరేశ శంఖం పూరించును.)

హెడ్డు : (శంఖం లాక్కొని పక్కనువుంచి) అట్టెపట్టెయ్యకండి భాయి.

దుకా : అట్టే యక్కడభాయీ? పరవశవైందాకా తాక్కుంటే తాగడవేఁటి? వేమన్న చెప్పలేదా?

"తాగి, తాగి, తాగి, ధరణిపైబడుదాక।
తాగెనేని తన్ను, తాను తెలియు॥
తాగలేని వాడె, తాగుబోతరయంగ।
యిశ్వదాభిరామ యినరవేమ॥

బైరాగి : కాశీలో రెండువందల యాభై సంవత్సరముల క్రిందట అలంగీర్ పాదుషా వారి హయాంలో, ఒకశేటు మాబోటి సిద్ధులందరిని కూటానికి పిలిచాడు. గంగనడివిఁని పడవ మీద పీపాలలో సారాయి భరాయించి, బంగారపు గిన్నెలతో అందిచ్చాడు. రెండు ఝామల రాత్రి అయేసరికి పీపాలు కాలీ అయిపోయినాయి. అంతా పడిపోయినారు.

హెడ్డు : యేమి ఆశ్చర్యం!

బైరాగి : మేమూఁ ఒక్క నేపాళపు బ్రాహ్మడూ మిగిలాం. "తే! తే!" అన్నాడు ఆ బ్రాహ్మడు. "తెస్తావా శపించేదా" అన్నాడు. శెట్టి యెక్కడ తెస్తాడూ? వాడు మా కాళ్లు

పట్టుకునేటప్పటికి పర్వాలేదు నిలవమని చెప్పి, మేము ఒక పుణిక మంత్రించి, గంగ భరాయించిన కొద్దీ ఆ గంగ సారా అయిపోయింది. ఆ బ్రాహ్మడు సహస్ర పుణికలు తాగి జిట్టున తేన్చాడు. బ్రాహ్మల్లో కూడా మహాత్ములుంటారు. కనుక్కోగలిగిన జ్ఞానికి గంగానది అంతా సారాయి కాదా?

**మునస:** రామందాసోహదు, గంగ బరాయించడానికి గురువు; ఒకదరావుకి పద్దరావుఁలు సేరుస్తాడు.

(హవల్దారు అచ్చన్న ప్రవేశించును.)

**దుకా** : గురూ వీరు హవల్దార్ అచ్చన్న గారు. మంచి గ్యాని. మునసబు గారికి మేనల్లుడు.

**హవల్దారు** : రామ్! రామ్!

**బైరాగి** : రామ్! రామ్!

**హవల్దారు** : (యోగినితో) పిల్లా హుక్కాలావ్? (హెడ్‌తో) భాయీ గుంటూరు శాస్తుల్లు గారి పతాయేమైనా తెలిశిందా?

**హెడ్డు** : లేదు భాయి.

**దుకా** : రామప్పంతులంటాడు – పెళ్లికూతురు రెండో పెళ్ళి పిల్ల – దాన్ని అమ్మి డబ్బు చెయ్యి చిక్కించుకుని –

**హెడ్డు** : ఆ మాటలు మనకెందుకు భాయి?

**మునస** : పోలిసోళ్లకీ అక్కర్లేక, బాపనోళ్ళకీ అక్కర్లేక, యెదవముండని బాపనాడు పెళ్లిచేసుకుంటే లోకం అంతా వూరుకోవడవేఁనా?

**హెడ్** : డబ్బు యిచ్చినవాడికీ, పెళ్లి ఆడినవాడికీ లేని చింత, మనకేల మావాఁ! కాక, "ఈ రోజుల్లో బ్రామ్మణ్యం యెక్కడుంది? యెక్కడ చూశినా పిల్లల్ని ముసలాళ్లకి అమ్ముకోడాలు – రంఢా గర్భాలే కదా?

**హవ** : కలికాలం గదా భాయీ? యెంత చెడ్డా బ్రాహ్మలు మనకి పూజ్యులు.

**హెడ్డు** : అన్నా, యవరంత వారు, వారు. జ్ఞానం, నీతీ ప్రధానం గాని, జాతిలో యేవుఁది? వేమన్న యేవఁన్నాడు?

**మునస:** యెవఁన్నాడా? నీతికి పోలీసోణ్ణి, ఘానానికి సాతానోణ్ణి అడగమన్నాడు.

**హెడ్డు** : మావాఁ! వెక్కిరించండి గాని, నేను యెన్ని తాలూకాల్లో నౌఖరి చేశానో అన్ని తాలూకాల్లోనూ రంఢా గర్భాలు యెన్నని చెప్పను? నన్నడిగితే వెధవలు పెళ్లి చేసుకోవఁ

డమే ఉత్తమం అంటాను. మా సూపరెంటు పిల్లలతో వున్న రెండో పెళ్లి దొరసాన్ని పెళ్లాడి సుఖంగా వుండలేదా?

**మునస:** మావఁగారి అబిప్పరాయం, పెయ్యతోటొచ్చిన ఆవు మేలు కాదా అని? అందకనే, ముసలి బాపనోడు యెధవ గుంటని పెళ్లాడితే, మీ నేస్తం కరణపోణ్ణి, ఆ ముసలాడి యెధవ కూతుర్ని పెళ్లాడమని బోదసెయ్యరాదా?

**హవ** : మనకేల మావాఁ? గవునర్‌మెంటా, దేవుళ్లూ బ్రాహ్మలూ – వారి నేరాలు వారివి – వాటితో మనకి పని లేదు. మన భక్తి మనకుండాలి. (హెడ్‌తో) భాయీ, తెల్లా నల్లా వొకటా?– తెల్లవాడికి క్రీస్తువొక పద్ధతి పెట్టాడు. ముసల్‌మాన్‌కి పైగంబరు వొక పద్ధతి పెట్టాడు, నల్లవాడికి రాముడు వొక పద్ధతి పెట్టాడు. భగవంతుడు తెల్లవాడితో యేవఁన్నాడూ? వెధవని పెళ్ళాడు అన్నాడు. రాముడు తెనుగువాడితో యేవఁన్నాడూ? వెధవని పెళ్లాడొద్దన్నాడు. చెప్పన్న దేశాలూ చూశాను భాయీ. పరిపరి విధాలు ఆచారాలూ, వ్యవహారాలూ వున్నాయి గాని నీతి వకటీ, భగవంతుడొకడూ, అంతటా వక్కటే.

**మునస:** రాముడు యెదవ ముండల్ని కాని పనులు సెయమన్నాడూ? మన్లో మారు మనువులుండేవి కావా?

**హవ** : పిల్లా, చిలుం భరాయించి, తే.

**మునస:** నామాలోడు మూలకి తీసికెళ్లి పిల్లని ముద్దెట్టుకుంటున్నాడు.

**యోగిని** : (చెయ్యి విడిపించుకొని సిగ్గుతో) ఏకాంత ఉపదేశం చేస్తున్నారు.

**మునస** : యేటో ఆ వుప్పుదేశం? తనెంట వాయు యేగంగా రమ్మనా?

**దుకా** : యేవిఁటి భాయీ? అనరాని మాట్లు అంటున్నారు. మనయోగిని పరమ భక్తురాలు.

**మునస:** లెంపలోయించుకుంటాను. పిల్లా! ఆనామోలోడు సెప్పిన ఉప్పుదేశవేఁటో, నా సెవులో కొంచెం సెప్పరాదా?

(యోగిని సారాగళాసు హవల్దార్ యెదట వుంచును)

**మునస** : నామాలోడి వుప్పుదేశంతో పిల్లకి మతోయింది.

**బైరాగి** : హవల్దారు గారు అమృతం సేవించరా?

**హవ** : (చిరునవ్వు నవ్వి) తాక్క సోజరు వాడు చెడ్డాడు, తాగి సిపాయివాడు చెడ్డాడు. జ్ఞానికి జ్ఞానపత్రి; తాగుబోతుకు సారాయి.

**మునస** : పించను పుచ్చుకుంటివి గదా, యింకా సిపాయీనా సెయ్యాల్నుందా, అల్లుడోడా?

**హవ** : కుంపిణీ నమ్మక్ తిన్న తరువాత, ప్రాణం వున్నంత కాలం కుంపిణీ బావుటాకి కొలువు చెయ్యాలి. రేపు రుషియాతో యుద్ధం వొస్తే పించను ఫిరకా యావత్తూ బుజాన్ని తుపాకీ వెయ్యమాఁ ?

**మనస** : రుస్సోవోడి వోడ నీట్లో ములిగి నడస్తాది గదా, నువ్వు తుపాకుతో యవణ్ణి కొడతావు?

**హవ** : మొన్నగాక మొన్న యింగిరీజ్ రుషియా దేశానికి దండెత్తిపోయి, రుషియాని తన్ని తగలలేదా? అప్పుడేవైఁందో, యిప్పుడూ అదే అవుతుంది. మా రాణీ చల్లగా వుండాలి.

**దుకా** : సీవఁరాణీ ఆ కాళీమాయి అవుతారం కాదా?

**హవ** : కాళీ, గీళీ, జాంతేనై – ఆ రాముడి అవతారం.

**దుకా** : గురూ – హవల్దారుగారు తత్తకీర్తనలు మాయింపుగా పాడతారు. (యోగినితో) తల్లీ, నా తంబూరా తెచ్చి భాయిగారికి ఇయ్యి.

**మునస**: యీతూరి, యీరేచ వుప్పుదేశం చేస్తున్నాడు.

**దుకా** : గొప్పవారున్నప్పుడు ఆస్యాలేటి భాయీ?

**మునస**: వున్నమాటాడితే ఆస్సాలా? నాకెవడూ సెయడేం వుప్పుదేశం? యీరేచ వుప్పుదేశం గట్టిగా బిగిసింది; మరిసెయ్యొదల్లు –

(యోగిని కష్టం మీద చెయ్యి వొదిలించుకొని తంబురా తెచ్చియిచ్చును)

**దుకా** : అవన్నీ గ్యానరహశ్యాలు. బ్రెమ్మానందవఁంటే యేటి? కడుపునిండా సారా; ముక్కునిండా పొగ; పక్కని పడుచుపిల్లా కదా?

**మునస**: ఘానం యినండొస్సి –

**హవ** : పామరం ! పామరం! రాముడు పఠం కాళీ నెత్తి మీద పెట్టకపోతే కుంపిణీ సిపాయన్నవాడు యిక్కడికి వొచ్చునా?

**హెడ్డు** : భాయీ ! ఓ కీర్తన శలవియ్యండి.

(హవల్దారు పాడును.)

పింజర్మె రహకర్ ఛుప్ నైరహ్నా
క్యారే బుల్బుల్ కహొ ముల్కిసునా॥ క్యారె॥
యెక్కడికి వెళతావు? యేమి చెప్పవు, బోలో పింజర్మె॥

(వీరేశ శంఖం మనవాళ్లయ్య తీసి పూరించును.)

**హవ** : (పాటమాని, తంబూరా క్రిందబెట్టి) గద్దా!

**హెడ్డు** : (శంఖంలాక్కొని) శంఖం అగ్గిలో పడేస్తాను. యెందుకు తానిస్తావు భాయి!

**దుకా** : వొద్దంటే వినడు.

**హెడ్** : వినకపోతే దుకాణానికి రానియ్యకండి. అల్లరైతే మాకు మాటకదా!

**దుకా** : పదిశంకాలు దాచేశాను; మళ్లీ మళ్లీ తెస్తాడు. యేం జెయ్యను. బేరంగదా భాయీ?

**మునస**: దిట్టంగా పట్టెయి. తత్తఘ్నానం తలకెక్కాలి !

**దుకా** : (తంబురా తీసిపాడును)

నాగా దిగురా। నా తండ్రి దిగురా॥
దిగుదిగు నాగన్న। దివ్య సుందర నాగ।
ముదముతో రేపల్లె। ముద్దుల నాగ॥
ఊరికి ఉత్తరాన । ఊడలమఱ్ఱి కింద॥
కోమపుట్టలోని కోడి నాగన్నా॥–

(పాడుచుండగా రామప్పంతులు ప్రవేశించి యెడంగా నిలిచి యోగినికి సౌజ్ఞ చేయును. యోగిని రామప్పంతులుతో మాటలాడి వచ్చి హెడ్ చెవిలో రహస్యం చెప్పును.)

**మున** : పిల్ల, హెడ్డుగారికి వుప్పుదేశం సేస్తూంది. ముసలోణ్ణనా –

**యోగిని** : (మునసబు చెవి దగ్గర నోరు పెట్టి చెవిగిల్లును)

**మునస**: పిల్లా! సాత్రోజులైంది మునిసిబు నాయుడికి యీపాటి వుప్పుదేశం తగిలి–(హెడ్డు కనిష్టీబు రామప్పంతులు దగ్గిరకు వెళ్లి యడంగా యిద్దరూ మాటలాడుదురు.)

**హెడ్డు** : కొత్తవారు యవరూ లేరే? బావాజీ గారు వుంటే మీకు భయ వేఁవిఁటి?

**రామ** : కొత్తా, పాతా, ఆలోచించుకోలేదు. కొంప మునిగింది. మీ సాయం కావాలి.

**హెడ్డు** : డబ్బేవైఁనా పేల్తుందా?

**రామ** : మీ చాతైతే, పేల్తుంది.

**హెడ్డు** : యేమిటొచ్చిందో చెప్పు.

**రామ** : లుబ్ధావుధాన్లు పెళ్లాడిన గుంట మధురవాణి తాలూకు కంటె తీసుకుని యెక్కడికో పారిపోయింది.

**హెడ్డు** : యెందుకు పారిపోయిందో?

రామ : మీనాక్షి చావగొడితే పారిపోయింది. యెక్కడ వెతికినా కనపడలేదు. ముందు మీ జవాన్లని దౌడా యించండి.

హెడ్ : యీ రాత్రివేళ మాజవాన్లుమాత్రం పట్టుకోగల్రా? పోలీసు జవానంటే పదికళ్లూ, పది కాళ్లూ వుంటాయనుకున్నావా యేవింటి?

రామ : దాని సిగ్గోసిరి; దాన్ని పట్టుకోవడం నాకెందుకు, నాకంటె నాకిప్పించెయ్యండి?

హెడ్డు : యేవింటి నీ మాటలూ! ఆ కంటె పట్టుకు ఆ పిల్ల పరారీ అయిందని చెపితివి. నేను కంటె యెలా యిప్పిస్తాను?

రామ : ముసలాణ్ణి అడిగితే, అది పట్టుకుపోయిందంటాడు; గాని నిజంగా వాడు పెట్టెలో దాచేశి యివ్వకుండా వున్నాడు.

హెడ్డు : నన్నేం చెయ్యమంటావు?

రామ : కూనీకేసని ముసలాణ్ణి బెదిరిస్తే, నా కంటె నాకిచ్చేస్తాడు; మీ చెయ్యి కూడా తడౌతుంది.

హెడ్డు : అలాగనా–గాని నువ్వన్నట్టు ఆ పిల్లగానీ, కంటె పట్టుకు పరారి అయిపోయి వుంటే–

రామ : పోనీండి – దాని ఖరీదు యిప్పించెయ్యండి.

హెడ్డు : వాడిస్తాడా?

రామ : మరి మీ సాయం యెందుకు కోరాను?

హెడ్డు : యిస్తాడని నాకు నమ్మకం లేదు. ఐనా చూస్తాను. కేసని యెత్తు యెత్తడానికి యిద్దరు ముగ్గురు సాక్షులుండాలి?

రామ : మందిరంలో వున్నవాళ్లో?

హెడ్ : వీరేశం, మనవాళ్లయ్యా, మూడోకాలంలో వున్నారు. హవల్దారు అబద్ధం ఆడమంటే తంతాడు. మునసబు నాయుడు యింతరాత్రివేళ అంతదూరం నడిచి రాలేడు. యిహ ఆడనూ పాడనూ రామందాసు వొక్కడే గదా?

రామ : ఆ బైరాగాడు సాక్ష్యం పలకడేం?

హెడ్డు : వేషం వేసుకు ముష్టెత్తుకునే బైరాగాడనుకున్నావా యేవింటి? ఆయన గొప్ప సిద్ధుడు, నిలువెత్తు ధనం పోస్తే అబద్ధవాడ్డు.

రామ : సాక్ష్యం పలకావొద్దు, యేవీవొద్దు, దగ్గిర నిలబడితే చాలును. పిల్చుకురండి? (కనిష్టీబు వెళ్లి దుకాణ దారునూ బైరాగినీ తీసుకువచ్చును.)

బైరాగి : సాక్ష్యం అంటే మావంటి వాళ్లే చెప్పాలి. యోగదృష్టి వల్ల చూశావఁంటే యెక్కడ జరిగినదీ యెప్పుడు జరిగినదీ కళ్లకి కట్టినట్టు అప్పుడు కనబడుతుంది. గనక మేం కూడా వస్తాం. యెవైఁనా దొరికితే హరిద్వారంలో మఠానికి పనికొస్తుంది.

రామ : జరిగినదాని ముండామోశిరి. కొంచం కల్పనుంటే కాని కథ నడవదు. అంచేత హెడ్డుగారు ముసలాడితో చెప్పే మాటలు నిజం అని మీరు శలవివ్వాలి.

బైరాగి : వెట్టి! వెట్టి! నిజవేఁవిటి, అబద్ధవేఁవిఁటి! మేం సిద్ధులం. అబద్ధం నిజం చేస్తాం, నిజం అబద్ధం చేస్తాం – లోకవేఁ పెద్ద అబద్ధం, పదండి.

(నిష్క్రమింతురు.)

★ ★ ★

## ౫వ స్థలము : దేవాలయం గుమ్మం దగ్గిర

(హెడ్డు కనిష్టీబు, రామప్పంతులూ మాట్లాడుతుందురు. మరివక కనిష్టీబు, బైరాగి, దుకాణదారు కొంత యడముగా నిలుచుందురు)

హెడ్ : నా నౌఖరీ పోగొట్టుకుంటానా భాయీ?

రామ : కొంచం బెదిరిస్తే నౌఖరీ పోతుందా అన్నా? పోలీసు డూటీ అంటే బెదిరింపే గదా? మీరు అలా తప్పించుకుంటే నేనేం అనుకోను?

హెడ్డు : (చేతిలో నులుపుతున్న కాకితపు ముక్కలు విసిరేసి) భాయీ. లుబ్ధావుధాన్లు చంటిపిల్లడా? దుక్కిముచ్చా? బెదిరించడానికి – కూనీ కేసని నాకేవైఁనా ఆశవుంటే, పోలీసువాణ్ణి, నేను వూరుకుంటానా? పట్టుకుంటే నాకు యెంత కారక్టు కాదు? యీ జవాన్ని యీ చీకటి రాత్రిలో నూతిలో దింపాను కానా? కూనీ గీనీ అంటే యవరైనా నవ్వుతారు. మీనాక్షి చేతికి వెరచి, ఆ పిల్ల యిరుగింట్లోనో పొరుగింట్లోనో పడుంది. మీ యింట్లోనే వుందేమో – ముసలాడు అన్నట్టు?

రామ : దేవుఁడుతోడు మా యింటికి రాలేదు. యిరుగింటో, పొరుగింటో అని మీరు వూరుకుంటే యలాగ? మీ ధైర్యవేఁవిటో నాకు బోధపడదు. వెతికించవయ్యా అంటే, వెతికించారూ కారు. ఆ యిరుగింటి వాళ్లూ, పొరుగింటివాళ్లూ, పిల్ల నిద్దరపోతూవుండగా కంటె చెపాయిస్తే నాగతేవిఁటి? కంటె యింటికి పట్టుకు వెళ్లకపోతే మధురవాణి గుమ్మంలోంచి గెంటుతుంది. అనగా, గెంటుతుందని కాదు – యేడుస్తుంది – ప్రాణం తినేస్తుంది. విన్నారా?

హెడ్డు : అయితే నా సలహా విన్నారా?

రామ : యేదో చెప్పండి మరి.

హెడ్డు : ఆ కంటె యిచ్చిందాకా, కదలకుండా, లుబ్ధావుధాన్లు యింటిమీద కూర్చోండి.

రామ : యిదా సలహా? పీకమీద కూచున్న దాకా నాకేం పట్టింది? యింటికెళ్లి సుఖంగా పడుకుంటాను.

హెడ్డు : మధురవాణి బాధ పెడుతుందని కదూ?

రామ : అని మీకు కనికారం కాబోలు? రేపు గానీ వాడు కంటె యివ్వకపోతే, అవుధాన్లు మీద సివిల్ దావా పడేస్తాను. మీ దగ్గిర, కంటె మాట వొప్పుకున్నాడు గదా, మిమ్మల్ని సాక్ష్యం వేస్తాను.

హెడ్డు : ఓహో! యిదా వేషం? పోలీసు ఆఫీసర్ని నేను, సాక్ష్యాలకీ సంపన్నాలకీ తిరిగితే నా నౌఖరీ నిలుస్తుందా? కావలిస్తే లుబ్ధావుధాన్లు కంటె హరించాడని నా దగ్గిర ఫిరియాద్ చెయ్యండి. కేసు చేసి నా తమాషా చూపిస్తాను.

రామ : కంటె మాట మీ దగ్గిర అతడు వొప్పుకున్న తరవాత, మీరు బోనెక్కి యలా అబద్ధం ఆడగల్రో చూస్తాను గదా.

హెడ్డు : పంతులూ, అక్కరమాలిన లౌక్యాలు చెయ్యకు. వాడు కంటె మాట తనకేవీఁ తెలియదన్నాడు. కావలిస్తే ఆ మాట సాక్ష్యం పలుకుతాను.

రామ : యిదా మీరు చేసిన సాయం?

హెడ్డు : యెందుకు అక్కరమాలిన ఆందోళన పడతావయ్యా- రేపు నీ కంటె నీ యింట్లో వుండకపోతే నన్ను అను.

రామ : మధురవాణితో యిప్పుడు యేం జెప్పను?

హెడ్ : అయితే నన్నేం జేయమంటారు?

రామ : మళ్లీ లుబ్ధావధాన్లు యింటికి రండి. యీ మాటు మనవిద్దరం వెళ్లి పీడిద్దాం.

హెడ్డు : రెడ్డొచ్చాడు, మొదలాడు అన్నాట్ట - నిరర్ధకంగా రాత్రల్లా నిద్దర్లేకుండా చంపావు. మరి నేను రాజాలను. నువ్వెళ్లి వాడి యింటి మీద కూచోవయ్యా, అని చెప్పాను కానా? నా మాట విని అలా చెయ్యండి. అదే సలహా. పీసిరిగొట్టు ముండాకొడుకు మా నలుగురికీ నాలుగు మూళ్ళు పజ్యెండు రాళ్లు పారేశాడు. యివి పెగిలేటప్పటికి నా తలప్రాణం తోకకి వొచ్చింది. నా వొంతు మూడూ మీకిచ్చేస్తాను.

**రామ** : కంటె పోయి యేడుస్తూ వుంటే, యీ వెధవ మూడు రూపాయలూ నా కెందుకూ?

**హెడ్డు** : మీకు అఖ్ఖర్లేకపోతే పోనియ్యండి. గురోజీ గారికి యిద్దాం.

**రామ** : కొంచం చిల్లర ఖర్చుంది. యేం జెయ్యను? యిలా పారెయ్యండి. (పుచ్చుకొనును.)

**హెడ్డు** : గురోజీ తమకో తులసిదళం.

**బైరాగి** : తృణం, కణం యేవొఁచ్చినా మఠానికే అర్పణం.

**హెడ్డు** : (దుకాణదారుతోనూ, కనిష్టీబుతోనూ) మీకో మూడు, నీకోమూడూ (చేతులు దులిపి) సాఫ్ ఝూడా - నాకు తిప్పటే మిగిలింది.

**దుకాణదారు** : (బైరాగిని పక్కకి పిలిచి) యీవేళే చెన్నాపట్టం నుంచి ఫస్టురకం బ్రాందీ వొచ్చింది. చిత్తగించి మరీ కాశీ వెళుదురు గాని.

**హెడ్డు** : గురోజీ! రాం! రాం! పంతులూ, ముసలాణ్ణి వెళ్లి పట్టుకోండి, భాయీ, స్టేషనుకు పోవాలి. (జవానుతో) రావోయి కావఁయ్యా. (హెడ్డూ, జవానూ, ఒకవైపున్నూ, దుకాణ దారూ, బైరాగీ మరి వక వైపున్నూ వెళ్లుదురు)

**రామ** : కంటె పోయిందంటే మూడురూపాయలా చేతులో బెడతాడు! (విరసంగా నవ్వును) వీడి తాళం పడతాను. (హెడ్ పారేసిన కాకితపు ముక్కలు యేరి) యినస్పెకటరుకి వొకటి, తాసిల్దారుకి వొకటి, ఆకాశరామన్న అర్జీలు పంపుతాను. వెధవ, మధురవాణి దగ్గిరికి వెళతాడేమో? నేను యింటికిపోతే అరుగుమీద పడుకోవాలి గాని ఆ తిక్కలంజ తలుపుతియ్యదు. లుబ్ధావధాన్లు యింటికి వెళ్లితే వాడు కఋచ్చుకుంటాడు. యీ దేవాలయంలో పరుందునా? - పురుగూ బుట్రా కరిస్తే-కరిస్తే ఛీ!- యీ సానిముండని వొదిలేస్తాను - ఆ గుంట యావైఁనట్టు? నా అదృష్టం వల్ల యవళ్లింట్లో నైనా దాగి రేపు గాని కళ్లబడితే, కంటె పోకూడదు - ఒకవేళ చస్తే? - చచ్చుండదు-నూతులో పడలేదు. గవరయ్యా, కావఁయ్యా కూడా గాలించారు-ఒకవేళ అది రెండో పెళ్లి పిల్ల అయి, దాని ఆ తండ్రి కానికీగావొచ్చి బండీ యెక్కించుకు దౌడాయించాడేమో? అలా ఐతే కంటె కూడా వుడాయించదా?-మీనాక్షిని పట్టుకుంటే కొంత ఆచోకీ తెలుస్తుంది - అది కనపడ్డవెఁలాగ?-తలుపు తట్టితే ముసలాడే వొస్తాడేమో?-(రోడ్డు దాటి లుబ్ధావధాన్లు యింటి గుమ్మం యదట నిలుచుని) ఆకలి దహించేస్తూంది - మీనాక్షి దొరికితే యేవైఁనా ఫలహారం యిచ్చును - యవడు చెప్మా! రావిచెట్టు కింద చుట్ట కాలుస్తున్నాడూ? (నాలుగు అడుగులు ముందుకు వెళ్లి) అసిరీ, నువ్వా?

**అసిరిగాడు** : నానుబాబు (చుట్టపారవైచును)

**రామ** : నిమ్మళంగా వున్నావురా?

**అసిరి** : యేట్నిమ్మళం బాబూ, సానమ్మొచ్చింది – ఈయమ్మకాసి సూడం మానేసినారు. డబ్బిచ్చే దాతేడి బాబూ?

**రామ** : అసిరి, అడక్కపోతే, అమ్మైనా పెడుతుందిరా?

**అసిరి** : ఆ సానమ్మ మా సెడ్డ మనిషి బాబూ.

**రామ** : యేవింటి? యేవింటి? చెప్పొరే. చాలా రోజులైంది నీకు డబ్బిచ్చి – యిందా ఈ రూపాయి పుచ్చుకో.

**అసిరి** : నూరు దండాలు బాబూ!

**రామ** : మధురవాణి మాట యేవింట్రా చెప్పబోయినావు?

**అసిరి** : మా సెడ్డమనిషి బాబూ.

**రామ** : యవడెళ్తాడ్రా దాందగ్గిరకీ? అసిరి – యవడెళ్తాడ్రా?

**అసిరి** : యవడెళ్నా, యీపు పెట్లగొడతాది బాబూ.

**రామ** : చెడ్డ మనిషన్నావు?

**అసిరి** : కాదా? మొన్న హెడ్డు గారెళ్తే, యేపికూన్ని ఉసుగలిపింది కాదా?

**రామ** : నిజం చెప్పావు. నీ మీద యెప్పుడైనా కోప్పడ్డదిట్రా?

**అసిరి** : మాలాటోళ్ల మీద యెందకోప్పడతాదీ? బాపనాళ్లొస్తే తిడతాది.

**రామ** : నువ్వు యెప్పుడూ నిజవేఁ చెబుతావురా అసిరిగా.

**అసిరి** : సీ! అబద్దవాడితే బగమంతుడు ఒల్లకుంటాడా బాబూ?

**రామ** : మీ బుగత యేం జేస్తున్నాడ్రా?

**అసిరి** : తొంగున్నాడు బాబూ.

**రామ** : నీకు మరో రూపాయి యిస్తాను – మీనాక్షిని సావిట్లోకి పిలుస్తావురా?

**అసిరి** : నాశక్కవాఁ, బాబూ? ఆయమ్మ అయ్యగదులో పక్కేసుకు తొంగున్నారు.

**రామ** : నువ్వు చిటికేస్తే, యక్కడున్నా లేచొస్తుంది. నేనెరగనట్రా.

**అసిరి** : తెండి బాబూ, సూస్తాను. (రామప్పంతులు రూపాయి యిచ్చును. ఉభయులూ యింట్లో ప్రవేశింతురు)

★ ★ ★

ఽవ స్థలము : లుబ్ధావధాన్లు యింటి నడవ

(తలుపు జారవేసి వుండును)

(మీనాక్షి ప్రవిదతో దీపం తెచ్చి గూటిలో వుంచును. రామప్పంతులు వొత్తి తగ్గించి, మీనాక్షిని ముద్దుబెట్టుకొనును)

**మీనాక్షి:** తోవ తప్పొచ్చారో?

**రామ :** బుద్ధి తక్కువచేత, గడ్డితిని యిన్నాళ్లూ తోవ మరచాను.

**మీనాక్షి:** మధురవాణి యలా రానిచ్చింది?

**రామ :** మధురవాణి శిగ్గోశిరి, దాన్ని వదిలేస్తాను. ఆకలి దహించుకుపోతూంది. ఫలారం యేవైఁనా వుందీ?

**మీనాక్షి:** యేవుందీ? – వొడపప్పూ, కొబ్బిరిముక్కా కావాలా?

**రామ :** యేదో ఒహటి తెస్తూ. (మీనాక్షి మూకుడుతో వడపప్పూ కొబ్బిరి ముక్కలూ తెచ్చును. రామప్పంతులు తినుచుండును)

**మీనాక్షి:** మధురవాణిని వొదిలేస్తారో?

**రామ :** వొదిలెయడం నిశ్చయవైఁపోయింది.

**మీనాక్షి:** కనిష్టీబు మాట తెలిసిందో?

**రామ :** తెలిసింది.

**మీనాక్షి:** యవరు చెప్పారు?

**రామ :** అసిరిగాడు.

**మీనాక్షి:** మా అసిరిగాడా?

**రామ :** మీ అసిరిగాడే.

(అసిరిగాడు వీధి తలుపు కొంచం తీసి తొంగి చూసి)

**అసిరి :** దెయ్యానికెట్టింది తింతున్నావయ్యా?

**రామ :** దెయ్యానికా పెట్టారు?

**మీనాక్షి:** (అసిరిగాడితో) వూరుకో వెధవా.

**రామ :** నీకు న్యాయవేఁనా? దిగదుడుపు కూడు పెట్టడం?

(వీధులోకి వెళ్లి వమనము చేసికొనుటకు ప్రయత్నము చేసి తిరిగీ ప్రవేశించి) వమనవైఁంది కాదు. యేం సాధనం?

**మీనాక్షి:** దిగదుడుపు కాదంటే నమ్మరు కదా?

**రామ** : మూకుళ్ళో తగలేశావు?

**మీనాక్షి:** దెయ్యం తిని సచ్చిందా, యేవిఁటి?

**రామ** : ఆడవాళ్ళు దారుణం మనుషులు!

**మీనాక్షి:** అసిరిగాడేం చెప్పాడు మధురవాణి మాట.

**అసిరి** : (తిరిగీ తొంగి చూచి) ఆ పారేసిందట్టుకు పోదునా బాబు?

**రామ** : పట్టుకుపో.

(అసిరిగాడు పట్టుకుపోవును)

**మీనాక్షి:** వాడికి మీ కంటె ధైర్యం వుంది.

**రామ** : అపవిత్రం ముండాకొడుకు యేవైఁనా తింటాడు. బ్రాహ్మలం పవిత్రవైఁన వాళ్లం గదా!

**మీనాక్షి:** పవిత్రం అంటే, మీదీ, నాదే!

**రామ** : అదేం అలా అంటున్నావు?

**మీనాక్షి:** నేను వెధవముండనీ, మీరు సరసులున్నూ, మనకంటే మరి పవిత్రం అయిన వారు యవరుంటారు?

**రామ** : ఆకళంకం తీసెయ్యడానికే యీ వేళొచ్చాను.

**మీనాక్షి:** యలా తీసేస్తారు?

**రామ** : మనయిద్దరం పెళ్లాడితే మరి అపవిత్రత యెక్కడుంటుంది?

**మీనాక్షి:** యేవిఁటీ!

**రామ** : మనం పెళ్లాడదాం?

**మీనాక్షి:** నిజంగాను?

**రామ** : యేం వొట్టు వేసుకొమ్మన్నావు?

**మీనాక్షి:** ఆ దీపం ఆర్పెయ్యండీ.

**రామ** : యీ కాగితం ముక్కలు చదివి మరీ ఆర్పేస్తాను. (కాగితంముక్కలు జేబులోంచి తీసి చదివి) గాడిద కొడుకు తన బాకీ తాలూకు నోటు లాగి, నన్ను దగా చేశాడు; వీడి తాళం పడతాను.

**మీనాక్షి:** యవడు?

**రామ** : అది వేరే కథ.

**మీనాక్షి:** అసిరిగాడు కనిష్టిబు మాట యేం జెప్పాడు?

**రామ** : మధురవాణి హెడ్డు మీద కుక్కని వుసిగలిపిందని చెప్పాడు.

**మీనాక్షి:** యెందుకూ?

**రామ** : నేను లేనప్పుడు వాడు యింట్లో చొరబడ బోతేను.

**మీనాక్షి:** అయ్యో తెలివా! అసిరిగా!

**అసిరిగాడు** : (ప్రవేశించి) యేటమ్మా!

**మీనాక్షి:** వెధవా, నిజం చెప్పు. పంతులు యింట్లో లేనప్పుడల్లా కనిష్టీబు మధురవాణితో వుంటాడని, నువ్వు నాతో చెప్పలేదూ?

**అసిరి** : (బుఱ్ఱగోకుకుంటూ) సెప్పినాను.

**రామ** : దొంగ వెధవా! కుక్కని వుసిగలిపిందన్నావు?

**అసిరి** : బాబు – నౌకరోడు నోరుమూసుకోవొద్దా బాబు? సానమ్మడిగితే, మీమాట సెప్పుతాన బాబు?

**మీన** : వెధవా, నువు చెబితే నాకు భయవఁనుకున్నావా యేవిఁటి?

**రామ** : ఓరి అబద్ధపు వెధవా! యెవరితోనూ మా మాటమాత్రం చెప్పకు. రూపాయి యిచ్చాను కానూ?

**మీనాక్షి:** యందుకిచ్చారూ, రూపాయి?

**అసిరి** : పిల్లలోణ్ణిగందా? (పైకి వెళ్లును)

**రామ** : దొంగముండ ద్రోహం చేస్తూందేం?

**మీనాక్షి:** తెలుసునన్నారు?

**రామ** : యింతని యెరగను.

**మీనాక్షి:** ఆడది నీతి తప్పిన తరవాత అంతేవిఁటి? యింతేవిఁటి? తెగించిన దానికి సగుడు మొకాలుబంటి – అందులో సాంది ఖాయిదాగా వుండాలనుకోవడం మీదీ బుద్ధితక్కువ.

**రామ** : బుద్ధి తక్కువంటే బుద్ధితక్కువా! ముండని బుఱ్ఱ చితకపొడిచెయ్యాలని వుంది. దీనికింద యంత సొమ్ము తగలెట్టానూ!

**మీనాక్షి:** యెప్పుడు తోలేస్తారు?

**రామ** : యెప్పుడోనా? రేపే. లంజ యంత పతివ్రత వేషం వేసిందీ!

**మీనాక్షి:** మనవెఁప్పుడు వెళ్లిపోవడం?

**రామ** : యక్కడికి?

**మీనాక్షి:** మతిపోతూందా యేవిఁటి? రాజమేంద్రం?

**రామ** : అవును. రేపు దాన్ని తోలేస్తానా? యెల్లుండి మనం వుడాయిద్దాం. గాని నీ సరుకులు తెచ్చుకుంటావా, ముసలాడికి వొదిలేస్తావా?

**మీనాక్షి:** నాకున్నదల్లా నా సరుకులే; యెలా వొదిలేస్తాను? నా సరుకుల పెట్టె తాళం మా నాన్న దగ్గరుంది గదా, యేవి గతి?

**రామ** : నా ప్రయోజకత్వం నీకేం తెలుసును? యిదుగో ఈ రింగున వున్న యినప ములికీతో నీచిత్తవొఁచ్చిన పెట్టె తాళం తీసేస్తాను. గాని నాకంటె యక్కడుంది?

**మీనాక్షి:** గుంటకి పెట్టిందా? రాత్రివేళ, నా బట్టల పెట్లో పెట్టేది.

**రామ** : నీ పుణ్యవుంటుంది. ఆ బట్టల పెట్టె వోమాటు తీసి చూతూ. రేపు దాని కంటె మధురవాణికిచ్చి, ముండని తగిలేస్తాను.

**మీనాక్షి:** ఆ గుంట బట్టల పెట్టె తాళం పారేశింది?

**రామ** : ములికితో తీసేస్తాను.

**మీనాక్షి:** నా సరుకుల పెట్టె తాళం కూడా తీసేసి పెడతారూ?

**రామ** : అద్దే!

**మీనాక్షి:** నన్ను పెళ్లాడతానని ప్రెమాణం చేశారు కారే?

**రామ** : దీపం అర్పేస్తె పెట్టె తియ్యడం యలాగ?

**మీనాక్షి:** అగ్గిపుల్ల వుంది.

**రామ** : ఐతే యిదిగో, నిన్ను తప్పకుండా పెళ్ళాడతానని ఈ దీపం ఆర్పేస్తున్నాను.

(రామప్పంతులు దీపం ఆర్పి మీనాక్షిని కాగలించుకుని యెత్తును.)

**రామ** : యిలా యెత్తుకు తీసుకుపోతాను రాజమహేంద్రవరం.

(లుబ్ధావధాన్లు చీకటిలో వచ్చి కఱ్ఱతో రామప్పంతులు కాళ్ల మీద కొట్టును. మీనాక్షి కిందపడును)

**లుబ్ధా** : బందిపోటు గాడిదెకొడకా!

**రామ** : సచ్చాన్రా (వీధిలోకి కుంటుకుంటూ పోవును)

**లుబ్ధా** : పో, ముండా నువు కూడా నా యింట్లోంచి. (మీనాక్షిని పైకి తోసి తలుపు గడియ వేయును)

**రామ** : అసిరిగా. చంపేశాడ్రా – కాలెవింక విరిగి పోయిందిరా.

**అసి** : (నిమ్మళంగా) దెయ్యానికెట్టింది తింతే యేటౌతది బాబూ? (గట్టిగా) కానేళ యిల్లు జొరబడితే, బుగత తన్నడా?

**రామ** : (మీనాక్షితో) నువ్వు యింట్లోకి వెళ్లిపో.

**మీనాక్షి:** మరి యింట్లో అడుగుపెట్టను. నా సరుకులు లేకపోతేపాయను. రండి రాజమేంద్రం పోదాం.

**రామ** : తలిచినప్పుడేనా తాతకి పెళ్లి?

**మీనాక్షి:** మీ యిష్ట వొచ్చినప్పుడు పెళ్లాడుదురు గాని, యింట్లోంచి లేవదీసుకొచ్చారు గదా? యిహ నేను మీతో వుండవలసిన దాన్నే, పదండి.

**రామ** : వెట్టి కుదిరింది, రోకలి తలకి చుట్టుకొమ్మన్నాట్ట! బతిమాలుకుంటాను. యిప్పటికి యింట్లోకి వెళ్లిపో.

**మీనాక్షి:** మరి యీ జన్మంలో యీ యింట్లో అడుగు పెట్టను.

**రామ** : అసిరిగా, మీనాక్షి వొక్కర్తా వుంటుంది. కాపాడి, బుగత తలుపు తియ్యగానే లోపలికి తీసుకెళ్లు.

(పరిగెత్తును. మీనాక్షి వెంటబడును)

**(రామప్పంతులు యింటి యెదట)**

**రామ** : (తలుపు తట్టి) వేగిరం, వేగిరం తియ్యి.

**మధురవాణి** : (తలుపు అవతల నుంచి) యేవింటా తొందర?

**రామ** : ఆకుచిట్టెడ వెంట తరువుతూంది.

**మధురవాణి** :చిట్టెడ కనపడగానే తలుపు తీస్తాను.

**రామ** : తలుపేసుకు కూచుంటే నీకకనపడ్డం యలాగ? నువ్వు తలుపు తీసేలోగా నన్ను కాజేస్తుంది.

**మధు** : నాకంటేదీ?

**రామ** : కంటె, కంటె, అని తపిస్తున్నావేవింటి? నిలబడ్డ పాటున నూరు కంటెలు కురిపిస్తాను.

**మధు** : మీ నూరు కంటెలూ మీరు వుంచుకొని, నావొక్కకంటె నాకిచ్చి, మరీ యింట్లో అడుగు పెట్టండి.

**రామ** : రేపు పొగలు కాని కంటె యివ్వనన్నాడు లుబ్ధావధాన్లు?

**మధు** : రేపే యింట్లోకొత్తురు గాని, మించిపోయిందేవీఁలేదు.

**రామ** : యింతట్లో చిట్టెడ మీదపడితే.

**మధు** : సకేశా? అకేశా?

**రామ** : పిల్లికి చెలగాటం, యలక్కి ప్రాణ పోకటా!

(మీనాక్షి ప్రవేశించి, రామప్పంతులు రెక్క పట్టుకొనును)

**మీనా** : దీపం ఆర్పి ప్రమాణం చేశావు – తప్పితే తలపగిలిపోతుంది.

**రామ** : పోముండా!

**మీనా** : మీ కాగల పెళ్లాన్ని గదా యెక్కడికి పోతాను?

**మధు** : కాగల పెళ్లావేఁవింటి?

**మీనా** : నిన్ను వొదిలేసి, నన్ను రాజమేంద్రం తీసుకు పోయి పెళ్లాడతానన్నాడు – దీపవాఁర్పి ప్రమాణం చేశాడు. మరెలా తప్పుతాడు?

**మధు** : యీవిడేనా ఆకు చిట్టెడ?

**రామ** : ముండా, నాచెయ్యొదిలెయ్ – నిన్ను నే పెళ్లాడతానన్నానే? కలగన్నావా యేవింటి? (మీనాక్షిని విదిపించుకొనగా మీనాక్షి కిందపడును)

**మధు** : ఆడదానిమీదా చెయి జేసుకుంటారు? యేమి పౌరుషం! అబద్ధవాఁడక అన్నమాట నిలబెట్టుకోండి. యేం? కులం తక్కువా? రూపం తక్కువా? ఆమె బతుకు భ్రష్టు చెయ్యనే చేశారు; పెళ్లాడి తప్పు దిద్దుకోండి–ఆవిణ్ణి పెళ్లాడి వొస్తేనే నేను తలుపు తీస్తాను.

**మీనా** : పంతులు నన్ను కాగలించుకుని యెత్తుకుంటే మా నాన్న చూసి, తన్ని, యిద్దర్నీ యింట్లోంచి తగిలేశాడు. నువ్వు హెడ్డు కనీష్టీబుతో పోతున్నావు, నిన్నొదిలేసి నన్ను పెళ్లాడతానని వొట్టేసుకున్నాడు. నన్ను లేవదీసుకొచ్చి, నన్ను పెళ్లాడక తప్పుతుందాయేమిటి?

**మధు** : అవస్యం పెళ్లాడవలిసిందే – పెళ్లాడక పోతే నువ్వు మాత్రం వూరుకుంటావూ? దావా తెస్తావు – పంతులు గారికి దావాలంటే సరదానే!

**రామ** : మధురవాణీ! నీకు మతిపోతూంది – నా యింటికి నువ్వా యజమానివి? తలుపు తియ్యి.

**మధు** : నిలబడండి. కర్పూరం వెలిగించి, మంగళ హారతి పళ్లెం తెస్తాను. (తలుపు దగ్గిర నుంచి లోనికి వెళ్లును).

**రామ** : (తలుపు సందులోనుంచి చూసి, తరవాత మీనాక్షిని ముద్దెట్టుకొని) యెంత పని చేశావూ! దాంతో చెప్పేశావు! రహస్యంగా లేచిపోయి పెళ్లిచేసుకోవాలి గాని, అల్లరి చేసుకుంటే యలాగ?

**మీనా** : యెప్పుడైనా అందరికీ తెలిసేదే గదా?

**రామ** : నా మాట విని యిప్పుడు యింటికి వెళ్లిపో.

**మీనా** : యిహ మా యింటికి వెళ్లను. యిదే మా ఇల్లు; మధురవాణి తలుపు తీస్తుంది; లోపలికి వెళదాం.

**రామ** : అయితే యిక్కడ వుండు యిప్పుడే వస్తాను. (కొన్ని అడుగులు వీధంట నడచి, నిలచి) నిజంగా మంగళహార్తి తెస్తుంది కాబోలు పెంకె లంజ? అది తలుపు తియ్యకపోయెనా, మీనాక్షి నన్ను వెతకడానికి బయల్దేరుతుంది. తెల్లవారవచ్చింది–చెరువ్వేపు పోయి కాలకృత్యాలు తీర్చుకుని ఆపై చర్య ఆలోచిద్దాం. రెండ్రోజులు పైకి వుడాయించానంటే, మళ్లీ వచ్చేసరికి కొంత అల్లరి సద్దుకుంటుంది. తలుపు తీసినట్టు కానరాదు. యవడిల్లు? యవర్తె యిది నన్ను అడ్డడానికి? ఆశ్చర్యం! (కొంత దూరంగా వీధిలో నిలబడి, దాసరి వేషంతో శిష్యుడు చితారుమీటి పాడును)

చరణం ॥ "యిల్లు యిల్లనియేవు । యిల్లు నాదనియేవు
నీ యిల్లుయెక్కడే చిలుకా?"

**రామ** : యిది నా యిల్లు కాదా?

**శిష్యుడు** : "ఊరికి ఉత్తరాన। సమాధి పురములో। కట్టె యిల్లున్నదే చిలుకా॥"

**రామ** : వల్లకాట్లోనా?

**శిష్యుడు** : పల్లవి॥ "యెన్నాళ్ళు బ్రతికినా। యేమి సామ్రాజ్యమే।
కొన్నాళ్ళకో రామచిలకా?"॥

అనుపల్లవి : "ముణ్ణాళ్ల బతుకునకు, మురిసేవు త్రుళ్ళేవు।
ముందుగతి కానవే చిలుకా"

**రామ** : యేవిఁటీ అపశగునం పాటా?

**శిష్యుడు** : "కట్టిలే చుట్టాలు, కట్టెలే బంధువులు

కన్నతల్లెవ్వరే చిలుకా?"

**రామ** : చుట్టాలా? వొక్క అప్పవుంది, అది యెప్పుడూ నా గుమ్మంలో అడుగుబెట్టలేదు. యిప్పుడు యింటికి యజమాని యెవరూ? తలుపవతల సాని లంజా, తలుపివతల సంసారి వెధవ లంజానూ; యిద్దరూ కలిసి యిల్లు చేరకుండా నన్ను తగుల్తున్నారు.

**శిష్యుడు** : "నిన్ను మోసేరు నలుగురు। వెంబడిని పదిమంది।"

**రామ** : వెఱ్ఱి ముండాపాటా! పోదాం. (గబగబ కొంత దూరము నడచి, నిలుచుని) యీ తోవనే వొస్తున్నాడు కాబోలు – అదుగో పాట వినబడుతూంది?)

పాట : "నువ్వు కాలిపోయేదాక।
కావలుందురు గాని।
కడకు తొలగొత్తురు।
వెంట నెవరూ రారు చిలుకా॥"

**రామ** : వెఱ్ఱి ముండాపాటా!

**శిష్యుడు** : పంతులుగారూ! యక్కడున్నారు?

**రామ** : పరుగుచ్చుకోకపోతే పట్టుగుంటుంది. (పరిగెత్తును)

★★★

# కన్యాశుల్కము

## షష్ఠాంకము

### ౧వ స్థలము: రామచంద్రపురం అగ్రహారంలో)

(చెఱువు గట్టున వున్న తోటలోనికి పెళ్లివారిబళ్లు వచ్చును. గట్టుమీద ఒక వైపు అగ్నిహోత్రావధాన్లు, రెండవ వైపు పళ్ళు తోమికొనుచు రామప్పంతులును)

**అగ్ని** : బళ్లు దింపండి. బళ్లు దింపండి. సాయేబూ యేనుక్కి కావలసినంత రొడ్డ. చెఱువు స్నానానికి బహు బాగా వుంది. యెవరయా చెఱువు గట్టు మీద?

**రామ** : (తనలో) అరే! మరిచితిని. యీవేళే కదా పెళ్లివారు రావలసిన రోజు? (పైకి) నా పేరు రామప్పంతులంటారు.

**అగ్ని** : లుబ్ధావధాన్లుగారు మిమ్మల్ని పంపించారా యేమిషి?

**రామ** : యెందుకండి?

**అగ్ని** : మేవొఁస్తున్నావఁని యెదురుగా యవర్నీ పంపలేదా? నా పేరు అగ్నిహోత్రావధాన్లు అంటారు.

**రామ** : మీరేనా అగ్నిహోత్రావధాన్లు గారు? యేం వచ్చారేఁవిటి?

**అగ్ని** : పెళ్లి మాట మీకు తెలియదా యేమిషి?

**రామ** : పెళ్లెవరికండి.

**అగ్ని** : మీదీ వూరు కాదా యేమిషండి? మా పిల్లని లుబ్ధావధాన్లుగారి కిస్తావుఁ.

**రామ** : లుబ్ధావధాన్లు గారికి పెళ్ళైపోయిందే?

**అగ్ని** : తమరు హాస్యాలాడుతున్నారు – హాస్యాలకేం గాని, ప్రయత్నాలు యలా జరుగుతున్నాయి యేమిషండి?

**రామ** : మీరే హాస్యాలాడుతున్నట్టుంది. పెళ్లి అయి పదిరోజులైంది. లుబ్ధావధాన్లు గారి సంబంధం అక్కర్లేదని మీరు రాశారట. అందుపైని యవడో గుంటూరు నుంచి వొచ్చిన ఓ శాస్తుల్లు కొమార్తెని పన్నెండు వొందలిచ్చి పెళ్లాడాడు.

**అగ్ని** : అన్నగారూ–హాస్యం ఆడుతున్నారు. న్యాయం కాదు. మనకి బావగారి వరసా యేమిషండి?

**రామ** : యేమిటి మీ మాటలూ? నేను యెన్నడూ అబద్ధవాఁడి యెరగను. నా మాట నమ్మకపోవడం ధర్మవేఁనా?

**అగ్ని** : ప్రమాణం చెయ్యండీ?

**రామ** : గాయత్రీ సాక్షి.

**అగ్ని** : అయ్యో! అయ్యో! యేవీఁదురంతం! రండీ, వెళ్లి గాడిదకొడుకు యెవిఁకలు విరగ్గొడతాను.

**రామ** : నేను రానండి. ఆ గుంటూరు సంబంధం చెయ్యవొద్దన్నానని నాతో మాట్లాడడం మానేశాడు. మీరు వెళ్లిరండి. మీరు తిరిగీ వొచ్చిందాకా యిక్కడే కూచుంటాను.

**అగ్ని** : ఆ గాడిదె కొడుకు యింటికి నాకు తోవ తెలియదే?

**శిష్యు** : (చెరువుగట్టు యెక్కుతూ పాడును) "తానెవ్వరో తన వారెవ్వరో? । "మాయజీవికి తనువుకు తగులాయగాకా"॥

(రామప్పంతులు నిలబడి భయము కనబర్చును.)

అగ్ని : యేవిఁ అలా చూస్తున్నారు?

రామ : శవాన్ని మోసుకుపోయే పాట!

శిష్యుడు : "దినమూ, మరణమని తెలియూడీ".

రామ : (శిష్యునితో) వూరుకో (అగ్నిహోత్రావధాన్లుతో) అన్నా ఓ కానీ వుందా?

శిష్యుడు : మిమ్మల్ని తీసుకురమ్మంది.

రామ : చచ్చానే - వొస్తూందా యేవిఁటి?

శిష్యుడు : కంటె పోతేపోయింది, రమ్మంది.

రామ : బతికాను.

అగ్ని : చావడం యెందుకు, బతకడం యెందుకు?

రామ : అది వేరే కథ.

శిష్య : చిట్టపులి పిల్లని తండ్రొచ్చి పండకి తీసుకు పోయినాడట.

అగ్ని : యీ వూళ్లోకి పుల్లొస్తాయా యేమిషి?

రామ : విరగడైపోయింది. (శిష్యునితో) యింద రూపాయి. (శిష్యుడు తీసుకుని) దాసుణ్ణి బాబూ!

(పాడును) "చిత్తాస్వాతి వాన, జోడించి కురియగ".

అగ్ని : యేవిఁటీ వెధవపాట? వూరుకుంటావా వూరుకోవా? నీకు రూపాయి చాలదురా గుంట కక్కగట్టా?

శిష్య : తమరు దయచెయ్యరా బాబూ?

అగ్ని : నేనివ్వను - అన్నా, తోవ యవరు చూపిస్తారు?

రామ : (శిష్యుడితో) నీకు లుబ్ధావధాన్లు యిల్లు తెలుసునూ.?

శిష్య : తెలుసును - తండ్రీ

రామ : అవుధాన్లు గారు ఓ కాని డబ్బిస్తారు. యిల్లు చూపించు.

శిష్య : ముందిస్తే గాని చూపించను.

అగ్ని : యింద - యేడువు.

(శిష్యుడు ముందూ, అగ్నిహోత్రావధాన్లు
వెనకా కొన్ని అడుగులు వెళ్లిన తరవాత, శిష్యుడు పాడును.)

శిష్యు : "నీలాలకా యేల నీ యలుకా?"

అగ్ని : యలకేవిఁటి నీ శ్రాద్ధం?

శిష్యు : యలక్కాదు, పిల్లి.

(పాడును) "పిల్లన్న తెయితక్కలాడంగనూ। యలక లేరూగట్టి దున్నంగనూ!"

అగ్ని : యేవిఁటీ?

శిష్యు : "మేక పిల్లరెండు మేళాంగట్టుకుని। మేరంగి తీర్థాని కెళ్లంగనూ"॥

అగ్ని : యేవిఁటి నీ శ్రాద్ధం పాట!

శిష్యు : "తొండాయ నేస్తూడు, దొనిగఱ్ఱబట్టుకుని। తోటమల్లీ పువ్వులేరంగను॥"

అగ్ని : పాడావంటే తంతాను.

శిష్యు : అయితే నీకు మరి యిల్లు చూపించను.

అగ్ని : పాడగట్టా – (కొట్టబోవును)

శిష్యు : (తప్పించుకు పారిపోతూ) "గట్టుకిందానున్న। పందాయనేస్తూడు మరిగబుకూ మరిగుబుకూ"॥

(నిష్క్రమించును)

అగ్ని : వీడి శ్రాద్ధం చెట్టుకింద బెట్టా, తోవ యిటా? అటా?

(తెరదించవలెను)

★★★

## ౨వ స్థలము : చెఱువుగట్టు తోట

(అగ్నిహోత్రావధాన్లు, రామప్పంతులు, వెంకమ్మ, యితరులూ.)

అగ్ని : గాడిదెకొడుకుని మా చెడ్డ దెబ్బలు కొట్టేశాను; యేనుగులూ గుఱ్ఱాలూ తెచ్చాను వీడి శ్రాద్ధం మీదికి! తోవ ఖర్చయినా వొక దమ్మిడీ ఇయ్యడష.

వెంకమ్మ : మన ప్రాలుబ్ధం – నేన్నోచిన నోవుఁలు యిలా వుండగా, మరోలా యలా అవుతుంది? యీ సంమ్మంధం వొద్దని పోరితే విన్నారూ? నేను భయపడుతూనే వున్నాను. బయల్దేరేటప్పుడు పిల్లి యెదురు గుండా వొచ్చింది.

అగ్ని : పింజారీ! వూరుకో–ఆడముండలకేం తెలుసును? అన్నగారూ, క్రిమినల్ కేసు తావడానికి అవకాశం వుంటుందా? మా దగ్గిర అయ్యవారూ ఒకాయన వున్నారు. ఆయనకి లా బోగట్టా మాబాగా తెలుసును. ఆయన్ని కూడా సలహా చేదాం.

రామ : కోర్టు వ్యవహారాల్లో ఆరితీరిన మీకు ఒహడు సలహా యివ్వాలండీ? స్థలజ్ఞుణ్ణి గనక సాక్ష్యం గీక్ష్యం తేవడానికి నేను సాయం చేస్తానన్నాను గానీ, అయ్యవార్లు, గియ్యవార్లూ మీకు నాకూ సలహా చెప్పేపాటివాళ్లా? గుంట కక్కగట్లు రెండు యింగిలీషు ముక్కలు చదువుకున్నారు గనక ముక్కస్యముక్కార్థః అని తర్జుమాలు మట్టుకు చేస్తారు; గాని యేదయినా యెత్తుయెత్తావఁంటే, తమలాంటి యోధులు యెత్తాలి, నాలాంటి నియ్యోగపాడు నడిపించాలి. క్రిమినలుకి అవకాశం వుందా అని అడుగుతారేవిఁటి? మీకు తెలియదా యేవిఁటి! – అటుపైని సులభసాధ్యంగా మూడు నాలుగువేలు డామేజీ కూడా సివిల్లో లాగేస్తారు.

అగ్ని : అదే, నా ఆలోచన.

రామ : తీరిపాయె; మళ్లీ యిహ సలహాకేవుఁంది. వెంటనే వెళ్లి ముక్క తగిలించేదాం. ఖర్చులికి సొమ్ము పట్టుకుని బయలుదేరండి.

అగ్ని : నా దగ్గిర దమ్మిడీ లేదు; యేమి సాధనం? ఈ గాడిదె కొడుకు రూపాయలిస్తాడని నమ్మి, నేనేమీ తేలేదు.

రామ : యింటికి వెళ్లి లెఖ్ఖపట్టుకు వొచ్చేటప్పటికి పుణ్యకాలం మించిపోతుంది. "శుభస్యశీఘ్రం" అన్నాడు – మీ ఆలోచనేవిఁటి?

అగ్ని : యిదేదో అయితేనే గాని యింటి మొహం చూసేది లేదు. మా అమ్మి సరుకేదయినా ఈ వూళ్లో తాకట్టు పెడదాం.

రామ : అయితే పట్టుకురండి; పోలిశెట్టి దగ్గర తాకట్టు పెడదాం; పోలిశెట్టిని మనం కొంచం మంచి చేసుకోవడం ఆవస్యకం. మీరు లుబ్ధావధాన్లుని కొట్టినప్పుడు–పోలిశెట్టి వున్నాడు గనక, లుబ్ధావధాన్లు మీమీద ఛార్జి చేసినప్పుడు, పోలిశెట్టిని తప్పకుండా సాక్ష్యం వేస్తాడు. శెట్టిని మనం విడతియ్యడం జరూరు – యేవఁంటారు?

అగ్ని : మీ సలహా మా బాగా వుంది. నాకూ అదే భయ వేఁస్తూంది.

రామ : చూశారా, ప్రతి వాడికీ సలహా చెప్పడం చాతౌతుందండీ? అందులో యీ యింగిలీషు చదువుకున్న అయ్యవార్లని సలహా అడిగితే, కేసులే తేవొద్దంటారు. దొంగసాక్ష్యాలు తావొద్దంటారు. వాళ్ల సొమ్మేం పోయింది. యే మాలకూడూ లేకపోతే కేసులు గెలవడం యలాగ?

**అగ్ని** : మా అయ్యవారు మట్టుకు మంచి బుద్ధిమంతుడూ, తెలివైనవాడూనండి-కోర్టు వ్యవహారాలలో అతనికి తెలియని సంగతి లేదండి. అంత బుద్ధిమంతుణ్ణి నేను యక్కడా చూడలేదు. ఆయన్ని చూస్తే మీరూ అలాగే అంటారు.

**రామ** : యెంత బుద్ధిమంతుడైనా మీ కొహాడు సలహా చెప్పేవాడున్నాడండీ? (చెవులో) మరో మాట-మీ అయ్యవారు గిరీశం గాడు కాడండీ? వాడు లుబ్ధావధాన్లు పింతల్లి కొడుకుగదా? మీకా వాడు, యీ కేసుల్లో సరైన సలహా చెబుతాడు?

**అగ్ని** : అవునండోయి!

**రామ** : నియ్యోగపాణ్ణి - నా మాట కొంచం ఖాతరీ చెయ్యండి. గనక, ఆ అయ్యవార్ని తోడిచ్చి, పిల్లల్ని యింటికి పంపించెయ్యండి. యెకాయెకిని మనం తక్షణం వెళ్లిపోయి, లుబ్ధావధాన్లు కన్న ముందు ముక్క తగిలించెయ్యాలి. యేదో ఓ సరుకు వేగిరం పట్టుకురండి.

**అగ్ని** : యేదీ, అమ్మిని యిలా పిలువు.

**వెంకమ్మ**: అమ్మేది చెప్మా? బద్దకించి బండిలో పడుకుంది కాబోలు. పిలువమ్మా.

**అగ్ని** : మనకి డామేజీ దిట్టంగా వొస్తుందా?

**రామ** : వొస్తుందంటే, అలాగ యిలాగానా?

**ఒకడు** : అమ్మన్నగారి బండీ యక్కడా కనపడదు; బండీ వెనకపడిపోయింది కాబోలు.

**వెంకమ్మ**: అడుగో అబ్బి వున్నాడే? వీడెలా వొచ్చాడు? అబ్బీ నువ్వు అక్కయ్య బండిలో కూచోలేదురా?

**వెంకటేశం** : లేదు. నేను యేనుగెక్కాను.

**అగ్ని** : దొంగగాడిద కొడకా అయ్యవారేడ్రా?

**వెంకటేశం** : యెక్కడా కనపడ్డు.

**అగ్ని** : గుఱ్ఱం వొచ్చిందా? గుఱ్ఱపాడేడీ?

**వెంకటేశం** : గుఱ్ఱపాడు చెప్పాడు -

**అగ్ని** : యేవింట్రా, వెధవా, చెప్పాడూ?

**వెంకటేశం** : మాష్టారూ - రాత్రి -

**అగ్ని** : నోటంట మాట పెగల్దేం?

**వెంకటేశం** : గుఱ్ఱం దిగి - బండీ యెక్కాట్ట.

**వెంకమ్మ:** అయ్యో దాన్ని లేవదీసుకు పోలేదు గద?

**దగ్గిరనున్న వారు** : ఆc! ఆc!

**వెంకమ్మ:** కొంప మునిగిపోయింది, మరేవింటి !

(చతికిలబడును)

**అగ్ని** : (కోపము చేత వణుకుచు) అయ్యవారు పకీరు ముండని లేవతీసుకుపోయాడూ? నగలపెట్టె? నా కోర్టు కాగితాలో ?

**వెంకటేశం** : అక్కయ్య పెట్లో నా పుస్తకాలు కూడా పెట్టాను.

**అగ్ని** : దొంగ గాడిదె కొడకా! నువ్వే వాణ్ణి యింట్లో పెట్టావు. రవంత ఆచోకీ తెలిసింది కాదు. దొంగ వెధవని చంపేసిపోదును. గాడిదె కొడుకును అమాంతంగా పాతి పెట్టేదును.

**రామ** : (దగ్గిరకు వచ్చి) అయ్యవారు మహా దొడ్డ వాడని చెప్పారే? యేమి యెత్తుకు పోయినాడేమిటండి?

**అగ్ని** : యేవిం యెత్తుకుపోయినాడా? నీ శ్రాద్ధం యెత్తుకుపోయినాడు. పకీరు ముండని యెత్తుకు పోయినాడు. యీ గాడిదె కొడుకు యింగిలీషు చదువు కొంప ముంచింది. (వెంకటేశం జుత్తు పట్టుకొని కొట్టబోవుచుండగా తెరదించవలెను.)

★★★

**౩వ స్థలము : విశాఖపట్టణములో మధురవాణి బస యెదటి వీధి**

(రామప్పంతులు, అగ్నిహోత్రావధాన్లు, ప్రవేశింతురు)

**అగ్నిహో:** మనం పోలిశెట్టి దగ్గిర బదులెత్తిచ్చిన రూపాయి లన్నీ అయిపోయినాయి; యప్పటికీ ఖర్చులు ఖర్చులే అంచారు; నా దగ్గిర వక దమ్మిడీ లేదు.

**రామ** : ఖర్చు కానిదీ కార్యాలవుతాయిటయ్యా? మీ కడియం యెక్కడైనా తాకట్టు పెట్టండి.

**అగ్ని** : యీవూళ్లో మనం యెరిగిన వాళ్లెవరున్నారు?

**రామ** : రండి మధురవాణి దగ్గిర తాకట్టు పెడదాం.

**అగ్ని** : చేసేవి మాఘస్నానాలూ, దూరేవి దొమ్మరి కొంపలూ అని, జటాంత స్వాధ్యాయిని నన్ను ముండలిళ్లకి తీసికువెళతావషయ్యా?

**రామ** : మరి యేకొంపలూ తిరక్కపోతే కేసులు గెలవడం యలాగ? అది అందరు ముండల్లాంటిదీ అనుకున్నారా యేమిటి? సంసారి వంటిది. ఐనా మీకు రావడం ఇష్టం లేకపోతే నా చేతికివ్వండి, నేనే తాకట్టు పెట్టి సొమ్ము తీసుకువస్తాను.

**అగ్ని** : అలాక్కాదు; నేను కూడా వస్తాను.

**రామ** : యేదీ కడియం ఇలాగివ్వండి.

**అగ్ని** : యిది మా తాతగార్నాటిది. యిది యివ్వడమంటే నాకేమీ యిష్టం లేకుండా వుంది. డబ్బు వూరికే ఖర్చు పెట్టించేస్తున్నారు; మీరు కుదిర్చిన వకీలు తగినవాడు కాడష; యింగ్లీషూ రాదు, ఏమీ లేదూ.

**రామ** : ఆయన్లాంటి చెయ్యి యీ జిల్లాలో లేదు. ఆయన్ని చూస్తే డిప్టీకలక్టరు గారికి ప్రాణం. ఇంతకీ మీరేదో పట్టుదల మనుషులనుకున్నాను గాని, మొదటున్న వుత్సాహమీ్మకు యిప్పుడు లేదు. మీకు డబ్బు ఖర్చు పెట్టడం యిష్టం లేకపోతే మానేపాయెను. "యావత్తైలం, తావద్వ్యాఖ్యానం" అన్నాడు. మరి నాకు శలవిప్పించెయ్యండి.

**అగ్ని** : (ఆలోచించి) అయితే తాకట్టు పెట్టండి. (అని నిమ్మళముగా కడియము తీసి యిచ్చును)

**రామ** : (తన చేత నెక్కించుచు) యీ కేసుల్లో యిలాగు శ్రమపడుతున్నాను కదా? నాకొక దమ్మిడీ అయినా యిచ్చారు కారు గదా?

**అగ్ని** : అయితే నా కడియం వుడాయిస్తావా యేమిషి?

**రామ** : నేను మీకు యెలాంటి వకీల్ని కుదిర్చాను! ఆయన మీ విషయమై యంత శ్రమ పడుతున్నాడు! ఇదుగో ఆయన వస్తున్నాడు.

(నాయడు ప్రవేశించును)

**రామ** : (తనలో) యేమిటి చెప్మా, వీడు మధురవాణి బస పెరటి దిడ్డీ వేపు నుంచి వస్తున్నాడు? వీడు కూడా మధురవాణిని మరిగాడా యేమిటి? వీణ్ణి ఈ కేసులో నుంచి తప్పించెయ్యాలి.

**నాయడు**: యేమండీ రామప్పంతులన్నా, మిగతా ఫీజు యిప్పించారు కారు గదా?

**అగ్ని** : మీరు రాసిన డిఫెన్సు బాగుంది కాదని భుక్త గారన్నారష.

**నాయడు**: ఎవడా అన్నవాడు? గుడ్లు పీకించేస్తాను. రామప్పంతులన్నగారూ చూశారండీ. డిఫెన్సు యెంత జాగ్రతగా తయార్ చేశానో. నా దగ్గిర హైకోర్టుక్కూడా ప్లయింట్లు రాసుకువెళ్లిపోతారు. యీ కుళ్లుకేసనగా యేపాటి? నేచెప్పినట్టల్లా పార్టీ నడిస్తే నేపట్టిన

కేసు పోవడమన్న మాట యెన్నడూ లేదు. యీ డిఫెన్సు చిత్తగించేండి. (చంకలోని రుమాల్ కట్టతీసి విప్పి అందులో ఒక కాగితము తీసి చదువును)

"ఫిర్యాదీ చెప్పిన సంగతులు యావత్తూ అబద్ధం కాని యెంత మాత్రం నిజం కావు". చూశారూ ఆ వక్క మాటతోటే ఫిర్యాదీ వాదం అంతా పడిపోతుంది.

"ఫిర్యాదీ నా మీద గిట్టక దురుద్దేశంతో కూహకం చేసి కేసు తెచ్చినాడు కాని యిందులో యెంతమాత్రం నిజం లేదు".

**రామ** : డిఫెన్సు మాటకేమండి గాని అవధాన్లు గారు పైసా లేదంటున్నారు.

**నాయడు**: పైసా లేకపోతే పనెలా జరుగుతుంది?

**రామ** : ఒక సంగతి మనవి చేస్తాను యిలా రండి (రామప్పంతులు, నాయడు, వేరుగా మాటలాడుదురు). నాయడుగారూ మీ వకాల్తీ యీయనకేమీ సమాధానం లేదు. నేయెంత చెప్పినా వినక భీమారావు పంతులు గారికి వకాల్తీ యిచ్చాడు. మీకు యింగ్లీష్ రాదనీ, లా రాదనీ, యెవడో దుర్బోధ చేశాడు.

**నాయడు**: స్మాలెట్ దొరగార్ని మెప్పించిన ముండా కొడుకుని నాకు లా రాకపోతే యీ గుంట వెధవలకుటోయ్ లా వస్తుంది. పాస్ పీసని రెండు యింగ్లీషు ముక్కలు మాట్లాడడంతోటే సరా యేమిటి? అందులో మన డిప్టీ కలక్టరు గారికి యింగ్లీషు వకీలంటే కోపం. అందులో బ్రాహ్మడంటే మరీని. ఆ మాట అందరికి బోధపర్చండి.

**రామ** : మరి కార్యం లేదండి. నే యెంతో దూరం చెప్పాను; తిక్కముండాకొడుకు విన్నాడు కాడు.

**నాయడు**: అయితే నన్నిలాగు అమర్యాద చేస్తారూ? యీ బ్రాహ్మడి యోగ్యత యిప్పుడే కలక్టరుగారి బసకు వెళ్లి మనవి చేస్తాను.

(తెరదించవలెను)

★★★

## ౪వ స్థలము : లుబ్ధావధాన్లు బస

**లుబ్ధా** :(ప్రవేశించి) ఏమి దురవస్థ వచ్చిందీ! నా అంత దురదృష్టవంతుడు లోకంలో యవడూ లేడు. యేల్నాడి శని రాగానే కాశీకి బయల్దేరి పోవలసింది. బుద్ధి తక్కువ పని చేశాను. యిలా రాసివుండగా యెలా తప్పుతుంది. సౌజన్యరావు పంతులు దేవుఁడు. ఆయనలాంటి వాళ్లు వుండబట్టే వర్షాలు కురుస్తున్నాయి. ఆయన శలవిచ్చినట్టు తప్పంతా నా యందు ఉంచుకొని విధిని నిందించడవెఁందుకు? ఇంత డబ్బుండిన్నీ, డబ్బుకి లోభపడి ఒక్కగా నొక్క కూతుర్ని ముసలివాడికి అమ్మేను. నా జీవానికి ఉసురుమంటూ అది కానితిరుగులు తిరిగిందంటే దాని తప్పా? బుద్ధితక్కువ వెధవని, ముసలితనంలో నాకు పెళ్లేం? దొంగముండా కొడుకని తెలిసిన్నీ ఆ రావఁప్పంతుల్ని నేన్నమ్మడవేఁవి? ఆ మాయగుంట పారిపోవడవేఁవి? కంటెకి, ఆ అల్లరేమి? ఆ యినసిపికటరు కూనీ చేశావని మమ్మల్ని సలపెట్టడవేవిఁటి? అంతా ఘోరకలి; కలి నిండిపోతూంది. ఒక్క సౌజన్యారావు పంతులు సత్యసంధుడు నాకు కనపడుతున్నాడు. కడవంతా వకీళ్లూ, పోలీసులూ, పచ్చిప దొంగలు – ఆయన చక్రం అడ్డువేసి, మమ్మల్ని యీ ఆపదలోంచి తప్పించారంటే కాసీవాసం పోతాం–యేమి చిత్రాలు! వెధవలకి మఠం కట్టారట! యన్నడూ వినలేదు. అమ్మిని వెళ్లి ఆ మఠం చూడమంటాను. దానికి యిష్టం కలిగిందా, దానికి కావలిసిన డబ్బు యిస్తాను. ఆ మఠంలో వుంటుంది. లేకుంటే నాతోపాటు కాసీవాసం.

(రామప్పంతులు ప్రవేశించును)

**లుబ్ధా** : కంటె, గింటె అని నాతో మీరు ప్రశంసించి కార్యం లేదు.

**రామ** : ఆ కంటె మాట ప్రశంసించడానికి రాలేదు మావాఁ. ఆ కంటె మధురవాణిది, మీరె ర గరా? అదీ, మీరూ యేం జేసుకుంటారో నాకేం కావాలి? కంటె సిగ కోసిరి గాని, మీకు ఓ గొప్ప సాయం చెయ్యడానికి వొచ్చాను. మీ అవస్థ చూస్తే నా గుండె నీరైపోతూంది.

**లుబ్ధా** : మహాప్రభో! నీకు పదివేల నమస్కారాలు. యిక, యీ పకీరు వెధవని వదిలెయ్యి.

"రామనామ తారకం।
భక్తిముక్తిదాయకం। జానకీమ" –

**రామ** : రామ! రామ! యంతమాట అంటివయ్యా! మీరు ఆపదలో వుండి విరక్తి చేత యేమి మాటలన్నా అవి పడి, పని చెయ్యడం నాకు విధి. చెప్పేమాట చెవిని బెట్టండి. ముందూ వెనకా చూడడానికి యిహ టైము లేదు. వ్యవహారం అంతా సూక్ష్మంగా పొక్తు పరుచుకు వొచ్చాను. రెండు సంచులతో, కూనీకేసంతా మంచు విడిపోయినట్టు

విడిపోతుంది. ఒక్క యినస్పెక్టరుతో కుదరలేదు. డిప్టీ కలక్టరికి కూడా చెయ్యి తడి చెయ్యాలి– మీ దగ్గిర యిప్పుడు సొమ్ము లేదంటిరా, ఒక చోట వ్యవహారం కూడా పొక్తుపర్చాను. ప్రాంసరీ నోటు మీద యెన్ని రూపాయలు కావలిస్తే అన్ని రూపాయ లిస్తారు.

**లుబ్ధా** : నేను వక దమ్మిడీ యివ్వను. "రామనామ తారకం, భక్తిముక్తిదాయకం, జానకీ మనోహరం, సర్వలోక నాయకం."

**రామ** : నా మాట విను. యంతో ప్రయాసం మీద యీ ఘట్టం కుదిర్చాను. తాసీల్దారు మీ దగ్గిర లంచం పుచ్చుకుని కూనీ కేసు కామాపు చేశాడని, యినస్పెకటరు డిప్టీ కలక్టరికి గట్టిగా బోధపర్చాడు. కలక్టరు సలహా మీద యినస్పెక్టరు చాలా పట్టుదలగా పనిచేసి, సాక్ష్యం అంతా రడీ చేశాడు. కేసు రుజువైనట్టాయనా యావొఁతుందో ఆలోచించు కోండి.

**లుబ్ధా** : నీ కెందుకు నా యేడుపు?

**రామ** : డిప్టీ కలక్టరు బ్రహ్మద్వేషి – తాసిల్దారు తాడు ముందు తెగుతుంది. తరువాత మిమ్మల్నీ, మీనాక్షినీ కమ్మెంటు కట్టేస్తాడు – వురిసిద్ధం. నాకూ యినస్పెక్టరికీ వుండే స్నేహం చేత యీ ఘట్టానికి వొప్పించాను. గనక నా మాటకి చెవొగ్గి యీ ఆపద తప్పించుకోండి.

**లుబ్ధా** : నన్ను బాధపెట్టక నీ మానాన్న నువ్వుపోదూ. "రామనామతారకం। భక్తిముక్తిదాయకం.॥

**రామ** : నీ అంత కర్కోటకుణ్ణి యక్కడా నేను చూడలేదు. నీ మాటకేం పెద్ద వాడివి – పసిపిల్ల, కడుపున కన్న మీనాక్షికి వురి సిద్ధం అయితే, ముండా డబ్బుకి ముందూ వెనకా చూస్తావు! తలుచుకుంటే నా హృదయం కరిగిపోతూంది.

(సౌజన్యారావు పంతులు ప్రవేశించును.)

**రామ** : తమరు ధర్మ స్వరూపులు. లుబ్ధావధాన్లు గారి యందు అకారణమైన దయచేత యీ కేసులో పని చేస్తున్నారు. కేసంతా వట్టి అన్యాయమండి. ఒక్క పిసరైనా నిజం లేదు. శలవైతే గట్టి డిఫెన్సు సాక్ష్యం –

**సౌజన్యా** :నీ సంగతి నాకు తెలుసును. అవతలకి నడువు.

**రామ** : తమరు యోగ్యులూ, గొప్పవారూ అయినా, ఏక వచన ప్రయోగం –

**సౌజన్య**: నడువు!

(రామప్పంతులు నిష్క్రమించును)

**సౌజన్య** : ఈ దౌల్బాజీని తిరిగీ యెందుకు రానిచ్చారురూ?

**లుబ్ధా** : పొమ్మంటే పోడు బాబూ.

**సౌజన్య**: యే వొచ్చాడు?

**లుబ్ధా** : యినస్పికటరికీ డిప్టీ కలకటరికీ లంచం యిమ్మంటాడు.

**సౌజన్య** : డిప్టీ కలక్టరు గారు లంచం పుచ్చుకోరు. ఆయన నాకు స్నేహితులు; నాకు తెలుసును. లంచాలూ పంచాలూ మీరు యిచ్చినట్టయితే, మీ కేసులో నేను పని చెయ్యను.

**లుబ్ధా** : తమశలవు తప్పి నడుస్తే చెప్పుచ్చుకు కొట్టండి. నాకు భగవంతుడిలాగ తమరు దొరికారు. "పాలను ముంచినామీరే, నీళ్లను ముంచినా మీరే" అని మిమ్మల్నే నమ్మి ఉన్నాను.

**సౌజన్య** :మీరు నేరం చేయలేదని నాకు పూర్తి అయిన నమ్మకం వుంది. నిజం కనుక్కోడానికి చాలా ప్రయత్నం చేస్తున్నాను గాని ఆ గుంటూరి శాస్తుల్లు యవడో భేదించ లేకుండా వున్నాను. మీరు జ్ఞాపకం మీద చెప్పిన చహరా గుంటూరు వ్రాసి పంపించాను. అక్కడ అలాంటి మనిషి యవడూ లేడని జవాబు వొచ్చింది.

**లుబ్ధా** : అదేం మాయో బాబూ! మీ సాయం వల్ల యీ గండం గడిచి, నా పిల్లా నేనూ యీ ఆపదలోంచి తేలితే, నా డబ్బంతా, మీ పాదాల దగ్గిర దాఖలు చేసి కాసీ పోతాను.

**సౌజన్య**: మీ డబ్బు నాకక్కరలేదని మీతో మొదటే చెప్పాను. నే చెప్పిన మాటలు మీకు నచ్చి, ముసలివాళ్లు పెళ్లాడకూడదనీ, కన్యాశుల్కం తప్పనీ, యిప్పటికైనా మీకు నమ్మకం కలిగితే, యిలాంటి దురాచారాలు మాన్పడానికి రాజమహేంద్రవరంలో వక సభ వుంది. ఆ సభకి కొంచవోఁ గొప్పో మీకు తోచిన డబ్బు యివ్వండి. వితంతువుల మఠానికి మీ పిల్లని పంపడం నా సలహా.

**లుబ్ధా** : తమ చిత్తం, తమ శలవు. చేసిన తప్పులు, తప్పులని శల్యాల్ని పట్టిపోయింది. బుద్ధివొచ్చింది బాబూ.

**సౌజన్య**: ఆ గుంటూరు శాస్తుల్లుకి పరవఁట దేశపు యాస వుండేదా? బాగా జ్ఞాపకం చేసుకు చెప్పండీ.

**లుబ్ధా** : (ఆలోచించి) లేదండి.

**సౌజన్య**: బాగా జ్ఞాపకం తెచ్చుకోండీ.

**లుబ్ధా** : లేదండి.

(తెర దించవలెను)

## ౫వ స్థలము : విశాఖపట్టణంలో

(మధురవాణి యింటి యదటివీధి కొసను కరకటశాస్త్రి, శిష్యుడూ ప్రవేశింతురు)

**కరట** : నువ్వు ఆ కంటె వాళ్ల నెత్తిని కొట్టకుండా లేచి రావడం నుంచి, యీ ముప్పంతా వొచ్చినట్టు కనపడుతుంది.

**శిష్యుడు** :మధురవాణి కంటె మధురవాణికి యివ్వడం తప్పా అండి?

**కరట** : తప్పు కాదా? నువ్వు యిచ్చావని, మరి అది వొప్పుకుందా? "తే, ధగిడీకే కంటె తెస్తావా, చస్తావా?" అని రామప్పంతుల్ని పీకి పిండెట్టింది. దాని బాధపడలేక, ఆ రావఁప్పంతులు కూనీ కేసని యెత్తు యెత్తాడు. ఆ ముసలాడికి సిక్ష అయిపోయిందంటే, బ్రహ్మహత్య నా మెడకి చుట్టుకుంటుంది. నువ్వు అంటూ ఆ కంటే వాళ్ల యింట వొదిలేస్తే, నాకు ఈ చిక్కు లేకపోవును గదా?

**శిష్యుడు** : వెధవముండ గూబగదలేస్తూంటే, కంటె గింటె యవడికి జ్ఞాపకం వొస్తుందండి? చేయి కరిచి, పెట్టె తీసి, మెహురు అంకించుకుని, చెంగున గోడ గెంతాను. పజ్యండువొందలు మీరు పత్రాగా, నాకు పెళ్లిలో పెట్టినకంటె నేను తెచ్చాననా, తప్పు పట్టుతున్నారు? ఆ కంటె అయినా దక్కిందా? చూస్తూనే మధురవాణి లాక్కుంది.

**కరట** : నేను హాస్యగాణ్ణే గాని, యీ కూనీ గడబిడతో నా హాస్యం అంతా అణిగిపోయింది. గనక యిక హాస్యంమాను – నేను తీసుకున్న రూపాయలు, లుబ్ధావధాన్లుకి యప్పటికైనా పంపించడానికే తలచాను! అంతే గాని అపహరిద్దామని అనుకోలేదు – మధురవాణిని యలాగైనా లయజేసి, కంటె యరువు పుచ్చుకుని, ఆ కంటా, యీ రూపాయలూ, బంగీకట్టి అవుధాన్లుకి పంపించేస్తే, కూనీ నిజం కాదని పోల్చుకుంటారు. నాకు ఈ బ్రహ్మహత్య తప్పిపోతుంది.

**శిష్యుడు**: మీ నేస్తులు సౌజన్యారావు పంతులు గారితో నిజం చెప్పెయ్యరాదా అండి?

**కరట** : వెట్టి కుదిరింది, రోకలి తలకి చుట్టమనన్నాట్ట! వెనకటికి యవరో పోలీసు, తల్లి కూరగాయలు పుచ్చుకుంటే జుల్మానా వేశాట్ట; సౌజన్యారావు పంతులు అలాటి వాడు. ఆయనతో మనం వున్నమాట చెప్పావఁంటే ఆయన నిజం కోర్టులో చెప్పేస్తాడు. ఆపైని లుబ్ధావధాన్లు పీక వురి, మన పీకకి తగులుకుంటుంది.

**శిష్యుడు** : 'మన' అంటున్నారేవిఁటి?

**కరట** : మాట పొరపాటురా. రావఁప్పంతులు వూరికి వెళ్లిన మాట నిజవేఁనా?

**శిష్యుడు** : నిజవేఁ –

**కరట** : వాడి కంట పడ్డావంటే -

**శిష్యుడు** : పడితే?

**కరట** : మరేం లేదు. మధురవాణి కంటె మనకి యెరువు యివ్వడానికి వొప్పుకుంటే, ఆంజనేయస్వామికి పదిశేర్లు నెయ్యి దీపారాధన చేస్తాను.

**శిష్యుడు** : కడుపులోకి వెళ్లవలసిన నెయ్యి కాల్చెయ్యడం నాకేవీఁ యిష్టం లేదు. అమృతగుండీ మొక్కుకొండి.

**కరట** : హాస్యం చాలించు! బెడిసిగొడుతుంది.

(నిష్క్రమింతురు)

★★★

## ౭వ స్థలము. మధురవాణి బసలో గది

(మధురవాణి కుర్చీమీద కూచుని యుండును. కరటక శాస్త్రుల్లు, శిష్యుడూ ప్రవేశింతురు. మధురవాణి నిలబడును).

**మధు** : గురువుగారికి పదివేల దండాలు; శిష్యుడి కొక చిన్న ముద్దు (శిష్యుని ముద్దు బెట్టుకొనును)

**కరట** : నీ పుణ్యం వుంటుంది. నా అల్లుణ్ణి చెడగొట్టకు.

**మధు** : అల్లుడెవరు?

**కరట** : మా పిల్లని యితగాడికి యిచ్చి, కన్యాదానం చేస్తాను.

**మధు** : జెయిలు నుంచి వొచ్చిన తరువాత పెళ్లా? లేక, పెళ్లి చేసుకుని, మరీ మఠ ప్రవేశవా?

**శిష్యుడు** : జయిలేవిఁటండోయి?

**కరట** : వొట్టినే హాస్యానికంటూంది.

**మధు** : పాపం ఆ పసిపిల్లవాడికి వున్న నిజస్థితి చెప్పండి. తన వాళ్లని వెళ్లి చూసైనా వస్తాడు.

**శిష్యుడు** :(కరటకశాస్త్రితో) కొంపముంచారో?

**మధు** : ముంచడం అంటే ఆలాగా యిలాగానా?

**కరట** : నీ పుణ్యవుంటుంది. హాస్యం చాలించు. లేకపోతే కుఱ్ఱవాళ్లకి పెద్దలయందు భక్తి చెడుతుంది.

**శిష్యుడు** :నేనేం తప్పుచేశాను? గురువు గారు చెప్పిన పని చేశాను. ఆ తప్పూ, వొప్పూ ఆయనందే.

**మధు** : యవరేమి చేసితిరో, నాకు తెలియదు గాని, మీ యిద్దరి కోసం హెడ్ కనిష్టీబు గాలిస్తున్నాడు. దొరకగానే మఠం ప్రవేశం చేస్తాడట. యీ మాట మట్టుకు నాకు రూఢిగా తెలుసును.

**శిష్య** : యిదేనా మీరునాకు చేస్తానన్న పెళ్లి?

**కరట** : యేమైనా జట్టీ వస్తే, నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డు వెయ్యనట్రా?

**మధు** : వొస్తే జట్టీ గురుశిష్యులకు యిద్దరికీ వొక్క మారే వస్తుంది గాని, ఒకరికి రావడం ఒకరు అడ్డు పడటం అన్న మాట వుండబోదు. యెప్పుడైనా మీ యిద్దరి ప్రాణాలకీ నేను కనికరించి, అడ్డుపడాలి కాని, మరి యవడికీ సాధ్యం కాదనుకుంటాను.

**శిష్య** : మా గురువుగారి మాటకేం; ఆయన పెద్దవారు; యేవొఁచ్చినా సర్దుకోగలరు. నేను పాపం పుణ్యం యెరగని పసిపిల్లవాణ్ణి. నా ప్రాణానికి నీ ప్రాణం అడ్డువేశావంటే, కీర్తి వుండిపోతుంది.

**మధు** : నీ గురువుని వొదిలేసి నా దగ్గిర శిష్యరికం చేస్తావా?

**శిష్య** :యిదిగో–యీ నిమిషం వొదిలేస్తాను( బుగ్గలు గాలితో పూరించి పిడికిళ్లతో తట్టి గురువుతో) మీ నేస్తం యీవేళతో సరి. మరి ఆడవేషం యీ జన్మంలో వెయ్యను.

**మధు** : నాటకంలో కూడా వెయ్యవా?

**శిష్య** : మరి నాటకం గీటకం నాకొద్దు.

**మధు** : నా దగ్గిర శిష్యరికం అంటే యేవేఁం జెయ్యాలో తెలుసునా?

**శిష్య** : నీళ్లు తోడుతాను, వంట చేస్తాను. బట్టలు వుతుకుతాను. గాని బ్రాహ్మణ్ణి గదా, కాళ్ళు పట్టమనవు గద?

**మధు** : (విరగబడి నవ్వి) యిదా నీ గురువు దగ్గిర చేసే శిష్యరికం?

**శిష్య** : మరిచిపోయినాను. చిదప్పొక్కులు కూడా గోకుతాను.

**మధు** : (నవ్వి) పెంకా?

**శిష్య** : యే నౌఖరీ చెయ్యమంటే ఆ నౌఖరీ చేస్తాను.

**మధు** : నన్ను ముద్దెట్టుకొమ్మన్నప్పుడల్లా ముద్దెట్టుకోవాలి.

**శిష్య** : ముద్దెట్టుకుంటాను.

**కరట** : వాడు కుఱ్ఱవాడు – వాణ్ణెందుకు చెడగొడతావు? ఆ శిష్యరికం యేదో వాడి తరఫునా, నా తరఫునా కూడా నేనే చేస్తాను. చాతనైతే చక్రం అడ్డెయి.

**మధు** : "గురువూ శిష్యుడాయె, శిష్యుడూ గురువాయె."

మీరు శిష్యులు కావాలంటే యిస్కూలు జీతం యిచ్చుకోవాలి.

**కరట** : పిల్లికి చలగాటం, యలక్కి ప్రాణపోకటా!

**మధు** : మీరా యలక?

**కరట** : అవును.

**మధు** : మీరు యలక కారు, పందికొక్కులు. మీ శిష్యుడు యలక.

**కరట** : పోనీ – వాణ్ణయినా కాపాడు.

**మధు** : అదే ఆలోచిస్తున్నాను.

**కరట** : బుద్ధీ, బుద్ధీ కలిస్తే రాపాడుతుంది. నీ ఆలోచన యేదో కొంచం చెబితివట్టాయనా నా ఆలోచన కూడా చెబుతాను. కలబోసుకుందాం.

**మధు** : మీ ఆలోచన ముందు చెప్పండి.

**కరట** : మరేమీ లేదు. నే పుచ్చుకున్న పజ్యెండువొందల రూపాయల నోట్లూ, ఆ కంటా, పోస్టు ద్వారా బీమా చేసి గుంటూరు శాస్తుల్లు పేరట, లుబ్ధావధాన్లుకి పంపిస్తాను. దాంతోటి కూనీ కేసు నిజం కాదని సౌజన్యారావు పంతులు గారు పోల్చుకుంటారు. ఆపైని దైవాధీనం!

**మధు** : మీకు కంటె యలా వొస్తుంది?

**కరట** : నువ్వు అనుగ్రహిస్తేను.

**మధు** : (ముక్కు మీద వేలువుంచుకొని) చిత్రం! బ్రాహ్మలు యంతకైనా తగుదురు.

**కరట** : యేవిఁ అలా అంటున్నావు?

**మధు** : నా కంటె తిరిగీ నేను కళ్ల చూడడం యెలాగ?

**కరట** : సౌజన్యారావు పంతులుగారు నీ వస్తువ నీకు యిచ్చేస్తారు. ఆయన బహు న్యాయమైన మనిషి.

**మధు** : అంత మంచివాడా?

**కరట** : అందుకు సందేహవేఁమిటి?

**మధు** : యెంత మంచివాడు?

**కరట** : అంత మంచిమనిషి మరి లోకంలో లేడు.

**మధు** : ఆయన్ని నాకు చూడాలనుంది. తీసి కెళ్తారా?

**కరట** : నా ఆబోరుంటుందా? ఆయన సానివాళ్లని చూడరు.

**మధు** : ఆంటీ నాచ్చి కాబోలు?

**కరట** : యింగిలీషు చదువుకున్న వాళ్లకి కొందరికి పట్టుకుంది యీ చాదస్తం! అయినా అందులోనూ దేశ కాలాలను బట్టి, రకరకాలు లేకపోవడం లేదు.

**మధు** : సౌజన్యారావు పంతులు గారిది యే రకం? గిరీశం గారిది యే రకం?

**కరట** : యేమి సాపత్యం తెచ్చావు? కుక్కకి గంగి గోవుకూ యెంతవారో, వాడికీ ఆయనకు అంతవార. సౌజన్యారావు పంతులుగారు కర్మణా, మనసా, వాచా, యాంటీనాచి. "వేశ్య" అనే మాట, యేమరి ఆయనయదట పలికితివట్టాయనా, "అసందర్భం" అంటారు. ఆయనలాంటి అచ్చాణీలు అరుదు. మిగిలినవారు యధాశక్తి యాంటీ నాచులు. ఫౌఁజు ఫౌజంతా, మాటల్లో మహావీరులే. అందులో గిరీశం అగ్రగణ్యుడు. కొందరు బంట్లు పొగలు యాంటీనాచి, రాత్రి ప్రోనాచి; కొందరు వున్న వూళ్లో యాంటీనాచి, పరాయివూళ్లో ప్రోనాచి; కొందరు శరీరదార్ఢ్యం వున్నంతకాలం ప్రోనాచి, శరీరం చెడ్డ తరువాత యాంటీనాచి; కొందరు బతికివున్నంత కాలం ప్రోనాచి, చచ్చిపోయినతరవాత యాంటీనాచి; కొందరు అదృష్టవంతులు చచ్చిన తరవాత కూడా ప్రోనాచే. అనగా యజ్ఞం చేసి పరలోకంలో భోగాలికి టిక్కట్లు కొనుక్కుం టారు. నాబోటి అల్ప ప్రజ్ఞ కలవాళ్లు, లభ్యం కానప్పుడల్లా యాంటీనాచె.

**మధు** : మీ యోగ్యత చెప్పేదేవిఁటి! గాని, హెడ్డు గారి మాటలు చూస్తే, సౌజన్యారావు పంతులు గారు లుబ్ధావధాన్లుగారిని కాపాడడానికి, విశ్వప్రయత్నం చేస్తూ వున్నట్టు కనపబడుతుంది. యేమి కారణమో?

**కరట** : చాపలు యీదడానికి, పిట్టలు యెగరడానికి, యేం కారణమో అదే కారణం.

**మధు** : పరోపకారం ఆయనకు సహజగుణమనా?

**కరట** : కాకేవిఁ?

**మధు** : మీరెందుకు, కొంచెం ఆ యీదడం, యెగరడం నేర్చుకోకూడదు?

**కరట** : నీ మాట అర్థం కాలేదు.

**మధు** : ఈ కేసులో నిజవేఁదో సౌజన్యారావు పంతులు గారితో చెప్పి మీరు కూడా – కొంచం లోకోపకారం చెయ్యరాదా?

**కరట** : మా మంచి సలహా చెప్పావు! తనకు మాలిన ధర్మమా? "స్వయంతీర్ణః పరాంస్తారయతి" అన్నాడు. నిజం చెబితే పంతులు యేవంటాడో నీకు తెలుసునా? శాస్తుల్లు గారూ మీరు నేరం చేశారు, నేనేఁమి చెయ్యగలను? మిమ్మును గురించి నాకు చాలా విచారంగా వున్నది" అని వగుస్తూ, పోలీసువాళ్లతో చెప్పి, జైయిలులోకి వప్ప చెప్తాడు. జైయిలు నుంచి తిరిగీ వచ్చిందాకా మాత్రం నెలకో పాతికో, పరకో కనికరించి నా భార్యాకు యిస్తూ వుంటాడు. అలాంటి ప్రమాదం లేకుండా కార్యసాను కూలం కావఁడంకోసమే యీ యెత్తు యెత్తాను.

**మధు** : సరే, సౌజన్యారావు పంతులుగారు మంచివారు గనక ఆయనదాకా వస్తే నా కంటె నాకు యిప్పించేస్తారు. గాని, లుబ్ధావధాన్లు ఆ రూపాయలూ, కంటా, పెట్లో పెట్టుకుని ముంగిలా మాట్లాడకుండా వూరుకుంటేనో?

**కరట** : దాని ఖరీదు నేనిచ్చుకుంటాను.

**మధు** : తమరు ఒకవేళ మఠంలో ప్రవేశిస్తే మరి నాకు కంటె ఖరీదు యిచ్చేవారెవరు? అందుచేత ఆ కంటె నాకు తిరిగీ వచ్చేవరకూ మీ శిష్యుణ్ణి నా దగ్గిర తాకట్టు వుంచండి.

**కరట** : అలాగనే.

**శిష్యు** : మీ సొమ్మేంబోయింది. నా పెళ్లో?

**కరట** : నాలికా? తాటిపట్టెరా?

**శిష్యు** : మీరో వేళ – జయిల్లోకి వెళితే –

**మధు** : గురువుకు తగిన శిష్యుడివౌదువు!

**కరట** : అంత ఉపద్రం వొస్తే, నీ పెళ్లి మాట నా పెళ్లాంతో యరేంజిమెంటు చేసి మరీ వెళతాను.

**శిష్యు** : యేమో! ఘోరవైఁన ప్రమాణం చేశారు గదా?

**కరట** : మధురవాణీ, కొంచెం శ్రమచేసి కంటెతేవా?

**మధు** : యేవొఁచ్చిందీ తొందర?

**కరట** : హెడ్డు గాని, రామప్పంతులు గాని, వొచ్చాడంటే, నా కొంప ములుగుతుంది.

**మధు** : ములిగితే తేలుస్తాను.

**కరట** : అంత చాకచక్యం నీకు లేదని కాదు.

(మధురవాణి లోనికి వెళ్లును)

**కరట** : అది చెప్పిందల్లా చెయ్యక, కొంచంపై ఒచ్చేది కాని, మరీ నడుస్తూవుండు, యేవైఁనా వుంటే, నా చెవిని పడేస్తూండు.

**శిష్యు** : యవరిదగ్గిర వున్నప్పుడు వారు చెప్పిందల్లా చెయ్యడవేఁ, నా నిర్ణయం. మీరు యేంపైకాని, నా చేత ఆడవేషం వేయించి పెళ్లి చేశారో?

**కరట** : ప్రమాదోధీమతామపి. యంతటివాడికైనా ఒకప్పుడు కాలుజారుతుందిరా.

(మధురవాణి కంటె పట్టుకు ప్రవేశించి)

**మధు** : తాకట్టు వస్తువ తప్పించుకు పారిపోతేనో? కుక్కా? నక్కా, కాదు గదా గొలుసులు వేసి కట్టడానికి?

**కరట** : నీ వలల్లో పడ్డ ప్రాణి మరి తప్పించుపోవడం యలాగ? వాటికి వున్న పటుత్వం యేవుక్కు గొలుసులకూ వుండదు.

**మధు** : వలలో ముత్యపు చిప్పలు పడితే లాభం గాని, నత్తగుల్లలు పడితే మోతచేటు.

**కరట** : యంతసేపూ డబ్బు, డబ్బేనా? స్నేహం, వలపూ, అనేవి వుంటాయా?

**మధు** : స్నేహం మీలాటి వారిచోట; అందుచేతనే, కష్టపడి ఆర్జించిన కంటె మీపాలు చేస్తున్నాను. మా తల్లి చూస్తే భవిష్యం వుంచునా? యిక వలపో? బతుకనేది వుంటే, వలపు వన్నె తెస్తుంది. అంగడి వాడికి మిఠాయి మీద ఆశా, సాని దానికి వలపూ, మనస్సులోనే మణగాలి; కొద్ది కాలం వుండే యవ్వనాన్ని జీవనాధారంగా చేసుకున్న మా కులానికి వలపు ఒక్కచోటే.

**కరట** : యక్కడో?

**మధు** : బంగారం మీద. శృంగారం వన్నె చెడిన దగ్గిర నుంచీ, బంగారం గదా తేటు తేవాలి? ఆ బంగారం మీకు ధారపోస్తూ వున్నప్పుడు నా స్నేహం యెన్ననేల?

**కరట** : నీ స్నేహం చెప్పేదేవిఁటి? గాని నీ యౌవ్వనం, నీ శృంగారం దేవతా స్త్రీలకు వలె శాశ్వతంగా వుంటాయి.

**మధు** : మా తల్లి ధర్మవాఁ అని, ఆమె నా చెవిలో గూడు కట్టుకుని బుద్ధులు చెప్పబట్టి గాని, లేకుంటే మీలాంటి విద్వాంసుల యిచ్చకాలకి మైమరచి, యీపాటి వూళ్లో సానులవలె చెడివుండనా?

**కరట** : మీ తల్లి అనగా యెంత బుద్ధివంతురాలు! దాని తరిఫీదు చేతనే నువ్వు విద్యా సౌందర్యాలు రెండూ దోహదం చేసి పెంచుతున్నావు?

**మధు** : అంతకన్న కాపు మనిషినై పుట్టి, మొగుడి పొలంలో వంగ మొక్కలకూ, మిరప మొక్కలకూ దోహదం చేస్తే, యావజ్జీవం కాపాడే తనవాళ్లన్న వాళ్లు వుందురేమో?

**కరట** : యేమి చిన్నమాట అన్నావు! మధురవాణి అంటూ ఒక వేశ్యా శిఖామణి యీ కళింగరాజ్యంలో వుండక పోతే, భగవంతుడి సృష్టికి యంతలోపం, వచ్చి వుండును?

**మధు** : సృష్టికి లోపం వచ్చినా రాకపోయినా, యిప్పటి చిక్కులలో మీకు మట్టుకు కించిత్ లోపం వచ్చి వుండును.

**కరట** : మమ్మల్ని తేల్చుడానికి నీ ఆలోచన యేదో కొంచం చెప్పావు కావు గదా?

**మధు** : నన్ను సౌజన్యారావు పంతులుగారి దగ్గిరకు తీసుకువెళ్లడానికి వొప్పారు కారు గదా?

**కరట** : ఆయన నిన్నూ, నన్నూ యింట్లోంచి కఱ్ఱ పుచ్చుకు తరుముతారు.

**మధు** : కోపిష్టా?

**కరట** : ఆయనకి కోపవఁన్న మాటే లేదు.

**మధు** : ఐతే భయమేల?

**కరట** : చెడ్డవారి వల్ల చెప్పుదెబ్బలు తినవచ్చును గాని, మంచివారివల్ల మాట కాయడం కష్టం.

**మధు** : కొత్త సంగతి వకటి యీ నాటికి నాకు తెలిసింది. సృష్టికల్లా వన్నె తెచ్చిన మధురవాణి అనే వేశ్యా శిఖామణి గిరీశంగారి వంటి కుక్కల పొత్తుకే తగి వున్నది గాని, సౌజన్యారావు పంతులు గారి వంటి సత్పురుషులను చూడడమునకైనా అర్హత కలిగి వుండలేదు. గిరీశంగారు దాని యింట అడుగు బెట్టగానే, మీ చెల్లెలు గారియింట, అడుగు పెట్టడానికి ఆయనకు యోగ్యత తప్పిందని మీ నిర్ణయం. తమలాంటి పండితోత్తములు మాత్రం కార్యావసరం కలిగినప్పుడు వూరూవాడా వెతికి, మధురవాణి దగ్గర లాచారీ పడవచ్చును. అయితే డిప్టీ కలక్టరూ కుక్కేనా?

**కరట** : లంచం తినడు గాని, ఆయనకు స్త్రీవ్యసనం కద్దు. పెద్ద ఉద్యోగస్థుడు గనక, సీమకుక్క అని అందాం. ఆయన్ని గానీ వలలోవేశావా యేవిఁటి?

**మధు** : వేస్తే?

**కరట** : బతికానన్న మాట! ఆయన సాయం వుంటే, కేసు మంచులా విడిపోతుంది. తెలిసింది. యిదా నువు చేసిన ఆలోచన? యెంత గొప్పదానివి!

**మధు** : ఆయన నాయుడు చేత రాయబారాలు పంపుతున్నారు.

**కరట** : వెళ్లు, వెళ్లు, వెళ్లు, వెళ్లు, యింకా ఆలోచిస్తావేవింటి? నీ అదృష్టం నా అదృష్టం యేవంని చెప్పను?

**మధు** : వెళ్లతలచుకోలేదు.

**కరట** : చంపిపోతివే! ఆయన ఒక్కడే మమ్మల్ని కాపాడగలిగినవాడు.

**మధు** : యిటుపైని వూరకుక్కలనూ, సీమకుక్కలనూ దూరంగా వుంచడానికి ఆలోచిస్తున్నాను.

**కరట** : ఆయనని హాస్యానికి సీమకుక్క అని అన్నాను గాని, యెంత రసికుడనుకున్నావు? చేతికి యెమిక లేదే! హెడ్డు కనిష్టీబుపాటి చేశాడు కాడా?

**మధు** : పట్నం వొదిలి పల్లెటూరు రాగానే, మీ దృష్టిలో, పలచనైతినో? హెడ్డును నౌఖరులా తిప్పుకున్నాను గాని, అధికం లేదే? ఆ నాలుగురోజులూ, సర్కారు కొలువు మాని అతడు నా కొలువు చేశాడు. అతడి సాయం లేకపోతే, మీరు ఆ వూరి పొలిమేర దాటుదురా? ఈ దాసరి దాటునా? లోకం అంతా యేమి స్వప్రయోజక పరులూ!

**కరట** : అపరాధం! అపరాధం! కలక్టరుని చూడనంటే, మనస్సు చివుక్కుమని అలా అన్నాను. నువ్వు ఆ గ్రామం గ్రామం సమూలం రాణీలాగ యేలడం నేను యీ కళ్లతో చూడలేదా?

**మధు** : నేను కలక్టరును చూడనంటే, మీ మనస్సు చివుక్కుమనడం యెట్టిది? యేమి చిత్రం! సౌజన్యారావు పంతులుగారు యీ మాట వింటే సంతోషిస్తారు కాబోలు?

**కరట** : పీక వుత్తరిస్తారు.

**మధు** : అదేదో చూస్తాను.

**కరట** : బ్రహ్మహత్య కట్టుకుంటావా యేవింటి?

**మధు** : ఆహా! యేమి బ్రాహ్మలూ! – అయినా పోలిశెట్టి చెప్పినట్టు, యెంత చెడ్డా బ్రాహ్మలు గదా? యిందండి; (కంటె యిచ్చును) తిలోదకాలేనా?

**కరట** : యెంతమాట! పువ్వులలో పెట్టి మళ్లీ రాదా? నీ యెదట అనవలిసిన మాట కాదు, నీలాంటి మనిషి మరిలేదు. కించిత్ తిక్క లేకుంటేనా!

**మధు** : ఆ తిక్కే గదా యిప్పుడు మీకు వుపచరిస్తూంది?

**కరట** : యేం వుపచరించడం? చంపేశావు! ఆ డిప్టీ కలక్టర్ని ఒక్క మాటు చూసి యీ బీద ప్రాణిని కాపాడితే –

**మధు** : చాలించండి. యిక విజయం చెయ్యండి. (వెళ్లిపొమ్మని చేతితో సౌజ్ఞ చేయును. కరటక శాస్త్రుల్లు, శిష్యుడు నిష్క్రమించుచుండగా) శాస్తుల్లు గారూ!

(కరటక శాస్తుల్లు తిరిగీ ప్రవేశించును.)

**మధు** : మీ పిల్లని మహేశానికి యిస్తారా?

**కరట** : యిస్తాను.

**మధు** : అయితే నాకో ఖరారు చేస్తారా?

**కరట** : చేస్తాను.

**మధు** : యిక అతణ్ణి నాటకాలాడించీ, ముండలిళ్లతిప్పీ చెడగొట్టకండి.

**కరట** : యిటుపైని చెడ్డగొట్టను – నాకు మాత్రం అక్ఖర్లేదా? (పొడుం పీల్చి) నీది గురూపదేశం, మధురవాణీ!

**మధు** : బ్రాహ్మలలో ఉపదేశం లావూ, ఆచరణ తక్కువా, ఖరారేనా?

**కరట** : ఖరారే.

**మధు** : బ్రాహ్మలు కాగానే, దేవుఁడికంట్లో బుగ్గిపొయ్య లేరు అనుకుంటాను.

**కరట** : చివాట్లకి దిగావేఁవిటి?

**మధు** : చిత్రగుప్తుడికి లంచం యివ్వగలరా? అతడి దగ్గిరకి మధురవాణిని పంపి, చేసిన పాపాలు అన్నీ తుడుపు పెట్టించడానికి వీలువుండదు కాబోలు?

**కరట** : మధురవాణీ! జరూరు పనివకటుంది. మరిచి పోయినాను – వెళ్లి, రేపు మళ్లీ వస్తాను.

**మధు** : (నవ్వు చేత కుర్చీ మీద విరగబడి, తరవాత నవ్వు సమాళించుకొని) ఒక్క నిమిషం ఆగండి. శిష్యుడా! (శిష్యుడు ప్రవేశించును) యేదీ, నాడు నువ్వు రామచంద్రపురం అగ్రహారంలో, రామప్పంతులు యింటి బైటనూ, నేనూ మీనాక్షమ్మా తలుపు యివతలా అవతలా ఖణాయించి వుండగా, తెల్లవార ఝాముఁన నిశ్శబ్దంలో ఆకాశవాణిలా పాడిన చిలక పాట పాడి నీ మావఁగారికి బుద్ధి చెప్పు. తమ మూలంగా ఒక ముసలి బ్రాహ్మడికి ముప్పు వస్తూ వుంటే తమశరీరం దాచుకుంటున్నారు.

**శిష్యుడు** : (పాడును) యెఱ్ఱని ముక్కుగలది రామచిలుక! దాని....

**మధు** : (బెత్తముతో కొట్టబోయినట్లు నటించి) చెప్పిన పని చెయ్యకపోతే జయిలు సిద్ధం.

**శిష్యు** : ("యెన్నాళ్ళు బ్రతికినా" అను పాట పాడును. రెండు చరణములు పాడిన తరువాత).

**కరట** : అతిజరూరు పని వుంది. మధురవాణీ మరోమాటు వస్తాను (నిష్క్రమించుతూ) తలవాయ గొట్టింది. తెల్లవెంట్రుకలు లావయినాయి – మనసు కొంచెం మళ్లించుకుందాం.

★ ★ ★

## ౭వస్థలము : సౌజన్యరావు పంతులు గారి యింట్లో కచేరీ గది

(సౌజన్యారావు పంతులుగారు, అగ్నిహోత్రావధాన్లు ప్రవేశింతురు)

**సౌజ** : ఇక మిమ్ములను జయించినవాడు లేడు. పిల్లల్ని అమ్ముకోవడం శిష్టాచారం అంటారండీ!

**అగ్ని** : ఆహా, మా మేనత్తల్ని అందరినీ కూడా అమ్మారండి. వాళ్ళంతా పునిస్త్రీ చావే చచ్చారు. మా తండ్రి మేనత్తల్ని కూడా అమ్మడవేఁ జరిగిందష. యిప్పుడు యీ వెధవ యింగిలీషు చదువునుంచి ఆ పకీరువెధవ దాన్ని లేవదీసుకుపోయినాడు గాని, వైధవ్యం అనుభవించిన వాళ్లంతా పూర్వకాలంలో యెంత ప్రతిష్ఠగా బతికారు కారు?

**సౌజ** : పసిపిల్లల్ని కాలం గడిచిన వాళ్లకి పెళ్లి చేస్తే వైధవ్యం రాక తప్పుతుందా? నింపాది చేసి కొంచెం యోచించండీ.

**అగ్ని** : ప్రాలుబ్ధం చాలకపోతే ప్రతివాళ్లకీ వస్తుందండి. చిన్నవాళ్లకిచ్చినా, పెద్దవాళ్లకిచ్చినా, రాసిన రాత యెవడైనా తప్పించగలడా?

**సౌజ** : మీరు చదువుకున్నవారు గదా, ప్రారబ్ధమని పురుష ప్రయత్నం యే వ్యవహారంలో మానేశారు? కేసు, "విధికృతం; యలా వుంటే అలా అవుతుందని" వకీల్ని పెట్టడం మానేశారా? కన్యలని అమ్ముకోవడం శాస్త్ర దూష్యం కాదా? డబ్బుకి లోభించి పిల్లల్ని ముసల వాళ్లకి కట్టబెట్టి విధికృతం అనడం న్యాయవేఁనా? శలవియ్యండి.

**అగ్ని** : యిప్పుడు మీ లౌక్యుల్లో వెయ్యేసి, రెండేసి వేలు, వరకట్నాలు పుచ్చుకుంచున్నారు కారండీ? గిరీశం గారు చెప్పినట్టు – వాడి పిండం పిల్లులికి పెట్టా! – మీలో ఆడపిల్లలికి యిన్ని తులాలు బంగారం పెట్టాలి, యిన్ని తులాలు వెండి బెట్టాలి అని నిర్ణయించు కోవడం లేదా? అది మాత్రం కాదేం కన్యాశుల్కం?

**సౌజ** : అలా చెయ్యడం నేను మంచిదన్నానా యేమిటండీ? "గిరీశం గారు చెప్పినట్టు" అని అన్నారేవిఁటి?

**అగ్ని** : ఆ వెధవ పేరు నాయదట చెప్పకండి.

**సౌజ** : కానీండి గాని – మీ రెండో పిల్లకి తగిన వరుణ్ణి చూసి పెళ్లిచెయ్యండి. యేం సుఖపడు తుందని ముసలివాళ్లకి యివ్వడం? శలవియ్యండీ.

అగ్ని : అదంతా మీకెందుకయ్యా! ఓహో యిందుకా నన్ను పిలిపించారు? మీ గృహకృత్యాల వూసుకి నేవొచ్చానా యేవిఁటి? నా గృహకృత్యాల వూసు మీకెందుకూ?

సౌజ : తొందరపడకండి అవుధాన్లుగారూ, దూరం ఆలోచించండి. మీ కడుపున బుట్టిన పిల్ల యొక్క సౌఖ్యం ఆలోచించి సలహా చెప్పాను గాని, నా స్వలాభం ఆలోచించి చెప్ప లేదు గదా – పెద్దపిల్లకి సంభవించిన అవస్థ మీ కళ్లతో చూడనే చూశారు. యికనైనా వృద్ధులకు పిల్లని కట్టబెట్టడుపు ప్రయత్నము చాలించండి.

అగ్ని : నా పిల్లభారం అంతా మీదైనట్టు మాట్లాడుతున్నారేమిటి? ఆ సంత మీకెందుకూ?

సౌజ : నన్ను తమ స్నేహవర్గంలో చేర్చుకోండి– పరాయివాణ్ణిగా భావించకండి – దయచేసి నా సలహా వినండి – మర్యాదగల యింట పుట్టిన బుద్ధివంతుడగు కుఱ్ఱవాణ్ణి చూసి, మీ చిన్నపిల్లని పెళ్లిచెయ్యండి. యిక పెద్ద పిల్ల మాట–ఆమెకు వితంతువుల మఠంలో, సంఘ సంస్కార సభవారు విద్యాబుద్ధులు చెప్పించుతారు. మీ కడుపున పుట్టినందుకు యెక్కడనయినా ఆమె సుఖంగా వుండడం గదా తండ్రైనవారు కోరవలసినది. ఆమె తాలూకు కొంత ఆస్తి తమ వద్ద వున్నది. మా స్నేహితులున్నూ, స్త్రీ పునర్వివాహ సభ కార్యాధ్యక్షులున్నూ అయిన రామయ్య పంతులుగారు నా పేర వ్రాసినారు. ఆ ఆస్తి, చిక్కులు పెట్టక, తాము ఆ పిల్లకి పంపించి వెయ్యడం మంచిది.

అగ్ని : యేవిఁటీ ముండా యేడుపుసంత! వాడెవడు? వీడెవడు? మీరెవరు? అదెవర్తె? నా పిల్లేవిఁటి, పకీరు ముండ! రేపు యింటికి వెళుతూనే ఘటాశ్రాద్ధం పెట్టేస్తాను.

సౌజ : యిప్పటి ఆగ్రహం మీద మీరు అలా శలవిచ్చినా, నిడివిమీద మీకే కనికరం పుడుతుంది. యిప్పట్లోనే మీరు కనికరిస్తే కొంత మీకు నేను ఉపకారం చెయ్యగలను.

అగ్ని : కనికరం గాకేం, కడుపులో యేడుస్తున్నానుకానూ? ఆస్తీ గీస్తీ యిమ్మంటే మాత్రం యిచ్చేవాణ్ణి కాను. ఆ వెధవని పెళ్లి చేసుకోకుండా యిల్లు జేరితే, యింట్లో బెట్టుకుం టాను. అంతే.

సౌజ : అది మరి జరగదు.

అగ్ని : యిది అంతకన్న జరగదు.

సౌజ : ఆమె ఆస్తి మీరు యిచ్చి వెయ్యకపోతే దావా పడుతుంది. నిష్కారణం ఖర్చులు తగులుతవి.

అగ్ని : నేను అగ్రహారపు చెయ్యిని – దావాగీవా అని బెదిరించితే భయపడేవాణ్ణి కాను.

**సౌజ** : నా మాట విని ఆస్తి యిచ్చివేసి, గిరీశం గారి మీద గ్రంథం చెయ్యడపు ప్రయత్నము మానుకుంటే, లుబ్ధావధాన్లు గారు మీ మీద తెచ్చిన కేసు తీయించి వేస్తాను. మీ పిల్ల మీద దయాదాక్షిణ్యాలు లేకపోతే, స్వలాభవైఁనా ఆలోచించుకోండి.

**అగ్ని** : వెధవముండని లేవదీసుకుపోయిన పకీరువెధవ పక్షం మాట్లాడుతావు; యేవిఁ పెద్దమనిషివయ్యా? నేనా కేసు వొదులుకుంఛాను? ఆ వెధవ గానీ కంటికి కనపడితే, కూనీ చేస్తాను. పెద్ద ప్లీడరు ప్రత్యుద్ధానం చేసి పిలిచాడంటే, కేసుల్లో యేవిఁ సలహా చెబుతాడో అని భ్రమ పడ్డాను. వెధవముండలకి పెళ్లి చెయ్యడపు పోయీ కాలం పట్టుకుందేవిఁ, పెద్ద పెద్ద వాళ్లకి కూడాను?

**సౌజ** : లుబ్ధావధాన్లు గారి తరఫున మీ మీద గ్రంథం నేనే నడిపించవలసి వుంటుంది. మీకు వృధాగా డబ్బు తట్టుబడీ, సిక్షా, క్షూణతా కూడా సంభవిస్తాయి గదా అని యింత దూరం చెప్పాను. మంచికి మీరు మనుషులైనట్టు కనపడదు. గనక నా చాయశక్తులా పనిచేసి మీకు గట్టి సిక్ష అయ్యేటట్టు గ్రంథం నడిపిస్తాను. పిల్ల దాని ఆస్తి విషయమయి దావా కూడా నేనే పడేస్తాను.

**అగ్ని** : నీ యింట కోడి కాల్చా!

**సౌజ** : మీరు యేమన్నా, నాకు కోపం లేదు. యింటికి వెళ్లి ఆలోచించుకుని, నా సహాయం కావలసివుంటే తిరిగీరండి.

అగ్నిహోత్రావధాన్లు (నిష్క్రమించుతూ తనలో) వీడికి వెఱ్ఱి గాబోలు!

(తెరదించవలెను)

★★★

# కన్యాశుల్కము

## సప్తమాంకము

### ౧వ స్థలము : విశాఖపట్ణంలో వీధి

(బైరాగి, వెనుక పదిమంది శూద్రులూ ప్రవేశింతురు)

**రామన్న** : యెక్కణ్ణించి యిజయం సేస్తున్నారు గురూ?

**బైరాగి** : కాశీ నుంచిరా!

**రామన్న**: యెన్నాళ్ళైంది గురూ?

**బైరాగి** : ప్రాతః కాలం గంగ సేవించి బయల్దేరాముురా.

**రామన్న**: యింత యేగిరం యెలాగొచ్చినారు గురూ?

**బైరాగి** : పవనం బంధించి వాయువేగం మీద వచ్చాముురా.

**బుచ్చన్న** : యోగులికి సిద్దులుండవురా? యీయనేరా, ఉప్పాకలోనూ సింవాచలంలోనూ మొన్న సివరాత్రికి వొక్కమారే అగుపడ్డారు.

**లక్ష్మన్న**:తెల్లోడు తీగి టపా యేసినాడు కాడ్రా? నిమేటికి వుత్తరం దేశదేశాలికి యెల్లదా?

**బైరాగి** : పామరులు! పామరులు!

**రామన్న** :వూరుకొస్సి – నీకేటెరిక? యెట్టినాకొడక.

**బైరాగి** : యీ వూళ్ళో తీర్థపురాళ్ళ రేవున రెండు మైళ్ళ లోసబురున ధర్మరాజు వారు ప్రతిష్ఠ చేసిన శివాలయం, కంచు దేవాలయం ఒకటి వున్నది. రాత్రి ఆ దేవుణ్ణి శేవించుకొని, రేపు రామేశ్వరం వెళ్ళిపోతాం. సదావృత్తి యక్కడ దొరుకుతుంది?

**రామన్న**: యీ వూళ్ళో మఠం లేదు గురూ. మేవంతుండగ తమకి లోపవేఁటి గురూ? కాశీ కబుర్లేటి గురూ?

**బైరాగి** : నాలుగు రోజుల కిందట విశ్వేశ్వరుడి కోవిలలో ఒక బంగారపురేకు ఆకాశం మీంచి పడ్డది. దానిమీద వ్రాసిన లిపి బ్రాహ్మలికి యవరికీ బోధ అయింది కాదు. మేం చిత్తగించాం. సిద్ధుల భాషని దానిమీద బంగారం చేసే యోగం వకటి, కలకాలం బతికే యోగం వకటి వ్రాసివున్నాయి.

**రామన్న** : యేవాఁచ్ఛుట్టిం? గురూ భోజినం యేటారగిస్తారు?

**బైరాగి** : పాలు, పంచదారా, అరిటి ఫలములూ, యీ ప్రకారం ఒక పక్షం ఫలహారం చేస్తాము. మరి పదిహేను రోజులు వాయుభక్షణ చేస్తాము.

**రామన్న** : ఒక మిట్టకాయలో పలారం జాగర్త చేస్తాం గురూ. మా రాంమందిరానికి దయసెయ్యాలి.

**బైరాగి** : పద – యీ వూరి వింతలేవింటి?

**లచ్చన్న** : యేటీలేవ్ – రావంశంద్రపురం అగ్ఘరోరంలో ముసలబాపనోడు ఆల్ని సంపేసినాట్ట. ఆడికీ దొంగసాచ్చీకం పలికినోళ్ళకీ తాసీలుగోరికీ సిచ్చెపోతాదిట.

**బైరాగి** : ఈ వూరు పాపంతో నిండి వున్నట్టు కనపడుతూంది. యీ వూళ్లో మేము నిలవము.

**రామన్న** : లచ్చువుండు వెఱ్ఱోడు గురూ. ఆడిమాట నమ్మకండి. మీరెల్లిపోతే మాలాటోళ్లు తరించడం యలాగ్గురూ? ఆళ్లు వూరోళ్లు కారు.

**బుచ్చన్న**: ఆ వూరి దుకాణదారు గారు అదుగో వొస్తున్నారు.

**బైరాగి** : యీ వూళ్ళో తాగడం లావుగా వున్నట్టు కనపడుతుంది. మేము తాగుబోతులతో మాట్లాడం – ఆ దుకాణదారు వచ్చేలోగా యీ సందులోకి మళ్లిపోదాం. రండి (దుకాణదారు పరుగున వచ్చి కలిసి బైరాగి మొలలో చెయివేసి పట్టుకొనును.)

**దుకా** : రూపాయలు కక్కి మరీ కదలాలి!

**బైరాగి** : యేమిటీ వాళకం! వీడు తప్పతాగి పేలుతున్నాడు – నేను మొదటే చెప్పలేదా యీ వూరి సంగతి? అంతా పాపంతో నిండి వుంది! వేమన్న యేమన్నాడు?

"తాగుబోతుతోడ! తగదెందు నేస్తంబు"

**రామన్న**: (దుకాణదారుతో) భాయీ! మీకేటి, మతోయిందా? గురువుగోరికి దణ్ణవెంట్టి లెంపలోయించుకొండి.

**దుకా** : గురువూ లేదు, గుట్రా లేదు. వూరుకోస్సి – యీడెక్కడ గురువు? నాదుకాణంలో సారా అంతా చెడ తాగి డబ్బియ్యకుండా యెగేసినాడు.

**రామన్న**: మీకు మతోయిందా భాయి! ఆరేటి మీ దుకాణంలో తాగడవేంటి? కాశీ నించి యిప్పుడే ఒచ్చినారు గదా?

**దుకా** : ఆకాశం బొక్క చేసుకుని వొచ్చాడు కాడూ? (బైరాగితో) డబ్బిచ్చి మరీ కదులు.

**బైరాగి** : మావంటి సాధులతో నీకు వాదెందుకు అబ్బీ? యవర్ని చూసి మేవనుకున్నావో! మమ్మల్ని పోలిన దాసరి వాడొకడు, బైరాగి వేషం వేసుకుని యీ దేశంలో తిరుగుతున్నాడు. కిందటి మాటు మేం దేశ సంచారం చేసినప్పుడు చూసి చివాట్లు పెట్టాం. నీకు డబ్బు మీద అంత కాపీనం వుంటే తులం రాగి తెచ్చుకో బంగారం చేసి యిస్తాం. సంగోరు ధర్మ ఖర్చు చేసి సంగోరు తిను. లేకుంటే తల పగిలిపోతుంది.

**రామన్న** : యేం యెఱ్ఱిముండా పని చేసినారు భాయీ! బంగారం చేసే సిద్దులికి డబ్బు లచ్చుంటోయి? ఆరికాళ్ల మీద పడి అలక తీరుసుకొండి.

**దుకా** : వుండోస్సి - యేడిసినట్టే వుంది. నీ సొమ్మేం పోయింది?

(హెడ్ కనిష్టీబు ప్రవేశించును.)

**హెడ్** : యేమండోయి గురోజీ! మీరు దొరకడం నాకు దేవుఁడు దొరికినట్టుంది. ఇక బతికాను. మీతో కొన్ని జరూరు సంగతులు మాట్లాడాలి, రండి.

**బైరాగి** : భాయీ - మీరు వెనక్కుండండి. (దుకాణదారు తప్ప తక్కినవారు దూరముగా వెళ్లుదురు.)

**దుకా** : నా డబ్బిచ్చి మరీ మాట్లాడండి.

**బైరాగి** : నలుగురిలోనూ మర్యాద తియ్యడం ధర్మ వేఁనా తమ్ముడా? యోగరహస్యాలు పామరుల దగ్గిరా వెల్లడి చెయ్యడం?

**దుకా** : డబ్బు యెగెయ్యడప్రయోగం నా దగ్గిర పారదు. రహస్యవేఁటి? ఆ విద్యకి అంతా గురువులే!

**బైరాగి** : వెఱ్ఱి నరుడా! బైరాగి వాళ్లకి మాకు డబ్బు మీద తనుపుంటుందటోయి? ఒకళ్లకి యిచ్చేదీ కానం - పుచ్చుకున్నదీ కానం.

**హెడ్డు** : భాయీ! నీ రూపాయలు నేనిస్తాను. తెలివి మాలిన మాటలాడకు. గురువు గారికి కళ్లు మొయ్యా ఆగ్రహవొఁస్తే మనం మండిపోతాం. మీరటుండా, వెళ్లండి. (బైరాగితో) గురోజీ! కూనీ కేసు పీకల మీది కొచ్చింది. కేసూ, యే బుగ్గీ లేనిదే, ఆ రాత్రి నాలుగు రాళ్లు తడువుఁకుందావఁని మనం ఆ ముసలాణ్ణి అల్లరి పెట్టావాఁ? ఆ తరవాత, తాసిల్దారొచ్చి "హాత్‌హూత్" అని బెదిరించి పదిరాళ్లు లాగాడు. తన తాలూకు కంటె పెగిలింది కాదని రావఁప్పంతులుగాడు యినస్పెక్టరికీ పోలీసు సూపరెంటుకీ అర్జీలు కొట్టాడు. నిజంగా కూనీ కేసు జరిగి వుండగా, మేవుఁ కామాపు చేశావఁని తాసిల్దారు మీదా, నా మీదా యిప్పుడు పితూరీ చేస్తున్నారు.

**బైరాగి** : మేవుఁండగా మీకేం భయం, భాయి?

**హెడ్డు** : అందునే గదా, నా పాలిటి దేవుఁళ్లా మీరు దొరికారన్నాను.

**బైరాగి** : మీ శత్రువులకు వాగ్బంధం చేస్తాను. వాళ్ల పేర్లు వ్రాసి యివ్వండి. యినస్పెక్టరుకి మీమీద యిష్టవఁని చెప్పేవారే?

**హెడ్డు** : యీ పెద్ద ఉద్యోగస్థులకి దయలూ, దాక్షిణ్యాలూ యేవిఁటి గురూ? వాళ్లకి యంత మేపినా, వాళ్లకి కొరక్టు వొస్తుందని గాని, ప్రమోషను వొస్తుందని గాని, ఆశపుట్టి

నప్పుడు, తెగని కత్తితో పీకలు తెగ గోస్తారు. మా యినస్పెక్టరికి, సూపరేంటుపని కావాలని ఆశుంది. తసీల్దారికీ వాడికీ బలవద్విరోధం వుంది. ఆ విరోధం మధ్య నన్ను కొట్టేస్తూంది.

**బైరాగి** : చూస్తూ వుండండి. రేపటి నుంచి పతకం తిరిగిపోతుంది.

**హెడ్డు** : మీ దయ, గురూ – సౌజన్యారావు పంతులుగారని ఓ గొప్ప వకీలుగారున్నారు. ఆయన నాకు చాలా సాయం చేస్తున్నారు. కేసు తేలిపోయే సాధనం ఆయన వొకటి చెప్పారు గాని, అది కుదరక తల్లడిల్లుతున్నాం.

**బైరాగి** : యెమిటండి, ఆ సాధనం?

**హెడ్డు** : పరారీ అయిపోయిన ఆ పిల్లదాని తండ్రి – గుంటూరు శాస్తుల్లని ఒకడు వున్నాడు. అతగాడు దొరికితే, కేసు పోతుంది. వాడు యెక్కడా కనపడ్డు.

**బైరాగి** : యిదెంతపని, రాత్రి అంజనం వేసి ఒక్క క్షణంలో కనుక్కుంటాను.

**హెడ్డు** : అలా రక్షించు గురూ, ఆ కుఱ్ఱాడు – అనగా ఆ చిన్నది – యిప్పుడు యెక్కడుందో కనుక్కోగలరూ, గురూ?

**బైరాగి** : అదీ అంజనంలోనే కనపడుతుంది.

**హెడ్డు** : అది మొగాడయినా, ఆడదయినా కూడా కనపడుతుందా గురూ?

**బైరాగి** : ఆడది మొగాడెలా అవుతుంది భాయీ?

**హెడ్డు** : (తనలో) చెబితే యేం ప్రమాదవో? (పైకి) యీ చిక్కుల్నించి మతిపోతూంది గురూ. దయచేండి యింటి కెళదాం.

**బైరాగి** : యీ శిష్యులకి కొంచెం జ్ఞానోపదేశం చేసి మరీ వస్తాను. మీరు ముందు నడవండి.

**హెడ్డు** : ఈ కార్యం అయిందాకా మీ పాదాలు వొదలను – కార్యమైతే తమరు హరిద్వారంలో కట్టిస్తూన్న మఠానికి నూటపదహార్లు దాఖలు చేస్తాను.

(అందరూ నిష్క్రమింతురు.)

★★★

## ౨వ స్థలము : డెప్యూటీ కలెక్టర్ కచేరీ

(డిప్టీ కలక్టరు, వకీళ్లు, బంట్రౌతులు, మొదలైనవారు ప్రవేశింతురు.)

**భీమారావు** : నాకు మునసబు కోర్టులో కేసున్నది. వొక అర్జీ దాఖలు చేసి శలవు పుచ్చుకుంటాను.

**కలెక్టర్** : కోర్టువారికి అవకాశం అయ్యే వరకూ వుండలేని వకీళ్లు కేసు యెందుకు దాఖలు చేయవలె? ఇది చెప్పినట్టల్లా వచ్చే కోర్టనా మీయభిప్రాయం?

**భీమా** : చిత్తం, చిత్తం, తమ ప్రిడిశెసర్లు అలాగు గడుపుతూ వచ్చేవారు.

**కలె** : ఆఫీస్ పని చూసుకుని పిల్చే వరకూ ఉండండి.

**అగ్నిహో** : (రామప్పంతులుతో) యేమండోయ్ మన కొత్త వకీల్ని కోప్పడుతున్నారే?

**రామప్ప** : (అగ్నిహోత్రావధానులుతో) యీ అధికార్ల నైజం యేమిటంటే యెవళ్ల మీద దయవుండి యెవళ్ల పక్షం కేస్ చెయ్యాలంటే వాళ్ళని కరవ్వొచ్చినట్టు కనపడతారు. మీరు కోరట్ల సంగతంతా తెలుసునంటారే? యిదేనా మీ అనుభవం?

**అగ్నిహో**: (గట్టిగా) అవునవున్నాకు తెలుసును.

**కల** : యెవరా మాట్లాడుతున్న మనిషి?

**నాయడు** : (లేచి) తక్‌షీర్ మాఫ్ చేస్తే మనవి చేస్తాను. యీయన కృష్ణారాయపురం అగ్రహారం కాపురస్తుడు, నులక అగ్నిహోత్రావధాన్లు గారు; మహా (అ) యోగ్యమైన బ్రాహ్మడు, జటాంతస్వాధ్యాయి, యీయనే లుబ్ధావధాన్లుగారికి తన కొమార్తెను పద్దెనిమిది వందల రూపాయిలకు, కన్యాదానం చేయడానికి బేరమాడుకుని, కాబోయే అల్లుడికి దేహశుద్ధి చేశారు; అందుకే యీ మధ్య లుబ్ధావధాన్లు గారు యేలినవారి కోర్టులో ఛార్జీ దాఖలు చేశారు; అందులో ముద్దాయీ యీ మహానుభావుడే! మల్లవరంలో సహస్రమాసజీవైన వక బ్రాహ్మణ శ్రేష్టుడుంటే, ఆయనకు తన పెద్ద కుమార్తెను కన్యాదానం చేసి, రెండు పిల్లికూనలు స్వీకరించేటప్పటికి పెళ్లిలోనే ఆ బ్రాహ్మడి పుణ్యం అంతామూడి పరం పదంవీంచేశాడు. ఆ పిల్లదాని తరపున భూముల కొరకు దావా తెచ్చారు. వీరు తమవంటి గవర్నమెంటు ఆఫీసర్లకి తరుచుగా పనిగలుగచేసి ప్లీడర్లని పోషిస్తూ వుంటారు. వీరి యోగ్యతలేమి, వీరి దయాంతఃకరణలేమి, వీరి సరసత లేమి, మరి యెన్నడమునకు శేషుడికైనా అలవి కాదు. వారి తరపున కేసు దాఖలు చెయ్యడం కోసమే భీమారావు పంతులుగారు కోర్టుకు దయ చేశారు. (విరసముగా నవ్వి కూరుచొనును.)

**కలె** : బలే శాబాష్ (గుమాస్తాతో) ఏదీ భీమారావు పంతులు గార్ని ప్రియాదు అర్జీ దాఖలు చేయమను. (గుమస్తా పుచ్చుకొని దాఖలు చేయును.)

కలె : (కాగితమందుకొని) యేమిటయ్యా కేసు స్వభావం?

భీమా : చిత్తం, యీయన వెధవ కొమార్తెని, యీయన కొమారుడికి చదువుచెప్పే గిరీశం అనే ఆయన అలంకారాలూ, ఆస్తీతో కూడా లేవతీసుకు వెళ్లిపోయినాడు.

అగ్ని : దస్తావేజులూ, కోర్టు కాయితాలూ కూడానండి.

కలె : యేమిటి? ఆ, హా, హా, హా, హా, (నవ్వుచు బూట్సు నేలపై తట్టును) బలే శాబాష్ (అర్జీ చూసుకొని) యిన్నాళ్లేమి చేస్తున్నారు?

భీమా : తహస్సీల్దార్ గారి దగ్గిర నేరం జరిగిన మూడో రోజునే మున్సబుకోర్టు వకీలు వెంకట్రావు పంతులుగారు, ఛార్జీ దాఖలు చేస్తే ఆ తహస్సీల్‌దారు గారు కేస్ స్వభావం యేమిటని అడిగినారు. ఎబ్‌డక్షన్ అని వెంకట్రావు పంతులు గారు చెప్పేసరికి యింగ్లీషు రాకపోవడం చాత, తహస్సీల్దారు గారు ఆ మాట యెప్పుడూ విన్లేదని చెప్పారు. తరవాత కేస్ స్వభావం తెలుగున చెప్తే యీలాటి నేరం మా జూరిస్ డిక్షన్‌లో జరగదు. తోవలో రోడ్డు మీద యేతాలూకా సరిహద్దులో యెత్తుకుపోయినాడో అని అర్జీ దాఖలు చేసుకున్నారు కారు. లుబ్ధావధాన్లు గారి కూనీ కేసు కామాప్ చేసిన తహస్సీల్దారు గారే యీయనండి.

నాయుడు : ఇంగ్లీష్ రాకపోతేనేమండి? తహస్సీల్దారు గారు యెంత ప్రాజ్ఞులు. పూర్వపు యూరోపియన్ అధికార్లని యెంతమందిని మెప్పించారు! ఆయన లుబ్ధావధాన్లు గారి కేసు కామాప్ చేశారని భీమారావు పంతులు గారు అంటున్నారు. యింకా యిన్క్వైరీ అవుతూ వున్న కేసులో అలా అన్నందుకు యీయన పైని తహస్సీల్దారు గారు పరువునష్టం ఛార్జీ తేవడమునకు వీలు వున్నది.

కలె : (భీమారావు వైపు జూచి) పిల్లకు పదహారు సంవత్సరములకు లోపు యీడని రుజువున్నదా?

భీమా : జాతకం వుందండి.

నాయుడు : కోర్టు వారు ఆ జాతకం దాఖలు చేసుకోవాలి.

భీమా : యీ కేసులో ఆయన మాట్లాడుతూ వుంటే నే ఎంత మాత్రం వొప్పేది లేదు.

నాయుడు : యీ కేసులో నాక్కూడా వకాల్తినామా వుందండి. (అని దాఖలు చేయును)

భీమా : (అగ్నిహోత్రావధాన్లుగారితో) ఏమయ్యా, యీయనక్కూడా వకాల్తీ యిచ్చావయ్యా.

అగ్ని : మొదటా, రామప్పంతులు యీయన కిప్పించారు.

**భీమా** : (అగ్నిహోత్రావధాన్లుగారితో) అయితే యేడువు.

(అగ్నిహోత్రావధాన్లు తెల్లపోయి చూచును.)

**కలె** : యేదీ జాతకం దాఖలు చెయ్యండీ.

(భీమారావు పంతులు దాఖలు చేయును.)

**నాయుడు** : కోర్టువారితో వక సంగతి మనవి చేసుకుంటాను. యీ జాతకం విశ్వామిత్రుడంత యోగ్యుడైన బ్రాహ్మడి చేత తయారు చెయ్యబడ్డది. అదుగో ఆ మూల నిలబడ్డ రామప్పంతులు గారికి యీ జాతకంలో మంచి ప్రవేశం వుందండి.

**భీమా** : నేను పేన్డ్ వకీల్ని. కేసు హీరింగు నేనే చేయవలెను గాని, నాయుడు గారు చేస్తే నేనెంత మాత్రం వొప్పేది లేదు.

**నాయు**: స్మాలెట్ దొరగారి దగ్గిర్నుంచీ యేజన్సీ కోర్టులో వకాల్తీ చేస్తున్నాను. డబ్బుచ్చుకున్నందుకు నా పార్టీ తరఫున నాలుగు మాటలు చెప్పి తీరుతాను గాని, యింగ్లీష్ చదువుకున్న కొందరు వకీళ్లలాగ నోటంట మాట్రాకుండా కొయ్యలాగ నిలబడనండి.

**కలె** : (అగ్నిహోత్రావధానుల వైపు జూచి) మీ కుమార్తె యే సంవత్సరమందు పుట్టిందయ్యా?

**అగ్ని** : అంగీరస.

**కలె** : జాతకంలో భావవుందే? బ్రాహ్మణ్యం పరువంతా తీసేస్తిరే. గడ్డితిని పిల్ల నమ్ముకున్నావు సరే కాని, యీలాటి ఫోర్జరీలు కూడా చేయిస్తావూ? బ్రాహ్మల్లో వున్నంత ఖంగాళీ, మాలకూడూ మరెక్కడా లేదు. నీ దుర్మార్గత వల్ల నీ కుమార్తెను యీ అవస్థలోకి తెచ్చి మళ్లీ ఎబ్‌డక్షన్ కేసు కూడానా? నీ పొట్ట కరిగించేస్తానుండు. (గుమాస్తాతో) కేసులో నోటీస్‌లు చెయ్యి.

**గుమా** : (ఛార్జీ కాగితము జూసి) యిందులో ముద్దాయీ యింటిపేరూ సాకీనూ లేదండి.

**నాయు**: (లేచి) యీ అర్జి వల్లకాట్లో రామనాధాయ వ్యవహారం లాగుంది. ఇంగ్లీషు వకీళ్లు దాఖలు చేసే కాకితాలు యీరీతినే వుంటాయండి.

**భీమా** : (గుమస్తాతో రహస్యముగా) తరవాయీలు నింపించలేదుటయ్యా? (పైకి) యీలా నాయుడుగారు నన్ను తూలనాడుతూంటే, కోర్టు వారు ఊరుకోవడం న్యాయం కాదు.

**కలె** : నాయుడు గారు మిమ్మ నేమీ అన్లేదే?

**భీమా** : (తనలో) యిక్కడికి నేను రావడం బుద్ధి పొరపాటు.

**క్లార్క్** : (భీమారావు పంతులు గారితో) ఇంటిపేరూ, సాకీనూ యేమిటండీ?

**భీమా** : (అగ్నిహోత్రావధాన్లుగారితో) ఏమిటయ్యా?

**అగ్ని** : ఆయన పేరు గిరీశం, మరంతకంట నాకు తెలియదు.

**కలె** : చాబాష్; బాగా వుంది! అవధాన్లు గారి కొమార్తెని యెవడో తీసుకుపోయినాడు. కనక వాడి వూరూ పేరూ యెరిగిన వాళ్లు తెలియచెయ్యవలసినదని, దండోరా కొట్టించి గేజట్లో వేయించండి. పోలీసు వారికి యెందుకు నోటీసివ్వలేదూ! సాకీనూ మొదలైనవి లేనిదీ కేస్ యడ్మిట్ చెయడానికి వీలులేదు. టిఫిన్‌కి వేళయింది. లేదాము (అని లేచి వెళ్లిపోవును).

**అగ్నిహో**: (భీమారావు పంతులు గారితో) ఏమండోయ్ కేసు అడ్డంగా తిరిగిందే? (భీమారావు పంతులుగారు మాట్లాడరు.)

**అగ్నిహో**: యేమండోయి మీతోటి, మాట్లాడుతున్నాను.

**భీమా** : ఇచ్చిన ఫీజుకు పనైపోయింది; మళ్లీ ఫీజిస్తేనేకాని మాట్లాడేది లేదు.

**అగ్నిహో**: యేంపనైంది అఘోరంపని? కలక్టరు చివాట్లు పెడుతూంటే ముంగిలా మాట్లాడక వూరుకున్నావు!

**భీమా** : బంట్రోత్! యితన్ని నా దగ్గిరికి రాకుండా గెంటేయ్.

**అగ్నిహో**: ఓహూ బాగుంది వ్యవహారం! రామప్పంతులేడీ?

**నాయుడు**: (మెల్లగా వెనుకనుండివచ్చి) పోర్జరీ మాటరాగానే నన్నసన్నంగా జారారు. యీపాటికి వారి వూరికి సగంతోవలో వుంటారు.

**అగ్ని** : అయ్యో కొంపతీశాడే!

**నాయుడు**: ఇంగ్లీషువకీలు సరదా తీరిందా? పోర్జరీకి తమక్కూడా మఠప్రవేశం అవుతుంది.

**అగ్ని** : అయ్యో నీయింట కోడికాల్చా.

**నాయుడు**: రోజూ కాలుస్తూనే వుంటారు.

(తెరదించవలెను.)

★ ★ ★

## 3-వ స్థలము. సౌజన్యారావు పంతులుగారి కచేరీ గది

(సౌజన్యారావు పంతులుగారూ, పోలిశెట్టి ప్రవేశింతురు)

**సౌజ** : చూశారా శెట్టిగారూ. యిప్పటి రోజుల్లో దేవ బ్రాహ్మణభక్తి కోమట్లలోనే వున్నది. లుబ్ధావధాన్లుగారు బ్రాహ్మలు, వృద్ధులున్నూ - ఆయనను కాపాడితే మీకు చాలా సుకృతం వుంటుంది.

**పోలిశెట్టి**: బాబు - తమ శలవు కబ్బెంతర వేఁటి?

**సౌజ** : చూశారా, మీరు సాక్ష్యం చెప్పి ఆయన్ని యీ ఆపదలోనుంచి తప్పించకపోతే, నిజం దాచినందువల్ల ఆయనకి యేమి ప్రమాదం వచ్చినా, ఆపాపం మిమ్మల్ని చుట్టుగుంటుంది.

**పోలి** : అబ్బెంతరవేఁటి? బాబూ!

**సౌజ** : నిజంగా కూనీ జరగలేదని మీనమ్మకవేఁకదూ?

**పోలి** : అబ్బెంతరవేఁటి? బాబూ!

**సౌజ** : ఆపిల్ల గోడదాటి పారిపోవడం మీరు చూశారుగదూ?

**పోలి** : అబ్బెంతరవేఁటి బాబూ?

**సౌజ** : మీరు అప్పుడు గుడ్డెమీదకి బాహ్యానికి వెళ్లివున్నారు?

**పోలి** : అబ్బెంతరవేఁటి బాబూ?

**సౌజ** : మీరు బాహ్యానికి వెళ్లినప్పుడు, సహాయానికి మీ నౌఖరును కూడా తీసుకు వెళ్లారు?

**పోలి** : అబ్బెంతరవేఁటి బాబూ?

**సౌజ** : (కలం కాగితం తీసి) యీ సంగతులే వ్రాస్తాను. చెప్పండి.

**పోలి** : యేటి బాబూ?

**సౌజ** : మీరు చెప్పబోయే సాక్ష్యానికి స్టేటుమెంటు కట్టుగుంటాను. జరిగినది అంతా చెప్పండి - వ్రాస్తాను.

**పోలి** : మా యింట్లోళ్లకి ఉడ్డోలవైఁన జబ్బుగా వుందని కబురెట్టారు బాబూ. నాకు సేతులు కాళ్లు ఆడకుండున్నాయి. బండీ కుదుర్చుకొచ్చాను - శలవిప్పించండి - యీ సాచ్చీకాల్లో తిరిగితే పిల్లాపేకా బతుకుతారా బాబూ?

**సౌజ** : యింతసేపూ చెప్పారు కారేమి? రుగ్మత నిజమే ఐతే చాలా విచారమైన సంగతి – మీకు సాక్ష్యం యలాగా తప్పదు. చెప్పేమాటలు ముందు వ్రాసుకుంటే మంచిది. లేకుంటే బోనెక్కిన తరవాత తత్తరపడిపోతారు. పది నిమిషములు పట్టదు. చెప్పండి వ్రాస్తాను.

**పోలి** : సాచ్చీకం తప్పదు బాబూ?

**సౌజ** : యలా తప్పుతుందీ? నిజం తెలిసినవారు సాక్ష్యం పలకకపోతే మరియవరు పలుకుతారు?

**పోలి** : బాబూ – తమరు పెద్దవాకీళ్లు, కోవఁటోడి మాటని కొట్టెయక, యింటారా?

**సౌజ** : వినకేమి?

**పోలి** : నిజవేఁటి బాబూ? అబద్దవేఁటి బాబూ? నేను చూసి నిజవాఁ చెప్పినాను? గుడ్డిమీదికేటి నిశిరాత్రేళ నేను బైటకెల్దవేఁటి? జువ్విచెట్టుమీద పిశాచం అమాంతంగా సంపేసి పోదా! బాబూ? యేటిబాబూ సాచ్చీకానికి ముండ పోలిశెట్టి పోలిశెట్టే సెప్పాలా సాచ్చీకం బాబూ? తమంటి అధికార్లని చూస్తే, పాణం యెగిరిపోతుందిగదా? తమరు తలిస్తే సాచ్చీకానిక్కొదవా? బాపనోళ్లు నచ్చాపనచ్చులు. కొంచం సెయితడిజేస్తే సాచ్చీకం చెప్పేసిపోతారు బాబూ –

**సౌజి** : యీపాటి చాలించండి. దొంగసాక్ష్యాలు నాదగ్గిర పనికిరావు. నిజం తెలిసిన సాక్షులే నాకు కావాలి.

**పోలి** : ఆపాటిమాట యెవరు సెప్పినారు కారు బాబూ; నిజం నాకేమీ తెల్దు, యేదేవుఁడు నెత్తికొట్టమంటే ఆ దేవుఁడు నెత్తికొడతాను బాబూ.

**సౌజ** : మరి యెరుగుదువఁని యెందుకు చెప్పారూ?

**పోలి** : బాబూ, సెప్పనంటే కనిష్టీబోళ్ళు ఊరుకున్నారా?

**సౌజ** : యిప్పుడు మాత్రం వూరుకుంటారా?

**పోలి** : చెప్పితే, యిన్నిసిపికటరు పీక పిసికెయ్డు బాబూ!

**సౌజ** : చెప్పకపోతే హెడ్డు కనిష్టీబు పీక పిసకడా?

**పోలి** : అధికార్లేటి చెయ్మంటే, మాలాటోళ్లు అదల్లా సెయ్యాలి గదా బాబూ –లేకుంటే పీక్కురిగదా? "పోలిశెట్టీ, సాచ్చీకం సెప్పాలి" అని హెడ్డు గారంటే, సిత్తం బాబూ అనాలి; "పోలిశెట్టీ కబడదారు, సాచ్చీకం చెప్పితే సంపేస్తాను" అని యిన్నిసిపికటరు గారు

అంటే, సిత్తం బాబూ అనాలి. "హేడ్డు గారిని బదిలీ చేస్తాం, మరి భయపడకు", అంటే సిత్తం బాబూ అనాలి. ఆ రాత్రి నేనూళ్లోవున్నానా బాబూ? లింగోరం సంతకి పోలేదా?

**సౌజ** : మీ సాక్ష్యాన్ని, నమ్ముకొని లుబ్ధావధాన్లుగారికి నేను ధైర్యం చెప్పానే?

**పోలి** : గొప్పధికార్లు! తమరు తలిస్తే ఆరికి నోటేటి బాబూ? కొవిఁటాడి మాటకొట్టెయ్యకండి బాబూ, తమవంటోరుతలిస్తే, బాపన సాచ్చీకాలు నచ్చాపనచ్చులు.

**సౌజ** : మీ యోగ్యత తెలిసింది. చాలు, యీపాటి వెళ్లండి.

**పోలి** : (లేచి నిలబడి) కోపవాఁబాబూ? మేం బతగ్గలవాఁ? ఆవు నెయ్యి బాబూ గుమగుమలాడేది ప్రతోరం పంపించుకుందునా బాబూ?

**సౌజ** : మీ యినస్పెక్టరికి పంపండి.

**పోలి** : (వెళ్లిపోతూ) ఆరంతోరు ఆరూ, తమంతోరు తమరూ. మాకిద్దరొహటి గాదా?

**సౌజ** : చాలును వెళ్లండి, వెళ్లండి.

**పోలి** : తమక్కోపవొఁస్తే, బతగ్గలవాఁ బాబూ., (గుమ్మం దాటి) బతిగాన్రా దేవుఁడా! పెందరకాళె యింటికి పోయి యెంకటేశ్వర్లుకి, అరశటాకు నెయ్యి దివ్వెలిగిస్తాను.

(నిష్క్రమించును.)

★★★

## ౪వ స్థలము : వీధి

(అగ్నిహోత్రావధాన్లు, నాయడు ప్రవేశింతురు.)

**అగ్ని** : అప్పైతే కేసు మానుకొమ్మంఛారూ?

**నాయడు** : లేకపోతే మీకు చాలా వుపద్రవం సంభవిస్తుంది. ఆ యింగిలీషు వకీలు అంతా పాడుచేశాడు.

**అగ్ని** : అయితే, రావఁప్పంతులు ఉడాయించేసినట్టేనా?

**నాయడు** : అందుకు సందేహవేఁవిఁటి?

**అగ్ని** : నా కడియం, పట్టుకుపోయి, తాకట్టు పెట్టాడు.

**నాయడు** : దానికి నీళ్లధారే.

**అగ్ని** : అయ్యో! ఆ కడియం మా తాతనాటిది. మీరు మొన్న దిడ్డీ తోవంట వొచ్చారే, ఆ సొందాని యింట్లో తాకట్టు పెట్టాడు.

**నాయడు** : రామ! రామ! ఆ సరుకు దాని దగ్గర వుంచేలేదు. మీది మిక్కిలి దాని తాలూకు కంటె వకటి వాడే తీసుకుపోయి యక్కడో తాకట్టు పెట్టాడు. ఆ తాగుబోతు మీకేలా దొరికాడు?

**అగ్ని** : రావఁప్పంతులు తాగుఛాడా?

**నాయడు** : మరి కడియం, కంటెకూడా తాగేశాడు కాడా?

**అగ్ని** : వీడి సిగతరగా?

**నాయడు** : అవును గాని, మీ మీద ఫోర్జరీ కేసు ఖణాయించకుండా డిప్టీ కలక్టరు గారితో సిఫార్సు చేశాను గదా, నాకేమిస్తారు?

**అగ్ని** : యేవిఁచ్చేది? నాభి కొనుక్కోడానికి దమ్మిడీ అయినా నా దగ్గిర లేదు. వూరికి చేరితే గాని డబ్బు పెగల్దు.

**నాయడు** : పోనియ్యండి. ఒక ప్రోమిసరీ నోటు రాయండి; రూపాయలు యిప్పిస్తాను.

**అగ్ని** : నా ప్రాణం పోతే నోటు రాయను. అప్పుపత్రం రాయనని మా తండ్రి చచ్చిపోయేటప్పుడు నా చేత ప్రమాణం చేయించాడు.

**నాయడు** : అయితే మీతో కూడా మీ వూరు వస్తాను – వక బండెడు ధాన్యం యివ్వండి.

**అగ్ని** : డబ్బూ, దినసూ కూడా వొకీళ్ళ నెత్తిని కొడితే, యేటికేడాదీ బతకడం యలాగు? రెండుపుట్లు మిరపకాయలిస్తాను.

**నాయడు** : అదైనా యెంత కాదు. ఖరారేనా?

**అగ్ని** : అగ్నిహోత్రావధాన్లు అన్నమాట తప్పుఛాడా? లుబ్ధావధాన్లు నన్ను పకీర్ని చేశాడు – వాడికి సిక్ష కాదేం?

**నాయడు** : అవును గాని, సౌజన్యారావు పంతులు గారు అతడికి సాయం చేస్తున్నారు. అధికార్లంతా ఆ పంతులు మాట వింటారు.

**అగ్ని** : ఆ పంతులు అవుధాన్లు కూతుర్ని పెళ్లాడఛాడా యేమిషి?

**నాయడు** : ఆయన ప్రాలుబ్ధం, దాన్ని పెళ్లాడతాడా?

**అగ్ని** : మరి యెందుకు, లుబ్ధావుధాన్లు మీదపడి యేడుస్తాడు?

**నాయడు** : సౌజన్యారావు పంతులుగారు మహా దొడ్డ వారు. కోట్లలో యెన్నవలిసిన మనుషులు. ఆపదలో వున్న యెవరికైనా ఆయ్న ఉపకారం చెయ్యవలసినవారే?

**అగ్ని** : అపైతే, వెధవముండని పెళ్లాడిన చావాటుపీనుగును వెనకేసుకుని, నా పీక యెందుకు నొక్కుచున్నాడు? – అడుగో ఆ గాడిదకొడుకు!

(గిరీశం తొందరగా ప్రవేశించును. అగ్నిహోత్రావధాన్లు పక్కనుంచి గిరీశం మీదపడును. గిరీశం తప్పించుకుని కిందికి జారి, అగ్నిహోత్రావధాన్లు కాళ్లు బట్టి లాగి, "మావగారికి నమస్కారం" అని పరుగుచ్చుకొనును. అగ్నిహోత్రావధాన్లు కిందపడును)

**నాయడు** : అల్లుడుగారా యేవింటండి? (లేవదీసి వొళ్లు దులుపును.)

**అగ్ని** : వీడి శ్రాద్ధం చెట్టుకింద బెట్టా! యేడీ, వెధవని చంపేస్తాను?

**నాయడు** : అల్లుణ్ణి హతవాఁరిస్తే, కూతురు డబ్బిల్ వెధవౌతుంది. శాంతించండి.

**అగ్ని** : నీ యింట కోడి గాల్చా!

**నాయడు** : అమోఘాశీర్వచనము! పదండి.

★★★

## ౫వ స్థలము : లుబ్ధావధాన్లు బస

**లుబ్ధా** : రామనామతారకం। భక్తిముక్తి దాయకం॥

(గిరీశం ప్రవేశించి లుబ్ధావధాన్లును కాగలించుకొని "అన్నయ్యా" అని యేడ్చును.)

**లుబ్ధా** : యిదేవింట్రా?

**గిరీశం**: నీ మీద కూనీ కేసు వొచ్చిందని తెలిసి నిద్రాహారం లేకుండా యకాయకీని వొచ్చాను. మా అన్నయ్యకీ వాళ్లకీ కబురు పంపించావు కావేవిఁ?

**లుబ్ధా** : యెవడేం జెయ్యాలి? అన్నిటికీ సౌజన్యారావు పంతులుగారే వున్నారు. అయితే అబ్బీ, అగ్నిహోత్రావధాన్లు గాడి కూతిర్ని లేవదీసుకు పోయినావట్రా? వాడికి తగిన శాస్తి చేశావు. దాన్నిగానీ పెళ్లి మాత్రం ఆడలేదు గద?

**గిరీశం**: నేనంత తెలివితక్కువ పని చేస్తాననుకున్నావా, అన్నయ్యా? నువ్వు నన్నేదో పెంచు కుంటావనీ, పెళ్లి చేస్తావనీ మా వాళ్లు కొండంత ఆశ పెట్టుకున్నారు గదా?

**లుబ్ధా** : ఈ గండం గడిస్తే పెంపకం మాట ఆలోచించుకోవచ్చును.

**గిరీశం**: (గద్గద స్వరంతో) సౌజన్యరావు పంతులు గారు చెప్పిన మాటలు చూస్తే, యీ గండం గడుస్తుందని నాకు ధైర్యం తాళకుండా వుంది. నీకు కావలసిన వాణ్ణీ, చదువుకున్న వాణ్ణీ, బుద్ధిమంతుణ్ణీ గనక నీకు మంచి సలహా చెప్పమని సౌజన్యారావు పంతులు గారు నాతో మరీ మరీ చెప్పారు.

**లుబ్ధా** : ఆయన్ని చూశావురా?

**గిరీశం**: "చూశావా" అనా అడుగుతున్నారు? ఆయన దగ్గిరికి పెద్ద సిఫార్సు తీసుకువొచ్చాను. ఆయనకి నా మీద పుత్ర ప్రేమ. ఆయనకేమీ పాలుపోకనే, నన్ను మీతోటీ, హెడ్డు కనీష్టీబు తోటీ మాట్లాడి, మంచి సలహా యిమ్మని పంపించారు. గనక నా మాట విను యెందుకైనా మంచిది, ఒక దత్తత పత్రిక రాయి – కన్న కొడుకు లేనందుకు, ఉత్తరగతి చూసుకోవాలా లేదా?

**లుబ్ధా** : నాకువున్న బంధువులంతా నా దగ్గిర డబ్బు లాగాలని చూసేవారే గాని, నా కష్ట సుఖాలకి పనికివొచ్చేవాడు ఒక్కడయినా కనపడ్డు.

**గిరీశం**: ఒహణ్ణెత్తినైనా యెన్నడైనా, ఓ దమ్మిడీ కొట్టిన పాపాన్ని పోయినావూ? నేనొక్కణ్ణే గద, నీ మీద అభిమానం పెట్టుకు దేవులాడుతున్నాను. మిగతా నీ బంధువులకి యెవరికైనా నీ మీద పిసరంత అభిమానం వుందీ? చెప్పు.

**లుబ్ధా** : లేకపోతే పీడా నాడా కూడా పాయెను.

**గిరీశం** : నే మట్టుకు నీ దగ్గర ఒక్క దమ్మిడీ యెన్నడూ ఆశించలేదు. నీపరం కోసం దత్తత చేసుకోమన్నాను. నన్ను కాకపోతే మరొకణ్ణి చేసుకో.

**లుబ్ధా** : యిహం యింత బాగా వెలిగింది; పరం మాట బతికివుంటే ముందు చూసుకుందాం.

**గిరీశం**: సౌజన్యరావు పంతులు గారు నీకు మంచి సలహా యిమ్మని శలవిచ్చారు. గనక నీతో యీ మాట చెప్పాను; అంతేగాని, ఆప్తులు చెప్పిన మాట నువ్వు వినవన్న మాట నాకు బాగా తెలుసును–పోనియ్యి–మరో మాట చెబుతాను. అది ఐనా, చెవిని బెట్టు – నీకొక వేళ, సిక్ష అయితే, నీ తరఫున, నీ వ్యవహారాలూ, సవహారాలూ చూడడానికి యవడైనా ఒకడు వుండాలా లేదా? నీ బంధువుల్లో కల్లా యింగిలీషు వొచ్చినవాణ్ణీ, వ్యవహార జ్ఞానం కలవాణ్ణీ నేను వొక్కణ్ణే గద? నాకో పవరాఫ్టర్నామా గొలికి యిచ్చెయ్యి.

**లుబ్ధా** : నువ్వెందుకు నన్ను దుఃఖంలో వున్నవాణ్ణి, మరింత దుఃఖ పెడతావు? అన్నిటికీ నాకు సౌజన్యారావు పంతులు గారు వొక్కరేవున్నారు. ఆయన యేలా చెబితే అలా చేస్తాను.

గిరీశం : నేనన్నమాటా అదే కదూ? ఆయన చెప్పినట్టు నువ్వేవింటి? నేనేవింటి, యవరైనా వినవలసిందే, యీ రెండు సంగతుల విషయమయీ, ఆయన సలహా తప్పకుండా అడిగి, వారు యలా శలవిస్తే అలా చేదాం. యేమంటావు?

లుబ్ధా : యిప్పటి నా చిక్కుకు పనికొచ్చే మాట ఒక్కటి లేదుగద.

గిరీశం: మరి యెందుకొంచ్చా ననుకున్నావు యింత దూరం? నేను నాడు వ్రాసిన వుత్తరపు సంగతులు నువ్వు ఆలోచనలోకి తెచ్చి వుంటే, యీ చిక్కులు నీకు రాకపోను గదా?

లుబ్ధా : అప్పుడు గడ్డితిన్నాను.

(హెడ్డు కనిష్టీబు, దుకాణదారు ప్రవేశించి)

హెడ్డు : అవుధాన్లూ – ఈయనెవరు?

లుబ్ధా : నా తమ్ముడు.

హెడ్డు : నాకేం తోచకుండా వుంది బైరాగీ మాయవైం పోయినాడు.

లుబ్ధా : అయ్యో! మరేవింటి సాధనం?

హెడ్డు : అదే ఆలోచిస్తున్నాను.

లుబ్ధా : యెక్కడికి వెళ్ళాడో?

హెడ్డు : శ్రీ జగన్నాథస్వామి వారి శలవౌతూంది అని యీ వుదయం నుంచీ అంటూ వొచ్చాడు.

దుకా : సారా దుకాణాల్లో యెతికితే, దొరుకుతాడు.

హెడ్డు : అదేం మాట భాయీ, సిద్ధులు యేం జేసినా, వారికి తప్పులేదు. యే దుకాణంలోనూ కూడా కాన రాలేదు.

దుకా : ఆలాగైతే అనకాపిల్లి రోడ్డు కాసి యెతకండి.

గిరీ : బైరాగి యెందుకయ్యా?

హెడ్డు : ఆయన అంజనం వేసి గుంటూరు శాస్తుల్లునీ, వాడి కూతుర్నీ చూపించాడు.

గిరీ : డామ్ నాన్సెన్సు – గ్రోస్ సూపర్ స్టిషన్ – యీ వెఱ్ఱి కబుర్లు యేదొర నమ్ముతాడు?

హెడ్డు : దొర్లు నమ్మకపోతే పోయేరు. ఆ గుంట బతికి వుందనీ, ఫలానా చోట వుందనీ మనకి ఆచోకీ తెలిస్తే చాలదా?

గిరీశం : ఇగ్నోరెన్స్! యేమి ఆచోకీ తెలిసింది?

హెడ్డు : ఆ పిల్ల ఒక వూరి యింట్లో కుక్కి మంచం మీద కూచుని యేడుస్తూన్నట్టు కనపడ్డది.

గిరీ : మీకే కనపడ్డదా?

హెడ్డు : నాకెలా కనపడుతుంది?పాపం పుణ్యం యెరగని చిన్న పిల్లవాళ్లకే కనపడుతుంది.

గిరీ : లోకం అంతటా పూరియిళ్లూ కుక్కి మంచాలూ వుఁన్నవి గదా, యేవూరని పోల్చడం?

హెడ్డు : ఈ రాత్రి మళ్ళీ అంజనం వేసి వూరు పేరు చెప్పిస్తానన్నారు.

గిరీ : యవిడెన్సు ఆక్టులో అంజనాలూ, పిశాచాలూ సాక్ష్యానికి పనికొస్తాయిటయ్యా?

హెడ్డు : ఆ బైరాగీని మీరెరగరు; ఆయన గొప్ప సిద్ధుడు – యేం జెయ్యాలంటే అది చెయ్యగల్డు. అతడు పక్కని వుంటే నాకు కొండంతం ధైర్యం వుండేది. జగన్నాధ స్వామిని సేవించుకుని సాయంత్రానికి ఆయనవొస్తే, నేను అదృష్టవంతుణ్ణి.

గిరీ : పదిరోజులు ప్రయాణం గదా, ఒక్క రోజుకి పోవడం రావడం యలాగ?

హెడ్డు : ఆయనకి వాయు వేగం వుంది.

దుకా : అప్పులాళ్ళు అగుపడితే, వాయువేగంగా యెగేస్తాడు – నా బాకీ వొసూలు చేసుకోనిచ్చినారు కారు గదా భాయీ!

హెడ్డు : వెధవబాకీ – యీ గండం తప్పితే, నేను యిచ్చేస్తాను భాయీ.

దుకా : గండం తప్పేదేటి, నా సొమ్ము నా చేతులో పడేదేటి భాయీ?

హెడ్డు : మీ అందరిసాయం వుంటే దాటకేం భాయి?

దుకా : ప్రాణం పెడతాను భాయి, సాక్షెం మాట మాత్రం శలవియ్యకండి?

హెడ్డు : సాక్ష్యం పలకరా యేవిఁటి?

దుకా : దుకాణవేఁసుకు బతికేవాళ్ళకి సాక్షికాలెందుకు భాయీ? ఈ తిరగడం నించి బేరం చెడ్డాది. యీ వేళ వూరికి పోకుంటే దుకాణం యెత్తి పెట్టాలి.

హెడ్డు : యిదేనా మీ స్నేహం, నేస్తం?

దుకా : మీ వెంట తిరిగితే, కొత్త హేడ్డు గారు –

హెడ్డు : కొత్త హేడ్డేవిఁటి భాయీ?

దుకా : యినసిపికటరు గారు, చెప్పినారు. నా సొమ్ము మాటేటిభాయి?

హెడ్డు : యినస్పెక్టరు గాడు అన్నిందాలా నా కొంప తీశాడు!

దుకా : ఆ బైరాగాడు నాకొంప తీసినాడు. యిహ నా డబ్బు నాచేతులో పడేదేటి?

(నిష్క్రమించును)

(అసిరిగాడు ప్రవేశించి.)

**అసిరి** : (బుఱ్ఱ గోకుకుంటూ) బాబు, మా ముసల్దోనికి సాలొచ్చిందట – కబురెట్టింది బాబూ.

**హెడ్డు** : వెధవా, సాక్ష్యం యివ్వందీ వెళ్లిపోతావా యేమిటి?

**అసిరి** : సాచ్చీకం అయిందాకా బతికుంతాదా బాబు?

**హెడ్డు** : ఓరి వెధవా, దొంగమాటలాడుతున్నావు – గుండె పగలగొడతాను. నీకెవడ్రా కబురు తీసుకొచ్చాడు?

**అసిరి** : మనవూరు బండోళ్లొచ్చినారు బాబు.

**హెడ్డు** : గాడిద కొడకా, యిల్లు కదిలావంటే వీపు పెట్ల గొడతాను.

**అసిరి** : యెల్లితే మీరు తంతారు, యెల్లకుంటే అరుతంతారు.

**హెడ్డు** : ఆరెవఱ్ఱు?

**అసిరి** : యినీసిపిక్కటోరు.

**హెడ్డు** : యీ యినస్పెక్టరు మరి సాక్ష్యం రానివ్వడు!

**గిరీశం**: అసిరీ – నా దెబ్బ నీకు తెలుసును – యినస్పెక్టరు, గినస్పెక్టరూ జాంతేనై. విన్నావా? తిన్నగా బోనెక్కి నిజవేఁదో సాక్ష్యం పలక్కపోతివట్టాయనా, పీక నులివేఁసి నిన్ను నూతులో పారేస్తాను.

**అసిరి** : యేటిబాబూ! మీరోతెన్నా, ఆరోతెన్నా, యీరో తెన్నా, నాకేటెరిక బాబు? మీ నౌకరీకి దణ్ణిం. పోతాను, బాబూ. ఆయమ్మ గోడగెంతడం నాను సూపులేదు బాబూ– గవరయ్యగోరు దెయ్యాన్ని సీసాలో యెడితే, గోడగెంతడం యేటిబాబు? వొట్టి అబద్దం! నాను సూపు లేదు బాబు.

**గిరీశం**: వాడు చూడందీ సాక్ష్యం యలా పలుకుతాడు, అన్నయ్యా?

**లుబ్ధా** : నా ప్రాలుబ్ధం – యేవఁని జెప్పను?

**హెడ్డు** : యవరీయనా? కేసుల మొహం అంటే యీయనకేమైనా తెలుసునా?

**గిరీ** : కేసుల మొహం నాకూ తెలియదు, నిజం మొహం పోలీసువాళ్లకీ తెలియదు. అబద్ధ సాక్ష్యాల వల్ల తప్పించుకోవడం కన్న, జెయిల్లో కూచోడవేఁ ఉత్తమం. ధన ప్రాణాలు రొండూ పోయినా, మనిషి అన్నవాడు అసత్యం ఆడకూడదు – ఆడించకూడదు.

**హెడ్డు** : యేవిఁటండీ ఈయన శల్య సారధ్యం! యవరితడు?

గిరీ : నేను లుబ్ధావధాన్లుగారి తమ్ముణ్ణి – నా పేరు గిరీశం అంటారు. నేను పరిక్షలు పాసైనవాణ్ణి; తెలిసిందా?

హెడ్డు : వెధవముండని తగులుకుపోయిన మహానుభావుడివి నువ్వేనా?

గిరీశం: డిఫమేషన్ అంటే మీకేమో తెలుసునా? నేను సౌజన్యారావు పంతులు గారి స్నేహితుణ్ణి – సాక్ష్యాలు యే రీతిగా వున్నాయో కనుక్కుని, అన్నయ్య గారికీ మీకూ సలహా చెప్పమని పంతులు గారు నన్ను పంపితే వచ్చాను.

హెడ్డు : అలా అయితే మాకు మీరు సాయం చెయ్యాలి గాని, అబద్ధం లేకుండా సాక్ష్యం కావాలంటే ఈ భూప్రపంచకమందు యెక్కడైనా సాక్ష్యం అన్నది వుంటుందా? నా నెత్తిమీద యెన్ని వెంట్రుకలున్నాయో, అన్ని సాక్ష్యాలు చూశాను. పెద్ద పెద్ద వకీళ్లు తయారు చేసిన సాక్ష్యాలు కూడా చూశాను. మీరు అనుభవం లేక నీతులు చెబుతున్నారు గాని, హైకోర్టు వకీళ్లు కూడా తిరగేసి కొట్టమంటారు. నీ పుణ్యం వుంటుంది బాబూ, నిజం అబద్ధం అని తేలగొట్టక, యేదో ఒక తడక అల్లి తయారు చేస్తే గాని ఆబోరు దక్కదు.

గిరీ : అన్నయ్యకీ, మీకు సహాయం చెయ్యడం కోసం కాకపోతే యింతదూరం నుంచి నేను యెందుకు వచ్చాను? మీ యిష్టవొచ్చినట్టల్లా మీకు పనికివొచ్చే, అబద్ధాలు మీరు పలికించడముకు, నా అభ్యంతరం యెంత మాత్రం లేదు. ఎబ్‌స్ట్రాక్టు ట్రూత్ అనగా సుద్ధసత్యవఁనేది, సాక్షాత్తూ భగవంతుడితో సమానమైన వస్తువ అన్నమాటమాత్రం మరిచిపోకూడదని నా అభిప్రాయము. నేను మట్టుకు నిజం కోసం సమయం వస్తే సంతోషముతో ప్రాణం యిచ్చేస్తాను. "లోకోభిన్న రుచిః" అన్నాడు. కొందరికి కందిపప్పు పచ్చడి రుచి; కొందరికి పెసరపప్పు పచ్చడి రుచి; కొందరు అదృష్టవంతులికి, రెండు పచ్చళ్లూ రుచి, అలాగనే, కొందరికి అబద్ధం రుచి. కొందరికి నిజం రుచి; చాలా మందికి రెండింటీ కలగలుపు రుచి యిది లోక స్వభావం. గనక అవసరం కలిగినప్పుడు తణుకూ బెణుకూ లేకుండా, అబద్ధం ఆడవలసిందే – ప్రస్తుతాంశంలో, అసిరిగాడి చేత అబద్ధం ఆడించడం నాది పూచీ. అసిరీ – నా తడాఖా జ్ఞాపకవుఁందా, కబడదార్ – సాక్ష్యం ఇవ్వకపోతే చంపేస్తాను.

హెడ్డు : అలా తోవలోకి రండి భాయీ – చర్మం చెప్పులు కుట్టి యిస్తాను. (లుబ్ధావధాన్లుతో) ఆ ఛండాలుడు రావఁప్పంతులుని నమ్మక, యిలాంటి కావలసినవాళ్ల మాట వింటే; మీకు యీ గతి రాకపోవును గదా?

గిరీశం: మా వాడు, కావలసినవాళ్ళ సలహా వింటాడండీ? దత్తత చేసుకుంటానని యెన్నాళ్లాయో అంటున్నాడు; దత్తత చేసుకుంటే కనిపెట్టివుండనా? "పోనీ ఓ పవరాఫ్‌టర్నామా అయినా నా పేర వ్రాయి, నీ వ్యవహారాలు చూస్తాను" అంటే, చెవిపెట్టడు.

హెడ్డు : యేవఁండీ, అవుఁధాన్లుగారూ అలా చెయరాదటయ్యా?

లుబ్ధా : వెనకనుంచి ఆలోచించుకుందాం.

గిరీశం: అధాత్తుగా, జెయిలులోకి లాక్కుపోతే, ఆ పైని చేసే పనేవిఁటి?

హెడ్డు : జయిలు సిద్ధపరిచారూ?

గిరీశం: మాటవరసకన్నాను. కీడించి మేలించాలి. యినస్పెక్టరు కుట్ర బలంగా వుంది. పోలిశెట్టి సాక్ష్యం పలకనని సౌజన్యారావు పంతులుగారితో చెప్పి వూరికి వెళ్లిపోయినాడు.

హెడ్డు : అయ్యో, మరేమిటి గతి?

గిరీశం: అదే పంతులుగారూ, నేనూ విచారిస్తున్నాం.

(పూజారి గవరయ్య ప్రవేశించును.)

హెడ్డు : గవరయ్య గారూ, గురోజీ కనపడ్డారా?

గవ : యిదుగో నాతో వొస్తూంటేనే! మీ పెరటి అరుగు మీదే యింతసేపూ సమాధిలో వున్నారు.

హెడ్డు : నాకు పెరటి అరుగుమీద కనపడలేదే? పోనీండి ఆయనవొచ్చారంటే బతికాను అన్నమాట – యేరీ?

గవ : యేమి అలా అడుగుతున్నారు? యిరుగో మీ యెదటా? (కాళీ జాగావేపు చూపును) మీకు కనపడలేదా యేమిటి? (కాళీ జాగా వైపు చూసి) యేం గురోజీ తిరస్కరిణీ విద్య అవలంబించారేమిటి? – ఓహో, మీ గురువు గారి ఆజ్ఞ ఐందనా?–అయితే నాకెలా కనపడుతున్నారు? – నాకు మంత్రసిద్ధి కలదనా? – అయితే యెన్నాళ్లు యిలా కనపడకుండా వుంటారు? – ఒక్క పక్షవాఁ? –(హెడ్డుతో) అదీ వారు శలవిచ్చిన మాట.

హెడ్డు : ఈ లోగా మా పీకకి వురి అయిపోతుందే?

గవ : (కాళీ జాగా వైపు చూచి) యేమి శలవు. గురూ?–(హెడ్డుతో) మీకేమీ పర్వాలేదన్నారు.

హెడ్డు : ఈ రాత్రి అంజనం వేయిస్తావఁన్నారు గదా, యెలాగ?

గవ : (కాళీ వైపు చూచి) యేం శలవు? – (హెడ్డుతో) అన్ని పనులూ నా చేత చేయిస్తామన్నారు.

హెడ్డు : వారు కనపడితే బాగుండును.

అసిరి : అదేటి బాబూ, ఆరు నాకగుపడుతున్నారు!

గవ : సిద్ధులూ, పిశాచాలూ, మాలాంటి మాంత్రికులికి కనపడతారు. వాడిలాంటి మూఢ భక్తులకు కనపడతారు; పాపం, పుణ్యం యరగని, పసిపిల్లలకి కనపడతారు. ఇతరులకు కనపడరు.

గిరీశం: డామ్! హంబగ్. (కఱ్ఱతో గవరయ్య పక్కని ఖాళీ జాగా కొట్టి) యవడున్నాడిక్కడ? హెడ్డుగారూ? యిదంతా గ్రాండ్డచ్చీ ఆఫ్ బేడెన్.

గవ : నువ్వు రెండు ఇంగిలీషు ముక్కలు చదువుకుని నాస్తికుడివి కాగానే మాహాత్మ్యాలు పోతాయనుకున్నావా యేవింటి? నువ్వు సొట్టకఱ్ఱ తిప్పితే సిద్ధులికి తగుల్తుందా? నీలాగే పెద్ద కబుర్లు చెప్పిన రిజిస్టరికి, స్మశానంలోకి తీసికెళ్లి దెయ్యాన్ని చూపించేసరికి, ఆర్నెల్లు వూష్టం పెట్టుకున్నాడు. సిద్ధుల్ని నిందిస్తే బుఱ్ఱ పగుల్తుంది.

అసిరి : ఆరేటి బాబూ, బైరాగోరు!

గిరీశం: (అసిరిగాడిపైని ఉరికి) వెధవా, యేడిరా?

అసిరి : లేదు బాబూ, లేదు బాబూ, ఉత్తినన్నాను.

గిరీశం: దొంగ గాడిదె కొడకా! (హెడ్డుతో) మీరు సాక్ష్యం కుదుర్చుకోవడం మానేసి, ఈ గవరయ్య మాయల్లో పడితే మరి తేల్తారా?

హెడ్డు : అన్నా – అలా అనకండి. వీరి సాయం వల్లే మనం వొడ్డెక్కాలి (చెవిలో) గవరయ్య గారు మనకి ముఖ్యమైన సాక్షి.

గవర : కిరస్తానప భ్రష్టులు చేరినచోట మాంత్రికులూ, సిద్ధులూ వుండజనదు. – (కాళీ వైపు చూసి) రండి గురోజీ మన తోవని మనం పోదాం.

లుబ్ధా : గవరయ్యన్నా, యెక్కడికి వెళతారు?

గవర : నాకు తోచిన చోటికి.

లుబ్ధా : మరి సాక్ష్యవోఁ?

గవ : అవధాన్లు గారు పెళ్లాడినది కామినీ పిశాచం. "అది మనిషీ, గోడగెంతి పారిపోయింది" అని నేను అబద్ధపు సాక్ష్యం చెప్పానంటే మరి మంత్రం అన్నది నాకు మళ్లీ పలుకుతుందా? నా వొంతు ఆ గిరీశాన్ని సాక్ష్యం పలకమను.

నమ్మి చెడినవారు, లేరు।
నమ్మక చెడిపోతే, పోయేరు॥

(గిరీశంతో) – యినసిపికటరు గారు నీకంటే యెక్కువ యింగిలీషు చదువుకున్నా ఆయనకి మన శాస్త్రాల్లో నమ్మకాలు పోలేదు.

**హెడ్డు** : ఆయన దగ్గిరికి వెళతారా యేవిఁటి?

**గవర** : (వెళ్లుతూ) కబురంపించారు.

**హెడ్డు** : రండి, రండి, గవరయ్య గారూ చిన్నమాట.

**గవర** : (వెళ్లుతూ) ఆ చిన్న మాటేదో (గిరీశమును చూపి) ఆ మహానుభావుడుతో చెప్పండి.

(నిష్క్రమించును.)

**హెడ్డు** : (గిరీశంతో) ఈ సాక్ష్యం మీరు మాట దక్కించుకున్నారు – మరి సాక్ష్యవఁన్నది లేదు.

**గిరీశం:** ఆ మాటకొస్తే – నేనే సాక్ష్యానికి దిగి, కేసు నీళ్లు కారించేస్తాను. నా శక్తి చూతురు గాని – సౌజన్యారావు పంతులుతో మాత్రం ఆ మాట యింకా చెప్పకండి.

(తెరదించవలెను.)

★★★

## ౮వ స్థలము : సౌజన్యారావు పంతులు గారి యిల్లు

(మేడపైని పంతులుగారి పడకగది. ఒక బల్లపైని సన్నని గాజుదీపము కొంచము వెలుతురు కలుగజేయును. గది మధ్యను మెట్లవైపునున్న గుమ్మమునకు యెదురుగా దోమతెర మంచము ఉండును. దానిపైని సౌజన్యారావు పంతులు మేలుకుని పరుండియుండును. మంచము రెండవ ప్రక్కను చిన్న రౌను బల్లపైని గిల్టు కవరూ అంచులూ గల భగవద్గీతా పుస్తకము. ప్రక్కని కుర్చీ మీద గిరీశము కూర్చునియుండును.)

**గిరీశ** : నా మనసు డైలెమ్మాలో పడి చాలా ఖేదిస్తూందండి. యే రీతినైనా నా అన్నగారు యీ ఆపద దాటుదురా అని ఆతృత వొకపక్కా, అసత్యమునా కార్యసాధనంగా చేసుకోవడం అనే జిఘాస ఒక పక్కా, నన్ను పీడిస్తూన్నవండి. "అబద్ధపు సాక్ష్యం వొద్దు, నిజమైన సాక్ష్యం జాగ్రత చెయ్యండి" అని హెడ్డు కనిష్టీబుతో నేను అనేసరికి నాపైని కొండంత కోప్పడ్డాడండి. నిజమైన సాక్ష్యం ప్రయత్నిస్తే దొరకదా అండి?

**సౌజ** : నిజమైన సాక్ష్యం! యేం సత్యకాలం! నిజవాఁడే వాడు సాక్ష్యానికి రాడు. సాక్ష్యానికొచ్చిన వాడు నిజవాఁళ్లేడు.

గిరీశ : యెంచేత ఆళ్లేదండి.

సౌజ : వాదికి బాధించే నిజం వాది తరపు వకీలికి అక్కర్లేదు. ప్రతివాదిని బాధించే నిజం ప్రతివాది వకీలుకి అక్కర్లేదు. క్రాసెగ్జామినేషను ఆరంభం అయేసరికి యెంతటి సాక్షీ కవిత్వం ఆరంభిస్తాడు. అంచేతనే పెద్ద మనుషులు బోనెక్కడానికి భయపడతారు.

గిరీశ : వకీళ్లు అబద్ధాలాడిస్తే న్యాయం కనుక్కోడానికి జీతం పుచ్చుకునే జడ్జీ యేం జేస్తాడండి?

సౌజ : ఉభయపార్టీల వకీళ్లు ఆడించే అబద్ధాలూ చెయిపీకేటట్టు రాసుకుంటాడు.

గిరీశ : అయితే యెందుకండి యా కోర్టు.

సౌజ : నేను అదే చాలా కాలవాఁయి ఆలోచిస్తూ వుంటిని. పెద్ద పెద్ద వకీళ్లుకూడా సిగ్గుమాలి బరిపెట్టి దొంగ సాక్ష్యాలు పాఠం చెబుతారు. కొందరు మృదవర్లు తిరగేసి కొట్టమంటారు. నావంటి చాదస్తులం యింకొక కొందరం అట్టి పాపానికి వొడిగట్టుకోం గాని, మా పార్టీల తరపు సాక్ష్యులు కూడా అబద్ధం చెబుతున్నారని యెరిగిన్నీ వూరుకుంటాం. యిలాటి అసత్యానికి అంగీకరించవలసి వస్తుందనే, నేను ప్రాక్టీసు చాలా తగ్గించు కున్నాను. క్రమంగా ఈ వృత్తే మానుకోవడపు సంకల్పం కూడా వుంది.

గిరీశ : అందరూ తమవంటి వకీళ్లే అయితే, అసత్యం అన్నది వుండనే వుండదండి. వకాల్తీలో యింత అక్రమం వుందన్నమాట నేనెరగనండి. యేమైనా సహించగలను గాని అసత్యం అన్నది సహించలేనండి.

సౌజ : ఒక్క అసత్యంతో కుదరలేదు. సాధారణంగా వకాల్తీలో దురాచారాలు చాలా వున్నాయి. ఆంటినాచ్ లాగనే, ఆంటీ వకీల్ అని ఒక మూవ్‌మెంట్ మన దేశంలో స్టార్టు చెయ్యడపు అవశ్యకత కలిగేటట్టు కనపడుతుంది. హెడ్ కనిస్టేబుది తప్పుకాదు. దొంగసాక్ష్యం కలిస్తేనే గాని కేసులు గెలియవు. మీరు సత్యమార్గంలో తరిఫీదైన మనుష్యులు ఔటచేత, మీకు కేసులు నడిపించే మార్గాలు ఏహ్యంగా వున్నాయి.

గిరీ : మరి మా అన్నగారి గతియేవిఁటండి?

సౌజ : ఒక్కటే సాధనంవుంది. ఆ గుంటూరు శాస్తుల్లు యెవరో పోల్చి పట్టుగుంటే, యితర సాక్ష్యం అవసరం వుండదు.

గిరీ : పట్టుపడేమార్గం యేదో తమరు శలవిస్తే మూడులోకాలూ గాలించి అయినా పట్టు గుంటానండి.

సౌజ : మీయోగ్యతకు నాకు చాలా సంతోషంగావుంది. మీలాంటి యెంగ్‌మెన్ లావుగావుంటే, మనదేశం బాగుపడును. మీ ప్రయత్నం సానుకూలంగా తగిన బందోబస్తు యావత్తూ

నేను చేస్తాను. మీస్వంత చిక్కులు కూడా వదిలినవి గనక మీరు వెంటనే బయలుదేరి వెతకడం ఆరంభించవచ్చును. యీ కారణం చేత మీ వివాహం పోస్ట్‌పోన్ కావలసి వొస్తుందిగదా అని మాత్రం విచారిస్తున్నాను.

గిరీ : అట్టి విచారం తాము పడనక్కరలేదు. మా గురువుగారి ఉపదేశం – డ్యూటీ ముందూ, ప్లెజర్ తరవాతానండి. అందులో నేను చిన్ననాటి నుంచీ కొంచం కాన్‌సెన్‌ట్రేషనూ, ఇంద్రియనిగ్రహమూ అభ్యాసం చెయ్యడం చాతనూ, వొళ్లు మరిచి యెల్లప్పుడూ యేదో ఒక వ్యాపకంలో కొట్టుకుంటా వుండడంచాతనూ, స్త్రీసుఖములయెడల నాకు విముఖతలావండి. అందుచేతనే మావాళ్లంతా నాకు నెపోలియన్ ఆఫ్ ఆంటినాచ్ అని పేరుపెట్టారు. యీ జీవితకాలవంతా సోషల్ రిఫారమ్ కింద వినియోగ పరుద్దావం నే నిర్ణయంతో వివాహంమాని మా గురువుగారి దగ్గిర లెఫ్టెనెంటుగా ప్రవేశించానండి. బుచ్చమ్మయొక్క హృదయ నైర్మల్యమూ, ఆమె దురవస్థా చూచిన్నీ, నా శిష్యుడి యందు నాకు వుండే ప్రేమాతిశయం చేతానున్నూ, ఆమెయందు కూడా ప్రేమాతిశయం నాకు కలిగి, ఆమెను వివాహం కావడముకు వొప్పుకున్నానుగానండి, ఇంద్రియ సుఖముల నపేక్షించి కాదు. ఆమెకూడా నన్ను ప్రేమించి, విధవా వివాహము కూడుననే నిశ్చయ ముతో నన్ను వివాహము కావడముకు అంగీకరించారండి. గనక మా మారియేజి అనేది, ట్రూలవ్‌మారియేజి గాని, సాధారణపు విడోమారియేజి కాదండి.

సౌజ : మీ గురువుగారూ అలాగే వ్రాశారు. గాని మీరు విడోమారియేజి చేసుకుంటే మీ అన్నగారు మిమ్మల్ని పెంచుకోరేమో?

గిరీశ : తమ మాటను ఆయన అతిక్రమించబోరండి. ఒకవేళ ఆయన వప్పకపోతే, దత్తత వదులుకుంటాను గాని, ప్రాణసమానురాలైన బుచ్చమ్మను విడవనండి.

సౌజ : ఆమె అదృష్టవంతురాలు.

గిరీశ : అట్టి స్త్రీ రత్నము (చడిలేకుండా ఒక మనిషి మెట్లెక్కి వచ్చి ద్వారము దగ్గిర తనకు యెదురుగా నిలిచివుండడము చూచి గిరీశం నిర్ఘాంతపోయి, మాటమాని నోరు తెరచును. ఆ వైఖరి సౌజన్యారావు పంతులు కనిపెట్టి)

సౌజ : యేవిటి అలా చూస్తున్నారు? (గిరీశం చూస్తూ వున్న వేపు తానును దృష్టి తిప్పి, వచ్చిన మనిషిని చూసును)

గిరీశ : యిట్టి స్త్రీ రత్నము దొరికిన కారణం చేత నేనే అదృష్టవంతుణ్ణి అని భావిస్తాను. అయితే "పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం" అన్న న్యాయప్రకారం, ఒకర్ని కాపాడి ఉపకారం చెయ్యడం ఉత్కృష్టమైన పుణ్యం. నిష్కారణంగా, వాడి మానాన్న

వాడు బతుకుతున్న వాడికి అపకారం చెయ్యడం పాపానికి కారణం. గనుక మా అన్నయ్యని యెంత కష్టపడి అయినా నేను కాపాడడం విధి అని యెరుగుదునండి.

**సౌజ** : (కొత్తగా వచ్చిన మనిషితో) యెవరు మీరు?

**కొత్త మనిషి** : జరూరు ప్రయోజనం కలిగి వచ్చానండి. వర్తమానం చెయకుండా వచ్చినందుకు క్షమించవలెను – కింద నౌఖర్లు కానరాలేదండి.

**సౌజ** : రండి – కూచోండి.

**గిరీశ** : (లేచి వెళ్ళి ఒక కుర్చీ తెచ్చి తన కుర్చీ పక్కను వేసి) దయచెయ్యండి.

**కొత్త మనిషి** : (కూచోక) అక్కర్లేదు.

**సౌజ** : కూచోండి (కొత్తమనిషి కూచొనును) తాము యెవరండి?

**కొత్త మనిషి** : నేనెవరో మనవి చెయక తీరదా అండి?

**సౌజ** : యే కారణం చేతనైనా పేరు చెప్పడం యిష్టం లేకపోతే, చెప్పనక్కరలేదండి.

**కొత్త మనిషి** : నేవచ్చిన పనికి, నా పేరుతో పనిలేదండి. కొన్ని కారణములచేత నా పేరు చెప్పడముకు వీలు లేదండి. క్షమించవలెనని ప్రార్థన.

**గిరీ** : షెక్స్పియర్ అన్నాడు కాడా అండి "వాట్సినె నేమ్?" అని. దానిని నేను చిన్న గీత ముక్కగా తర్జుమా చేశానండి. "పేరులోన నేమి పెన్నిధియున్నది" మన శాస్త్రాల్లో కూడా యెవరి పేరు వారు గట్టిగా ఉచ్చరించితే పాపవఁన్నారు. తమకు విశదమే.

**కొత్త మనిషి** : మరివొకరితో అయితే కల్పించి మారు పేరు చెప్పుదును. తమచోట అబద్ధం ఆడజాలనండి.

**గిరీ** : భోజరాజు ముఖం చూస్తే కవిత్వం పుట్టినట్టు, తమ ముఖం చూస్తే యెట్టి వాడికైనా నిజవేఁ నోటంట వొస్తుందండి.

**కొత్త** : ఒకానొకరికి తప్ప.

**గిరీ** : "సచేమాన్ ఈజ్ టుబి పిటీడ్" అనగా అట్టి మనిషి వుంటే ఆ మనిషి యెడల మనం కనికరం కలుగజేసుకోవాలి – అంతే.

**సౌజ** : అసత్యవఁనేది యెవరితోనూ ఆడకూడదు.

**కొత్త** : మంచివారి యెడల మంచిగానూ, చెడ్డవారి యెడల చెడ్డగానూ, వుండమని మా తల్లిగారు ఉపదేశం చేశారు. అంచేత తమతో అబద్ధవాఁడనన్నాను.

సౌజ : మీ తల్లిగారు పూజ్యులేగాని, వారి ఉపదేశంలో మీరు మొదటి సగమే అవలంబించి కడం సగమూ మార్చి, మనం చెడ్డవారని అనుకునే వారి యెడల కూడా మంచిగా వుండుటకు ప్రయత్నము చేస్తే, దయాపరిపూర్ణుడైన భగవంతుడు సృజించిన యీ లోకము మీకు మరింత యింపుగా కనపడుతుంది. మీకూ మీ పరిచయం కలిగిన వారికీ మరింత సౌఖ్యము కలుగుతుంది. కాక మంచి చెడ్డలు ఏర్పర్చగలిగిన వాడు యెవడు? మంచిలోనూ చెడ్డ వుంటుంది. చెడ్డలోనూ మంచి వుంటుంది.

గిరీశ : యేమి విలవైన మాటలు! ఒక చెడ్డ మనిషి వున్నాడనుకోండి. ఒకణ్ణి అనడవెందుకు? నేనే ఆ చెడ్డవాణ్ణి అనుకోండి. అట్టి చెడ్డవాడనైన నా యెడల మంచిగా వుండడమే యోగ్యత. తమవంటి మంచి వారి యెడల అంతా మంచిగానే వుంటారు. "అపకారికి నుపకారము నెపమెన్నక చేయువాడు నేర్పరి సుమతీ" అని కవి అన్నమాట పర్‌ఫెక్ట్ జెమ్ కాదా అండి!

సౌజ : నా భావం మా బాగా ఉపన్యశించారు.

కొత్త : (సౌజన్యారావు పంతులుతో) తమ వాక్యం గురూపదేశంగా భావించి, యిటుమీదట చెడ్డవారి యెడల కూడా మంచిగా వుండడముకు ప్రయత్నిస్తాను. తమ శిష్యరికం లభించడం నాకు పెన్నిధి. సత్పురుషుల దర్శనం సద్యోఫలం కలది. తాము మంచిలో చెడ్డ వుంటుందని శలవిస్తిరి. పరిపూర్ణమైన తమ మంచిలో చెడ్డలేదని వింటున్నాను.

సౌజ : పరిపూర్ణమైన మంచి ఒక్క భగవంతుడియందే కలదు. నా చెడ్డలోకవేఁవెఁరుగును?

గిరీ : మిషనరీ ఒరిజినల్ సిన్ అంటాడండి. మన వాళ్ళు దుష్కర్మ అంటారు. దాంతస్సాగొయ్యా (బెగ్ యువర్ పార్డన్) ఆ ఒరిజినల్ సిన్, లేక కర్మ, అనేది యెంత మంచివాడినైనా, యెంత కట్టుదిట్టవైఁన వాడినైనా రెక్క పట్టుకుని తప్పు తోవలోకి లాగుతుందండి. తమకు విశదము కానిది యేమున్నది?

సౌజ : "బలవానింద్రియగ్రామో విద్వాంసమపికర్షతి" అని గీత చెబుతూంది. యెవడి చెడ్డ వాడు దాచుకుని, మంచినే పైకి కనపర్చుతాడు.

కొత్త : ఒకానొకరు లేని మంచిని కూడా వున్నట్టు ప్రచురపరిచి లోకాన్ని భ్రమింపచేస్తారు.

సౌజ : సత్యం. అందుచేతనే మంచి చెడ్డలు మనసే యెరగవలెగాని లోకమేవెఁరుగును అని అన్నాను.

కొత్త : నటన వల్ల కొద్ది కాలవేఁ లోకానికి కళ్లు కప్పవచ్చును గాని, నిడివి మీద బంగారాన్నీ, యిత్తడినీ లోకం యేర్చేస్తుందండి (గిరీశంతో) యేమంటారు?

గిరీశ : పంతులు గారికి నిద్రభంగవౌఁతుంది. మీరు వచ్చిన పనేదో -

కొత్త : (సౌజన్యారావు పంతులుతో) స్వాభావికంగా మంచికి లోకం గుడ్డి; చెడ్డ వెతకడానికి చారెడు కళ్లు; గనక, చూస్చూసి, లోకం ఈయన మంచివారు, అని నిర్ధారణ చేసిన తరవాత, వారు మంచివారు కాక తీరదండి - తమవంటి మంచివారు వలవేస్తే యెక్కడా కనపడడం కష్టం అండి. గనక తమ దర్శనం నాకు కావడం వల్ల యీరోజు, నా జన్మానికల్లా సుదినంగా భావించి సంతోషిస్తున్నాను.

గిరీ : సందేహవేఁవిఁటి!

సౌజ : మంచిగా వుందావఁని ప్రయత్నిస్తున్నాను. అంతకన్న నా యందు యోగ్యత యేమీలేదు. మీరు వచ్చిన పని చెప్పారు కారు.

గిరీశ : నేను కనుక్కుని తమతో ఉదయం మనవి చేదునా?

సౌజ : జరూరు పనిమీద వచ్చినవారూ, పేరు చెప్పని వారూ, మీతో వారికార్యం చెబుతారా? మీది యెంత సత్య కాలం?

గిరీశ : వారికి నేనేమైనా సాయం చెయడానికి అవకాశం వుంటుందేమో అనీ, తమకు నిద్రవేళైందనీ, మనవి చేశాను.

కొత్త : గిరీశంగారు లోకోపకారపరులు.

సౌజ : మీకు కృత పరిచితులా?

కొత్త : వారిని యెరగని వారెవరండి?

గిరీశ : వారు నాయందు వుండే దయచేత అలా శలవిస్తున్నారు గాని, నన్ను అంతా యెరగడానికి నేనే పాటి వాణ్ణండి. అయినా తరుచుగా లెక్చర్లు యిస్తూ వుండడం చాత, వీరివంటి సత్పురుషులు నన్ను యెరిగివుండడం కద్దు; సత్కరించడం కద్దు. వీరిని కూడా నేను చూచివుందును. అందుచేతనే వీరు కనపడగానే, యెవరు చెప్మా చూచినట్టుందీ, అని! కలవిలపడ్డాను. వారు కూడా ప్రచ్ఛన్నులై వుందామని నిశ్చయించుకున్నారు గనక, నేను జ్ఞాపకం తెచ్చుకోడానికి ప్రయత్నం చెయ్యను; నేను పోయి పరుంటాను. తాము ఉభయులు మాట్లాడుకోవొచ్చును.

సౌజ : ఆలాగే చెయ్యండి.

గిరీశ : (సౌజన్యారావు పంతులుతో) నమస్కారం. (కొత్తమనిషితో) మీరు బ్రాహ్మలా?

కొత్త : కాను.

**గిరీశ** : (కొత్త మనిషితో) అయితే, దాసోహం ! – టు ది అన్సోన్! (నిష్క్రమించుతూ గుమ్మము దగ్గరకు వెళ్లి తిరిగి చూసి కొత్తమనిషిని బతిమాలుకున్నట్లు అభినయించి, వెళ్లును.)

**సౌజ** : గిరీశం గారు కవి – మహా యోగ్యవైఁన చిన్నవాడు.

**కొత్త మనిషి** : వితంతువులను పెళ్లాడడం, యాంటీనాచీ కూడా మంచికి ఆవశ్యకవేఁనా అండి?

**సౌజ** : వితంతువులను, యిష్టమైతే పెళ్లాడవొచ్చును. లేకుంటే మానవొచ్చును. మంచితో దానికి పనిలేదు. గాని వేశ్యా సంసర్గ కలవాడు యెన్నడూ మంచివాడు కానేరడు.

**కొత్త మనిషి** : అంతేనా అండి, లేక వేశ్యను చూడరాదు; వేశ్యతో మాటాడరాదు; వేశ్య పాట వినరాదు; అని నిర్ణయం కూడా వున్నదా అండి?

**సౌజ** : అలాంటి నిర్ణయం వుంటే మరీ మంచిది.

**కొత్త మనిషి** : తమరు యాంటినాచ్ అనుకుంటాను.

**సౌజ** : ఔను.

**కొత్త మనిషి** : (చిరునవ్వుతో) గిరీశంగారూ యాంటీనాచే కదా అండి?

**సౌజ** : మీకు తెలియదా? ఆయన యాంటినాచికి గురువు.

**కొత్త మనిషి** : ఆయన నాకు కూడా గురువులేనండి.

**సౌజ** : అలాగనా? నాకు చాలా సంతోషం.

**కొత్త మనిషి** : యీ విషయంలో చాలా కాలవాఁయి నాకు ఒక్క సందేహం వుండిపోయింది; క్షమిస్తే మనవి చేస్తాను.

**సౌజ** : చెప్పండీ – తప్పేమి?

**కొత్త మనిషి** : వేశ్యలను పాటకు పిలవకపోతే, వాళ్లు బతకడం యెలాగండి?

**సౌజ** : పెళ్లి చేసుకుంటే సరి.

**కొత్త మనిషి** : గిరీశంగారి లాంటి వారిని అనా తమ అభిప్రాయం?

**సౌజ** : యేమిమాట అన్నారు! రేపో నేడో ఆయ్న ఒక పవిత్రమైన వింతువును పెళ్లికానై యున్నారు గదా, వేశ్యనా పెళ్లాడుతారు?

**కొత్త మనిషి** : జపాన్ దేశంలో గెయిషాలని వేశ్యలు వున్నారనీ, వాళ్లని గొప్ప గొప్పవారు కూడా పెళ్లాడతారనీ యీ గిరీశం గారే కాబోలు చెప్పగా విన్నాను. జపాన్ దేశం గొప్పదేశం అని అంటారండి?

**సౌజ** : ఔను గాని, గొప్పదేశంలో వున్న చెడ్డనే మనం అవలంబించాలా? గిరీశం గారు అట్టి అపవిత్రమైన పనికి ఇయ్యకొనరు.

**కొత్త మనిషి** : అయితే పెళ్లి చేసుకోగోరిన వేశ్యలకు కోరతగిన వరులు దొరకడం యెలాగండి? లేక యెట్టి వారైనా సరే అని తమ అభిప్రాయమా అండి?

**సౌజ** : ఈ సంగతి యింకా నేను బాగా ఆలోచించ లేదు – వేశ్యలు విద్యలు నేర్చి, ఇతర వృత్తుల వల్ల సత్కాలక్షేపము చెయ్యరాదా?

**కొత్త మనిషి** : అట్లా చేస్తే, తమవంటి వారు వాళ్లను వివాహమౌదురా?

**సౌజ** : యేం ప్రశ్న? నేను యెన్నడూ వేశ్యను పెళ్లాడను, నా యెత్తు ధనం పోస్తే వేశ్యను ముట్టను.

**కొత్త మనిషి** : ప్రమాదం వల్ల వేశ్య శరీరం తమకు తగిలితే?

**సౌజ** : (నవ్వుతూ) తగిలిన శరీరం కోసేసుకుంటాను. చిత్రమైన ప్రశ్నలడుగుతున్నారు !

**కొత్త మనిషి** : వేశ్యజాతి చెడ్డ కావచ్చును. గాని తాము శలవిచ్చినట్టు చడ్డలో మంచి వుండకూడదా? మంచి యెక్కడనున్నా గ్రాహ్యం కాదా అండి?

**సౌజ** : మంచి యెక్కడనున్నా గ్రాహ్యమే. గాని మీరు వచ్చిన పని చెప్పారు కారు?

**కొత్త మనిషి** : నా పని మట్టుకు మిమ్మల్ని చూడడమే.

**సౌజ** : చూడడానికి నిశీధి వేళ రావలెనా?

**కొత్త మనిషి** : మీ పని మించిపోకూడదని అట్టి వేళ వచ్చాను.

**సౌజ** : మించిపోయే పనులేవీ నా పనులు లేవే?

**కొత్త మనిషి** : దురవస్థలో వున్న వారి పనులల్లా తమ స్వంత పనులు గానే యోచింతురని లోకుల వల్ల విన్నాను. మరేం లేదు, అవధాన్లు గారి కేసులో గట్టి సహాయం చెయ్యగలిగిన వారి నౌకరిని నేను యెరుగుదునండి.

**సౌజ** : అలాగైతే మిమ్మల్ని మా పాలిట దేవుణ్ణిగా భావిస్తాం.

**కొత్త మనిషి** : అంత మాట నాకు దక్కాలి గదా అండి?

**సౌజ** : యేమి అలాగ అంటున్నారు?

**కొత్త మనిషి** : మరేమీ లేదు. ఆ కార్య సాధనము ఒక వేశ్యవల్ల కావలశివున్నది. అదీ చిక్కు.

**సౌజ** : డబ్బు యిద్దాం.

**కొత్త మనిషి** : ఆ వేశ్య ద్రవ్యానికి సాధ్యురాలు కాదండి.

**సౌజ** : అయితే మరేమి కోరుతుంది?

**కొత్త మనిషి** : ఆమె కోరిక అసాధ్యవఁని తలుస్తానండి.

**సౌజ** : అయినా యేమిటో చెప్పండి.

**కొత్త మనిషి** : చెప్పితే మీకు ఆగ్రహం రావడమే కాని, కార్యం వుండదనుకుంటానండి.

**సౌజ** : తనను వుంచుకోమంటుందా యేమిటి! అది యెన్నడూ జరిగేపని కాదు.

**కొత్త మనిషి** : ఆ ముసలి బ్రాహ్మడి దురదృష్టం! మనవేఁం చెయగలవండి?

**సౌజ** : యెంత బుద్ధిహీనురాలు! అసందర్భమైన యిలాటి కోరిక కోరతగునా? మీరెలా మోసుకొచ్చారు యింత అసంభావితమైన మాట?

**కొత్త మనిషి** : వ్యవహార విషయములు మాట్లాడుతూన్నప్పుడు మంచైనా, చెడ్డైనా ఉన్న మాటలు నాలుగూ అనుకోవడం విధాయకం గదండి. ఆ మనిషి తలకితగని వెఱ్ఱికోరిక పెట్టుకుంది అనేమాట అన్నంతినే మనిషల్లా యెరగడా అండి?

**సౌజ** : నేను మన్మధుణ్ణనా నన్ను వలిచింది?

**కొత్త మనిషి** : మిక్కిలీ మంచివారని కాబోలు.

**సౌజ** : సానిదానికి మంచితో పని వుండదు. ఇది యేదో యెత్తై వుండాలి.

**కొత్త మనిషి** : మృచ్ఛకటిక చదివిందేమోనండి.

**సౌజ** : వసంతసేనలాంటి మనిషి వెఱ్ఱి కవీశ్వర్ల కల్పనలో వుండాలి గాని, లోకంలో వుండదు. యేదో యెత్తు. అందుకు సందేహం వుండదు – సాధనాంతరం లేదో?

**కొత్త మనిషి** : తమరు ప్రశ్నలు అడుగుతారు. విన్నమాట మనవి చేస్తే ఆగ్రహిస్తారు. యేం సాధనం?

**సౌజ** : శ్రీకృష్ణుడి అనుగ్రహం వల్ల ఆగ్రహమనే వస్తువను చంపుకోవడముకు సదా ప్రయత్నం చేస్తున్నాను. స్ఖాలిత్యం కనపర్చారు. కృతజ్ఞుడను, చెప్పవలసినది చెప్పండి.

**కొత్త మనిషి** : తమకు వుంచుకోవడం మనస్కరించకపోతే, తనను వివాహము కావచ్చునని కూడా ఆ మనిషి అభిప్రాయము.

**సౌజ** : మంచివారిని హేళన చెయ్యవలసినదని కూడా మీ తల్లి గారి ఉపదేశం కాబోలు?

**కొత్త మనిషి** : మీ శ్రీకృష్ణుని మీద ఆన – మీ యెడల నాకు అమాయకమైన భక్తి కలదు. తమరి యెడల తృణీకార భావము నా హృదయమందు యెన్నడూ పుట్టదు. నమ్మండి.

రాయబారి మోసుకువచ్చే మాటలకు రాయబారిని తప్పుపట్టడం ధర్మం కాదు. యివి జరిగే మాటలని నేను మనవి చెయ్యలేదు. వున్నమాట మనవి చేస్తే, వకీళ్లు గనక వేశ్యపెట్టిన చిక్కు, విప్పజాలకపోతారా అని మనవి చేశాను.

**సౌజ** : వేశ్యలకు వకీళ్లు సమదంతా అనా? (నవ్వి) నేను మట్టుకు వోడిపోయినానని వొప్పుగుంటున్నాను. యెగతాళీలో దించకండి– వేశ్య డబ్బొల్లకపోదు. ద్రవ్యం కోరమనండి, ఆయనైనా యిస్తారు, నేనైనా యిస్తాను.

**కొత్త మనిషి** : అందాకా యెందుకండి? తమదాకా అక్కరలేదు. ఆ బ్రాహ్మడికి ఉపకారార్థం నేనేయిస్తును. ఆ మనిషి ద్రవ్యానికి సాధ్యురాలు కాదని మనవి చేశాను; నమ్మరా?

**సౌజ** : అన్నట్టూ, మీరు గిరీశం గారి శిష్యులమంటిరికదా? మీరు యాంటినాచ్ కారా? అయితే, వేశ్యవల్ల యీ భోగట్టా యావత్తూ మీకు యెలా వొచ్చింది? యిదంతా యెగతాళా? కుట్రా?

**కొత్త మనిషి** : నమ్మని వారితో యేమి చెప్పను? యిది కుట్రా కాదు; యెగతాళీ కాదు. నేను అక్షరాలా యాంటీనాచ్‌నే. వివేకలేశం వున్నవారు యెవరు యాంటినాచ్ కారండి? గాని, విధికృతం చేత నాకు వేశ్యాసంసర్గ తప్పింది కాదు.

**సౌజ** : యేవిటో ఆ విధికృతం?

**కొత్త మనిషి** : ఇది! (కొత్త మనిషి నెత్తిని వున్న పాగా తీసి జుత్తును జారవిడచి; వెనకకు తిరిగి తొడుగుకున్న కోటు విడచి, కప్పుకున్న శాలువ వలెవాటుగా వేసికొని సౌజన్యారావు పంతులు వేపు తిరిగి) నా వూరూ పేరూ అడిగితిరి. వూరు విజయనగరం, పేరు మధురవాణి!

**సౌజ** : (మొదట ఆశ్చర్యమగ్నుడై, యోచనపైని కోపావేశము కలిగి నిలిచి) యేమి మోసము జరిగినది!

**మధు** : గురువుల ఉపదేశం గురువులే మరవ కూడదు. చెడ్డలో కూడా మంచి వుండవచ్చును. కాక మంచి చెడ్డలు యెంచేవారెవరు?

**సౌజ** : యేమి దగా!

**మధు** : నిర్మలమైన అంతఃకరణతో వస్తిని, నిజం దేముడెరగవలె. దగా అని తోచినది; యేమి చెయ్యగలను? వెళతాను.

**సౌజ** : శీఘ్రంగా వెళ్లవచ్చును.

(మధురవాణి పాగా కోటూ విడిచి గుమ్మము వరకు వెళ్లును.)

**సౌజ** : నిలు-నిలు - (మధురవాణి తిరిగి వచ్చి కొంచము యెడముగా యెదట నిలుచును.)

**సౌజ** : పాగా, కోటూ మరిచిపోయినావు.

**మధు** : అంతేనా? మనసే మరచిపోయినాను; కొదవేవింటి? (తిరిగి రెండడుగులు వెళ్లును.)

**సౌజ** : మాట!

**మధు** : (తిరిగిచూసి) యీ మాటు యేం మరిచానండి!

**సౌజ** : నువ్వు మరవలేదు, నేనే మరిచాను; లుబ్ధావధాన్లు గారి మాటేమిటి?

**మధు** : తమమంచి లోక ప్రసిద్ధమైనప్పటికీ, ఆయనయందు తమకు అట్టే అభిమానం భగవంతుడు పుట్టించలేదు.

**సౌజ** : ఆయనను కాపాడడముకు న్యాయమైన పని యేమి చెయ్యమన్నా చేస్తాను. అనేక సంవత్సరములాయ, వేశ్య అన్నది నా యింటికి రాలేదే? నేను వేశ్యతో యెన్నడూ మాట్లాడలేదే? ఈనాటికి వ్రతభంగమైనది గదా, అని అపారమైన విచారములో మునిగివున్నాను.

**మధు** : తమరు ప్రాజ్ఞులు ; వ్రతభంగమేది?

**సౌజ** : నిశిరాత్రివేళ పడకింటిలో వేశ్యను పెట్టుకొని మాట్లాడడం కన్న యింకాయేమి కావలెను?

**మధు** : తమరు నన్ను రప్పించలేదే? వేశ్యలు పార్టీలైతే, వకీళ్లు కేసులు పట్టరో?

**సౌజ** : పడతాం, పట్టం; యేమైనా నువ్వు పార్టీవైనా కావే?

**మధు** : కాను - గాని మీ పార్టీని కాపాడే మనిషిని నేను యెవతెనైతేనేమి-నను చూడకూడదా? అది అలా వుండగా వేశ్యలము దేవాలయములలో భగవంతుణ్ణి చూడడమునకు పోవచ్చును గదా? సత్పురుషులైన తమవంటి వారి దర్శనమునకు మాత్రం నిరోధమా?

**సౌజ** : "మంచివారు, మంచివారు" అని పలుమారు అంటూవుంటే, నాకు లజ్జగా వుంది. ఆ మాట మరి అనకు - చూడరావచ్చును గాని రాత్రివేళ పడకింట్లోనా?

**మధు** : వేశ్యనని వర్తమానం చేస్తే పగటివేళ చూతురో?

**సౌజ** : నా శత్రువులు యెవళ్లో నిన్ను నా దగ్గిరకు పంపారు (నఖ సిఖపర్యంతం నిదానించి) యెంతటివాళ్లైనా వుంటారు!

**మధు** : అలాగైతే తమమంచే తమకు శత్రువై వుండాలి. మీ కార్యం నిర్వహించి డబ్బు ఒల్లనప్పుడు కుట్రా కూహకం లేదని నమ్ముదురా?

సౌజ : అంత మంచి మనిషివి అయితే, పాపము ఆ బ్రాహ్మడికి ఉపకారం నీవు చెయ్యరాదా? మధ్య నాకు గండగత్తెరేమి?

మధు : నేను మంచిదాననని నమ్మగలరా?

సౌజ : ఆ బ్రాహ్మణ్ణి కాపాడితే నమ్మనా?

మధు : అయితే, ఒక తుని తగువు మనవి చేస్తాను.

సౌజ : అట్టే సేపు నువ్వు నా యెదట గానీ నిలిచివుంటే, నువ్వు యేతగువు తీరిస్తే ఆ తగువుకు వొప్పుదల అవుతానేమో అని భయవేఁస్తూంది.

మధు : (ముఖము పక్కకు తిప్పి) ఒక్క చిన్న ముద్దుకు కరువో?

సౌజ : అంతటితో కార్యం నిర్వహిస్తావా?

మధు : యేంజెయనూ, మరి?

సౌజ : నా వ్రతభంగం చెయ్యడవేఁనా నీ పట్టుదల?

మధు : అడుగు మెట్టుకు దిగానని మెప్పులేదు గదా? యిష్టం లేని పని యేల చేయించవలె? శలవు. (రెండు అడుగులు వెళ్లును)

సౌజ : ఆగు (మంచము మీద కూర్చుని – దుప్పటీ కప్పుకుని) కూచో.

మధు : కూచోను.

సౌజ : వెయ్యి రూపాయలిస్తాను. తీసుకుని బ్రాహ్మణ్ణి కాపాడు.

(మధురవాణి తిరిగీ వెళ్లబోవును.)

సౌజ : వెళ్లకు – నీకు ముద్దా కావాలి? యేం వెఱ్ఱి మనిషివి? యేమిలాభం?

మధు : నాకు తెలియదు.

సౌజ : తప్పదూ?

మధు : తప్పదనుకుంటాను.

సౌజ : అయితే విధిలేక వొప్పుకుంటున్నాను. చిత్రం! వెయ్యి రూపాయలకంటే వక ముద్దు యెక్కువ విలవా? సరే – నువ్వు చేసే సాయఁవేదో చెప్పు.

మధు : తెల్ల బియ్యం, పాటిమానికా – లుబ్ధావధాన్లు గారు వివాహవైఁన పిల్ల ఆడ పిల్లకాదు.

సౌజ : (ఆశ్చర్యముతో) యేమిటీ!

మధు : మరచితిని – అందుతో సంబంధించిన వారికి యెవరికిన్నీ హాని రాకుండా కాపాడతావఁని శలవిస్తేనే కాని పేర్లు చెప్పజాలను.

**సౌజ** : లేకుంటే చెప్పవా?

**మధు** : చెప్పను.

**సౌజ** : లుబ్ధావధాన్లుగారి వల్ల యెవరికిన్నీ బాధ లేకుండా కాస్తాను. అయనకు కాక ఇతరులు యెవరికైనా హాని చేసి వుంటే, నావశం కాదు.

**మధు** : చాలును. యిహ చెబుతాను. కరటక శాస్త్రుల్లు గారు వారి శిష్యుడికి ఆడవేషం వేశి పెళ్లిచేశారు.

**సౌజ** : కరటక శాస్త్రుల్లా గుంటూరు శాస్త్రుల్లు!

**మధు** : అవును. కొంచెం చిరిగెడ్డం అంట్టించుకున్నారు; అంతే భేదం –

**సౌజ** : ఔరా? అతగాడి దారుణం !

**మధు** : అతని వల్ల తప్పులేదండి ; అగ్నిహోత్రావధాన్లుగారి కూతురు ఆయన మేనకోడలు. ఆ పిల్లని లుబ్ధావధాన్లుగారికి యివ్వడానికి నిశ్చయమైన సంగతి తమకు విశదమే. ఆ సమ్మంధం తప్పించుటకు కరటక శాస్త్రుల్లు గారు యీ యెత్తు యెత్తారు. ఆయనకు మాత్రం హాని రానీకండి.

**సౌజ** : ఔరా? యేమి చిత్రము! మేలుకున్నానా నిద్రబోతున్నానా?

**మధు** : నా ఫీజు ఇచ్చి మరీ నిద్రపొండి.

**సౌజ** : బీదవాణ్ణి యిచ్చుకోలేనే?

**మధు** : నాకు లోకంలో ధనవంతా అదే అనుకున్నానే?

**సౌజ** : నీవు సొగసరివి. ముద్దు చేదని కాదు. వ్రత భంగం గదా అని దిగులు.

(ముద్దు పెట్టుకొనబోవును)

**మధు** : ఆగండి.

**సౌజ** : ఏమి?

**మధు** : నా వ్రతమో?

**సౌజ** : యేమిటది?

**మధు** : చెడని వారిని చెడగొట్టవద్దని మా తల్లి చెప్పింది.

**సౌజ** : చెప్పితే?

**మధు** : అందుచేత, మిమ్మల్ని ముద్దు పెట్టుకోనివ్వను.

**సౌజ** : కృతజ్ఞుడనై వున్నాను!

**మధు** : ఆ పుస్తకము నేను చూడవచ్చునా అండి?

**సౌజ** : చూడు.

(మధురవాణి పుస్తకము విప్పి చదువును.)

**మధు** : భగవద్గీతలు, యిది మంచివారు చదివే పుస్తకమా అండి?

**సౌజ** : యిది చెడ్డవారిని మంచివారినిగా చేశే పుస్తకం.

**మధు** : దానిలో యేముందండి?

**సౌజ** : అది చదివిన వారికల్లా విలవలేని గొప్ప స్నేహితుడొకడు దొరుకుతాడు.

**మధు** : యెవరండి ఆ స్నేహితులు?

**సౌజ** : శ్రీకృష్ణుడు.

**మధు** : శ్రీకృష్ణుడు సానిదానితో కూడా స్నేహం కడతాడా అండి?

**సౌజ** : శ్రీకృష్ణుడు తన్ను నమ్మినవారితో అల్లా స్నేహం కడతాడు. పరమాత్మకు జాతి భేదం లేదు.

**మధు** : శ్రీకృష్ణుడు ఆంటీనాచి కాడా అండి.

**సౌజ** : యేమి పెంకెవు!

**మధు** : అయితే ఈ పుస్తకం చదువుతాను. చదివి మంచిదానను అవుతాను.

**సౌజ** : కావలిస్తే ఆ పుస్తకం తీసుకువెళ్లు.

**మధు** : కృతార్థురాలను – శలవా?

**సౌజ** : (వెన్నుకుప్ప వేపు చూచి యోచించి) నువ్వు మంచిదానివి. యెవరో కాలుజారిన సత్పురుషుడి పిల్లవై వుంటావు. యీ వృత్తి మానలేవో? స్థితిలోపమా?

**మధు** : దైవానుగ్రహం వల్ల లోపం లేదు. నా వృత్తి యొక్క హైన్యత గుర్తెరుగుదును. సత్పురుషుల దయ సంప్రాప్తమైన తరవాత దుర్వృత్తి యేల వుంటుంది?

**సౌజ** : (భగవద్గీతా పుస్తకము మీద నున్న శ్రీకృష్ణుని విగ్రహమును వేలునజూపి) సత్పురుషుడనే నామము సార్థకముగాగల యీ సత్పురుషుణ్ణి నీకు యిచ్చాను. ఆయన స్నేహం బలమైనకొలదీ మా బోట్లను తలచవు.

**మధు** : అప్పటప్పట తమదర్శనం చేసుకోవచ్చునా?

**సౌజ** : (తటపటాయించును)

**మధు** : వృత్తి మానినా, మంచి -

**సౌజ** : అయితే రావచ్చును.

**మధు** : కృతార్థురాలను, (పుస్తకము వక్షమున ఆని చేతులు జోడించి) శలవు!

**సౌజ** : మరోమాట! (మధురవాణి ప్రశ్నార్థకముగా కనుబొమలెత్తి చూచును) నీకు గిరీశం గారి పరిచయం యెక్కడ?

**మధు** : క్షమించండి.

**సౌజ** : చెప్పవా?

**మధు** : తాము చెప్పక తీరదని ఆజ్ఞాపిస్తే దాటగలనా? పాపము ఆయనను బతకనియ్యండి.

**సౌజ** : అతడి బతుకు మాట ఆలోచించుతున్నావు. వీడు అవ్యక్తుడైతే, పాపము ఆ బుచ్చమ్మ బతుకు చెడుతుంది. అది ఆలోచించావు కావు.

**మధు** : (ఆలోచించి) అవును ఆయన నాకు కొంతకాలం యింగిలీషు చదువు చెప్పేవారు. కొంతకాలం వుంచుకున్నారు కూడాను.

**సౌజ** : యెన్నాళ్ల కిందట?

**మధు** : మొన్నమొన్నటి దాకా.

**సౌజ** : చిత్రం! ఒక్క నిమిషము ఆగు. (పైకి వెళ్లి గిరీశమును వెంటబెట్టుకుని వచ్చి) నెపోలియన్ ఆఫ్ యాంటి నాచ్ గారూ! యీమెను మీరు యెరుగుదురా?

**గిరీ** : కొంతకాలం కింద గిరీశం అనే ఫూలిష్ యంగ్ మేన్ వొకడు వుండేవాడు. మధురవాణి అనే ఆ బ్యూటిఫుల్ నాచిడెవిల్ ఒకతె వుండేది. వాడి దురదృష్టం వల్ల దాని వలలలో చిక్కి, మైమరచి అంధకారంలో పడి పోయిన మాట సత్యము. గురువుల ఉపదేశం కొంత కాలానికి జ్ఞప్తికి తెచ్చుకొని, ఆ అంధకారంలోంచి వెలువడి గురువుల పాదములు చేరుకుని గతం కలగా భావించి, మరిచి, మంచితోవలో పడ్డాడు. ఆ గిరీశవేఁ యీ గిరీశం – ఆ మధురవాణే యీ మధురవాణి! స్వర్గానికి ఒక్క చీడీ తరవాయిగా వున్న నన్ను నరకానికి లాగడానికి తిరిగీ యిక్కడ నా పురాకృతం వల్ల ఆవిర్భవించింది! ఐ టర్నడ్ ఆల్టుగెదరే న్యూలీఫ్– పాపంలో కాలుజారి, పశ్చాత్తాపపడి, రిఫార్మ్ అయినాను. నా వంటి సిన్నర్స్‌ని సహాయం చేసి మంచివాళ్లని చెయ్యడం తమ బిరుదు గాని, బ్రతుకు చెరచడం న్యాయంకాదు. ఐ క్రేవ్ యువర్ మెర్సీ!

**సౌజ** : యెన్నాళ్ళైంది చీకట్లోంచి వెలుతురులోకి వురికి?

**గిరీ** : (వూరకుండును)

**సౌజ** : (మధురవాణితో) నువు చెప్పగలవు.

**గిరీ** : యెన్నాళ్లైతేనేమండి? ట్రూరిపెంటెన్సు ట్వంటీ ఫోర్ అవర్సు చాలదా అండి?

**సౌజ** : ఔరా? నీలాంటి ఆషాఢభూతుల వల్ల నీ గురువుగారు యెంత సులభంగా దగా పడ తారూ? అరె, నన్ను కూడా భ్రమింపజేస్తివే! నిన్ను మరి చేరనివ్వవద్దనీ, బుచ్చమ్మను పూనాలో విడోజుహోముకు పంపమనీ, మీ గురువుగారి పేర టెల్లిగ్రాం యిస్తాను. ఆమె చదువుకుని ప్రాజ్ఞురాలై తన యిష్టము వచ్చినవారిని పెళ్లిచేసుకుంటారు. లేకుంటే మానుతారు. రిఫారము అయితివని గదా నీవుచెప్పితివి. నిజమైతే, కాలేజీలో ప్రవేశించి, పైపరిక్షలకు చదువుకో. నీ ప్రవర్తన బాగున్నంతవరకు ద్రవ్యసహాయం చేస్తాను. బుద్ధి తెచ్చుకుని బతుకు. మధురవాణిని డెవిలంటివే? నీవే డెవిల్. ఆమె నీ అయోగ్యత అయినా నొక్కి అడిగితే గాని చెప్పింది కాదు. వక సత్యకాలపు బ్రాహ్మడిని కాపాడడమే కాకుండా, దుర్మార్గుడవైన నీ చేతిలో పడకుండా బుచ్చమ్మను కాపాడింది. నాకు వక మహోపకారం కూడా చేసింది. గనుక, నా సంతోషమును తెలియజేయుటకు, యిదిగో ఆమెతో షేక్‌హాండ్ చేస్తున్నాను. (షేక్‌హాండ్ చేయును) నెపోలియన్! తక్షణం యింట్లోనుంచి పైకిపో!

(గది గుమ్మం దాటి)

**గిరీ** : డామిట్! కథ అడ్డంగా తిరిగింది!

(తెరదించవలెను)



# బిల్హణీయము

## మొదటియంకము - ఒకటవ స్థలము

### అనిహిల్లా పట్టణములో రాజు ఆస్థానము

(వైయాకరణుడు నారాయణభట్టును, బిల్హణుని

మిత్రుడగు తార్కికుడు, కేశవభట్టును ప్రవేశింతురు.)

**నారాయణభట్టు :** మహాభాష్యానికి ఇతని తండ్రి వ్రాశిన వ్యాఖ్యానం ప్రమాణంగా యెవరు వొప్పుతారండీ! ఆలాగైతే నా శిష్యులు వ్రాసిన వ్యాఖ్యానాలు కూడా ప్రమాణవేఁ! యేవఁటారు?

**కేశవభట్టు :** వాదానికి యుక్తి ప్రధానం గాని పుస్తకాలతో యేంపనండీ!

**నారా :** యుక్తిలో నీరస సారసాలు కనిపెట్టే దాతేదండీ? ప్రభువులు నూతన ప్రియులు, ఆశ్రయించుకున్న వాళ్ళను క్షూణత పరచడమూ, పరాయి వాణ్ణి నెత్తికెక్కించు కోవడమూ వారికి నైజగుణం.

**కేశ :** గొంగళీలో తింటూ వెంట్రుకలు లెక్కపెట్టాడట! యిప్పుడు క్షూణత మనకు కొత్తగా వొచ్చిందా యేమిటండి భోజరాజు కాలంనుంచీ కవిత్వం విలవ హెచ్చింది; శాస్త్రాలు అడుగంటాయి. నాలుగు శ్లోకం ముక్కలు అల్లుతారనే కదా రామశాస్త్రిని కృష్ణ స్వామిని రాజు యిప్పుడు మన అందరి నెత్తిమీదా కూచోబెట్టాడు.

**నారా :** వెధవ కవిత్వం! నా శిష్యులు చెబుతారు అంతకన్న మెరుగ్గాను, పరిశీలించేవాడే దండీ?

**కేశ :** గనక మనకు యిప్పుడు కొత్తగా వచ్చిన క్షూణత లేదని నా మతం. బిల్హణుడికీ, మీకూ స్నేహం కలుపుతాను రండి?

**నారా :** అయితే వాడి కాళ్ళు పట్టుకోమంటారా యేవిఁటి?

**కేశ :** ఏవీఁ, బిల్హణుడు, రామశాస్త్రీ కృష్ణస్వామీ పాటి పండితుడూ, కవీ, కాడనా మీ అభిప్రాయం?

నారా : ఆ పీనుగులకంటే యెవడైనా నయవేఁ అని నా అభిప్రాయం.

కేశ : నేను చెప్పవచ్చిన మాటా అదే. బిల్హణుడు మహాకవీ, ప్రతిభావంతుడున్నూ. అప్పుడే రామశాస్త్రుల్లుకీ కృష్ణస్వామికీ కొన మళ్లించాడు. అది మనకో గొప్ప లాభం కాదా?

నారా : ఔను గాని, మన కొన కూడా మళ్లించే ప్రయత్నం చేస్తున్నాడే!

కేశ : మనకు కొనంటూ వొకటి వుంటే కదూ మళ్లించడానికి? మీ, నా, అదృష్టాలు నాడే గిడస బారాయి. రాజు మన శాస్త్రాలు అక్కర చెయ్యడమే మానెను. మనం సభకు రాక పోయినా యేమైనారని తనుపే లేదు. మన పదవి సదక్షిణాకంగా ధారపోస్తే వొల్లడు బిల్హణుడు.

నారా : అవును, మన అవస్థ అలాగే వుంది.

కేశ : ఈపాటి భాగ్యానికి అతగాడితో వృథావాదం మన కెందుకూ? కలహం పెంచకండి. నిన్న మీరు ఉభయులూ వాదిస్తూ వున్న సమయంలో రాజు ఉదయమంత్రితో రాచకార్యాలు ప్రశంసించుచుండెను. కనిపెట్టితిరా?

నారా : ఆలాగనండీ! అయితె నావాదవఁంతా వృథాయే? అవును. రాజు మెచ్చుతాడన్న ఆశ చాలా కాలామాయి వొదులుకున్నాను, గాని, జినచంద్రుడయినా మెచ్చుకున్నాడా?

కేశ : స్తంభాన్ని జారబడి నిద్రపోయినాడు.

నారా : ఆసి! వీడి బొడ్డు పొక్కా! పాండిత్యం కురిపిస్తూంటే యలా నిద్రపోయినాడయ్యా?

కేశ : ఇక్కడికి సంతుష్టి అయిందా?

నారా : అయితే ముందు యేంజేదాం?

కేశ : ఇటుపైని వాదం మానీసి, బిల్హణుడు ఏమన్నా మెచ్చుకుందాం.

నారా : ఓడిపోయినావఁనుకుంటాడేమో?

కేశ : బిల్హణుడి యోగ్యత మీ రెరగరు. ఎదటివాడి సత్తువ యెన్నే ఔదార్యం, పండితుల్లోకల్లా అతనియందే కలదు. నిజమైన విద్వత్తుకు జోహారు చేస్తాడు. అతను వైరులకు పిడుగు, స్నేహితులకు చందనము.

నారా : అయితే నా పాండిత్యం విషయమై అతగాడి అభిప్రాయం యెట్టిదో కనుక్కున్నారా?

కేశ : దిగ్దంతులం, మన పాండిత్యం విషయమై ప్రాజ్ఞుడైన వాడికి మరో అభిప్రాయం యెలా కలుగుతుంది? ఆయన మనసులో మాట దాచే వ్యక్తి కాడు. రేపో నేడో ఆయన ముఖతః మీరే వింటారు. అదుగో మాధవశర్మ వస్తున్నాడు మొహం మంగలంలా వుంది.

(యామినీదేవికి విద్యాగురువు మాధవశర్మ ప్రవేశించును.)

**మాధవ:** రాజుకు మతిపోయింది.

**నారా** : యేవఁండోయి?

**మాధవ:** యామినీదేవికి బిల్హణుడిచేత, విద్య చెప్పిస్తాడష!

**నారా** : మరి మీరో?

**మాధ** : కొత్త నీరొచ్చి పాతనీరు కొట్టుకుపోయింది.

**నారా** : యేం విద్య చెప్పిస్తారో?

**మాధ** : యేం విద్యో నాకేం కావాలి! క్షుణతలో క్షుణత, అతగాడు చదువు చెబుతూవుంటే నేను కూడా వింటూ దగ్గర కూచోవాలష! "విపులాచ పృథ్వీ" అన్నాడు, మరో రాజు కాళ్ళు పట్టుకుంఛాను.

**కేశ** : బావా! తొందరపడకు. నీ జీతం నిలుపు కాలేదు గద?

**మాధ** : లేదు గాని పువ్వులమ్మిన వూళ్ళో కట్టెలమ్మవలశి వచ్చింది గద?

**కేశ** : రాజుల యిష్ఠాయిష్ఠాలు మనమా శాసించే వాళ్ళము? పండితుడన్న వాడికి, కాలు కాలిన పిల్లిలాగ దేశాలు తిరిగి కష్ఠజీవనం కల్పించుకోవడానికి బదులుగా, గొప్ప ఆస్థానమందు ఉపాధి కలగడం పెద్ద అదృష్టం కాదా? అది తన్నుకుపోవడం ఉచితం కాదు. మన రాజు రాజర్షి! యిట్టి రాజు యెన్ని రాజ్యాలు తిరిగినా మీకు దొరకదు.

**మాధ** : రాజర్షయితే యీలాటి ఘోరం ఆచరిస్తాడండీ ?

**కేశ** : ఘోరానికీ, అఘోరానికీ మీరయినా యామినీదేవికి కలకాలం విద్య చెప్పేది లేదు గద? రేపో నేడో ఆమెకు వివాహవైఁ విద్య కట్టడుతుంది. యీలోగా బిల్హణుడు నొల్లుకుపోయీది యేమీ లేదు.

**మాధ** : యెవడిదాకా వొస్తే గాని వాడికి తెలియదు.

**కేశ** : యెవడైనా కాకతీరని పనికి తలవంచక తీరదు. రాజుకు యెవడు మాన్యుడైతే మనకు వాడే రాజు గనక బిల్హణుణ్ణి మంచి చేసుకోవడమే నీతి.

**మాధ** : మానభంగానికి కారణభూతుడైన శత్రువును బతిమాలు కొమ్మన్నావు. మంచి నీతే!

**"రథకారో నిజాం భార్యాం**

**సజారాం శిరసా కరోత్"** అన్న న్యాయంగా వుంది నీ సలహా!

**కేశ** : మనిషి దైవసృష్ఠి, శత్రుమిత్రులు మనుష్యసృష్ఠి. "అయం బంధుః పరోవేతి గణనా లఘుచేతసామ్! పుంసా ముదార చిత్తానాం వసుధైవ కుటుంబకమ్"

మాధ : చాల్చాలు, నీ కుతర్కం చాలించు.

(కవి కృష్ణస్వామి ప్రవేశించును, మాధవశర్మ అతనికి యెదురుగా వెళ్ళి.)

మాధ : విన్నారా?

కృష్ణ : చూచాయగా.

మాధ : (నారాయణభట్టుతో) చూశారా, అప్పుడే వూరందరికీ తెలిసింది. (కృష్ణస్వామితో) ఆ వుత్తరాది వాడు మీకంటె పెద్ద కవిషండీ?

కృష్ణ : పెద్ద కేవుఁంది; అందరికంటే తాటిచెట్టు పెద్ద. కవిత్వం ఒక పాటిగా చెబుతాడు; గాని పండితుడు.

మాధ : పండితుడే కాగట్టండి! ఒకపాటి కవి కాదు మహాకవే అనండి. రాజపుత్రికలకు, తరతరాలనుంచి ఆస్థానం కనిపెట్టుకొని కాలం గడిపిన మీ, నా, బోటివారు విద్య చెప్పడం భావ్యం గాని, శీలం యెట్టిదో, సాంప్రదాయం యెట్టిదో, తెలియని దిక్కుమాలిన పరదేశిని అంతఃపురంలో ప్రవేశపెట్టడం ఉచితమేనా?

కృష్ణ : ఆ మాట అన్నారు, ఒప్పుకున్నాను.

మాధ : (మెల్లగా) మాట వరసకు అనుకుందాం. బిల్హణుడు జారుడైతే?

కృష్ణ : మీ పుట్టేం మునిగింది? రాజు అనుభవిస్తాడు.

మాధ : ఈలోగా యీ అవమానవఁంతా నేను అనుభవించాలి గదండీ!

కృష్ణ : మానావమానములు వకడు యిస్తేనా వస్తవి? రాజుటండీ బుద్ధి యొక్కా, విద్యయొక్కా విలువ కొల్చేవాడు? లేకుంటే, ఆ రామశాస్తుల్లు సొట్ట కవిత్వం మెచ్చుతాడు గదా, రాజు తెలివి యేమని చెప్పను!

మాధ : అయితే యిప్పుడు మనం యేం జేయడం, మీ సలహా.

కృష్ణ : సలహా కేవుఁంది? మాట్లాడక ఊరుకోవడవేఁ సలహా.

మాధ : యీ అప్రతిష్ఠ సహించి యెలా వూరుకోవడం? నాలుగు మాసములు శలవు పుచ్చుకుని తీర్థయాత్రలు వెళుదునా?

కృష్ణ : వెళ్ళండి.

మాధ : (మెల్లగా) ఆహవమల్ల మహారాజు పట్టపుదేవి తరుచు వర్తమానం చేస్తూన్నారు. వస్తే నాలుగు గ్రామాలు అగ్రహారంగా దయచేయిస్తావఁన్నారు.

కృష్ణ : అలాగైతే యింకా ఆలోచిస్తారేవిఁ?

(వైయాకరణులు జిన చంద్రుడును గోవింద శాస్త్రియును ప్రవేశింతురు.)

**మంజు** : యేది యిందాకటి పద్యం చదవండీ.

**కొండి** : (రాగవరసను చదువును)

"చ నను భవదీయ.........

(అలా రాగవరసని చదువుతూవుండగా వెనుక వైపు వచ్చి మంజువాణి శాస్తులు వీపు మీద తన్నును)

ఓస్నీ అమ్మాశిఖా....(అని తగ్గి).... ఆహా! మల్లి పువ్వుల గుత్తా? పట్టుకుచ్చా? మలయ మారుతమా? వీపు తాకినది?

**మంజు** : సానిదాని కాలు.

**కొండి** : కాదు! కాదు! మన్మధుని వాడి వాలు.

**మంజు** : ప్రాస కుదిరింది కాని, శాస్తుల్లు గారు! యీ తాపు మదనశాస్త్రంలో క్రియక్రింద పరిగణన మవుతుందా? భూసురోత్తములను తన్నిన పాపం క్రింద పరిగణన మవుతుందా.?

**కొండి** : పది రూపాయిలు పారేస్తే పుణ్యం కింద పరిణామం అవుతుంది.

**మంజు** : పాటు పడక పైసా రాదు.

**కొండి** : బ్రాహ్మడికల్లా సాపాటు వక్కటె పెద్దపాటు యేర్పాటు చేసి బ్రహ్మ పడేశాడు.

**మంజు** : అయితే పెందరాళే వెళ్ళి ఆపాటు పడండి.

**కొండి** : మంజువాణి! యెంత చదువుకున్నా మా వంటి వాళ్లం నీకు వక్క మాటకు సదుత్తరం చెప్పగలమా? బాపనాళ్ళని కనికరించి, ఒక డబ్బు సొమ్ము ఇవ్వాలి గాని.

**మంజు** : వేశ్యల ద్రవ్యం పాపిష్టిది. బేరం తెచ్చి రుసుం పుచ్చుకుంటే ప్రత్యువాయువుండదు.

**కొండి** : ఈ వూళ్ళో నానాటికి రసికత సన్నగిల్లుతూన్నది. "అంధునకు గౌరయవెన్నెల" అన్నట్టు ఈ వూళ్ళో మూర్ఖులకు నీరూపలావణ్య విలాస విశేషములు అగ్రాహ్యాములు. తోవంటపోయే పొన్నూరు వాళ్లను కాచి పట్టుకొవ్వాలి.

**మంజు** : ఈ కంసాలాడు యింటి యెదుట దుకాణం బెట్టుకొని యిక్కడికి వచ్చే వాళ్లనల్లా వాళకం కట్టుతూ వుంటాడు. వాడిని తెస్తే.......

(తెర దించవలెను.)

# ప్రథమాంకము

## (ద్వితీయ రంగము)

(కొండుభొట్లు యిల్లు – వీధి సావిడి)

(రామ్మూర్తి, వెంకన్న, గిరీశం ప్రవేశించును.)

**వెంక** : రాముడు! పరీక్షంటే ఏమిటిరా?

**రామ** : పరీక్షంటే యెగ్జామినేషన్.

**వెంక** : (పొడుం పీల్చును) యజ్ఞం నాకు తెలుసును. మేషం అంటే మేక, మేకపోతు వేస్తారా ఏమిషిరా?

**రామ** : ఫూలిష్! యజ్ఞం కాదూ. మేషం కాదు. శాస్త్రాల్లో ప్రశ్నలు అడుగుతారు.

**వెంక** : నీకు శాస్త్రము వచ్చును? తర్కమా? వ్యాకరణమా?

**రామ** : నథింగ్ ఆఫ్ ది కైండ్ (Nothing of the kind) జాగర్ఫీ ఒకటి.

**వెంక** : అనగా?

**రామ** : భూగోళ శాస్త్రం.

**వెంక** : దానిలో యేమిటుందిరా?

**రామ** : వెలగపండువలె గుండ్రంగా వుండే భూం మీద యేయే నదులు, సముద్రాలు, కొండలు వగయిరాలు యెక్కడవున్నాయో చెప్పుతుంది.

**వెంక** : భూమి గుండ్రంగా వుంది? అబద్ధం! అబద్ధం! నలు చదరంగా వుంది. దాన్ని, అష్ట దిగ్గజాలూ మోస్తున్నాయి.

**రామ** : నాన్‌స్సెన్సు (Nonsense) “కపిద్ధాకార భూగోళం” అని మనవాళ్లు కూడా అన్నారు. యేనుగులు మాట పాతమాట. అవి అన్నీ వెళ్ళిపోయినాయి.

**వెంక** : గుండ్రంగా వుంటే ఎవరు మోస్తున్నారు.

**రామ** : యెవ్వరూ మొయ్యలేదు. ఆకర్షణ శక్తి వల్ల భూగోళం అంతరాళంలో నిలిచియున్నది.

**వెంక** : అలా చెప్పు... అదొక కొత్త శక్తి పేరు చెప్పావు. యేదోవక దేవతలేన్ది యేదీ వుండదు. అయితే ఈ వెధవలు పశ్చిమసముద్రం చూశారు?

**రామ** : ఓ! దాన్లోకి! ఓబి. యెనిసి, లీనా, అను మూడు నదులు, ప్రవహించును.

**వెంక** : అబద్ధం, శుద్ధ అబద్ధం, హిమవత్పర్వతానికి వుత్తరం చూడ్డం. మనుష్యులు వెళ్లితే చచ్చిపోర్రా! ఇదా. దొంగముండా శాస్త్రం. ఇంకా యే శాస్త్రం చదువుకున్నావు.

రామ : హిష్టరీ.

వెంక : విస్తరా?

రామ : చెరిత్ర

వెంక : అనగా?

రామ : తెలియనివాడితో యేమి చెప్పను. వేదాలు యెప్పుడు రాశారో, రామాయణం, భారతం, యెప్పుడు పుట్టేయో అవి యెంత నిజమో, యెంత అబద్ధమో....

వెంక : వేదాలు రాశేరు? రామాయణం అబద్ధమా?

రామ : ఆ! కావలసినంత. రాముడు దేముడు కాడుట. మహారాజు, రావణాసురుడికి ఒక్కటే బుర్ర, విన్నారా?

వెంక : ఈ పాపపు మాటలు వినగూడదు.

(చెవులు మూసుకొని పారిపోవును.)

గిరీశం : అజ్ఞానం! అజ్ఞానం పోతే గాని మన దేశం బాగుపడదు.

రామ : మా వెంకడికి మెదడు లేదు.

గిరీశం : మీ తండ్రి తెలివి వున్న మూర్ఖుడు. భోగం వాళ్ల యింటికి వెళ్లి ఆశ్రయిస్తాడు. నీ పరువు తీసి వేస్తూన్నాడు. సమయము చూచి చీవాట్లు పెట్టాలి.

రామ : అతనికి తోచినట్టు అతను చేస్తాడు. మనకు తోచినట్లు మనం చేదాం.

గిరీశం : డామిట్ (Damit), ప్రాణమయ్నా యిచ్చెయ్యాలి గాని రిఫారం విషయమై నదురూ, బెదురూ వుండకూడదు. లేకుంటే మనదేశం బాగుపడేదెట్లు? మనకి బంగాళీ వాళ్లలాగ పరువు ప్రతిష్ఠ వచ్చేదెట్లు?

రామ : అయితే సమయం చూసి చీవాటు పెట్ట మంటారా?

గిరీశం : ఇంక ఆలోచిస్తావా? అదుగో మీ తండ్రి వస్తూన్నట్టుంది. నన్నెరగనట్టు నటించు. రహస్యం భేదించకుండా నటించాలి.

రామ : యెందు కేమిటండి?

గిరీశం : మీ తండ్రి అసాధ్యుడు. నిన్ను గురించి యెంతో విచారిస్తూన్నాను.

రామ : ఆయనతో పరిచయము చేశారా యేమిటి?

గిరీశం : చేశాను. నీకు చేస్తానన్న పిల్ల ముక్కుపచ్చ లారని పసిపిల్ల. రిఫార్మర్ (Reformer) అనేవాడు అలాంటి పిల్లని పెళ్ళాడితే (Society looks down upon him) సంఘం నిరసనగా అతన్ని చూస్తుంది.

**రామ** : అంచేతనే నేనూ సిగ్గుతో చచ్చిపోతున్నాను, తెగించి దేశాలంట పోదూనా అనిపిస్తూంది.

**గిరీశం** : నాతో యెన్నడు చెప్పకపోతివే?

**రామ** : యేమని చెప్పను. సిగ్గుచేత చెప్పలేదు.

**గిరీశం** : ఒకరి లోపాలికి మనం సిగ్గుపడనేల? చేతనయినంతవరకూ మళ్లిద్దాం. మళ్లకపోతే కనికరిద్దాం. సిగ్గుతోనూ, కోపంతోనూ పనిలేదు.

**రామ** : నామీద్దయ చేత మీరు అలా అంటారు. లోకంలో తలయెత్తుకు యెలా తిరగను.

(తెర దింపవలెను.)

## ప్రథమాంకము

## తృతీయ రంగము

(అక్కాబత్తుడి యింటి వీధి అరుగు)

(వెంకన్న, అక్కాబత్తుడు ప్రవేశించును)

**వెంక** : యేనుగులు దొబ్బేశాయండోయి.

**అక్కా** : యెవరియేనుగులు? విజయనగరం వారివా? బొబ్బిలివారివా?

**వెంక** : కాదండి, దిగ్గజాలు.

**అక్కా** : యెక్కడికి వెళ్ళిపోయినాయి?

**వెంక** : భూమి వెలగపండులా గుండ్రంగా వుందిష. అంచేత యేనుగులు మోత అక్కరలేదుష.

**అక్కా** : భూమి వెలగపండయితే యేనుగులు వెలగ పండు తినేస్తాయి కాబోలు?

**వెంక** : మా రాముడు చెప్పాడు.

**అక్కా** : ఇంకా ఏమి చెప్పాడు?

**వెంక** : వేదాలెవళ్లో రాశారుష, రాములువారు మనిషష, దేముడు కాదుష.

**అక్కా** : మీకు కొండిభొట్లు ఇంగ్లీషు చదువు చెప్పించాడు కాదని నాకు కించగా వుండేది. ఇంగ్లీషు చదువు కిదే ఫలితమయితే మరి విచారం లేదు. తురకలు మెడకి కత్తి మొనజేర్చి గొడ్డు మాంసం తినిపించే వారు. ఈ యింగ్లీషు వాళ్లు చదువులు పెట్టి మనవేళ్ళతో మనకళ్లే పొడుస్తున్నారు. అదిగో మీ బాబు వస్తున్నాడు పారిపో.

(యిద్దరు నిష్క్రమింతురు.)

# ప్రథమాంకము

## చతుర్థ రంగము

(కంసాలి దుకాణం)

(అక్కాభత్తుడు, కొండిభొట్లు ప్రవేశింతురు.)

**కొండి** : అక్కాభత్తుడు గారూ? దయలేదు గదా.

**అక్కా** : బ్రాహ్మణోత్తములు తమదయ మాకుండ వలెను గాని మా దయ యేమిచెరితార్థం?

**కొండి** : విశ్వకర్మలనగా సాధారుణులండీ. పురుష సూక్తంలో యేమి చెప్పాడో విన్నారా. "విశ్వకర్మణ...... పురుషుణ్ణీ" అనగా ఆపరమాత్ముడ్నే త్వష్ట అనే కంసాలి చేశాడుట.

**అక్కా** : అలా అయితే బ్రాహ్మల కన్న కంసాల్లు యెక్కువే గదా?

**కొండి** : సందేహమేమిటండి. అందుచేతనే కంసాల్లు బ్రాహ్మలకి దండం పెట్టరు. వక్కహక్కు మాత్రం బ్రాహ్మణులకు వుండుకున్నది. కంసాల్లకి గాని యితర వర్ణాలకి గాని లేదు.

**అక్కా** : అది యెషువంటిదండి?

**కొండి** : గొప్ప చెప్పుకోవలసినది కాదు. అది యేమిటంటే "ప్రతి గ్రహణం" తెలిగిస్తే, ముష్టి యెత్తుకోవడమన్న మాట.

**అక్కా** : గడియకపోతే అది అందిరికీ వున్న హక్కే.

**కొండి** : గడిచినా బ్రాహ్మడ్కి తప్పదు. నూరుకోట్ల రాజ్యాలేలే శ్రీమంతుడ్కి తప్పింది కాదు.

**అక్కా** : అది యెలాగేమిటి.

**కొండి** : చిత్తగించారా? అహల్యాబాయి అని హోల్కారు మహారాజులుంగారి భార్య వుండేవారు. ఆవిడకి కోట్లతో ధనమువుండేది. ఆ మహారాణీ బహుదొడ్డ పుణ్య కార్యాలు చేశారు. కాశీలో ఒక ఘట్టం కట్టించారు. సత్తరువు వేశారు. చిత్తగించారా! ఒకనాడు శ్రీమంతుల వారికి ద్రవ్యం కావలశివచ్చినది. అహల్యా బాయి గారిని దోచుదామని వెళ్ళేసరికి ఆ మాట తెలిసి అహల్యాబాయి గారు యేం చేశారంటె ధనమంతా కుప్పపోసి స్నానం చేసి, పట్టు వస్త్రాలు ధరించి తులసిదళం జారీ చేత్తోపట్టుకొని శ్రీమంతులు రాగానే "మహారాజా! దోచడానికి యేమి అవసరముంది. మీరు బ్రాహ్మణ మహారాజులు. ఈ తులసిదళం రెండు నీళ్ళ చుక్కలుతోటి నా యావత్తు ధనం పరిగ్రహించవలసినది. యింత పాత్రతయిన దానం యెలా లభిస్తుంది" అని ఆ మహారాణి అన్నారుట.

**అక్కా** : సరేకాని అపాత్ర దానంవల్ల దోషం లేదా?

**కొండి** : ఈ కలియుగంలో పాత్రాపాత్ర లెంచడానికి అవకాశమేది. అంతా పాపభూయిష్టమయి యున్నది. "బ్రాహ్మణబీజాయి తేనమః" అన్నాడు, గనుక బ్రాహ్మణ బీజానికి పుట్టితే చాలును.

**అక్కా** : అదైనా నిశ్చయము కద్దా?

**కొండి** : లోకం అంతా నమ్మకముతో వుంది. నమ్మకం లేకుంటే అడుగుతీసి అడుగు పెట్టడాన్కి వీలు లేదు. నమ్మియెన్నో వెండి, బంగారాలు లోకులు తమకి స్తున్నారు కారూ? అసాక్షికం లేదంటే యేమిటి చెయ్యడం "నమ్మిచెడిన వారు లేరు. నమ్మక చెడిపోతే చెడిపోయారు" అన్నాడు.

**అక్కా** : శాస్త్రాలు వదిలి తంబళి పదాల్లోకి వొచ్చారూ?

**కొండి** : భారతంలో యేమన్నాడు "లోకజ్ఞున్" అన్నాడు. అంచేత లోకంలో వేదం మొదలుకొని తంబళి పదాల వరకూ యావత్తుహంశములు తెలిస్తేగాని పండితుడు కానేరడు. ఇదిగో శాస్త్రంలో ముక్క మనవి చేసుకొంటాను. "కంసాలి" అనగా 'కంసారి' "రలయోరభేదః" అన్నాడు. గనుక కంసాలి శబ్దార్థం సాక్షాత్తు శ్రీకృష్ణమూర్తి వారని సిద్ధాంతం.

**అక్కా** : నేను కృష్ణమూర్తిని అయితే సత్యభామని యెక్కడయ్ని ఆలోచించారా లేదా?

**కొండి** : అదే నేనూ మనవి చెయ్యాలనుకుంటాను. సత్యభామ కోసం యెక్కడికైనా వెళ్లాలా, యేమిటి? తమ యింటి యెదుటనే కాచివేచి యున్నది. మంజువాణి – బంగారు బంతి – దాని రూపురేఖ విలాసాలెషువంటి దనగా .......

**అక్కా** : అదంత నిజమే కాని, "మిక్కిలి రొక్కము లియ్యక చిక్కదు రా వారకాంత సిద్ధము సిద్ధము సుమతీ" అన్నాడు. నేను డబ్బెక్కడ తేను.

**కొండి** : శ్రీకృష్ణమూర్తి వారియందు సత్యభామకు వలెనే ఈ మంజువాణికిన్ని మీ యందు మనసు లగ్నమయి వున్నది.

**అక్కా** : అది చెప్పిందా, మీరు పోల్చారా?

**కొండి** : అది చెప్పనూ చెప్పింది. అయితే మాటల్లో మర్మము వుండవచ్చును కాని, కామ శాస్త్రంలో చెప్పిన హావభావచేష్టల్ని పట్టి పండితముండా కొడుకుని ఆపాటి పోల్చలేనా? "స్తంభః ప్రళయరోమాన్చ శ్వేదో వైవర్ణ వేపదుః...".

**అక్కా** : ఒక్కొక్కటి సెలవివ్వండి.

**కొండి** : తమర్ని స్మరించేటప్పుటికి "స్తంభః" స్తంభించిపోవడం.

**అక్కా** : అగ్నిస్తంభమా జలస్తంభమా?

**కొండి** : స్తంభమనగా నిశ్చేష్టగా నిలిచిపోవడము.

ప్రళయ : ఇంద్రియ వ్యాపారాలు అణగడం.

రోమాంచ : వెంద్రుకలు పులకరించడము.

స్వేదం : చమట పొయ్యిడం.

వైవర్ణ్యం : తెల్లపోవడము.

వేపదు : వణకడంము.

ఇవియన్నియు ప్రేమాతిశయ ద్యోతకాలు.

**అక్కా** : నా వ్యాఖ్యానం వింటారా? దొంగపని చేసి పట్టుబడి బొంకలేకపోతే తెల్లపోవడం, ఒక సరసుడుండగా, మరోసరసుడొస్తే స్తంభః అనగా ఒకడ్ని స్తంభం చాటున దాచడం. సీతాకాలములో సరసుల్లేకుండా వంటరిగా పడుకొంటే వేపదుః, రోమాంచ, అడిగినప్పుడు సరసుడు డబ్బు యియ్యకపోతే ప్రళయం, ఇవి హావభావచ్చేష్టలు.

**కొండి** : బంగారం గీటు గియ్యనిది నాణెం చెయ్యరు గదా. పండు రుచి చూడందీ తారీపు చెయ్యరు కదా. స్త్రీని అనుభవించి యెంచాలి. సుఖాలు అనుభవ వేద్యాలు గాని వర్ణింప వీలైనవి కావు.

**అక్కా** : సత్యభామని నేను తగులుకుంటే, యింట్లో యిల్లాల్ని యెవరికివప్పచెప్పను.

**కొండి** : తమ యిల్లాలు సాక్షాత్తూ రుక్మిణీదేవిలాగు కీర్తి ప్రతిష్టలు సంపాదించి వున్నారు. జ్ఞాపకం తెచ్చారు. వారి నోములుకి నా పౌరోహిత్యం మానివేశారు కదా.

**అక్కా** : మీరు కాలం అంతా లౌక్యంలో వెళ్లబుచ్చుచున్నారు. చిన్ననాడు చదువుకున్న ముక్కలు జ్ఞాపకం వున్నాయో లేవో.

**కొండి** : దానిముండా మోసిపోయెను. నిలుచున్నపట్లాన యజ్ఞాదిక్రతువులు చేయించమంటే చేయించి వేస్తాను కదా, నోములు చేతకాదూ?

**అక్కా** : తమరే శలవిచ్చారు గదా కంసాల్లు బ్రహ్మల కంటే అధికులని, అంచేతనే వీర సభా చార్యులు మా యిళ్ళలో పౌరోహిత్యం చేస్తున్నాడు.

**కొండి** : తమకియిదో మెహనత్తు కాదు కాని, మంజువాణి దగ్గర నుంచి చిన్న పని తీసు కొచ్చాను. చిత్తగించారా (పంచకొంగున కట్టబొడ్డు దగ్గర ముడిచిన బంగారపు కమల్ పఠామొలతాడు తీసి) యిది చెరిపి బంగారు గోవతాడు చేయించమంది.

**అక్కా** : (స్వగతం) యిది మాతంఁడ్రి, పంతులు తల్లికి తయారు చేస్సింది. యింత పనివాడితనం వున్న యీ పాలెలు చితగొట్టుటకు చేతులు యెలా వస్తాయి. ఇది పంతులు యింటి వద్దపోయినదని కలవిలపడి వూరుకున్నాం. కానియ్యి! ఇది పంతులు భార్యకు యిచ్చి వేస్తాను (ప్రకాశం) యెంతట్లో కావాలి.

**కొండి** : యెంతవేగం వీలైతే అంత వేగం కావాలి.

**అక్కా** : సరే (మొలతాడుపెట్టిలో పెట్టి తాళం వేసి) మీకుర్రవాడు వచ్చినట్టుంది. చదువెలాగు వుంది?

**కొండి** : ఈ సరికి బాగా వుంది. యిప్పుడు మెట్రికిలేషను పరీక్షకు కడతాడు. యిరవై రూపా యీలు కావాలి. తమవంటి వారి సహాయం వుంటే గాని గట్టు దాటదు.

**అక్కా** : (ఇరవయి రూపాయీలు పెట్టిలోనుంచి తీసి యిచ్చి) గుప్తదానము యిది. యెవరితో చెప్పకండి.

**కొండి** : (అక్కాభత్తుడి చెవిలో) చూశారు మంజువాణి, డబ్బు లక్ష్యంగాని, డబ్బు జాగ్రత్తగాని వున్న మనిషి కాదు. బంగారం కరగడంలో కొంచెం కొంచెం చెయ్యి తడి చేసుకో వచ్చును. మా వాడి వివాహం వొకటి తటస్థించింది. డబ్బుకి వ్యాపకపడుతున్నాను.

**అక్కా** : అలాగేకానియ్యండి. తూనిక మీరు శెలవిచ్చి నట్టు అందాదుగా చూసుకొందాం. ఈసరకు యిలాగే వుంచి నా దగ్గర బంగారం పెట్టి జమిలిగోవాతాడు తయారుచేస్తాను. కాని మీ కుర్రవాడు భూమిగుండ్రంగా వుందునని, రామాయణం అబద్ధమని అంటాడట. మీరు విన్నారా? అవునుగాని వెంకన్నకి యింగ్లీషెందుకు చెప్పించారు గారు?

**కొండి** : ఒక్కడికి చెప్పించడమే కృత్యాద్యవస్తగా వుంది. ఇద్దరికీ చెప్పించడం నా తరమా?

**అక్కా** : వెంకన్నకే ఇంగ్లీషు చెప్పించి, రామ్మూర్తికే కావ్యాలు యెందుకు చెప్పించారు కాదు?

**కొండి** : అక్కాభత్తుడు గారు! అన్నీ యక్షప్రశ్నలడుగు తారు. మనమా చేసీవాళ్ళం. జాతక యోగం వుండాలి.

**అక్కా** : యోగం యెలావుంటే అలా వుండనియ్యండి కాని వెధవ ముండనెవర్తినీ పెంల్లాడ కుండా వివాహం ముందు చెయ్యండి.

# కొండుభొట్టీయము

## ప్రథమాంకము

### పంచమరంగము

(కొండిభొట్లు యింటి పెరట్లో పెంకిటిసాల, పొయి మీద నీళ్ళకాగు. పొయ్యిలో నిప్పు లేదు. నీరుకాయ పంచ అంగవస్త్రం ధరించి కొండుభొట్లు, నీళ్ళ కాగులోకి తన జుత్తు వదుల్తాడు. గావంచాతో తడిజుత్తు తుడుచు కుంటూ అంటాడు.)

**కొండి** : తల వెంట్రుకలకి శీతోష్ణాలు తెలియకుండా చేసిన భగవంతుడి ప్రజ్ఞ ఏమని పొగడనూ. లేకపోతే సీతకాలంలో తెల్లవారగట్లే చన్నీళ్లలో మునగడానికి మనిషా, మానా?

(వీభూతిబురిక గూట్లోంచి తీసి బాలరామాయణం చదువుతూ నుదుటికి జెబ్బలకీ గుండెకీ రాసుకొంటాడు.)

కూజంతం... రామరామేతి..... మధురం మధు రాక్షరం। ఆరుహ్యాకవితాశా ఆఆఖాం। వందేవా....ల్మీకికోకిలం. యఃఐర్బ సతతం రామ....

చప్పుడౌతుంది. లేచాడు గాబోలు. (గట్టిగా)

చరితామృత సాగరం। అతృప్తస్తం మునిం వందే ప్రాచేత సమకల్మషం। గోష్పదీకృత వారాసిం మశకీకృతరాక్షసం

(రామమూర్తి ప్రవేశించును)

అబ్బీ మేష్టరుల్లేచార్రా?

**రామ్మూ**: మేష్టరుగారు యేటికి స్నానానికెళ్ళారు.

**కొండి** : యీచల్లో యేట్లో యలా స్నానం చాస్త్రార్రా? ఉద్దండ పిండంలా వున్నాడు.

**రామ్మూ**: మీకంటె యెవరైనా నయం.

**కొండి** : తండ్రిం తప్పట్టకూడదు; తెలిసిందా. మాతృదేవోభవ! పితృదేవోభవ! అని వేదం ఘోషిస్తూంది.

**రామ్మూ**: రాత్రి ఎక్కడకెళ్లారు.

**కొండి** : పెద్దల్ని పిన్నలు ప్రశ్నలడగకూడదు. యాభై యేళ్ళు దాటి తుదకి నీకా నేను సమాధానం చెప్పడం! నా బ్రతుకు అంతకొచ్చిందీ!

**అంజనానందనం దేవం జానకీ శోకనాశనం।**

**కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరం।**

**రామ్మూ:** ఆ శ్లోకాలు కట్టిబెట్టి, నేం జెప్పే మాట వినండి.
"ప్రాప్తేషోడశ వర్షాణి పుత్రంమిత్రవ దాచరేత్" అన్నాడు

**కొండి :** (చిన్న రాగి జారీ చేతపట్టుకొని నిల్చి)
నా శాస్త్రం ముక్క నామీదికే విసురుతున్నావ్? ఆ చెప్పే మాటేదో చెప్పు. యిటుపైని నువ్ తండ్రివి నేను కొడుకునినీ.

**రామ్మూ:** మీరు రాత్రి రామసానిపంచనో పంతులుగారి పంచనో తిని పరుంటారని మా గురువు గారితో అమ్మ చెప్పేసరికి నా వొళ్లు నీరు విడిచిపోయింది. మీరు సాందాని కొంపకి వెళ్లడవైనా మానాలీ, నేను మీ యింట్లో అడుగు పెట్టడమైన మానాలి.

**కొండి :** (నిర్ఘాంతపోయి) యేమంటున్నావ్?

**రామ్మూ:** మీ ప్రవర్తన బాగుంది కాదు.

**కొండి :** మతిపోయి మాట్లాడుతున్నావేమిటి? బ్రాందీత్రాగలేదు కద?

**రామ్మూ:** అదొక్కటీ తరువాయుండిపోయింది. మీరు సాని యింటికి వెళ్లడం నాకు యిష్టము లేదు.

**కొండి :** గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించిందని... నీ యిష్టం యెవరిక్కావాలి. ముండయేడుపుసంత. యేదొమ్మరి గుడిసెలూ దూరకపోతే యే అకార్యాకర్ణాలు చెయ్యక పోతే నీకు బోలిడేసి డబ్బు పోసి చదువెలా చెప్పిస్తున్నాననుకున్నావు.

**రామ్మూ:** సానికొంపలు తిరిగి తెచ్చే డబ్బు పెట్టి నాకు చదువు చెప్పించక్కరలేదు.

**కొండి :** అయితే మున్సబీదాకా చదుకోవూ? నీయధాన్న యిదివరకల్లా బోశ్ని డబ్బంతా బూడిదలో పోసిన పన్నీరే? ఇది వరకు తిన్నది మాత్రం దుష్ట డబ్బు కాదా యేమిటి? అది ముందు వెళ్లగక్కి, తరవాత శ్రీరంగ నీతులు చెప్పు.

**రామ్మూ:** మీరు మన యింటి పరువు తీసేస్తున్నారు.

**కొండి :** ఓరీ! నీ పరువుకు తండ్రినయినానుకాను, రాముడు దేవుడు కాదని, వెధవ ముండల్ని పెళ్ళి చేసుకో మనే కిరస్తానపు వెధవలకు సానింటికెళ్తే తప్పొచ్చిందీ. నీ పెళ్ళి కూడా సమీపించింది. కిరస్తానంలో కలసిపోవాలనుకుంటే యీలోగానే కలసిపో నీమేనమామ కూతురు కొంపెందుకు తీస్తావు.

**రామ్మూ:** కిరస్తానంలో యెంత మాత్రము కలియను నేను.

**కొండి :** ఈ తండ్రి మీద తిరుగుబాటంతా ఏమిటి.

**రామ్మూ**: నేను బ్రహ్మ సమాజంలో కలిశాను.

**కొండి** : బ్రహ్మ సమాజం ఏమిటి? విష్ణుమతం, శివమతం అని సృష్ట్యాది నుంచి విన్నాం కాని, బ్రహ్మకి పూజెక్కడేడిసింది. పోనియ్యి: యే సమాజమయినా యెవణ్ణో మనదేవుణ్ణే పట్టుకుని కిరస్తానంలో కలియకుండా వుంటే చాలు.

**రామ్మూ**: కిరస్తానమతం అసత్యమతం – దాల్లో బుద్ధిమంతుడెవడూ కలియడు.

**కొండి** : అదిగో! ఆ మాత్రం మంచిమాట అన్నావంటే నాకు పరమానందం (కాగలించుకొని) మున్సబీ పరీక్ష కోసం తెల్లవాళ్ల చదువు చదువుదు గాని, స్వేత ముఖులు కల్పించి మతం చెడగొట్టాలని వ్రాశిన సంగతులు ఒకటయ్నా నమ్మవద్దు. యివిగో యిరవై రూపాయ్యాలు తెచ్చాను. ఇవి కట్టి పరీక్షకు వెళ్లు.

**రామ్మూ**: (రూపాయీలు పుచ్చుకొని) సానింటికి వెళ్లడం మానేస్తే బాగుండును.

**కొండి** : మరో పరమార్థం మాట మనస్సులో వుంచు కోవాలి. విన్నారా? జాజిమొక్కకి పేడవగైరా అసుద్ధ పదార్థములు వేస్తే మొక్క పెరిగి, పరిమళ భరితములగు పూలు పూస్తుంది. చెట్టుకి పేడవేశామని పుష్పాలకేమయినా అపవిత్రత వచ్చిందా? అవి దేవుడి నెత్తిమీద పెడతాం. అషువలెనే యే మాయోపాయం చేతనైనా ద్రవ్యం సంపాదించి పెద్ద అవస్తలోనికి వచ్చిన తరువాత వుచితంగా ధర్మంచేస్తే పాపాలన్నీ దహించుకుపోతాయి. నీ పెల్లి అయిన తరువాత శివ పంచాక్షరీ మంత్రముపదేశం చేస్తాను. దాంతో ఐశ్వర్యము, ముక్తి కూడా లభిస్తాయి. పాపాలు యెగిరిపోతాయి.

**రామ్మూ**: (ఆత్మగతం)

కాష్టవాదం వల్ల కార్యం లేదు. యెంతయ్నా పెద్దవాడు తండ్రిగదా (ప్రకాశం) అలగే.

(ఇద్దరూ నిష్క్రమింతురు.)

# కొండుభొట్టీయము

## ద్వితీయాంకము

### ప్రథమ రంగము

(కొండిభొట్లు యింటి అరుగుమీద చాప పరుచుకొని వెంకన్న కూర్చుని చుట్ట చేతితో పట్టుకొనును.)

**వెంక** : రాముడు చుట్ట మా ఠీవిగా కాలుస్తాడు. ముక్కులోంచి పొగ తెప్పిస్తాడు. ఆ విద్య పట్టుపడింది కాదు. (అగ్గిపుల్ల వెలిగించి చుట్ట ముట్టించుచుండగా తలుపు తియ్య బడును) (చటుక్కున చుట్ట, అగ్గిపుల్ల పారవేశి, తటాలున ముసుగెత్తి పడుకొనును)

పార్వతమ్మ ప్రవేశించి గుమ్మము దగ్గర నిలువబడి; మెల్లగా "వెంకడూ! వెంకడూ" అని పిల్చును. వెంకన్న మారు పలకక నిద్రించినట్టు నటించును. పార్వతమ్మ అరికాలుగోకి తిరిగి నిమ్మళముగా "వెంకడూ, వెంకడూ! అని పిలుచును.

**వెంక** : (కాలు ముడుచుకొని) నిద్రపోతున్నానే.

**పార్వ** : దొంగనిద్ర పోతున్నావు! నువ్వు చుట్ట కాల్చడం సొంపు చూడలేదనుకున్నావా యేమిటి?

**వెంక** : చూశావూ?

**పార్వ** : చూశాను.

**వెంక** : బాబుతో చెబుతానంచావా యేమిషి? కాల్చడం మానేస్తానులే.

**పార్వ** : నే చెప్పినమాట వింటే చెప్పనులే గదా, చుట్టలు కొనడానికి రూపాయిలు కూడా యిస్తాను.

**వెంక** : చుట్టల శిఘాగోశెనుగాని, పది రూపాయలంటూ యిచ్చావంటె పొడుం దుకాణం పెట్టుకుంఛాను.

**పార్వ** : చెప్పినట్టు వింటె, పది కాదు యిరవై రూపాయిలు యిస్తాను.... ... యిప్పుడె యిమ్మంటావా యేమిటి ?

**వెంక** : యిచ్చావంటె నీకన్న పుణ్యాత్మురాలుందా?

**పార్వ** : అయితే లోపలికిరా... (అని గదిలోనికి వెళ్లును)

**వెంక** : (సావిడిలోనికి వచ్చి నిలుచుని పొడుం పీల్చి) పార్వతి బహుదొడ్డ మనిషి... బాబుకంటె నయం. నేను పొడుంకొట్టు పెట్టానంటె వర్ఘుల కొట్టుమీద వక్క దమ్మిడీ పొడుం చెల్లదు.

పార్వ : (ఒక చేతితో విస్తరంటలో అట్లున్నూ, రెండవ చేతిలో రూపాయిలున్నూ పట్టుకొచ్చి అట్లు కింద వుంచి) అట్లు తిను.

వెంక : కాళ్ళూ చేతులు కడుక్కుని తడిగావంచా కట్టుకుని తింఛాను.

పార్వ : (తనలో) వెఱ్ఱివెధవా. (పైకి) మీ బాబు కాళ్లు కడుక్కోంది వీధిలోంచి వొచ్చిన బట్టతో తింటాడు కాని. నీకు అంతకన్న ఆచారం బలువయి పోయిందీ? తిన్నగా తిను.

వెంక : కాళ్లూ చేతులు కడుక్కోవద్దంఛావా ఏమిషి.

పార్వ : కాళ్ళు కడుక్కుంటే చప్పుడవుతుంది.

వెంక : చప్పుడవుతే యేమిషి?

పార్వ : (తనలో) మొద్దు వెధవ! (పైకి) అంతా లేస్తారు.

వెంక : (గట్టిగా) ఓ! హో! దొంగతనంగా తెచ్చావు?

పార్వ : నిమ్మళంగా మాట్లాడు. చెప్పినట్టు వినకపోతే రూపాయిలివ్వను.

వెంక : అనాచారంగా తింటే యిస్తానంఛావా (తినను)

పార్వ : పది రూపాయిలిస్తే యేం చేస్తావు?

వెంక : పొగాకు కొని పొడుం కొట్టు పెడుతాను. నేను పొడుంకొట్టు పెట్టానంటే వాడి కొట్టు పడిపోతుంది.

పార్వ : గట్టిగా మాట్లాడకు.

వెంక : నా పొడుం యెంత బాగా వుంటుందనుకున్నావేమిటి, చిన్న పట్టు పీల్చిచూడు. (అని ఎడమ చేతిలో మొలనున్న పొడుంకాయ చూపించును)

పార్వ : (ముక్కుమీద వేలుంచి) ఆడవాళ్లు పొడుం పీలుస్తారుట్రా? (పొడుంకాయ మొల్లోంచి తీసి రూపాయలు మొలలో ముడుచును. ఆలాగు చేయుటలో తన శరీరము వెంకన్న పార్శ్వమునకు తగిలించును.)

వెంక : (తనలో) యిదేమిషోయి మీదపడుతూన్నది.

పార్వ : (అట్టుముక్క తానుకొరికి వెంకన్న నోటి కందించును.)

వెంక : యిదేమిటి, యెంగిలితినమంచావా యేమిషి.

పార్వ : నేచెప్పినట్టు వింటానన్నావే? (అని నోటిలో కుక్కును.)

వెంక : (అయిష్టముతో మింగుతూ) యెంగిలి తినడానికి పది రూపాయిలు యిచ్చావంషావు?

**పార్వ** : యింకా వుంది.

**వెంక** : యేమిటుంది?

**పార్వ** : యిదిగో (అని కౌగిలించుకొనును)

**వెంక** : వెధవముండా (అని విదిలించివేయును. పార్వతి నేలబడును, వెంకన్న పైకి పారిపోయి అరుగు మీద ముసుగు పెట్టికుని పడుకొనును. (తనలో) చచ్చానురోయి! యిదేమిటీ రంకుముండకి కాలం... రామ... రామ!

**పార్వ** : (చీపురు కట్ట తెచ్చి) గాడిద కొడుకా.. (అని కొట్టును)

(తెర దించవలెను)

# ద్వితీయాంకము

## ద్వితీయ రంగము

(అక్కాభత్తుడి యిల్లు)

**వెంక** : అక్కాబత్తుడూ – అక్కాబత్తుడూ (అని తలుపు కొట్టును)

**అక్కా** : యెవరది?

**వెంక** : వెంకన్న.

**అక్కా** : (తలుపు తీసి పైకి వచ్చి) యేమిటి వెంకన్న.

**వెంక** : కొంప ములిగింది.

**అక్కా** : ములగడానికి నీకు కొంప వుంటేనా? మీచ్చిబాబు గారి కొంప ములిగినట్టాయిన, శుభవార్త చెప్పు.

**వెంక** : కొంప ములిగింది.

**అక్కా** : యెందుకు తొందర – నింపాదిగా చెప్పు – దొంగలొచ్చారా? యిల్లంటుకుందా? యేదయ్నా సంతోషమే.

**వెంక** : చెప్పనా?

**అక్కా** : (అరుగుమీద కూర్చుని) చెప్పు.

**వెంక** : నేను చెప్పను.

**అక్కా** : చెప్పకపోతే యింట్లోకి పోయి వెచ్చగా పరుంటాను. (లేచి తలుపు వైపు పోవును.)

**వెంక** : (అక్కాబత్తుడి దుప్పటి పట్టుకులాగి) నేను చెప్పుతాను. చెప్పుతాను.

**అక్కా** : (తిరిగి కూర్చుని) అయితే చెప్పండి.

**వెంక** : యెవరితో చెప్పరు గద!

**అక్కా** : యేమిటా మహా రహస్యం

**వెంక** : చెప్పరు గద – యిదిగో పార్వతి రాత్రి పడుకుంటే, మెల్లిగా లేపి మయిల బట్టలతో అట్లు తినమంది.

**అక్కా** : యిదా రహశ్యం, మైలబట్టలతో ఎందుకు తిన్నావు?

**వెంక** : (తలగోక్కుంటూ) పొడుం కొట్టు పెట్టుకోవడాన్కి పదిరూపాయిలిస్తానంది.

**అక్కా** : మరేమి! నీరొట్టి నేతిలో పడ్డది.

**వెంక** : నెయ్యి లేదు, వొట్టి రొట్టిలే పెట్టింది.

**అక్కా** : కొంప ములగడం?

**వెంక** : తను కొరికిన యెంగిలి రొట్టిముక్క తినమన్నది.

**అక్కా** : (నవ్వి) తిన్నావ?

**వెంక** : తిన్నాను.

**అక్కా** : (నవ్వు పట్టలేక మిక్కిలిగా నవ్వుతూ) రూపాయి లిచ్చిందీ?

**వెంక** : యిచ్చింది.... యిచ్చి....

**అక్కా** : యిచ్చి యేంచేసింది.

**వెంక** : మీదపడి కాగలించుకుంది. వెధవముండా అని తోసేసి అరుగు మీద వచ్చి పడుకున్నాను. ఆయంతా చీపురుగట్ట పట్టుకు వచ్చి వీపు పెట్లగొట్టింది. దాంతో మీ దగ్గరకు పారిపోయిచ్చినాను.

**అక్కా** : (నవ్వు పట్టలేక దొర్లును)

**వెంక** : యెందుకు నవ్వుతారేమిషి?

**అక్కా** : నవ్వక యేడవమన్నారేమిటి?

**వెంక** : నేను కూడా నవ్వనా?

**అక్కా** : అడిగి నవ్వుతారాయేమిటి? నవ్వు.

**వెంక** : (నవ్వును)

అక్కా : అయితే యిప్పుడేంచేస్తావు.

వెంక : యేం చెయ్యమంటారు.

అక్కా : తిన్నగా వెళ్ళి అరుగుమీద పడుకో.

వెంక : చీపురుకట్ట ముతకది.

అక్కా : నిష్కారణం దెబ్బలు తిండం యెందుకు? పార్వతి చెప్పినట్టు చెయ్యి.

వెంక : వెధవతో సంగమం చెయ్యమంటావయ్యా.

అక్కా : నీ పింతండ్రికంటను నువ్వు గొప్పవాడివా యేమిటి? ఆయన యెన్నో పాడు దేవాలయాలు ప్రతిష్ట చేశాడు.

వెంక : మా తండ్రి మహా యోగ్యుడు. అయ్య పేరు చెడగొట్టుతానా.

అక్కా : హాశ్యానికన్నాను. బహుధర్మంగా ప్రవర్తించావు. నిన్ను చూచి చినబాబు బుద్ధి తెచ్చుకోవాలి. నీవు వేలలో యెన్నికైన మనిషివి. గాని రేపటి నుంచీ యెలా కాలక్షేపం చేస్తావు.

వెంక : మధోకరం.

అక్కా : నేస్తం! నేనువుండగా నీకా అవస్థ రానిస్తానా? ఆ పది రూపాయిలు యెం చేస్తావు?

వెంక : పార్వతికి పంపించేస్తాను.

అక్కా : నేను యంత మదుపు పడితే అంత మదుపు పెట్టుతాను. పొడుం కొట్టుపెట్టి నీ కాలక్షేపము పోగా మనకి లాభం కూడా వస్తుంది.

(యిద్దరూ నిష్క్రమింతురు.)

# కొండుభొట్టీయము

## ద్వితీయాంకము

### తృతీయ రంగము

(రామమూర్తి, చేతులు కట్టుబడి పార్వతమ్మ ప్రవేశించును)

రామ : యిదేమిటి పార్వతి.

పార్వతి : (కంట నీరొలుకుతూ వూరుకుండును.)

రామ : (దగ్గిరచేరి కూర్చుని) యే దుర్మార్గులు కట్టారు నీ చేతులు.

**పార్వతి** : (మాట్లాడదు.)

**రామ** : (వెంట్రుకలు సవరించి, ముద్దు పెట్టుకొని చేతులు కట్లువిప్పి) యెవరు నీకీ అవస్థకి కారణభూతులు.

**పార్వతి** : వెంకడు.

**రామ** : వెధవని యెముకలు విరగదంతాను.

(యిద్దరూ నిష్క్రమింతురు)

# కొండుభొట్టీయము

## ద్వితీయాంకము

### చతుర్థ రంగం

(పొడుం దుకాణం)

**వెంకన్న**: (పొడుం చేస్తూ ప్రవేశించును.)

**రామమూర్తి** : యెందుకురా వెంకా చేతులు కట్టావు?

**వెంకన్న**: యెప్పుడొచ్చావు రాముడూ? పరీక్ష ప్యాసయిందిరా?

**రామమూర్తి** : దున్నపోతు. అడిగిన మాటకు జవాబు చెప్పవేమి?

**వెంకన్న** :(పొడుంకఱ్ఱ పడవేసి నిర్ఘాంతపోయి జూచును) యెందుకురా రాముడు యీ కోపము.

**రామ** : పార్వతి చేతులు కట్టినందుకు ఇదిగో, పూనితీసి వో లెంపకాయ (అని కొట్టును)

**వెంక** : (బుగ్గ తడుముకుంటూ) యెవఱ్ఱా కట్టారు పార్వతి చేతులు.

**రామ** : నువ్వు కట్టావని చెప్పింది.

**వెంక** : నేను కట్టానని చెప్పిందా వెధవముండ.

**రామ** : వెధవముండని దాన్ని తూల్నాడితే మరో లెంపకాయ తీస్తాను.

**వెంక** : వెధవముండ కాకుంటే పునిస్త్రీ ముండనమంఛావురా! యీ మాటు లెంపకాయ తీస్తే ఆ మండ విరిచేస్తాను. విన్నావా.... ఒక దెబ్బకి మా రాముడివి కదా అని వూరుకున్నాను.

**రామ** : (పస్తాయించి) అయితే నువ్వు కట్టకపోతే దాని చేతులు ఎవరు కట్టారు ?

**వెంక** : అదేమో నాకేం తెల్సును. నెల రోజులాయి నేను యింటికే వెళ్ళలేదు.

**రామ** : (కూర్చుని ఆశ్చర్యముతో) యెంచేతరా? అబద్ధమాడిందా ... అబద్దమాడి వుండదు... నే వినడం తప్పు కావచ్చును... యెంచేతరా నెలరోజులాయి ఇంటికి వెళ్ళలేదు?

**వెంక** : యెంచేతనంటే... చెప్పకుమా పొడుం కొట్టు పెట్టుకున్నాను.

**రామ** : మా నాన్న గెంటేశాడా యేమిటి?

**వెంక** : మీ నాన్న నెలరోజులాయి వూళ్ళో లేడు.

**రామ** : నీ మానాన్న నువ్వు బతకాలని బుద్ధిపుట్టిందా యేమిటి?

**వెంక** : అవును రాముడు. పొడుం మా బాగా తయారుచేస్తాను. మీ తట్టు పొడుం యిలా వుంటుందిరా. ఒక పట్టు పీల్చు!

**రామ** : (పీల్చి) మా మజాగా వుందిరా. ఏం వేస్తావేమిటి?

**వెంక** : యే వేస్తానా? మకోబా పిక్క వేస్తాను... ఘుమఘుమలాడుతుంది. ఓ పెద్ద పొట్లం పుచ్చుకో... నీకు యెప్పుడు కావలిస్తే అప్పుడు పొట్లాము యిస్తాను.

**రామ** : వెంకన్నా! నీవు చాలా మంచివాడివిరా.

**వెంక** : నేను మంచివాణ్ణిరా?

**రామ** : అవును.

**వెంక** : మరి నన్నెందుకు కొట్టావు?

**రామ** : బుద్ధి తక్కువచేత !

**వెంక** : మరెప్పుడూ కొట్టవు గద?

**రామ** : కొట్టను.

**వెంక** : రాముడు ! నువ్వు మునసబు పనిచేస్తూ వుంటే నేను వచ్చి, "వొరె రాముడు!" అని పిలుస్తాను. కోప్పడవు గద.

**రామ** : కొప్పడను... యింటికెళ్ళిపోయిరా!

**వెంక** : అమ్మో... నేను రా[్రా.

**రామమూర్తి** : యిన్నాళ్ళు అన్నదమ్ముల్లా ఉండి, యిప్పుడు వేరుంటావురా?

**వెంకన్న**: చీపురుగట్ట ... (అని వీపు తడుము కొనును.)

**రామమూర్తి** : నీకేం [్రాలుబ్ధం. చీపురుగట్టతో స్వయం యిల్లు తుడుచుకోవడం... వంట చేసుకోవడం నాకేం మనస్కరించలేదు.

వెంకన్న : వొరే రాముడూ! వంట ఓ సొగసుగా చేస్తానూ.... చినబాబు దేశాంతరం వెళ్ళుతే నేనే గద వండుతాను. యీ రాత్రి వుల్లిపాయల పులుసు చేస్తాను వస్తావా?

రామమూర్తి : యెందుకు శ్రమ పడుతావు. నా మాట విని యింటికి వెళ్ళిపోయిరా.

వెంకన్న : యెంత డబ్బొస్తూందంటావంటె... రెయిలు వచ్చినప్పుడల్లా అక్కాబత్తుడు పొట్లాలు పంపిస్తాడు. ఒక రూపాయి పొట్లాలు చెల్లుతాయి. మా పొడుం వూరు వూళ్ల వాళ్లు కొనుక్కుపోతారు. వర్ఘులు కొట్టు యెత్తేశాడు. ఒక రహశ్యం విన్నావూ.

రామమూర్తి : ఆరహశ్యమేమిట్రో?

వెంకన్న :పొడుం షడక్షరని ఒక మహా మంత్రం వుంది. కంసాలి గురువు వీరనాభాచార్యులు దగ్గిర ఉపదేశమయి పునశ్చరణ చేశాను. శిద్ధయింది.

రామమూర్తి : నాకు చెప్పుతావురా ఆ మంత్రం.

వెంకన్న : చెప్పుతే తల పేలిపోతుందిష. ... గురువు చెప్పాడ్రా...

రామమూర్తి : మంత్రాలబద్ధం. శ్రమపడి పునశ్చరణ చెయ్యకు.

వెంకన్న : అదొక్కటేన్రా? నీ దగ్గిర దౌర్భాగ్యపు గుణం.... తెల్లవాడి మాట నమ్మేసి మన గ్రంథాలన్నీ అబద్ధం అంచావు... నాకు దాఖలా యిస్తేనే. స్వప్నంలో మంత్ర దేవత నానా భర్ణ భూషితురాలవు కుంచున్నూ బంగారపు పొడుం కర్రతో వీపు మీద వేశింది. దాంతో తెలివొచ్చింది. మరి ఆవేళ నిద్రపోలేదు. నిద్రపోతె ఫలం పోతుందిష.

రామమూర్తి : పూర్ ఫూల్ (poor fool).

# కొండుభొట్టీయము

## ద్వితీయాంకము

### పంచమ రంగము

(అక్కాబత్తుడు, వెంకన్న ప్రవేసించును.)

అక్కా : యేమిటి కబుర్లు?

వెంకన్న: మా రాముడు పరీక్ష ఫ్యేసు అయినాడు? యీ వేళె పట్నం నుంచి వచ్చి వో లెంపకాయ తీశాడు.

అక్కా : యెందుకేమిటి?

వెంక : పార్వతి చేతులు యెవడో కట్టాడుష.

**అక్కా** : యెవడో కట్టలేదు. వీధి దగ్గిర నిలుచుని తోవంటెపోయే వాళ్ళని చూస్తూవుంటే, మీ మేనత్తతో ఖాయిదా పెట్టమనినే చెప్పాను. అంచేత చేతులు కట్టింది.

**వెంక** : మా మేనత్త కడితే రాముడు నన్నెందుకు కొట్టాడు ?

**అక్కా** : నీ సత్యకాలము చూసి. రామమూర్తికి గూబకదలేశావు కాదు.

**వెంక** : రాముణ్ణి కొడుతానా! వాడ్కి మునసబీ అయితే "వొరే రాముడూ" అని పిలుస్తాను. వాడి పెళ్ళి చేస్తాను.

**అక్కా** : నువ్వే చేస్తావూ?

**వెంక** : (పొడుం పీల్చి) ఆ నేనే! మా చిన్నాన్న వచ్చి నన్ను కౌగలించుకు యెత్తి యింటికి తీసుకుపోయినాడు. యివాళనుంచి మా యింట్లోనే భోజనం. ష్టాంపు సంతకము చేసి వెయ్యి రూపాయిలు తెచ్చి మా మామకిచ్చాను.

**అక్కా** : యంత బుద్ధి తక్కువ పనిచేశావు. నాతో చెప్పందీ యెందుకు సంతకం జేశావు.

**వెంక** : రాముడికి పెళ్లి చెయ్యవొద్దంఛావా యేమిషి?

**అక్కా** : యంత పనిచేశావు! (ఆత్మగతం) దీనికేమిటీ ప్రతీకారం? (ప్రకాశముగా) రెయిలు వేళయింది పొట్లాలు పంపించు.

(యిద్దరూ నిష్క్రమింతురు.)

# కొండుభొట్టీయము

## ద్వితీయాంకము

### షష్ఠ్వరంగము

(కొండుభొట్లు ప్రవేశించును.)

(రెయిలు వచ్చును. ఫష్టు క్లాసు బండిలో, జరీ టోపీ, కన్ కాఫ్ ఫాయిదామా మొదలయ్ని పోషక్ వేసుకొని త్రివిక్రమరావు పంతులు కిటికీలో నుంచి తొంగిచూచి "అల్లీఖాన్– అల్లీఖాన్" అని నౌఖర్ని పిలుచును.)

**కొండు** : యే తాలూకా వారు వీరు – యే తాలుకా రాజా వారు వీరు (అని దగ్గర నున్న వార్ని అడుగును.)

**దగ్గిర వున్నవారు** : మాకు తెలియదు.

**కొండు** : (త్రివిక్రమరావు పంతులుగారి దగ్గరకు వెళ్ళి) ప్రభువువారు జాజి నగరం జమీందారు వారనుకుంటాను.

**త్రివిక్రమరావు** : అలాగే నన్ను చూసి అంతా అనుకుంటారు. మేము తుమ్మల పాలెం మొఖాసాదార్లం. మాకు భూములవల్ల పది పదహారు వేల్దాకా వస్తాయి.

**కొండు** : నా విష్ణుః పృథ్వీపతిః అన్నాడు. భూస్వాములు కాకపోతే ఆ రాజవర్చస్సు యెలా వస్తుంది. తమ నాయనగార్ని మా బాగా యెరుగుదును. నాయందు వారికి చాల దయ. పిల్ల జమీందార్లును - అఖండ అన్న ప్రదాతలును - ప్రభువు వారు యిక్కడ దిగుతారు? పైకి దయచేస్తార? యిక్కడ దిగేటట్టయితే మా యిల్లు విశాలంగా వుంచుంది. యే విధమయిన యిబ్బందిన్నీ వుండదు. యీ గ్రామం గొప్ప క్షేత్రం. పాండవ ప్రతిష్ట కోదండ రామస్వామి వారు స్వయం వ్యక్తం.

**త్రివి** : మేము విలాసార్థం దేశం చూదామని విజయం చేస్తున్నాం. మీ గ్రామంలో చోద్యాలేమయ్నా వుంటే రెండు పూటలు గడుప అభిప్రాయం కద్దు.

**కొండు** : చోద్యం అంటే పాతకోట కద్దు - సీత గుండం కద్దు. స్వామివారి ఉద్యానవనం కద్దు. అందులో మంటపము, దేవ నిర్మాణం దేవాలయం. నౌఖరీ చేసేవారు యాభయి యిళ్లు భోగం వాళ్లు వున్నారు. మంచి విద్యావంతులు - రూపవంతులున్నూ.

**త్రివి** : అయితే యిక్కడ దిగుతాం.

**కొండు** : యేమర్రా - ఓయి - కళాసులు.

**త్రివి** : సాయిబు వున్నాడు - మీరు శ్రమ పడకండి.

**కొండు** : పరాయిలపనా యేమిటి? తమ పనికి నా కభ్యంతరము లేదు.

**అల్లీఖాను** :(ప్రవేశించి) నీకీ పైకీ చలోజీ

**కొండు**: నేను సామాను అందిస్తాను. నువ్వు బహర్‌రఖో.

**అల్లీ** : నాకి బాత్ నకోజీ - నీకి సామాన్ మత్‌పకడో.

**కొండు** : అమ్మకి తక్లేఫ్ నహి (అని అటూ యిటూ సామానుతీస్తూ సీసా గళాసులు తన్ని వేసును)

**అల్లీ** : అరే బంచూత్ కామ్‌కియా.

**కొండు** : అపరాధం - అపరాధం

**త్రివి** : అవి మనవి కావండి - యెవడో దొరహొదిలి వెళ్ళి పోయినాడు. (అని వూరుకొమ్మని సాయిబుతో సంజ్ఞ చేయును)

**కొండు** : నేను పరాయివాణ్ణి కాను – నేను శాక్తేయుణ్ణిని. వామాచార తత్పరుణ్ణిన్ని – నా దగ్గిర ప్రభువు వారు అరమరవుంచవద్దు – రండి – ప్రభువు వారు దయ చెయ్యండి. సామాను వెనుక నుండి తీసుకువస్తారు.

**టిక్కెట్టు కలెక్టరు**: (ప్రవేశించి) కొండుభొట్లు చెయ్యి పట్టుకు లాగి – ఫష్టుక్లాసు బండీలోంచి దిగుతూ వుండగా నేను కళ్ళార చుశాను.

**కొండు** : అది యెవర్ని చూచి నేననుకున్నావో – వొంటి మీద చెయి వెయ్యకు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి – నీ మీద డేమేజీ దావా తెస్తాను. (కొండుభట్లు త్రివిక్రమ రావు గారి వేపు తిరిగి) చిత్తగించారా ప్రభువు వారు యీ మూర్ఖుడికి యింగ్లీషన నాలుగు చివాట్లు రానియ్యండి శ్రోత్రియుణ్ణైన బ్రాహ్మణ్ణి అమాంతముగా ముట్టు గుంటారు! తల పగిలిపోతుంది.

**టిక్కెట్టు** : యీ కబుర్లెందుకు పదండి ష్టేషన్ మేష్టరు దగ్గరకి.

**కొండు** : పద, నాకేం భయమనుకున్నావ యేమిటి? (త్రివిక్రమరావు పంతులుగారితో) యిప్పుడే వస్తాను. తాము వొక్క నిమిషం ప్రభువు వారు కుర్చీమీద కూర్చోండి. (రంగనాయకులు సెట్టి తొందరగా ప్రవేశించి కొండుభట్లు చెవిలో యేమో చెప్పును. కొండుభొట్లు ఆందోళన పడును. యిద్దరూ ప్రత్యేకము మాట్లాడడముకు ఒకే ప్రక్కకు వెళ్లిపోదురు.)

**టిక్కెట్టు క.** : యెక్కడికి వెళ్ళుతావు ష్టేషను మాష్టరు దగ్గరకి రా!

**శెట్టి** : ఏమిటీ అల్లరి

**కొండు** : నేను ఫష్టు క్లాసులో కూచున్నాని ప్రాణం పుచ్చుగుంటున్నాడు.

**శెట్టి** : యెళ్ళు! బాపనోళ్ళ మీదే నీ ఝూంకారమంతాను. యింద! సుట్ట ముక్కలకి (అని ఒక అణా చేతితో పెట్టును.)

**కొండు** : కొంప ములిగింది. హఠాత్తుగా చచ్చింది, ముండ! యింత వేగం ఛస్తుందని నే నెరుగను. లేకుంటే వూరు దాటుదునా? అయితే మంజువాణిని ఎవరయినా ఆదుకున్నార? ఆమెకు యెవరు భరాసా యిస్తూన్నారు... నువ్వు వెళ్ళావు కావు.

**శెట్టి** : అంతా రత్నాంగే. మరెవరు నేను వెళితే కఱ్ఱ పట్టుకుని వెంట తరుముతుంది.

**కొండు** : అయితే మనకేం చెయిజిక్కదు కాబోలు.

**శెట్టి** : సిక్కకేం! మీరు బేగెల్లి సుళువు చెయ్యండి.

**కొండు** : యేం సుళువు చెయ్యడం ? బుద్ధిమాల్ని వెధవని. నాలుగు రాళ్లకి ఆశపడి రామసానికి అంత జబ్బుగా వున్నప్పుడు వూరు విడిచివెళ్లేను.

**శెట్టి** : బుద్ధి తక్కువకు లెంపలాయించుకుని బేగెల్లి కథ యెలా వుందో కనిపెట్టండి.

**కొండు** : సరేగాని ప్రొద్దుపోతూంది. నువ్వు ముందు వెళ్ళి పెరటి గుమ్మం దగ్గిర వుండు. నే నిప్పుడే ఆ బోడి పంతులిని బసకు దిగబెట్టి వచ్చి కలుసుకుంటాను... (త్రివిక్రమరావు పంతులుగారి వద్దకు వెళ్ళి) ప్రభువు వారు దయచెయ్యాలి... యేదిరా గుఱ్ఱబ్బండీ. తీసుకురా జట్కా! ప్రభువువారి హోదాకి తగినది కాదు కాని – కుచేలుడింటికి శ్రీకృష్ణమూర్తి వారు విజయం చేసినట్టు అనుగ్రహించాలి... సాయిబూ, మా బసకి పోనీయి. ఈ సామాను పట్టించుకుని నౌకర్లతో కూడా నేను వస్తాను.

**వెంకటస్వామి** : నా గాజు సామానుకు వేరే బండి కావాలి.

**కొండు** : ఈ బండీ నీకు.

**అచ్చన్న**: నా లాంతరుకి కొవ్వొత్తులకి వేరే బండీ కావాలి.

**కొండు** : ఈ బండీ నీకు

**అల్లిఖాన్** : పంతులుగారి హుక్కాకీ, లేహం డబ్బాకీ వేరే బండీ కావాలి.

**కొండు** : ఈ బండి నీకు.

**అల్లీ**: పంతులుగారి పోషక్‌కు వేరేబండి కావాలి.

**కొండు** : దానికీ బండి.

**బుచ్చన్న**: వంట సామానుకో బండి కావాలి.

**పాపన్న**: ప్రత్యేకం నాకొకబండి మామూలు.

**కొండు** : మరిలేవు పొండి.

**పాప** : స్నేహితుణ్ణి, ఆశ్రితుణ్ణి –

**కొండు** : మరిలేవుబళ్లు, ఒక్కొక్కరే ఓ బండీ యెక్కి వాళ్లు వుడాయించారు.

**బుచ్చ** : అయితే యీవాళ పంతులుగారు పస్తు పడుకోవాలీ....

**కొండు** : నడిచి వెళ్ళిపోదాం – మరి బళ్లు దొరకవు.

**బుచ్చ** : సామానెవడు మోస్తాడు.

**కొండు** : కూలివాడు ఒకడూ కనపడ్డూ – మనమే మోసుకుపోవాలి.

**పాప** : మనం – తిమ్మనం – ఆ పప్పుడకదు. నేను ఒక్క వస్తువయినా పట్టుకోను.

**బుచ్చ** : దొబ్బితిని, భంగుతాగి పంతులుతో మజా ఉడాయించడాన్కి నువ్వున్ను, అరవచాకిరీ చెయ్యడాన్కి నేనూనా!

**పాప** : బ్రహ్మదేవుడు నీకలా రాశాడు. నాకిలా రాశాడు. కావలిస్తే బ్రహ్మదేవుడితో వెళ్ళి ఫిర్యాద్ చేసుకో. శాస్త్రుల్లు గారు యీ వూళ్లో డాన్సు కథ యేమయినా వున్నదా యేమిటి – లేకుంటే పంతులు పడడు.

**కొండు** : యీ దేవాలయం నౌఖర్లులో మంజువాణి సాక్షాత్తు రంభావతారం, వుంది.

**పాప** : యెవరైనా వుంచుకున్నారా?

**కొండు** : నరహరిరావని ఒక పంతులు వుంచుకున్నాడు.

**పాప** : అయితే మా పంతులికి అవకాశం యెలాగ?

**కొండు** : నేను కొంచెము వైద్యము కూడా చేస్తాను. పంతులుకి పైత్యాధికం పోవడానికి అప్పటప్పట విరోచన సాధనం చేస్తాను. దాంతో మూడు నాలుగు రోజులు మంజు వాణికి ఆట విడుపు కలుగుతూ వుంటుంది.

**బుచ్చన్న** : నువ్వు పాతర సామాను పట్టుకుంటే నేదినస్సు పట్టుకుంటాను.

**కొండు** : నా ప్రారబ్ధం కాలితే నా స్వగ్రామంలో మూటలు మొయ్యమంటావు.

**బుచ్చ** : అంత పౌరుషముంటే – వెదికి కూలాణ్ణి యెవడ్నయినా తీసుకురా.

(కొండుభట్లు నిష్క్రమించును.)

(తెర దించవలెను)

# కొండుభొట్టీయము

## ద్వితీయాంకము

### సప్తమ రంగము

(మంజువాణి పెరటి యింట్లోగది. ఆ గదిలో ఒక వైపు పెద్ద పాత పందిరి మంచము, ఒక మూలకు ఒక పాతబోను పెట్టె గోడవైపు రెండు పెద్ద జాడీలు, గోడలకు బల్లల పీటలు, వాటిపైని బొమ్మలు పాతపటాలు, పందిరి మంచము క్రింద యిత్తడి సామానులు.)

(చింపిరితల, కొంచము మాసినబట్టతో కనకవల్లి, దువ్వినజుత్తు, తగు మాత్రం అలంకారం, కావిరంగు చీరతో మంజువాణి, ఒక జాడీకి యీ ప్రక్కనొకరు, ఆ ప్రక్కనొకరు నిలిచివుందురు. రత్నాంగిచేతిలో, ఒక వెలుగుతూ వున్న కొవ్వొత్తి, జాడీ దగ్గర ఒక మొక్కల పీటపైని, బంగారపు సరుకులు, మరి ఒక పీట మీద వెండి సామాను, ఒకవేపు బట్టల మూట.)

రత్నాంగి కొవ్వొత్తి వెలుతుర్ని - జాడీ నాలుగు మూలల తొంగి చూచి - తలయెత్తి - యింతే - మరిలేదు - యేమఁనుకుంటావు? యిరవై ముప్ఫై వేలకు దేకురుతుంది. యింత గణించిందని, యవరూ యెన్నడూ అనుకోలేదు. బతికి నిన్ను బాధ పెడితే పెట్టింది కాని చచ్చి నీకు కనకాభిషేకం చేసింది. లోకం కోసమయినా కంటతడి బెట్టావు కావు.

**మంజు** : చచ్చిందని సంతోషించుతూ కంట నీరు పెట్టడం యెలాగ?

**రత్నాంగి** : నవ్వులు, కన్నీళ్ళు, భోగం దానికి తలిచే టప్పటికి రావద్దా?

**మంజు** : నేను భోగం దాన్నా?

**రత్నాంగి**:నాలుగేళ్ళు సానెరికం చేసి, యింకా సంసార్ని అనుకుంటానా?

**మంజు** : నమ్మక స్వామిద్రోహము చేసి నన్ను అమ్మి కొండుభొట్లూ, డబ్బిచ్చి కొని రామసానీ నాలుగేళ్ళు యీ చెరలో పెట్టారు - దేవుడు యిన్నాళ్ళకి చెరవొఁదిల్చాడు. యీ డబ్బు నాకు యివ్వాలని ఆ పిశాచం యిచ్చిందా యేమిటి? యీ డబ్బు నాకు దేవుడు యిచ్చాడు. నన్ను బెట్టి అది యెంత ఆర్జించింది? యిక స్వేచ్ఛగా బతుకుతాను.

**రత్నాంగి** : అనగా?

**మంజు** : వొకరి బాధ లేకుండాను.

**రత్నాంగి** : యెవరి బాధ?

**మంజు** : రామసాని బాధ వొదిలిపోయింది - యిక పంతులు బాధ.

**రత్నాంగి**:(జాడీలో సరుకులు ఉంచడం మాని నిలిచి) నా మాట కొంచెం వింటావా?

**మంజు** : నీకంటె నా మంచి కోరిన వారెవరున్నారు.

**రత్నాంగి**:అట్టి నమ్మకం వుంటే పది రోజుల కాలం పాటీ తోవనే జరగనీ.

**మంజు** : అయితే నీ యిష్టం.

**రత్నాంగి**:అలసివున్నావు. వెళ్ళి పడుకొని నిద్దర తెచ్చుకో.

**మంజు** : అలాగె, కాని నిద్దర రావడం యెలాగ? యీ మంచం మీద యింకా పడుకుందేమో అని బితుకు వేస్తూంది. దెయ్యవైందేమో?

**రత్నాంగి**:చచ్చిన వుత్తర క్షణం వెర్రి కుక్కయి పుట్టి వుంటుంది. మనుషుల్ని పీక్కు తినే పిసినిగొట్లకు అదే గతి. ఆంజనేయ దండకం చదువుకుంటూ పడుకో (మంజువాణిని కాగలించుకొని జుత్తు సవరించి ముద్దు పెట్టుకొని) వెళ్ళు, పడుకో.

**మంజు** : నీకీ రాత్రి జాగరవేఁనా?

**రత్నాంగి** : లేకుంటే ప్రమాదం వుంది – డబ్బు పాపిష్టిది – యెవరి కే దుర్వ్యూహాలు వున్నాయో?

**మంజు** : వొక్కర్తవీవుండడానికి భయం వేఁయదా?

**రత్నాంగి**:బతికివున్నప్పుడు భయపడందానికి చచ్చిం తరువాత భయపడుతానా?

(మంజువాణి పైకి వెళ్లును. రత్నాంగి తలుపు వేసి లాంతరు వెలిగించి తిరిగి చూసును. మూలనున్న పెద్ద జాడీలోంచి కొండుభొట్లు లేచును – రత్నాంగి గుండె ఝల్లుమని కొవ్వొత్తి జారవిడుచును – కొండుభొట్లు వూరుకొమ్మని చేత్తో సంజ్ఞ చేసును – రత్నాంగి కొవ్వొత్తి తిరిగీ తీసుకొని కొండుభొట్లు దగ్గిరకు వెళ్లును)

**కొండు** : మంచి యెత్తు యెత్తావు. నీ అంత బుద్ధి మంతురాలు లోకంలో లేదు.

**రత్నాంగి**:మీ కంటేనా?

**కొండు** : అంచేతనే మనవుభయులం యిక్కడ కలిశాం.

**రత్నాంగి**:యిన్నాళ్లు యిటు కనపడితే అటు మొహం తిప్పేవారే?

**కొండు** : ఆ రాక్షసి ముండ రామసానికి నీ పేరు చెబితే యిష్టం లేకపోయేది. మరిదాన్ని ఆశ్రయించుకు బతక్క తీరేది కాదు; అంచేత నీకు యెడ యెడంగా తిరిగే వాణ్ణి గాని నీచతురతా – నీ విద్యా – నీ ధర్మబుద్ధి – చదువుకున్న వాణ్ణి నేను కాన లేదనుకున్నావా? ..... తెల్లవారేసరికి యీ సరుకులన్నీ కరగడానికి తగిన సాధన సామగ్రి సిద్ధంగా వుంది. వొంతులు యేర్పర్చేయి – నన్ను మాత్రం కలుపుకున్నావంటే పోలీసు గీలీసు నిన్ను ముట్టలేరు – మంజువాణి డబ్బు విలువ యెరగదు. మనం యెంత వుడాయించినా పోల్చలేదు.

(కొండుభొట్లు రత్నాంగి భుజం మీద చెయి వేసి)

కొంచెం ఆసరాయియ్యి పైకి రావడం దండ ఘుడియ పడుతుంది. కాళ్లకి కొంచెం మేహవాతనొప్పులు.

(రత్నాంగి కొండుభొట్లుచెయి విదల్చి సరుకులు జాడీలో పడివేయ నారంభించును.)

**కొండు** : సరుకులు జాడీలో పడివేస్తున్నావేమి?

**రత్నాంగి**:జాడీతో కూడా పట్టుకుపోవడానికి.

**కొండు** : జాడీ యెలా మోసుకువెళ్లడం.

**రత్నాంగి** : జాడీ మొయ్యడానికి మనుషులున్నారు.

**కొండు** : యెందుకు వృధా శ్రమ–నలుగురికీ తెలియడం. నా మాట విని యీ గావంచా గుడ్డలో కట్టు (గావంచా చుట్ట చుట్టి రత్నాంగికి విసురును) నీకు యీ విద్యలో ప్రావీణ్యత తక్కువగా వున్నట్టు కనబడుతుంది.

**రత్నాంగి** : బంగారం యెవరు కరిగిస్తారు?

**కొండు** : యిదుగో మన......

**రత్నాంగి**:మన యెవరు?

**కొండు** : యెవరయితేనేం పేరడక్కు.

**రత్నాంగి**:నమ్మినట్టా? నమ్మనట్టా?

**కొండు** : కావలిస్తే నువ్వు కూడా దగ్గిరవుందువు కాని.....

**రత్నాంగి**:అయితే పేరు చెప్పరా?

**కొండు** : యేదీ! గ్రంథంలో దిగిన తరువాత అసలు అవతారాలె దిగుతాయి – పేర్లతో యేం పని?

**రత్నాంగి** : అయితే పేరు చెప్పరా?

**కొండు** : నీ పుణ్యం వుంటుంది – కొంచెం ఆసరా యియ్యి పైకి వొచ్చి అన్ని సంగతులు చెబుతాను. వీటి తస్సాగొయ్యా బొద్దెంకలు చెడకరుస్తున్నాయి.

**రత్నాంగి**:బొద్దెంకలు కరవ్వు కొంచెం దాళండి. యీ జాడి పెట్టించి మళ్లి వస్తాను.

(తలుపు దగ్గరికి వెళ్లి ఘడియతీయనారంభించును.)

**కొండు** : అంతా నువ్వే అవుపోసం పడతావు? కొంచెం బ్రాహ్మడికి పారెయ్యకపోతే శ్రేయస్సు కాదు.... ఆ ధనంలో మూడో వంతు నా మంత్రాంగమువల్ల రామసాని సంపాదించింది.

**రత్నాంగి**:(తలుపు కొంచెం తీసును – కొండుభొట్లు తల జాడీలోకి తీసును)

**రత్నాంగి** : ఆ తగాయిదా యేదో మంజువాణితో తీర్చుకొండి. పిలుస్తాను.

**కొండు** : (బుర్రపైకెత్తి) అమాంతంగా చంపేస్తావా యేమిటి?

**రత్నాంగి** : అయితే పేరు చెప్పండి.

**కొండు** : చెప్పకపోతే యేం జేస్తావు?

**రత్నాంగి**:మంజువాణ్ణి పిలుస్తాను –

**కొండు** : నువ్వు కాకనేకాదంటె-చెబుతాను కాని, కోరి లభించిన ధనంకాళ్లని తన్నుకుపోవడమే?

**రత్నాంగి** : పేరు... పేరు?

**కొండు** : అయితే విను (పొడుం పీల్చి) అక్కాబత్తుడు

**రత్నాంగి**:కంసాలాడి శ్రీరంగనీతులన్నీ వొట్టివేనా?

**కొండు** : మరేవిఁటనుకొన్నావు. లోకమంతా అంతే - నీలాంటి ధనవొల్లని వెఱ్ఱికుట్టె యెక్కడో వుంటారు - నా మాట విను.

**రత్నాంగి**:ముందు నా మాట వింటే - ఆ తరువాత నీ మాట ఆలోచిస్తాను.

**కొండు** : నీ చిత్తం - నువ్వేమి చెబితే అది చేస్తాను.

**రత్నాంగి**:యీ గదిలోనికి యేలా వొచ్చావో చెప్పు.

**కొండు** : యేకవచనం ప్రయోగిస్తూన్నావేమిటి?.... యక్ష ప్రశ్నలడుగుతున్నావు. నా వంటి మంత్రవేత్తకి తలుపులు - గోళ్ళూ ఒక అడ్డా?

**రత్నాంగి**:అయితే ఆ మంత్రం వల్లే పైకిరా - యీ జాడీపైన పెట్టించి పైనుండి తాళం వేస్తాను.

**కొండు** : గదిలో ప్రవేశించడానికి యేం బ్రహ్మవిద్య కావాలి? మారు తాళం పెట్టి తీశాను.

**రత్నాంగి**:యే మనిషి నీకు సాయం చేసింది?

**కొండు** : నా కొకరి సాయం కూడా కావాలా?

**రత్నాంగి**:పేరు?

**కొండు** : చెప్పకపోతే?

**రత్నాంగి**:పట్టి అప్పచెపతాం

**కొండు** : పట్టి అప్పచెప్పితే ప్రాణత్యాగం చేస్తాను - బ్రహ్మహత్య నిన్ను చుట్టిముట్టి శేషువులా చుట్టుకుంటుంది.

**రత్నాంగి**:అయితే చెప్పిన మాటకి జవాబు చెప్పండి.

**కొండు** : పేరుకే వుంది. (పొడుం పీల్చి) అంకి.

**రత్నాంగి**:అబద్ధం!

**కొండు** : అయితే - పైడి

**రత్నాంగి**:అబద్ధం!

**కొండు** : యెరిగి నన్నెందుకడుగుతావూ

**రత్నాంగి:** బ్రాహ్మడికుండే నీతి నీకు లేకపోయినా – దొంగకి వుండవలసిన నీతైనా నీకున్నందుకు అలరుతున్నాను.

**కొండు** : అయితే బ్రాహ్మణ్ణి దయదల్చి ప్రాణాల్తో వొదిలి వేస్తావాయేమిటి? నువ్వు ధర్మాత్మురాలివి. యీ పుణ్యం కట్టుకుంటే స్వర్గం యెదురుగా వస్తుంది. కొంచెం ఆసరా యియ్యి. జాడిలోంచి పైకి వచ్చి యీ దొంగముండా బొద్దెంకల బాధ వదుల్చుకుంటాను.

**రత్నాంగి:** శిఖా, యజ్ఞోపవీతం, యిక్కడ సమర్పించి, మరీపైకి రావాలి.

**కొండు** : అదేవింటది?

**రత్నాంగి:** అలానిలుచుండండి; చెబుతాను (దగ్గరకు వెళ్లి) ముందు జంఝుం, దర్భముడి వుంగరం ఇలా ఇచ్చెయ్యి.

**కొండు** : (జంఝుం తీసి యిచ్చి) యిదుగో జంఝుంపోస దాఖలు చేసుకో–బ్రాహ్మడన్న వాడికి ప్రాణ సమానమైన ధనం యిదే. అది నీ పాలు చేశాను. అంతటితో వొదలి వేయి.

**రత్నాంగి:** వుంగరం ఇలా ఇయ్యి.

**కొండు** : నువ్వు నీతిమంతురాలవని పేరు పడ్డావు. బ్రాహ్మణ ద్రవ్యం అపహరిస్తావా? అవిషం విషమి త్యాహుః బ్రాహ్మస్వం విషముచ్చతే" అని వెయ్యి నోళ్ళతో శాస్త్రకారుడు చెప్పాడు. చదువుకున్న బ్రాహ్మణ్ణి కొంచం చెయ్యి తడిచేస్తావేమో అని ఆశపడితే అసలుకి మోసం తెస్తూన్నావేమిటి?

**రత్నాం** : అధిక ప్రసంగం ఆలస్యానికి హేతువ! మన మాటలు విని ఎవరైనా వస్తే గుట్టు బట్టబయలవుతుంది... వుంగరం! ....

**కొండు** : కానియ్యి! నా వేలు వుంగరం నీ మృదువైన వేలు అలంకరిస్తే కృతార్థత చెందుతుంది. (వుంగరం అందిచ్చును.)

**రత్నాం** : ఆ మాట బాగుంది. (వుంగరం వేలునుంచుకుని) యిక శిఖ వుండిపోయింది. (తలవంచి ఒక నిమిషం కదలకుండా వుండి మొలలోంచి కత్తితీసి చూపించును.)

**కొండు** : (జుత్తు చేత పట్టుకుని) సిగకే తాళం పట్టావు? అదిమాత్రం వొదిలే, నీకు దాసుణ్ణై తిరుగుతాను. యెన్నడైనా నీ మాట గడువు దాటితే అప్పుడే యీ మర్యాద చేతువు గాని.

**రత్నాం** : "శుభస్య శీఘ్రం" అన్నాడు.

**కొండు** : కేశఖండన వుత్సవానికి చెప్పినట్టు చెపుతున్నావు. యీమాత్రం గడపవా? ముందు నీకెంతో పనికి వస్తాను సుమా.

**రత్నాం** : అలా అయితే కొస కొంచం కత్తిరించి వొదిలేస్తాను; అది మాత్రం తప్పదు.

**కొండు** : అయితే కానియి !

**రత్నాం** : (జుత్తు కత్తిరించును.)

**కొండు** : కొసేమిటి! మొయ్యా కత్తిరించేశావు.

**రత్నాం** : వెండ్రుకల కేవిఁటి! తరిగినకొద్దీ పెరుగుతాయి, బలువు తగ్గింది.

**కొండు** : యీ అవమానంతో నలుగుర్లో యెలా తలెత్తి తిరగడం ? దాని సిగ్గోసినసిగ పోతే పోయింది. కొంచెం ఆసరా యిచ్చి పైకి లేవదియ్యి. కాళ్లు కొంకర్లు పోయినాయి.

**రత్నాం** : మొదట యెలా దిగావు ?

**కొండు** : తలుపు తాళం రాగానే శరీరాన్కి యెక్కడలేని లాఘవం వొచ్చి హనుమాన్లులా యెగిరి లోపల్కి జారాను గాని వొళ్ళు కొట్టుకుపోయింది.

**రత్నాం** : రాలేకపోతే అలాగే వుండు.

**కొండు** : యేం యీలాంటి కాఠిన్యం వహించావు? (కొండుభొట్లు అంచులు చేతపట్టి ఉబక ప్రయత్నించగా జాడీ పగిలిపడును. (కొండుభట్లు పెంకుల మధ్య కూలబడును.) చంపావు! (రత్నాంగి కొంత కనికారముతో లేవతీసును.)

వొళ్ళంతా గాయాలు తగిలాయి గాని, నీ కరస్పర్శ తగలగానె అమృతనిష్యందనం లాగ–(కుంటుతూ తలుపు వేపు నడుచును. తలుపు దగ్గర నిలచి ధనం వేపు చూచి) ధనం కాళ్ళతన్నుకు పోతున్నావు. లేక నాతో వంతుకూడ్డం యిష్టం లేదు గాబోలు – నా మట్టుకు కొత్త నీరూ పాత నీరూ కూడా యేకంగా కొట్టుకుపోయినాయి – నా వుంగరం దొబ్బినందుకు లేడా దేవుడు (అంటూ తలుపు గడియ తీసును, రత్నాంగి తను కూడా తలుపు దగ్గరకి వెళ్లి తలుపు తానే వేస్తూ)

**రత్నాంగి**: నిన్ను ఒక్కణ్ణీ పైకి వదలనే – గదిలో వున్నానంటే పైని గొళ్ళెం వేసి కొంపకగ్గిపెట్టగలవు. గనుక నిన్ను వీధిలోకి సాగనంపి వీధి తలుపు గడియ వేస్తాను (రత్నాంగి గదిపైన గొళ్లెం వేసి కొండుభొట్లుతో పైకి వెళ్లును).

(బోనిపెట్టి తలుపు యెత్తి కోమటి రంగన్న పెట్టి పైకి వచ్చి సరుకులు పరీక్షించి అందులోంచి వుంగరాలు తీసి చేతిని పట్టుకొని కొన్ని కాసులు మొలను దోపుకొనును.

యింతట్లో రత్నాంగి కాళ్ల చప్పుడవును. శెట్టి మంచం మీద పడుకుని దుప్పటి తీసి కప్పుకొనును. రత్నం తలుపు తీసి గదిలో ప్రవేశించి సరుకులు వేపు చూచి - కాసులు పోగుచేసి)

**రత్నాంగి** : యేమిటీచిత్రం కాసులు సగానికి సగం తగ్గిపోయినాయి? (నిలుచుని నాలుగువైపులా చూచును. మంచంమీద మనిషి వుండడం చూసి గతుక్కుమని రెండడుగులు వెనక్కువేసి ఆంజనేయదండకం పఠిస్తూ "శ్రీమన్మహా అంజనీగర్భ సంభూత - సద్బ్రహ్మచారీ - కపీంద్రాదివంద్యా - కిరీటోజ్వలద్రత్న" రత్నాంగి దుప్పటీ ముసుగుతీస్తుంది. గాఢ నిద్రలో వున్నట్టు శెట్టి కదలడు. రత్నాంగి బాగా మనిషిని, నఖశిఖ పర్యంతం పరీక్షించి మొలదగ్గర చెయ్యి పెట్టును - శెట్టి తటాలున రత్నం తలపట్టుకొని)

**శెట్టి** : దొరికావు మరొగ్గను - చెప్పు - అమ్మవారివా? అసిరమ్మవా? పీడవా? పిశాచానివా? ఆ! యేమిటీ వాళకం చెప్పు - నిశిరాత్రి వేళ యిటొస్తావు అటొస్తావు నీకేం నేనాశ్శకరా! పరాశ్శకరా! వోలమ్మా యిదియేవూరు? యేలోకం? నా కొంపలో నా పక్క మీద నీను పల్లకపడుకున్న ముండా వాణ్ణి అమాంతంగా యెత్తి తెచ్చి యిక్కడ పడేసినావు గదా గుండెబద్దలయి సవ్వనా? రామసాని నీకేటి కావాల? ఒక్క మాట చెప్పు, యేటపోతు కావాలా? నీ రూపం చూస్తే నాకు భయం వేస్తున్నాది. కళ్లు మూసుకున్నాను. తల్లీ రక్షించు.

**రత్నాంగి**:చదవవలస్ని పాఠంవంతా అయిందా? యింకా వుందా?

**శెట్టి** : అయితే మనిషివే? యెవరమ్మా నువ్వు? చెప్పు - నా యిల్లు చేర్చు తల్లీ మా వాళ్ళు బెంగ బెట్టుకుంటారు - రత్నాంగివా? అయితే బతికాను. (పలు ప్రక్కలా పరికించి) యిది రామసాని చీకటి గది కాదు? పిశాచమై పీక్కు తింటూంది! నన్ను తెచ్చి పడేసినట్టే నిన్నూ తెచ్చి పడేసిందా ఏమిటి? యిక్కడుంటే మన్ని చంపేసి పోగలదు! రా! పైకి పోయి మంత్రగాడి కాళ్ళట్టుకుని ప్రాణం బచాయించుకుందాం.

**రత్నాం** : తల వొదిలెయి.

**శెట్టి** : చూశావా నా చేతులు యెలా గజగజ వొణుకుతున్నాయో? భయం చేత వళ్లు కంపం పట్టుకుంది... నా వశవాఁ చేతులు వొదల్డానికి. (రత్నాంగి పెనుగులాడి మొల దగ్గిరకి చెయ్యి పోనిచ్చును)

**శెట్టి** : చెయ్యి మాత్రం మొలలోకి వెళ్లనియ్యకు. దోపిడే? సానిబుద్ధిపోతుందా? పిశాచం పీక్కుతింటావుంటే సరసానికి యాళా?

**రత్నాం** : వేళాకోళం మాని మొలనున్న కాసులు అక్కడ పెట్టు.

**శెట్టి** : యీ వాళకం సెట్టి దగ్గర పనికి రాదు. (లేచి నిలబడి రత్నాంగిని దూరానికి తోసి తలుపు వేపు జరుగును)

**రత్నాం** : దొంగ! దొంగ! మంజువాణీ (అని కేక వేసును.)

**శెట్టి** : నేనేం యెట్టి కుట్టి బాపనాణ్ణనుకున్నావా యేమిటి? నీ యిష్టం వొచ్చినవాళ్లని పిలువు. నాకు భయమనుకున్నావా? (పెద్ద గొంతుకతో) నన్ను యీ సీకటి గదిలోకి పిలిసి యీ బంగారం మనం పంచుకు దొబ్బుదామంటే నే నొప్పుతానా? నీక్కావలిస్తే నువ్వు దొబ్బు. పోలీసోళ్ల పట్టుకున్నప్పుడు నువ్వడ్డుపడతావా? రామసాని దెయ్యమై పీక పిసికితే నీ డబ్బడ్డుపడతాదా? (తలుపు దగ్గిరకి దాసీలు, మంజువాణి, నరహరిరావు గారు వచ్చి తట్టుదురు)

**శెట్టి** : నా యెత్తు ధనం పోస్తే యిలాంటి దొంగ పని నేను చెయ్యను. యింత ద్రోహవా? పాపము బద్ధలై ఆకాశమంత పిడుగు నెత్తిమీద పడదా? నా చెయ్యి వొదిలెయి. తలుపు తీసి నీ భవిష్యం నలుగురి యెదుటా తీస్తాను.

**రత్నాం** : చేతులు పట్టు వొదల్డు! ఏం చెయ్యను?

**నరహరి**: (తలుపు మీద చెయ్యివేసి) యెవర్లోపల?

**రత్నాం** : శెట్టి–

**మంజు** : శెట్టా? యెలా వొచ్చాడు?

**శెట్టి** : శెట్టి యెలా వచ్చాడా? రత్నం రమ్మని ప్రాణం తింటే వచ్చాను. బంగారం నాణెం చేసి ఖరీదు కట్టాలి రమ్మంటే వచ్చాను. దొంగ పని చెయ్యమంటే నే నొడబడతానా? రామసాని సొమ్ము ఒక్క చిల్లికాసు ముట్టుకుంటే పిశాచై పీక పిసగదా? (తలుపు తీసుకు పైకి పోవడాన్కి ప్రయత్నిస్తూండగా)

**రత్నాం** : పట్టుకోండి! మొల్లో కాసులు ముడుచుకుపోతున్నాడు? అవుగో, వుంగరాలతో పాటు...

**శెట్టి** : యేటీ మనిసి యికారం. (రత్నాంగి మీదికి వంగి మొహం దగ్గిర మొహం పెట్టి) నే దొంగనా? నువ్వు దొంగవా? మా యింటావంటా ఆ మాటలేదు. ఆ మాట మళ్లీ అన్నావంటే చాలా దూరం యెళుతుంది. కోవటోళ్లం! మా యిల్లంతా బంగారం! మా వొళ్ళంతా బంగారం.

**నరహరి**: శెట్టీ!

**శెట్టి** : సిత్తం బాబు! పిశాచమంటే నాకు భయం. పోలీసోళ్లంటే నాకు భయం – మరెవ్వళికీ లచ్చపెట్టను. (శెట్టితిరిగి సాగి వెళ్లుతాడు.)

**నరహరి**: నిలబడు!

**శెట్టి** : (వెళ్లిపోతూ) భోగం దానియింట్లో ఒక్క నిమషం నిలబణ్ణు! అదంతా బాపనాళ్లకు చెల్లుతుంది.

**నరహరి**: (పరుగెత్తి శెట్టి రెక్క పట్టుకొని నిలబెట్టి) కాసులు, వుంగరాలు పెట్టు.

**శెట్టి** : సెయిముట్టు సరసం మాత్రం సెయకండి, మాటొస్తుంది.

**నరహరి**: యిస్తావా? యివ్వవా?

**శెట్టి** : దోపిడే!

**నరహరి**: ఆహా!

**శెట్టి** : యివ్వకుంటే యేటిసేస్తావు?

**నరహరి**: పిలకూడదీస్తాను.

**శెట్టి** : గవరుమెంటు బావుటా యెగురుతుండగా యెవడు పిలకట్టుకునేవాడు ?

**నరహరి**: యిదుగో నేను (అని పిలకపట్టుకుని వంచును.)

**శెట్టి** : బాబ్బాబు! మీ మాట కెప్పుడయినా కోవటోఁడు అడ్డు పెడతాడా? మీ శెలవు! బాపనోరికి బంగారం యిచ్చుకుంటే పుణ్యం కదా! పితాళ్లు స్వర్గానికి పోరా? ముంద కాసులు మళ్ల ఆర్జించుకుంటాను; పుచ్చుకొండి! (కాసులు పుచ్చుకుని నరహరిరావు జుత్తు వదలివేయును.)

**నరహరి**: దెబ్బకు దెయ్యం  వెరుస్తుంది.

**శెట్టి** : బాబు! దెయ్యమంటే నాకు వొల్లమాల్ని భయం! మరొగ్గెయ్యండి! ఈ కొంపలోంచి దాటిపోతే బతుకుతాను. (గడప దిగుతూవుండగా)

**రత్నాం** : వుంగరాలో?

**నరహరి**: వుంగరాలిచ్చి మరి వెళ్ళు!

**శెట్టి** : మీ శలవు! మీ శలవు కద్దా? (వుంగరాలు తీస్తూ రెండడుగులు ముందు కేసి పరిగెత్తి పారిపోవును.)

(తెర దించవలెను)

# కొండుభొట్టీయము

## ద్వితీయాంకము

### అష్టమరంగము

(అక్కాబత్తుడి దుకాణం)

(అక్కాబత్తుడు – రామమూర్తి ప్రవేశించును)

**అక్కా** : యిక రామమూర్తి అని పిలవకూడదు. రామమూర్తి పంతులుగారు అని పిలవాలి.

**రామ** : యేదో పెద్ద ఉద్యోగాలు అయినప్పుడు గదా అలా పిలవడం.

**అక్కా** : అందాకా మామూలుగా పిలవొచ్చునా?

**రామ** : యేం చదువు – యేం వుద్యోగాలు.

**అక్కా** : యేం అలా అంటున్నారు.

**రామ** : మా తండ్రి సంగతి బాగుంది కాదు. ఆయనకి మంచి స్నేహితులైన మీలాంటి వాళ్లు కూడదని చెప్పరు–

**అక్కా** : ఆయ్నె యే కూడని పని చెయ్యలేదే. యేదో ఉపాయం వల్ల పదిరాళ్ల సొమ్ము ఆర్జించుకుని సంసారం గడుపుకుంటున్నాడు.

**రామ** : యెవడో షోళంగిరాజును యీ వేళ యింట్లో దింపి పార్వతిని వాడికి ఉపచారం చెయ్యమని అప్పచెప్పారు. ఈ దౌర్జన్యం చూశారా ?

**అక్కా** : "భార్యా రూపవతీశత్రుః" అన్నాడు. మొగుడున్న పెళ్ళామే సొగసుగా వుంటే పరాయి వాళ్లు కన్నేస్తారు గదా! ఖాయిదా లేకుంటే సొగసైన వితంతు చెడిపోవడమనగా యెంతసేపు?

**రామ** : మా తండ్రికి అలాగ్గడ్డి పెట్రాదా?

**అక్కా** : మీ తండ్రికి గడ్డిపెడితే గడ్డయ్యేది గట్రయ్యేది సాపుగా తినేస్తాడు. అయినా ఆయిన ప్రతిబంధకం మీ ప్రయత్నానికి అడ్డవుతుందా యేమిటి? పెళ్ళి మూర్తం యెప్పుడండి?

**రామ** : యెవరి పెళ్లండి?

**అక్కా** : యవరి పెళ్లనుకున్నారు?

**రామ** : నా పెళ్లి?

**అక్కా** : ఆ మాటే – మీ పెళ్లి – పార్వతమ్మ పెళ్లిన్నీ.

**రామ** : (నిర్ఘాంతపోయి) యెవరు చెప్పారేమిటి?

**అక్కా** : యెవరూ చెప్పలేదు..... లేదు మీ మాటల వల్లా, మీ చెర్యల వల్లా ఊహించాను. మరేం భయపడకండి. అది మహా మంచిపని. మీ తండ్రి ఆదాలో వుంటే రత్నం లాంటి పిల్ల చెడిపోతుంది – యీ మాట పొక్కేలోగా శీఘ్రంగా కానియ్యండి – నా చేతనయ్ని సహాయం చేస్తాను.

**రామ** : నిజంగాను?

**అక్కా** : లింగం సాక్షి.

**రామ** : అయితే మా గురువు గిరీశంగార్ని తీసుకొస్తాను.

(యిద్దరు నిష్క్రమింతురు)

# కొండుభొట్టీయము

## ద్వితీయాంకము

### నవమ రంగము

(మంజువాణి యిల్లు – ఒక బల్ల చుట్టూ కుర్చీలు – బల్లమీద గళాసులు – విప్పిన సీసా.) (మంజువాణి మంచం మీదను త్రివిక్రమరావు పంతులు ఈజీ చెయిరు మీదను మితిమీరి పడివుందురు)

**కొండు** : (చప్పుడు కాకుండా బొటన వ్రేళ్ళమీద నడచి వచ్చి త్రివిక్రమరావును కదిపిచూచును. తెలివిరాదు. ఆత్మగతం) జేబులో యేముందొ–(చెయి జేబులో జొరిపి మనీపర్సు తీసి–విప్పిచూచి, ఆత్మగతం) దీనిలో పెద్ద కాసులు చాలా వున్నాయి–యివి వీడికీ దక్కేవి కావు – వివాహ కార్యం క్రింద వినియోగపరిస్తే కొంత పుణ్యం అయ్నా వీడికి దక్కుతుంది. రెండు కాసులు మంజువాణికి యిచ్చేటందులకు యిందులో వుంచి యిదిగో జేబులో మళ్లీ పడేస్తాను. కడంవి కాకితం పొట్లాం కట్టి కందులజాడీలో లోతుగా కప్పివేస్తాను.

(నిష్క్రమించును)

**త్రివిక్ర** : (నిద్రలో కాలుజాచగా సారాబుడ్డి నేలకిపడి చప్పుడవును, అంతట వులికిపడి లేచి, మరి ఒక గళాసు పుచ్చుకుని) దీనికి డబ్బిచ్చి వెళుదాం.

(జేబులో మనీఫర్సు తీసి చూచి నిర్ఘాంతపోయి ప్రకాశం) ఆ! రెండే వున్నాయి – కడంవి యెవరు దొబ్బారు. అది మంచం మీద వొళ్ళెరక్క పడే వున్నది. లేక నేను

ఖర్చు పెట్టాన? లేకుంటే నౌఖర్లు యెవరయినా చెపాయించేశేరా? ఈ రెండు కాసులు దీనికి యిచ్చేస్తే యింటికి చేరే సాధనమేమిటో.... ఒకటీ సాధనం కనపడుతూంది. శాస్తుల్లు ఇంట్లో దాని శిగగోస్ని పాత్రసామాను వొదిలివేసి – సన్నంగా నలుగురుం జారిపోయి తెల్లారగట్ల రెయిలులో విశాఖపట్నం జేరుకుంటే, అక్కడ రుణం చేసుకోవచ్చును. యెవడూ మేలుకుండలేదుగద?

(తలుపు మెల్లగా తీసి వెళ్ళిపోవును)

# కొండుభొట్టీయము

## తృతీయాంకము

### ప్రథమ రంగము

(కేశవరాయుడు గారి చదువు గది. కేశవరాయుడు గారు హెడ్ మేష్టరు – ఇంద్రపట్నం బ్రహ్మ సమాజ కార్యదర్శి – దివాన్ బహద్దర్ రాజారాం గారు – కేశవ రాయుడు గారు ప్రవేశించును.)

**కేశవ** : బహు కాలానికి. దయచెయ్యండి.

**ది.రా** : రిటైరయ్నివాళ్లం కామండీ, బ్రతుకు యొక్క సాయం కాలంలో దేవుడికి దేశానికి నౌఖరీ చెయ్యవలెననే అభిలాష కలిగి దైవారాధనా గ్రంథ కాలక్షేపంతో కాలం వెళ్లబుచ్చుచున్నాను. భగవద్గీత ఆచార్యుల వారి వ్యాఖ్యాన సహితంగా ఆంధ్రీకరించి నాను కద – ఇప్పుడు ఉపనిషత్ భాష్యం తెనిగిస్తున్నాను. నాస్తికం ఇంగ్లీషు చదువుకున్న మన వారిలో యెక్కువగుచున్నది. పెద్దలు చిన్నలు కూడా అప్పటి ఐహికములందు మగ్నచిత్తులయి వుండడమే కాని "What Am I" “కోహం”? “నేనెవడను?” నా దేవుని యడల నా యెడల నాతోటి పాటి జంతువుల యడల duty యేమిటి? where am I drifting? నే నేతోవజారుతున్నాను – అనే తలంపులు యేమి పాపమో కాని బుర్రలో జొరబడవు. ఆస్తికులయిన తాము ప్రధానోపాధ్యాయులయి వుండుటను యీ పట్నముల బాలురు మాత్రము యితర పట్నముల వారివలె కాక బుద్ధివంతులుగా నున్నారు.

**కేశవ** : దయచేత నన్ను పొగడుచున్నారు గాని నేను యెంతటి వాడను. నే చేసేపననగా యెంతటిది?

**ది.రా** : మీ వంటి సత్పురుషులకు వినయము సదాభూషణమయే వుండును. దేశమున ముందునుండీ యున్న పాపచింతా ఆంగ్లేయ విద్యల వలన కలిగిన నాస్తికతా అనే

మహా మిసిసిపి–మిసోరి ప్రవాహములకు బ్రహ్మ సమాజ మతమనేది పెద్ద ఆకట్టుకట్టువలే ఆచరిస్తున్నాది. బ్రహ్మ సమాజము లోకములో నుండు మతములన్నిం టికన్నా Rational సవబయినదే అయిననూ లోకమున అవస్థాభేదము–రుచి భేదము కలిగి వుండుట చేత ఏజాయ మనుష్యులకు ఆజాయను జ్ఞానోత్పత్తి ధర్మోపదేశమూ చేయడము విధి గనుక తాము తర్కమును బట్టి సూటిగాపోవు బుద్ధులకు బ్రహ్మమతో పదేశము చేయుచున్నారు. నేనంటిరో హిందూ మత గ్రంథములలో పురాణాదులు కేవల స్త్రీ పామరజన బోధక ప్రయోజనములుగా తొలగించి పాశ్చాత్యులు గూడా వేయినోళ్ళ పొగడు భగవద్గీతాది మహాగ్రంథముల సహాయమున ఆర్య మతమునకు చిరకాలమావరించిన తృప్పును గడగి ఆచార్య నిర్దిష్ట కర్మ– వేదాంత మార్గములను చదువరుల కంటికింపుగ గనపర్చ ప్రయత్నిస్తుయున్నాను.

**కేశవ** : యేరీతినయినా నాస్తికతా పాపముయడల భీతి–పుణ్యము యడల ఆసక్తి కలుగ చెయ్యడం యిప్పుడు మన దేశములో అత్యావశ్యకములైనప్పటికి మనవాళ్ల అవివేకానికి మేర లేకుండా వున్నది.

**ది.రా** : Pardon me. యేదో ఒక తరహా అంటే ఇంచుక నేను తమ అభిప్రాయముతో భేదించవలసి వస్తుంది. క్షమించవలయును. యే రీతిగానైనా ఆస్తికత అంటే యిదిగో ఛండాలుడు యెనుపోతును వేటవేసి మరిడమ్మకు పూజ చేస్తాడు. మనమునూ అట్టుల చేయగలమా? సంఘములోపై అంతస్తుల వారమైన మనము Rational Religion కలిగి వుండవలెను. అట్టి మతము క్రమక్రమంగా క్రిందివారికి దిగును. సవబునే నేను పూజిస్తాను. థియాషిపిష్టు మతము వలె పేడా బెల్లం కలిపి మనవాళ్ళు సంతోషిం చడం కొరకు ప్రతి వెర్రి మొర్రి వ్రాతకు సందర్భార్థము కల్పించడము ప్రతి అవకతవక ఆచారముకు రహస్యసవబులు గుణములు కల్పించడము – యేమంటారు? తాము అట్టి వెర్రి మాయల నమ్మజాలరే?

**కేశవ** : నిజమే!

**ది.రా** : అట్టి ప్రవర్తన కలవారితో రాజీ లెల్లను యెట్లు పాటించతరమనవలయును. మత సంబంధ మయిన ఆ తర్కిత ఆచరణలో మన వాకిటలోనే కొండంత inconsistency వున్నది చూడండి. నాయుడు గారు– మనమాధవయ్య గారున్నారు – వారి యోగ్యత ఆంధ్ర పాండిత్యమూ, కవితా సామర్థ్యము – మన దేశమున కెల్లా అలంకార భూషితములయియున్నవే – వారు బ్రహ్మ సమాజ మతము నెన్నాళ్ల నుండియో అవలంబించి, ఆ మతమునకు మొనగాండ్లయి వున్నారు. విధవా వివాహములు

ఆచరించవలసి వచ్చినప్పుడు రీజన్ కాగినవారు బ్రహ్మ సమాజము యొక్క మార్గము వదలి హిందూ శాస్త్ర ప్రకారం ఆచరిస్తారు – అది యేమనవచ్చును?

**కేశవ** : నిజమే గాని మాధవయ్య గారు సవబు మాలిన పనిచేసిననూ మళ్ళించడము శక్యము కాదు గాని తాము విధవా వివాహమునకు ఫర్ (for) గాని, ఎగనెష్టు (Against) గాని వున్నట్టు కానరాదు – తమవంటి పండితులు ఆ రిఫారం (reform) విషయమయి చర్చించి యేదో వకనిశ్చయము తీసుకు వుండకపోతే.....

**ది.రా** : అన్ని పనులు అందరూ చెయ్యడము శక్యమా? మత సంస్కారము అందుతో సంబంధించిన గ్రంథ రచనా నా బ్రతుకుకు నిధానములుగా నిర్నయించకు వున్నాను– చేయవలసిన పనులు లోకములో మెండు కలవు. చేయ జేసుకొనిన పని చాయశక్తుల చేయనగు అందు విద్య అన్య వ్యాపార నిరోధి (Jealous wife) ప్రస్తావనవశాత్తూ విధవా వివాహముల మాట అంటిని గాని, ఆ భారము కూడా వహించుటకు నా భుజములకు వైశాల్యముజాలదు. మాధవయ్య గారూ, తమలాంటి వారు పట్టి యుండగా నా రిఫార్మ్ (reform)కు మరియొకరి సహాయమావశ్యకము కాదు– గాని నా మనసునకు కలిగిన సందేహము నివారించుకోజాలక మాధవయ్య గారి మతమునకు ఆచరణకు గల వైరుధ్యము తాము సమన్వయించగలుగుదురని అడిగితిని.

**కేశవ** : రాత్రింబొగళ్ళు నేనిదే ఆలోచించుతాను – వారు వినరు– యేమి చెయ్యను. నేను కూడా మోరల్ కరేజ్ (moral courage) లేనివాడిలా లోకానికి కనపడుతున్నాను. నా శత్రువులు నన్ను తరుచుగా వెక్కిరిస్తూ వుంటారు.

**ది.రా** : మాధవయ్య గారు గొప్ప గ్రంథకర్తలు. సంఘ సంస్కార నిర్వాహకులు. వారికి మన మందరమూ పూజ చేయవలసినదే వారి పేరట చంద్రకాంత శిలాప్రతిమ ఒకటి నిలపనగును గాని తప్పుత్రోవను మనల నీడ్చుకు పోయి హాస్యాస్పదులనుగా జేసి నప్పుడు నేనయిన నేమిచేతును? పెళ్ళి చేసుకునే కుర్రవాడు బ్రహ్మసమాజ మతస్తు డైనప్పుడు సమాజ మందిరములో సమాజపద్ధతి ప్రకారం పెళ్లి చేయించుదును. మాధవయ్య గారేమి చేయుదురు?

**కేశవ** : తమరిచ్చిన సలహా బాగా వున్నది. సంఘ సంస్కార సమాజం వారము చాలామందంతా బ్రహ్మ సమాజము వారమే. మేము నలుగురమూ కలసి మా మత ప్రకారం వివాహము చెయ్యడమునకు నిశ్చయిస్తే మిగిలిన ముచ్చకాయ ముగ్గురూ యేవిఁచెయ్యగలరు? అందులో మా స్కూలు కుర్రవాళ్లు మా పక్షం వుంటారు కద. ఓట్లు మెజారిటీ యే

మీటింగులోనయ్నా మాకే వస్తుంది. యిటు పైని మా నమ్మకములననుసరించి పని చేసి చూస్తాము. థేంక్యూ వెరిమచ్ ఫర్ ది ఎడ్వైస్. (Thank you very much for the advice).

**ది.రా** : నేను యెడ్వైసు (advice) యివ్వలేదు. యివ్వజాలినంత వాడిని కాను. రిఫారమ్ (reform) విషయమై నేను తమకు యెడ్వయిజు (advice) యేల? ఈ హంశము మన ప్రసంగములో ఉపమానముగా తెచ్చినాను. దీని మాటకేమి? తాము సవబు ప్రకారం నడిచేటప్పుడు లోకం అంతా మీ పట్ల వుంటారు. మనం అనుకుంటూ వున్న ప్రస్తావన రిలిజన్ రేషనల్గా (religion rational) వుండకుంటే అన్యమతస్థుల యొక్క నాస్తికం యొక్క ధోకాకు నిలవగలదా.

**కేశవ** : అవును.

**ది.రా** : నేను యిప్పుడు తమ దర్శనానికి రావడము కారణమేమంటే తమతో ముచ్చటించడమనే సంతోషమలా వుండగా ఆదివారం రోజున, మా తోటలో నలుగురు ఫ్రెండ్సు (friends) కి టీపార్టీ యిస్తాను. ఆహూాయము చేయుటకు వచ్చితిని.

**కేశవ** : చీటీవ్రాస్తేవస్తానే నా కోసం యింత శ్రమ తీసుకున్నారు.

**ది.రా** : తామును చూడడపు ఆనందమో తమతో ముచ్చటించుట వలన గలుగు జ్ఞానోత్పత్తియో? గుడ్ బై (Goodbye) (Shake hands చేసుకుందురు.)

**కేశవ** : గుడ్ బై.

(యిద్దరూ నిష్క్రమింతురు.)

# కొండుభొట్టీయము

## తృతీయాంకము

### ద్వితీయ రంగము

(రాజారాంగారి కచేరి గది)

(దివాన్ బహుద్దూర్ రాజారాం గారు, గంగాధర శాస్త్రి ప్రవేశించును.)

**ది.రా** : ఈ పటుపటాంగములో యెవరు గెలుస్తారంటారు?

**శాస్త్రి** : తాము దివాన్ బహద్దర్లు – మాధవయ్య గారు రావు బహద్దరు – ఇద్దరి తారతమ్యము కంపెనీ వారు యెంచేవుంచారు. తాము సార్థక నాములగు మంత్రులు – మాధవయ్య

గారిది వైదీకపురస్తా – అందులో వేగినాటి సన్యాసం ఆయ్నకు దేశాన్ని పట్టి అబ్బింది. గ్రంథాలయితే చాలా రాశారు.

**రాజా** : పండితులైన మీరూ అలా అనడం ఆశ్చర్యంగా నున్నది. పిట్టకథలు పిచ్చిక కథలు తిట్లూ గ్రంథము లంటారా? ఇంగ్లిషులో సోలిడ్ బుక్ (Solid Book) అంటారే అనగా ఉద్గ్రంధము. అది మనము వ్రాస్తూన్నాము. మన భగవద్గీత ఆంధ్రభాషకు వజ్రకిరీటమని పేపరు వాడు రాశాడు. శైలి భేదం చూశారా మాధవయ్య గారి వ్రాత – ఊక – పేలపిండి మా శైలి అలంకార భూయిష్టమైయుండును. వాక్యములనడక సంగీత గమనము ననుకరించును. పామర జనులకు ఉత్కృష్ట వస్తుగుణ గ్రహణం వుండదు. మన గ్రంథములు యెంత సొగసుగా నచ్చొత్తించినను కొనువారు కానరారు. జమీందార్లు తమ యుద్యోగస్తుల మేలుకోరి కాపీలధికముగా గొని తాము వారికి పంచి పెట్టిన జమీందారీలు బాగగును. దేశములో జ్ఞానాభివృద్ధికి మార్గమగును. ఒకమారు వెళ్ళి ఉద్యోగావస్థలో పూర్వ పరిచితులయిన వారిని చూడవలె. యెక్కడయినా మంచి సంస్థానంలో దివాన్‌గిరీకి కుదురుకుంటేనే గాని అధికారం చేసే అలవాటు పోయి యేమీ తోచకుండా వున్నది.

**గంగా** : ప్రజలికి అదృష్టం పట్టాలి కదా!

**ది.రాజా**: దివాన్ గిరీ చేస్తే చెన్నపట్టపు వకీళ్లతో పలుకుబడి కూడా వుంటుంది. కౌన్సిలు మెంబరు పనికి సహాయ భూతంగా వుంటారు. యీజిల్లాలోనే కొంచెం ప్రజలని రంజింప చెయ్యడాన్కి సంఘ సంస్కారంలో మనంకూడా వేలు పెట్టితేనే కాని యిక్కడి వాళ్లు మనకు వోట్లు యివ్వరు.

(నౌఖరు ప్రవేశించి)

**నౌఖ** : గిరీశం పంతులుగారు వచ్చారు.

**ది.రాజా**: రమ్మను (గంగాధర శాస్త్రితో)

ఇతడు నా బాల్యస్నేహితులయ్ని యుగంధరరావు పంతులుగారి కొమారుడు. చిన్న నాటి నుంచి యెరుగుదును. బి.ఏ. ప్యాసుఅయినాడు. తండ్రి ఆర్జించిన ధనంపెట్టి బ్రతుకుతున్నాడు. ఇతనిని సంఘ సంస్కారంవారు కెప్తాను అంటారు. సాహసౌదార్యాలు గల మనిషి. కోటి విద్యలున్నాయి. నాటకాలాడుతాడు. పాడుతాడు. గారిడీ చేస్తాడు. దొర్లకి యితనంటే సరదా. తండ్రిచేసిన మొదటి వివాహం భార్యాపోయింది. పిల్లలు లేరు. తిరిగీ వివాహం లేదు. చేసుకుంటె మరెవరయినా పిల్లను యిచ్చివుందురు. అర్ధరాత్రివేళ యెటువైపున పిలచినా రెండువేలమంది వెనుక కూడుతారు. గుణయోగ్యత

లున్నవిగాని కొంచెం పెద్ద పిన్నా తారతమ్యం మరిచి హాస్యరసంగా మాట్లాడుతాడు. తుంటరి ... అతనువచ్చే సర్కి పుస్తకం చదువుతూ వుందాము. "భీష్మాత్ వాతః పవతి – భీష్మోదేతి సూర్యః – భీష్మాదగ్నిశ్చండశ్చ.

**గిరీశం**: (ప్రవేశించి.)

ఆ స్వరాన్ని యెందుకు సాగదీస్తున్నారు. శాస్తుల్లుగారి చేత చదివించండి. మీరు అర్థం వ్రాయండి.

**ది.రాజా**: (Dam it) (అప్పుడే ఆరంభించాడు.)

బి.ఏ. ఆ భాషలో ప్యాసు అయినాడు. మావాడికి సంస్కృతంలో మంచి ప్రవేశం వుందండి. తండ్రి ఉపనిషత్తులు కూడా చెప్పించాడు.

**గిరీ** : మా గ్రామములో ఒక కోమటి ఉండేవాడు. ఆయన పురుషసూక్తం పారాయణ చేస్తూ వుంటే నూతులో కప్పలు బుఱ్ఱపైకెత్తి అరిచేవి.

**గంగా** : మండూకప్లుతం – వేదంలో స్వరం కూడా వుంది.

**గిరీ** : బ్రాహ్మలు సోమపానం చేసి తొలకరి వేదపారాయణ చేస్తే తొలకరి కప్పల అరుపుల్లా వుంటుందని ఋగ్వేదంలో ఉపమానం కల్పించారు. తొలకరివాన కురిసినతరవాత రాత్రివేళ కప్పలు మేళంగట్టి తరహాతరహాలుగా గానం చేస్తూవుంటే అదిఒక ఆనందంగా ఉంటుంది.

**ది.రాజా**: (Serious Subject) సీరియస్ సబ్జెక్టులోనయినా హాస్యం విడనాడజాలవుగదా ! రావుజీ !

**గిరీ** : మామగారు! గుడ్లగూబలా గాంభీర్యంగా కూర్చుంటాను. యేం శలవు?

**ది.రాజా**: ఉపనిషద్వాక్యము పరిసమాప్తిచేసి మాటాడుకుందాము.

శాస్తుల్లుగారు! అబ్బీ నువ్వు కూడా విను. నీ బుద్ధిలో (originality) ఒరిజినాల్టి వుంది. భీష్మాత్ వాతః పవతే" అన్నాడు. దేవునికి భయపడి వాయువు వీస్తుంది. సూర్యుడు ఉదయిస్తున్నాడు. అని యీ ప్రకారం చాలామంది తాత్పర్యం చెప్పుతారు. భయమనేది భగవంతుని యందు క్రౌర్యం కనపరుస్తుంది. భక్తి వల్ల దేవతలు వారి వారి పనులు చేసినారంటే కొంత స్వారస్యంగా వుండును. మా వాడు (గిరీశం వంక చూసి) భయం చేత చెయ్యమంటే యే పని చెయ్యడు. "భీషా" అనే మాటకు మరి యేదయినా అర్థం చెప్పితే బాగుంటుంది. యూరోపియన్లు వ్రాసిన డికషనరీలు చూదాం.

**గంగా** : నేను కూడా యేకాక్షర నిఘంటు చూచి కొన్ని అర్థాలు మనవి చేసుకుంటాను.

**గిరీ** : నేను ఒరిజనల్ (Original) అని మామగారు శలవిచ్చారు గనుక నేనో కొత్త అర్థం చెప్పుతాను. 'షా' మీద 'కా' యెక్కిస్తే 'భిక్షా' అని అవుతుంది. ఆపైని అర్థం బహు సుళువుగా వస్తుంది. గాలీ, సూర్యుడు వగైరాలు ముష్టి కోసం సంచారం చాస్తారని సమన్వయం అవుతుంది. "భిక్షా" అన్నది 'భీ' అనే ధాతువులో నుంచి వచ్చిన పదం కాదు. అది యిండో ఆర్యన్ (Indo Aryan) మాట. 'వ' 'చ' యోరభేదః అన్నసూత్ర ప్రకారం యింగ్లీషులో విష్ అనే మోస్తరుగా తేలింది. విష్ (Wish) అనగా యిచ్ఛ. ఇఛ్ఛా మాత్రం భోజనం దేని కోసం ముష్టి అంటే భుక్తి కోసం. "భుక్తి భిక్ష మీయవే" అని త్యాగరాయిలు పాడలేద. – లోకంలో కూడా మనం చూడమా! గవర్నమెంటు వారు యింత భిక్ష పడేస్తే గదా మామగారి వంటి గొప్ప గొప్ప ఉద్యోగస్తులు నౌఖరీ చేస్తారు.

**గంగా** : వేదంలో అక్షరాలు మార్చడానికి వీలు లేదండి.

**గిరీ** : అర్థము మార్చడానికి వీలుందండీ?

**గంగా** : శాస్తుల్లు గారు! మీకు తెలియదండీ. మా వాడు చెప్పింది చాలా సబబుగా వుంది. యీ వేళకి సమాప్తి చేతాం. శాస్తుల్లు గారు మనలో వారే. మనం స్వేఛ్ఛగా మాట్లాడు కోవచ్చును. రావుజీ! నీ హాస్యరసమునకు కొంచెం కళ్ళెం పెట్టి ఒక్క అర నిమిషం సీరియస్ (Serious) గా వుంటే చాలా ఒబ్లైజు (Oblige) అవుతాను.

**గిరీ** : మామ గారి శలవు శిరసావహించి, గుడ్లగూబ వలె బుద్ధిగా కూర్చుంటాను.

**ది.రాజా**: యీ విధవా వివాహం తాలూకు హికమత్తు యావత్తూ మీ క్యెప్తాను గారి చేతులో వున్నది. గనుక, 'తూ' 'చా'లు పోకుండా యావత్తూ పరిసమాప్తి అగుననే నమ్మకము నాకున్నది. నేను నిన్నటి దినం కేశవరావు నాయుడు గారితో మాట్లాడినాను. మాధవయ్య గారిది వరకు .... చేయుచున్న శాస్త్రోక్త పద్ధతి త్రోసి, బ్రహ్మ సమాజ మత ప్రకారం యిటు పైని విధవా వివాహములు చేయించుటకు వారిని గట్టిగా పుర్లెక్కించాను. నీ సహాయం కూడా వుంటే పార్వతమ్మ వివాహం మన పట్టణంలో ఫస్టు (first) బ్రహ్మ సమాజ విడోమారోజి (widow marriage) గా వుంటుంది. చేసుకునే కుర్రవాడు బ్రహ్మ సమాజ మతస్తుడు గన్క రేషనల్ కన్సమేషన్ (Rational consummation) అనేది మనం ప్రతిష్ఠించిన వారమగుదుము.

**గిరీ** : సందేహము లేమయ్యా అడగవచ్చునా?

గంగా : అడగకపోతే యెటులను.

గిరీ : ఇదివరకే వ్యవహారం జరిగిపోతూ వుంది. నలుగురూ ఐకమత్యంగా రిఫారం పని చేసుకుపోతూ వున్నారు. ఇప్పుడు నాయుడుని లేవదీశారు. మాధవయ్య గారికి తాను పట్టిన కుందేటికి మూడేకాళ్ళు. ఇప్పుడు మీరు చేస్ని దోహదం వల్ల వారుభయులు జుత్తూ జుత్తూ పట్టుకుంటారు. ఈ దేశంలో రిఫారం (Reform) అమాంతంగా రెండు ముక్కలవుతుంది. అదే నా అభిప్రాయం. మామగారు శలవియ్యండి.

ది.రా : (ఆత్మగతం) వీడు అసాధ్యప్పిండం. యితడి సహాయం లేనిది పని కాదు. మామ అని పిలవడం ఆరంభించాడు. యుగంధరరావు నేనూ స్కూలులో చదువుకునే రోజులలో అన్నా తమ్ముడు అని పిలుచుకునే వారము. యెదిగిన పిల్లలు గల తండ్రులను మామ అని పిలిస్తే మనస్సుకు కించిత్తు అనుమానం తగులుతుంది. యింట్లో చనువుగా తిరుగు తాడు వద్దంటే బాగుండదు. యెంతటి వాడికైనా వీడిని చూస్తే సరదా. ప్రవర్తన చెడ్డదని వినలేదు. గాని వీడి నాటకాలు, గారడీ చూడకుండా పిల్లల్ని ఖాయిదా పెట్టాలి. వెధవ పిల్లని మాత్రం యీ వూళ్ళో వుంచితే మాటదక్కదు. అన్న దగ్గరకు పంపించివేతాము.

గిరీ : మామగారు! యేమిటి ఆలోచిస్తున్నారు.

ది.రా : మరేమీ లేదు. మీ నాయినే యీ వ్యవహారంలో ప్రవేశిస్తే నీవు హాస్యాలు అడ్లు మాని సహాయం చేతువు గదా!

గిరీ : మా తండ్రి యే వ్యవహారములో దిగినా ముందూ వెనుకా చూడకుండా దిగేవారు. తండ్రిగారు దిగినా నాకు తోచిన మాటలు చెప్పవలసివస్తే చెప్పే వాడినే.

ది.రా : అయితే నీవంటి బుద్ధిమంతులు సంఘ సంస్కారముకు మొనగాళ్ళయి వుండిన్నీ బేసవబయిన మార్గాన్నపని జరుగుతూ మనమంతా అన్య మతస్తులకు హాస్యాస్పదం కావడం నీకు మనస్కరించి యున్నదా? పెళ్లాడే కుర్రవాడు బ్రహ్మ సమాజ మతస్తు డైనప్పుడు హిందూ శాస్త్రోక్తంగా పెళ్లి చెయ్యడం నీకు యుక్తమనే తోచిందా?

గిరీ : పెళ్లికూతురిది యే మతమో ఆలోచించారా? (ఆత్మగతం) యిదివరకు రంకుమతం.

ది.రా : మనలో స్త్రీలు అజ్ఞానులు. అస్వతంత్రులున్ను. వాళ్ళకి "గతానుగతికో లోకః" అన్నట్లు ఆచరణే గాని మతమంటూ వకటున్నదీ? క్రమంగా ఆ పిల్ల భర్త మతం అవలంబి స్తుంది. యిన్‌యేంటిసిపేషన్ (in anticipation) మనం అందులో చేర్చవచ్చును.

గిరీ : కిరస్తానులు, తురకలూ, విధవా వివాహం చేసుకుంటే హిందూ సంఘ సౌంస్కారానికి యెంత లాభమో బ్రహ్మ సమాజం వారు చేస్తే అంతే లాభము. అంతకంటె సవరలు,

కోదులు, గడబలు, మొదలయిన కొండ జాతుల ఆచారాలంటే తెల్లవాళ్ళు చెవికోసు కుంటారు. పేపర్లలో వ్రాసినా చదవతగి వుంటుంది.

**ది.రా** : (ఆత్మగతం) కర్ణ పిశాచి వున్న వాళ్ల దగ్గిర కాని కీలు దాగవు.

(ప్రకాశం) ఒక పోయింటు నీవు మరచిపోతున్నావు. హిందూ హిందూ అనే మాట తుడుపు పెట్టి సంఘ సంస్కారమే ముఖ్యముగా ఆలోచించవలసి వుంటుంది. హిందూ అనే మాట చేర్చగానే మన వుద్యమముల లాభము సంకుచితమవుతుంది. రాచకీయ వ్యవహారములలో అన్ని మతముల వారమూ కలుస్తూన్నామా? లేదా? యౌవ్వన వంతులైన వితంతువుల బ్రతుకు సుఖ రహితము కాకుండా వుండడము సంఘ సౌంస్కారము యొక్క ముఖ్యోద్దేశము కదా! యేమత ప్రకారమైతేనేమి వారలు పెండ్లి చేసుకొని సుఖించుట సంఘ సౌంస్కారము కాదా? బ్రహ్మ సమాజమతము కూడా హిందూ మతములలో నొకటని నా అభిప్రాయము. పుత్ర ప్రాయుడవు కావలసినవాడవూ గనక నీ ఆసరా మీద కించిత్తు సంఘ సౌంస్కార రూపకమైన లోకోపకారంలో దిగతలచితిని. నీకు తోడ్పడడముకు యిష్టము లేని యెడల యింతటితో విరమిస్తాను.

**గిరీ** : (ఆత్మగతం) బాణం గురి దాటింది. మిగిలిపోనియ్య కూడదు.

(ప్రకాశం) నేను చెయ్యబూనుకున్న సహాయం చేసి తీరుతాను. గిరీశం అన్నమాట తప్పినాడన్న మాట యీసర్కి పుట్టలేదు. భగవంతుడనుగ్రహం వల్ల ముందయినా అలా అనుటకు అవకాశము కలుగకూడదు. వధూవరులను యిక్కడకు తెచ్చి దిగబెడతాను. గాని మామగారు పెట్టుతూ వున్న బ్రహ్మ సమాజ హిందూ వివాహ విధానముల కలహంలో నేను చేయి జేసుకో జాలను. సవబు కావలిస్తే నా స్వల్పాను భవమును బట్టి చెప్తుతాను. యెవడి మతం వాడికి సవబు, యెదుటి వాడి మతం వాడికి బేసవబు. నిజమయిన సవబు స్వర్గంలో వుంటే వుండవచ్చును. మనిషికి మనసాసవబుతత్వమాలోచిస్తే మనోవృత్తులు ముందు పరుగెత్తుతాయి. మాటకారి సవబులు కలిపిస్తాడు. నిష్కల్మషమయిన మనస్సు అవ్యాజ్యమయిన భూతదయా వుంటే యేమతమయినా సమ్మతమే.

**ది.రా** : మామ! నీ మాటలు లేబరింతులా గనబడుతాయి. మాటలను బట్టి మతం పోల్చడం శక్యం కాకుండా వుంది. ఒకమారు శాస్త్రంలో కర్రెత్తుతావు. మరచటి క్షణం శాస్త్రాన్ని తిరుగదోసి సవబుకోసం కత్తి తీస్తావు. ఆ వెంటనే లోకంలో సవబు లేదంటావు.

**గిరీ** : నా మతం నాకే పోల్చడానికి దుస్థరంగా వుందనుకుంటాను. మతం వుపాది వేసి కడతారనుకున్నారు కాబోలు మామగారు – యెండవేళ వొక మతం – చల్లని వేళ

ఒక మతం – కడుపు కాల్తూవున్నప్పుడు ఒక మతం – కడుపు నిండినప్పుడు ఒక మతం – అందులో అంబలి మతం – పప్పు నెయ్యి మతం – గోధుమ రొట్టె మతం – మద్యమాంస మతం – యేరెకుతినే వాకపళ్ళ మతం– డబ్బిచ్చి కొనే మామిడిపళ్ల మతం – గడవడం గడవకపోడాన్ని బట్టి అంతర్భేదాలు కలవు. అలసివున్నప్పుడో మతం – వంటరిగా వున్నప్పుడో మతం – అతివ చంతనున్నప్పుడు ఒక మతం – లంగరు లేని నావలాగ మతం మనస్సు యొక్క శరీరము యొక్క స్థితిని బట్టి చెలిస్తూ ఉంటుంది. కొన్ని వెఱ్ఱులు మాత్రం నాకు వున్నాయి అనుకుంటాను. మనసుకు మాటకు విడాకులైనప్పుడు మాటునున్న మాట మార్కట్టులో పెట్టాలనే పట్టలేని ఉత్సాహం ఒకటి –సూదంటి రాయిని యినుమంటినట్లు మంచివాళ్లు కనిపిస్తే వాళ్లను అనుకొను స్వభావం రెండు–యెదిరించిన వాడి మీద కయ్యానికి కాలు దువ్వడం మూడు – కష్ట సాధ్యమైన పని తటస్థించి ఫలితం మంచిదని తోస్తే ముందూ వెనకా చూడకుండా అందులో వురకడం నాలుగు–లైఫ్ (life) లో వుండే చమత్కారాలు వెతుక్కుంటూ పోవడం అయిదు – తమ వంటి పెద్దల శలవు ప్రకారం నడుచుకోవడం ఆరోమతం. అక్కడికి షణ్మతాలు స్థాపనయినాయి. ఇన్ని మతాలు ఒక్క చోట గూడిన ఒకతెన్ను యెలా వెళతాయి.

ది.రా : అందుచేతనే లోకం నువ్వు చెప్పినట్టల్లా వింటారు. అటువంటి మనిషివి నాబోట్లు చెప్పినట్టు వినడమనేది వాత్సల్య సూచికం. ఆ మాత్రం ఆసరా యిచ్చావంటే నేను కూడా సంఘ సౌంస్కారానికి కించిత్ సహాయభూతుణ్ణి కాగలను. ప్రస్తుతాంశమేమిటి?

గిరీ : మీరు చేస్తానన్న ద్రవ్య సహాయము సెటిల్ (settle) కావలెను.

ది.రా : రామమూర్తికి మూడు వందల రూపాయిలు యిస్తానన్నానే.

గిరీ : యెప్పుడు?

ది.రా : పెళ్లి అయిన తక్షణం.

గిరీ : బ్రహ్మ సమాజ మత ప్రకారం వివాహం కాక శాస్త్రోక్తంగా అయితే?

ది.రా : బేసవబుగా అయిన పనిలో మనం యేలా సహాయ భూతులం కాగలం?

గిరీ : యే ప్రకారం జరిగినా సరే, ఇప్పుడు ఆ సొమ్ము చేతులో పడితేనే ముందు పని జరగడం లేకుంటే యిక్కడితో సమాప్తి.

ది.రా : Hard terms. you can trust me to pay.

గిరీ : Immediate payment will obviate the necessity for trust, Some money has to go in to the hands of divers persons persons including the brid.

ది.రా : కంసాలికూడానా?

గిరీ : లేదు.

ది.రా : నీవు ప్రాజ్ఞుడవు. నీకు నేను బుద్ధి చెప్పవలసిన వాడను కాను గాని అనుభవాన్ని బట్టి చెబుతున్నాను. బ్రాహ్మణ సంఘ సౌంస్కారంలో కంసాలి వాడు అమాయకంగాను అనపేక్షగాను కలుస్తాడంటే నమ్మవద్దు. యేదో వక ఘట్టి సామిద్రోహం చేసి మన పరువు తీస్తాడు.

గిరీ : నేను ఆ జాగ్రత్త పడగలను. అయినా జాగ్రత్త ఈ వ్యవహారములో అవసరం లేదు. మనము సంఘ సౌంస్కారమని వేశడు మాట ఉపయోగించి లోకాన్ని మూరెడెత్తు పెరిగించామని సంతోషిస్తున్నాము. కంసాలి బాపనోళ్ళకులం చెడుతున్నారు గదా అని ఆనందిస్తున్నాడు. అదివకటి మనకి సేఫ్ సైడ్ (safe side) మరి ఒకటేమిటంటే రామమూర్తి పెత్తండ్రి కొడుకు వెంకన్నని వున్నాడు. వాడియందు కంసాలికి పుత్రప్రేమ. ఆ వెంకన్నని తిన్నగా పెంచక వాడి వంతు భూముల ఫలసాయం పెట్టి కొండుభొట్లు రామమూర్తికి ఇంగ్లీషు చదువు చెప్పించాడని మరికొన్ని కారణాల చేత కొండుభొట్లు మీద కోపం. రామమూర్తికి మేనరికం కుదిర్చివుంచాడు. యీ విధవా వివాహం అయినట్టయినా మేనరికం తప్పిపోతుంది. ఆ పిల్లని వెంకన్నకి పెళ్లి చేయించాలని అక్కాబత్తుడు కుట్ర చేస్తున్నాడు. గనుక భయపడ్డానికి అవుసరం లేదనుకుంటాను. పెళ్లికి తర్లి మూడో రోజు రాత్రి యీ వూరికి పదకొండు మైళ్ళ దూరముననున్న చెరుకువాడ సత్రంలో దిగుతారు. అప్పట్లో మీ గుఱ్ఱబ్బండీ సత్రం పెరటి గొబ్బరితోటలో వుంచి యీ కంసాలి హికమత్ మీద వధూవరులను దాల్లో యెక్కించి రాత్రి వుండగానే తమ యింట్లో పెట్టాలి.

ది.రా : కొంపదీసి మా యింటికే?

గంగా : (ఆత్మగతం) అమ్మగారు పంతులుగారికి వధూవరులకు కూడా గోమయోదకస్నానం, చీపురుగట్ట ప్రయోగం చేత ఉచ్చాటన వెంటనే చేస్తారు.

గిరీ : మీరు పబ్లీకుకు రాకూడదో? మామగారు యింత పిరికి అని నేననుకోలేదు.

ది.రా : పిరికితనమా? యుద్ధానికి వెళ్లమంటే వెళతాను. సమయోచితమయిన జాగ్రత్తను పిరికితనమంటారా? కుర్రవాళ్ల బుద్ధి మిలమిల పరుగెత్తుతుంది. ముసలి బుర్రలు కొంచెం పస్తాయిస్తాయి. కార్య సానుకూలం అయ్యే వరకు పైకి రాకూడదు వకటి. రెండవది నా సహాయ్యం కావలసినదిగాని నా పేరు గొప్ప కావడం నేను విలవగా

యెంచను. మూడవది మా వంటి వాళ్లం సంఘంలో వుండి మీ అభిప్రాయములను వ్యాపింపచేస్తే లాభం గాని – అంతా యేట్లో దిగితే లాభం లేదు. కొంతమంది మన వాళ్లని పించుకున్న వాళ్లం గట్టుమీద వుంటే మనకే లాభం.

**గిరీ** : దానిపేరు ఇంగ్లీషులో టైమ్ సెర్వింగు (Time serving) అంటారు.

**ది.రా** : (అది....) మంచి అభిప్రాయములకు చెడ్డపేరు మహా సులభంగా యిస్తారు.

**గిరీ** : వధూవరులను మా యింట్లో పెట్టనా?

**ది.రా** : (ఆత్మగతం) యితని యింట్లో పెడితే బట్ట బయలవుతుంది. నలుగురూ చేరి అంతా Credit కోసం దేవులాడితే మన Credit సన్నగిల్లుతుంది. (ప్రకాశం) మీ యిల్లు సత్రవు. అక్కడయేం చేసినా చిదంబర రహస్యం. ఈ వ్యవహారం మట్టుకు పెళ్లి పీటల మీద... లేదు. కుర్చీల మీద కూర్చునే వరకూ వధూవర్లు ఫలానీ వారనీ యెవరికిన్నీ తెలియకూడదు. బ్రహ్మసమాజ మతం ప్రకారం పెళ్ళి కావడమునకు ప్రయత్నం నేను చేసుకుంటాను. యేదో ఒక విధవా వివాహము సిద్ధమయినదని నాయుడు గారితో చెప్పుతాను, గాని పేర్లు చెప్పను. తెలిసినదా, బ్రహ్మ సమాజం, పద్ధతి వల్ల మరివక వుపయోగం కనిపెట్టాను. శాస్త్ర ప్రకారం అయితే మంచి ముహూర్తం దాకా వితంతువుని దాచి వుంచడం దుర్లభం. యీ లోగా బంధువుల వల్ల చాలా తొందర కలుగుతుంది. బ్రహ్మసమాజం ప్రకారమయితే పిల్లవచ్చిన మర్నాడు సాయంత్రమే పెళ్ళి చేసి వేయవచ్చును. నాకు తోచిన సలహా యేమిటంటే మాబగీచాలో వధూవర్లును ఆ రాత్రి పెట్టి....

**గిరీ** : బాగుంది! రూపాయిలో?

**ది.రా** : యివిగో! అని.....

(పెట్టె తీసి రూపాయిలిచ్చును)

**గిరీ** : Thank you (అని నిష్క్రమించును)

**గంగా** : (ఆత్మగతం) గాడిద కొడుకు! యిన్నాళ్లు ఆశ్రయించాను. నాకు నెలకి యేడు రాళ్లు యిచ్చేటప్పటికి కళ్ల నీళ్లు పెడతాడు. ఈ వెధవ పెళ్లికి మూడు వందలు ఖర్చు పెడుతున్నాడు.

**ది.రా** : శాస్తుల్లు గారు! యీ సంగతి మనవాళ్ళకి తెలియనీకండి. మీరు చెప్పాలి. నేను చెప్పాలి మరెవరూ చెప్పరు.

**గంగా** : "ఘట్కర్ణాభిద్యతే మంత్రాని" అన్నాడు.

**ది.రా** : గిరీశం చెప్పడు. లోగిట్లో వాళ్లు ఆ సమయంలో వుంటేమట్టుకు ఆబోరుదక్కదు. వాళ్లు పుట్టింటికి పంపించమని సంవత్సరమై తొందర చేస్తున్నారు. ముహూర్తం యీలోగానేకుదిర్చి మీరు తీసుకుని వెళ్లి దిగబెట్టండి.

**గంగా** : మీరు విధవా వివాహములో కలుస్తే బహిష్కారం అవుతుందే.

**ది.రా** : యింతేనా నా మంత్రశక్తి శాస్తులు గారు. చూశారు బ్రహ్మసమాజ మత ప్రకారం పెళ్ళి అయితే మనం చేసే సహాయ సంపత్తి వల్ల బాధకం లేదు. పెళ్లి సమయంలో వెళ్లి Tiffin పుచ్చుకున్నా, కిరస్తానులు, తురకలు వద్ద పుచ్చుకున్నట్టే గాని అంతకన్న తప్పు పట్టడానికి అవకాశం లేదు. క్షీరం కలిసినందువల్ల కాఫ్యాదులు చెండాల హస్తంలో నుంచి ఆరగించవచ్చును.

**గంగా** : బోధపడ్డది.

(యిద్దరూ నిష్క్రమింతురు)

# కొండుభొట్టీయము

## తృతీయాంకము

### తృతీయ రంగము

(కంసాలి దుకాణం)

(అక్కాభత్తుడు వెంకన్న ప్రవేశించును)

**అక్కా** : వెంకన్నా! పంతులు చెడిపోతున్నాడు. దాని శాష్టలు బహు అక్రమంగా వున్నాయి. మీ బాబు మంత్రాంగము వల్ల యవరు బాగుపడ్డారు?

**వెంక** : మా బాబు యేం చేశాడు?

**అక్కా** : యేం చెయ్యలేదు. సానిదాన్కి సరసుల్ని తార్చి సంపాదిస్తాడు. పంతులుకి రత్నం వంటి పతివ్రత అయ్ని భార్య వుండగా దీని మాయలలో దింపేశాడు.

**వెంక** : పంతులుని మీరు బాగు చెయ్యరాదు!

**అక్కా** : మీ బాబు మంత్రాంగం మీద మన బుద్ది లెక్కవు. గాని పంతులు కంటి మసక వదలడాన్కి వక మందు చెప్పతాను. చెయ్యి.

**వెంక** : నేను వైద్యుణ్ణి కాను.

**అక్కా** : మందనగా వుపాయము. యీవేళ పంతులు తండ్రి తద్దినం. అంచేత మంజువాణి యింటికి రాత్రి యీ సమయము చూచి కొండిభొట్లు తోళ్ళ సాయిబుని మంజువాణి యింట్లో ప్రవేశపెట్టబోతున్నాడు. నువ్వు తిన్నగా వెళ్ళి ఈ మాట పంతులుగారితో చెప్పి పదకొండు ఘంటల ప్రాంతాన పెరటి గోడ గెంతి అమాంతంగా లోపలికి వెళ్లమను. నేను వీధి గుమ్మం తలుపు గొళ్లెం పెట్టుతాను.

**వెంక** : తురకాడుంటే పంతులుకేమి?

**అక్కా** : చూస్తూగాని నీకే తెలుస్తుంది.

(తెర దించవలెను)

# కొండుభొట్టీయము

## తృతీయాంకము

### చతుర్థ రంగం

(మంజువాణి ఇల్లు)

(మంచంమీద కూర్చుని హుక్కా పీలుస్తూ సాహేబు గారు కింద తివాచీ మీద కూర్చుని కొండుభొట్లు ప్రవేశించును.)

**సాహే** : క్యో! దేర్ హోతాజీ.

**కొండు** : పోషక్ బనాతే మహరాజ్.

**సాహే** : క్యాపోషక్ – ఆన్‌కో పోషక్ కర్తే రాత్ బహుత్ హోగయ, తోడా వేదం బోలోజీ.

**కొండు** : (ఆత్మగతం) తురక వెధవ వేదం చదువమంటున్నాడు.

(ప్రకాశం) సాహేబు గారు వచ్చారు.

మహదొడ్డవారువై!
మదదుక్కలాగ వున్నారు!
గొడ్డుమాంసము తిందురు!
లెంపకాయ ఆచికొట్టేను
దవడపళ్ళూడిపోవును ఇత్యమరః

సాహేబుగారు వచ్చారు!
మహదొడ్డవారువై!
మోటవారేమి చేస్తారో!
భయం వేయుచున్నది!
గంజాయి పీల్చు మార్గాన!
వొళ్ళు తెలియక యుందురు ఇత్యమరః

(దాసీ ప్రవేశించి కొండుభొట్లు చెవిలో)

**దాసీ** : సాయిబుకు తెలుగువచ్చునా?

**కొండు** : వక్క అక్షరం రాదు. రెండు నెలలు కాలేదు ఢిల్లీ నుంచి వచ్చాడు.

**సాహె** : ఢిల్లీ క్యా బోల్తేజీ,

**కొండు** : డిల్లీ బాద్షాకె అబ్ భాయి బంధుకర్కె బోల్దియా.

**సాహె** : (లేచి వచ్చి వెన్నుమీద గట్టిగా చరిచి)
తు అచ్చా బొమ్మన్ హై.

**కొండు** : చచ్చానురోయి. నీ అమ్మా శిగతరగా!

**మంజు** : (తెర అవతల నుంచి) సాయిబుని వెళ్ళిపొమ్మను. వెధవ కసాయి వాడిలా వున్నాడు. తోళ్ల వాసన కొట్టుతున్నాడు.

**సాహె** : క్యాబోల్తేజీ!

**కొండు** : ఫెట్మె దర్ద్ హైకర్కె బోల్తే

**సాహె** : ఝూటాబాత్ దగాకర్తెతో తుమ్మొమార్తె (అని ముష్టియెత్తును)

**కొండు** : వాణ్ణి పొమ్మన్నమాట
చెప్పజాలనువై
తురకః కరకశ్చేవ
ద్యానేతౌ మలమోచకౌ।
తురకాడు కరక్కాయ
పేరు చెప్తే విరోచనం।
నీవు రాకుంటే వీడ్నించి
యింటికి మెల్లిగానువై।
జారిపోతాను లేకుంటే
నాకిక్కడాబోరు దక్కదు॥

**సాహె** : కంచన్ క్యం నై ఆతేజీ?

**కొండు** : అబి ఆతే మహారాజ్

**మంజు** : గుల్లో కూచుని, తలుపు గడియ వేసుకున్నా ములే; నేను వెంకిని, సాయిబుని పైకి గెంటెయ్యి లేకుంటే వాడి చేత తాపులు తిను.

**కొండు** : ధర్మం కాదిది మంజువాణి వినుమా (Read like a verse)
దాగుంట, ధైర్యంబూనీ
నవలంబించియు పైకి వచ్చి మరియున్
ప్రాణంబు దక్కించుమా
లేకుంటే నిటదీపమార్పి మరియున్
నీకొంప కగ్గెట్టుదున్
నీవు న్నీ చెలికత్తె కూడ గదిలో
చిచ్చెట్టి చస్తారువై॥

**సాహె** : బహుత్ అచ్ఛాగాతేజీ (అని తిరిగీ కొండుభొట్లును తట్టును)

**మంజు, వెం** : యెవళట్టో వీధిలోను? (అని గొంతెత్తి అరచును)

**సాహె** : క్యా గడ్‌బడ్ జీ?

**కొండు** : యెఘర్మె ఏక్ బడా బ్రహ్మరాక్షసికహతే. బడా బొమ్మన్ సైతాన్ హై.

**సాహె** : సైతాన్ గియితాన్ మార్దేతి (అని కట్టి సవరించును)

(పంతులు తలవిరబోసుకొని చేతులో లాఠీ పట్టుకుని కోపముతో)

"ముండా మంజు వాణి" (అని తొందరగా ప్రవేశించును.)

(కొండుభొట్లుని చూసి) వెధవ పకీరు వెధవ! నువ్వుండేన యీ దౌర్జన్యం చేస్తున్నావు? (అని కొండుభొట్లును కర్రతో కొట్టును)

**సాహె** : యెహాయి బొమ్మన్ సైతాన్?

**కొండు** : హై మహరాజ్.

**సాహె** : (కర్రతో రెండు దెబ్బలు పంతుల్ని కొట్టేసరికి పంతులు చతికిలబడును)

**కొండు** : (వీధి తలుపులోపలి గడియతీసి తియ్యబోతే రాదు) యెవడో తలుపు గొళ్లెం వేశాడురోయి! పెరటి తోవను పోదామంటే అడ్డంగా తురకాడున్నాడు! యిఖనేమి సాధనం (ఆత్మగతం) దీపం ఆర్పేస్తే పంతులు పారిపోతాడు. (దీపం ఆర్పేసి సాహెబు మీద, పంతులు మీద బిందెతో నీళ్లు విసురును.)

**సాహె** : అరే బహుత్ బడా సైతాన్ హై. ఇహాసె చెల్జానా (వీధి తలుపు తియ్యబోగా రాదు. తలుపు బలత్కారంగా తీసి వెళ్లిపోవును.)

(తెరదించవలెను)

# కొండుభొట్టీయము

## తృతీయాంకము

### పంచమ రంగము

(అక్కాబత్తుడి యింటి అరుగు : వెంకన్న, కొండుభొట్లు అక్కాబత్తుడు ప్రవేశించును)

**కొండు** : సాయిబు పంతుల్ని చావగొట్టేడు.

**అక్కా** : యెక్కడ?

**కొండు** : మంజువాణి యింట్లో

**అక్కా** : మీరెందుకున్నారక్కడ?

**కొండు** : పంతులుగారి యింట్లో ఆడవాళ్ళకు పురాణం చెప్పి వస్తూండగా మంజువాణి ఇంట్లో గడబిడ అవుతు వుంటే తొంగి చూశాను.

**అక్కా** : అయితే యేం చయ్యమంటారు? కనిష్టీబుల్ని పిల్చుకు వెళ్ళుదాం.

**కొండు** : వొద్దు బాబు! లేనిపోని అల్లరి చెయ్యకండి! తమరు దయచేస్తే చాలును.

**అక్కా** : తురకాడు నాకు దేహశుద్ధి చేస్తే?

**కొండు** : వెళ్ళిపోయినాడు.

**అక్కా** : కొండుభొట్లుగారు! లాంతరు తెండి. నేను చేతికఱ్ఱ పట్టుకు వస్తాను.

(ముగ్గురు నిష్క్రమింతురు)

# కొండుభొట్టీయము

## తృతీయాంకము

### షష్టమ రంగము

(పంతులు మంచమును జారబడి జాపోయుచుండును. అక్కాబత్తుడు చేతికఱ్ఱయు – వేంకన్న లాంతరును పట్టుకొని కొండిభొట్లు ప్రవేశించును)

అక్కా : యేమిటండి పంతులుగారు?

పంతు : యేమీ లేదండి ... శాస్తుల్లూ! వీడ్నెందుకు తీసుకొచ్చావు?

కొండు : సాయిబు మళ్ళా వస్తాడేమో అని భీతాహం చేత తీసుకొచ్చాను.

పంతు : సాయిబు యింగువ అమ్మకానికి కాదూ వచ్చాడు?

కొండు : వెధవ అందుకే వచ్చానన్నాడు (మెల్లిగా) సానివాళ్ళ మాయలు నాకేం తెలుసును.

అక్కా : యెందుకట్టే చర్చ పంతులుగారు. యిక్కడ వుంటారా? యింటికి వస్తారా?

పంతు : యిహెంధుకు యిక్కడ యింటికి వెళ్లి పోతాను.

మంజు : (మంజువాణి పంతులు వెనుక నుంచి ప్రవేశించి) అక్కాబత్తుడు గారు మీరు వెళ్ళిపొండి.

పంతు : (కుంటుతూ లేచి కమ్చీ తీసి)

ఆ యింగవమ్మే తురకాడికోసమేనా యీ ముస్తాబంతా?

(అని కమ్చీతో మంజువాణిని కొట్టును. అక్కాబత్తుడు కొరడా చెయ్యి పట్టుకొని)

అక్కా : శాంతించండి పంతులుగారు.

మంజు : (చేతిలో కొరడాలాగికొని రెండవ జబ్బ, తనచేత్తో పట్టుకొని) పంతులుగారు కారు వీరు అమ్మ గారు. ఆడవాళ్ల మీదికి సూరులు –సాయిబు దగ్గిర లేకపోయిందీ పౌరుషం నేను వేశ్యను నా వృత్తి ధర్మం నే మానను. మీ యింట్లో వున్న సంసారి వేశ్యను ఖాయిదా పెట్టుకొండి.

పంతు : యేమిటి పేలేవూ? చూడు (అని పెనుగు లాడును)

కొండు : ఊ.... ఊరుకొమ్మని మంజువాణికి సౌజ్ఞ చేయును.

మంజు : పంతులుకి యింకా గీటణగలేదు. వెంకీ! యిక్కడే వీధిలో వుంటాండు తీసుకురా.

వెంక : పిలవమన్నావా యేమిటి?

కొండు : వెధవాయ! వూరుకోవోయి– సాయిబు మళ్లీ వస్తే చంపేస్తాడు. పంతులుగారు దయచెయ్యండి.

(అని పంతులు చెయ్యి పట్టుకొని లాగును. పంతులు కొండుభొట్లు గుమ్మము దాటుతూండగా చురచుర చూస్తూ, మంజువాణి పంతులు వీపు మీద ఒక దెబ్బ తిరిగి చూచిన కొండుభొట్లు వీపు మీద ఒక దెబ్బ వేసును.

(తెర దించవలెను)

# కొండుభొట్టీయము

## తృతీయాంకము

### సప్తమ రంగము

(కొండుభొట్లు యిల్లు)

అరుగు మీద బిచాణ పరచుకొని కూర్చుని పొడుం పీల్చి

**కొండు** : ఇవాళ యేమి ప్రమాదాలు వచ్చాయి. పంతులు కొట్టిన దెబ్బ రక్తం బొటబొట రక్తం కారింది. గాడిద కొడుకు నిద్దరపోతే తురకాడు కల్లో వస్తాడేమో అని భయంగా వుంది. రామస్కంథం, హనూమంతం, వైనతేయం, వృకోదరం, శయనేయస్సరే న్నిత్యం దుస్స్వప్నం తస్యనశ్యతి. (నలుదిక్కులా కలయజూచి పడుకొనును)

(సాహెబు ప్రవేశించి)

**సాహి** : ఉఠోజి

**కొండు** : (ఆత్మగతం) ఓర్నాయన సాయిబు కాబోలు... నిజమా ? కలా?

**సాహి** : ఉఠోజి, (అని గట్టిగా వెన్ను మీద చరచును.)

**కొండు** : (లేచి) చంపేశావు.

**సాహి** : కంబన్ ఘుర్కు ఫిర్ చల్నా ఆప్.

**కొండు** : ఆహా; .... హాహా.... హి..... ఖురావంద్ కంబన్ ఘుర్మే బడా బొమ్మన్ సైతాన్‌హై హమ్‌దర్తె

**సాహె** : కూచ్ ఫర్వానహి. బొమ్మన్ సైతాన్‌కు మార్ దేయంగే.

**కొండు** : హమ్ బొమ్మన్ హై కంచన్ ఘుర్కు చల్నా బొహుత్ దోష్ కర్కి అమార శాస్త్రమే హయి.

**సాహె** : తుమ్‌కు కోన్ శిఖాయ?

**కొండు** : అమార బాప్ శిఖాయ.

**సాహె** : ఆజ్ తక్ ఆల్ కంచన్కు ఘుర్ నై చల్తీ

**కొండు** : కంచన్‌కు ఘుర్కు కిభీనై జాయెగ.

**సాహె** : అయిసాత్ తుమారీ దేవత్సే ప్రమాణ కరో.

**కొండు** : (ఆత్మగతం) ఘోర ప్రమాణాలు చెయ్యమంటాడు. యెవరిశక్యం, కందుల గూనలో కాసులు యెవడు వదులుకోగలడు? వీధిలో చడి అవుతూంది. ఓ కేక వేస్తునా.

**సాహె** : పుకార్ కర్నే, తొగలాకాటు దేయంగే (అని గొంతుకు చేత్తో పట్టుకొనును.)

**కొండు** : (ఆత్మగతం) మనస్సులో మాట మనస్సులో వుండగానే పోలుస్తాడు. మనిషి కాడు దెయ్యం అనుకుంటాను (ప్రకాశం) యిదిగో జందెంపద్కె శపథం కరేంగే, హం కంచన్కు ఘర్కునై జాయంగే - దేఖోజీ దర్తె హమ్కు బుఖార్ ఆయ (అని చెయ్యి చూపును)

**సాహె** : అచ్ఛా! కెబీ కంచన్కు ఘర్కు జాన్‌తే గల్లా కాట్‌గా (అని నిష్క్రమించును.)

**కొండు** : చలి వొణుకు వచ్చాయిరా బాబూ పార్వతీ, కుంపటి తేవే కుంపటి-కుంపటి (అంటూ నిష్క్రమించును)

# కొండుభొట్టీయము

## తృతీయాంకము

### అష్టమ రంగము

(కొండుభొట్లు యిల్లు. రాత్రి భోజనం చేసి బట్టలు కట్టుకొని పైకి వచ్చి గుమ్మం అవతల నిల్చి)

**కొండు** : తురకాడి దెబ్బ పదిహేను రోజులు మంచంయెక్కించింది. మంజువాణి ఫికర్లేదు. ఇన్నాళ్లకు ఆశ్రయించి యెంతో సహాయ సంపత్తి చేసినాను. శాస్తులు గారికి యెలా వుందని మాటవరుసకైనా వర్తమానం పంపించలేదు. పంతులు కూడా అదే పద్ధతి అవలంబించాడు. మంజువాణ్ణి వదిలేసి యేకపత్నీవ్రతుడయినాడుట. దెబ్బకి దెయ్యం వెరుస్తుందన్నారు. గాడిద కొడుకు నన్ను కొట్టాడయ్యా... యీసర్కి గాయం మానలేదు. వీళ్ళు మాగడపలోకి రావద్దంటే మాత్రం.... కందులగూనలో కాసులకి కామమ్మ సరసాలకి దూరమై పోతాం. మంజువాణికి యేమిటి అపకారం చేశాను. ఒక్క తుమ్మలపాలెం వాడు డబ్బియ్యకుండా వెళ్ళి పోయినాడు. అదొకటిన్ని సాయిబు కొంచం భయోత్పాతం చేశాడు. తలుపుకి మాత్రం కించిత్తు మరామ్మత్తు తటస్థించి వుండవచ్చును. అయితే, ఆ అల్లరి తురకాడు చేసిన దేహశుద్ధి తోటి పంతుల ప్రాపకం పడిపోయిందని కోపం వుంటే వుండవచ్చును. పైపత్యంలో వున్నాను. ఇంకా దేహానికి జవసత్వం రాలేదు. తొందర పాటు మనిషి... కమ్చీ తిరిగేసిందంటే మళ్లా మంచం

యెక్కాలి. కుఱ్ఱవాడి పెళ్ళి వ్యవధి లేదు. కందులగూనలో కాసులు చేతపడితేనే గాని పప్పుడకదు. యేమిటి సాధనం... మరేమిటీ లేదు. తిన్నగా వెళ్లడం యెవరూ చూడకుండా లోపల ప్రవేశించి, తటాలున దీపం ఆర్పివెయ్యడం. కందులగూన దగ్గరకు ఒక్క దాటు వేసి కాసుల పొట్లాం సంధించుకొని ఆంజనేయులలాగ పైకి లంఘించడం... వెళదామా... తురకాడితో సానింటికి వెళ్లనని చెప్పానే... వెధవ చూడొచ్చాడాయేమిటి.... వాడికిదే తనుపా? గొడ్డును కోసుకుతినే వాడు సర్వాం తర్యామా యేమిటి? కోళ్ల కొట్టు మేడ తలుపు తాళం వేసి వుంది. మంత్రజాలం సాయిబు వూళ్ళో లేడు. ఆ చుట్టు పట్ల యెంతోసేపు నిలబడ్డాను. హుక్కా పొగ వాసన రవ్వంతైనా కనపడలేదు. "పర్వతోవహ్నిమస్థమాత్ ధూమాత్" అన్నాడు. ధూమం లేకపోతే అగ్గి లేదు. అషువలెనే హుక్కా ధూమం లేదనే కారణం చేత అగ్గి రాముడనే సాయిబు కూడా నాస్తి, యితి సిద్ధాంతః – ('కబడ్దార్' అని ఒక కేక వినపడును.)

ఓరిదేమిటిరోయి నాయినా! తురకాడి గొంతుక వినపడుతూంది. వూళ్లో లేని తురకాడి మాట యిక్కడి కెలా వచ్చింది. వందేమాతరం గుంటడెవడో కేకవేసి వుంటాడు... అంతే... అదే నిజం... కాని వొళ్లు కొంచెం కంపరం పుచ్చుకుంది. శబ్దం విని భయపడితే మరేం పౌరుషం శబ్దగుణం ఆకాశం. ఆకాశం నిరవకాశం శబ్దం వట్టి మిథ్య, మిథ్య, మిథ్య, అనగా యేమీ లేదన్న మాట (నాలుగడుగులు నడిచే సర్కీ "కబడ్దార్" అని తిరిగి వినపడును) మళ్ళీ వచ్చింది రోయి ధ్వని.... వణుకు పట్టుకుంది. అయితే యేం చేతాం? ఈ శబ్దానికి భయపడి రెండు మూడు వందల రూపాయిల సొమ్ము వదులుకుంటానా? తురకాడు వస్తే యేం జేస్తాడు? ఇంగ్లీషు బావుటా చల్లగా ఉండాలి గాని చెయ్యి జేసుకున్నా డంటే తురకాణ్ణి పోలీసు వారికి వప్ప చెప్పుతాను. కబడ్దార్ అప్పుడు తెలుస్తుంది. ఎందుకేనా మంచిది ఆంజనేయ దండకం చదువుతూ ఒక్క విసరున వెళ్లానంటే అన్ని భయాలూ పటాపంచలైపోతాయి. "శ్రీ మన్మహా అంజనీ గర్భసంభూత సదా బ్రహ్మచారీ కపీంద్రాదివంద్యా కిరీటోజ్జ్వలద్రత్న..." (మంజువాణి యింటి గుమ్మం దగ్గర నిలిచి, మెల్లగా తొంగి చూచి) సావిట్లో యవరూ లేరు.... సావిడి గదిలోనూ లేరు.... (మెల్లగా దీపం ఆర్పేసరికి గభీమని వీధి తలుపు గడియ వేస్ని చప్పుడగును.) చంపేశాద్రోయి సాయిబూ... అని) మంజువాణీ! బ్రహ్మహత్య జరిగి పోతూంది.

**మంజు** : మళ్లీ సాయిబుని తీసుకొచ్చావు? ఇదిగో కందులగూన వున్న గదిలోనికి వెళ్ళి గడియ వేసు కుంటున్నాము. బ్రహ్మ హత్య జరిగితే స్వయంకృతాపరాధం గాని పాపం మాది కాదు.

**కొండు** : తురకాడి కమ్చీ దెబ్బలు తప్పించుకోవడం కష్టంగా వుంది. బ్రహ్మ హత్య జరిగిస్తే బ్రహ్మ రాక్షసినై పీక్కుతింటాను.

**మంజు** : కంసాలి వీరనాభాచారి చేత మారణహోమం చేయిస్తాను.

**కొండు** : అంతటి దానవగుదువు. (ఆత్మగతం, కిందటి మాటులాగ కేకైనా వేతునా యెవరయినా రానైనా వస్తారు)

**మంజు** : "ధర్మం కాదిది మంజువాణి వినుమా దాగుంట"

**కొండు** : నువ్వా వాడితో కలిశావు. సాహెబ్ అభీ ఛోడ్ తోకెభీఫిర్ నై ఆయంగె.

**సాహె** : బొమ్మన్ బాత్ ఝూటా బాత్ అని (కమ్చీ చప్పుడు చేయును)

**మంజు** : దీపంయెందుకు ఆర్పేశావు. ఇదిగో దీపం తెస్తున్నాను. ధైర్యం అవలంబించండి.

**కొండు** : చీకట్లో కొరడా దెబ్బలు తప్పించుకొంటు న్నాను. దీపం మాత్రం తేకు ధర్మాత్మురాలివి. వీధి తలుపులు మట్టుకు తీసెయ్యి.

**మంజు** : (దీపం పట్టుకువచ్చి సాయిబు వెనక నక్కి) శాస్తుల్లు గారు! మంచం క్రింద నుంచి విజయం చెయ్యండి.

**కొండు** : సాయిబు, సైతానా? నిజమైన మనిషా?

**మంజు** : పైకి వస్తే మాట స్పష్టమవుతుంది.

**కొండు** : సాహేబ్ – సాహేబ్ కంచన్ ఘుర్కకబీ నైజాయంగే.

**సాహె** : దాలార్ఝూడ్ మే తుమ్ రహకర్ మెహెర్ చోడ్దేయంగే.

**కొండు** : (ఆత్మగతం) వీడి దగ్గర యక్షిణీ వుందిరోయి నాయన అన్ని రహస్యాలూ వీడికి వెల్లడే. గూనలో కాసులు దొబ్బింది. ఈ గండం గడుస్తే డబ్బుమాట చూసు కుందాము. (ప్రకాశం) మహరాజ్ లేజియే ఆప్కా పాం పకడ్తే.

**సాహె** : బొమ్మన్ పాంపకడ్తే.

**కొండు** : సమయం వస్తే గాడిద కాళ్లు పట్టుకోమన్నాడు. ఏం చెయ్యను.

**సాహె** : అచ్ఛా గులామల్లీ దర్వాజా ఖోలో – దౌడ్ కర్కె చెలో...

**కొండు** : (చెవల పిల్లిలాగ మంచం కింద నుండి జరిగి కుప్పించును. పరుగెత్తుటలో గుమ్మము తగిలి జారిపడును.) కందులగూనా యెంత చేస్తివే...?

(తెరదించవలెను)

# దిద్దుబాటు

"తలుపు! తలుపు!"

తలుపు తెరవఁబడలేదు. ఒక నిమిష మతఁడూరుకొనెను.

గదిలోని గడియారము టింగుమని ఒంటిగంట కొట్టినది.

"ఎంత ఆలస్యము చేస్తిని; బుద్ధి గడ్డి తిన్నది. రేపటి నుంచి జాగ్రత్తగా వుంటాను. యాంటి నాచల్లా పోయి సానిదాని పాట సరదాలో మనసు లగ్నమై పోయినది. ఒక్క పాట సరదాతో కుదరలేదు. మనిషి మీద కూడా సరదా పరిగెత్తుతూంది. లేకుంటే, పోకిరీ మనిషి వలే పాట ముగిసిన దాకా కూర్చోవడమేమిటి? యేదోవక అవకాశము కలుగఁజేసుకొని దానితో నాలుగు మాటలు ఆడడపు ఆసక్తియేమి? ఇదిగో లెంపలు వాయించుకుంటున్నాను. రేపటి నుంచి మరి పాటకు వెళ్ళను. నిశ్చయం, నిశ్చయం........ గట్టిగా పిలిచితే కమలిని లేవగలదు. మెల్లిగా తలుపు తట్టి రాముడిని లేపగల్గితినా చడి లేకుండ పక్కజేరి పెద్దమనిషి వేషము వెయ్యవచ్చును".

గోపాలరావు తలుపు చేతనంటగానే రెక్కవిడబారెను. "అరే యిదేమి!" అనుకొని, రెక్క మెల్లన తెరవ, నడవలో దీపము లేదు. అంగణము దాటి తన పడక గది తలుపు తీయ, నందును దీపము లేకుండెను. చడిలేక అడుగు వేయుచు మంచము దరికి పోయి కమలిని నిద్రించుచుండెనా, మేల్కొని యుండెనా యని కనుగొన యత్నించెను గాని, యేర్పరింప లేదయ్యె, అంత జేబు నుండి అగ్గిపెట్టె తీసి పుల్ల వెలిగించెను. మంచముపైని కమలిని కానరాలేదు. నిశ్చేష్టుడై చేతి నుండి అగ్గిపుల్ల నేలరాల్చెను. గదినీ, అతని మనస్సును కూడా చీకటి క్రమ్మెను. వెఱ్ఱిశంకలును అంతకు వెఱ్ఱి సమాధానములును మనసున పుట్టుచు గిట్టుచు వ్యాకులత కలుగజేసెను. బుద్ధి తక్కువకు తనయందో, కానరామికి కమలిని యందో, యేర్పరింపరాని కోపావేశమును, చీకాకును గలిగెను. నట్టి వాకిటికి వచ్చి నిలువ చుక్కల కాంతిని దాసి గాని దాసుఁడు గాని కనపడలేదు. వారికి తగిన శిక్ష వురియేయని గోపాలరావు నిశ్చయించెను.

తిరిగి గది లోనికి పోయి దీపము వెలిగించి, గది నలుదెసల పరికించెను. కమలిని కానరాలేదు. వీధి గుమ్మము జేరి, తలుపు తెరచి చూడ చుట్ట కాల్చుచు తలయెత్తి చుక్కల

పరీక్షించుచున్న రాముఁడు వీధి నడుమ కానవచ్చెను. పట్టరాని కోపముతో వానిని ఁజూచి గోపాలరావు "రామా! రా!" యని పిలచెను. రాముడు గతక్కుమని చుట్ట పారవైచి, 'బాబు' అని దగ్గరెను.

"మీ అమ్మేదిరా?"

"మా యమ్మా? యింటున్నది బాబూ".

"మీ అమ్మ కాదురా; బుద్ధిహీనుఁడా, నా భార్యా"

"అమ్మగారా? యెక్కడుంటారు బాబూ? పడుకున్నారు"

"యింట్లోనే లేదు".

రాముడి గుండెలో దిగులు ప్రవేశించెను. గుమ్మములో అడుగు పెట్టఁగానే రాముని వీపుపై వీశ గుద్దులు రెండు పడెను. "చంపేస్తిరి బాబూ" అని రాముఁడు నేల కూలఁబడెను.

గోపాలుఁడు సదయ హృదయుఁడు. అక్రమమాచరించితినను జ్ఞానము వెంటనే పొడమి ఆగ్రహావేశము దిగజారి పశ్చాత్తాపము కలిగెను. రాముని చేత లేవనెత్తి, వీపు నిమిరి పశువువలే నాచరించితినని యనుకొనుచు గదిలోనికి తీసుకొని పోయెను.

కుర్చీ పయి కూచుని "రామా యేమాయెరా?" యని దైన్యముతో ననెను.

"యేటో మాయలా వుంది బాబూ"

"పుట్టింటికి వెళ్లియుండునా?"

"అంత వారు కారనా? బాబూ కోపగించితే చెప్పలేను గాని ఆడారు చదువు నేరిస్తే యేటౌతది?"

"విద్య విలవ నీకేం తెలుసురా, రామా!" అని గోపాలరావు మోచేతులు బల్లపయినాని వాని నడుమ తలయుంచి యోచించుచుండ కమలిని చేవ్రాత నొక యుత్తరము కానవచ్చెను. దానిని చదువసాగెను.

"అయ్యా!"

" 'ప్రియ', పోయి 'అయ్యా!' కాడికి వచ్చెనా?"

"పెయ్య పోయిందా బాబూ"

"మూర్ఖుఁడా! వూరుకో!"

"అయ్యా! పది దినములాయె. రాత్రులనింటికి మీ రాకయే నే నెరుగను. మీటింగులకుఁ బోవుచుంటి మంటిరి. లోకోపకారకరములగు నుద్యమముల నిదుర మాని చేయుచుంటిమంటిరి.

మా చెలుల వలన నిజము నేర్చితిని. నేనింట నుండుటను గదా మీరు కల్లలు పలుకవలసి వచ్చె. నేను పుట్టింట నున్న మీ స్వేచ్ఛకు నిర్బంధమును, అసత్యమునకు అవకాశమును కలుగకుండును. మీచే దిన దినమును అసత్యమాడించుట కన్న మీ త్రోవకు అడ్డుగ నుండకుం డుటయే, పతి మేలు కోరిన సతికి కర్తవ్యము కాదా? నే నీ రేయి కన్నవారింటికి జనియెద సంతసింపుఁడు. వెచ్చము గాక యేపాటి మిగిలియున్నను దయ నుంచుఁడు.”

ఉత్తరము ముగించి “నేను పశువును” అని గోపాలరావు అనెను.

“అదేటి బాబు ఆలా శలవిస్తారు?”

“శుద్ధ పశువును!”

రాముఁడు అతి ప్రయత్నముచే నవ్వు ఆచుకొనెను.

“గుణవతి, విద్యానిధి, వినయ సంపన్నురాలు, నా చెడు బుద్ధికి తగిన శాస్తి చేసినది”.

“యేటి చేసినారు బాబూ?”

“పుట్టింటికి వెళ్ళిపోయినది – గాని నీకు తెలియకుండా యెలా వెళ్ళిందిరా?”

రాముఁడు రెండడుగులు వెనుకకు నడిచి “నాను తొంగున్నాను కావాల బాబూ – అలక చేస్తే చెప్పచాల్ను గాని బాబు ఆడదాయి చెప్పకుండా పుట్టినారింటికి యెల్తానంటే లెంపలాయించి కూకోబెట్టాలి గాని, మొగోరిలాగ రాతలూ కోతలూ మప్పితే ఉడ్డోరం పుట్టదా బాబూ?”

“ఓరి మూర్ఖుఁడా! భగవంతుడి సృష్టిలోకల్లా ఉత్కృష్టమైన వస్తువ విద్య నేర్చిన స్త్రీ రత్నమే. శివుఁడు పార్వతికి సగం దేహము పంచి యిచ్చాడు. యింగ్లీషు వాఁడు భార్యను బెటర్‌హాఫ్ అన్నాఁడు. అనగా పెళ్ళాము మొగునికన్న దొడ్డది అన్నమాట. బోధపడ్డదా?”

“నాకేం బోధ కాదు బాబూ” రామునికి నవ్వు ఆచుకొనుట అసాధ్యమగుచుండెను.

“నీ కూతురు బడికి వెళ్ళుతున్నది గదా; విద్య విలవ నీకే బోధపడుతుంది. ఆ మాట అలా వుండనియ్యి కాని, నువ్వో నేనో వెంటనే బయలుదేరి చంద్రవరం వెళ్ళాలి. నేను నాలుగు రోజుల దాకా వూరి నుంచి కదలడముకు వీలు పడదు. నువ్వు తాతల నాటి నౌఖరువి. వెళ్ళి కమలినిని తీసుకురా. కమలినితో యేమి జెప్పవలెనో తెలిసిందా?”

“యేటా? బాబూ! బాబు నా యీపు పగలేసినారు, రండమ్మా అంతాను”.

“దెబ్బల మాట మరచిపో, కొట్టినందుకు రెండు రూపాయలిస్తాను తీసుకో. మరి యెన్నడు ఆ వూసెత్తకు. కమలినితో గాని తప్పిజారి అనఁబోయేవు సుమా”.

“అనను బాబూ”.

"నువ్వు చెప్పవలసిన మాటలు చెబుతాను", బాగా విను. "పంతులికి బుద్ధి వచ్చింది. యిక యెన్నడూ సానుల పాట వినరు. రాత్రులు యిల్లు కదలరు. యిది ఖరారు". తెలిసిందా? మిమ్ములను గెడ్డము పట్టుకుని బతిమాలు కున్నానని చెప్పమన్నారు. దయదలచి ఆయన లోపములు బయలు పెట్టక రెండు మూడు రోజులలో వెళ్ళిపోయి రమ్మన్నారు. మీరులేని రోజో యుగముగా గడుపుతున్నారు. అని నిపుణతగా చెప్పు– తెలిసిందా?"

"తెలిసింది బాబూ!"

"యేమని చెబుతావో, నాతో వొక మాటు చెప్పు".

రాముఁడు తలగోకుకొనుచు "యేటా - యేటా - అదంతా నాకేం తెలదు బాబూ - నానంతాను. అమ్మా! నామాటినుకోండి – కాలం గడిపినోణ్ణి – ఆడోరు యెజిమాని చెప్పినట్టల్లా యిని పల్లకుండాలి. లేకుంటే మా పెద్ద పంతులార్లాగ అయ్యగారు కూడా సానమ్మ నుంచు గుంతారు. మీ శెవులో మాట, పట్టంలోకి బంగారబ్బొమ్మలాంటి సానమ్మ వొచ్చింది. మరి పంతులు మనుసు మనుసులో లేదు. ఆపై మీ సిత్తం. అంతాను".

"ఓరి వెధవా!" అని గోపాలరావు కోపముతో కుర్చీ నుండి లేచి నిలిచెను.

ఊసవలే రాముడు వెలి కెగసెను.

అంతట మంచము క్రింద నుండి అమృత నిష్యందిని యగు కలకల నగవును కరకంకణముల హృద్యారావమును విననయ్యెను.

***(ఆంధ్రభారతి 1910 ఫిబ్రవరి)***

# మీ పేరేమిటి?

## దేవుడు చేసిన మనుషుల్లారా!
## మనుషులు చేసిన దేవుళ్ళారా! మీ పేరేమిటి?

పురాణములను గురించి మేము శంకలు వేస్తే, మా గురువు గారు "వెధవ చదువు! మీమతులు పోతున్నాయి. మీరు వొట్టి బౌద్ధులు" అనేవారు.

"బౌద్ధులు యెషువంటి వారు శాస్తుల్లు గారూ?"అని రామ్మూర్తి అడిగాడు. రామ్మూర్తి శతపెంకె.

"రేపు ఆదివారంనాడు పువ్వుల తోటలో ఉపన్యాసం యిస్తాను, అంతా రండి" అని శా(స్తుల్లు గారు శలవిచ్చారు.

ఆదివారం మధ్యాహ్నం నాలుగు గంటలప్పుడు పువ్వుల తోటలో ఒక పరుపు మావిడి చెట్టుకింద యిసకలో మేమంతా పాతికమంది కూచున్నాం. మధ్యగావంచా పరచుకుని, మాకు అభిముఖంగా శాస్తుల్లు గారు కూచున్నారు. నేను బల్ల చెక్క తెచ్చి వెయ్యిబోతే, "వొద్దురా, మీరంతా కింద కూచుంటే, నేను బల్లమీద కూచుంటా(నా!" అన్నారు. రెండు కొబ్బరి కాయల నీళ్ళు తాగి, తాంబూలము వేస్తూ ,శాస్తుల్లు గారు బౌద్ధమతం విషయమై ఉపన్యాసం ఉప(క్రమించారు, పది నిమిషములు అయే సరికి, రామ్మూర్తి తన చేతనున్న పుస్తకం విప్పి చూచి, "శాస్తుల్లు గారూ, తాము శలవిస్తూన్నదంతా సర్వదర్శన సం(గ్రహములోనిది కాదండీ" అని అడిగాడు. ఆశ్చర్యపడి, శాస్తుల్లు గారు, "ఔరా నీకెలా తెలిసెనురా? అదేం తర్జుమా కాదు గద?" అన్నారు.

"ఔనండి"

"ఈ యింగిలీషు వాడు ఉద్దండ పిండంరా! ఆ రెండో పుస్తకమేమిటో?"

"బుద్ధ చరి(త్రండీ."

"ఎక్కడ సంపాదిస్తా(రా యీ అపూర్వ (గ్రంథాలు, యేదీ తే."

శాస్తుల్లు గారు పుస్తకం అందుకుని, అతి మధురమైన కంఠంతో చదివి, అర్థం చెప్పడం (ప్రారంభించారు.

నాలుగు రోజులు పోయిన తరువాత, శాస్త్రుల్లు గారు క్లాసులో యిలా శలవిచ్చారు. "ఒరే యీ పుస్తకం చదివిందాకా, బుద్ధుడి మహిమ నాకు తెలియలేదురా. తప్పకుండా యీ మహానుభావుడు శ్రీ మహావిష్ణు అవతారవేఁన్రా"

ఆనాటనుంచీ శాస్త్రుల్లు గారు మమ్మలిని బౌద్ధులని దూషించడం మానేశారు.

కిరాస్తానులమని మట్టుకు అంటూ వచ్చారు. క్రీస్తును, శ్రీ మహావిష్ణు యొక్క పదకొండవ అవతారంగా చెయ్యడం సాధ్యం కాక, వొడబడి వూరుకున్నాం.

మా గురువు గారి వంటి గురువులు లోకంలో లేరు. చిరకాలం కాశీవాసం చేసి తర్కశాస్త్రము చదువుకున్నారు. మన దేశంలో అంత తార్కికుడు లేడని ప్రతీతి. శాస్త్రం మాటకేం గాని, కావ్యాల్లో మంచి రసగ్రాహి. మరి సుగుణ సంపత్తికో అంటే, సత్యకాలపు మనిషి అన్నప్పుడు, ఆయనే సత్యకాలపు మనిషి. అంత పాండిత్యం యింత సత్యకాలం ఒక్క బుఱ్ఱలో యెలా యిమిడి వున్నాయో, ఆశ్చర్యం!.

యీ జరిగినది పది సంవత్సరముల కిందటి మాట. ఇప్పుడు శాస్త్రుల్లు గారు పించను పుచ్చుకున్నారు. మాలాటి శిష్యుల శుశ్రూష పొందుతూ, మాకు సంస్కృత గ్రంథాలు చెబుతూ, సంతోషిస్తూ, సంతోషపెడుతూ, కాలం వెళ్ళబుచ్చుతున్నారు.

నేను వర్తకం చేస్తున్నాను. రామ్మూర్తికి భూములు లావుగా వున్నాయి. కొత్త కొత్త మోస్తర్లను వ్యవసాయం చేస్తున్నాడు. వూట గెడ్డ దరిని సీతారామ కోరుతున్న ఒక బ్రహ్మాండమయిన తోట వేశాడు. అవి పువ్వులు కావు. అవి పళ్ళు కావు. తొలి ఫలాలు గురువుగారు ఆరగించనిదీ రామ్మూర్తి చెట్టు ముట్టడు. ఆ తోటలో విహరించడం గురువు గారికి అత్యానందం. అక్కడనే మేం తరుచు మీటింగులు చేస్తూ వుంటాం. వెంకయ్య స్కూలులో మేష్టరు. ఖాయిదా లావుచేసి, తిట్లు తింటూ వుంటాడు. మా స్కూలు జట్టులో ఆరేడుగురం యిక్కడనే వున్నాం. గురువు గారూ మేమూ కలసినప్పుడల్లా స్వర్గఖండం ఒకటి అక్కడికి దిగినట్లు వుంటుంది.

## యిక ప్రస్తుత కథా –

మా పట్నానికి యెనిమిది మైళ్ళ దూరంలో రామగిరి అని ఒక విష్ణుక్షేత్రం గలదు. దాని వర్ణన మరి వక మాటు చేస్తాను. ఇప్పటి మట్టుకు మీకు తెలియవలసిన దేమంటే:– అక్కడి విష్ణుక్షేత్రం ఆధునికం. ఆ వూరి నల్ల కొండల నంతటను శిధిలమైన బౌద్ధ కట్టడములు కలవు. అక్కడి వారు వాటిని పాండవుల పంచలంటారు. ఈ దేశంలో పాండవులు వుండని గుహలూ, సీతామ్మవారు స్నానమాడని గుంటలూ లేవు.

ఒక పెద్ద గుహలో నున్న బౌద్ధ విగ్రహమును శివుడని, దాని పక్కనున్న దేవీ విగ్రహమును గౌరి అని భావించి జంగాలు పూజ చేస్తున్నారు.

ఉండగా, ఉండగా, కొన్నాళ్ళకి, ఒక దొర, గుమాస్తాలతోను, బిళ్ల బంట్రోతులతోనూ వచ్చి, మెట్టల పడమట నున్న ముదర మామిడి తోటలో కాంపు ఖణాయించాడు. మరిన్నీ వొందల కొలది కూలీలను కూర్చి ఆ కొండల మధ్య నున్న దిబ్బలు తవ్వించడం ఆరంభించాడు. ధనం కోసం తవ్వుతున్నాడని అక్కడి వాళ్ళంతా అనుకొన్నారు. కాని, విరిగిన ప్రతిమలూ, జిలుగు చెక్కిన రాళ్ళూ, పాతుకుపోయిన పాత కుండలూ, మండలూ, బళ్ళమీద పెరికి ధనం కంటెనూ యెక్కువ భద్రంగా యేర్చి, పేర్చాడు. ఇవి చూచుటకే మేం వెళ్ళాం.

మేం ఆ వూరు వెళ్ళేసరికి జంగాలు పూజచేసే పాలరాతి బుద్ధ ప్రతిమను గూర్చి వూరంతా కోలాహలంగా వుండెను. ఆ బొమ్మ మేం చూశాం. బహు సొగసైనది. ఇంత తీరైన చిత్రము గాంధార దేశంవైపు తప్ప మరెక్కడా చూడలేదని దొరమాతో చెప్పారు. దాని పీఠం మీద "యే ధర్మా హేతు ప్రభవా" ఇత్యాది బౌద్ధ సిద్ధాంతము సొంపుగా వ్రాయబడివున్నది. దొరగారు దాని మీద కన్ను వేసి "ఇస్తారా?" అని అడగగా, శైవులలో పెద్దలు "ప్రాణములనయినా యిత్తుము గాని, దానిని యివ్వ జాలము" అనిరి. దొరగారు నలుగురితో సాయిలా పాయిలాగా తిరిగే వారు గనుక మర్యాదగా జవాబు చెప్పారు. మరివకరైతే కథ చాలా దూరం వెళ్ళి వుండును. దొరగారు అంతటితో ఆ ప్రయత్నం మానుకున్నారు.

ఇలా వుండగా ఒకనాటి రాత్రి పూజచేసే జంగం శరభయ్య ఆ ప్రతిమను పెగిల్చి, కొని పోయి దొరగారికి రెండు వందలకి అమ్మజూపాడు, దొంగతనంగా తెస్తివి పుచ్చుకోజాలను అని, దొర, తనకు మాట రాకుండా వుండగలందులకు వూరి పెద్దలకు కబురు పెట్టాడు. యేమిటి, యీ దొర బుద్ధి తక్కువా అని శరభయ్య కొంత ఆశ్చర్యపడి, దొర కొంచెం కనుచాటు కాగానే, మెట్టల వైపు పరుగుచ్చుకున్నాడు. నాటికీ నేటికీ మరి పికరు లేదు.

శాయన్న భుక్త గారి యింట బసచేసి ఆ వూళ్లో మేం మూడ్రోజులు వున్నాం. శాయన్న భుక్త మా గురువు గారి దగ్గర కొన్నాళ్ళు తర్కం చదువుకున్నాడు. మంచి సాహిత్యం కద్దు. కొంచం కవిత్వం కూడా అల్లుతాడు.

మూడోనాడు రాత్రి భోజనం చేసుకుని, డాబా మీద నలుగురమూ కూచున్నాం. చిన్న గాలి రేగి తోటలో కొబ్బరి మట్టలు అల్లాడడం ఆరంభించాయి. యెదట దేవుడి కొండ బ్రహ్మాండవైన మహాలింగము వలె చీకటిని చీల్చుకుని మిన్నుముట్టి మనిషి యొక్క అత్యల్పతను సూచించుచు, యేదో చెప్పరాని చింతను భీతిని మనస్సులకు కలుగజేయు చుండెను. దేవతలు పూజ చేసిన దివ్య కుసుమముల వలె చుక్కలు శిఖరము చుట్టు చెదిరి వెలిగెను. మా మనస్సులు

గత కాలము నాటి స్థితిగతులను గూర్చిన ఊహాలతో నిండి యుండెను. తలపోసి తలపోసి ఆనాడు యీ స్థలం యెలా వుండెనో బౌద్ధులు యేమి యేమి చేసేవారో అని నేనంటిని.

ఆ పీనుగులు మనలాగే యేడుస్తూ వుండేవారు. మనకంటే అర్ధాన్నంగా వుండేవారు : అని సున్నితమైన తలంపులు బెదిరి చెదిరే పెళుసు గొంతుకతో వెంకయ్య అరిచాడు. నాకు కళ్ళ మొయ్యా కోపం వచ్చి, "నీ అమూల్యమయిన వూహలతో నువ్వు ఆనందించరాదా, నా తలలోనే కల్పించుకున్న బౌద్ధ ప్రపంచమును పెటుకు మాటలాడి యేల కలత పరిచెదవు" అని అడిగాను.

"గాని" శాస్తుల్లు గారు అన్నారు. "బుద్ధుడు విష్ణ్వవతారం గదా యీ జంగాలు శివుడని యేల పూజ చేస్తూన్నార్రా?" అని శంక వేశారు.

శాయన్న భుక్త పొడుం డబ్బీ తీసి, పెద్ద పట్టు పీల్చి, గావంచాతో ముక్కు తుడుచుకుని, "ఒక కథ వుంది" అన్నాడు. కథంటే శాస్తుల్లు గారికి సరదా. "అయితే చెప్పు అన్నారు" చెవి వొగ్గి విన్నాం. యిదీ కథ.

ఈ గ్రామంలో శైవ వైష్ణవ మతాలకు వైరం చిరకాలం నుంచి కద్దు. శివ మతానికి మొనగాడు జంగం శరభయ్య అనగా యిప్పుడు పారిపోయిన పూజారే. మొన్న ప్రతిమను పెరికి పలాయనం అయిందాకా అతగాడు సాక్షాత్తూ నందికేశ్వరుడి అవతారమని రాత్రులు గృహ యెదుట వృషభ రూపమైఁ మేస్తూ వుంటాడని యిక్కడి జంగాలకూ, దేవాంగులకూ నమ్మకం. యిపుడైనా ఆ దొర కిందటి జన్మంలో పరమ మాహేశ్వరుడౌట చేత ఆ విగ్రహమును కోరినాడనీ, భక్తవాత్సల్యత చేత శివుడిచ్చిన శలవును అనుసరించే శరభయ్య విగ్రహాన్ని పెరుక్కు వెళ్ళాడనీ డేరా నుంచి పారిపోవడంలో వృషభ రూపం ధరించి రంకె వేసి మరీ దాటేశాడనిన్ని ఒక వార్త అప్పుడే అతని శిష్యులు పుట్టించారు. రేపో నేడో వీరాసనం వేసుకుని బక ధ్యానం చేస్తూ కొండ మీదనో, గోపురము మీదనో ఆవిర్భవిస్తాడు. బాజా బజంత్రీలతో వెళ్ళి ఉల్లభం బట్టి తోడ్చుకు వస్తారు. ఆ పైని కంసాలి వీరయ్య (వీరణాచారి అని పిలిస్తేనే గాని కోపగిస్తాడు) ఆ కథకి చిలవలూ పలవలూ కల్పించి ద్విపద కావ్యం రచించి అచ్చు వేస్తాడు. ఆ ఉభయుల కీర్తి దిగ్ధంతులకు వెల్లవేస్తుంది.

"ఔరా వీళ్ళ మూఢభక్తి, యీ ప్రపత్తి పండితులకు వుండదురా, వీళ్ళది యేమి అదృష్టం", అని గురువు గారు అన్నారు. ఆపైని వెంకయ్య యేమో అనబోతే చేతితో నోరు అడ్డాను. యెవరి అభిప్రాయం వారు చెప్పకుండా నీ శాసనం యేమిటి అని అడిగాడు. మాటాడవద్దని చైసౌజ్ఞ చేశాను. శాయన్న భుక్త తిరిగీ యెత్తుబడి చేశారు.

అవును తాము శెలవిచ్చినట్టు పామరులకు వుండే గాఢభక్తి పండితులకు వుండదు గాని, యీ మూఢభక్తి ఒకప్పుడు ప్రాణాంతం తెస్తుంది – అదే చెప్పబోవుచున్నాను వినండి.

"నేను ఆ మాటే చెప్పబోతే చెప్పనిచ్చాడు కాడు" అని వెంకయ్య అన్నాడు. "అవును నీకంటూ తెలియని సంగతి లేదు. మరి వూరుకో" అన్నాను.

శివస్థలం యొక్క ఉత్పత్తి మీకు తెలియనే తెలుసును. పూజారి శరభయ్య చాలా కథకు డౌటచేతను వీడి రోజుల్లో శివస్థలానికి మిక్కిలిగా వైభవం కలిగింది. చుట్టు పట్ల గ్రామాల వాళ్ళందరూ మొక్కుబళ్ళు చెల్లిస్తారు. ఉత్సవపు రోజులలో పెద్ద జాతర్లు సాగుతాయి. మరిన్నీ యిక్కడి దేవాంగులు కలిగినవాళ్ళు. జంగంపాడు యావత్తున్నూ, దేవర పేటానున్నూ, శరభయ్య మాట మీద నడుస్తారు. ఈ గ్రామములో వుండే విష్ణుస్థలం రెండు వందల యేళ్ళ కిందట యీ దేశం యేలే ఒక మహారాజు కట్టించి రాజభోగాలకు వొక గ్రామం స్వామికి సమర్పణ చేశారు. అప్పటి నుంచి రంగాచార్యులు గారి కుటుంబస్థులే యీ స్థలానికి ధర్మకర్తలై వుంటూ వచ్చారు. యీయన యిద్దరు ముగ్గురు వైష్ణవులను జీతమిచ్చి వుంచి వాళ్ళ చేత మిక్కిలి భక్తి శ్రద్ధలతో స్వాంవారి కైంకర్యం జరిపిస్తూన్నారు. రంగాచార్యులు గారు బహు యోగ్యులు. ఆయన యొక్క సంస్కృత సాహిత్యం మీరు చూడనేచూశారు. ద్రావిడ వేదములో కూడా గట్టివారని ప్రతీతి కద్దు. ఆయన కొమాళ్ళు క్రిష్ణమాచార్యులు కూడ సంస్కారే గాని విశేష ప్రయోజకుడు కాడు. ఆ యింటికి వెలుగు తెచ్చినది యీ కృష్ణమాచార్యులు భార్య నాంచారమ్మ. ఆమె తల్లీ తండ్రి కూడా పండితులౌట చేత ఆంధ్ర గీర్వాణముల యందు మంచి జ్ఞానం సంపాదించిరి. పురాణం ఆ యిల్లాలు చదివినంత శ్రావ్యంగానూ, రసంతోనూ యెవరూ చదవజాల్రు. రూపమూ రూపానికి సదృశమైన గుణ సంపత్తీ కలదు. ఆమెకు ఒక కొమార్తె. ఒక కొమారుడున్నూ. యిల్లూ, దేవాలయం కూడా ఆమే చక్కబెట్టుకుంటారు.

"ఇది కవిత్వమా, నిజమా?" అని వెంకయ్య అడిగాడు.

మాకూ వాళ్ళకూ రాకపోకలు గలవు. నా భార్య చెప్పిన మాటలు నే చెబుతున్నాను. ఆమె పురాణం చదవడం చవులారా విన్నాను. మీకూ వినడపు అభిలాష వుంటే రేపటి దాకా వుండిపొండి. విష్ణుస్థలం యొక్క స్థితి ఇది. గాని, అయ్యంవార్లం గారు మత సంబంధమైన జట్టీలలో యెన్నడూ జోక్యం కలుగజేసుకోవడం లేదు. వైష్ణవ పక్షానికి కెప్తాను సాతాని మనవాళయ్య, అనగా రోజూ పొద్దున్న ఉపాదానానకు వచ్చి, స్తోత్ర పాఠాలతో పెణక యెగర గొట్టేస్తాడే, అతగాడే ఒకనాడు తెల్లవారగట్ల కలక్టరు గారు గుఱ్ఱమెక్కి వస్తూ వుండగా, గ్రామ పొలిమేరను మనవాళ్లయ్య యెదురై, పెళపెళమని శ్లోకం యెత్తుబడి చేసేసరికి, ఇతని స్థూలకాయం బట్టె నామాలు, రాగి ధ్వజం, కోలాహలమూ చూసి గుఱ్ఱం బెదిరింది. కోపం వొచ్చి కలక్టరు

అయిదు రూపాయలు జుల్మానా వేశారట. యీ కథ శుద్ధాబద్ధం అనీ, తనచేత శ్లోకాలు చది వించి దొరగారు అయిదు రూపాయలు ప్రెజంటిచ్చారని, అవి పెట్టి కొత్త వ్యాయవార పాత్ర కొన్నాననీ మనవాళ్ళయ్య చెబుతాడు.

## 2

శైవులలో వున్న ఐకమత్యం వైష్ణవుల్లో లేదు. సాతాన్లు చాలమంది మనవాళ్ళయ్య శిష్యులే. అయినప్పటికీ కొందరుమట్టుకు అతను అవతార పురుషుడని చెప్పరు. అతనంటాడు – శరభయ్యే వృషభావతారమైనప్పుడు నేను గరుడాళ్వారి పూర్ణావతారం కాకపోతే కాకపోవచ్చును గాని వారి యొక్క అత్యల్పాంశవల్లనైనా జన్మించి వుండకూడదా. గరుడాళ్వారి నఖముల యొక్క తేజస్సు నాయందు ఆవిర్భవించి వున్నది కాబట్టే, శరభయ్యను యిలా చీల్చి పేల్చుతున్నాను.

అయ్యవార్లంగారికి ఒక మాటు యీ మాట చెవి సోకి గట్టి చీవాట్లు పెట్టారు. ఆ చీవాట్లు తిని పైకి వచ్చి, "యీ బ్రాహ్మలదీ, జ్ఞానము కాదు. అజ్ఞానమూ కాదు. కడజాతి మనుష్యులే భక్తి ప్రభావం చేత అళ్వార్లు అయివుండిరి గదా! ఇంతకాలవాఁయి రాముడి ధ్వజమును జయప్రదంగా మోస్తూ, శైవ సంహారం చేసిన నేను శ్రీమద్గరుడాళ్వారి నఖాగ్రాగ్రం యొక్క అవతారం యేల కాను? గరుడాళ్వారి నఖములు పెరిగి, ఖండన ఐనప్పుడూ ఆ ముక్కలు నా వంటి భక్తులుగా ఆవిర్భవించి పరమత సంహారం చేస్తవి గాని, వృధాగా పోనేర్చునా? వట్టి మాట!" అన్నాడు. "ఔర : యేమి మూర్ఖత; యేమి అహంభావము. యీ అజ్ఞులా అవతార పురుషులు? యిలా అన్నందుకు వీళ్ల తలలు పగిలిపోవురా?" అని గురువుగారు అన్నారు.

"శాస్తుర్లు గారూ! పాతరోజులైతే వీళ్ళే అవతారాలయి పోదురు. వీళ్ళ పేరట బొమ్మలు నిలిపి, దేవాలయాలు కట్టి, మనవేఁ పూజ్జేతుం. మరి బుద్ధుడూ యిలాంటి మనిషే గదండి" అన్నాడు వెంకయ్య.

"చాకి బట్టెకీ సముద్రానికీ సాపత్యం తెస్తివి" అన్నారు గురువు గారు.

"అన్న మాటకల్లా వ్యాఖ్యానం చేస్తే గాని వూసుపోదురా?" అని నే అన్నాను.

"యీ వూరి నాయలు స్తోమం కలవాళ్లు. అందులో సారధి నాయడు లక్షాధికారి. అతని బావమరిది రామినాయడు గ్రామ మునసబు. కొంచధూర్తూ, నిషా బాజీన్నీ – భోజన ప్రియుడు. యీ తాలూకాలో కల్లా పెద్ద సారా దుకాణం యీ వూళ్ళోనే వుంది. దాన్ని బట్టి ఈ వూరి యోగ్యత మీరు వూహించుకోవచ్చును.

నాలుగు సంవత్సరముల కిందట యిక్కడికి దక్షిణ దేశం నుంచి ఒక అయ్యవార్లంగారు

వచ్చి, సారధి నాయడికీ, ఇంకా మరి కొందరు నాయలకూ, చక్రాంకితం చేసి, వైష్ణవిం చ్చారు. ఆనాడు మునసబు రామినాయడు రామస్వామి వారి ఆలయంలో తూంపట్టు పులిహోరా, వైష్ణవమూ యేక కాలమందే గ్రహించాడు. నాటికీ నేటికీ, రెంటియందూ ప్రపత్తి యేకరీతిగానే వుంది. అప్పటి నుంచి సారధి నాయడు ద్వాదశి ద్వాదశికీ స్వాం వారికి విరివిగా రాగ భోగాలు నడిపిస్తున్నాడు. ద్వాదశి అంటే రామినాయడికి పెద్ద పండుగ.

నాయళ్ళంతా వైష్ణవం పుచ్చుకొని, శివకోవిల వైపు తిరిగి చూడకపోవడం, శరభయ్యకు కంట్లో మిరపకాయ రాసుకున్నట్టు వుండెను. ఆలోచించి, ఆలోచించి ఒక యెత్తు యెత్తాడు.

ఆ రోజుల్లో హైదరాబాదు రాజ్యం నుంచి శివాచార్లు కొందరు దేశ శంచారార్థం యీ ప్రాంతానికి వచ్చారు. మరి రెణ్ణెల్లనాటికి పీఠంతోనూ, ప్రభలతోనూ, రుంజలతోనూ, పెను ప్రళయంగా వచ్చి యిక్కడికి దిగబడ్డారు. రోజూ అర్ధరాత్రి వేళ శివార్చన చేసేవారు. ఆ సమ యంలో శంఖాలు, జయఘంటలు, ఢమామీలు, వీటి ధ్వని పామరుల మనస్సులో భయోత్పాతం పుట్టించేది. యీ నల్లరాతి కొండల్లో ఆ ధ్వనులకు ప్రతి ధ్వనులు కలిగి, కోలాహలంగా వుండేది. యీ అట్టహాసంతో, వైష్ణవం పుచ్చుకున్న ఒక్కొక్క నాయడే, నామాలకి నామంబెట్టి, విభూది రుద్రాక్ష ధారణం చెయ్యడం ఆరంభించాడు. వచ్చిన పదో రోజున శివాచార్లు గుండం దొక్కడానికి పెద్ద ప్రయత్నాలు చేశారు. సారధి నాయణ్ణి కదిలించడవేఁ వాళ్ళ ముఖ్య ప్రయత్నంగా వుండెను. అదివరకే సారధినాయడికి శివమతం వేపు తూగు లావాయెను. గుండం తొక్కడం చూసిన తరవాత సారధినాయడు సిద్ధాంతంగా శైవం పుచ్చుగుంటాడని అంతా నమ్మారు. అందుచేతనే, శైవుల్లో మొనగాళ్ళంతా రుంజలతో సారధి నాయడి యింటికి వెళ్ళి, చాలా కైవాదం చేసి వుత్సవం చూచుటకు రాక తీరదని పిలిచారు.

యీ మాట చెప్పగా, అయ్యవార్లంగారు యేవఁన్నారంటే "రాముడి ఆజ్ఞ యేలా వుంటే, ఆలా జరుగు గాక. వైష్ణవుడు, శైవుడు కావాలని కోరితే, అడ్డి యేమి కార్యం? కాక కాశీలో మృతి పొందిన వారికి శివుడేకదా, తారక మంత్రోపదేశం చేస్తాడు. గనక యీ జన్మంలో పరమ శైవుడైన వాడికి, వచ్చే జన్మలో తారక మంత్రోపదేశం చేసి, ముక్తి యివ్వకపోతాడా? యే మతవైనా ప్రపత్తి వున్నవాడికి తోవ వుంది. అది లేకుంటే వైష్ణవుడైనా, కార్యం లేదు". సాతాన్లకి అయ్యవార్లం గారి ఉదాసీనత చెయి విరుచుకున్నట్టు వుండెను.

ఈ బ్రాహ్మడికి వైష్ణవాభిమానం తక్కువ. గనక మనం విజృంభిస్తేనే కాని వైష్ణవమత ప్రభావానికి అగౌరవం వస్తుందని మనవాళ్ళయ్య ప్రగల్భించి, శివాచార్లు గుండం దొక్కేనాటి రాత్రి రెండు ఝాములప్పుడు, కోవిల యెదటి రావి చెట్టు కింద పెద్ద మీటింగు చేశాడు. సాతాన్లూ, నాయలూ వొందలకి జమ అయినారు. అందులో యోధులు, దుకాణంలో రహస్య

శేవ శేవించి, ఒక్కొక్కరే దిగబడ్డారు. అంతట మనవాళ్లయ్య చెట్టు మొదటి రచ్చ రాతి మీద వంగి, నిలిచి, గెడ్డము కింద వక కఱ్ఱ ఆనుకొని, యేమని పలికెను. “పరమ భాగవతోత్తముల్లారా! వింటిరా ఈ శైవుల యొక్క రాక్షస మాయల్లో పడి, అప్పుడే చాలామంది నాయలు వైకుంఠానికి పోయే రాజమార్గమైన వైష్ణవ మతం విడచి, అంధకారబంధురమైన శైవ మతంలో కూలి పోయినారు. ఇక మన పరమ మిత్రుడున్నూ, భక్తాగ్రేసరుడున్నూ అయిన సారధి నాయణ్ణి మాయగమ్మి తమలో పడవేసుకొనుటకు, యిప్పుడు విపుల ప్రయత్నం చేస్తున్నారు. యీ రాత్రి అతడు వెళ్ళి శైవుల ఘోర కృత్యములు చూసెనా, మరి మనవాడు కాడు. గనక అతన్ని కాపాడి శ్రీమహావిష్ణు యొక్క మహిమ ప్రజ్వలింపచేసే సాధనం యేమిటో తాము అంతా ఆలోచించండి. సారధి నాయడు యీ రాత్రి అక్కడకు వెళ్ళకుండా ఉపాయము కల్పించడము కర్తవ్యమని నా అభిప్రాయము”.

యెలాగంటే, యెలాగని నలుగురూ తలపోయుచుండగా, రామనుజయ్య లేచి నిలిచి అన్నాడు. “దీనికింత ఆలోచనేలా? యేమి? వాళ్ళు చేసే పని మనవేఁల చేయరాదూ? రామభక్తుడైన శివుడికే అంత మహిమ వున్నప్పుడు సర్వేశ్వరుడైన ఆ రాముడికి అంతకన్న వెయ్యి రెట్లు మహిమ వుండకపోయినా? గనక, నా సలహా యేమిటంటే శ్రీ మద్గరుడాళ్వారి అవతారమైన మనవాళ్ళయ్య, రాగి ధ్వజం చేతపట్టుకొని నాలాయిరం పఠిస్తూ గుండం తొక్కితే సరి. శ్రీ వైష్ణవ మతాల తారతమ్యం లోకానికి వ్యక్తం కాగలందులకు, శివాచార్ల గుండం కంటే మరి బారెడు ఆస్తి లావుచేసి, యీ చెట్టుకిందే యీ క్షణమందు బ్రహ్మాండమైఁన గుండం తయారు చేస్తాను. యిందుకు అభ్యంతరం చెప్పేవాణ్ణి వైష్ణవుడని భావించను”.

చీకట్లో యెవరికీ కానరాలేదు గాని మనవాళ్లయ్య నోరు వెళ్ళబెట్టాడు. నలుగురూ “బాగుంది! బాగుంది!” అనేసరికి అతని ప్రాణాలు యెగిరిపోయినాయి. ఒక్క నిమిషం ఆలోచించి అన్నాడు. “అన్నలారా! తమ్ముల్లారా! పరమ భాగవతోత్తముల్లారా! రామానుజయ్య నన్ను ఆక్షేపణ చేస్తున్నాడు. నేను పడవలసిందే? యీ శరభయ్యే వచ్చి తాను వృషభావతారవఁని నిక్కి నీలుగుతున్నాడు గదా, మనం దెబ్బకి దెబ్బతీదాం; అని కేవల వైష్ణవాభిమానం చేత, నేను గరుడ వేషం వేశానే గాని, ఇంత భారవైన శరీరంతో నేను గరుడాళ్వారిని యెన్నడూ కానేరనే? ఆ మాట నాకు తెలియదా? ప్రాజ్ఞులైన మీకు తెలియదా? రామానుజయ్య అయితే, చులాగ్గా దేగలా వున్నాడు గనక, అవస్యం అతగాడే గరుడాళ్వారి అవతారం. అతణ్ణే గుండం తొక్కమనండి. నేనుగాని నిప్పుల్లో కాలుబెట్టానంటే గజం లోతుక్కూరుకుపోయి చస్తాను. రామానుజయ్య తేలిగ్గా వున్నాడు; అంటీ అంటనట్టు చపచప అడుగేసుకుపోతాడు. అన్నల్లారా! న్యాయం ఆలోచించండీ” అనేటప్పటికి రామనుజయ్య సన్న సన్నగా జారాడు.

రామినాయుడు జల్దుకొని అన్నాడు. "రావంస్సోవింకి మయిమం వుందా లేదా? వుందా, యీ వేషాలు మాని తిన్నగా గుండం దొక్కు". ఆ మాట విని మనవాళ్ళయ్య మొహం జుమాల్మంది. రామానుజయ్యలాగ మందలో జొచ్చి మాయవౌందావంటే, చీమా, దోమా కాదు. పది యిరవై మణుగుల పట్టు. "హే దైవమా, నేను ఒక్క అరగడియ గరుడాళ్వారినే అయితే, యెక్కడకైనా యెగిరి ప్రాణం దాచుకుందును గదా" అని అనుకున్నాడు.

"యేం, పల్లకుంటావేం?" రామినాయుడు పొడవడం ఆరంభించాడు. "అల్లాండం బెల్లాండం అని తెల్లారకుండగ వొచ్చి, తెగ అరుస్తావు గదా, ఆ ముక్కలన్నీ మావంటోళ్ళని బెదిరించి కూరా నారా లాగడానికేనా ఆటి మయిమం యే కాసింతైనా కద్దా?"

మనవాళ్ళయ్య నిట్టూర్పు విడిచి, రామానుజులను స్మరించి, యిట్లా అన్నాడు. "రామి నాయడన్నా, నివ్వూ నేనూ చిరకాలం నాటి నేస్తులం, నువ్వు గవునరుమెంటు వారి తరపున మునసబీ అధికారం చాలా కాలవాంయి చలాయిస్తూన్నావు. యుక్తాయుక్తం యెరిగిన మనిషివి. అవును గాని, వైష్ణవమతం యొక్క అధిక్యత అగుపర్చాలంటే, ఆ శరభయ్య చేసే తక్కవ పనా, నన్ను చేయమంటావు? "పృధివ్యాపస్తేజో వాయురాకాశాత్" అన్నాడు. విష్ణు భక్తుడైన వాడికి కర్తవ్యం ఉత్తమోత్తం పృధివీ అనగా భూమిమీద నడవడవేం. పంచభూతములలో మరి వక భూతం మీద వైష్ణవుడన్న వాడు అడుగేసి నడవనే కూడదు. అంతకు ఒక వీసం తక్కువ ఆపః అన్నాడు. అనగా నీట్లో ఉరకడం ఒకపాటి కర్తవ్యం కావచ్చు. అధమాధమం అగ్గి తొక్కడం గనక మీరు యావన్మందిన్ని యిప్పుడే నా వెంట రండి. యీ నిశీధి సమయంలో శ్రీ మహా విష్ణు నామస్మరణ చేసి అమాంతంగా సీతాగుండంలో వురుకుతాను. అప్పట్లో నా మహిమ మీకు తెలియగల్దు".

రామినాయుడు దగ్గిరకి వచ్చి, మనవాళ్లయ్య చెయి బట్టుకొని గట్టిగా నొక్కుతూ అన్నాడు. "యిన్నావా వైష్ణపోడా, మా ఇయ్యంకుడు సారధి నాయుడు జంగపాళ్ళలో కలిసిపోతే దోదసి పులియోరి శక్కర పొంగళం పోతాయి. ఆ మాట నీకూ యెరిక, నాకూ యెరిక. నువ్వు సీతమ్మ గుండంలో ఆనపకాయ తుంబలాగ తేలి, యీతలాడితే, నీ మయిమం ఆడొప్పుతాడా, యెట్టి కుట్టె కబుర్లు మానేసి, మావాడు రెండు కళ్ళతో సూస్తుండగా అల్లాండం బెల్లాండం అంటూ అగ్గి దొక్కు!!".

"సరే నేస్తం నీ అభిప్రాయం ఆ ప్రకారం వున్నట్టయితే అలాగే కానియ్యండి. శ్రీ మహావిష్ణు యొక్క మహిమ నిలబెట్టడానికి అగ్గి తొక్కుతానా, తొక్కి చూస్తానా. యిప్పుడు చాలా రాత్రైంది. యిళ్ళకి పోయి పరుందాం. రేపు యీ వేళప్పుడు ఈ స్థలంలోనే బ్రహ్మాండమైన గుండం చేసి, దందహ్యామానమైన ఆ గుండం తొక్కి, వైష్ణవ మత ప్రభావం కనపరుస్తాను. అప్పట్లో ఆ గరుడాళ్వారే నన్ను ఆవహించి, అంత గుండమునూ చెంగున ఒక్క దాటున దాటిస్తారు.

“ఆ పప్పు వుడకదు. యీ రాత్రి మా వాడు జంగపాళ్ళలో కలిసిపోతే, రేపు నువ్వుదాటేం, దాటకేం, ఆ దాటేదాటేదో, యీయాళ ఆళ్ళ గుండంలోనే దాటు. లెండోస్సి యీ వైష్ణపోణ్ణి మోసు గెల్చి గుండం తొక్కిద్దాం” అని రామినాయడు అనేసరికి నలుగురు నాయలు మనవాళ్ళయ్య రెక్కలు పట్టుకు రచ్చ రాతి మీద నుంచి కిందికి దించారు. మీరి వచ్చిందని మనవాళ్ళయ్య ఒక యెత్తు పన్నాడు.

“ఆగండి, ఆగండి గుండం తొక్కవలసి వచ్చినప్పుడు, అందుకు కావలసిన పరికరం అంతా కూర్చుకోవడవాఁ, లేకుంటే కట్టుగుడ్డలతో గుండంలో పడేసి; వొళ్ళు తెగ్గాలుస్తారా? ఆ శివాచార్లు వీరభద్ర విగ్రహం చేతబట్టి, మంత్రాలు పఠిస్తూ, శంఖధ్వనికి వీరావేశం పుట్టి గుండం తొక్కుతారు. అలాగే శ్రీ రామస్వాం వారి తాలూకు ఉత్సవ విగ్రహం వొకటి నా నెత్తిని కొడితే గాని యెలా చస్తాను? గరుడాళ్వారు అయినా యెప్పుడూ పెరుమాళ్వారిని వీపున మోసుకునే బయల్దేరుతారు గాని ఒట్టినే రెక్క కదపరు. మీరెరగరా” అనేటప్పటికి, సారథినాయడు “ఆ మాట నిజవఁ్రాఁ యిగ్గరవిఁస్తాడు. అయ్యావోర్ని తెలుపుకు రండోస్సి” అన్నాడు. నలుగురు నాయలు పక్కనున్న అయ్యావార్లం గారి యింటికి వెళ్ళి, పైమీద గుడ్డ అయినా లేకుండా ఆయనను మోసుకు వచ్చి రావి చెట్టు కింద రచ్చరాతి మీద కూచోబెట్టారు. యీ గడబిడ కనిపెట్టి కృష్ణమాచార్లు అటకెక్కి దాగున్నాడు.

## 3

అతి వినయమును నటిస్తూ మనవాళ్ళయ్య రంగాచార్యులు గారికి ప్రస్తుతాంశము విన్న వించి, ఉత్సవ విగ్రహమును యిమ్మని వేడాడు. రంగాచార్యులు గారు అన్నారు. “ఓరి మూర్ఖ ల్లారా! మీకు మతులు శుభ్రంగా పోయినాయిరా? యీ గుండం తొక్కడమనేది గర్హ్యమైన తామస వ్యాపారము; వైష్ణవ మత నిషిద్ధము. మన గ్రంథాల్లో ఎక్కడా యీ ప్రక్రియ లేదు. గుండం తొక్కడానికి ఒక విధీ, మంత్రం యేడిస్తేనా?”

“శక్కరంతోటి వొళ్ళల్లా తెగ్గాల్చుడానికి మంతరం కద్దా! అట్టే మాటలు శెలవియ్యక, ఆ యిగ్గరవేఁదో సాతానోడికియ్యండి”. అని రామినాయడు అడిగాడు.

“ఛీ! పొండి. మూర్ఖుల్లారా! నేను యిచ్చేది లేదు. ఉత్సవ విగ్రహములు శూద్రులు ముట్టుకో వలసినవి కావు. ముట్టుగుంటే కళ్ళు పేలిపోతాయి”. అని రంగాచార్యులు గారు అనేసరికి, మనవాళ్ళయ్య, “బతికానురా దేవుడా”, అనుకొని, సారథి నాయడితో “చూశావా నేస్తం; ఆ మాట నిజమే! నేను ఉత్సవ విగ్రహములు ముట్టుగోకూడదు. అందుచేత యిప్పుడు కర్తవ్యం యేమిటంటే ఆ విగ్రహం పట్టుకొని అయ్యావార్లంగారే గుండం దొక్కవలసి వుంటుంది. ఆ ఆధిక్యత అనేది వారికే వుండవలసినది”.

మునసబు "ముసలాయన యిగ్గరాలట్టుకుని గుండం తొక్కేదేటి? సిన్నసోవిఁని లెగదీసుకెళదాం, రండి" అన్నాడు.

"వాడి జోలికి వెళ్ళకండి. మా బాగే; వుత్సవ విగ్రహాలు పట్టుకుని, నేనే గుండం తొక్కుతాను. మా వాడు పట్ణం వెళ్ళాడు. వూళ్ళోలేడు" అని రంగాచార్యులు గారు అన్నారు.

"అయితేలెండోయి!" అని మనవాళ్ళయ్య బొబ్బ వేశాడు. అంతట ఆ రావి చెట్టు మాను చాటున గప్పునీ ఒక వెలుతురు పుట్టింది. అందరూ భీతిల్లారు. నిషాలు దిగజారజొచ్చాయి. వెంటనే మాను వెనక నుంచి, ఒక చేత కరదీపము, రెండవ చేత సూరకత్తి, పట్టుకుని, వుంగరాల జుత్తు గాలికి తూగులాడుతుండగా, నిబ్బరంగా అడుగు వేసుకుంటూ వచ్చి నాంచారమ్మ, మామగారి పక్కను నిలిచి, ఆయన రెక్కలు పట్టుకుని వున్న నాయల వంక బాకు మొన జూపి "దుష్టుల్లారా! యీ పరమ పవిత్రమైన బ్రాహ్మణ్ణి వొదుల్తారా, బాకుకు బలి యిచ్చేదా?" అని అడిగినది.

హటాత్తుగా వచ్చిన యీ వీర రూపమును చూచి, అందరి ధైర్యాలూ అడుగంటాయి. అయ్యావార్లంగారిని పట్టి నిలిచిన నాయలు బెదిరి దూరం సాగారు. అంతట ఆమె చేతి దీపం రచ్చ రాతిమీద వుంచి, "నీకేం కావాల"ని మనవాళ్ళయ్యను అడిగింది. మనవాళ్ళయ్య రెండడుగులు వెనక్కివేసి, తనకేమీ అక్కరలేదన్నాడు.

"నీకు ఉత్సవ మూర్తులు కావలెనంటివే".

"నాకెందుకు తల్లీ, అపవిత్రుడను; వాటి యెత్తు బంగారం కరిగి యిస్తే నాకు అక్కర్లేదు. రామినాయడు యేమో కొంచం –"

ఆమె అటుంచి యిటు తిరిగి, రామినాయడిని నిస్సాకారంగా చూస్తూ – "నీకేం గావాలి, మునసబు నాయడా" అని అడిగింది.

మొహం వొంచి, రామినాయడు తనకేమి అక్కర్లేదని పైకి చెప్పి. "ఆడదాయితో యవడు మాటాడగల్డు?" అని గొణుగుకున్నాడు. రామినాయుడి పెళ్ళాం గయ్యాళి.

నాంచారమ్మ – "యెవరికీ యేమీ అక్కరలేకుంటే యీ ముసలి బ్రాహ్మణ్ణి వొంటిమీద బట్ట యినా లేకుండా నిద్దర మంచం మీంచి యెందుకు యీడుచుకువస్తిరి? యెవడూ మాటాడ్రేవిఁ?"

రామినాయడు కొంచం ధైర్యం తెచ్చుకొని, "ఆడదాయితో మాటలకంటే సాల్లేం గాని, యీ రాత్రి కాడ ఆ జంగపోళ్ళు శివుఁడి పేరు జెప్పి గుండం దొక్కుతారు గదా, మన రామ స్సోంవోరి పేరు జెప్పి మనం కూడా గుండం దొక్కకుంటే, మన పెండెం యిరిగిపోదా?"

నాంచా : "నువ్వేల తొక్కరాదూ?"

మున : “నాకు మంతరం, మాయా యెరికనేదే! అందకనే సాతానోణ్ణి తొక్కమన్నాను”.

నాంచా : (మనవాళ్ళయ్యతో) “నువ్వెందుకు తొక్క కూడదూ?”

మనవాళ్లయ్య : “అమ్మా యీవేళ యేదో నా ప్రారబ్ధం చాలక యీ మీటింగు తలపెట్టాను. బుద్ధి గడ్డి తిన్నది. యిదుగో లెంపలు పడపడ వాయించుకుంటున్నాను. తల్లీ నన్ను యీకాడికి వొదిలివేస్తే శ్రీరంగం వెళ్ళిపోతాను. యీ నాలుగు వూళ్ళ పొలిమేరనూ, నేనంటూ తిరిగీ కన పడితే, నా నెత్తి మీద పెద్ద పిడుగు పడిపోవాలి”.

నాంచా : “నీకు కొండంత గుండె వుంది! (రామి నాయడుతో) మునసబు నాయడా, నీ వియ్యంకుడు సారధి నాయుడు విరిగిపోతే, ద్వాదశి ద్వాదశికీ “శక్కర పొంగళం”, “పులియోరీ” లేకపోతాయని గదా నీ దుఃఖం.

మునసబు : (తలగోక్కుంటూ) “ నాకొక్కడికే అన్న మాటేటమ్మా. ఆ రామసోన్ంవారికి మాత్రం పులియోరం కరువైపోదా?”

మనవా :“అమ్మా శర్కరపొంగలి, దధ్యోదనమూ అనేవి ముఖ్యములు కావు. వైష్ణవ మతో త్కర్ష మహిమ కనపర్చి ఉద్ధరించాలి, అదీ కర్తవ్యం”.

నాంచాం : ఆ వుద్ధరించడం యేదో నువ్వేల చెయ్యరాదు? నీకు ఉత్సవవిగ్రహమంటూ యేలా? ఆకాశమంత రాగిధ్వజం మోసుకు తిరుగుతావు గదా. దానిలో అరకాసంతయినా మహత్తు లేదా?”

మనవాళ్ళయ్య, “మళ్ళీ మొదటి కొచ్చింద”ని సణుక్కుంటూ, కష్టం మీద మందలో దూరి అంతర్ధానం అయిపోయినాడు.

నాంచా : “రాముడే కాడు. యే దేవుడి మీద నయినా నిజమైన నమ్మకమన్నది యేడిస్తే, ఒక్క గుండవేఁ కాదు, అన్ని కష్టాలూ తరించవచ్చును. నేను మా మామగారి పేరు స్మరిస్తూ గుండం దొక్కుతాను. నా వెంట రాగలిగిన వైష్ణవులెవరైనా వుంటే యెదటికి రండి”.

యెవడూ కదలలేదు.

నాంచారమ్మ: నిరసన నవ్వు నవ్వి “ముసలాయనను అగ్గిలో తోసి పైనుంచి చూడడానికి మీరంతా వీరులా?”

యెవరూ ఉలకలేదు పలకలేదు.

నాంచారమ్మ అందరినీ కలయజూసి “పీరు సాయీబు యిక్కడ లేడా?” అని అడిగింది. పీరు సాయీబు వెంటనే యెదటికి వచ్చి “అమ్మా. యిదిగో దాసుడ”ని చెయి జోడించి నిలు చున్నాడు. పీరు సాయీబు దూదేకుల సాయీబు అయినప్పటికీ, రామభక్తుడు, కీర్తనలు

చెప్పుతాడు. హటయోగం అభ్యసిస్తాడు. రోడ్డు పక్క యేటి వొడ్డు తోటలో మఠం యితనిదే. యితనికి శిష్య బలగం లావు.

"సాయీబూ! నువ్వు గుండం తొక్కగలవా?" అని నాంచారమ్మ అడిగారు.

"మీ శలవైతే అవలీలగా తొక్కుతాను తల్లీ"! అని అన్నాడు.

నాంచారమ్మ : "యేడీ మనవాళ్ళయ్య? గరుడుడి అవతారం అంతర్ధానమైపోయిందీ. రామినాయడా పరమ భాగవతోత్తములైయుండిన్ని, మీరు యెవరూ గుండం తొక్కజాలినారు కారు గదా? అట్టి స్థితిలో యీ పచ్చి తురకకి గుండం తొక్కడానికి భగవంతుడు సాహస ధైర్యాలు యిచ్చాడు. గనక మీ వైష్ణవ మతం గొప్పా అతగాడి తురక మతం గొప్పా? రామినాయడా మీ దేవులాటంతా యీ రాత్రి వైష్ణవులు శైవులికి, పరాభవం చెయ్యాలని గదా? అందుకు వుపాయం చెబుతాను వినండి. మతాలు, సాత్వికాలూ తామసాలూ అని రెండు విధాలు. ఈ రెండు విధాల మనుష్యులూ శైవుల్లోనూ, వైష్ణవుల్లోనూ కూడా వున్నారు. గుండాలు దొక్కడం మొదలైన తామస కృత్యాలు చేసే వాళ్ళని శైవుల్లో శివాచార్లు అంటారు. మన వైష్ణవుల్లో అట్టి కృత్యాలు చేసే తెగ కూడా వున్నారు – యెవరో మీకు తెలుసునా?

మనవాళ్ళయ్య గుంపులో మరి వక పక్కనుంచి తన బుఱ్ఱ పైకిపెట్టి "యెవళ్ళమ్మా వాళ్ళు" అని అత్యాతురతతో అడిగాడు.

మునసబు నాయడు "మరెవళ్ళు? సాతానోళ్ళు" అనేటప్పటికి, మనవాళ్ళయ్య బుఱ్ఱ మళ్ళీ మందలో మాయమైపోయింది.

నాంచారమ్మ : "ఆ వైష్ణవులు యెవరా? మరెవరు తురకలు; పీరు అనేది యేమిటనుకున్నారు. శ్రీ స్వామివారి తిరునామమే. పట్టణంలో మా యింటి పక్కనే ఒక సాతాని పీర్లని నిలిపి గుండం తొక్కేవాడు. పట్టణంలో యెంతో మంది హిందువులే పీర్ల పంజాలు వుంచి గుండాలు తొక్కుతారు. గనక శ్రీ రామస్వామి వారి నామం తెచ్చి పీరు కట్టి యిస్తాను. ఆ పీరు పట్టుకు పీరు సాయీబు గుండం దొక్కుతాడు. పీరు సాయీబు యోగ్యత మీరెరిగినదే. అతగాడు కబీరు దాసంత భక్తుడు. గనక భయాలు విడిచి అతని వెంట వెళ్ళి జయించుకురండి. వేళకి భక్తి నిలుస్తుందో, నిలవదో చేతి కఱ్ఱలు మాత్రం మరవకండి.

ఆమె విరమించే సరికి పెళపెళమని ఆ మూకలో నుండి మనవాళ్లయ్య శ్లోక పఠనం ఉపక్రమించి యిటూ అటూ మనుషులను తోసుకుంటూ యెదటికి వచ్చి సాష్టాంగ వేసి "అమ్మా మీరు సాక్షాత్తూ శ్రీ మహాలక్ష్మి అవతారం. వైష్ణవ మతం నిలబెట్టారు. మతమే అన్నమాట యేమిటి? మా ప్రాణాలు కూడా నిలబెట్టారు. యిహ నా విజృంభణం చూడండి" అన్నాడు. మన వాళ్ళయ్య పెద్ద హికమద్దారుడు. ఆ రాత్రి వైష్ణవ తంత్రం తరవాయి కథ అంతా అతనే నడిపించాడు.

అంతా చల్లారగానే అటక మీద నుంచి కృష్ణమాచార్యులు దిగాడు. కష్ట సాధ్యమును సాధించిన సంతోషముతో, నాంచారమ్మ కరదీపం తిరిగి చేతపూని, యింటికి సవిలాసముగా నడిచిపోవుచుండగా, పెనిమిటి యెదురైనప్పుడు ఆమె ప్రేమ పరిహాసములు పెనగొను దృష్టితో చూసెను. ఆ దృష్టి తనకు దేవత్వమిచ్చి తన్ను అవతార పురుషుణ్ణి చేసిందని కృష్ణమాచారి మర్నాడు నాతో చెప్పి, ఆ అర్థంతో శ్లోకం రచించాడు. తమ రహస్య శృంగార చేష్టలు మిత్రులతో చెప్పితేనే గాని కొందరికి తనివి తీరదు.

ఆ రాత్రి శివాచార్లు గుండం తొక్కడం చూడ్డానికి నేను వెళ్ళివుంటిని. తెల్లవారగట్ల నాలుగు గంటల వేళ చిరిచీకటిలో గుండంలో నిప్పులు కణకణ లాడుతుండెను. ప్రాతఃకాలపు శీతగాలి సాగింది. ఒక్క పెట్టున గర్భ నిర్భేదమయ్యేటట్టు శంఖాధి వాద్యములు రేగాయి. ఇంగిలీషు చదువుకున్న నాస్తికాగ్రేసరులకు కూడా ఆ కాలమందు బితుకు కలిగిందని వారే వొప్పుకున్నారు.

పందిటిలో నుంచి వీరగంధాలు పూసుకున్న నలుగురు శివాచార్లు గుండం దగ్గరకు వచ్చి నిలుచున్నారు. ఒకడు నెత్తిమీద భీకరమైన రాగి ప్రతిమ పెట్టుకున్నాడు. యెదురుగా నిలిచి మరి వకడు కత్తి ఝుళిపించుచూ వీర వాక్యాలు కొలిపాడు. ఒకడు గుండంలో నెయ్యిపోసి గుమ్మిడికాయ తుండలు గుండంలోకి విసిరాడు. వెంటనే శివాచార్లు గుండం జొచ్చి నడుచుకు పోయినారు. అవతల వొడ్డు చేరి తిరిగి తొక్కుటకు వారు యిటు అభిముఖులై యుండగా, "అల్లా-రామ్" అని కెవ్వుమని ప్రళయమైన కేక ఒకటి వేచి, తక్షణం శివాచార్లు గుండం దిగిన వేపు నుంచి, మూకను చీల్చుకుని ఒక మనుష్య ప్రవాహము గుండము దాటుకుని పోయింది. వారిలో అందరున్నూ ముఖముల మీద ముసుగులు వేసుకున్నారు. ఆ మనుష్య ప్రవాహమునకు అగ్రమందు వెండి పీరు వకటి రెండు చేతులా పట్టి ఒక వీరుడు భీముని వలే నడుచుకుపోయి నాడు. యిది అంతా అర నిమిషం పట్టలేదు.

మూక, చకాపికలై చెదిరిపోయినది. కొందరు సాతాన్లకీ, శివాచార్లకీ కూడా యెత్కించిత్ కాళ్ళు కాలాయి. అది భక్తిలోపం కింద కట్టారు. తరువాత శరభయ్యకీ, మనవాళ్ళయ్యకీ రాజీనామా అయినదని అనుకుంటారు. పైకి మట్టుకు దెబ్బలాడుతున్నట్టే వుంటారు.

అదుగో, మా యింటికి యెదురుగా ఆ రచ్చసావిట్లో నిలిపిన పీరు ఆ పీరే. నాటినుంచీ, ప్రతి సంవత్సరం ఆ పీరుకు పండుగ చేస్తారు. వూరు ఆబాలగోపాలం శైవ వైష్ణవ భేదం లేకుండా పీరు దేవరకు మొక్కులు చెల్లిస్తారు. త్రిశూలాకారం గనక ఆ పీరు శివపీరే అని శరభయ్య అంటాడు. కేవలం రామస్వామివారి నామం గనుక విష్ణుపీరని మనవాళ్ళయ్య వాదిస్తాడు. ఆ వ్యవస్థయేదో వెంకయ్య పంతులు గారే చెయ్య సమర్థులు.

"శివుడూ, విష్ణూ పీర్లే అయినప్పుడు, బుద్ధుడు శివుడు కారాదా?" అని శాయన్న భుక్త కథ పరిసమాప్తి చేశారు.

మా గురువు గారు యీ చరిత్రకు చాలా ఆశ్చర్యపడి అన్నారు. "ఔరా! కలికాలంలో మనుష్యులే కాదు – దేవుళ్ళు కూడా సంకరం అవుతున్నారు.

"అయినా తప్పేమి? శివుడన్నా, విష్ణన్నా, పీరన్నా, బుద్ధుడన్నా ఆ పరమాత్మ మట్టుకు ఒక్కడే గదా?" వెంకయ్య వూరుకుంటాడా, "అందరు దేవుళ్ళూ వక్కరే అయితే, ఆ పీనుగుల్ని అందరినీ ఒక్కచోటే నిలిపి అందరూ కలిసి పూజ తగలెట్టరాదా?" అన్నాడు.

అంత గురువుగారు "ఓరి! దేవుళ్ళని పీనుగులంటావురా? నువ్వు వొట్టి కిరస్తానువి – యింకా కిరస్తానుకైనా దేవుడంటూ వున్నాడు; నువ్వు కిరాతుడివి. పీరో, బిట్రో, దెయ్యమో, దేవరో, యీ అజ్ఞులకు మూఢభక్తి అయినా వుంది. నువ్వు అందరు దేవుళ్ళకీ ఒక పెద్ద నామం బెట్టావు.

"ఒక్క మీకు తప్ప శాస్తుల్లు గారూ", అన్నాడు.

"నీ జన్మానికల్లా విలవైన మాట అంటివిరా" అని నే అన్నాను.

*(ఆంధ్రభారతి, 1910 ఏప్రిల్, మే, జూన్ సంచికలు)*

# మతము : విమతము

(గోలకొండ పాదశాహీ వారి పర్మానుల సీలు యిచ్చుట విప్పుబడుటం జేసి దీనికి సికాకోల్ లేక చికాకోల్ అను పేరు కలిగెనని యిక్కడి వారందురు గాని, అది నిజము కాదు. ఈ పట్టణము బహు ప్రాచీనమైనది. దీని పేరు శ్రీకాకుళము. ఒకప్పుడిందు శ్రీకాకుళేశ్వరుని క్షేత్రముండెను. దానిని పడగొట్టి షేరు మహమ్మదు పెద్ద మసీదును కట్టెను. నిజమిది)

ఒక సంవత్సరమున కార్తీక మాస శుక్లపక్ష దశమి నాటి సాయంత్రం ఇద్దరు బ్రాహ్మణులు, ముప్పది యేండ్ల ప్రాయపుటతడొకడును, యిరువది యేండ్ల లోపు వయస్సు గల యతడొకడునూ తూర్పు నుండి పట్టణము దరియ వచ్చుచుండిరి.

నారాయణభట్టు మోము అత్యంత సంతోషముతో వికసితమై యుండెను.

"పుల్లా! మా వూరొచ్చాంరా. యిట్టి వూరు భూప్రపంచములో వుండబోదురా. కాళిదాసు అవంతిని ఉద్దేసించి చెప్పిన మాటలు దీనియందు వర్తిస్తున్నాయిరా, యేమి నది, యేమి వూరు! ఇది శ్రీకాకుళేశ్వరుడి క్షేత్రము, యెట్టి మహాక్షేత్రమని చెప్పను, అదుగో –

నారాయణభట్టు నిశ్చేష్టుడై నిలిచి, కొంత తడవు మాటాడకుండెను.

"యేమి స్వామీ! యేమి స్వామీ!" అని పుల్లంభట్లు అడుగ "యేమి చెప్పనురా పుల్లా! కోవిల గోపురం మాయమై పోయిందిరా!" అని నేలపై కూలబడెను.

"చెట్ల చాటునుందేమో స్వామీ?"

"యే చెట్లు కమ్మగలవురా, పుల్లా!ఆకాశానికి నెత్తంటిన ఆ మహా గోపురాన్ని, మనస్సు చివుక్కుమని పోయిందిరా పుల్లా! యీ పట్నానికీ మనకీ రుణస్య చెల్లిపోయింది. రా తిరిగీ కాశీ పోదాం."

"గోపురం కోసవాఁ యిక్కడికి వచ్చాం స్వామీ? యెడతెగని మార్గాయాసం పడి యీ నాటికి దేశం చేరాం గదా; మళ్ళీ వెంటనే పోవడానికి యినప కాళ్ళు కావు గదా? లెండి, నా మాట వినండి; దాని సిగ్గోసిన గోపురం, గోపురవఁన్నదే మీకు కావలసి వుంటే మా వూరు రండి.

"ఓరి వెఱ్ఱివాడ! మీ వూరి గోపురం యెవరిక్కావాలిరా! నీకు బోధపడదు. చిన్నతనంలో యెప్పుడూ ఆ గోపురం మీదనే. యెందుకా తీపులు, మా గోపురం కథాశేషమైంది."

లేచి "శివ శివ –" ఓరే, మీ వూరి గోపురం కూడా యీ మ్లేచ్ఛులు పడగొట్టి వుంటాట్లా!"

"మీకు యేమి ఉపద్రవం వచ్చింది? పడగొడితే ఆ పాపం వాళ్ళనే కొడుతుంది. ఆకలేస్తూంది, పెందరాళే వూరు చేరుదాం!

"యేం వూరు – యేం చారడం! ఆకలంతా పోయిందిరా!"

నారాయణభట్టు లేచి మౌనము వహించి కొంత తడవు నడచెను. అంతట తలయెత్తి చూడ సంజ చీకటిలో నెలి వెలుగు కమ్మిన పడమటి ఆకాశమును దూసి రెండు మసీదు స్తంభములు కళ్ళ యెదుట నిలిచెను. నారాయణభట్టు మరల నిలిచిపోయి స్తంభముల పరికించుచు;

"కాకుళేశ్వరుడి గుడి పగలగొట్టి మ్లేచ్ఛుడు మసీదు కట్టాడు" అనుకొనెను.

"దేవుఁడెందు కూరకున్నాడు. స్వామీ"

"ఆ మాటే యే శాస్త్రంలోనూ కనబడదురా పుల్లా. మసీదు వేపు పోదాం పద."

"మసీదు గానీ సత్రం అనుకున్నారా యేమిటి? పెందరాళే భోజనం మాట ఆలోచించు కోకపోతే ఉపవాసం తటస్థిస్తుంది".

"అంత మహాక్షేత్రం పోయిన తరువాత తిండి లేకపోతే వచ్చిన లోటేమిటి?"

కాలుకు కొత్త సత్తువ పుట్టి గురువును, కాలీడ్చుచు శిష్యుడును, గట్లంట పుట్టలంట బడి మసీదు ద్వారం చేరిరి.

"యేమి తీరుగా కట్టాడు స్వామీ, మసీదు"!

"వాడి శ్రాద్ధం కట్టాడు!"

గెడ్డము పెంచి యాబది సంవత్సరములు ప్రాయము గల ఒక తురక చిలుము పీల్చుచు కూర్చుని యుండ నారాయణ భట్టు 'సలా'మని ఇట్లడిగెను.

"భాయీ! యిక్కడే కదా పూర్వం శివాలయం వుంటూ వచ్చింది".

తురక ఒక నిమిషమూరుకొని నోటిలోని పొగ నెగనూది "హో సైతాన్కాఘర్" అని యుత్తర మిచ్చెను.

"యేం పాట్లొచ్చాయీ దేవుఁళ్ళకి!"

"దేవుళ్ళకి యేపాట్లూలేవు – మన సాపాటు మాట ఆలోచించరేం?"

"కుఱ్ఱవాళ్ళకి ఆకలి లావు. సాయీబు గారూ! యీ వూళ్ళో చేబ్రోలు వారుండాలి; వున్నారా? ఈ దేవాలయం దగ్గిరే వారి బస వుండేది. అనగా యిప్పుడు మీ మసీద్దగ్గరే!"

ముసల్మాను స్వచ్ఛమగు తెనుగు నవలంబించి "లేద"నెను.

"అయ్యో! మా పెద మావఁ రామావధానులు చిన్నమామ లక్ష్మణ భట్టు దేశాంతరగతులైనారా? మృతులైనారా?

సాయీబు చేత నుండి చిలుము నేలరాలి ముక్కలై నిప్పులు నలు దెసలా చెదర, 'నారాయణా' అని సమ్మోదముగా పిలిచెను.

# మెటిల్‌డా

నేను వృక్షశాస్త్రము యమ్.యే. పరీక్షకు చదువుతూ వుండే రోజులలో మైలాపురి పెద్ద రోడ్డున ఒక మిద్దె యింట్లో బసచేసి వుంటిని. నాతో పాటు పది పన్నెండుగురు విద్యార్థులు మనదేశపు వాళ్ళు ఆ మేడ యింట్లో వుండేవారు.

నేను వచ్చినమూడో రోజున రామారావు నన్ను సౌజ్ఞ చేసి పిలిచి రహస్యంగా "మెటిల్డాను చూశావా?" అని అడిగాడు. "లేద"న్నాను. "అదుగో చూసీ చూడనట్టు చూడు" అని చూపించాడు.

చూశాను.

"చాలు, యికరా" అన్నాడు.

మెటిల్డా వైపు తిప్పిన మొహం తిప్పకుండానే "యెలా రావడం: కళ్ళు భగవంతుడు యిచ్చినందుకు యిదే కదా ఫలం – మనోహరమైన భగవంతుడి సృష్టిలో కల్లా మనోహరమైనది సొగసైన స్త్రీ, మనస్సులో చెడుచింత లేనప్పుడు చూస్తే తప్పేమి?" అన్నాను.

"నీలా శ్రీరంగ నీతులు చెప్పిన వాళ్ళనిచాలామందిని చూశాను. కొత్త వాడివి, యెరిగివుంటే మంచిదని చూపించాను. మరి యెన్నడూ యిటు కన్ను తిప్పకు." అని రెక్క పట్టుకు గెంటుక పోయినాడు.

"మంచి మనిషా, చెడ్డ మనిషా?" అని అడిగాను.

"మంచయితే మనకేల? చెడ్డయితే మనకేల? ఒకర్ని మంచి కాదండానికి మన మంచేం తగలడుతూంది? మెటిల్డా వైపు చూడవలెనని తిరిగి యెన్నడైనా చూస్తివా నీకూ నాకూ నేస్తం సరి" అన్నాడు. రామారావు నాకు ప్రాణసమానమైన మిత్రుడు. యేం చెయ్యను, మనసు నిరోధించి మెటిల్డా యింటి పెరటి వేపు వున్న డాబా పొంతకు నే వెళ్ళలేదు, కొన్నాళ్ళు.

పసుపు రాసుకొని స్నానమాడిన పైని బంగారు చాయలు దేరిన మేని సొంపు, నెమలి పింఛమువలె ఒడలును కమ్మి చెదిరిన తలకట్టూ, బావి నుంచి నీరు తోడిన వయ్యారమూ, తోడుతూ వొక్కొకతరి తలయెత్తి యిటు అటూ చూసిన కన్నుల తళుకూ, మోము అందమూ నా కన్నులు కట్టినట్టు వుండి మరుతునన్న మరుపు రాకపాయను.

వారం పది రోజులు కట్టుమీద వున్నాను. ఆ పైని మనసు పట్టలేక పచారు చేస్తూ చదివే మిషమీద, చేత పుస్తకం, దృష్టి పెరటి వేపూ వుంచి డాబా మీద గస్తు తిరిగేవాణ్ణి రామారావు యింట లేనప్పుడు.

ఆ రోజుల్లో రెండుమార్లే యేదో పని మీద పెరట్లోకి వచ్చి వెంటనే యింట్లోకి వెళ్ళిపోతూ వచ్చింది – మెరుపులా.

కాలేజీకి వెళ్ళేటప్పుడు మెటిల్డా యింటి యెదట చీమలాగ నిమ్మళంగా ఆ యింటివేపు చూస్తూ నడిచేవాణ్ణి. అప్పుడప్పుడు చిత్తరవు చట్రంలో ప్రతిమలాగ, గవాక్షంలోంచి మెటిల్డా కనపడేది.

## 2

మెటిల్డా చరిత్ర అడిగి వారివల్లా, వీరివల్లా, అడక్కుండా నా నేస్తుల వల్లా గ్రహించాను.

మెటిల్డా పెనిమిటికి మావాళ్ళు పులి, ముసలి పులి అని పేరు పెట్టారు. అంత ముసలివాడు కాడు. యాభై అయిదు, యాభై ఆరు యీడు వుండవచ్చును. కొంచెం తెల్లగా, పొట్టిగా వుంటాడు. పెద్ద కళ్ళూ, కోర మీసాలూ, స్ఫోటకం మచ్చల మొహం. రెండేళ్ళాయ వచ్చి మా ప్రక్క బంగళాలో బసవేశాడు. యెక్కణ్ణించి వచ్చాడో, యెందుకు వచ్చాడో యెవరూ యెరుగరు. వీధి వేపు పెరటిలోకి వొరసుకొని పెద్ద గది వొకటి వుంది. దానిలో మూడు బీరువాలతో పుస్తకాలు వున్నాయి; అమేషా రాస్తూనో, చదువుతూనో కనపడేవాడు. వీధి పెరటిలోనూ, వెనక పెరటిలోనూ పూల చమన్ బహు సొగసుగా వుంచేవాడు. ఉదయం, సాయంత్రం మొక్కలకు గొప్పు తవ్వేవాడు. మెటిల్డా మొక్కలకి నీరు పోసేది. ఇది యింగ్లీషు పద్ధతి ప్రకారం యిద్దరికీ శరీర వ్యాయామం. అంతే మరి, యిల్లు కదలి నాలుగు అడుగులు పెట్టడమన్నది లేదు. యింటికి చుట్టాలూ,పక్కాలూ రాకపోకలు యెన్నడూ లేదు. పులి మెటిల్డాని యెక్కువ కాయిదా పెట్టేవాడు. గుమ్మంలోకి రాకూడదు అని శాసనంట. గాని అప్పుడప్పుడు వచ్చేది. ఆ పిల్ల మొఖాన వొక మోస్తరు విచారం కనపడేది. వింతేమి? మొగుడు కంట్రక పెట్టేవాడు. మొగుడి అప్ప (అక్క), ఒక ముదుసలి, చిలిపి జగడాలు పెట్టేది. ఇంటిలో మిగిలిన వాళ్ళు ఒక ముసలి వంట బ్రాహ్మణుడు.

మెటిల్డా పెనిమిటిని పులి, పులి అనడమే గాని అతని పేరేమిటో యెవడూ యెరగడు; పోస్టు బంట్రోతు ఆయన పేర వచ్చిన ఉత్తరముల పై విలాసం ఎవరికీ చూపకుండా నిర్ణయంట. ఒక్క పోస్టు మేష్టరికీ, పులికీ మాత్రం పరిచయం వుందని అనుకునేవారు.

అది రహస్యం కాపాడడం కోసమై వుంటుంది.

## 3

ఒకనాడు అభ్యంగనమై జుత్తు విరియబోసి, షోకుగా టోపీ తలనమర్చి, మల్లిపువ్వు లాంటి బట్టలు కట్టి బరికి పోతూ, మెటిల్డా యింటి యెదట జాలంగా నడుస్తూ వుంటిని. అంతట గుమ్మం దగ్గిరికి వచ్చి, ఆమె వేపు చూస్తూ నిలిచిపోయినాను. అర మినుటు కావచ్చు, పులి గుహలోంచి పైకి దుమికి, "అబ్బాయీ, యిలారా" అన్నాడు. తంతాడేమో పరుగుచ్చుకుందావాఁ అనుకున్నాను; గాని అట్టి పని చేస్తే నాయందు నేరం నిలవడం కాకుండా, మెటిల్డా యందు నేరం నిలుస్తుం దేమో? నాకు యేమైతే ఆయను, ఆమెను కాపాడదామని వెళ్లాను.

లైబ్రరీ గదిలోకి తీసికెళ్ళాడు. కుర్చీమీద కూలబడి, రౌద్రాకారమైన చూపుతో యింగ్లీషున అడిగాడు?

"నా పెళ్ళాం వేపు చూస్తున్నావా?"

"కిటికీలోంచి కనపడుతూండే మీ లైబ్రరీ చూస్తూ, మీరు యెటువంటి మనుష్యులు, యేమి చేస్తుంటారు అని ఆలోచిస్తున్నాను."

"నా పెళ్ళాన్ని చూడలేదూ?"

"చూశాను, యెదట నిలుచుంటే కనపడరా, అంతే". పిడుగులాగ "జానే! జానే!" అని పిలిచాడు. మెటిల్డా రాలేదు.

"వొస్తావా రావా, లంజా!" అన్నాడు. వొణుకుతూ మెల్లగా వచ్చి తల వొంచుకు నిలబడ్డది.

యింగిలీషున నాతో మళ్ళీ అన్నాడు.

"ఓ తెలివితక్కువ పెద్దమ్మా – చూడు, యెంత సేపు చూస్తావో, యీ ముండ మొహం వేపు యేం, నా వేపు చూస్తావేం, దాని వేపు చూడక? నా మొహం దాని మొహంకన్నా బాగుందనా?

నేను మాట్లాడలేదు. కథ బాగుంది కాదని, కాలు గుమ్మం వేపు సాగించబోతూండగా, కనిపెట్టి మెల్లగా "వుండు" అన్నాడు.

నిలిచాను.

నిమిషం కిందట కన్నుల రాలిన నిప్పులు చల్లారాయి.

"అబ్బాయీ" అన్నాడు.

"నిజవాఁడ్డం యెన్నడైనా నేర్చావా? తల్లిదండ్రుల దగ్గిర గాని గురువుల దగ్గిర గాని." నా తల్లీ తండ్రీ తలపుకు వచ్చారు.

"నేర్చవలసిన అవసరం లేకుండా నిజాయితీ నాకు పుట్టుకతోనే వచ్చింది" అన్నాను.

"అయితే, పుట్టుకతో పుట్టిన ఆ నిజాయితీ చూదాం, చెప్పు; నా పెళ్ళాం అందంగా వుందా లేదా?"

"ఆమె అందంగానే వున్నాదనుకుంటాను"

"సంశయవేఁవైనా వున్నదా?"

"లేదు"

"తోవంట వెళ్ళేటప్పుడు రోజూ, దానికోసం యీ వేపు చూస్తూ వుంటావా లేదా?"

"నిజమాడమన్నారు గనుక వొప్పుకోక విధి లేదు. చూస్తున్నానుగాని, చెడ్డ తలపు మనసులో యీషత్తు వుంటే దేవుడు సాక్షి?".

"దాని మాటకేం – అది కంటికిక్కనపడితే నీకు ఆనందం. అవునా కాదా? నిజవన్నదేదీ?"

"అవును"

"అయితే ఈ ముండని తీసుకుపో – నీకు దానం చేశాను తీసుకో, నాకు శని విరగడై పోతుంది".

నేను మాటాడకుండా కదలి పైకొచ్చాను. యిళ్ళు కనపడలేదు. మనుషులు కనపడలేదు. శృంగభంగమై నన్ను నేను దూషించుకుంటూ బరికి పోయినాను.

అక్కడ బస యెత్తెయడానికి నిశ్చయించాను. బస యెత్తేసి, మరి ఆ వీధి మొహం చూడకూడ దనుకున్నాను.

నా కళ్ళకి కట్టినట్లు ఆ వొంచిన మొఖం : బిందువులుగా స్రవించిన కన్నీరు : ఆచుకొన్న నిట్టూర్పుల చేత కంపించిన రొమ్ము – యే మహాకవి రచనలోనూ లేదనగలను, అగాధమై ప్రౌఢమైన కరుణరసం, ఆ సరిలేని సొగసున్నూ.

## 4

నే బసవున్న యింటి గుమ్మం దగ్గిరకి వచ్చేసరికి పులి యింటి ముసలి బ్రాహ్మణుడు సన్నసన్నగా, నా చేతులో ఒక చీటీ పెట్టి జారిపోయినాడు, ఇందాకటి కథతో దీనికేదో సంబంధం ఉందని తలచి, నా గదిలోనికి వెళ్ళి లోపల గడియ వేసుకొని చీటి చదువుకొన్నాను, దానిలో యేముందీ?

కుదురైన అక్షరాలతో

"మీరూ, మీ నేస్తులూ నా కాపరం మన్ననివ్వరా? మీకు నేనేం అపకారం చేశాను? తల వంచుకు మీ తోవను మీరు పోతే నే బతుకుతాను. లేకపోతే నా ప్రారబ్ధం".

యేమి చెయ్యను? అక్కడ బస విడిచి మరివక చోటికి పోతే, నా మట్టుకు చిక్కు వొదులు తుందనుకుంటిని గదా? యిప్పుడు మెటిల్డా చేసిన విన్నపం యెలా తొలగి వెళ్ళిపోదును? నా స్నేహితుల వల్ల ముప్పు కలక్కుండా ఆమెను కాపాడవద్దా? కాపాడగలనా?

మెటిల్డాను కాపాడలేకపోతే బతుకేఁవిటి? పౌరుష మేవిఁటి? ఈ మనోజ్ఞమైన స్త్రీ రత్నం యొక్క చిత్రకథలో, దుఃఖ భాజన కథలో, నేను కూడా చేరానా? దుఃఖం మళ్ళించి, యీ అందకత్తె మనసుతో మెప్పుకొంటే జన్మ సార్థకమవుతుంది. ఈ సొగసైన లిపి మెటిల్డా రాసినదా? యేమి అదృష్టవంతుణ్ణి? మెటిల్డా యేమి రాస్తే చెయ్యను. త్రైలోక రాజ్యం నాకుండి, యిమ్మ్" అంటే పట్టం గట్టనా?

గాని యిప్పుడు యేం చేతును? నాకు లోకజ్ఞానం తక్కువ, వినాయకుని చెయ్య బోయి కోతిని చేస్తానేమో? రామారావు అనుభవజ్ఞుడు, గుణవంతుడు, నేర్పరి, చెప్పిన మాట విననందుకు చివాట్లు పెడితే పడతాను. నా ఉద్యమంలో సాయం చెయ్యమని కాళ్ళు పట్టుకుంటాను.

అని ఆలోచించి రామారావుకు పూస గుచ్చినట్లు కథంతా చెప్పాను. నా నిశ్చయం యిదని తెలియచేశాను. మళ్ళించ ప్రయత్నించవొద్దని గెడ్డము పట్టుకు బతిమాలాను. రామారావన్నాడు. "మళ్ళించగలనని నమ్మకం వుంటే మళ్ళించజూతును, మళ్ళవని యెరుగుదును, చూడవద్దంటే చూడడం మానితివా?"

"గాని నాకు తోచిన మాటా, నాకు తెలిసిన మాటా నీకు చెప్పకపోతే నేను అపరాధిని అవుతాను, స్నేహాన్ని తప్పినవాణ్ణి అవుతాను".

"ఆలు మొగుళ్ళ దెబ్బలాటల్లోకి వెళ్ళవద్దని మన పెద్దల శాసనం. అవి అభేద్యాలు, అగమ్య గోచరాలు. మధ్యవర్తులు, కాపరం చక్కచేదావఁని చెక్కలు చేసి వెళ్ళిపోయి వస్తారు" ఒకటి.

"పులి పులి అని మనం యెంత పేరు పెట్టినా పాపం యీ పులి అరుపే కాని కరుపు లేదు. మెటిల్డాని యెన్నడైనా ఒక్క దెబ్బ కొట్టాడని విన్నామా? లేదు. తిండికి లోపం లేదు. గుడ్డకి లోపం లేదు. అతను చెప్పినట్టు మెసులుకుంటే నెమ్మదిగా కాలం వెళ్ళడానికి అభ్యంతరం లేదు" – రెండు.

"యిక మూడోది, నీకు మెటిల్డా మీద మనస్సు గట్టిగా లగ్నం అయింది. అది కూడని పని. చెడ్డ తలంపు లేనప్పుడు యేమి ఫర్వా అని అనగలవు. చెడ్డ తలంపు చెప్పి రాదు. యెక్కణ్ణించో రానక్కర్లేదు. కంటికెక్కనపడకుండా మనసులో ప్రవేశించి పొంచి వుంటుంది. చూసీ చూడనట్టు మనం వూరుకొని, అది పైకొచ్చే ప్రయత్నాలు బాహాటంగా చేస్తూ వుంటాం. చెడ్డ తలపులకి గుర్తు యెవరైనా వుండాలి కదూ. అడవిలో వొంటరిగా వున్న వారికి స్త్రీల విషయమై

చెడ్డ తలపులు వుండవు. సొగసైన స్త్రీల పొందు కోరేవాడికి అవకాశం తటస్థించినప్పుడు చెడ్డ తలపు వస్తుందా రాదా అని ఆలోచన. అ అవకాశానికి అవకాశం యివ్వని వాడె ప్రాజ్ఞుడు".

## 5

"నాకూ నీవూ, నీ స్నేహితుడు రామారావూ మరొక గొప్ప వుపకారం చేశారు. మీ మాటలవల్లా, చేష్టల వల్లా నా భార్య యోగ్యురాలని తెలుసుకొన్నాను. ఆలోచించుకోగా ఆనాటి నుంచి కళ్లెం వదిలేశాను. నా పెళ్ళాం బహు బుద్ధిమంతురాలు. యిచ్చిన స్వేచ్ఛనైనా పుచ్చుకోలేదు. యెక్కడికి కావలిస్తే అక్కడికి వెళ్ళమన్నాను. యెవరిని కావలిస్తే వారిని చూడమన్నాను. యెక్కడికి వెళ్ళకోరలేదు. యెవర్నీ చూడకోరలేదు. నాకు నీతో లోకం. మరి యెవరితో యేం పనంది. అలాగే సంచరించింది..

దాని చర వొదిల్చావు. అది నా చర కూడా వొదలడానికి కారణమైంది. హయ్యరు మాథ మిటిక్సు చదువుకున్నావా? లేదు. పోనియ్యి"

కాల్‌బెల్ టింగ్‌మని వాయించాడు. కీలుబొమ్మలాగ మెటిల్డా ప్రవేశించి గుమ్మం లోపున నిలబడింది.

"కాఫీ యియ్యి"

బల్ల మీద రెండు గిన్నెలతో కాఫీ అమర్చింది.

"నీక్కూడా పోసుకో"

మొగుడు కేసి "కూడునా యిలాంటి పని" అనే అర్థంతో చూసింది.

"పర్వాలేదు, నువ్వు కూడా తాగు; మన స్నేహితుడు" అన్నాడు. గాని ఆమె తనకు కాఫీ అమర్చుకోలేదు. ప్రక్కను నిలుచుంది.

"పోనియి, కూచో," అన్నాడు, కూచోలేదు. నేను భార్యాభర్తల సరాగానికి సంతోషించాను. నేను అందుకు కొంత కారణభూతుణ్ణి కదా అని మెచ్చుకున్నాను.

కాఫీ పుచ్చుకున్నంతసేపూ అతను చెప్పిన మాటలు, తన భార్యకు చదువు చెబుతున్నాననీన్నీ, అమేషా రామాయణం, భారతం చదువుతున్నట్టుందనీ, తను ఫలానా ఫలానా చోటికి తీసుకు వెళ్ళాననీ, కులాసా దిలాసా చూపించానని. అంతట నా చదువు మాట కొంత. చాలా విద్వాం సుడని కనుక్కున్నాను.

వెళ్ళిపోయేముందు "మరి నువ్వు వెళ్ళిపో"

●

# మాట, మంతి - 1
# గ్రామ్య శబ్ద విచారణము

నవంబరు 5వ తేది శశిలేఖలో మ. చినపురుషోత్తం పంతులుగారు మొదలైనవారున్ను, 7వ తేదీని మా మిత్రులగు మ. లక్ష్మణరావు పంతులుగారున్ను వ్రాసిన లేఖలు చూస్తిని.

శశిలేఖా సంపాదకులు నాకు చాలా కాలము నాటి మిత్రులు. చెడుగు చేతామనే వూహతో నన్నుగూర్చి యేమిన్ని వ్రాయరు, అచ్చొత్తరు. కాక, యేమి ప్రచురించినా, మా స్నేహానకు భంగము రాబోదు.

విద్వాంసుల ధోరణులు వేరు వేరు రీతుల నుంటవి. హాస్యరసము మీద కొందరి కలము పరుగులిడుతుంది. కొందరి బుద్ధులు దోషాన్వేషణములో వాడితేరుతవి. మరికొందరి బుద్ధులు తిట్లకు తీరివుంటవి. ఈ మూడు రీతులూ చాలినంత లేకపోవడము వల్లనే, మన భాష యిప్పటి యీ దురవస్థలో వున్నదని నా అభిప్రాయము.

కాని, కన్ను కొంచెము తెరచి, యితర దేశములలో భాషలు యేలా పెరుగుతున్నవో, అదిన్నీ, గత కాలములో మన దేశభాషలు యెట్లు పెరిగినవో అదిన్నీ, కాని; శ్రద్ధతో భాషా శాస్త్రమును కరచి, గ్రాంథిక వ్యావహారిక భాషలను పరిశీలించి, మరి తప్పులు పట్టతలవడితే, ఉభయ తారకంగా వుండును. తీర్పులు చెప్పడం సులభం; విద్యా పరిశ్రమ కష్టం.

అంతవరకు యెవరి స్వభావానుసారముగా వారిని వ్రాయనిస్తేనే తప్ప, పేపర్లకు యీపాటి వ్రాయడమూ వుండదు. అచ్చు ఆఫీసులు మూసి, పత్రికా సంపాదకులు తపస్సుకు కూచోవలసి వస్తుంది.

ఇక మా మిత్రులు మ. లక్ష్మణరావుగారి మాట–మ.రాయప్రోలు సుబ్బారావు పంతులుగారు యేమివ్రాశారో నేను చూచియుండలేదు. లక్ష్మణరావు గారి వ్రాతను పట్టి చూడగా వారికి, వాడుక భాషయందు నిరసన భావం వున్నట్టు కనబడుతుంది ఏలనో? వారు దయచేసి కారణము చెప్పుదురు గాక.

గత కాలములో నవమాష్టం పారాయణము చెయ్యడమందు నిపుణులైన బ్రాహ్మణ వుద్యోగస్థులు రయితును, రత్రను, పరిపాటిగా, ఒక స్వారస్యమైన తిట్టు తిట్టుతూ వచ్చేవారు.

ఇప్పుడైనా కడపెడలను ఆ శబ్దం, వినబడ్డం కద్దు. యీనాడు కొందరు పండితులూ, కవులూ అట్టిదియే, ఆ గ్రామ్యోక్తివొకటి. గ్రామ్య భాషను గురించి వినియోగించుదురు.

వారిలో తెగబడి దీవించినవారు శ్రీ బాలకవి భోగరాజు నారాయణమూర్తిగారు, వారు వ్రాసిరి –

గీ. అజుని సృష్టి విచిత్రమేమందు నౌర
ఘనుల నిరుపమ పాండిత్యగరిమమేమొ
అంబురాసిలో గాలకూటంబు వోలె
గ్రామ్యభాష కొత్తగా ప్రబలె నిపుడు.

గీ. నిరత మవలక్షణంబుల నెగడుచుండి
ఆంధ్ర భాషతోఁబోరాట మాడదొడగె
లంజసంతతి సొత్తుకై లావుమించి
యౌరసునితోడ బోరాటమాడునట్లు.

సీ. నవనవాలంకార నవ్య వైభవమన్న
దలనొప్పియట దీని సరణి యేమొ
మహిని వ్యాకరణోక్తి మాటలాడుటయన్న
వాంతి యౌనట దీని వరుసయేమొ
సాహిత్య విధ్యుక్త సల్లక్షణములన్న
నురిబోసికొను దీని సరణియేమొ
వివిధ భవ్యాకార వృత్తగీతములన్న
మూలడాగును దీని లీలలేమొ

గీ. తగుదునని తానుగూడను తగవులిపుడు
సేయగాబూనె దెల్గుతో వేయి యేల
ఆంధ్రభాషా వధూటీ గృహాంగణమున
దాసియై మెలగుటకు నైన దగునె చెపుడ.

Appearances are deceptive – అని వొక ఆంగ్లేయోక్తి కలదు. తిట్టగానే, అసూయ కాబోదు. భూషించగానే, అనురాగం కాబోదు. ముద్దుతిట్లూ, భక్తి తిట్లూ, రస భరితములు. నారాయణమూర్తిగారి తిట్లు కూడా అట్టివేమో యని సందేహం పొడముతున్నది. లేని యెడల అవలక్షణములు వారి కవిత్వమందు వారేల వాడుదురు?

వీరు ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికకు వ్రాసిన పైపద్యములు కాక, శ్రీ రాయబహద్దర్ వీరేశలింగం పంతులు గారి లైబ్రరీని గురించి ఆంధ్రప్రకాశికకు వ్రాసిన పద్యములను కూడా నేను చదివితిని. అందు కొన్ని స్వారస్యములు కానవచ్చినవి.

1) స్వభాషను దేశమునందునన్ జీవవినాశ ఘోరమును బొందగనీయక.

2) పూజితమై కవీంద్రసుమపుష్కలమై ద్విజరాజపుంజమై
 చెలంగు నీ రాజమహేంద్ర పట్టణ వరస్థిత బాలక పుస్తకాలయోర్వీజము,

3) కల్పతరోపమానమై

4) నవనవ గ్రంథసంధానుడై యే కవి

5) అతులతేజసంయుతంబయి

ఈ సంస్కృత ప్రయోగములు మిక్కిలి సరళములు కావనుకుంటాను. ఇక తెనుగున కళలు ద్రుత ప్రకృతికములతో సంబంధించిన నియమములను వీరు సంస్కరించినట్లు కనబడుతుంది.

1) చాల యుపద్రవమయ్యె.

2) దేశభాషలందెల్ల యనుచు.

3) కథల నవ్వుల కల్లమి కలలబడుట.

4) భాషను చక్కగా.

5) అటుచేతురు గాక.

ఇది గ్రామ్యమునకు వృత్తి కల్పించుట కాదా! బలియులు బలియురు కావలయును.

పై వ్రాసిన మాటలు, రాయవలసివచ్చినందుకు చాలా చింతిస్తున్నాను. బాలకవులు ప్రతిభావంతులని వింటిని. మన ప్రాచీనకవుల గ్రాంథిక భాషలో రాయడమన్నది గరిడీవిద్య. భగవంతుడు కాళ్ళు యిచ్చినందుకు సుఖంగా నడవక గెడలెక్కుదురు; యేమి చెయ్యను?

రామాయణమును తెలుగు చేసిన మ. వావిలికొలను సుబ్బారావు పంతులుగారు కూడా ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో గ్రామ్యమును గురించి సరసముగా కొంత ముచ్చటించిరి. "కులటయగు మాతకన్న బతివ్రతయగు మాత యెక్కువ పూజ్యురాలైనట్లు, గ్రామ్యభాషకన్న లాక్షణిక భాషయే ప్రశస్తమని బుద్ధిమంతులెల్ల నంగీకరింతురు. అట్టి సలక్షణ భాష నుపేక్షించినచో గలుగు ననర్థములు పెక్కులు గలవు. గ్రంథవిస్తరభీతి సంక్షేపించెద. గాని తుద కాంధ్రపదము నామావశిష్టమగు".

పరభాషల నేర్చుట కడుపుకూటి విద్యగా నెంచి ఇంకొక చోట రాయడంలో సుబ్బారావు పంతులుగారు పరభాషల నేర్చుట కేవల గర్హ్యము కాదనుటకు ప్రమాణముగా యీ కింది పద్యమును వుదహరించిరి:

క్షితి మ్లేచ్ఛభాష శృతి గ
ర్హితమగునట్లే నని ధరిత్రిని దానిన్।
మతిరోసి విడువగూడదు
సతతము వ్యవహారహాని సంధిలు కతనన్ ॥

పై పద్యమున మ్లేచ్ఛభాషయని రాయడములో అప్పకవి తురకల భాషను మనస్సులో వుంచుకున్నాడు. ఆ కింది ఉదాహరణములను చూడండి. సుబ్బారావు పంతులుగారు యింగ్లీషు భాషను మనస్సులో వుంచు కొనిరి. గాని శృతి గర్హితమయిన మ్లేచ్ఛితము, యిది గాని, అది గాని కాదనుకుంటాను.

పతంజలి, వ్యాకరణాధ్యయన ప్రయోజనములను చెప్పడములో, శతపథ బ్రాహ్మణంలోని ముక్కొకటి యెత్తి రాసినారు.

తె సురా, హేలయో, హేలయ ఇతి కుర్వన్తః పరాబభూవుః।
తస్మాద్బ్రాహ్మణే న మ్లేచ్ఛితవై నాపభాషితవై।
మ్లేచ్ఛోహవా ఏషయ దపశబ్దః।

మరివొకచోట మహాభాష్యంలో – గరీయా నపశబ్దోపదేశః। ఏకైకస్య శబ్దస్య బహవో అప భ్రంశాః। తద్యథా గౌరిత్య శబ్దస్య గావీ । గోణీ, గోతా, గోపోతలికేత్యేవమాదయోపభ్రంశాః”

శృతిదృష్ట్యా, సంస్కృతపు మాట, లోకులనోట మారి సంస్కృత లక్షణమునకు పొందక పోగా, అట్టిమాట మ్లేచ్ఛితము లేక అపశబ్దమగును. అంతేగాని తురకమూ, యింగిలీషూ మ్లేచ్ఛితములు కావనుకుంటాను.

ఉద్యోతంలో నాగోజీభట్టు “నమ్లేచ్ఛితవై ఇత్యేత న్మ్లేచ్ఛభాషా విషయ మితి భ్రమనివృత్త్యర్థం తద్వివరణం నాపభాషితవై ఇతి అపశబ్దత్వం వ్యాకరణానుగత శబ్దస్యేషద్భ్రంశన ఏవ ప్రసిద్ధ మితి భావః॥ నను మ్లేచ్ఛోనామ పురుష విశేషో దేశ విశేషోవాస కథ పమశబ్దో॥ త అహ ఘజితి। నిన్దావచనా న్మ్లేచ్ఛతే రితి భావః। నిన్దా చ శాస్త్ర బోధిత విపరీతోచ్చారణేన పాపసాధనత్వాత్। ఏవం చ మ్లేచ్ఛా ఇత్యస్య నిన్ద్యా ఇత్యర్థ ఇతి దిక్”

వేదదృష్ట్యా, అన్య దేశభాషలకు మ్లేచ్ఛిత దోషము వర్తించనేరదు. “గ్రామ్యము నందు గల యనేక దోషంబుల గ్రహించియే పూర్వులు “అపశబ్దం ప్రయుంజానో రౌరవం నరకం వ్రజేత్” అని శాసించి” రని సుబ్బారావుగారు ఒక బాంబును నా బోట్ల మీద విసరజూడగా అది, పంతులు గారి చేతిలోనే పేలినది. యుక్తమే కదా?

సుబ్బారావు పంతులుగారు రామాయణము తెనిగించినారు. వారి తెనుగు సంస్కృత పదములతో నిండివున్నది. వీరి సంస్కృత ప్రయోగములలో మ్లేచ్ఛితములు అక్కడక్కడ కలవు.

"గావీ, గోణీ, ఆణవయతి" ఇత్యాది అపభ్రంశములను పఠించిన శిష్టేతరులకు, లోకసిద్ధి అయినా శరణమై యుండెను. స్వసిద్ధాంత ప్రకారము, పంతులుగారికి యే శరణమూ కానరాదు.

గాని, ఉద్యోతంలో "ప్రకరణాచ్ఛక్రత్వం గోయం నిషేధః" అని – అహోబలపండితీయములో అతయేవ వ్యాకరణ మహాభాష్యే సర్వోప్యపశబ్ద నిషేధః క్రతువిషయ ఏవ ఇతి ప్రతిపాదితం" ఇటువలెనే శబ్ద కౌస్తుభంలో కూడా మహా భాష్యమందు "యాజ్ఞే కర్మణి సనియమో అన్యత్రా౽ నియమః" ఉద్యోతంలో "యజ్ఞే సుశబ్ద ప్రయోగా ద్ధర్మోపశబ్ద ప్రయోగాదధర్మ ఇతి తత్రైవతయోః ప్రయోగ నియమః తదతిరిక్తస్థలేతు సుశబ్దాపశబ్దయోః ప్రయోగే అనియమః"

ఇలా రాయడంచేత సుబ్బారావు పంతులుగారి రామాయణ మందు నాకు అనాదరణ కలదని భావించకండి. వీరి కవిత్వం సాఫైనది. వీరి దైవభక్తి అందరూ యెన్నతగియున్నది. తెనుగులో వీరిపాండిత్యము అసమానము, గాని తెనుగులు నేర్చి, వీరి ఆంధ్రీకరణమును చదువుట కన్న, సంస్కృతంలో మిడిమిడి జ్ఞానం సంపాదించుకొని వాల్మీకి రామాయణం చదువుకోవడమే శ్రేయమని నా అభిప్రాయము.

ఆంధ్రపత్రికలో "గ్రామ్యము నిరసించుచు" వీరు వ్రాసిన వ్యాసమును బ్ర.శ్రీ. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు పొగిడి, తమ పత్రికలో ప్రచురించిరి. బ్రహ్మయ్యశాస్త్రి గారు కూడా వ్యావహారిక భాష "అందరి నోటంబడి కులటవలే భ్రష్టత నందియుండును" అని వ్రాసిరి. బ్రహ్మయ్యశాస్త్రుల్లు గారి దర్శనము నేను చేసి వుండకపోయినా చాలా కాలమునుండి వారి నెరుగుదును. వారిభాష నిర్దుష్టము. విద్యయు, తత్వాన్వేషణమును వారికి వ్యసనములవుటచేత, మాలో అభిప్రాయ భేదములున్నా వారియెడల నాకు విశేష గౌరవము కలదు.

వాడుక భాషను గురించి నా అభిప్రాయములను ప్రమాణములతో విమర్శించినవారు వీరొక్కరే. సమాధానములు, మరివొకచోట చెప్పదలచితి గాని, వారు ఉదహరించిన యింగ్లీషు పుస్తకములు ప్రస్తుత వాదమునకు ప్రసక్తములు కావు. ఇక వారి వాదమునకు సంస్కృత వ్యాకరణము యెటుల సహకారియో తెలియవలసి వున్నది. కన్నడ గ్రాంథికభాష మారుచు వచ్చెను గదా? ఆ మారుదలకు ఆదేశపు శిష్టులు యెటుల వొప్పిరో? తెనుగు గ్రాంథికభాష మాత్రము మారలేదా?

ఈ మధ్య యిలస్ట్రేటెడ్ లండన్ న్యూస్ అను పత్రికలో చెస్టర్‌టన్ (Chesterton) అను బుద్ధిశాలి, వైరుధ్యం లేని విరోధమును గురించి చమత్కారంగా ముచ్చటించిరి. సీమలో (Unionist versus Freetrader) అనునది, అటువంటిదే. పాత గ్రాంథిక భాషను, సలక్షణముగా వ్రాయ వలసినదన్న శాస్త్రుల్లుగారి మతమునకున్నూ, శిష్టులు యీనాడు వాడుకుంటూ వున్న భాషలో నుంచి కొత్త గ్రాంథిక భాషొకటి కల్పించుకోవలసినదన్న నా మతమునకున్నూ, వైరుధ్యం యెక్కడ? మా జాగాలే వేరు.

పరిశీలించి చూడగా, శాస్త్రుల్లుగారికిని, నాకును అభిప్రాయభేదము చాలా తక్కువ. గ్రాంథికభాష వాడుక చేసేవారు, దాని నియమములను పూర్తిగా మన్నించవలసినదనే నా అభిప్రాయము. ఆ భాషను సాధించలేని వారు, అనగా, లోకానికల్లా బ్రహ్మయ్య శాస్త్రులుగారి వంటి పది మంది తప్ప కడమందరూ, వాడుకభాషలో నుంచి సులభ సాధ్యమైన వొక కొత్త గ్రాంథిక భాషను కల్పించుకుంటే, శాస్త్రులు గారికి యేమికొరత?

వాడుక భాషను కులట అని మర్యాద చేసే పండితులు, దానిని దూరముగా విసర్జించక యేల వాడుక చేతురో? వారు "యాంటీనాచ్" కారు గాబోలును.

ఇక కళింగ దేశ చరిత్ర మాట :– దానిని గురించి మా మిత్రులు నాతో ముచ్చటించినప్పుడు, వారు కోరకముందే వారి నిర్ణయములను యెరిగిన వాడ నౌటచేత, యిదివరకు నలుగురూ వ్రాస్తూ యున్న భాషనే వ్రాతునంటిని. అట్టి వొప్పుదలకు కారణము దేశమున చరిత్ర జ్ఞానము విరివికావలెనని మా మిత్రులు చేస్తూ వున్న మహోద్యమమునకు తోడ్పడను అభిలాషే. అంతేగాని యిప్పుడు గ్రంథకర్తలువ్రాస్తూ వున్న అత్యంత కృత్రిమ భాషకంటె, బ్రాహ్మణాదులు వాడుకొనే భాష మంచిదని తెలియకకాదు.

ఇప్పుడు లక్ష్మణరావు పంతులు గారు నాకు వొక చిక్కు తెచ్చిపెట్టినారు. వారు రాసిన లేఖలో లక్షణ ప్రయుక్తమనే మాటొకటి ప్రయోగించారు. ఈ లక్షణం స్వభావం యెట్టిదో వారు కొంచెము శ్రమచేసి పత్రికా ముఖంగా లోకానికి వ్యక్తీకరిస్తే ఉపయోగంగా ఉంటుంది.

వ్రాతను బట్టి పోల్చుకుందామని, విజ్ఞాన చంద్రికా గ్రంథమాలలో చటుక్కున చేతికి వచ్చిన ఆంధ్రుల చరిత్రను తీసి చూస్తిని. దానిలో భూమిక మా మిత్రులు రాసినదే. మొదటి వాక్యకదంబమును చదివి చూడగా, భాష, లక్షణానుసారంగా వున్నట్లు నాకు కానరాలేదు. "అనియమాద్గ్రామ్యం హియత్వపభ్రంశః" అనే లక్షణము ప్రమాణం అయిన యెడల, ఈ భాషకు గ్రామ్యత గట్టిగా పట్టి వున్నది. గ్రామ్యంలో దిగిన వెనుక ఆగడం యెక్కడో!

అది అటుండగా "గ్రామ్య శబ్దార్థం యేమిటి?, శతాంధాః కూపం ప్రవిశంతి" వొకడన్నాడని వొకడనడమేనా, తత్వ విచారం కద్దా? సంస్కృత భాషా కావ్య శాస్త్రములో మోటుమాటకూ, మోటు అర్థమునకూ, గ్రామ్యత అని పేరు పెట్టిరి. ఇది వొక కావ్య దోషము. అహోబల పండితులు దీనిని గురించి కొంత రాసినారు. (రాజా భుజంగరావుగారి పుస్తకములో 117 పేజీ చూడండి)

గ్రామ్య శబ్దానకు సాధారణమైన అర్థము మోటు. ఈ శబ్దమునకు విరోధి "నాగరము, నాగరికము, నాగరకము" ఇంగిలీషులో నాగరికము Polite, refined అందురు; గ్రామ్యము Low, vulgar అందురు.

"శబ్దేపి గ్రామ్యతాస్త్యేవ సా సభ్యేతరకీర్తనాత్" శిష్టులు రాత్రీ పగలు వాడుకచేసే భాషను గ్రామ్య మనడము, అనాలోచితమనుకుంటాను. అదే గ్రామ్యమౌట నిజమైతే, ఇప్పటి మన గ్రంథకర్తలంతా గ్రామ్య జనమే, ఒక్క మహా మహోపాధ్యాయులు తక్క! "పామరాదిప్రయుక్తంయత్త ద్గ్రామ్య మభిధీయతే."

గనుక యిటుపైని బ్రాహ్మణాదులు వాడుకొనే నాగరికమైన భాషను పండితులు గ్రామ్యమ నకపోవడము ఉచితమని భావిస్తాను. నాగరమని దానికి పేరు పెట్టి, గ్రామ్యమును వొక చీడీ దించితే, శబ్దౌచిత్యము సాధిత మవుతుంది.

"అనియమాద్గ్రామ్యం హి యత్వపభ్రంశః" అని కొందరనగలరు. ఆ మాటకు వస్తే, నియమం లేని భాషే వుండదు. ఒక వేళ వుండుననుకున్నా, గ్రామ్య భాషకు వొక నియమం చేసుకుంటే, గ్రామ్యత పోవలెను. ఈ కారికరాసిన వైయ్యాకరణుడు అయితేనేమి, అహోబల పండితుడైతేనేమి, సంస్కృత లక్షణానుసారంగా, తెనుగుకు లక్షణం కల్పించకోరి, అసందర్భములు కల్పించుకున్నారు.

కాదంటిరా, నియమమంటే యేమిటో, సంస్కారం అంటే యేమిటో, వాటి స్వభావమెట్టిదో వాటి చరిత్ర మెట్టిదో స్పష్టముగానూ, విపులముగానూ యెవ్వరేని ఉపన్యసించి మమ్ముల తరింపజేతురు గాక. సాంకేతిక సుప్రసిద్ధ పదములు కూడా యెట్టివో తెలియగోరితిని.

గ్రామ్య, మ్లేచ్ఛిత, అపభ్రంశ శబ్దములను గురించి ముందు వ్రాసెదను. గ్రామ్యమును గురించి మా మిత్రులు బ్రహ్మశ్రీ వేదం వేంకటరాయ శాస్త్రులువారు చాటలు చెరిగి చర్చించినారు. వారు గ్రామ్యభాషను రాసిన కొన్ని పాటలు బర్న్స్ అను మహాకవి పాటలను పోలి యున్నవి.

గ్రామ్య భాషను గురించి యెవరేమి ప్రచురించినను, దయచేసి ఆ పత్రికల నాకు అంప వేడెదను. గ్రామ్య భాషా చర్చ గోరిన పత్రికా సంపాదకులు గ్రామ్యమును గురించిన నా వ్యాస ములు వారి పత్రికలలో యెత్తి ప్రచురింతురు గాక.

ఇంతవరకు వ్రాసిన పిదప మా మిత్రులొకరు శ్రీ బాలకవి గారి విమలా దేవి అను నవలను నాకిచ్చిరి. స్థాలీపులాకన్యాయముగా పరిశీలించ ఈ ప్రయోగములు కానవచ్చినవి. (అ) అనవసరమైన చోట్లను అనగా అనుకరణము లేని చోట్ల అన్య దేశములు.

సూచీ పత్రములో ఔరంగజేబు ఖాయిలా, యాఖుదా యా అల్లా, హుషారీ, ఖత్తల్ – ఇట్టివి చాలా కలవు (ఆ) సంధి విసంధుల తోవలు కానరావు; వఱకు ఆంధ్రోపాధ్యాయ పదవి; గ్రంథకర్తను అగు; సమగ్ర సృష్టియనియు, ఇందు; అప్పుడు; ఇందిర; ఇట్లు – ఉదయమున॥ గార్లు – ఆశ్చర్యాతి రేకము చేత॥ రాజసింహుడు– అతని ఏమి యీ యన్యాయము ॥ ఇంతలో నా రాజభటులు ఆ పురుషుని ఈడ్చుకొని బాటసారిని సమీపించిరి.

(ఇ) తనకు గల - నుత్సాహము ॥ విరిచి - గట్టినాకిది యే ప్రథమ ప్రయత్నమని - దెలుపుచుండ; రాజ్యము నకు వారసననియు (వారిన్ లేక వారిస) చంద్రావతి మహారాణిని బట్టి తెచ్చిన యాతడు సంతోషాతిశయమున ॥

ఈ) న్యాయమైన ఆడుది ॥ సాటివంశజుడే ॥ అన్యధా తలంచి ॥ సంరక్షణ ॥ స్మరణ ॥ ఈ ప్రయాస కూడ ॥ కుంభ కర్ణుని పాత్ర ॥ నిర్ఘాతపడి ॥ అర్ధపూర్ణ దృష్టి ॥ సృష్టింపబడె ॥ అంతా రామమయం (మిగిలినపాట సంస్కరించబడినది) నీవు చింతాక్రాంతయై ॥ దండన ॥ ఘటనము। సాహాయము ॥ జాగ్రత్తగా ॥ అసహ్యాపరుడు (అసహ్యా పాత్రుడనుటకు॥) ఇతరత్ర ॥ తన తదంతరము॥ కుమారిత ॥ భగవాన్ వశిష్ఠుల వారు ॥ ఆపద నివారణోపాయము ॥ ఆడుబడుచు॥

ఇవన్నీ తప్పులని నా అభిప్రాయమని కాదు "అపశబ్ద భయం నాస్తి అప్పలాచార్య సన్నిధౌ" అని చెప్పే వుంచాడు ॥ బాల కవుల ప్రయోగ సరణి కవిత్రయము వారి సరణికి చాలా దూరమనుకుంటాను. (తే.24.11.1910)

# మాట - మంతి - 2
# ఆకాశరామన్న ఉత్తరాలు

O, would some power the giftie gie us

To see ourselves as others see us - Burns

ఆకాశరామన్న బహు దొడ్డ మనిషి. బహు ప్రాచీనుడు, గాని రాతలు లేని అదృష్టపు కాలములో, ఆయన ఆఫీసు అమలు యెలా జరిగెనో నిశ్చయించలేము. చెట్టు చాటు నుంచీ, పుట్ట చాటునుంచీ ముఖం పెట్టి యెదట చెప్పరాని వార్త కేకవేసి వెళ్ళేవారు కాబోలు. ఇప్పుడు ఇంగ్లీషు వారు, పోస్టు, టెలిగ్రాఫు, ఖణాయించి, వార్తా పత్రికలు ప్రబలిన తరువాత అన్ని ఆఫీసుల వలెనే, స్కై ఆఫీసు పని కూడా హెచ్చినది. డబ్బున్నర ఖర్చుతో మనసులో బిరడా వేసి బిగించుకున్న దుఃఖమును వెలిబుచ్చవచ్చును.

వెనకటి కొక బుద్ధిమంతుడు, తాను చచ్చిపోయినట్లు తనవారికి తంతివార్త పంపెను. టెలిగ్రాఫు యొక్క ఉపయోగమును పూర్తిగా గుర్తెరిగిన వాడితడొక్కడే. డొంకచాటు నుంచి బాణం విసరవలె నంటే, వార్తా పత్రిక చాలా సుళువు. కొంతమంది సైంధవుణ్ణొకణ్ణి ముందు వుంచుకుని యుద్ధము చేస్తారు. యెగిరిపోతే, వాడి బుర్ర యెగిరిపోతుంది. గెలిస్తే యెవడి దెబ్బో అవతలాడు గుర్తెరిగే వుంటాడు. అభిమానం లావుగా వున్న చోట మాత్రం ఆకాశరామన్న గారు ఆటోగ్రాఫ్ లెటరే, అంపిస్తారు. Autograph letter అనగా స్వహస్తలిఖిత లేఖ.

ఈ మధ్య నన్ను కూడా ఆకాశరామన్న గారు అనుగ్రహించారు. అంతవరకూ, వారు ఖాతరీ చెయ్యవలసిన పాటి అధికుడను కానని అనుకుంటూ వుంటిని. యిప్పుడా కొరత తీరినది.

"నేను మిమ్ములనెరుగుదును. మీరు నన్నెరుగుదురో లేదో? అను ప్రశ్నతో శ్రీముఖమును ఆరంభించిరి. తమరి నెరుగనివారెవర"ని ఆ యుత్తరము. కవరు పెద్దాపురము పోస్టున వెడలినది. తమరు ఆ ప్రాంతమున వెలసియుందురు.

కాని, నేను మిత్రుడననియే మిమ్ముల భావించుచుండ బట్టి మిమ్ములను మిత్రమా! యని పిలుచుచున్న లోపమునకు మన్నించండి" ఇది యొక లోపముగా నేను తలంచలేదు.

శ్లో॥ అయం బంధుః పరోవేతిగణనా లఘుచేతసాం ।
పుంసా ముదారచిత్తానాం వసుధైవ కుటుంబకమ్ ॥

ఇదియను గాక దేశమాత పుత్రులమగు మన మందరము సోదర సమానులముగాన మిత్రులనుచున్నాను. ఇది పై శ్లోకార్థ దృష్ట్యా అల్ప దృష్టేమో? మనము జగన్మాత పుత్రులము.

దేశమాత అంటే, వొక చిక్కు కూడా వున్నది. యే దేశం? తెలుగులకు అరవలకు వుండే భ్రాతృభావం చాలా కనిపెట్టేను. బంగాళీలకు హిందూస్థానీలకూ గల ఐకమత్యము కూడా కొంత వరకు చూశాను. మన తెనుగులలోనైనా, దేశ మాతృ పుత్రత్వాద్భ్రాతృత్వం, లెక్చర్లలోనూ, వ్రాతలలోనే కాని, చర్యలలోనూ, ఆలోచనలోనూ, సిగపట్ల గోత్రత్వమూ, స్వప్రయోజకపరత్వమే మెండేమో? మాలవాడు కనపడగానే భ్రాతృత్వం చాలాదూరం పలాయనం చేస్తుంది. మాలవాణ్ణి చూడగానే అమాంతంగా కాగలించుకొని వాడికి దేశమాత పేరు యెత్తడముకు అర్హత లేదని నా గట్టి నమ్మకం. దేశమాత కథ అలా వుణ్ణియ్యండి. ఉగ్గుపాలతో మనము నేర్చిన తల్లిభాష యగు వాడుక తెనుగు భాషకే కొందరు తాళంబట్టుచున్నారు. మిద్దెలు మింగే బావగారికి తలుపులప్పడాలా!

"సంబంధ మాభాషణపూర్వమాహుః" అన్నాడు మహాకవి. పోస్టుద్వారా మాట్లాడుకొన్న మనకు, మిత్రత్వం సిద్ధంకానే ఐంది. దానికి యింత డొంక తిరుగుడేలా! ఆకాశరామన్నను యింగ్లీషు వారు కొంచెము దర్జా తక్కువగా చూస్తారు గాని, స్నేహాలకు దర్జా అంత అడ్డురానేరదని, నా మతం గనుక ఆకాశరామన్న గారితో నేస్తము నాకు యిష్టాపత్తే.

ఇష్టాపత్తే, అంటినా? బ్రహ్మానంద మనవలసినది, యేలనంటిరా, నావలెనే ఆకాశరామన్న గారు కూడా గ్రామ్య భాషాభిమానులు. రత్నములూ, ముత్యములూ కలిపిగుచ్చినట్లు వారు గ్రామ్యగ్రాంథిక పదములతో సొంపైన వాక్యములు రచించిరి.

ఇకవారిలేఖతరువాయి వినుడు : "మహారాజశ్రీ శ్రీవావిలకొలను సుబ్బారావు పంతులు గారు చేసిన రామాయణమును గురించి తాము వ్రాసిన మాటలేమి, శ్రీ విజ్ఞాన చంద్రికా గ్రంథమాల సంపాదకులును, సంస్కృతాంధ్ర మహారాష్ట్ర హూణ, హిందీత్యాది భాషా కోవిదులును నగు శ్రీ లక్ష్మణరావు పంతులు గారిని గురించి తాము వెలిబుచ్చిన యుద్దేశ మేమి? శ్రీ బాల కవి భోగరాజు నారాయణమూర్తిగారు మున్నగు వారిని గురించి తాము ప్రసంగించిన సంగతు లేమి మాకు చాలా హాశ్చర్యము కలుగజేయుచున్నవి. పులిని చూచి నక్క వాత పెట్టుకున్న దని నటుల మీ చర్య తోచుచున్నది. బహుశహ ఈ పై ముక్కలు అచ్చు వెయ్యడముకు వీలు వుండదు. అవి కాన్ఫిడెన్షల్ confidential not meant for publication మరియు "మీరు విద్యాధికులయ్యును, ప్రస్తుతము దేశము శాంతి కొరకు పాటు పడుచున్నదని తరుచు పత్రికలను చదువుచున్న తమకు తెలిసియున్నను, మీ వ్యాసము ఆ కల్లు త్రాగెడు వారి వ్యాసము వలె

తోచుచున్నది. "నిజముగా ఆలోచించి చూడగా మీకు అనుభవమే యెక్కువగాని విద్యా నైపుణ్యత తక్కువ. గుట్టు మట్టు నాకు తెలుసును. సంగతులన్నియు పత్రికా ముఖమున ప్రచురపరచమనిన ప్రచురపరచుతాను. గాని తమ యిట్టి గొప్ప కీర్తి ఆంధ్ర మహాజనులకు తెలియచేయ నా కిష్టము లేదు. అయినా మీ శలవేమిటి? పంతులు గారూ... దిక్కుమాలిన హాస్యోక్తులతో ఎదటి వారి మనస్సు నొప్పి కలుగచేయకండి. ఏమంటారు? నామాట నమ్ముతారా నమ్మరా? ప్రస్తుతము ఇంతటితో చాలించినాను, మీకు నా యుత్తరము వల్ల బుద్ధివచ్చినటుల పత్రికా ముఖమున ప్రచురించండి. నేనెవరినో మీ రెరుగుదురా? కొద్ది రోజులలో మిమ్ములను కల్సుకొని అప్పుడు చెపుతాను"

లేఖారంభమందు ఆ ప్రశ్న చూడగానే, మీరెవరో యెరుగుదుననుకున్నాను గాని, లేఖాంతమందు ఆ ప్రశ్న తిరిగి పఠించడము వల్ల సందేహమునకు కారణమైనది. "పంతులు గారూ" అని నన్ను నొక్కి పిలవటం చూడగా, ఆకాశరామన్న గారు పంతులుగారు కారని అనుకుంటాను, 'మాకు' అని బహువచనం ప్రయోగించటం చేత–యేమనుకోవడమునకూ పాలు పోకుండా వున్నది. మీరేమనుకుంటారు? సహస్రపాదాక్షి కాబోలు.

ఆకాశ ఆస్థానము నుండి నాకు ఈ ఫర్మానా జారీ కావడమునకు కారణము తప్పకుండా నాకు బుద్ధి రావలెననే. బుద్ధి వచ్చిదనదన్నమాట తాము నిరఖుగా తెలిసికొనగోరియే పత్రికా ముఖమున ప్రచురించమని వ్రాసిరి గాని నేను యెట్లు ప్రచురించగలుగుదును? చిన్ననాటి బెత్తపుదెబ్బల వల్ల బుద్ధి రాలేదు. పెద్దల మాట వినక దాట్లు వేసినపుడు కాలు విరిగినా బుద్ధి రాలేదు. నాటికి, నేటికి యెప్పటికప్పుడు బుద్ధిని యెంత ఆసక్తితో బతిమాలి పిలిచినా రాలేదు. అరవై యేళ్ళకి అగ్గిగండం అన్నట్లు, యిప్పుడు మామిత్రులు నొక్కి నొక్కి వ్రాసినారని బుద్ధిని విరిచికట్టి తెచ్చి పెట్టుకున్నా భరించడం కష్టం. ఆ శ్రమ నేను పూనుకోజాలను. మిగిలివున్న నాలుగు రోజులూ కొంచెం స్వేచ్ఛగా బతకవలెనని వున్నది. యెవరి కుండదు? అంతేగాక, నావంటి వాళ్ళకు కూడా బుద్ధి కలిగితే బుద్ధి చవకైపోతుంది. కనుక ఆ బుద్ధన్నదేదో ఆకాశరామన్న గారు భద్రంగానూ, రహస్యముగానూ దాచుకుంటేనే విలువ.

ఆకాశరామన్న గారి మాటయందు నాకు గట్టి నమ్మకమే గాని బుద్ధిరావడమన్న మాట మట్టుకు అబద్ధం. బైబిలులో "ది పేరబిల్ ఆఫ్ టెన్ టాలెంట్సు" అని నీతిబోధకమైన కథ వొకటి వున్నది. (The Parable of ten talents) భగవంతుడు ప్రతి మనిషికీ లావో, కొంచమో ప్రతిభను యిస్తాడు. యెక్కువ యివ్వలేదని తక్కువ ఉన్నవాడు సోమరియై వుండకూడదు. తన స్వల్ప ప్రతిభను పూర్తిగా వినియోగపరచ వలసి వుంటుంది. గాన నాకు చేతనైన రీతిని యిటుపైని కూడా రాయడమునకే తలచియున్నాను. గాని ఆగతలుచుకోలేదు. దేశము శాంతి కొరకు

పాటుపడుచున్న రోజులలో నా రాతల వల్ల పితూరీలు కలుగునని ఆకాశరామన్న గారు భయపడు చున్నట్టు కానవచ్చినది. ఏల నీ భయము? మేమంతా తిట్లాటలకు వీరులము గాని, తుపాకి పేల్చడం నేర్చి వుండలేదు. నేర్చిన వారివైనా తుపాకులు తుప్పట్టివున్నవనుకుంటాను.

ఏతావతా నేను హాస్యోక్తులు రాయడము మానకుంటే ఆకాశరామన్న గారు నా గుట్టు మట్టు ప్రచురించి నా గొప్ప కీర్తి ఆంధ్ర మహాజనులకు వెల్లడి చేస్తారట. ఇంతకన్న లోకోప కారమూ, నాకు ఉపకారమూ కద్దా? కోహం? అనే ప్రశ్నతో ఆరంభమైంది వేదాంత చర్చ అంతాను. నా గుట్టుమట్లేవో నాకే తెలియవు గదా, వారు శ్రమచేసి కనిపెట్టి చెప్పడం కన్న మిత్రత్వం వుండునా? లేక యే కారణము చేతనయినా వారికి నా యెడల ఆగ్రహము పొడమి, పత్రికా ముఖమున నాలుగు రానిత్తుమని బెదరించ తలచియుందురా? వృధా శ్రమ. ఒక రాతి స్థంభమును భూషిస్తే యెంత చరితార్థమో నన్ను మన్నించినా అంతే. ఆనందమహారాజును యెరిగిన నరుడికి ఆగ్రహం ఉండబోదు.

అయినా నేను ఆకాశరామన్న గారికి యే విధమైన అపరాధమైనా చేసివుందునా అని తలపోసి చూస్తిని. కాన రాలేదు. శ్రీ సుబ్బారావు పంతులుగారూ, లక్ష్మణరావు పంతులు గారూ, బాలకవి గారూ నా మాటలను అపరాధముగా తలచవలసిన వారు కారు. వారు ఆరి తేరిన గ్రంథకర్తలు. అయితే వారికి లేని ఆగ్రహము ఆకాశరామన్న గారికి కలుగునా? ఒక కథ వుంది.

వెనుకటి కొక గొప్ప ప్రభువు ఒక మహా పండితుణ్ణి అడిగెనట. యేమండీ మీరు భంగు పుచ్చుకుంటారట; నిజమేనా? అని. అప్పుడు ఆ వార్త విన్నవించియున్న మహానుభావుడు యెదటనే వుండెనట. అందుకా పండితుడనెను, "మహారాజా! నేను భంగు సేవిస్తానన్న మాట సత్యమే గాని, మత్తు మట్టుకు యీయనకు కలుగుతుంది".

లోకంలో యిట్టి వింతలువున్నా, ఆకాశరామన్న గారికి మట్టుకు నిజంగా నాపైని కోపం లేదు. ఈ మధ్య ఒక కవి సరికొత్త వృత్తమున నా రూప రేఖా విలాసములను వర్ణించిరి, యీ లేఖలో ఆకాశరామన్న గారు నా గుణసంపత్తి వర్ణించిరి. మొత్తము మీద తమ హస్తము హాస్యరసము వ్రాయుటలో నిరర్గళమయినదిగా తోచుచున్నది అని వ్రాసి, మీరు విద్యాధికు లయ్యును అని వ్రాసి, తిరిగీ నిజముగా ఆలోచించి చూడగా 'మీకు అనుభవమే యెక్కువ గాని విద్యా నైపుణ్యత తక్కువ' అని వ్రాసిరే అని శంకించగలరు. వారు శలవిచ్చిన రెండు మాటలూ యథా ర్థమే. శిష్టా నవగతములైనట్టిన్నీ, మ్లేచ్ఛ ప్రయుక్తములైనట్టిన్నీ "పిక, నేమ" ఇత్యాది వైదిక శబ్ద ముల అర్థము శాస్త్రము వల్ల కల్పించుకోవలసినదా లేక, మ్లేచ్ఛ ప్రయోగమును

అంగీకరించ వలసినదా అని ప్రశ్న వేసుకుని శరభస్వామి పలికెను. "యత్తు అభిముక్తాః శబ్దార్థేషు శిష్టాః ఇతి, తత్రోచ్యతే అభియుక్తతరాః పక్షిణాం పోషణే బంధనేచమ్లేచ్ఛాః" అని నాకు శాస్త్రములు రావు గాని చిన్ననాడు బొమ్మలాట నేర్చుకున్నాను.

ఆకాశరామన్న గారి మాటలకు గూఢార్థం కూడా వొకటి వున్నది. స్టెడ్ (Stead) అను మహా ప్రాజ్ఞుడు ఈ నెల రివ్యూ ఆఫ్ రివ్యూజ్ (Review of Reviews) అను పత్రికారత్నములో యిప్పటి పార్లమెంటు యెలెక్షనుల (Elections) ను గురించి ప్రజల తరపున వ్రాస్తూ హ్విట్టియరు (Whittier) అను కవి రాసిన రెండు చరణములు ఉదహరించిరి :

> I set the plain man's common sense
> against the Pedant's pride.

విద్యల విషయమై ఆకాశరామన్న గారి అభిప్రాయములను ముందు విపులముగా వ్యాఖ్యానము చేసి చెప్పుదును. రాస్తే వారే రాయాలి. వ్యాఖ్యానం చేస్తే నేనే చేయాలి.

మనుష్యుల విద్యలను పోల్చడమే కాకుండా, ఆకాశరామన్న గారు వైద్య శాస్త్రంలో కూడా ఉద్దండులు. చేవ్రాలు చూసేటప్పటికి యీ మనిషికి బహుమూత్ర రుగ్మత వుందని పోల్చుకుంటారు. డాక్టర్లుపోల్చుకోలేకపోతే లేక పోదురు. అది వాళ్లలోపం.

నా అదృష్టం యెట్టిదో గాని నాకు పరిచయం కలిగే మనిషల్లా వేలలో యెన్న తగినవాడై వుంటాడు. కోట్లలో యెన్నతగినవాడై వుంటాడు. నాటికి నేటికి ఆనందమహారాజు వలె లోకానికల్లా యెన్నతగినవాడై వుంటాడు. ఆకాశరామన్న గారు కూడా యెక్కడో వొకచోట ఆ గణనలో రావలసినవారే. పరుల గుణములు కనిపెట్టుటలో నేనే ప్రవీణుడనని నా గర్వం.

చిన్నతనంలో బొమ్మలాట నేర్చి వుండుట చేత లోకమనే రంగంలో చిత్రకోటి రీతులను ఆటాడే మనుష్యులనే పాత్రముల సొగసు నేకనిపెట్టడము నాకు అలవాటైనది. సొగసులేని మనిషే వుండడు. స్నేహమూ –ప్రేమా–అనేవి అనాది అయిన్నీ, యెప్పటికీ సరిక్రొత్తగా వుండే రెండు వెలుగులను నరుని మీద తిప్పి కాంచితే వింత వింత సొగసులు బయలు దేరుతవి. అసూయ అనే అంధకారంలో అంతా ఏక నలుపే!

అందులో జ్ఞాపకము వుంచుకోతగిన మాట పలికిన వాడల్లా యెన్నికైన మనిషే అని నా అభిప్రాయము. అట్టిమాట బ్రతుకు తెరవును దేనినైనా చూపేమాటైతే అది పలికినవాడు మహానుభావుడు కాడా? ఆకాశరామన్న గారు అట్టివారే. వారి మాటలు వినండి.

నిజముగా మీరు వ్రాసిన వారి యందు తప్పులేయున్నవనుకుందాము. అట్టి తప్పులను పత్రికా ముఖమున ఆంధ్ర మహాజనుల యెదుట రసవంతముగా చెప్పవలెను గాని దిక్కుమాలిన హాస్యోక్తులతో ఎదటివారి మనసు నొప్పి కలుగచేయకండి.

ఇప్పటి దేవాసుర యుద్ధ కాలంలో ఈ అమృతమయమైన వాక్కులు సాక్షాత్తూ ఆకాశవాణీ వాక్కులు కావా? విని మనమందరమూ బుద్ధి తెచ్చు కోవద్దా? ఆ రసవంతముగా తప్పులు చెప్పుట ఆకాశరామన్న గారి యొద్ద నేర్చికొనవద్దా? మనమంతా అనగా మీరంతా అని అర్థము.

దేవాసుర యుద్ధమని యేల నంటినా! భారత యుద్ధము పద్దెనిమిది రోజులతోనూ, రామరావణాయుద్ధము ఇరవై యేడు రోజులతోనూ చల్లారెనట. నన్నయ్యను గురించిన యుద్ధమూ, కవుల యుద్ధమూ, యింతటంతట చల్లారేటట్టు కానరాలేదు. ఈ దెబ్బలాడే వారంతా బుద్ధి మంతులూ, ప్రజ్ఞావంతులూ, విద్వాంసులూ అన్నందుకు సందేహము కద్దా! వీరిలో ప్రసిద్ధి లేని వారెవరు? మనసు రంజించునట్లు రాయనేరని వారెవరు? విద్యాబలంలోనూ, బుద్ధి బలంలోనూ ఈషత్తారతమ్యము ఉండుగాక! అది యెవడు తూచగలడు. ఒకరికొక విషయము యెక్కువ తెలిసియుండవచ్చును. మరొకరికి మరొక విషయము యెక్కువ తెలిసియుండవచ్చును. విద్య వొకరి సొమ్ము కాదు. అడుగు పెట్టిన చోటల్లా జ్ఞానపు గనులున్నవి. కన్ను తెరిచి చూసే సరికి గనులలో లక్ష్మి పెట్లో వచ్చి నిలుస్తుంది. యిక కవితా శక్తి మాట. మన దిక్కుమాలిన గ్రాంథిక భాషలో పద్యాలల్లడానికి కొండను త్రవ్వి ఆంధ్రగీర్వాణములు అభ్యసించవలెను గాని యింగ్లీషు, యింకా మరికొన్ని భాషలలో యీనట్టు లేదే! చచ్చిచెడి ఆంధ్ర గీర్వాణములు నేర్చిన, నాలుగడుగులకొకమాటు కాలు మెల్తపడుతూ వుంటుంది. మరిన్ని యెవడు వ్రాసిన పద్యాలు వాడికే అర్థం కావాలి. కావ్యాలు రాసినవారు పుస్తకములు అచ్చువేసి కట్టలు కట్టి అటక మీద భద్రము చేసి యెలకల పాలు చెయ్యవలె. యూనివర్శిటీ పద్ధతులు మార్పుగుటవల్లకావ్యములు టెక్సుబుక్కులై (Text book) బాలుర ప్రాణముమీదికి రాకుండా భగవంతుడు కాపాడినాడు. ఇది అప్రస్తుత ప్రశంస, వుండబట్టక యాకరువేశాను. బంగాళీలను చూసి మనము నేర్చుకోరాదా!

విద్యా వివాదాలలో పెద్దల యెడల కనపరచవలసిన విలువలు, వినయాది గుణములు పిన్నలు మరువరాదు. పెద్దలు పిన్నల యెడల వాత్సల్యత మరవరాదు. ఒకొ నొకప్పుడు కొంచెం రహస్యంగా పెద్దలను గూర్చి పిన్నలూ, పిన్నలను గూర్చి పెద్దలూ నిరసనగా మాట్లాడటం మనుష్య స్వభావం. అందుకు తేట తెల్లమైన కారణము భగవంతుడు పెద్దలనూ, పిన్నలనూ గూడా లోప ములు లేకుండా సృజింపకపోవడమే. అందుకు తోడు భగవంతుడు మంచి చెడ్డలను యెన్నే పనికిమాలిన శక్తి, ఆసక్తి ఒకటి పెద్దకీ పిన్నకీ కూడా కల్పించాడు. పెద్దలు ధోకాలు తిని వుండుటను కొంచం సహనమును నేర్చియుంటారు. పిన్నలకు ఆ సహనం వుండదు.

కనుక రహస్యముగా ఆ తప్పులు పలికిన నిరసన వాక్కులు ఒకప్పుడు చెవి సోకెనేని మనసున పెట్టకపోవడము న్యాయము కాదా? తండ్రి కొడుకును అంటాడు. కొడుకు తండ్రిని

అంటాడు. ప్రభువు భృత్యుణ్ణీ అంటాడు, భృత్యుడు ప్రభువును అంటాడు. అన్న మంచి మాటలను జ్ఞాపకం వుంచుకొని, నిందలు మరచిపోవలెను. లేకున్న మనిషికి సుఖమేదీ?

యిన్ని శ్రీరంగనీతులు పలుకుతున్నారు గదా. మీ "మాటా మంతీ" మాటేమని అడగగలరు. నా అంత మృదువుగా తప్పులు విజ్ఞాపన చేసేవాడు లేడని నా అభిప్రాయము. కోరివెళ్ళి నేను తప్పులు పట్టలేదు. గ్రామ్య భాష దిక్కుమాలిన స్త్రీ. ఆమెను పండితులు నిష్కారణముగా దూషించి అవమానించగా కనికరించి ఫీజు లేకుండా ఆమె తరఫున వకాల్తీ పట్టితిని. సమయా సమయము లలో ఆమెను అవలంబించిన వారే తిట్టడము భావ్యము కాదంటిని. వకీలుకు యేమన్నా చెల్లుతుంది గాని, అంత అధికారముండే నేనేమంటిని. ఒక్క దూషణ వాక్కు పలకలేదే! నన్ను, మృదువు తప్పితినని నిందించుట మొగనికొట్టి మొగసా లెక్కినరీతి నున్నది. ఆకాశరామన్న గారు పేర్కొనిన వారలలో శ్రీ బ్రహ్మయ్య, సుబ్బారావు పంతులు గారి యెడల నాకు భక్తి కలదు. శ్రీ లక్ష్మణరావు గారు నాకు ముఖ్య మిత్రులు. వారి విద్యను, దేశాభిమానమును నే నెరిగి వున్నట్టు ఆకాశరాములు యెరగరేమో! శ్రీ బాలకవి గారు యింకా ముందుకు రావలెనని నిర్వ్యాజమైన ఆసక్తి నాకు కలదు గాని, గ్రంథకర్తలు విమర్శనమునకు వెరచితే, భాష అభివృద్ధి అగుటయెట్లు? నవ్వుల వల్ల విమర్శనము యొక్క వాడి మొరపోవునని ఇంగ్లీషువారి సిద్ధాంతము. తలవరి వలె ముఖము మాడ్చుకొని పీక ఉత్తరించడము నాకు చేత కాదు. విమర్శనా పద్ధతులను గూర్చి యింకొకమాటు చర్చించెద.

29-12-2010.

# ఆంధ్ర కవితాపిత - 1

"ధరణి వడంకె, ధూళిదివిదన్నిన భానుని గానరాదు."

'కాటమరాజుకు కర్ణుడోడె'

"నన్నయభట్టు ప్రథమాంధ్రకవియేనా?" అని ప్రశ్న వేసుకొని, మా మిత్రులు శ్రీ లక్ష్మణరావు గారు రెండు వ్యాసములు వ్రాసిరి. చదివి సంతోషించినాను. వొకప్పుడు నేను కూడా నన్నయను గురించి విపులముగా రాయదలచి యుంటిని. మా మిత్రులు శ్రీ జయంతి రామయ్య పంతులు గారు కూడా రాయదలచిరని విని, ఆగితిని. వారే రాసినచో, యితరులకు వ్రాయవలసినది అట్టే మిగిలియుండదని నా నమ్మకము.

కాని, ఢంకా దెబ్బ విన్న తరువాత యుద్ధంలో జొరకనిల్వడం కష్టం! ఫలితము రెండు తెగల వారివల్లనూ దెబ్బలు తినడమె కావచ్చును. అదీ ఒక ముచ్చటే!

లోకం పుట్టిన దగ్గరనుంచీ, లోకులు ప్రాణం పెట్టి దెబ్బలాడే అన్ని వివాదాంశములూ, కొంచెం నిదానించి చూస్తే, 'అవునూ- కాదూ', కూడా అని తేలుతవి. ఈ రహస్యమును మా మిత్రులు లక్ష్మణరావు గారు గ్రహించి నన్నయ వాదానికి తగిలించినారు. యిట్టి తీర్పులలో తేటతెల్లమైన మెరుగొకటి కలదు. నిజం యెటు ప్రక్కను వున్నా, మన ప్రక్కన కూడా వుండక తీరదు. మా మిత్రుల అభిప్రాయముతో నేను పూర్ణముగా యేకీభవింతును. గాని వొకరు అన్నమాటే మనం కూడా అనడం సొగసుకాదని తోచి, కొత్తమాట యేమైనా అందామని విశ్వప్రయత్నం చెయ్యగా, ఒకటి దైవవశాత్తు స్ఫురించినది.

అది యేమనగా, "నన్నయ ప్రథమాంధ్రకవి అవునన్న మాటా, కాదు. వాడన్నమాటా, కాదు. యిదీకాక అదీ కాకపోతే, అయినమాటేది? యేదా? చెవిఒగ్గి వినండి. "మనకు తెలియదన్నమాట!" దేనికైనా సందేహం వుండవచ్చును గాని, దీనికి సందేహం వుండబోదు. యీ మట్టుకైనా తెలియడమన్నది సామాన్యమైన మాటకాదు. వెనుకటికి, గ్రీకులలో సొక్రటీసనే పండితాగ్రేసరుడు వుండే వాడు. అతనికడకు పోయిమనబోట్లడిగిరట : "యేమయ్యా! లోకానికల్లా నీవే మహా జ్ఞానివని ఒక దేవత చెప్పినది. మాకన్న నీకు తెలిసిన దేమిటి? సొక్రటీసనెనట : "నాకు యేమీ తెలియదు. ఆ సంగతి మట్టుకు నాకు తెలుసును. మీకైతేనో, ఆ తెలియదన్న మాటా తెలియదు. అదె, నా ఆధిక్యత కావచ్చును." ప్రథమంలో తీర్పు చెప్పి వేశాం గనుక, యిక ఆ తీర్పు నిలబెట్టుకోవడమునకు తగిన యుక్తులు కల్పించుకుందాము.

ప్రపంచము యే రీతిని వున్నా ఆ రీతినే అది వుండడమునకు మనము ఒడబడ వలసి వచ్చిందిగదా అని లోకంలో పుట్టిన పండిత పామరులు ప్రతి వారికీ, ఒకప్పుడైనా విచారం పొడమక మానదు, "యిది యిలా వుంటే బాగుండును" అని మనకు తోచినపుడల్లా, లోకం యొక్క స్థితిలో సంతుష్టి లేక దానిని మరమ్మతు చేయడపు వూహ మనకు కలిగినదనే అర్థము. మాట లన్నవి ప్రపంచములోనివేగనుక, సృష్టి యావత్తూవలెనే అవి కూడా లోపములతో కూడియుంటవి.

**ప్రాయేణ సామ్యగ్ర్య విధౌగుణానాం**
**పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః॥**

విద్వాంసుల జుత్తులు తెగిపోవడము, యీ శబ్దముల వల్లనే, రామన్న గారు ఒక మాటకు, ఒక అర్థం చేసి, ఉపన్యాసం ఆరంభిస్తారు. ఆ అర్థంతో నాలుగు వాక్యాలు నడచిన తరువాత, అయిదో వాక్యంలో మరో అర్థం అందుకుంటారు. మరి పది పంక్తులైన వెనుక మరియొక అర్థాన్ని దాటుతారు. అలా కోతి, చెట్టు మీద నుంచి చెట్టుమీదికి దాటునట్టు, అర్థం మీద నుంచి అర్థం మీదికి దాటి, తుదకు సిద్ధాంతం చేసే వేళకు "మొదటి నుంచీ, ఈ చెట్టు మీదే ఉన్నామయా" అంటారు కృష్ణయ్య గారు; ఆ అర్థాలలో వొక అర్థం తీసుకొని పచ్చడి చేసి విడచి పెడతారు. తరువాత, ఆ వాదములో జొరబడే పెద్ద, పిన్నలు తలొక అర్థం లాగుతారు. తుదకు అర్థం అనర్థ మవుతుంది. యిది లోకపాటి.

నేను లోకంలో వాడనే అవుటను దాట్లు వెయ్యడంలో ప్రవీణుడనే. మీరంతా వున్నారు కనుక, అట్లా దాట్లు వేసేటప్పుడల్లా హుంకారం చెయ్యండి. ఈ కట్టుదిట్టంతో చర్చ వుపక్రమిత్తాం.

కవి అనగా యెవరు? ఒక అర్థము ఒట్టో, గట్టో నాలుగు పదాలు అల్లినవాడల్లా కవియే అని. ఈ అర్థమున నన్నయ్య ప్రథమాంధ్రకవి కాడనుకుంటాను. కిందటి సంవత్సరము మా మిత్రులు కృష్ణశాస్త్రిగారు వ్రాసిన శాసన పరిశోధన రిపోర్టులో 3, 81, 82వ పేజీలలో వుదహ రించబడిన యుద్ధమల్లుని శాసనము, మా మిత్రులు వ్రాసియున్నట్టు ఛందోబద్ధముగానే వున్నది.

**స్వస్తినృపాంకుసాత్యన్తవల్లల నత్యత్రిణేత్ర**
**విస్తర శ్రీ యుద్ధమల్లుణ్డ నవద్య విఖ్యాతకీర్తి**
**ప్రస్తుత రాజాశ్రయుణ్డు త్రిభువనాభరణుణ్డు సకల**
**వస్తుసమేతుణ్డు రాజసర్కి భూవల్లభుణ్డర్థిన్॥**

ఇది మొదటి పద్యము మధ్యాక్కర. నన్నయ అక్కర లందువలెనే, దీని యతి అయిదవ గణమున నిలిచినది. ప్రతి అర్థము చరణమునా, మూడవగణమున బ్రహ్మ గణము అనగా సూర్యగణము గాని, సగణ, గగములు గాని అయివుంటుంది.

# ఆంధ్రకవితా పిత - 2

ఈ నెల 2, 5 తేదీలను శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రుల్లు వారును, శ్రీ తేకుమళ్ళ రాజ గోపాలరావు పంతులు గారును, శ్రీ కోటీశ్వరశర్మగారును శశిలేఖలో ప్రచురించిన జాబులను చదివితిని. శ్రీ బ్రహ్మయ్య శాస్త్రులు వారి లేఖ ప్రచురితమైన తరువాతనే కోటీశ్వరశర్మ గారి లేఖ ప్రచురమాయెను.

"ప్రమాదో ధీమతామపి" అని శర్మగారు వ్రాసిరి. "ప్రమాదో ధీమతామేవ" అని నేనంటాను. నేలను నడిచేవాడికి మీది నుంచి పడడమనేది వుండదు. విపులమైన విచారణ చేసి వ్యాసములు రాసేవారి అభిప్రాయములు ఒకప్పుడుకొన్ని తేలిపోవడము సహజము. అట్లు తేలిపోవడం వల్ల ఆ గ్రంథకర్తల ప్రతిష్టకు ఒక లోపము లేదు. లోపములన్నవి యవరు పడితే వారు పట్ట గలరు. అది యొక గొప్ప ప్రజ్ఞ కాదు.

బ్రహ్మయ్య శాస్త్రులు గారికి ఇదమిత్థం అని శాసించి రాయడం కొంత అలవాటను కుంటాను. అది వక తప్పుగా నేను యెంచను. "సంశయాత్మా వినశ్యతి" అన్నాడు. తన శక్తి యందు తనకు నమ్మకం లేనివాడు గట్టిపని యేదీ చెయ్యలేడు. వివాదాస్పదమైన చిక్కు అంశ ములలో ధైర్యముతో యేదో వొక తోవతొక్కిన వాడల్లా లోకోపకారి. నిజము తేలుటకు అది వొక సాధనము. విక్రమార్క "సంవత్" ఉత్పత్తిని గురించి యడతెగని వివాదం ప్రబలియున్న రోజులలో శిల్పకళాకుశలులయిన ఫెర్గ్యూసన్ దొర యేమి నిర్ణయము చేసెనంటే, "విక్రమార్క శకారంభ కాలమందు విక్రమార్కు డనే రాజు వుండి వుండలేదు. మరి ఆరువందల సంవత్సరముల వెనుకనుండెను. జ్యోతిషముతో సంబంధించిన గణనలకొరకు శకారంభ కాలము ఆరువందల యేండ్లు వెనుకకు జరిపెను" అని. ఇట్టి సిద్ధాంతము తత్వ నిర్ణయమునకు సహకారి అని కీర్తి శేషులైన మాక్సుముల్లరు దొరవారు వాటిండియా టీచస్ అజ్ (What India Teaches us) అను గ్రంథమున మెచ్చి వ్రాసి ఆ సిద్ధాంతము ననుసరించి కొందరు సంస్కృత కవుల కాలమును యేర్పరిచిరి. ఇది కాదనువారు క్రీస్తు శకము 544కు ముందు "సంవత్" వాడుకొనునటుల రుజువు చూపుదురు కాక! యనిరి.

అంతట కీల్హార్న్, బూలర్ అను జర్మను పండితుల బట్టి నిదర్శనములను చూపిరి. వాటిండియా టీచస్ అస్ (What India Teaches us) అను గ్రంథము రెండవ కూర్పులో

మాక్సుముల్లరు (Max Muller) దొరగారు తమ వ్యాసమును విసర్జించిరి. అటులనే బ్రహ్మయ్య శాస్త్రులు గారు కూడా బెజవాడ శాసనము విషయమై తమకు నిజము తెలసిన వెంటనే సవరణను ప్రచురించిరి. పండితులు మరివకలాగు యెందుకు చేతురు? బెజవాడ శాసనము ఛందోబద్ధమైతే యేమొచ్చె? కాకపోతే యేమొచ్చె? అది యవరూ చెప్పరు. అసలు శాసనమును "అందున్నవి సౌష్టవము లేని వచనములు" అని బ్రహ్మయ్య శాస్త్రులు గారున్నూ 'యిందలిది భాష కాదు' అని రాజగోపాలరావు గారును దించివేసిరి. గ్రాంథిక భాష మారుననుమాట నమ్మని వారేమందురో!

ఈనాడు చుట్టు చూపూ, వెనక చూపూ లేని విద్యను విద్యగా పరిగణించరు. చుట్టు చూపు అనగా సరిపోల్చి తారతమ్యము తెలిసి చదువుట. ఒక దేశపు చరిత్ర బాగా తెలియవలెనంటే యితర దేశముల చరిత్రను కూడా నేర్చి చరిత్ర స్వభావమును గుర్తెరగవలె. వక భాషను బాగా తెలియవలెనంటే యితర భాషల చరిత్రము కొంత నేర్చి భాషా శాస్త్రము నెరుగవలె. నన్నయనాడు ఆంధ్ర కర్ణాటక భాషలు రెండును నేర్చిన కవులుండిరి. నాడు కన్నడ భాషా జ్ఞానమును వెలుతురును తెనుగుపై పరపి కొత్త సంగతులు తెలిపిన వారు శ్రీ రాజగోపాలరావుగారొక్కరు కనబడుచున్నారు. గాని నేను కర్ణాటక ఛందస్సును చాలా కాలము కిందటనే యెరిగియుంటిని. కన్నడ భాషను నేరనివారు కూడా కన్నడ ఛందస్సు సులభముగ గ్రహించుటకు సాధనమున్నది. మంగళూరు బేసిల్ మిషన్ ప్రెస్సులో అచ్చుపడిన నాగవర్మ ఛందస్సులో కన్నడ ఛందస్సును గురించిన్నీ, కన్నడ కావ్య ప్రపంచమును గురించిన్నీ విపులమైన వ్యాసములు ఇంగ్లీషున వ్రాయబడి యున్నవి. ప్రతి పద్యము యొక్క లక్షణము కూడా ఆ పుస్తకములో ఇంగ్లీషున తేటతెల్లముగ రాయబడినది. అక్కరల లక్షణము 102; 108 పుటలోనూ, అక్కరకె లక్షణము 109 పుటలోనూ అక్కరలలో వాడబడే గణములలో వివరము అయిదవ అధ్యాయారంభములోనూ యీయబడినవి. నాగవర్మ ఛందస్సున్నూ కర్ణాట సాహిత్య లక్షణ సంగ్రహమున్నూ కలిపి చెన్న పట్టణము గ్రంథ రత్నాకర ముద్రాక్షరశాలలో అచ్చుపడినవి. ఇందులో యింగ్లీషు లేదు. వెల తక్కువ. రెండవ నాగవర్మ కృతమైన కర్ణాట భాషాభూషణమనే వ్యాకరణమును రైస్ (Rice) దొరగారు. బెంగుళూరు గవర్నమెంట్ ప్రెస్‌లో అచ్చువేసిరి. ఈ వ్యాకరణము సంస్కృత సూత్రములు వృత్తి కలిగి వున్నది. గ్రంథము రోమను అక్షరములతోను కన్నడ అక్షరములతోనూ కూడా అచ్చు అయి వున్నది. సంస్కృత మెరిగిన వారు యీ వ్యాకరణమును సులభముగా జదువుకోవచ్చును. ఈ పుస్తకములో నాగవర్మను గురించిన్నీ కన్నడభాష, కన్నడ కవులను గురించిన్నీ, కన్నడ కావ్య ప్రపంచమును గూర్చిన్నీ యింగ్లీషు వ్యాసములు కలవు. 6వ పుటకు యెదురుగనున్న పటములో కన్నడ లిపికి కలిగిన మార్పులు చూపబడినవి. నాలుగు అయిదు కాలములలోని అక్షరములను త్రైఫారు వేసి చూసిన యెడల తెనుగున కూడా తలకట్లెట్లు మారినవో తెలియవచ్చును. మైసూరు

గవర్నమెంటు ప్రెస్‌లో శ్రీ ఆర్. నరసింహాచారిగారు నాగవర్మకృత కావ్యాలోకనమును కర్ణాటక భాషాభూషణమును కలిపి ముద్రించినారు. యింగ్లీషున విపులమైన ఉపోద్ఘాతము కలదు. అందులో ఛందోంబుధి వ్రాసిన నాగవర్మా, కావ్యావలోక నాదిగ్రంథములు వ్రాసిన నాగవర్మా భిన్నులని ఋజువు పరచిరి.

కేశరాజు రచించిన శబ్దమణి దర్పణమను వ్యాకరణమును మంగుళూరు బేసిల్ మిషన్ ప్రెస్‌లో కిట్టెలు దొరగారు ముద్రించిరి. యిందు సూత్రములు కన్నడ పద్యములుగానున్నవి. సూత్రార్థమింగ్లీషున మార్జినులో నీబడినది. భట్టకలంక దేవుని కర్ణాటక శబ్దాను శాసనము విపులమైన వ్యాకరణము. దీనిని రైస్ (Rice) దొరగారు మైసూరు గవర్నమెంటు సెంట్రల్ ప్రెస్‌లో అచ్చు వేయించిరి. సంస్కృతమున సూత్రములు, వృత్తి వ్యాఖ్య కూడా కలవు. పుస్తకము రోమను లిపిని కన్నడ లిపిని కూడా అచ్చు అయినది. కర్ణాటక కవిచరిత మొకటి ఆర్. నరసింహాచారి గారు, యస్. నరసింహాచారి గారు మైసూర్ వెస్లియన్ మిషన్ ప్రెస్‌లో అచ్చు వేయించిరి. (Wesleyan Mission Press Mysore) ఇంగ్లీషున ఉపోద్ఘాతము కలదు.

నృపతుంగుని కవి రాజమార్గము కె. పాఠక్ గారు మైసూరు గవర్నమెంటు ప్రెస్‌లో అచ్చు వేసిరి. విపులమయిన ఇంగ్లీషు ఉపోద్ఘాతము కలదు. గ్రంథము రోమను లిపిని కూడా అచ్చువేసి యున్నది. కెటిల్ దొరగారు కన్నడ, ఇంగ్లీషు నిఘంటువు రచించిరి.

# ఆంధ్ర కవితాపిత - 3

బెజవాడలోని యుద్ధమల్లుని శాసనము రాజరాజ నరేంద్రుని కన్న చాలా ప్రాచీనమనే నా అభిప్రాయము. లిపినిబట్టి ఆలా అనక తీరదేమో అనుకుంటాను. 1893 సంవత్సరములో గవర్నమెంటు యెపిగ్రాఫిక్ డిపార్టుమెంటు (Epigraphic Department) వారు ఈ రాతిపైని కాగితము ఒత్తి అచ్చు తీసిరి. (Estampa face) దానిని ఆ దరిమిలాను మా మిత్రులు శ్రీ గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారితో కలిసి పరిశీలించియుంటిని. తరువాత ఆ శాసనపు రాతిని కూడా చూచితిని.

యెపిగ్రాఫిస్టు గారి 1893 సంవత్సరపు రిపోర్టులో 12వ పుటలో ఈ శాసనము గూర్చి యిట్లు వ్రాయబడి యున్నది. Telgu-In very archaic characters mentions the King's Grandfather Mallaparaju"

(తెనుగు చాలా ప్రాచీనమైన అక్షరములతో నున్నది. రాజు తాతమల్లపరాజని వున్నది.)

ఆ సంవత్సర మెత్తిన శాసనపు అచ్చు కాగితము గైవిలియ కాగా యిప్పటి యెఫిగ్రాఫిస్టులును నా మిత్రులును అగు శ్రీ హెచ్చికృష్ణ శాస్త్రిగారు కిందటి సంవత్సరం తిరిగి ఒక అచ్చు యెత్తి ఆ శాసనమును గురించి వారి 1910 సం॥పు రిపోర్టు 2, 82, పేజీలలో వ్రాసిరి.

2వ పేజీలో దానిని గూర్చి "One of the earliest to lethic records written in Telugu Language in that part of the country" అని వ్రాసి (ఆ ప్రాంతమునందు వున్న మిక్కిలి ప్రాచీనమైన తెలుగు భాషలో వ్రాయబడిన శిలా శాసనములలో వొకటి)

82వ పుటలో :- "This epigraph may be roughly assigned to the 9th century of the Christian Era" (యీశాసనము అందిందుగా క్రీస్తు శకము తొమ్మిదవ శతాబ్దము నాటి దని చెప్పవచ్చును)

ఇలియటుదొర గారి తెనుగు శాసనములలో ఈ శాసనమును గూర్చి యిట్లు వ్రాయబడినది. గర్భాలయమునకు తూర్పున నంది మండపములో నందీశ్వరుని మంటపమునకు వుత్తరముగా వున్న తూము మీద అడ్డుగా వేసియున్న రాయిమీద శాసనము, ఈ రాతి పలకను తెలియని అక్షరములున్నవి.

ఇలియటు దొరగారు నియోగించిన పండితులు పదకొండు, పన్నెండవ శతాబ్దముల శాసనములెన్నో సులభముగా భేదించిరి. ఈ శాసనమును భేదించలేకపోయిరి.

కృష్ణ శాస్త్రిగారి కోరికపైని ఈ శాసనపు రాయి బెజవాడ మ్యూజియములో భద్రపరచబడి అందరూ చూచుటకు అనువైయున్నది. అందలి అక్షరములను పదకొండు, పన్నెండవ శతాబ్దముల లిపులతో సరిచూసిన అవి పాతవని చూచినంతనే తెలియును. ఆ శాసనపు లిపిని పరీక్షించగోరిన వారికి బూలర్ దొరగారి ఇండియన్ పెలియాగ్రఫీ (Buhler's Indian Palaeography translated by Dr. Fleet) యున్నూ, బర్మల్ దొరగారి సౌతిండియన్ పెలియాగ్రఫీయున్నూ సహాయ పడును. మొదటి పుస్తకములోని పటములు జర్మను ప్రతిలోనే గాని యింగ్లీషు ప్రతిలో లేవు. ఆ పటములలో 8వ పటమున నాలుగు, అయిదు, ఆరు కాలములలో తూర్పు చాళుక్య లిపులీబడినవి. అందులో అయిదవ కాలములోని లిపి రెండవ అమ్మరాజు (A.D. 945–970) శాసనము నుండి యెత్తబడినది. (ఇండియన్ యాంటిక్వరీ 7వ సంపుటము 15 పుట పటము 160వ పుటకు యెదుటనున్నది. ఆరవకాలములోని లిపి రాజరాజ నరేంద్రుని కోరుమిల్లి శాసనమునుంచి యెత్తబడినది. ఇండియన్ యాంటిక్వరీ 14వ సంపుట 48వ పుట.)

ఈ రెండు లిపులకును చాలా భేదము వుండబట్టే బూలరు దొరగారు అమ్మరాజ శాసనలిపికి, మధ్యకాలపు లిపి The middle variety అనిన్నీ, రాజరాజు కాలపు లిపికి పాత కన్నడ లిపి అనిన్నీ పేరుపెట్టిరి. ఈ పాత కన్నడ లిపి అన్న దానికే, బర్నలు దొరగారు ట్రాన్సిషనల్ Transitional character (మారుదల కాలపు) లిపి (ట్రాన్సిషనల్) అని పేరిడిరి. ఈ లిపి పదకొండవ శతాబ్దపు వేంగీ దేశపు శాసనములలో మొదట బయలు వెడలినది.

It first appears in the Vengi Inscriptions of the 11th Century Buhler's Indian Palaeography, Fleets translation p. 68.

అమ్మిరాజు నాటి లిపులకు రాజరాజునాటి లిపులకును గొప్ప భేదమొకటి యేదనగా, అమ్మిరాజుల నాటి లిపిలోని అక్షరముల తలకట్టు సూక్ష్మముగా శాణాంవలే నుండును (Wedge) రాజరాజు నాడు కొమ్ముల వలె తలకట్లు లేచి కోణము తేరినవి. రెండవ అమ్మరాజు శాసనముల పటములు యిండియను యాంటిక్వరీ 12, 13 సంపుటములలోనూ, బటర్వర్తు నెల్లూరు శాసనములు 1.సంపుట (Butterworth Nellore Inscriptions vol 1) 164 పుటలోనూ యీబడినవి. వీటి లిపిని కోరుమల్లి శాసనపు లిపితో సరిజూసి, ఆపైని యుద్ధమల్లుని బెజవాడ శాసనపు లిపిని పరీక్షించిన యెడల, అది రాజరాజు నాటికి ప్రాచీనమని స్పష్టపడగలదు. యెపిగ్రాపికా ఇండియా 5వ సంపుటములో 118 పుట వెనుక 6 తూర్పు చాళుక్య శాసనముల పటము లీబడినవి. వాటిలిపులు తొమ్మిది, పది శతాబ్దముల నాటివి.

బూలర్ ఇండియన్ పెలియాగ్రఫీకి యింగ్లీషు తర్జుమా బొంబాయిలో యెడ్యుకేషనల్ సొసయిటీ ప్రెస్‌లో దొరుకును.

Educational society's Press Bombay, "శాసనమునందున్న పురుషులను బట్టి, కాలము తెలిసికొందుమనిన నట్లగుచో నీ శాసనము రాజరాజ నరేంద్రునకు దరువాత వ్రాయ బడినట్లు తోచు చున్నది. గాని పూర్వము నందు వ్రాయంబడినట్లు తోచుట లేదు. "శ్రీయుత అప్పారావు పంతులు వారీ శాసనము రాజ రాజ నరేంద్రునకు బూర్వముదని వ్రాయించిరి. కాని వారు వ్రాసిన దానితో నేనేకీభవింపజాలను" అని బ్రహ్మయ్య శాస్త్రులు గారు వ్రాసిరి.

ఇట్టి అభిప్రాయమునకు శ్రీశాస్త్రులు వారు చెప్పిన యుక్తులు యివి అని అనుకుంటాను: (అ) బెజవాడ శాసనములో శాసనకర్త పేరు మల్లుడు, యుద్ధ మల్లుడు అని కూడా వున్నది. తాతపేరు మల్లపుడు. ఇట్టి లక్షణము గల (యుద్ధ) మల్లుడు రాజ నరేంద్రునకు బూర్వమునందు లేడు. (ఆ) ఈ శాసనమున పేర్కొన బడిన యుద్ధమల్లుడు తూర్పు చాళుక్యుడని వ్రాయబడి యుండలేదు. (ఇ) రాజరాజనరేంద్రున కిటీవల మల్లపు దేవుని మనమడైన మల్లుడొకడు కాన్పించుచున్నాడు. ఇతడు క్రీస్తు శకము 1202లో బరిపాలనము చేసినాడు.

బెజవాడ శాసనపు యుద్ధమల్లుడు క్రీస్తు శకము 927 నుండి 934 వరకూ తూర్పు చాళుక్యులసింహాసన మెక్కి పాలించిన యుద్ధమల్లుడయె వుండునని నా అభిప్రాయము.

శాస్త్రుల వారు పేర్కొనిన మల్లపుదేవుని శాసనము క్రీస్తు శకము 1202 నాటిది. ఆ సంవత్సరమున ఆ రాజు పిఠాపురమున పట్టాభిషిక్తుడాయెను. ఈ శాసనము యెపిగ్రాఫికా ఇండియాలో 4వ సంపుటములో 231 పుటను ప్రచురింపబడినది. పటము ఆరవ సంపుట 270 పుటను కలదు. ఈ శాసనపు లిపి బెజవాడ శాసనపు లిపితో చేర్చి చూసిన వెంటనే దీని కొత్త బయలుపడును. గాన నీమల్లపను గూర్చి చర్చించుట అనవసరము. అయినను పిఠాపురపు శాసనపు తెలుగు భాగము మొదటను, మల్లప పేరిట్లీ బడినది. 86 పంక్తి "స్వస్తి శ్రీ సర్వలోకాశ్రమ శ్రీ విష్ణువర్ధన మహారాజులైన మల్లపదేవ చక్రవర్తి" బెజవాడ శాసనములో ఈ రీతిని లేదు.

# ఆంధ్ర కవితాపిత - 4

యుద్ధమల్లుని కథ యించుక ముచ్చటింతము. హియంతసాంగుడను చీనా దేశపు బౌద్ధ పండితుడు యేడవ శతాబ్దారంభ మందు మన దేశమునకు వచ్చెను. అప్పుడు దక్కను దేశమును చాళుక్య రాజగు రెండవ పొలికేసి, సత్యాశ్రయుడు పాలించుచుండెను. అతను ఆంధ్ర దేశమును జయించినట్లు అయిహోవి శాసనమందు జెప్పబడినది. (ఎపిగ్రాఫికా ఇండియా 6వ సంపుటలో 1, 12 పుటలు) యీ శాసనకావ్యకర్త రవికీర్తి అనే జయనుడు. సంస్కృత కవిత్వమందు అభిరుచి కలవారీ శాసనము చదవవలెను. సత్యాశ్రయుని తమ్ముడు కుబ్జ విష్ణు వర్ధనుడు తూర్పు చాళుక్యశాఖకు మూల పురుషుడు. ఇతని సంతతిలో కవి విష్ణువర్ధనుడనెడి రాజు క్రీస్తు శకము 843-844లలో పద్దెనిమిది మాసములు రాజ్యము చేసెను. యీ కవి విష్ణువర్ధనునికి ముగ్గురు కొడుకులు. జ్యేష్టుడగు గుణక విజయాదిత్యుడు 844 నుండి 888 వరకు 44 వత్స రములు పాలించి, సంతానము లేకుండా గతించినట్లు కనబడును.

అతని తమ్ములు మొదటి విక్రమాదిత్యుడు, మొదటి యుద్ధమల్లుడు. ఉభయులకూ సంతతి కలిగియుండెను. ఇక జట్టీలకు కొదవేమిటి?

గుణకుడు గతించగానే విక్రమాదిత్యుని కొడుకగు మొదటి చాళుక్యభీముడు రాజ్యమునకు వచ్చెను. ఇతనికి దాయదుల వల్ల చిక్కులు కలిగినట్లు శాసనముల వల్ల కనబడును. ఇతని కాలానకు పశ్చిమ చాళుక్య రాజ్యము అంతరించి, మన్యఖేట రాష్ట్ర కూట రాజులకు చేరినది. పశ్చిమ దేశం యేలే ఈ రాష్ట్ర కూటులకున్నూ, తూర్పు చాళుక్యులకున్నూ అనుశ్రుతమైన వైరమున్నట్లు కానవచ్చుచున్నది. పూర్వ చాళుక్యరాజుల దాయాదులను కొందరిని వెనక వేసుకొని ఈ రాష్ట్ర కూట రాజులు వేగి దేశముపై దండెత్తి వచ్చు చుండిరి. మొదటి భీముడు రాష్ట్ర కూటరాజగు రెండవ కృష్ణునితోనో, తన దాయాదులతోనో యుద్ధము చేసి జయించి నట్లు నాకు దొరికిన కశింకోట శాసనములో వ్రాయబడినది. యీ దాయాదులలో భీమునికి పినతండ్రి అయిన యుద్ధమల్లుడు గాని అతని కుమారుడు తాడపుడు గాని వుండివుండవచ్చును. ఇది వూహ. భీముడు 888 నుంచి 919 వరకూ 30 సంవత్సరములు పాలించెను. ఇతని అనంతరము ఇతని పెద్దకొడుకు కొల్లభిగంధ విజయాదిత్యుడు ఆరు మాసము లేలెను. తదనంతరమతని

పెద్ద కుమారుడు మొదటి అమ్మరాజు 925 వరకు ఏడేళ్ళేలెను. ఇతని కుమారుడు బాలుడైన బేతవిజయాదిత్యుడు పదిహేను రోజులు ఏలెను. ఇతనిని కంఠికా విజయాదిత్యుడందురు.

ఈ ప్రకారము మొదటి భీముడి సంతతిలో, అతని మునిమనమడి వరకూ రాజ్యము వచ్చెను. అంతట భీముడి పినతండ్రియు మొదటి యుద్ద మల్లుని కొడుకును అగు తాళపరాజు, బాలుడగు కంఠిక విజయాదిత్యుని తొలగించి, రాజ్యమాక్రమించుకొని ఒక్కనెల రోజులు యేలెను. (మొదటి భీముని పెద్ద కొడుకగు కొల్లభిగండ విజయాదిత్యుని సంతతి వారు రాజ్య భ్రష్టులై యేమీ చెయ్యజాలక ఊరకుండిరి గాని) భీముని రెండవ కుమారుడైన రెండవ విక్రమాదిత్యుడు తాళప రాజును చంపి, రాజ్యమాక్రమించి, పదకొండు మాసములు రాజ్యము చేసెను. అంతట రాజ్య భ్రష్టుడైన బేత విజయా దిత్యుని తమ్ముడొకడు, మూడవ భీముడనువాడు, తన పినతాత అగు రెండవ విక్రమాదిత్యుని జయించి ఎనిమిదిమాసములు రాజ్యము చేసెను. ఆ వెనుక యీ మూడవ భీముని కొట్టి తాళపరాజు కుమారుడగు రెండవ యుద్ధమల్లుడు రాజ్యమును అక్రమించు కొని 927 నుండి 934 వరకు యేడేండ్లు యేలెను.

యిది బీరకాయపీచు. ఈ యుద్ధమల్లుడే బెజవాడ శాసనపు యుద్ధమల్లుడు కావచ్చునని నా అభిప్రాయము. ఇతనికి దాయాదులు మనకు తెలిసిన వారెవరనగా :–

1. మొదటి భీముని మనుమడు రాజ్య భ్రష్టుడైన బేత లేక కంఠికా విజయాదిత్యుడు;
2. పదకొండు మాసములు రాజ్యము చేసి తాళప రాజు వలన తొలగింపబడిన బేత విజయాదిత్యుని పినతాత రెండవ విక్రమాదిత్యుడు;
3. కంఠికా బేతవిజయాదిత్యుని పినతండ్రియగు రెండవ భీమరాజు.

క్రీస్తు శకము 934లో ఈ మూడవ దాయాదియగు రెండవ భీముడు యుద్ధమల్లుని జయించి దేశము నుండి వెడలగొట్టినట్లు శాసనముల వల్ల కనబడును. (Epigraphica Indica Vol. VII P.181; Vol. IX P. 49. Nellore Inscriptions Vol.I. P.170, 171)

రెండవ భీమునకు రాజ్యము సులభముగా సంప్రాప్తము కాలేదు. అతని శత్రువులకు రాష్ట్రకూటరాజగు నాలుగవ గోవిందుడు తోడ్పడెను. రాజ్యకాంక్షులై పోరిన దాయాదులతో యుద్ధమల్లుడు (Nellore Inscriptions Vol. I pp 170, 171; Epigraphica Indica Vol VII P. 181) కంఠికవిజయాదిత్యుడును జేరియుండిరి. ఇతర శత్రువులు యవరనిన, రాజమయ్య, ధళగ తాత బిక్కి; బిజ్జి; అయ్యప; లోవబిక్కి. వీరిలో తాతబిక్కి బేతవిజయాదిత్యుని పినతాత అయిన విక్రమాదిత్యుడని నేను పోల్చినాను. ఒక శాసనములో ఇతని పేరు తాత బిక్క్యన అని వున్నది. పశ్చిమ చాళుక్య రాజగు ఆరవ విక్రమార్కుని శాసనములలో విక్కలన్ అనుటకలదు.

కంఠిక విజయాదిత్యుని, యుద్ధమల్లుని, రెండవ భీముడు దేశము నుండి తొలగించెనంటిమి. ఈ బేతవిజయాదిత్యుని సంతతి తూర్పున చేరి, గాంగులతో సంబంధములు చేసి, తిరిగీ కొంత కాలమునకు తలయెత్తినట్లు కనుపడును. Indian Antiquary Vol. XX.p. 267-268 అటువలెనే యుద్ధమల్లుని సంతతి కృష్ణా జిల్లా ప్రాంతమందు రాష్ట్ర కూటుల సహాయము వలన కొంత రాజ్యము కల్పించుకొని కొంత కాలము మన్నినట్లు కనుపడును. యిందుకు ఆధారము యెపిగ్రాఫిస్టు గారి 1909 సంవత్సరపు రిపోర్టులో చెప్పబడిన గుంటూరు శాసనము (Pages 109; 110). శాసనకర్త విష్ణువర్ధన తాళరాజు. ఇతని వంశము పూర్వ చాళుక్య వంశము. ఇతను పైని చెప్పిన పూర్వ చాళుక్య రాజగు తాళపరాజు సంతతిలోని వాడు. ఈ శాసనములో మొదటి తాళపరాజు మొదటి భీముని తమ్ముడని వ్రాయబడియున్నది. పినతండ్రి పెత్తండ్రి బిడ్డలను, అన్నదమ్ములను వాడుక మనదేశమున నున్నది. మొదటి తాళప కుమారుడు యుద్ధమల్లుడు. ఇతనికి యిద్దరు కుమాళ్ళు. మహారాజాధిరాజ పరమేశ్వర బాడబరాజు, విష్ణువర్ధన తాళరాజు.

గుంటూరు ప్రాంతమందు రెండవ యుద్ధమల్లుని సంతతి వారు రాజ్యము చేసి యున్నప్పుడు ఆ కాలపు లిపినివున్న బెజవాడ శాసనములోని యుద్ధమల్లుడు పూర్వ చాళుక్యులలోని యుద్ధమల్లుడయి వుండడనుటకు కారణములు నాకు కానరాలేదు.

ఇక పేరులకా? యుద్ధమల్లుడను పేరు "మల్ల, మల్లప" అనియు, తాళరాజను పేరు, "తాహ, తాళప, తాలప, తాల, తాడప" అనియు శాసనములలో కానవచ్చు చున్నవి. నేను పైనుదహరించిన శాసనములే ప్రమాణము.

# కన్యాశుల్కము

మంచి నాటకముల గనుట, జదువుట, కన్న విద్యాభిమానులకు ఎక్కుడు ఆనందముండ బోదు. అట్లు చూచుచు, చదువుచు, నుండునపుడు మనము భగవన్నిర్మాణమగు నీమాయా ప్రపంచమును మరచి కవి నిర్మాణమగు మరియొక మహా మాయా ప్రపంచమలో నానంద మగ్నులమై యుందుము. సాధారణ నాటకములెల్ల నిటుల నానందజాయకములగునపుడు ప్రతిభావంతులగు కవిశ్రేష్ఠుల నాటకముల మాట చెప్పనేల? మ.రా.శ్రీ. గురజాడ అప్పారావు పంతులు బి.ఏ.గారు రచించిన యీ నాటకమును పోలిన నాటకములు ఆంధ్రభాషలో లేవు. కథాకల్పన, పాత్రరచనా చమత్కృతి, రసపుష్టియు, నీ నాటకమున శ్రేష్ఠతరముగ నున్నవి. వీరికి హూణకవిశ్రేష్ఠుల కలాకౌశలము పూర్ణముగ పట్టుపడుటంజేసి, వీరు ఆపూర్వగ్రంథరచనచే నాంధ్రభాషా వధూటి నలంకరించిరి. ఈ నాటకము ౧౮౯౭వ సంవత్సరమున నైదకంములుగా రచింపబడి, రాజర్షులును, విద్యా భోజులును, పండిత పోషకులునునగు శ్రీ ఆనందగజపతి మహారాజావారలకు అంకిత మీయబడినది. అచ్చుపడిన కొద్ది వారములలో నన్ని ప్రతులును చెల్లుటయే కాక, పత్రికాధిపతులు ఈ నాటకమును వేనోళ్ళ పొగడిరి. ఇన్నాళ్ల వరకు రెండవ కూర్పు అచ్చొత్తించక పోవుటకు కారణము మన దేశములో గ్రంథముల నచ్చొత్తించి యమ్ము పడివాటుల భీతియే యని గ్రంథకర్తగారు ఉపోద్ఘాతమున వక్కాణించిరి. ఈ మాట యెంత నిజము! కొందరి స్నేహితుల ప్రోద్బలమున నీ రెండవ కూర్పిప్పుడచ్చొంత్తించిరి. రెండవ కూర్పులో నాటకమును మిక్కిలిగ మార్చి, అయిదంకములను యేడంకములుగ పెంచిరి. ఈ నాటకము గ్రామ్యభాషను వ్రాయబడి పండిత పామరులకు ఆనంద జనకమై యున్నది. గ్రంథకర్త గారు గ్రామ్యగ్రాంథిక భాషల తారతమ్యముం గూర్చి ఆంగిలేయ భాషను విపులమగు క్రోడము వ్రాసి, నాటకమునకు ఉపోద్ఘాతముగా నచ్చొత్తి, వారి పాండిత్యప్రకర్షను గనపరచిరి. వీరీ నాటకమున గ్రామ్యభాషకెంతయో వన్నె తెచ్చి, రసానుగుణ్యముగ పలికించిరనుటకు సందియము లేదు. ఇటులనేకదా ప్రాచీనకవులు ప్రాకృత భాషల యందు కావ్యములు వ్రాసిరి. ఆప్రాకృతములే యిప్పుడు బంగాళీ, ఓఢ్రము, మహారాష్ట్రము, మున్నగు భాషలుగా మారినవి. ఇప్పటి యీ వ్యావహారిక భాషలలోనే ఆయా దేశపు కవులు ఉద్గ్రంథముల వ్రాసి, ఆయా భాషలకు వన్నె తెచ్చిరి. ఆంధ్రమున గ్రామ్యగ్రాంథిక భాషల తారతమ్యమెటుల నున్నను, హాస్యరస ప్రధానములగు

నాటకములు గ్రామ్యభాషనే వ్రాయనగుననుటకు అంగీకరించని వారు ఉండబోరు. స్వభావము ననుసరించి వాడుకలో నుండు మాటలతో వ్రాయబడుటం జేసి, యీ నాటకమున భాష ముద్దులు మూటకట్టుచున్నది. కన్యాశుల్కమున కాశించి వృద్ధులకు పిల్లలనిచ్చు దురాచారమును మాన్పుటకై యీ నాటకము వ్రాయబడినది. కృష్ణారాయపురమను నగ్రహారమున నగ్నిహోత్రావధాని యను బ్రాహ్మణుడు కలడు. ఆయనకిద్దరు పుత్రికలు. పెద్దపిల్లను కన్యాశుల్కమున కాశించి వృద్ధున కొకనికి కట్టబెట్టుటంజేసి, ఆమెకు బాల్యమునందే వైధవ్యము సంభవించినది. అంతటను బుద్ధిరాక రెండవ పిల్లను గూడ లుబ్ధావధానులను నొక ముసలివానికి పెండ్లిచేయుటకు అవధానులు గారు తలపెట్టిరి. ఈ వివాహము విఘ్నముచేయుటకుగాను ఆయన బావమరది యగు కరటకశాస్త్రి తన శిష్యునకొకనికి స్త్రీ వేషము వేసి తక్కువ వెలకు ఆ లుబ్ధావధానులకు పెండ్లిచేయును. వివాహమైన కొద్ది దినములలో నా శిష్యుడు వేషము విప్పి పారిపోవును. ఇటుల పెండ్లికూతురు అదృశ్యముకాగానే, ప్రాణహత్య జరిగినదని పోలీసువారు క్రిమనలు కేసును లేవనెత్తుదురు. ఈ రసకందాయములో నగ్నిహోత్రావధాని పుత్రునికి విద్యనేర్పు గిరీశమను మోసగాడొకడు అవధానులుగారి జ్యేష్ఠపుత్రికను పెండ్లికిబోవు మార్గమధ్యమున లేవతీసుక పోవును. దీనంజేసి చిలవపలవలుగ కోర్టు చిక్కు లెన్నియో పుట్టి, న్యాయమార్గానువర్తియగు నొక బ్రాహ్మణోత్తమునిచే బాపబడును. గ్రంథము చదివి చూడవలెగాని, చెప్పి తెలుపశక్యమైనది కాదు. షేక్స్పియరు మహాకవి నాటకములలోని ఫాల్‌స్టాఫ్ అను పాత్రమువలె, నీ నాటకమున గిరీశమను నతడు నవ్వులబండి. కావ్యగుణములన్నిటికన్నను లలితమగు హాస్యరసము కష్టసాధ్యమని యాంగ్లేయ పండితుల యభిప్రాయము. అట్టి సరసమగు హాస్యము యీగ్రంథమంతట నిండియున్నది. కాన నీకవిని ఆంధ్రమోలియరని యనతగియున్నది. అంకితమును, ఉపోద్ఘాతములును ఇంగ్లీషుభాషను వ్రాయబడియున్నవి. తెనుగున వ్రాసిన బాగుండునని మా యభిప్రాయము. ఈ గ్రంథమును ఆనందగజపతి మహారాజుల సుందరరూపమును తెలుపు పొటిగ్రాపొకటి యలంకరించుచున్నది. గ్రంథము వెల ౧౨ అణాలు. ఇది చెన్నపురి ఎన్‌ప్లనేడులో సంస్కృతాంధ్ర గ్రంథముల విక్రయించు వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు వారి షాపునను, తెలుగు దేశమునగల రెయిలు స్టేషనులలో హిగ్గిన్‌బాతం కంపెనీవారి పుస్తకముల యంగళ్ళవద్దను దొరుకును.

# ప్రఫుల్ల లేక రాణీ చౌదరి (బంకించంద్రుని నవలారచన)

ఒకరివెనకొకరు ఆడపిల్లలీగ్రంథమును చదువుచున్నారు. ఈమాట వొక్కటియే దీని విలువను తెల్పజాలును. శ్రీసుబ్బారావుగారు ఇంగ్లీషునుండియో, కన్నడమునుండియో తెనిగించిరని నాజ్ఞాపకము. మన తెనుగుదేశమున కెంత దురవస్థ! బంగాలీ గ్రంథముల చదువు నేర్చిన కవి మనలో వొక్కడు లేడుగదా?

నూరు సంవత్సరము క్రిందట బంగాలీ విద్వాంసులు, బంగాలీ భాషలో వ్యాకరణము గాని, నిఘంటువు గాని లేకుండుట గని, గత యాభై, అరవై ఏళ్ళలో బంగాలీ వాడుక భాష నుండి ఒక సులభమైన గ్రాంథిక భాషను కల్పించుకొని, లోకములో యెన్నిక కెక్కిన గ్రంథ ప్రపంచమును కల్పించిరి. ప్రక్కనున్న వారిని చూచి నేర్చుకొను నేర్పయినను మనకు లేదాయెను. ఇకనైనను మనలో బుద్ధిమంతులు బంగాళి భాష నేర్చి, దానగల మంచిని తెనుగునకు కూర్తురు గాక.

సుబ్బారావు గారి శైలి చిన్నయ్యసూరిగా రేర్పరిచిన త్రోవనున్నది. ఆ శైలిని వీరి రచన మిక్కిలి రసవంతముగా నున్నది. అసమానమే అనవచ్చును. 45వ పుటలో "ప్రఫుల్ల ముఖ దిగ్భ్రమముజెంది" అని ఆరంభమైన వాక్యకదంబమును చదివిన శ్రీ సుబ్బారావు గారి రచనా సామర్థ్యము తెలియును. వీరి శైలిలో రెండు దోషములు నాకు కనపడ్డవి. అనవసరమైన సంస్కృత శబ్దములును, వాడుకలోలేని తెనుగు మాటలును గ్రంథమందు నిండియున్నవి. సంస్కృత వ్యాకరణము నేర్చకుండా పాత గ్రాంథిక శయిలిలో వ్రాయబూను వారికి కలుగు స్ఖాలిత్యములు శ్రీ సుబ్బారావుగారికి కూడ కలిగినవి. మొదట అధ్యాయముల సంఖ్య వీరు సంస్కృత పదముల నిచ్చిరి. అందు షష్ఠమాధ్యాయము, చతుర్దశమాధ్యాయము, ఏకాదశమాధ్యాయమను ప్రయో గములు దొర్లినవి. అది తెలిసి కానోపును. రెండవ భాగములో అధ్యాయముల సంఖ్య తెనుగు పదముల నిచ్చియు, అందులో సప్తమాధ్యాయమునకు మాత్రమే తత్సమము వుంచిరి. వీరు కొన్ని చోట్ల వాడుకలో నున్న తత్సమదేశ్య శబ్దముల విడిచి, అంతరించిన తద్భవశబ్దములను వాడియున్నారు.

రెండవ దోషము : అక్కడక్కడ అనుప్రాసమును వొత్తుగా తగిలించుట (అ) "ఇంక నేమే మింబెట్టుకో, తిట్టుకో, భూషించుకో, దూషించుకో" (ఆ) కెంపు పెంపు గల, "కెంపు సొంపు నింపు నధరంబు, కుందముల యందము డిందుపడంజేయు ద్విజాలియు" (ఇ) "అత్తరు

ణీతరుణుల మనముల గలిగిన దలపులు వలపుల పొలుపులు దెలుపవశమగునె” (ఈ) “పెచ్చు పెరిగి విచ్చలవిడి పచ్చవిల్తు డొచ్చము లేక.” ఇప్పుడు మన పత్రికలలో రెండు విమర్శన మార్గములు కనబడుతున్నవి. ఇష్టులైన కవులను పొగిడి వారి గ్రంథములందు తప్పులెన్నక పోవడము, అయిష్టులగు కవుల గ్రంథములయందు వున్నవి లేనివి తప్పులే యెన్ని, గుణములను మరుగు పరచడము. ఇంతకన్న భాషకు కీడు వుండబోదు. తప్పులని నాకు తోచినవి కనపరిచి నందుకు శ్రీ సుబ్బారావుగారు నన్ను క్షమింతురుగాక. కథ యొక్క గుణదోషములు బంకిం చంద్రులవి. కీర్తిశేషులైనవారి తప్పులెన్నినను చిక్కుకలగబోదు. బతికివున్న కవులకు శ్రాద్ధము పెట్టడము, చచ్చిన వారికి వర్ధంతులు చేయడము, యీనాడు మనవారి కలవాటైన ఈ పద్ధతి తలకిందులు చెయ్యడము వల్ల భాషకు కొంత మేలు కూడునని నా అభిప్రాయము.

బంకిముల కథలు తెనుగైనవి నా యెదట మూడున్నవి. శ్రీ సుబ్బారావుగారి ప్రఫుల్ల యొకటి; శ్రీ ఓ.వై. దొరసామయ్య గారు కన్నడము నుంచి తెనిగించి శ్రీవావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ అచ్చొత్తిన, ఆనంద మఠమొకటి; అటులనే శ్రీ దొరసామయ్యగారు ఆంధ్రీకరించి కలారత్నాకర ముద్రాక్షరశాలలో అచ్చుపడిన కపాలకుండలము యొకటి. ఇంతకు మున్నింగ్లీషున బంకిము కథలనే రెండు మూడు చదివియుంటిని.

బంకిము వ్రాసినట్లే తాము తెనిగించితిమని శ్రీ సుబ్బారావుగారు వ్రాసిరి గాని, కొన్ని చోట్ల ఆంధ్ర లోకోక్తులును, లోకోక్తులవంటి ఆంధ్ర పద్యములును వీరి తెనుగులో కానవచ్చు చున్నవి. ఇదిగాక బంకిముల రచనా మార్గమునకు పొందిన వర్ణనాంశములను పెంచుట కూడా కొన్ని చోట్ల కలదు. బంగాళానేరనివాడనౌటచేత, దీని నిజమును కనిపెట్టజాలను.

ఈ మూడు గ్రంథములు ఇంగ్లీషులో ‘రొమాన్సు’ అను జాతిలో చేరును. దేశ కాలములను బట్టి జరగరాని సంగతులు, జరగతగిన సంగతులు వుంటవి. జరగతగిన సంగతులను వర్ణిం చునది ఉత్కృష్ట కథ. జరగనేరని సంగతులతో నిండి ఉండినది రొమాన్సు. అందులోను అంతరులు కలవు. బంకిముల రొమాన్సులు, ఇంగ్లీషు ‘నవలి’ యగు ‘స్కాట్’ తోవను కొంతవరకు అనుసరించి పోవును. దేశకాల భేదములను మన్నించక స్కాటు నవలలలోని కొన్ని అంశములను బంకిములు తన నవలలో చేర్చిరి. సీమలో మొదటి రిచర్డుఅను రాజు కాలమున రాబిన్‌హుడ్ అను బందిపోట్ల మొనగాడొకడుండెను. వానికి స్కాటు సుగుణసంపత్తిని కల్పించెను. ఇది స్కాటు నందే కావ్య దోషమై వుండెను. రాబిన్‌హుడ్‌నకు ప్రతిగా, బంకిములు ప్రఫుల్లలో భవానీ ఠాకూరను వాని నమర్చియున్నారు. ఈ భవానీ ఠాకూరు దొంగల మొనగాడైనను శౌర్యౌదార్య దేశాభిమానాది గుణసముద్రుడు; “సంపూర్ణ ధిషణాధురంధరుడు”. ఆనంద మఠములో కూడా గుణసంపత్తి కల బందిపోట్లు కలరు. సన్యాసుల దేశాభిమానము యింతంత కాదు. అట్టి

బందిపోట్లను, యిట్టి సన్యాసులును, మనసు కల్పించిన మాయా ప్రపంచములోనే వుందురు గాని, లోకములో వుండి వుండలేదు. దేశోద్ధరణమునకు భవాని ఠాకూరునకు దొరికిన సాధనము ప్రఫుల్ల ముఖియను ఒక మగడు విడనాడిన పేద బ్రాహ్మణస్త్రీ. రూపసి, బుద్ధిమంతురాలు. అడవిపట్టి పోవుచుండగా ఆమెకు నట్టడవిని వొక గాజుయిల్లు గానవచ్చెను. ఆ యిల్లు అంతటను అద్దములు కూర్చి కట్టిరి గాన, అడవి ఆ అద్దములయందు ప్రతిఫలించి అంతా యేక అడవిగా కనపడునట! ప్రఫుల్లముఖి ముఖము అద్దములో ప్రతిఫలించగా అది అద్దమని యామె పోల్చు కొనెనట. ఆ అద్దపుటింటికింద నొక నేలమాన్యములో లెక్కలేని ధనరాసులు పడియుండెను. ఆ ధనముతో సైన్యమును గూర్చికొని, భవాని ఠాకూరు ప్రఫుల్లముఖికి రాణీపదవి నిచ్చి పట్టాభి షేకము చేసెను. చెప్పన్న విద్యలు ఆమె అవలీలగా నేర్చెను. ప్రఫుల్లముఖి నేర్చిన శాస్త్రములు కళల పట్టీ 69-70 పుటలో నీబడినది. ప్రఫుల్లముఖి గారిడీవాడు అరగడియలో పుట్టించి, పూపించి, కాపించిన మామిడిని పోలియున్నది. ఇట్టి అసందర్భమును బంకిములు కల్పింతు రాయని నాకు శంక కద్దు.

ప్రఫుల్లముఖని అత్తవారు విడనాడుటకు కారణము పొందుకగా కానరాదు. "ప్రఫుల్లతల్లి ధనహీనురాలైనను, గొప్పవారి తోడి సంబంధము కలిగెనని వారితో తులతూగు ప్రయత్నంబున తన సర్వస్వమును వమ్ము చేసెను. ఒకనాడూరు బంతి పెట్టినప్పుడు తమకు మనసుదీర భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్య, పానీయంబు లెల్ల సమకూర్చదాయెననుచు నాయూరిలోన నెందుకు గొఱ గాని దుష్టులు కొందరు భోజనమధ్యమున లేచిపోయిరి. ఆ యవమానమునకు గినుక యొదవ ప్రఫుల్ల ముఖితల్లి వారిని నిందించెను. అందుల కాగ్రహముగదుర నామెపై బగబూని యా తిండిబోతులు గలసి యాలోచించుకొని హరవల్లభుడు తన చుట్టముల తోడంగూర్చుండి యుండ, నాయూరిలోని వారెవరు లేకుండ జూచుకొని, వారొకరొకరుగ సభలోన గూర్చుండిరి. అందొకడు హరవల్లభుడు వినుచుండ "ఆహా! యేమి సంబంధము!" అనుచు దనలో దాను గొణిగెను. ఆ మాటకు దత్తరపడి "ఏమేమ"నుచు హరవల్లభుడు ఆతురత నడుగ "మాకెందుకండీ? ఎవరెట్లు పోయిన నేమ"నియె. అందులకు మరింత మనంబున దొందరుగలుగ హరవల్లభుడు వేడుకోలుగ నడుగ "ఏమోనండి, కులభ్రష్టులట!" అనుచు జివాలున లేచిపోయెను. అంత విషాదాకులిత చేతస్కుండై హరవల్లభుడప్పుడే సభలో ప్రవేశించిన మరియొకని నాయూరివాని నత్యాతురతతో "నేను జేసిన సంబంధము మంచిది కాదా?" యని యడిగెను. కుట్రలో జేరినవాడగుటం జేసి యా దుష్టుడు పెదవి విఱుచుచు నూరకుండెను. 7వ పుట.

ఇటులనే మరికొందరు గ్రామస్థులు అనుమానమును బలపరుతురు. అంతట హరవల్లభుడు తనకు కూడా లోకము కులభ్రష్టత్వ మాపాదించునేమో యని భీతిల్లి "తనవారినెల్ల బిలిచి

స్థితిగతులను వివరించి చెప్పి ఈ యూరికి మనము వచ్చిన సంగతిని గుఱించి గాని, మనము చేసిన సంబంధ విషయమై గాని యెవరితోడను మాటలాడకుండ భద్రముగా నుండుడు. మన గ్రామమున నెవ్వరికైన నీ మానహీనమగు వృత్తాంతము దెలియవచ్చునేని మనకు జేటు మూడును. కావున నత్యంత జాగ్రత్త తోడ రహస్యమును గాపాడు"డనుచు నొక్కి చెప్పి యారేయి యెవరికిని దెలియకుండ మూటలనుగట్టుకొని సందడిగాకుండ పయనమై తెల్లవారకమునుపేయిల్లు చేరెను.

ఈ చరిత్రము, చిన్నపిల్లలు చెప్పుకొను కాళ్ళూ చేతులూ లేని కథలను పోలియున్నది. మామగారు ధనవంతుడట. పరమలౌక్యుడు. మొదట కులగోత్రములు తెలుసుకొనకనే వివాహ మును నిశ్చయించెనో? కులగోత్రము లెరుగకనే, తన ఆప్తబంధువులు సమ్మతించిరో? అప్పుడు సభలో నుండిన బంధువులలో మొదట సంబంధము కుదిర్చిన రాయబారు లేమయిరి? గ్రామమునందలి పెద్దలిట్టి దుర్నయములకు దిగియుండరు గదా! మామగారు వారి నడిగి నిజము తెలిసికొనకనే, కులభ్రష్టులని నిశ్చయించెనో? యిందరు బ్రాహ్మణులు భ్రష్టులయింట యెటుల భుజించి యుందురను శంక పొడమలేదో? నమ్మె, పోనిండు. సంబంధము జరిగినమాట దాచుటెట్లు? తరలిపోయినపుడు లోకమెల్ల నెరిగి యుండలేదో? అందరు బంధువుల నోళ్ళు కట్టుబడునని మామగారెట్లు నమ్మిరి? ప్రఫుల్లముఖి భ్రష్టయైన తాను కూడ భ్రష్టాయెనే? అజ్ఞాన కృత దోషము ప్రాయశ్చిత్తము వలన నివర్తించునే? అది అటుండ ప్రఫుల్ల కుటుంబమునకు భ్రష్టత యెటులవచ్చెనో గ్రంథకర్త చెప్పలేదు. రైలు బయలుదేరి తెల్లవారక మునుపే యిల్లు చేరినంత దగ్గరనుండెను మామగారి యిల్లు! ప్రఫుల్లముఖి శైశ వవృత్తాంతము గాని, ఆమె కుటుంబము యొక్క పూర్వవృత్తాంతము గాని యీయబడి యుండలేదు. నాయిక యెవరి నడుమ యెటుల పెరిగెనో తెలియక, ఆమెను తెలియనేరము. చిత్రరచనా కళలో సెటింగ్ అని ఇంగ్లీషు వారనునది ప్రఫుల్లముఖికి లేదు. సెటింగ్ అనగా ఒక ప్రతిమ యేవస్తు జాలమునడుమ నిలిచియుండునో అట్టి వస్తుప్రపంచము. సెటింగ్ అనుమాటకు తెనుగు భాషయందు పర్యంత ప్రపంచమని వాడుదుము.

ఈ జాతి నవలలు ఉత్కృష్టమైనవి కావు. లోకములో నున్నట్టే వ్రాయవలెనని నా అభిప్రా యము కాదు. ఇంగ్లీషువారు ఐడియల్ (యేది యేలా వుంటే బాగుండునో అలా భావించుట) అను లోకోత్తర కల్పనలుండక, లోకోత్తరమైన రచనముండనేరదు. గాని మనుష్య జాతము యొక్క మనో ధర్మములను, వస్తుతత్వము ననుసరించి కథ నడుపవలెను. కళ్ళెము వదలి, చిత్తమును పరుగిడనిచ్చిన నవలలు జ్ఞానదాయకములు కానేరవు.

# కావ్యము నందు శృంగారము

(ఒక గొప్ప పండితులిటుల వ్రాయుచున్నారు.)

కావ్యములలో శృంగార మెంతవరకు వర్ణనీయమను చర్చ తెనుగు పత్రికలలో జరుగు చున్నది. ఒక్కొక్క పుస్తకమును బట్టి దానిలో పది పంక్తులు తీసి, వాటిని పచ్చి శృంగారముగా నెంచి, పుస్తకమును గ్రహించుటన్నది అల్పదృష్టి. గత కాలములోను, అన్యదేశములలోను కళల స్థితిని కానీక చేయు సిద్ధాంతములుట్టి సిద్ధాంతములు కాని, గట్టి సిద్ధాంతములు కానేరవు.

పాశ్చాత్య కవులలో శృంగారము మెండా, మనలో మెండా అను విషయమును పండితులు భిన్నాభిప్రాయలలయి యున్నారు. పాశ్చాత్యులు మన కావ్యముల యందు పచ్చి శృంగారము మెండని అనులోచితముగా వ్రాయుటకలదు గాని, వారింటి మంటికుంపటిని వారు చూచు కున్నచో, వారు నోరెత్తరని నా నమ్మకము.

గ్రీకు దేశమున శిల్ప కారుల కళ దిశిమొల బొమ్మలతో నారంభమై, ఈనాటి ఫ్రెంచి యకాడమి బొమ్మలుగ పరిణమించినది. ఒంటినత్తి, యవయవముల బయటబెట్టు పుట్టముల గట్టి, వేలకొలది పెద్ద మనుష్యులమను మగవారి యెదుట, నాటలాడి, వారి నానందమగ్నులను జేయు కౌశలము పాశ్చాత్యులదే కదా. పదుగురి యెదుట స్త్రీని ముద్దు పెట్టుకొనుట, ఆలింగనము చేసికొనుట, వారిలో సర్వసామాన్యమే కదా.

మత గ్రంథములటుండగా బొకాషియో వ్రాసిన డికామిరన్ మొదలగు యూరోపు భాషలలోని పచ్చి శృంగార గ్రంథముల మాట చెప్పనవసరము లేదు. అందులో ఫ్రెంచి కవుల మాట లోక ప్రసిద్ధమే కదా!.

ఇంగ్లీషు కవులలో వాల్మీకి యగు చాసరు కథలందలి పచ్చి శృంగారమునకు ఈనాడు సమాధానము కల్పించుకోవలసి వచ్చినది. 'మార్లో' అను కవికృతమగు "హీరో అండ్ లియాండర్" అను కావ్యమును, ఆవిడ్ అను రోమను కవి కావ్యముల భాషాంతరీకరణమును, షేక్స్పియరుని "రేప్ ఆఫ్ లుక్రేన్" "వీనస్ అండ్ యడొనిస్" అను కావ్యములను, "మెర్రీ వైవ్స్ ఆఫ్ విండ్సర్", "హెన్రీ ది ఫోర్తు" అను నాటకములును మన ప్రబంధములకు తీసిపోవు. బైరను కవి వ్రాసిన డాంజు అన్ మొన్నమొన్నటి గ్రంథము.

మన దేశమున సంస్కృతములో వేదము మొదలుకొని ఈనాటి వరకును రచితములయిన యనేక గ్రంథములలో పచ్చి శృంగారమున్నదే. సంస్కృత కవుల త్రోవను బోయిన ప్రాచీన ఆంధ్ర కవుల మాట యటుంతము. ఈనాటి కవులలో మొనగాండ్ర కొందరి నెంచి వారి సరణిని పరీక్షించినచో కూడిన దెద్దియో కూడనిదెద్దియో బయలుపడగలదు.

అందు భాషా సంస్కర్తలలో మొనగాండ్రు శ్రీ రాయబహద్దర్ వీరేశలింగము పంతులుగారు. వారి మార్గమును ముందు విచారించి చూచెదను. గ్రామ్య భాషకు ప్రాణము పోసినవారు వీరేశలింగము పంతులుగారు. వారు తమ గ్రంథములనన్నింటిని అనేక సంపుటములుగా నచ్చొత్తిరి. తెనుగు భాషకు వారు మహోపకారము చేసిరనుటకు సందియము లేదు. అట్టి సంపుటములలో నగ్ర స్థానము పొంది ప్రథమ సంపుటములో జేరినవి గ్రామ్యభాషలో వ్రాయబడిన కొన్ని ప్రహసనములు.

శ్రీ పంతులు వారు భాషా సంస్కరణ కర్తలును, సంఘ సంస్కర్తలును నైనను, రక్త బలిమి చేత మన ప్రాచీన కవుల శృంగారము వీరికి ఆమూలాగ్రముగా నబ్బినది. అందుకు నిదర్శనము ప్రథమ సంపుటములో నగ్రాసనమునకు బూనిన అపూర్వ బ్రహ్మ చర్యమను ప్రహసనమే.

పచ్చి శృంగారము రెండు రీతులుగా నుండును. రత్యాది వర్ణనమును, స్త్రీల అవయవ ములను వర్ణించుటయు నందొకటి. ఇదంత ప్రమాదకరము కాదు. కవి వర్ణించినను వర్ణింప కున్నను యెన్ని పుట్టంబులచే నాచ్ఛాదనము చేసినను స్త్రీల యవయవముల నెరుగని పురుష లుండరు. మరచియున్న వారికి వర్ణనలు జ్ఞాపకమునకు తెచ్చుననుట అసంభావితము. దేవుడు సృజించిన స్త్రీ యవయవములలో నేమి తప్పున్నది. రహస్యములని చేసికొన్న మనుష్య నిర్ణయముల వలననే కొన్ని వాడక లేర్పడినవి. మళయాళమున స్త్రీలు రవికలు లేకనుండురో. చూచినంతట గలుగని ప్రమాదము వ్రాసినంత మాత్రమున కలుగునా? నిజమయిన పచ్చి శృంగారమన్నది పరకీయా శృంగారము. ఈ శృంగారమే అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము నందు వర్ణింపబడినది.

ఈనాటక కథానాయకుడు రామాకాంతము పంతులు. ఇతని యోగ్యత భృత్యుడగు కరటక రెడ్డి, ఈ రీతిని వర్ణించుచున్నాడు.

"రెండు సంవత్సరముల నుండి నా భార్యను యజమానుని కంటపడకుండా కాపాడుకొని వచ్చినాను. అతని కంట బడితే యిక నాకు భార్య ఆశలేదు. పెళ్ళాలు వున్న ఈ వీధి వారు అంతా ఆయన జీవానికి వుసూరుమని యేడుస్తూ వున్నారు. ఆయన మునిసిపల్ కమీషనరు. లోకల్ ఫండు మెంబరు. బెంచి మేజిస్ట్రేటు, డిస్ట్రిక్టు కోర్టు ప్లీడరుకావడం చేత యెప్పుడు యేమి చేసి పోతాడో అని అందరు జడుస్తూ వుంటారు. వాసుదేవరావు పంతులు గారి భార్య పుట్టింటికి వెళ్ళిపోవడం చేత ఆవిడ నిమిత్తం మా పంతులుగారు, యీవాళ ష్టీమరు మీద కొవ్వూరు వెళ్లుతారు".

ఈ నాటకమునందు కథ యేమనగా రామాకాంతం పంతులు భార్య పుట్టింటికి వెళ్ళి యుండును. పట్టుమని పది రోజులు అయినను తన్ను వదలి పుట్టింట నామె యుండదనియు, వర్తమానమందగనే బండి చేసుకొని, దుడుంగున వచ్చి తన స్వేచ్ఛా ప్రవర్తనకు భంగము కలుగ చేయుననియు, రామాకాంత పంతులుకు విచారము మెండు. వాసుదేవరావు పంతులు పెండ్లాము పుట్టింటికి పోవుచుండ, నామెను తగిలిపోవుటకు రామాకాంతము కొవ్వూరుకు ప్రయాణమయి వెడలును. ఈ పంతులుగారి భృత్యుడు కరటక రెడ్డి అనునతడు రెండు సంవత్సరములకు ముందే రూపవతియగు భార్యను పెండ్లాడియున్నను, తన భార్యను యజమానుని కంటి యెదుట బెట్టవెరచి తన పెండ్లి కథనే యజమానునికి జెప్పకుండెను గాని, ఆనాడు యజమానుడు పొరుగూరు పోయెనని యెంచి, తన భార్యను తెచ్చి యజమానుని యింట ఆమెతో సుఖింప తలచును. అంతలో యజమానుడు పొరుగూరుకు పోక, యింటికి మరలి వచ్చి, భృత్యుని భార్యయగు మోహినిని చూచి అతని భార్యయని యెరుగక, మగని యెదుటనే ఆమె తోడ సరసమాడ నారంభించును.

అది చూచి భర్త దిగులొందును. ఇంతలో యజమానురాలగు శ్యామలాంబ కూడా యింటికి వచ్చును. ఆమె రాగానే రామాకాంతం పంతులు మోహినిని వసారాలోనికి పంపివేయును. యజమానురాలు కూడా ఒక మల్లిచెట్టును చూచుటకు, ఆ వసారాలోనికి పోవనుంకించును. అట్టి చిక్కు సమయములో, నేదైన ఒక పెద్ద బొంకు బొంకి, తన మానమును దక్కించుమని రామాకాంతము కరటకరెడ్డిని రహస్యముగా వేడును. మోహిని తన భార్యయనియు, పంతులుగారు యజమానురాలు నిమిత్తము మంచి దాసీని కుదర్చుమనియు చెప్పియుండుట తానామెను అటకు తెచ్చితిననియు కరటకరెడ్డి యజమానురాలితో చెప్పెను.

శ్యామలాంబ పోయి, మోహినిని చూచి దాని రూపమునకును, మాటలకును సంతసించి, తిరిగివచ్చి మగనితో తన సంతోషము నీ రీతి చెప్పెను. "వాళ్ళ అనురాగము, ఐకమత్యమూ చూస్తే నాకును ముచ్చటవుతూ ఉన్నది." గాని రామాకాంతమునకు సంతోషము లేదు. మోహినిని తన వస్తువుగా నెంచి, అతడేమనుకొనును :

"వాడు యెంతసేటికీ కదలిరాకుండా వున్నాడు. దొడ్లో దానితో యేమి చేస్తూ వున్నాడో."

**శ్యామల :** యీ అద్దంలో వాళ్లు కనబడుతున్నారు. మన రెడ్డి పెళ్ళామును యేలా ముద్దు పెట్టుకుంటూ వున్నాడో?

**రామా :** పట్టపగలు ఆడదాన్ని వాడలా చెయ్యడం నీకు యిష్టముగా నున్నదా?

**శ్యామల :** మొగుడు పెళ్ళామును ముద్దుపెట్టుకుంటే అందులో తప్పేం వున్నది?

**రామా :** "తప్పిదం లేదు గాని నేను వక్క మాటు కరటక రెడ్డిని కూకలు వెయ్యవలెను. నీ వవతలకు పో"

ఆపైని యజమానునకును, భృత్యునకును జరిగిన సంభాషణలోని రెండు ముక్కల నుదహరింతము.

**కర :** మీ కోసమే ముద్దు పెట్టుకున్నాను. అమ్మగారి మనసులో మీ యందు వుండే అనుమానము పోగొట్టడానికి నేనా పని చేసినాను.

**రామా :** ఆ ముద్దు నా కోసం కాకుండా నీ కోసమే పెట్టుకున్నావని నాకు యిప్పటికీ అనుమానం బాధిస్తూనే వున్నది.

**కర :** అయ్యా, మోహిని వకవేళ వచ్చి మోహించి నన్ను యేమయినా చేస్తే అది నా తప్పేనా? ఆడవాళ్లు వచ్చి యెదుట నిలవబడ్డప్పుడు మగవాళ్ళు మనసు పట్టలేరు."

తుదకు కరటక రెడ్డియు మోహినియు దంపతులని క్లర్జిమేను రుజువిచ్చును. కథ కంచికి వెళ్ళినది. మన మింటికి వచ్చితిమి! కాని ఈ గొప్ప కథ వలన వ్యక్తమగు నీతి యెద్దియో? శ్రీ రాయిబహదర్ గారు తెలుపవలసి యున్నది.

దుష్టవర్తనునకు తగిన శిక్ష జోడుకంచుకాగడాలు వేసి వెతకినను గానరాదు. ఇది పచ్చి బూతు శృంగారమునకు గొప్ప నిదర్శనము.

ఇట్టి గ్రంథ రచన లోకమునకు హాని చేయును. దీనిని నిలుపవలయునని మా మతము.

వీరేశలింగము పంతులుగారు ఆంగ్లేయ నాటక మహాప్రపంచములోనుండి తెనుగుచేసిన ప్రహసనములు చాల మట్టుకు విషయవినోద సాఫల్యములే. చుంబనాలింగములను గూర్చి మొదటి సంపుటము, వాల్యుం : 10, 15, 34, 41 పుటల జూడుడు.

బ్రహ్మ వివాహమను ప్రహసనాంతమున, భానుమూర్తి అనునతడు పాపావధానులతో నిట్లు పలికెను. "యీ రోజంతా రంకు పురాణములతోనే కాలక్షేపము చేసినాము" ఇట్టి రంకు పురాణములు బ్రహ్మశ్రీ వీరేశలింగము పంతులు గారు తాము కల్పించిన ప్రహసనములయందు నిండియున్నవి.

దాని నెత్తి వ్రాయ తగదు కాని సత్యమరయ గోరినవారి కొరకు కొన్ని పట్లు సూచించెదము.

| **పుట సంఖ్య** | **పంక్తులు** |
|---|---|
| 310 | 15, 16, 17, 23, 24, 25 |
| 312 | 26 |

| | |
|---|---|
| 313 | 14 |
| 318 | మూడవ రంగము |
| 368 | 2, 6, 7, 11, 12 |
| 370 | 12, 13, 14, 15, 16 |
| 372 | 12, 13, 14, 15, 16,27, 28 |
| 402 | 13, 15, 16, 25 |
| 408 | 1, 6, 10, 11, 12, 13, 20, 21, 22, 23 |
| 415 | 21, 22 |
| 462 | 29, 30, 31 |
| 463 | 8, 9, 10 |
| 464 | 5 |
| 467 | 16 |
| 468 | 7 |
| 522 | 16, 17, 18 |

రెండవ సంపుటములో బ్రహ్మ వివాహము నందలి సప్తమాంకము రెండవ రంగము. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము ప్రథమాశ్వాసమునందలి 33వ పద్యమును, అభాగ్యో పాఖ్యానము నందలి 52 మొదలు 84వ పద్యము వరకును ప్రాచీనుల వ్రాత అణగద్రొక్క బడినది. ఇక రసికజన మనోరంజనము చతుర్థాశ్వాసమున 114వ పద్యము నుండి స్త్రీ పురుష సంసర్గము తెరమరుగు లేక వర్ణింపబడినవి.

లాక్షణికులలో బ్రహ్మశ్రీ వేదము వెంకటరాయ శాస్త్రులవారు అగ్రగణ్యులుగదా. వారు రచించిన ఉషయను నాటకమున నీక్రింది పట్టులు చూడనగును.

పుటలు : 13, 25, 27, 28, 37, 38, 68, 69.

# మాటా - మంతీ - 3
# ఆంధ్రసాహిత్య పరిషత్

"ఆంధ్ర సాహిత్య పరిషత్కార్య నిర్వాహక సభ 1915 సం॥ ఫిబ్రవరి నెల 20వ తేది శనివారమునాడు ఉదయము 8 గంటలకు బెజవాడలో సోషలు క్లబ్బులో సమావేశమగును."

నిద్రబోతున్నానా? అనుకున్నాను. కళ్ళు నులుపుకొని, తిరిగీ నిదానించి చూశాను. కార్డు మీద అచ్చు అక్షరాలు స్పష్టముగా కనబడ్డాయి. షేక్స్పియర్ అన్నట్లు కలలైనా యెరగని కార్యాలు యెన్నో వున్నాయి, అందులో ఇది వొకటి కావొచ్చును, అనుకున్నాను.

అయితే చెన్నపట్నం రాజధానిలో జరుగుతూ వచ్చిన సభ రెండువందల యాభయమైళ్ళు ఉత్తరానికి యెలాడేకిరిందని శంకపొడమింది. కారణం వినా కార్యం వుండబోదు. ఆలోచించిన కొద్ది కారణాలు శరపరంపరగా స్ఫురించాయి.

1. (ఆంధ్ర) దేశానికి ఒకప్పుడు బెజవాడ రాజధానిగా వుండేది.
2. (సా)ర్వభౌముడైన కృష్ణరాయలు పూర్వదిగ్విజయయాత్రకు విచ్చేస్తూ బెజవాడలో కొన్ని దినములు వున్నాడు.
3. (హి)యం
4. (త్) సాంగ్ అనే చైనా దేశపు బౌద్ధయాత్రికుడు బెజవాడలొ కొన్ని దినములు గడిపాడు.
5. (య) బోనెటాపర్ సెయ్, అనే పరాసుయాత్రికుడు కూడా బెజవాడలో కాలు ఊనాడు.
6. (పరిషత్తు)కు కొంతకాలం సెక్రటరీగా వుండిన మ.రా.రా. హనుమంతరావు పంతులు గారు బెజవాడలో యిప్పుడు చెయిరుమాన్‌గా వున్నారు.

యింకా కారణాలు కావాలా? బెజవాడ దగ్గిర యెన్నో రెయిళ్లు కలుస్తాయి. బెజవాడ చెన్నపట్నానికి విజయనగరానికి మధ్యనుంది.

ఇంద్రకీలాద్రి మీద అర్జునుడు తపస్సు చేశాడు. యుద్ధమల్లుడి శాసనం.

"ఆగు! ఆగు! యిన్ని కారణాలు చెబుతున్నావుగాని, ఆంధ్రసాహిత్య పరిషత్తుకూ యీ కారణాలకూ సంబంధమేమిటి? ఆంధ్రవాఙ్మయానికి చక్రవర్తి తిక్కనసోమయాజి గదా? అట్టి తిక్కయజ్వ ఉత్తరరామాయణంలో "సారకవితాభిరాము గుంటూరు విభుని మంత్రి భాస్కరు మత్పితామహుని దలతు" అన్నాడు. అంతవాడి తాత పాలించిన గుంటూరులోనే యేల సభ జరగకూడదు? అని ఒక నవ నాగరుకుడు అన్నాడు.

"చేసినదానికల్లా అడ్డుచెప్పడవేనా తెలివికి చిహ్నా? బెజవాడలోనో, ఆకాశంమీదో, యెక్కడో ఒక చోట సభ చేస్తూన్నారని సంతోషించరాదా? ఇది చేయకపోతే మీరు చేసేదేమిటి? ఇన్నాళ్ళూ సభ చెయ్యకపోతే మీరేం చేయగలిగారు? అని సమాధానం చెప్పాను.

మోడ్రన్ పిల్లకాయలకు పెద్దలయెడల ప్రపత్తి తక్కువ "మహాజనో యేన గతస్సపంథాః" అని వారి అడుగుల్లో అడుగు వేసి నడవరు – ఎంతటివార్నీ తప్పులు పడతారు. వాళ్ళకు శంకలకు సమాధానం చెప్పడం యెంతటివాడికైనా ఒకప్పుడు కష్టసాధ్యమవుతుంది. మరివక బుద్ధిమంతుడు అన్నాడు. బెజవాడలో సభ చేయడం పద్ధతికాదట. ఏమి అనాలోచితమయిన మాట! కాంస్టిట్యూషన్‌లో విద్వాంసులైన సెక్రటరీలు చేసే పని యేమూలనైనా యిమడక పోతుందా?

"సరేనయ్యా! ఇమిడిందనుకుందాంగాని హటాత్తుగా బెజవాడకు దేకిరించివారు రేపు ఉత్తరధ్రువానికి దేకిరిస్తారు. చెన్నపట్నంలో సభచేస్తే అక్కడ నివసించి ఉన్న మెంబర్లు మీటింగుకు రావడానకు వీలువుంటుంది. అక్కడైన మీటింగులకే కొంత మంది అక్కడివారు రారు. అలాటి స్థితిలో వ్యయప్రయాసముల మీద బెజవాడ మీటింగుకు వెళ్లబోతారా? ఆ చెన్నపట్నంలోనైనా పై జిల్లాల పెద్దమనుష్యులు వచ్చే రోజుల్లో అనగా లెజిస్లేటివ్ కౌన్సిల్ మీటింగు మొదలయిన మీటింగుల కాలమునకు సామీప్యంలో అవకాశంకలుగుతుంది. అదంతామాని తోచినప్పుడు, తోచినచోట, ఆవాయిదాస్తుగా సభలు చేయడమేమిటయ్యా?"

అని ఉపన్యసించాడు ఇంకొక బుద్ధిమంతుడు.

కొంచెం ఆలోచించిన పైబలవత్తరమైన సమాధానం తోచింది. యెందుకు తోచదూ? మాట్లాడ్డానికి పని చెయ్యడానికి చాలాదూరం పదిమంది చేరితే మాటలు మెండవుతాయి పన్లు పాడౌతాయి? కోడొకడు తీస్తే కొమ్మొకడు తీస్తాడు. ఒక డౌనంటే ఒకడు కాదంటాడు. అందులో హిందూదేశానికి పార్లమెంటరీ గవర్నమెంటు యెంతమాత్రం పనికిరాదు. గనుక పనులన్నవి, ఒకరిద్దరి మీదనే జరుగవలసినది. కడం మెంబర్లందరూ హాయిగా పడుకొని నిద్రపోవచ్చును. పనితో వారికేమీ పనిలేదు.

కారణం లేక నేనా అనుకున్నారు? ఆంధ్రమహాజన సభకు అంటకుండా సాహిత్య పరిషత్తులు యెలా కాపాడుకువస్తున్నారో? ఈ జ్ఞానం అప్పుడు నాకు లేక తొలి సంవత్సరం ఆంధ్రసాహిత్య పరిషతు యొక్క సాంవత్సరిక సభ ఆంధ్రమహాజన సభతో పాటు బాపట్లలో జరగవలసిందని, యీ సంవత్సరం విశాఖపట్నంలో జరగవలసిందని నొక్కిచెప్పాను. నా మాటగా నా మిత్రులు విని ఆలా చేసివుంటే ఆంధ్రమహాజన సభలో వుండే నవ దేశాభిమానుల ధోకాకు సాహిత్య పరిషత్తు మూడు ముక్కలయి పోయియుండదా?

ఐతే నిన్నగాక మొన్ననే ఆంధ్రమహాజన సభ కూడినది గదా? ఆ స్థలంలోనే పరిషత్కార్య నిర్వాహక సభ యేలా చేయతలచేరు.

ఫర్వాలేదు. కృష్ణవరదలకి దాని వాసన యావత్తూ కొట్టుకుపోయింది.

# మాటా మంతీ - 4

# వాడుక భాషలు : గ్రామ్యము

అత్తగారూ, కోడలూ విషయమై ఒక సామెత కద్దు. రసావేశం మిక్కటమైతే గద్యలతూగు ఆగక, మాటలు పాటలుగా పరిణమిస్తాయి. గ్రామ్యానికి అలిగి, కసితీరక కొందరు మహాకవులు ఛందోబద్ధంగా తొమ్మిదో అష్టం పారాయణ చేస్తారు. వారికి పై సామెత వర్తిస్తుందేమో అను కుంటాను.

శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారు ఆరు పద్యములనే మహాస్త్రములను గ్రామ్యావలంబ కులైన 'కూళలపై' కృష్ణాపత్రిక ముఖమున ప్రయోగించినారు. ఆనాడు శ్రీరాముల వారి బాణములు శత్రువులను కొట్టి తిరిగి శ్రీరాముల వారి చేతికి వచ్చేవట! యీనాడు శ్రీరాములవారైన సచ్చిదా నందశాస్త్రులుగారి బాణములకు కూడా ఆ ధర్మం పట్టింది. ఒక విశేషంతో, అనగా వెయ్యగానే వెనక్కి తిరుగుతాయి. శత్రువులను ముట్టవు.

ఈ లెంపకొడితే ఆ లెంప చూపమన్నాడు, మహాను భావుడైన యేసు. తన లెంప తానే వాయించుకోవడం అంతకంటే గొప్ప ప్రజ్ఞ కాదు? అంతశ్శత్రువులను అణగ్గొట్టడం అన్నమాట. ఆ పనే సచ్చిదానందశాస్త్రులు గారు చేసినట్టు కానవస్తుంది. వెనకటి కొక మహానుభావుడు "దూర్వాలంటె యేమిటో అనుకొని తిరిగి చచ్చాను, గరిగ్గడ్డిట్రా?" అన్నాడట. గ్రామ్యమంటే యెక్కడో కోస్తాను వుందనుకొని, సచ్చిదానందశాస్త్రులుగారు కత్తులు, కటార్లూ నూరారు. ఆ దూర్వాలన్నవి, వారివే పద్యాలల్లోనే యెటు జూసినా, నవనవలాడుతూ నవ్వుతూ వుండెను. దగ్గిర వస్తువును నరుడు సరకుగొనడు.

నన్నయభట్టు సూత్రములు (అనగా ఆంధ్రశబ్ద చింతామణి) అహోబలీయము, అప్ప కవీ యము మొదలైన గ్రంథములు చదివిగాని, తెనుగు కావ్యములు రాయకూడదని శాస్త్రులు గారి అభిప్రాయము.

ఉ. నన్నయభట్టు సూత్రముల నాలుకచే బలుకంగమానియే
యెన్న నహోబలీయమును నించుకనైనను చేతముట్టకే
కన్నుల చేతనైన నిఁక గాంచక నప్పకవీయమాదియౌ
వన్నెలుగల్గు గ్రంథముల వ్రాయగవచ్చును గావ్య జాలమున్

లక్షణ గ్రంథముల పేరెత్తిన పద్యంలోనైనా, శాస్త్రులు గారు లక్షణం ఇంచుక పాటించినారు కారు. కడం పద్యములు దీనిని మీరివున్నవి. ఒక జాతి గ్రామ్యమైనా తప్పిపోకుండా వెతికి వెతికి పట్టితెచ్చి, వాటిని ఛందో బద్ధంగా బంధించి శాస్త్రులుగారు తమ పద్యాలను గొప్ప "గ్రామ్య ప్రదర్శనాగారము"గా చేసినారు. అందుచేతనే కాబోలును గ్రామ్యపద ప్రయోగమనే శీర్షిక నెత్తిరి.

పద్యాలంతటనూ చీకటి రాత్రిలో చుక్కలవలే గ్రామ్యములు మెరుగుతుండగా, కృష్ణా పత్రిక కానకపోవడం ఆశ్చర్యం. ఆ పద్యాలను మెచ్చి, యెత్తి అచ్చొత్తిన శశిలేఖ కానకపోయిన కానక పోవునుగాక!

ఆశ్చర్యమేలా? ప్రాచీనుల తెనుగు లక్షణం, కోరి చదివే మనుషులు కొంచం. చదివి తెలుసుకున్న వారు మరికొంచెం. వొంటబట్టిన వాళ్ళు మిక్కిలీ కొంచం. వొంటబట్టిన పండితుల క్కూడా కలం చేతపడితే దూడలు దొర్లుతాయి. బ్రహ్మశ్రీ వేదం వెంకటరాయశాస్త్రిగారు, మహా మహోపాధ్యాయ బిరుదాంకితులైన శ్రీ కొక్కొండ వెంకటరత్నంపంతులుగారి ప్రసన్న రాఘవమును విమర్శించి, విమర్శించి, మహా మహోపాధ్యాయులవారికి లక్షణజ్ఞానం యించుమించు పూజ్యమని సిద్ధాంతీకరించారు. ప్రమాణం చూపనిదీ శాస్త్రులుగారు మాటాడరు. అవతారికను యీ మాట లతో ఉపక్రమించారు.

"ఈ కాలములో ఆంధ్రభాషలో ప్రబంధములు పెచ్చు పెరుఁగుచున్నవి కదా. వానిలో అనేకముల వలన భాష కడుం జెట్టకలుగుచుంటం గాంచి, ఏదేనొక గ్రంథ మాధారముగా నీ చెరుపు నెల్ల విద్యార్థిజనోపయోగముకై భాషారక్షకై వెల్లడి సేయ దలంపుగొన్నవాడనై..."

మహా గజాః పలాయంతే మశకానాంతు కాకథా? ఇన్ని లక్షణ గ్రంథాలు చదివి రెండు వార్తా పత్రికల వల్ల మెప్పుగొన్న సచ్చిదానందశాస్త్రులుగారికే నాలుగు పద్యాల్లో నలభై చోట్ల కాలుజారినప్పుడు, యిక పసిపిల్లల గతి యేమిటి? యీ లక్షణమును స్కూలు పిల్లలు నేర్చగల రనుట వెఱ్ఱి భ్రమ కాదా? నేర్చమనడం ఉట్టి గట్టుకొని స్వర్గానికి యెగరమనడం కాదా?

ఓం ప్రథమం అని పల్లె కూటముల అయ్యవార్లకి లక్షణం పొంతే తెలియదు. యీ స్కూళ్ళల్లో తెనుగు మేష్టర్లకు వచ్చీ రావడం. ఇంగ్లీషు మేష్టర్లకు రానే రాదు. కాలేజీ పండితుల మాట మనం యేమీ చెప్పడానికి తగం. గాని మనకి శ్రమ లేకుండా, వారిలో వారే "వీరికి లక్షణం తెలియదని" వారూ, "వారికి లక్షణం తెలియదని వీరూ" తీర్పులు రాసి అచ్చువేసి వుంచారు.

మా చిన్నతనంలో శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులు గారు ప్రెసిడెన్సీ కాలేజీలో పండితులుగా వుండి ఆంధ్ర భాషా సంజీవని అనే పత్రికను ప్రచురించే వారు. రాజమహేంద్ర వరంలో వుండి శ్రీ వీరేశలింగం పంతులు గారు వివేకవర్ధనిని ప్రచురించేవారు. కొంత కాలానికి

వీరున్నూ, కాలేజీ పండితులైనారు. ఇద్దరూ ఆరితీరిన గ్రంథకర్తలు. యూనివర్శిటీకి పరీక్షకులు. వారిని మెచ్చి గవర్నమెంటువారు మహా మహోపాధ్యాయులను చేసిరి. వీరిని మెచ్చి రాయ్ బహద్దరులను చేసిరి. ఆనాడు తెనుగు భాషలకు వీరిరువురును పట్టభద్రులై యుండేవారు. గాని వీరికి లక్షణం రాదని వారూ, వారికి లక్షణం రాదని వీరూ గజకచ్ఛపముల వలె పోరాడేవారు. ఇదే, దేవాసుర యుద్ధం అనుకునేవాళ్ళం.

వారు విరమించి చాలాకాలమైంది. గాని యే ముహూర్తాన్న పోరు తలపెట్టిరో గాని, ఆ యుద్ధ రంగం మట్టుకు యెన్నడూ చల్లారలేదు. కవులు లావైనారు. కాట్లాటలు లావైనాయి. History is repeating it self. చరిత్ర పునరావృత్తమవుతున్నది. నలుదిక్కులా జయభేరీలు మోగుతున్నాయి. యేమని? బిరుదులు గట్టిన పండిత కవులకు తెలుగు లక్షణం రాదు, రాదు, రాదని.

పదాతుల మాటా, మూటలు మోసే వాళ్ళమాటా చెప్పేదేవింటి?

సంస్కర్తల ఉద్యమముల మూలంగా తెనుగు లక్షణం మట్టిగలిసి పోతున్నదని యెలుగెత్తే మహానుభావులలో లక్షణం బాగా తెలియని వాళ్ళూ, లక్షణానుసారంగా రాయలేని వాళ్ళే మెండు. ఒక తోవా, తెన్నూ లేకుండా, యెవడికి తోచిన రీతిని వాడు తెనుగు లక్షణం అడుగడుగునా పడగొడుతూ, గొప్ప కోసం సంస్కృతం మాటలు ప్రయోగించి, కృత్తద్ధితల రూపుమాపి, లింగ వ్యత్యయము చేసి, శబ్దౌచిత్యమును చెడగొట్టి, లోకంలో యెన్నడూ, యే దేశం యెరగని దౌర్భాగ్యపు భాషను రాస్తూ అది తలుచుకు ఆనందిస్తున్నారు. మనుషులకు బుద్ధులు లేవా? కళ్లు లేవా? ఇన్ని విధాల గ్రాంథిక భాష తగలబడుతూ వుంటే, ఈ ఉపద్రవమును తొలగించ ప్రయత్నించక, వాడుక భాష రాసినందువల్ల యేమో తెనుగుకు చేటు వచ్చునని వగలబొగులుతారేమి? మనలో నాగరికులు వాడుకునే భాషా, ఉత్తరాల్లో రాసుకొనే భాషా చెడ్డదా? యీ మహనీయులు రాసే భాష మంచిదా? అయితే లక్షణము పట్టుబడని వారు గ్రాంథిక భాషను యేల రాయబూనుతారు? మీది మిక్కిలి పద్య రచన యేల తలపెడతారు? అని అడగలరు. సచ్చిదానంద శాస్త్రిగారి పద్యములు కొంచెం పరీక్షిస్తే ఈ శంకలకు సమాధానం తేలవచ్చును.

★★★

ప్రతిభ భగవంతుడు యివ్వాలి. కావ్య గుణాలు, పూనినేర్చి, విసగక రాసి, మంచి కావ్యములు యెడతెగక చదివి సాధించవలె. అట్టి శ్రమకోరని సులభ సాధ్యములు రెండు మూడున్నాయి. ఛందస్సు వొకటి. గణాలు సరిపెడితే ఒక మోస్తరు లయ కుదురుతుంది. కడంవి నిఘంటువుల్లో మాటలూ, వ్యాకరణాల్లో ప్రత్యయాలూను. ఇవి వాడుక భాషలో లేకపోవడంచేత ఒక విలక్షణ ధ్వనిని కొలుపుతాయి. అంతటితో ఆనందించే వారు అనేకులు. గంగిరెద్దుమీద గుడ్డపాతలవలె యివి లోపల పసను కమ్ముతవి.

రసం ఆట్టే లేని తలపులకు గద్య రచన తగి వుంటుంది. రసం చాలని చోట పద్యరచన విరసం. అందుకు తోడు తలపులు తక్కువైతే వృత్తాలు నిండడం కోసం గంగిరెద్దు గుడ్డలు మెట్లుగా పడవలె. ఆ గుడ్డలనైనా అందంగా అమర్చడం చేతకాకుంటే మాటలు మాసి, అన్వయం చెడి, పద్యాలు టొంకర నడకలు నడిచి కవిత్వం కపిత్వం అవుతుంది.

పెద్ద కవులకే పొల్లు మాటలు లేకుండా వొదగని చంపక మాలలకు, ఉత్పలమాలలకూ తలపడితే అంత్య గురువు లభించుటకు గాను, ఏకాక్షర శబ్దాలు అతకవలసి వస్తుంది. యతి ప్రాసలకోసం నిరర్థక పదములను ఫర్లాంగు రాళ్ళ వలె నిలవెయ్యాలి. కౌపీన సంరక్షణార్థ మయం పటాటోపః!"

★★★

రెండో పద్యంలో నియమ శబ్దం ప్రాసకోసం రెండుమార్లు వెలసింది. మూడో పద్యంలో ప్రాసస్థానమందు "1. భువిని, 2. కవులు, 3. అవనిని, 4. కవివరులు" అమిరాయి.

వృత్తం తలపెట్టేటప్పటికల్లా భూ దేవత శ్రీరాములు వారికి తోడై సాగిస్తుంది. యుక్తమే కదా!

మొదటి పద్యంలో 'ఇల'

రెండవ పద్యంలో 'ఉర్విలోన'

మూడో పద్యంలో 'భువిని' 'అవనిని,' అని జమిలినవి. ఆరోపద్యంలో "ఉర్విలో"

"సుండు" "సుమీ" కూడా దగ్గిర సీస చరణాల్లో తగిలాయి. మొదటి పద్యంలో గ్రామ్యా వలంబకులు 'కొందరు' అయి, మూడో పద్యంలో 'అందరు' అయినారు. అందులో శాస్త్రులుగారు కలిసిరో లేదో?

"కాలము చేయు చిత్రమొకొ" అని మొదటి పద్యం ఎత్తుబడి చేసిన్ని, మళ్ళీ యేమి చిత్రమో, అంటేనే గాని పద్యం ముగిసింది కాదు. "నింద్యమంచు" అనే దానిని కమ్మెచ్చున సాగదీసి, నింద్య మటంచని, యీడిస్తేనేగాని, గణాలు సరిపోయినవి కావు. మచ్చులు చూపాను. ఆరుమాటల్లో చెప్పవలసిన భావం, ఆరు పద్యాల్లో చెబితే వొచ్చే అనర్థకాలన్నీ యెవడితరం చెప్పడానికి? "అమలిన తారకాసముదయంబుల నెన్నను .... విధాతృనకైనను నేరcబోలునే?"

ఇక ఆంధ్ర శబ్ద చింతామణి, అహోబలీయము, అప్పకవీయము మొదలైన లక్షణ గ్రంథములలోని నియమములను, పటుక్కుమని త్రెంచినచోట్లు కొన్ని చూపుతాను.

1. అరసున్న వుండవలసిన చోట లేకపోవడం (అ) ఎక్కుడు బొందగోరి (ఆ) తెల్గు జేర్పగా (ఇ) ఇలగోరుచు (ఈ) అబ్రమౌగదా.

2. అరసున్న వుండగూడని చోట వుండుట : (అ) జీవమున్ఁ జయముగ (ఆ) తిప్పలుఁ దెచ్చిపెట్టి (ఇ) వ్రాయగఁవచ్చు (ఈ) ఓఁ కవివరులార

3. స్థిరానకు ముందు పూర్ణానుస్వారం కావ్యములందున

4. సరళాదేశం చెయ్యవలసిన చోట మానడం : (అ) చాల ప్రయాస (ఆ) ఐయినను చేత

5. సరాళాదేశం చెయ్యరాని చోట చెయ్యడం : (అ) మన దెల్గు (ఆ) ఆంధ్రము బాడుసేయ.

6. ద్రుతముపై గసడవాదేశము : (అ) వలయుంసుడు (ఆ) వలెసుమీ

7. కళలను ద్రుతాంతములుగా వాడడం:(అ) కాంచక నప్పకవీయ మాదియౌ

(ఆ) ఇంచుకనైనను.

8. కక్కూర్తి ప్రయోగాలు, అపశబ్దాలు : (అ) మున్ (ఆ) వద్దు (ఇ) విప్పలు (ఈ) చదువుకోవలెను (ఉ) కష్టముగూడను (ఊ) మొండి వివాదలేల యని మూర్ఖులతోడుత నంచు (ఋ) ప్రయాస.

కొసకు శ్రీరాముల సచ్చిదానందశాస్త్రులుగారు నిజం చెప్పేశారు ఇదుగో : దండిగ గ్రామ్య శబ్దముల దార్చుచు నాంధ్రము బాడుసేయఁగా జండతపూనకున్నని(కఁజయ్యన దెళ్ళును భాషయుర్విలో".

"ఆంధ్రము పాడుసేయగా" శాస్త్రులుగారు చండతపూనారు. కడంవారిని పూనమన్నారు. గాని ఆ హెచ్చరిక అనవసరం.

# మాటా - మంతీ - 5
# యిద్దరు రాజులు

రారాజు బంగాళాకువచ్చి, చేసిన చనువూ, చూపిన నెనరు కాంచితిని. కంటిని పట్నంపల్లె విరగబడి, ప్రేమార్ద్రములైన చూపుటరులతో రేని నించి పూజించడు. వారీవీరి సరాగం పొలయల్క తీరిన ఆలుమగల కలయికను పోలినది.

మన ఆంగ్లేయుల రాజు, ఒక చిన్న కరణం మొదలు వైసరాయి వరకూ, అధికారములకు చిన్నె. ఊరినాయుడు మొదలు మేటు తీర్పరి వరకూ, పద్ధతికి చిన్నె. ప్రజలను పీడిస్తూ, కాపాడే కనిష్టేబు మొదలు దండిదండ నాయకుడి వరకూ, మగటిమికి, చిన్నెగాని యీనాడు జాజిన్ ప్రభువు, మనపాటి మీద చిన్నెలుదాల్చి, దయాధర్మముల అవతారమై నిలిచాడు. బంగాళా విరాళికొనడము ఆశ్చర్యమా?

**ఇది వొక రాజు కథ :** కవి రాజైన రవీంద్రునికి బంగాళా చూపిన మిక్కుటపు పేరూ, పొరలేని భక్తీ, యేనాడేరాజెరుగును? ఆ మహాకవి భాషను యెత్తాడు. తలపుల నెత్తాడు. చెయ్యులనెత్తాడు. కీర్తి వెన్నెలల దిక్కులు నింపాడు. అది తనకీర్తి అని వంగదేశము గుర్తెరిగినది. అతడు తన సిరియని గర్వించినది. దేవుఁడని పూజించినది.

చిత్పూర్ రోడ్డులో చిన్న సందొకటి మళ్ళితే యెదుట పొయిపొక్కిళ్ళవలె మూడు మేడలు కనపడతవి. అందులో మధ్యది, కలకాలమూ దేశ చరిత్రములో వన్నెకెక్కి వుండగలదు. అది రవీంద్రునిది.

బ్రహ్మసమాజ మహోత్సవం రోజున, చీకట్లు కమ్మేవేళపుడు నేను వెళ్ళాను. గుమ్మం దాటితే బ్రహ్మాండమైన అంగణం. ఆ అంగణం చుట్టూ ఉన్నతమైన యెత్తిటికల మేడ. మేడల చూర్లంట మెరుపు దీపాలు వెలుగుతుండినవి. అంగణమంతా సామాజికులతో నిండివుండెను. చూడబోయిన మా బోట్లమూ, టాగూరు కుటుంబమువారూ, దక్షిణపు ప్రక్క మేడమీద నిలుచుంటిమి. మా కెదురుగా సారసను నాదుల పూజా భవనం వుండినది. లోపల దీపములు లేమిని, వెలుగు చీకట్లు పెనుగులాడుతున్న ఆ పూజా మందిరములో బ్రాహ్మ సుందరులు ఆకులలో పండ్లవలెనూ, చదువు చీకట్లమరుగున ముక్తి కాంతవలెనూ, కనీ కానరాక వుండిరి.

అంగణంలో దక్షిణం వేపు సామాజికులకు యెదురుగా వొక మంటపం యేర్పరిచారు. ఆ మంటపం మీద ముందుకు రెండు యెల్జిగాజు దీపపుచెట్ల నడుమను రవీంద్రుడూ, వొక పండితుడూ, ధోవతి అంగ వస్త్రములతో కూచున్నారు. వారి యిరుప్రక్కలనూ, వెనకకూ సామాజికులలో పేరుపడ్డ వారూ, గాయకులూ కూచున్నారు. వారిలో పండిత శివనాథశాస్త్రిగారినీ, హేరంబచంద్రమిత్రగారినీ పోల్చగలిగితిని.

నేను వెళ్ళేసరికి రవీంద్రులు మేఘ గర్జనమును పోలిన కంఠంతో భగవంతుణ్ణి కొని యాడుతుండెను. సామాజికులకు జ్ఞానోపదేశము చేస్తుండెను. మధ్య మధ్యను రవీంద్రుడూ, గాయకులూ భక్తి పారవశ్యం పుట్టేటట్టు కీర్తనలను పాడుతూ వచ్చిరి.

అప్పుడప్పుడు మెరుపు దీపాలు గప్పుగప్పున ఆరి వెలుగుతూ వచ్చినవి. అలా ఆరినప్పుడు భవనం మీద రాలిన చీకటియొక్క రెక్కలమీద భగవంతుడు సన్నిహితుడయినట్టు మనస్సుకు తోచేది. కాదా? చీకటే వెలుతురు. మరుపే జ్ఞానము.

చిన్ననాటి మాట యేమో, యిప్పుడు రవీంద్రుడుత్కృష్టమైన బతుకు బతుకుతున్నాడు. శాంతుడు, భక్తుడు, దయాపరుడు, పరోపకారమే బతుకునకు వినియోగమని నమ్మినవాడు, మంచివాడు. ఇట్టి మహాత్ములు వుండబట్టే బంగాళా బాగై వన్నెకెక్కింది.

బ్రహ్మమతం బంగాళాకు చాలా మేలు చేసింది. కొందరికైనా స్త్రీలకు చెరవొదల్చింది. బంగాళాకూ, సీమకూ బాట వేసింది. ఆ సుందరులు దీపమువలే దేశమునకు వెలుతురు నిస్తున్నారు. ఆ బాటను సీమనుండి నాగరికత ఆ దేశానకు దిగబడ్డది.

రవీంద్రుని వాఙ్మాధుర్యంను క్రోలి క్రోలి, ఉత్సవం ముగిసే వరకు వుంటే, తొడిదొక్కిడి లావగునని యెంచి, నా మిత్రులను వీడ్కొని చిత్పూరు రోడ్డుకు వచ్చితిని. అక్కడ అంతకంటే తొడిదొక్కిడి కానవచ్చింది. ఆ రోజు మాఘ పంచమి. బంగాళీలు సరస్వతీ పూజ చేస్తారు. రాత్రి ఉత్సవంలో సరస్వతీ ప్రతిమల్ని ఊరేగిస్తారు. ఆ పట్నంలో సామంతులు యిసకపాతర. ప్రతి సామంతుడూ తన యింట సరస్వతిని నిలిపి వూరేగిస్తాడు. ముచ్చిపనితో ధగధగలాడే వాహనాల తోటి, రథాల తోటి జన ప్రవాహం ఆ వీధిలో అడ్డు కలిగిన నీటి ప్రవాహం వలె పొంగి వెనకాడుతూ, కొంత సాగుతూ యెడతెగక కనబడినది.

ఉపాధికల ప్రతి బంగాళీ యింట్లోనూ, మొదటి అంగణంలో రమ్యమైన పూజామందిరం వుంటుంది. కాళీ, సరస్వతీ మొదలైన దేవతల వుత్సవములు ఆ మందిరంలో విశేషమైన వైభవంతో చేస్తారు. ఆ పూజలు ఆబాల వృద్ధులకు, స్త్రీ, పురుషులకు యింటిలిపాదికీ పనులు కల్పిస్తవి. మందిరమును అలంకరించడం, పూజా ద్రవ్యములను సమకూర్చడం స్త్రీ బాలుల వేడుక. యీ రీతిని యింటిలిపాదీ కలిసి చేసే పూజలు మనదేశంలో తక్కువ. నలుగురికీ

వినబడే దేవతార్చనగంట వొక్కటే కొన్ని యిళ్ళలో మిగిలింది. అదైనా దేవుణ్ణి జ్ఞాపకం చెయ్యదు. భోజనపు గంట అయింది. మిగిలిన యిళ్ళలో ఆ గంట మేజాబల్ల మీద యెక్కింది.

1912వ సంవత్సరం, డిసెంబరు నెల, రెండవ తేదీని కలకత్తాలో రవీంద్రుణ్ణి చూశాను. ఆయన ఒక పెద్ద టేబిల్ ముందు కూర్చునివున్నారు. గది అలంకరణతో, వస్తు సామాగ్రితో ఏమంత తీర్చిదిద్దినట్టు లేదు. భవంతి మొదటి అంతస్తులో పశ్చిమదిశగా వుంది ఆయన గది. రవీంద్రుడి కుడి భాగాన యువకుడొకడు ఆసీనుడయి వున్నాడు.

టాగూరు సాధుస్వభావి. మాటపొందిక మహా మెత్తన. నాజూకైన ముఖలక్షణాలు. తేటగా, సున్నితంగా నవ్వుతారు. మాటలాడేటపుడు పురుషత్వం తొణికిసలాడుతుంది. ఒక విధమైన ప్రశాంత, మనోనిశ్చయం ప్రస్ఫుటమౌతుంది. మన వీరేశలింగం పంతులుగారి మనః ప్రవృత్తికిది పూర్తిగా విరుద్ధం. ఆయన వలె, రవీంద్రుడు గడబిడగా మాట్లాడరు. సంభాషిస్తున్నప్పుడు సజీవత్వం వెల్లడి అవుతుంది. అయితే, ఆయన ప్రార్థన చేస్తున్నప్పుడు, ప్రవచిస్తున్నప్పుడు కంఠం సంగీత శ్రావ్యంగా వుంటుంది. వినసొంపైన గొంతుక. రవీంద్రునిది.

బెంగాల్‌లో నాటక రచన నీరసావస్థలో వుందని ఆయన అభిప్రాయం. షేక్స్పియర్‌నో, లేదా మరొక ప్రఖ్యాత ఆంగ్ల నాటక రచయితనో, వంగదేశ కవులు అనుసరిస్తున్నారని చెప్పలేం; కొంతమంది రచయితలు మాత్రం పాశ్చాత్య సాహితీపరులతో సంపర్కం పెట్టుకుంటున్నారు. కాని వారి రచనా ప్రభావం, వీరి నాటకాలను సోకడం లేదు. రంగభూమి శిధిలావస్థలో వుంది. ప్రేక్షకులను ఆకర్షించడానికై యధేచ్ఛగా పాటలను, పదాలను నాటకాలలో తెచ్చి పెడుతున్నారు. మొదట ఈ నాటకాలు చారిత్రక యితివృత్తజనితాలు. వీటిలో చాలా మటుకు రాజపుత్ర కథలతో నిండినవే. ఇప్పు డిప్పుడు పౌరాణిక గాధలలోనికి దిగజారిపోయాయి.

గేయకవిత్వంలో బెంగాల్ ముందంజ వేసింది. రవీంద్రుడు వాడేభాష వ్యవహారికమే. అంటే అందరూ మాట్లాడుకొనే భాష. ప్రామాణిక గ్రంథప్రయోగాలకు విరుద్ధమైన భాష. వ్యాకరణ సూత్రాలు కాదంటూ ఈ రకమైన బెంగాలీ భాషను ప్రయోగిస్తాడని ఆయనను పండితులు నిందిస్తారు.

ఇప్పుడు మద్రాసు యూనివర్సిటీ గ్రాంథిక భాషను సంరక్షించాలని చేస్తున్న ప్రయత్నమే, నాడు కలకత్తా విశ్వ విద్యాలయమూ చేసింది.

కలకత్తాలో జనులు మాట్లాడుకునే భాషలో తప్పిస్తే, ఇంకొక భాషలో మనకు వ్యాకరణ గ్రంథం ఎక్కడ లభిస్తుంది?

"తెడకొరి తెచ్చె" అనే పద ప్రయోగము మీద రవీంద్రునికీ, నాకూ సంభాషణ జరిగింది. ఆయన కొద్దిసేపాలోచించి, పూర్వకవుల ప్రయోగాలలో వుందని చెప్పారు. "తె" అనేది జానపదుల భాషలో కనిపిస్తున్నదని నేను సూచించాను.

ఆంగ్ల సారస్వత బోధనా పద్ధతులు చాలా లోపభూయిష్టంగా వున్నాయని వారి అభిప్రాయం. ఆంగ్ల సాహిత్యంపై హెన్రీ మోర్లే యిచ్చిన ఉపన్యాసాలను, రవీంద్రుడు ఎంతో ఆహ్లాదంతో విన్నారు. విద్యార్థులకు పరీక్షలు చాలా ఆవశ్యకాలని వారి మతం.

సిస్టర్ నివేదిత ఆయన కథలను కొన్నింటిని అనువదించింది, కాని ఆమె చనిపోయిన తరువాత, ఆ వ్రాత ప్రతులు కనిపించలేదు.

'మైకేల్'ను రవీంద్రుడు అనుసరించారు. ఆయన గీతంలోని పాదాలు ఏ పాదానికాపాదం అంతం కావు. ప్రయోగాలనూ, వ్యాకరణ నియమాలనూ, కాలదన్ని సరికొత్త శబ్దరూపాలను కల్పించినా, ఆయన సృష్టించిన 'శబ్దాలు' చలామణిలోకి రాలేదు. అందుచేత మన వెనకాల ఒక టిప్పణి వుంటే కాని, కావ్యం అర్థం కాదు. భాష బలి అయిపోతున్నా సరే, ఆయన "మైకేల్" అనే కావ్యం శబ్దాలంకారాలనే దృష్టిలోపెట్టుకుంది. ఈ విషయాన్ని నేను రవీంద్రునికి సూచించాను.

రవీంద్రునికొక పాఠశాల వుంది. ఆ స్కూలులో తనకు తానై సహాయం చేసుకోవడ మెలాగో చెబుతూ, ఆయన ఉపజ్ఞావంతమైన విద్యను ప్రసాదిస్తూ వుంటారు. మెట్రిక్యులేషను, విశ్వవిద్యాలయ పరీక్షలకు కూర్చునే విద్యార్థులు ఎన్నెన్నో విషయాలను అధ్యయనం చేయవలసి వుంటుంది.

తన ప్రక్కనే కూర్చున్న యువకుణ్ని "కావ్యభాష"పై ఒక వ్యాసం వ్రాయమని రవీంద్రుడు ఆదేశించారు.

అరుణాస్పదమనే నగరాన్ని వర్ణిస్తూ పెద్దనగారు "అచటబుట్టిన చిగురు గొమ్మైనఁజేవ" అన్నారు. అదే విధంగా కలకత్తా పట్టణంలో చిట్టచివరకి దోమలుసైతం పొలిటీషియన్సే!

# కవిత్వము : వర్డ్సు వర్తు

వర్డ్సు వర్తు కవిత్వమునకును, అంతకు పూర్వము కవిత్వము వ్రాసిన ఇంగ్లీషు కవీశ్వరుల కవిత్వమున కును చాల భేదము కలదు. అతనికి ముందు పదునెనిమిదవ శతాబ్దమున నుండిన కవులు రెండు నిశ్చయములు చేసికొనియుండిరి. అవి యెవ్వియనిన (1) కావ్యమున నుపయోగించు మాటలు (Poetic Diction) నాజూకు గను లలితముగను నుండవలయు ననియు (2) కవిత్వమున వర్ణించతగిన వస్తువులు (Subjects) కూడ సామాన్యమైనవి కాక నాజూకు గాను, లలితముగాను, గొప్పవిగాను నుండవలయుననియు.

మనలో కూడా కావ్యములు లోకములో వాడుకలో లేని గ్రాంథిక భాషలోనే వ్రాయవల యునని లక్షణములు వ్రాసిన కవుల నిర్ణయము.

అటుల గాక, సామాన్యమగు వస్తువులను గూర్చి, వాడుకలో నుండు మాటలలో కవిత్వము చెప్పి కవితా సామర్థ్యము వలన వానికి సొంపు తెచ్చి చదువరుల మనసుల రంజింప చేయ వచ్చునని వర్డ్సువర్తుని అభిప్రాయము. అట్లని నాజూకు మాటలనతడు ఉపయోగించక పోలేదు. నాజూకగు సంగతుల గూర్చి కావ్యములు వ్రాయకపోలేదు. ఇతని కాలము నుండి ఇంగ్లీషు కవిత్వము తోవయే మారి మిక్కిలి గొప్ప స్థితికి వచ్చినది.

మన దేశపు కవులు కావ్యములలో వర్ణించు పాత్రములు, దేవతలు, దేవతా స్త్రీలు, రాజులు, రాజకుమారికలు, పెద్ద యింటి పురుషులు, స్త్రీలు, వీరి చర్యలు అవస్థలనే వర్ణింతురు. అందులో కథానాయకులకు (Heroes of the poem) లోకములో కానరాని గుణ సంపత్తి, పరాక్రమాదులు, సౌందర్యమును ఆరోపింతురు. తక్కువ జాతి వారిని గూర్చి వర్ణించి వ్రాయరు. కవిత్వమున వ్రాయతగిన చర్యలు అట్టి తక్కువ మనుష్యుల బ్రతుకులలో నుండనేరవని మన దేశపు కవుల అభిప్రాయము. వర్డ్సువర్తుకు పూర్వపు కవుల అభిప్రాయము కూడా కొంతవరకట్టిదియే.

ఆధునిక కవులు అటుగాక మనుష్యుల సుఖ దుఃఖములు అన్నియును వొక్కలాటి వేయనియు, మనిషి అయివుండుటలో వకని తక్కువ, వకని హెచ్చు లేదనియు, సుగుణములు, సత్ప్రవర్తన గొప్ప అవస్థలో నుండువారికిని, తక్కువ అవస్థలో నుండు వారికి సామాన్యములనియు, కావ్యములను రసవంతము చేయుటకు రాజుల, రెడ్ల, బ్రాహ్మణుల చర్యల వర్ణన యెటుల తగియున్నదో, రయితుల యొక్కయు, తక్కువ జాతుల వారి చర్యలు కూడా నటులనే

తగియున్నవనియు నభిప్రాయపడి, యింపయిన కావ్యములు తక్కువ స్థితిలో నుండు మనుజుల సుఖ దుఃఖముల గూర్చి వ్రాసిరి. వర్డ్సువర్తు అందుచేతనే ఒక గొల్లవాడి బ్రతుకును గూర్చి కావ్యము వ్రాసెను.

మన పండితులీ కావ్యమును జూచినచో "ఇదియా కావ్యము; ఒక గొల్లవాడు కొండలవెంట దిరిగెనట. వాని కుమారుడు చెడు తిరుగులు తిరిగి దేశాంతరగతుడాయెనట. తండ్రి మందకు పాకకట్ట నారంభించి దుఃఖముచే గాంచలేకపోయెనట. ఇదియా కావ్యమునకు తగిన కథ?" అని నవ్వుదురు?

పుట్టుకవల్ల గొప్ప రానేరదు. గుణయోగ్యతల వలననే గొప్ప వచ్చును. పెద్ద యవస్థలో నుండు దుర్జనుని కన్న తక్కువ స్థితిలో నుండు సజ్జనుడు నిజమైన గొప్పవాడు కాడా? టెన్నిసన్ అనెను :

"Kind hearts are better
Than coronets and served
Faith than Norman blood"

పెద్ద ప్రభువులై యుండుట కంటే దయగల హృదయము కలిగియుండుటే శ్రేష్టము. రాజరక్తము కన్న నమ్మిన నీతియే శ్రేష్టము. బర్న్సు కవియనెను :

"Rank is but the guinea stamp
The man is the gold for all this"

లోకములో యెక్కువ అవస్థ అనునది తెచ్చిపెట్టు కున్నది. నాణెముపై ముద్దర వంటిది. మనిషే బంగారము. అనగా గుణయోగ్యతలను బట్టి మనిషికి విలువ కలుగును. గాని ఉద్యోగము వలన, ధనధాన్యముల వలన పెద్దింట పుట్టుట వలన కలుగనేరదు. మైకేల్ అను గొల్లపిల్లవాడు అట్టి బంగారము. గుణ సంపదచే ఎన్నికైన మనుష్యుడు.

# వంగీయ సాహిత్య పరిషత్తు

నారాయణమూర్తి పంతులు, నేను జస్టిస్ ఆశుతోష ముకర్జీగారిని చూడవెళ్ళాం. కొంత ప్రసంగమైన తరువాత "మీలో గొప్ప విద్వాంసులను చూడవలెనని నాకు అభిలాష కలదని" నేనన్నాను. సాహిత్య పరిషత్తులో కొందరు ప్రముఖుల్ని మమ్మును కలుసుకోవడనుకు సమావేశం చెయ్యమని, వారు దాస్‌గుప్తాగారితో శలవిచ్చారు. దాస్‌గుప్తాగారు వకీలు, బంకించంద్రుడి 'ఆనందమఠ్' యింగ్లీషు చేశారు.

అయిదుగంటలకు సాహిత్యపరిషత్తుకు రమ్మని మాకు ఆహ్వానపత్రిక వచ్చింది. మేం వెళ్ళాం.

సాహిత్యపరిషత్తు మందిరం అప్పర్ సర్క్యులర్ రోడ్డులో జైనమందిరానికి సమీపంగా వున్నది. అది ఒక పెద్దమేడ. కట్టడానికి నలభై యాభై వేలు అయివుండును. గుమ్మం దాటగానే కీర్తిశేషులయిన కాసింబజారు మహారాజావారి ప్రతిమ నేత్రోత్సవం చేసింది. ఆయన స్ఫురద్రూపి. శ్రీ పిఠాపురం రాజావారి వంటి విద్యాభిమానులు. పరిషత్తుకు చాలా ద్రవ్య సహాయం చేసి వుండిరి.

అప్పట్లో మేడ రెండో అంతస్తులో పరిషత్తుతో సంబంధించిన యగ్జిబిషను అనగా వింతలయి నట్టి గొప్పవైనట్టి వస్తువులను చూపుట జరుగుతుండెను. మేడకు దక్షిణంవేపు అరలా వొకటి వున్నది. ఆ అర సభలైనప్పుడు, నాటకములు ఆడడానకూ, ఉపన్యాసము లిచ్చుటకూ, ఉపకరించును. ఆ అరలో యెదురుగుండా బంకించంద్రుడి పూర్ణచిత్రము కద్దు. బకించంద్రుడు వంగభాషా కావ్య ప్రపంచమునకు బ్రహ్మ అనిన్ని, చంద్రుడు సాటిలేని కవి అనిన్ని ఆ దేశంలో పండిత పామరుల నమ్మకం. ఈయన ముఖాన శాంతమూ స్థైర్యమూ కనబడతవి.

బంగాళీలలో అనగా నాగరికులలో రెండు రకముల మనుషులను కనిపెట్టాను, గుండ్రని ముఖం, స్థూలకాయం వకటి. ఒంటిపేక కోలముఖం మరివకటి. చిన్నతనంలో బంగాళీపిల్లలు చాలా సుందరులుగా వుంటారు; చిక్కితే (గిల్లితే) పాలుగారు చెక్కులు; విశాల నేత్రములూ తరుచు.

బంకిం కొంచము వొలంగా వుంటాడు. ఆయన పఠానకు యెడంవేపు భారతమును బంగాళీ గద్యంగా రాసిన ఒక కవిపఠం వున్నది. దానికి యెడంవేపు మైకేల్ మధుసూదన్‌దత్తు,

అలలు తీరిన కత్తిరీజుత్తు పాపిట దువ్వి తా రచించిన “మేఘనాథబన్ధ” అను మహా కావ్యమును చేతబూని తన విశాల నేత్రములతో చూచెడి వారివేపు చూస్తూ పఠంలో కూచున్నాడు. బంగాళా కవుల పటములు బౌవుబజారు యిండియన్ ఆర్టు స్టూడియోలో అణాపరక (అణన్నర) కొకొక్కటి అమ్ముతవి. మధుసూదనుడి పెదవులలో చిన్న నవ్వొకటి దాగి ఉంది. ఈయన నాతో మాట్లాడు తూన్నట్టే కనిపిస్తాడు. ఆనాటి యింగిలీషు బారిష్టరులు వీరివిద్యకు జంకేవారని ‘రీస్ అండ్ రయ్యత్’ పత్రిక సంపాదకులు బాబూ జోగీశ చంద్రదత్తుగారు నాతో చెప్పినారు. గ్రీకు, లాటిన్లు సంస్కృత భాషను, ఫ్రెంచి, జర్మను, ఇవియే కాక తెలుగు, అఱవమును మైఖేలు నేర్చియుండిరట.

చదువుకునే రోజుల్లోనే వివాహము చేతునని తండ్రి సంకల్పించగా అందుకు అంగీకరించక కిరస్తానం అవలంబించి 1848వ సంవత్సరములో కొందరు చెన్నపట్నపు సహాధ్యాయులతో కూడి చెన్నాపట్నం వెళ్ళాడు. అక్కడ జీవనం జరగడం కష్టమై పత్రికలకు రాసి కాలం వెళ్ళబుచ్చవలసి వచ్చింది. ఆ రోజుల్లోనే బైరన్‌రీతిని “కాప్టిల్ లేడి” అనెడి యింగ్లీషు కావ్యం రాయడం. ఇంగ్లీషున గ్రంథములు రాసి పేరు ప్రతిష్ఠలు సంపాదింతుమనే ఆనాటి బంగాళీ విద్వాంసులు ఆశించిరి గాని దేశ భాషను తలపెట్టరయిరి.

మధుసూదనుడి మొదటి భార్య ఒక ఇండిగోపొంటరు కుమార్తె. భార్యాభర్తలకు సమరసచెడి ఆమె విడాకులు పుచ్చుకున్నారు. తిరిగీ మధుసూదనుడు వరించిన మరొక దొరసాని కష్ట సుఖములలోను ప్రతిష్ట అప్రతిష్టలలోను ప్రేమతో కనిపెట్టి తిరిగినది. ఆమెకు సంతానం కలిగెను.

యెనిమిది సంవత్సరాలు చెన్నపట్నంలో వుండి కలకత్తా తిరిగి వచ్చేసరికి పెళ్ళినాటి పెద్దపెళ్ళాం అంటకాగింది.

# విద్యా పునరుజ్జీవనము

విద్యలలోనూ, కళలలోనూ మునపటి గ్రీకులు సాటిలేనివారై యుండేవారు. గ్రీకుల స్వాతంత్ర్యము సన్నగిలిన తరువాత రోమనులు తలయెత్తి ఆనాటి లోకమును ఏకఛత్రంగా యేలిరి, గాని విద్యలలో గ్రీకుల చాయను బట్టి పోయిరి.

కొంతకాలానకు, ఇటలీ దేశము కిరాతులు జయించడమూ, రోమనులు కిరస్తానులు కావడమూ జరిగింది. కిరస్తానులకు కిరాతులకు గ్రీకుల విద్యలయందు ఆదరం లేక దేశం కొన్ని సంవత్సరములు అజ్ఞానాంధకారం కమ్మి వుండినది.

అంతట కొన్ని కారణముల చేత ఇటలీలో జాత్యభిమానమూ, దేశాభిమానమూ మొలకెత్తి బలిసినది. పాత విద్యలు నేర్చను అభిలాష కలిగినది. ఆ సమయంలో యిస్తంబూల్ తురకల పాలుకాగా, అక్కడి గ్రీకుపండితులు కొందరు యిటలీకి వచ్చి అక్కడి ప్రభువులవల్ల మన్ననలంది, గ్రీకు విద్యలను తిరిగి లేవనెత్తిరి. దీనినే "రివైవల్ ఆఫ్ లెటర్స్" (Revival of letters) అని అంటారు.

యూరోపుఖండం అజ్ఞానంలో నుండి మేలుకోవడం అప్పుడే. అదివరకు టోపీ జాతులవారు కిరస్తానీ మతమే నిజమైన మతమనిన్ని, విగ్రహారాధన చేసే గ్రీకు, రోమనుల విద్యలలో విలవ వుండనేరదనీ, వారి విద్యలు చదువుటే పాపమనీ నమ్మి వుండేవారు. ప్రజలకు విద్య నేర్పితే దేశం బాగుపడునన్న జ్ఞానం లేకపోయెను. బైబిలు నిర్జీవమైన లాటిను భాషలో చదివే వారు. దైవ ప్రార్థనలు కూడా ప్రజలకు అర్థముకాని లాటిను భాషలోనే వుండేవి. బయిబిలు దాటి సత్యమూ, జ్ఞానమూ లేదనిన్ని, విగ్రహారాధకులై వుండే గ్రీకు, రోమనులు మూర్ఖులనిన్నీ కిరస్తానులు నమ్మేవారు.

ఇటలీలో గ్రీకు, లాటిను సరస్వతి ఉదయించగానే జనులకు కళ్ళ మసక మాసినది. బుద్ధిమంతులు కిరస్తానుల మోటతనమూ, మూర్ఖమూ, విగ్రహారాధకులై వుండిన గ్రీకు లాటినుల జ్ఞానమూ, కళాకౌశలమూ చూడగలిగిరి. యూరోపులో బుద్ధికి గొలుసులు విడినవి.

గ్రీకు, లాటిను విద్యలను చేపట్టుట పరువు ప్రతిష్టలకు తెరువైంది. వాటి రసానకులోనై విద్వాంసులు దేశభాషను నిరసించేవారు. గాని దేశాభిమానమూ, జాత్యభిమానమూ ప్రబలుట చేత దేశ భాషలో చెయిపట్టి రాయించింది. ఆ కథ ముందు చెబుతాను.

లాటినుకూ, యిటాలియనుకూ ఆనాడు వుండే భేదం, సంస్కృతముకూ, ప్రాకృతములకూ వుండిన యట్టిది. కొంతవరకు గ్రాంథిక తెనుగుకూ, వాడుక తెనుగుకూ వున్న భేదం వంటిది. వుత్తర దేశాలలో సంస్కృత ప్రాకృతములనే గాని, దేశ భాషలలో రాయడం పరువు తక్కువని పండితులు చాలాకాలం తలచేవారు. ఇప్పుడు ఆ భ్రమ తరిగిపోయింది. బంగాళీలలో లేనేలేదు. రవీంధ్రనాధుని ఆదరించడముకు సాహిత్య పరిషత్తు భవనంలో సభ అయినప్పుడు: "యిప్పటి బంగాళీ కవులు సంస్కృత కవులుగా మారినారు" అని వొకసందర్భములో అన్నాడు.

తెలుగు దేశంలోనూ యిట్టి చిక్కు మునుపు కలిగింది. ఇప్పుడు కలుగుతూంది. సంస్కృతాన్ని పట్టి అప్పుడు కలిగింది. గ్రాంథిక భాషను పట్టి యిప్పుడు కలుగుతుంది.

ఆంధ్రశబ్ద చింతామణికర్త అన్నాడు: "స్వస్థాన వేష భాషాభిమతాః...."

తొలికాలపు నాటి తెలుగు కవులు తాము ఉభయ భాషా కవులమని చెప్పుకోకపోతే గౌడు మూకలో కలుపుతారేమో అని, "ఉభయ భాషా కావ్యరచనాభిశోభితు", "ఉభయకవి మిత్రు" అని తమ సంస్కృత పాండిత్యము వెల్లడించుతూ వుండేవారు. తెనుగులో కూడా కావ్యములు రాస్తే ప్రత్యవాయం లేదని అధర్వణుడు చాటభారతం రాశాడు.

భట్టకలంకదేవుడి శబ్దానుశాసనం యిప్పుడు దొరకడం కష్టం. 1890 సంవత్సరంలో మైసూరుగవర్నమెంటువారు అచ్చువేశారు. ఇది వొక గొప్ప కన్నడ వ్యాకరణం. దీనిని గురించి రైస్‌దొర వ్రాసినారు.

"The date of its completion as given at the end of the work corresponds with 1604 A.D. it is thus from its period, not an antique treatise dealing with archaisms and absolete terms; interesting as a literary monument, though of citter practical value now, but has the advantage of treating of the whole range of the language down to the modern period and its rules are such as apply to the present times."

కన్నడమునకు వ్యాకరణమేల? అనే విషయమును, భట్టకలంకుడు యిలాగున చెర్చించాడు:-

**మంగళశ్లోకం**

"నమః శ్రీవర్ధమానాయ
విశ్వవిద్యావబాసినే !
సర్వభాషామయా భాషా
ప్రవృత్తా యన్ముఖాంబుజాత్".

“శబ్దానుశాసనంవా ప్రస్తుతమ్. తత్రచ అనుశాసన విషయభూతాః శబ్దాః కర్ణాటకా ఏవ. తే చ సంస్కృతశబ్దవత్సకల దేశ ప్రసిద్ధాః సకల శాస్త్రోపయోగితయాసకల మహాజనపరి గ్రాహ్యాశ్చ నభవన్తి; భాషావిషయత్వాత్, భాషాయాం చ పామరాణామేవాధికారో న పణ్డితానామితివై తేను శాస్యాః ప్రయోగార్హ త్వాదితి కేషాం చిత్సంస్కృతానామన్యథాఖ్యాతిం ప్రత్యాఖ్యాతు మేతదేవ విశేషణం సర్వఇతి ప్రవర్ణితవాన్ గ్రంథకారః. ఇదమత్రాకూతమ్ యథాసంస్కృతశబ్దాః సాధ్వసాధు వివేచన విషయతయాను శాసనార్హాః తథా భాషాశబ్దా అపి.

# ఆంధ్ర కవితాపిత

బెజవాడ శాసనములో యుద్ధమల్లుని గూర్చి "రాజ్య పట్టంబుగట్టినపతి " అని వ్రాసియున్నది. "బాడబు మహారాజాధి రాజ"ని గుంటూరు శాసనమున నున్నది. యుద్ధమల్లుడును అతని సంతతి వారును తామే పూర్వ చాళుక్య రాజ్యమునకు హక్కుదార్లమను వాదమున నిలిచియుందురు. "రాజసల్కిభూవల్లభుండ"ను చోట "సల్కి" అనుమాట "చాళుక్య" అనుమాటకు దేశ్యము. ప్రాచీనమగు శివానందయోగేశ్వరుని మరాఠీవంశావళియును గ్రంథములో "చాళ్కె" అనుపేరు "చలకియా" "సాళోంగే" రూపములు కూడ నీయబడినది. కవిరాజ మార్గము ఉపోద్ఘాతం 8వ పుట చూడుడు. చాళుక్య అనుమాటకు గల రూపములను గురించి Fleet, dynasties of the Canareses districts in Bombay gazette volume I. Part II' pages 336, 337 లోచూడుడు.

"చాళుక్యర్" అను రూపము కుబ్జవిష్ణువర్ధనుని సతారా శాసనములో నున్నది. Indian antiquary vol. XXI. P.303) మరియు ఓఘూగారి పుస్తకము 1 పేజీలో నోటు చూడుడు.

ఇరియటు దొరగారు సంపాదించిన శాసనముల వల్ల వేంగిగొంక రాజనునతడు యుద్ధమల్లుని వంశము వాడయినట్టు కానవచ్చుచున్నది. నా ప్రతి శుద్ధమైనది కాదు. శాసనపు రాతిలో కొంత ముక్క కూడా విరిగిపోయినట్లు తెలియుచున్నది. అసలు శాసనమును చూడడము ఆవశ్యకము, ఇరియటు దొరగారి ప్రతిలోని పంక్తులు కొన్ని ఈ క్రింద ఉదహరించెదను.

"సదరు జిల్లా రావిమట్ల గ్రామంలో వూరికి పడమర వయిపున తాడిమళ్ళ ప్రకాశనాయుడు గారి లోగిలి ప్రహరీ గోడకు ఉత్తర భాగమున పడివున్న నల్ల రాతి మీది లిపి.

పయి పలకవ్రాత యీ రాయిపయివరస కొంత విరిగిపోయినది. అందుచేత రాత కూడా కొంత పోయినది.

"పుత్రస్తస్య త్రిణేత్రప్రభు...
రాజేత్యన్వర్థ సంజ్ఞః కుముద
వనహిత శ్రీ.... వతంసః...
.... వేంగి గొంకేశనామా...

యుద్ధమల్ల నృప వంశాంభోధిర
త్న స్యతస్యాప్తో... సహో
గతమహామమాత్యశ్చ సేనాపతి.
యాశ్చాసౌ గుడియూరిపూ
ర్నకబహు గ్రామాధినాథః.

"స్వస్తిశక వర్షంబులు 1100 అగు నేటి వుత్తరాయణ నిమిత్తంబున గుడియూరి వెన్నపరెడ్డి కొడుకు దండనాయక మల్లిరెడ్డి దన్నేలిన శ్రీ మన్మహామండలేశ్వర వేంగి గొంక రాజునకు ధర్మముగా మాధ్యపల్లి శకటేశ్వర మహాదేవర గుడియును మంటపము గోపుర ప్రాకారపరివార సహితముగా దను యెత్తించి దేవరకు సాలునకు మానులకు నిబంధన నైవేద్యములకు..."

ఇరియటు దొరవారి శాసనములలోనే మరివక శాసనము కలదు. అది యిట్లున్నది. "బందరు జిల్లాలోని గణపవరం గ్రామములో గ్రామానకు తూర్పున సువర్ణ గుండం దక్షిణపు వైపున వేంచేసియున్న శ్రీ సువర్ణేశ్వర స్వాముల వారి దేవాలయం ముఖ మంటపంలో వాయువ్య మూల స్తంభం పడమర వైపు పలక మీద శాసనము. "స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహా మండలేశ్వర... పురనరాధీశ్వర, మానవ్యసగోత్ర హారీతిపుత్ర సోమవంశార్ణవ చంద్ర, సత్య హరిశ్చంద్ర, దళితరిపుదర రాజకందర్ప. యుద్ధమల్లవంశ సముద్ధరణ, భయలోభ... హర్న షట్సహస్రావనీనాయక, వయిరి భయదాయక శ్రీ మల్లేశ్వర మహాదేవదివ్యశ్రీ పాదపద్మారాధక పరబలసాధక నామాది సమస్తప్రశస్తిసహితము శ్రీమన్ మహామండలేశ్వర వేంగిమల్లి దేవరాజు కొడుకు గోకరాజులు శకవర్షంబులు 1066 అగునేటి ఆషాఢకృష్ణ ఏకాదశియు బుధవారము నాడు దక్షిణాయిన ..తినిమిత్తంన శ్రీమతు పద్మినీపురమున శ్రీ సర్వేశ్వర మహా దేవరకు నఖండవర్తి దీపమునకు నిచ్చిన సురభులు 30. దీనింజేకొని తోకల కొండబోయిందు పుత్రానుపౌత్రికముగా సాగనీయంబెట్టి నిత్యం మానెడు నెయ్యి నడుపంగల వాడు. శ్రీ వేంగి సాకాచారి లిఖిత.

పై శాసనములలో గణపవరం శాసనము సూయల్ దొరగారి జాబితాలలో ఒకటవ సంపుట 39వ పేజీలో ఉదహరింపబడియున్నది. శకము 1096గా నీబడినది. ఇరియటు దొర వారివి సూయల్ దొరగారివి సరి అయిన ప్రతులు కాకపోవడం చేత లేఖకులు ఒక అంకెనే 6 గాను 9 గానూ చదివి యుందురు. ఇట్టి శాసనములున్నవని తెలుపుటకంటె వీటి ప్రయోజనము వుండబోదు. చాళుక్యయుద్ధమల్లుని సంతతివారు కృష్ణాజిల్లాలో సామంత ప్రభువులుగా వుండిరనుటకు ఈ నిదర్శనములు చాలు ననుకుంటాను.

ఇతర స్తలములలో కూడా ఈ వంశము వారి శాసనములు కలవు. బెజవాడలోనే వేంగిగొంకరాజు కొమారుడున్ను మల్లపరాజు మనమడున్ను అయిన మహాదేవరాజు శాసనములు

రెండు కలవు. 1893 సం॥ యపిగ్రాఫిష్టుగారి రిపోర్టును 11వ పుట చూడుడు. ఒక శాసనపు కాలము 1062 శాలివాహన శకము.

బెజవాడ శాసనపు యుద్ధమల్లుడు చాళుక్య వంశము లోని వాడన్నమాట బెజవాడ శాసనము లోనే చెప్పబడి యున్నది. ఆరవ పంక్తిలో "రాజసల్కి భూవల్లభుండు" అని వున్నది. సల్కి అనగా చాళుక్య. రెండవ పులి కేశి యొక్క హైదరాబాదు శాసనములో చిలిక్య అనే రూపమున్నది. చాళుక్యుల యింటి పేరు అనేక రూపములుగా వుండెను. బొంబాయి గెజిటీయరు 1 టవ సంపుటం 2వ భాగములో ఫ్లీటు దొరగారు Dynasties of the Canarese districts 336, 337 పుటలు చూడుడు. కే.బీ. పాఠకకవి రాజమార్గము 8వ పుట కూడా చూడుడు. శ్రీ గౌరీశంకరు ఓగారి సోలంకేయుల చరిత్ర కూడా చూడుడు.

# ఇతర యుద్ధమల్లులు

చాళుక్య రాజులందు గల యుద్ధ (ఆహవ) మల్లులలో రాజనరేంద్రునకు తరువాతి వారు కూడగలరు అని శ్రీ బ్రహ్మయ్య శాస్త్రులు వారు వ్రాసిరి. పర్యాయ పదములను పెట్టి పేర్లు మార్చుడము కారణాంతరములు లేనిదీ యుక్తము కాదనుకుంటాను. బెజవాడ శాసనపు యుద్ధమల్లుడు కాక యితర చాళుక్య యుద్ధమల్లులు కావలసినచో కలరు. Fleets Canarese Dynasties 211, 212. పుటలను, 380, 381 పుటలను రైస్ దొరగారి కర్ణాటక భాషా భూష ణము ఉపోద్ఘాతము. 13, 14 పుటలను చూచునది.

కన్నడ భాషలోని పంప భారతము అరికేసరి అనెడి చాళుక్య రాజుకోరికను వ్రాయబడినది. ఈ రాజు యొక్క పూర్వులలో యుద్ధమల్లుడనే ఆయన వేంగి దేశము నుండి కన్నడ దేశమునకు వచ్చి ధార్వాడ జిల్లా ప్రాంతమందు ఒక సంస్థానమును స్థాపించెను. ఆ యుద్ధ మల్లుడి తరువాత అయిదో పురుషుడు మరియొక యుద్ధమల్లుడు. అరికేసరి యితని మనవడే. పంప భారతము శాలివాహన శకము 863వ సంవత్సరములో వ్రాయబడెను. గనుక ఈ యుద్ధమల్లులు రాజ రాజునకు ప్రాచీనులే.

రాజరాజునకు తరువాత కూడా చాళుక్య యుద్ధ మల్లులు వుండి వుండలేదని యెవరు చెప్పగలరు? దేశ చరిత్రయు పూర్తిగా నున్నచో యిట్టివారుండి యుండలేదు అని చెప్పుటకు అవకాశము వుండును. మన పూర్వులు చరిత్ర ముఖమే యెరుగరే! ఒక్క పేరును బట్టి యితడు యితనని నిర్ణయించరాదు.

బెజవాడ శాసనపు భాషకును నన్నయభట్టు భాషకును వ్యత్యాసము కూడా వున్నది. అందు గూర్చి ముందు చర్చించెద.

# ముత్యాల సరాల లక్షణము

ఆగష్టు నెల 17వ తేదీని వెలువడిన ఆంధ్రపత్రికలో వొక శతావధాని గారు నే రాసిన ముత్యాల సరములను గేయములను విమర్శించిరి. ఆపత్రిక నాకు అందినప్పుడు, నేనా విమర్శనమును చూసియుండలేదు. తరువాత కొందరు మిత్రులు చూసి నాతో చెప్పిరి. ఇంతట్లో మా వూరి 'భారతమాత' శతావధాని గారి వ్రాతను గర్హించుతూ వ్రాసినది. పిమ్మట శతావధానిగారి విమర్శనమును కూడా నేను చదివితిని.

విమర్శనమును రాసినందుకు శతావధానిగారికి నేను కృతజ్ఞుడను. చర్చ జరిగిన గాని నిజము వెల్లడి కానేరదు. నా ఉద్యమము వల్ల ఆంధ్రభాషకు ముప్పు వచ్చునను భయము వారికి పొడమి, వారు కొంచము కఠినముగా రాసియుందురు. తప్పేమి? ఆంధ్ర భాషయందు వారికి మిక్కిలి యభిమానముండుటనే కదా? వారి మనసుకు వ్యధ కలిగి ఆ రీతిని వ్రాసి యుండిరి. స్వమతాభిమానమును, పరమత నిరసనమును అందరికిని సహజమే కదా!

'భారతమాత' శతావధానులు గారిని గురించి కొంచము కఠినముగా వ్రాసినందుకు నేను యెంతో విచారిస్తున్నాను. లోకోపకారకములైన గొప్ప సంగతులు చర్చించుతున్నప్పుడు, మనసులు నొచ్చునట్లు రాసి, ఆగ్రహమునకు అవకాశము కలుగ చెయ్యరాదని నా అభిప్రాయము. శతావధానులు పండితులు; పూజ్యులు. వారి వల్ల నాలుగు తిన్నను, చేతనైన యెడల వారిని వొప్పించడము గాని, తెలియని చోట వారి వల్ల తెలుసుకోవడము గాని, లాభకరము. దూషణము వల్ల లాభము లేదు.

సులభమైన కొత్త గ్రాంథిక భాషను కల్పించుకొనడమును గురించి నా అభిప్రాయములను తెలియజేయవలెనన్నచో, పెద్ద గ్రంథమును రాయవలసివచ్చును. ఆ విషయము చర్చించుటకు నాకు యిప్పుడు అవకాశము చాలదు. శతావధాని గారు ఇంగ్లీషు నేర్చిన వారివలే కనపడు తున్నారు. వారు సంస్కృత, ద్రావిడ భాషల వ్యాకరణము లే కాక, ఇంగ్లీషున వ్రాయబడియున్న భాషాశాస్త్ర, భాషాచరిత్రములను కూడా చదివియున్నయెడల, వారిని అందలి సంగతులు జ్ఞాపకము తెచ్చుకొండని ప్రార్థించుట తప్ప, నేను చేయవలసిన పని వుండబోదు.

ముత్యాల సరములు గురించి మాత్రం యిక్కడ వ్రాసెదను. ముత్యాలసరములలో కొన్ని అచ్చు తప్పులున్నవి.

| పద్య సంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 10 | చెప్పరంబు | చప్పరంబు |
| 17 | వెల్లకల్లై | లెల్లకల్లై |
| 18 | ఒక్కటి | ఒక్కటె |
| 29 | పలుకకయుండు | పలుకకయుండి |

శతావధానులు గారు నా పద్యములందు మూడు పెద్ద తప్పులు పట్టినట్లు కనబడుచున్నది. ఒకటి, నేను గ్రాంథిక భాషా వ్యాకరణమును పాటించలేదని, రెండు, ఛందశ్శాస్త్రమును పాటించ లేదని, మూడు, పద్యములలో కావ్య గుణములు లేవని.

కావ్య గుణములు ఒకరిసొమ్ము కావు. లక్షణ గ్రంథములెంత చదివినను, అందలి అలంకారాదులు తమ కబ్బమునందెంత యెక్కించవలెనని ప్రయత్నించినను, అనేకమంది పండితులు మనసును రంజించు కావ్యములు వ్రాయలేదు. అది వారి పాండిత్యమునకొక లోపముగా తలచకూడదు. కావ్య గుణములు ముఖ్యముగా ప్రతిభ వల్లనూ, కొంతవరకు కావ్య పఠనా కళాజ్ఞానము వల్లనూ, కొంతవరకు పూర్వకవుల కావ్యరసము మనసును పట్టి, ప్రవర్తింపజేయుట వల్లనూ కలుగును. అది అలా వుండగా, గుణ గ్రహణము కూడా కొంతవరకూ అలవాటును పట్టేయుండును. ఇంగ్లీషు సంగీతము సహించని ఇంగ్లీషు వారెందరో గలరు. ఒకవేళ మన లక్షణ గ్రంథములనే తీసి, యీ యీ గుణములు యీ యీ పట్ల పట్టినవని, యెత్తి చూపినను, శతావధానులు గారు అంగీకరింతురని నే తలచను. ఇక మన లక్షణ గ్రంథములలో కానరాని కావ్య గుణముల మాటో, లక్షణ గ్రంథములలో చెప్పడమునకు శక్యము కాని కావ్య గుణముల మాటో, చెప్పనేల? గ్రాంథిక భాషా వ్యాకరణమును అనుసరించని తెనుగు వ్రాతలు శతావధాని గారికి అసహ్యములై యుండును. ఇందును గురించి అట్టే చర్చించిన వినియోగము వుండదు.

ముత్యాలసరముల మాట అటుండనియ్యండి. ఆంధ్రభారతి యందు ప్రచురించిన వ్యాసము లలో రెండు మూడు దక్క తక్కినవన్నియు తమ స్తుతి, తామే యొనరించవలెనట. బుద్ధిశాలులును, గద్య ప్రబంధ రచనాచణులును అగు ఆంధ్ర భారతీ విలేఖకుల వ్రాతలు శతావధాని గారికి మనస్కరించకపోవుటకు కారణము యూహింపజాలను.

శతావధానులు గారు, ఛంధశ్శాస్త్ర సంస్కారము నెత్తిరి. అట్టి సంస్కారమునకు నే చూపినది దారి కాదనిరి. ఛందశ్శాస్త్ర సంస్కారము శతావధానులు గారికి అభిమతమైనట్లే కానవచ్చుచున్నది. ఛంధశ్శాస్త్రమనగా తెలుగున లాక్షణికులు చేసిన నియమములని వారి యభిప్రాయము కావచ్చును. లేకున్న శాస్త్రమునకు సంస్కారమన్న మాటీవరకు విని యుండలేదు.

శతావధానులు గారిని నేనొక ప్రశ్న అడిగెద. పూర్వులు చేసిన ఛందోనియమములు మార్చుతగియున్నప్పుడు ఆంధ్రవైయ్యాకరణుల శాసనము లేల మార్చరాదు?

"తెనుగు భాషకు అనుగుణమైన వృత్తముల నన్నింటినీ, ప్రాచీనకవు లెరిగి నిరూపించిరి. ఇక మన స్వేచ్ఛా ప్రచారమునకు అవకాశము లేదు" అనే యడల కథ ముగిసినది. యూరోపి యను భాషలలో కవులు కొత్త వృత్తములను కల్పించి భాషాభివృద్ధి చేయలేదో? కొత్త వృత్తములను కల్పించవచ్చునన్నచో, నా నేర్పు కొలది నేనొక కొత్త తోవ తొక్కితిని. తప్పేమి? నలుగురూ ఆమోదించిరా, నేను కల్పించిన వృత్తమును అవలంబింతురు. ఆమోదించరా, పరిత్యజింతురు. గాని దానిని గర్హించుటలో అక్షర విన్యాస మెచటెచట పెటకుగానున్నదో, విరామము లెచటెచట శ్రావ్యతను చెరచెనో, శతావధాని గారు శలవియ్యరైరి.

ముత్యాల సరములలో నే చేసుకున్న నియమమిది. మొదటి మూడు చరణములలోను సామాన్యముగా పధ్నాలుగేశిమాత్ర లుండును. నాలుగో చరణమున యేడు మొదలు పధ్నాలుగు వరకూ వుండును. విరామమును అర్థానుసారముగా చెవి కింపగునట్లు మార్చయత్నించితిని. ఎంత వరకూ నా యుద్యమము కొనసాగెనో, మార్పుల యెడ నసహనము లేని చదువరులు చెప్పవలె.

ఇక యతిప్రాసల మాట. నేను అజ్ఞుడనే కావచ్చును. కాని తెనుగు లాక్షణికులు యతి ప్రాసములని చేసుకున్న సంకేతములు బడి కుర్రవాళ్ళకును తెలిసియుండును గదా. నాకు తెలియకనే అవి నా పద్యములందు అమరినవని శతావధానిగా రెట్లు దలచిరి? తెనుగు నాకు మాతృభాష అవుటను యతిప్రాసములు దొరలినవట. తెనుగు భాషకును, యతి ప్రాసములకును నైసర్గిక సంబంధ మెట్టిదో శతావధానులు శలవిత్తురు గాక!

పాత యింగ్లీషులో మన యతి నియమము వంటి నియమముండెను. తరువాత అంత్య నియమము ప్రబలెను. వర్డ్సువర్తు మొదలైన మహాకవులు అంత్య నియమమును విడనాడి ఉత్కృష్ట కావ్యములు వ్రాసిరి. అప్పుడు మార్పులు సహింపజాలని విమర్శకులు గొల్లుపెట్టిరి. ఇంగ్లీషు భాషకు యవి నైసర్గిక మైనట్టా? అంత్య నియమమయినట్టా? రెండూ కానట్టా?

తెనుగును, కన్నడమును అక్క చెల్లెళ్ళు. కన్నడ భాషలో యతి నియమము లేదే? యేమి సాధనము? తెనుగులో కొన్ని జాతులకు, వృత్తములకును ప్రాస నియమము లేదే; దీని కేమి సాధనము?

ప్రాకృతాది భాషలలో అంత్య నియమము ప్రబలినది. సంస్కృతమునకు స్వాభావికము కాని ఈ అంత్య నియమము వీటి కేలాగు స్వాభావికమాయెను? తెనుగున మనము యతి ప్రాసములనువాటిని, సంస్కృతకవులచ్చటచ్చట నలంకారములుగా తగిలించుచు వచ్చిరి. చేతగా కనా, లేక సంస్కృత భాష యీ యతిప్రాసములకు వొదగకనా, వారు నియమములుగా నుంచుకొనరైరి?

బంగాళీలలో మొన్నటి వరకూ అంత్య నియమముండెను. మైఖేల్ మధుసూదనదత్తు అనునతడు అంత్య నియమమును విడిచి, ఒక మహా కావ్యమును వ్రాసి, బంగాళీ కవులలో అగ్రగణ్యుడాయెను.

నేను యెరిగియె యతిప్రాసములను, అలంకారములను ముత్యాలసరములలో ప్రయోగించితిని. నియమముగా నుంచిన యడల, యతిప్రాసములకు గాను తెచ్చిపెట్టుకున్న శబ్దములు అర్థ పటుత్వమును చెరచి, సందర్భమును తప్పించి, యీడ్చుకుపోవును. అందుకు శతావధానిగారు ఎత్తిన ముతకసామెతయే ప్రమాణము.

ఒకజాతి పార్శీగజలుయొక్క నడక ముత్యాల సరములలో తెచ్చుటకు నే యత్నించియుంటిని. కలమునకు వచ్చినట్లు వ్రాసితినని శతావధానిగారు అభిప్రాయపడిరి. అది నిజము కాదు. కలమునకు వచ్చినట్టు రాయుట శతావధానిగారికి అలవాటయి యుండును. లేనియడల శతావధాన మెట్లు చేయగలుగుదురు? ఏకైక దిన ప్రబంధ ఘటికాసద్యశ్శత గ్రంథకల్పన కొందరి మతమున, కవితకు మేర. ఇతరులు అర్థపటుత్వ శబ్దౌచిత్యములను సాధించుటకు మిక్కిలి శ్రమచేతురు. చిత్రములు వ్రాయునప్పుడూ, జిలుగు చెక్కునప్పుడూ శిల్పకుడు యెట్టి పరిశ్రమము చేయునో, అట్టి పరిశ్రమము చేసినగాని కావ్యగుణము లబ్బనేరవని మా మతము.

గ్రాంథిక భాషా సంస్కరణమును గురించి నా అభిప్రాయముల నిక్కడ రాయజాలనంటిని. ఒకటి రెండు మాటలు మాత్రము రాయక వుండబట్టక రాస్తున్నాను. శతావధానులుగారు వొక తప్పైనా లేకుండా సంస్కృతము రాయగలిగియుందురు. తెలుగు మాత్రము విస్పష్టముగా రాయజాలరు. లక్షణ గ్రంథములనూ, ప్రాచీన కావ్యములనూ, అనుసరించి గ్రాంథిక భాషనే రాద్దామని వారు యెంత యత్నించిననూ, మాతృభాషా ప్రభావమువల్ల వాడుక భాషలోని ప్రయోగములు, తెలిసో, తెలియకనో పంక్తులలో వచ్చి కూచుంటవి.

లేఖరులు; ఎక్కడ యాగినదో; రెండు మాటలు దక్క తెనుగున; వరకు చదివిన; ఉండవలయు కాని; సిరాయును కాగితము; ఇట్టివి; ఇందు పెక్కులు గానబడుచున్నవి. అని శతావధానులు గారు వ్రాసిరి. "సీసపద్య అర్థము యను శీర్షికతో" ననిరట. అకారమునకు యకారము అచ్చుతప్పు యెట్లగును? యిక శతావధాని గారి రాతలలోనూ, వారి మిత్రులు యం.వి. కృష్ణారావు గారి రాతలలోనూ విసంధులు కానవచ్చుచున్నవి. యే ఆంధ్రశబ్దాను శాసనమో అందులకు ప్రమాణము? బహుశః కౌస్తుభకారుడు ప్రాచీనులమతమని ఉదహరించిన "సంహితైకపదే నిత్యా" ఇత్యాది కారికలను వారు చూపగలరు. అది కుదరదు.

నా రాతల వలన ఆంధ్రభాషకు ముప్పెట్లు వచ్చును? ప్రాచీన గ్రాంథిక భాష, గ్రంథములలో నున్నది. ఎక్కడి మారుమూలల గ్రంథములూ చావుదప్పి అచ్చుపడ్డవి. ప్రాచీన గ్రాంథిక భాష

నిరర్గళముగా తూగినవారు, ఆ భాషనే వ్రాసి ఆనందింతురు గాక! ఎవరు వొద్దనిరి? పండితులు వ్రాయనూ వచ్చును. వెతికి తప్పుల బట్టి ఒకరినొకరు దూషించుకొను వ్యాపారమును కల్పించుకోనూవచ్చును. యెవరు వొద్దనగలరు? చిత్రము! నా రాతలవల్ల "త్రిలింగ" భాషకు ముప్పు వచ్చెనని శతావధానిగారు విలపించుచుండగా ఆ పేజీలోనే వెంకటరాయ శాస్త్రిగారు, శతావధానులుగారి రాతల వల్ల "ఆంధ్రభాషా యోషామణి కెన్నిపాట్లు వచ్చుచున్నవి" అని వ్రాసిరి. భాషకు ముప్పువచ్చునో లేదోకాని, ఈ దొమ్మిలాట వల్ల పత్రికలు చదువు వారికి తప్పక ముప్పు వచ్చుచున్నది.

కవిత్రయము వారి గద్యములను, అవధానిగారు వ్రాసిన విమర్శన గద్యమును, పాక్షికదృష్టి విడిచి, శతావధానులుగారు తైపారువేసి చూచినచో శబ్దములయందును, రూపముల యందును, అన్వయఫక్కియందును వారి తోవను తప్పి వీరెంత దవ్వున నడచిరో, శతావధానులే తెలియగలరు. ఇంత మార్పును తెచ్చిన శతావధానులే భాషా సంస్కరణధురీణులు గాక ఒరులెట్లు కాగలరు? వారితోవనే కదా, మా బోట్లము పోవుట. "మహాజనో యేన గతస్సపంథాః".

ఆంధ్ర గీర్వాణ సాహిత్యములు కలిగి తెనుగు వ్రాయు వారు మిక్కిలి యరుదు. దేశములో నూరుమంది వుండరని నిశ్చయముగా చెప్పగలను. మాట వరసకు నూరంటిని. అంతకును చాలా తక్కువే. సంస్కృత సాహిత్యము లేని వారు కోటాను కోట్లు. పత్రికలలోనూ, నవీన నాటకాది గ్రంథములలోనూ వారి లక్షణ స్ఖాలిత్యములు యెన్న వశమా? అట్టి తప్పుల తడకను వ్రాసి, ఆ రాతను గ్రాంథిక భాష అనుకొనుట కన్న, ఇప్పటి నాగరకులును, శిష్టులును వ్యవహరించు భాషనే రాసుకొనరాదా? ప్రౌఢ గద్య కావ్యములనూ, పద్య కావ్యములనూ వ్రాయువారు గ్రాంథిక భాషలోని యింపగు పదములను తీసికొందురు గాక. సులభ సాధ్యమగు నవీన వ్యావహారిక భాషొకటి ప్రబలిన యెడల, బుద్ధిబలము కలిగియు, మూగులైయున్న మనవారెందరు గ్రంథములను వ్రాసి భాషను వృద్ధి చేయరు? పుట్టు కవులయి, కఠినమగు గ్రాంథిక భాష నేరని వారికది మహోపకారము కదా?

వాడుక భాష కావ్యరచనకు తగదని శతావధానుల అభిప్రాయము. తగునని నా అభిప్రాయము. వాడుక భాషలే కదా, కవులు రాయ రాయ గ్రాంథిక భాషలైనవి. యీ భారత వర్షములోనూ, యితర దేశములలోనూ, వాడుక భాషలలో రసవంతమైన కావ్యములు పుట్టి యుండలేదా? బర్న్స్ అను మహాకవి మాట, శతావధానులు గారు వినలేదో!

# భట్టకలంకుడు (కన్నడ వ్యాకరణములు)

భట్టకలంకుడు జైనుడు. కర్ణాటక శబ్దానుశాసనమనే గొప్ప కన్నడ వ్యాకరణం రాశాడు. 1604 సంవత్సరంలో గ్రంథం పూర్తి అయినట్లు కనబడుతుంది.

ఈనాటికి నిలిచిన కన్నడ వ్యాకరణములలో మొదటివి, రెండవ నాగవర్మ రాసిన కర్ణాటక భాషా భూషణము, కావ్యా లోకములో మొదటి అధికరణమును, రెండవ నాగవర్మ పన్నెండవ శతాబ్ద మధ్య కాలంలో వుండెను. భాషాభూషణము ఆధారంగా చేసుకుని, పదమూడోశతాబ్దంలో కేశిరాజు శబ్ద మణి దర్పణం అనే వ్యాకరణం రాశాడు.

డాక్టర్ బర్నలు అనే విద్వాంసులు శబ్దమణి దర్పణమును గురించి ఇలా రాసినారు. "The great and real merit of Sabdamanidarpana is that it bases the rules on independent research and the usage of wirters of repute; in this way it is far ahead of the Tamil and Telugu treatise, which are much occupied with vain scholastic disputations"

శబ్దమణిదర్పణములోని సూత్రాలు ప్రత్యేక స్వతంత్ర పరిశోధనమీదనూ, గొప్ప ప్రాచీనకవుల ప్రయోగాల మీదనూ ఆధారపడి రచింపబడినవి. నిరర్థక పాండిత్య ప్రకర్షకమైన వివాదగ్రస్త విషయాలతో నిండిన తెలుగు, తమిళ వ్యాకరణాలకంటే శబ్దమణిదర్పణం ఎంతో మెరుగైనది అని దీని భావం.

భట్టకలంకుల శబ్దానుశాసనమనే గ్రంథాన్ని మైసూరు ప్రభుత్వము వారు 1890వ సంవత్సరములో బెంగుళూరులో అచ్చు వేయించినారు. యిప్పుడు ప్రతులు దొరకవు. మైసూరు గవర్నమెంటు లైబ్రరీలో వున్న పుస్తకాన్ని నేను అరువు తెచ్చాను. అది తిరిగీ యిచ్చి వెయ్యవలసిన కాలం వచ్చినందున అందులో నుంచి తెనుగు వారికి తెలియతగిన భాగాలు కొన్ని యెత్తి రాస్తున్నాను. ఈ గ్రంథాన్ని గురించి రైసుదొర యిట్లు రాసినారు :

"It is .... not an antique treatise dealing with archaisms and obsolete terms, interesting as a literary monument though of little practical value now, but has the advantage of treating of the whole range of the language down to the modern period and its rules are such as apply to the present time"

ప్రాచీనమైనవీ, యిప్పుడు వాడుకలో లేకుండా నశించినవీ అయిన అనేక శబ్ద ప్రయోగాల సరళిని తెలిపే వ్యాకరణాలు వున్నాయి. ఇవి ప్రస్తుత కాలానికి ఉపయోగపడకపోయినప్పటికీ ప్రాచీన భాషా ప్రయోగ సంప్రదాయాలను గ్రహించడానకు ఉపకరిస్తాయి. అయితే శబ్దానుశాసన మనే వ్యాకరణం ప్రాచీనమైనది. కాని ప్రాచీన కాలం నుంచీ ఆధునిక కాలం వరకు గల భాషా ర్ణవాన్ని గురించి ప్రస్తావించే అవకాశాన్ని ఈ శబ్దానుశాసనం కలిగివున్నది. శబ్దానుశాసనం లోని సూత్రాలను ప్రస్తుత కాలానకు కూడా అనువర్తింపజేసుకోవచ్చును అని పై వాక్యాల తాత్పర్యం.

Some what curious statements are made in works that have come to hand regarding the constituent parts that combine to form Kannada. Thus the unknown author of Subhasthita or Neetikanda an old Jain work says"

ఒళుగన్నడ బెళుగన్నడ
తెళుగన్నడ అచ్చుగన్నడం సక్కజముం
ఎళగన్నడ హాళగన్నడ
సలెదేశియ కెనెయదుణ్ణి కన్నడికిళెయోళ్

Local (or home) Kannada, white Kannada, clear Kannada, and derivatives from Sanskrit young (or new) Kannada, old Kannada, being combined in the language of the country, is there any equal to Kannada in the world?"

ఏ అంతర్భాష వలన కన్నడమేర్పడినదో వాటిని గురించి తెలుసుకోదగ్గ కొన్ని వింత సంగతులు యిప్పుడు మనకు లభించిన గ్రంథాలలో కనిపిస్తున్నవి. సుభాషిత అనే ప్రాచీన జైన గ్రంథకర్త పేరెవరో తెలియదు కాని, ఆయన యిలా వ్రాస్తున్నారు :

ఒళు, బెళు, తెళు, అచ్చ, ఎల, హాళ మొదలైన కన్నడములు దేశభాషతో కలిసిపోయినవి. కన్నడ భాషకు సరితూగగల మరివొక భాష లోకమున కలదా? లేదని పైవాక్యముల సారాంశము. హాళగన్నడ మనగా పాత కన్నడమనీ తెళుగన్నడమనగా తేట అయిన కన్నడమనీ అర్థము.

ఇదే విధముగా ఈ శతాబ్ద ఆరంభమున దేవచంద్రునిచే రాయబడిన "రాజావలి కథై" అను గ్రంథమున యిట్లు కలదు. దేవచంద్రుడు జైనుడు.

హాళగన్నడ బెళుగన్నడ
వళగన్నడ పొసతెంబుదుం
తెళుగన్నడ మిశ్రదినిద
నిళెయోళు సత్పురుష రోడికేళ్వుదు సతతం.

"This, in which old Kannada, white Kannada, local Kannada, pure Kannada, and that called new, are mingled into clear Kannada, may good men in the world ever read and listen to"

పాత కన్నడము ప్రాదేశిక, కొత్త కన్నడాదులు తెళుగన్నడ భాషలో కలిసిపోయినవి. దీనిని లోకములోని మంచి మనుష్యులు సదా చదువుతూ వింటూ వుండెదరు గాక! అని దీని భావము.

హళగన్నడ ఆర్ హళకన్నడ is the early form of the language, Belu Kannada or white Kannada, seems to refer to a belief of the Jains, who attribute substances to sound and say that it is white. Thus Kesiraju in his grammar Sabdamanidarpana" has the following :

(1) శబ్దద్రవ్యం జనియిసుగుంస్వేతం

(2) శబ్దం జనియిసుగుం ధవళవర్ణం అక్షరరూపం

బెళుకన్నడ లేక తెళుకన్నడ అనే దానికి ప్రాచీన రూపం హళగన్నడము లేదా హళకన్నడము. శబ్దాన్ని ద్రవ్య రూపముగా జైనులు భావిస్తూ వుండేవారు. మరి కొంతమంది దానిని అక్షరరూపంగా భావించారు. జైన సంబంధమైన శబ్ద ద్రవ్యం శ్వేతరూపంగా పరిగణింపబడినది. మరివొక చోట జైన సంబంధమైన శబ్దము అక్షర రూపముగనూ, ధవళరూపముగనూ తన శబ్ద మణి దర్పణములో కేశిరాజు పేర్కొన్నాడు. ధవళమంటే స్వచ్ఛమైనదని అర్థము.

“వళగన్నడ లేదా ఓళదేశకన్నడ, refers to the word called దేశ్య, the native tongue including local peculiarities and dialects. అచ్చుగన్నడ is the universal term of pure కన్నడ, తెళుగన్నడ means clear, transparent కన్నడ, and from the same root derived the name Telugu, the other language which has so close and affinity to Kannda and which is written in the same characters"

వళగన్నడము లేదా ఓళ దేశ కన్నడ మనేది దేశ్య మనే శబ్దానికి చెందుతున్నది. దేశ్యమనగా మాతృభాష. ఇందులో మాండలిక భేదాలు, భాషలు చేరివున్నవి. శుద్ధ కన్నడ మనే దానిని విశాలమైన అర్థంలో అచ్చుగన్నడ మందురు. తెళుగన్నడమంటే తేట అయిన కన్నడమని, పలుచనిదని, సన్ననిదని అర్థము. స్ఫటికము వంటి స్పష్టమైన భాష తెళుగన్నడము. తెళు గన్నడమనే పదము నుంచే, మరివొక భాషావాచకమైన “తెలుగు” అనే మాట పుట్టినది. కన్నడమునకును, తెనుగునకును ఎంతో దగ్గర సంబంధము కలదనీ, తెలుగు అక్షరముల వ్రాత కన్నడ లిపిని పోలియుండుననీ రెయిసు దొరగారి వ్యాఖ్యానమునకు అర్థము.

పైది రెయిసు దొరగారి పీఠకలోనిది.

ఈ కిందిది గ్రంథారంభ మంగళ శ్లోకము :

**నమశ్శ్రీవర్ధమానాయ విశ్వవిద్యావభాసినే**
**సర్వభాషామయీభాషా ప్రవృత్తాయన్ముఖాంబుజాత్॥**

యే వస్తువు నుండి అన్ని భాషలకూ సంబంధించి నటువంటి భాష కలిగినదో సంపత్తును కలుగచేసేటటువంటిన్నీ, అన్ని విద్యల్నీ తెలియచేసేటటువంటిన్నీ ఆ వస్తువుకు ప్రణామములు.

ఈ శ్లోకము పై వ్యాఖ్యానంలోని కొంత భాగమిది. శబ్దాను శాసనం హి ప్రస్తుతమ్ । తత్రచ అనుశాసన విషయ భూతాః శబ్దాః కర్ణాటకా ఏవ। తేచ సంస్కృత శబ్ద వత్సకల దేశ ప్రసిద్ధాః సకల శాస్త్రోపయోగితయా సకల మహాజన పరిగ్రాహ్యాశ్చ నభవంతి। భాషా విషయత్వాత్ । భాషాయాం చ పామరాణామే వాధి కారోన పండితానామేతి వైతేనుశాస్యాః। ప్రయోగానర్హత్వాదితి। కేషాంచిత్సంస్కృతాగ్రహ గ్రహగ్రస్తానాం పండితమ్మన్యానామ్ మనసిప్రఖ్యాతా మన్యథాఖ్యాతిం ప్రత్యాఖ్యాతుమేత దేవ విశేషణ ముపవర్ణి తవాన్ గ్రంథకారః ఇదమత్రా కూతమ్। యథాసంస్కృతశబ్దాః స్వాధ్వసాధు వివేచన విషయతయానుశాసనార్హాః । తథా భాషా శబ్దా అపి । యదిచామీనానుశాశ్యాః కథంతర్హి భగవద్భాషా తన్మయీస్యాత్। సహ్యాపశబ్దమయీసా.

శబ్దమేరీతిగా ఉపయోగింపబడుతున్నదో యిప్పుడు మనం చెప్పుకుందాము. అందులో ముఖ్యంగా యిప్పుడు మనం తెలుసుకోవలసినది కన్నడ శబ్దాలు యేలాగున ప్రయోగింప బడుతున్నవనే విషయం. సంస్కృత శబ్దాలు అందరిచేతా పరిగ్రహింపబడుతున్నట్లు, అన్ని చోట్లా ప్రసిద్ధమైనట్లు, అన్ని శాస్త్రాలను సమన్వయించినట్లు కన్నడ శబ్దాలు పరిగణింపబడడం లేదు. యిక భాషను గురించి ముచ్చటించుకుందాం. జనుల వాడుకలో వుంటున్నది కనక, పండితులకు గ్రంథాలలో ఉపయోగార్హమైనది కాదు కనుక పండితులకు భాష ఉపయోగపడక జనులకు మాత్రమే మిక్కిలి ఉపయోగపడుతున్నది. అందులోనూ సంస్కృతం తెలియని కొందరు తాము పండితులమనుకుంటూ కొన్ని అనుకూల శబ్దాలను అననుకూలమైనవిగానూ మరికొన్ని అనను కూల శబ్దాలను అనుకూలమైనవిగానూ పొరపాటు పడుతున్నారు. అటువంటి పండితమ్మన్యులను గురించి మాత్రమే మేమిక్కడ ప్రస్తావిస్తున్నాము. సంస్కృత శబ్దాలను అవసరానవసరాలను బట్టి యెలాగున ప్రయోగించుకుంటున్నామో అలాగునే యీ భాషా పదాలు కూడా ఉపయోగిం చుకోవచ్చును. అన్ని విధాలా యీ భాషా శబ్దాలకు సంస్కృతంతో సంబంధమున్నది కనుక యివి సర్వదా ప్రయోగార్హములే. వీటిని అపశబ్దాలని యెంత మాత్రం పేర్కొనడానకు వీలులేదు. ఇది వ్యాఖ్యానం.

పై వ్యాఖ్యానమును మన తెనుగు భాషా పదాలకు కూడా అనువర్తింప చేసుకొనవచ్చును.

●

# 1893

## January

### *18th Wed*

(...) so wrote an article on Indian Press.

The Amrita Bazar Patrica. (...)

(Gurajada begins the first page of a note bok with the above entry. The following two pages are not legible. Eds.)

# 1894

## July

### *30th Mon*

259 MS.

July 93 - Feb 94

15th July due

Gonka Vol. II, P III Inscription

Para 19 of last manual report.

SS 1108. 1117 - 1125 SS ottepur

I Local Chief పృధ్వీశ్వర

malla madi friends with త్రినేత్ర పల్లవ

to have acquired a district of food villages and to

have recided at ధనదపుర

II హైహయ యదు కార్తవీర్య

III Kalinga's Heramba's (?) son

Gunaga Vijayaditya

ముగిశిర (in?) కందుకకేళి of మంగిమల గుండుగండ

గుండుగండ

MS PC (?) Annadevarapadu in Godavary

Vol. 10th June 1891 no 452 Salem manual foulks (Salem Manual by Rev. T. Foulkes, 1883. Eds.)

No. 351 of 1892
Vijayanthi Andhra (....)
24% principth?
See Kurma Vidunya
Trilochana Pallavadeva. Ind Antiquitiy 3 vol, XVIII
opposed Sultan (...) 1084 (...) inscription
Kalingattu Parani
The king of Kalinga fort to flee at ? May (...) in vengi, etc.

# 1895

## January

***Don't believe what you say and half-believe what you see.***[1]

### *3rd Thurs*

P.C. Biswas,
13 Elgin Road, Allahabad.

Drew previously from the Shroff my allowance for January, Wrote to Somaraju Bava[2] to send me the money he owes me as per account following:-

| | |
|---|---|
| 10 | Rs. in cash |
| 20 | Rs. stamp for రాజమ్మ[3] (Rajamma) Registration fee |
| 10 | Rs. for medicines. |
| 150 | Rs. on account of the horse. |
| 23 | Rs. for articles taken for the marriage festival |
| 8 | Rs. Oxford Books. |
| 221 | Rs. in all. |

To-night Fancy Dress Ball in the Fort.

### *5th Sat*

Near Viravalli station in the Krishna district – there is a tank, the bund of which is grown with తుమ్మ (Tumma - crab tree) and ఈత trees (Eeta-date tree) More tanks like that near Rajahmundry on either side of Godavary all along the road I found patches of pastured ground covered with తుమ్మ trees which grew very luxuriously. Lots of తుమ్మ

covered - pasture land near Bezawada. What is the long grass that grows there - No trefoil. I have seen a hedge of సీమచింత (Seema Chinta - Madras thorn) at Bezawada. 12-45.

### *7th Mon*

Drew pay for November and December. Maddala Venkataratnam. No. 7, College Road, Mylapore.

Sundara Rao, 293 Thambu Chetty St.,

Chengaiah.

### *9th Wed*

Started from Vizianagaram. 6 P.M.

### *10th Thurs*

| | | | |
|---|---|---|---|
| Rs. 20 | Madras note no. | T/43 | 90416 |
| | | | 29986 |
| Rs. 10 | T/16 | 22403 | |
| Rs. 10 | T/42 | 36930 | |
| Rs. 20 | T/41 | 55410 | |

Put these in Pogson's agriculture (Manual of Agriculture in India by J Frederick Pogson, 1883. Eds.). Arrived at Rajahmundry at 6 A.M.

### *11th Fri*

Started for Bezawada (now Vijayawada) 7 a.m. in the train of H.H. the Maharajah of Vizianagaram. Mr. Madhavarao[4] is one of the best people I saw. He shows much attention to the bringing up of his boy.

### *12th Sat*

Still on the way. Passed Nandial. A fine place. Refreshment beastly. I see jungle tracts newly cleared, cultivated with castor oil seed. The plant grows well. కంది (Red Gram - PIGEON Pea) Apparently not manured. Soil gravelly. Castor oil seed grown extensively.

### *13th Sun*

Arconum in the morning. Big irrigation tanks. Casuarina

plantations. The Railway Station's hedges of కిత్తలినార (Kittalinara : A kind of semi-arid plant with thick leaves. Fiber is extracted from this). Arrived in Madras. Admiralty House, a nice place.

It's good to have a good stone and enamelled vessels.

H.H. showed us all the building. Gave us some insight into the policy of the importance of investment in land and buildings. The first Prince that bought a house in the metropolis. Other princes have followed suit and city may improve thereby. H.H.'s house considered the nicest in Madras. Very creditable to Balaramaswamy Naidu[5] *garu* and not unworthy of Prince Charming.

### *14th Mon*

Chengaiah Pantulu calls. Why should Phool Bagh be not improved like this; not so much the building which is decent enough, but the garden.

### *16th Wed*

Kesanapalli Narasingarao Pantulu mama *garu*[6] called on me in the evening. Balaramaswamy Naidu *garu* gave me 6 Rs. as *batta* for the 17th, 18th and 19th of January. I had not asked him for it.

### *17th Thurs*

H.H. kindly asked Ramamurti Pantulu[7] and me to order dress suits. We did accordingly. I ordered a double-breast pink on my own account.

### *18th Fri*

The more I see of Madhavarao the more I respect him. Letter from G. Narasimham, No.32, Thambu Chetty Street.

### *19th Sat*

J.M. Gleeson, Esq., Supdt., Gardens, St. George's Cathedral Road, Teynampet.

N. Krishna Rao, Borhan & Co., P.B.No. 151 (...).

Mr. Madhavarao lent me 27 Rs. today.

